అంతర భారతీయ పుస్తకమాల

# గృహభంగం

రచన

ఎస్. ఎల్. భైరప్ప

అనువాదం

"వంపల్"



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

Cover Painting by Shri Dhiraj Choudhury

---

ప్రథమ ముద్రణ 1992 (శక 1914)



ISBN 81-237-0463-1

*Original Title* : Grihabanga (Kannada)

*Telugu Title* : Gruhabangam

రూ. 100.00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్, న్యూఢిల్లీ - 110 016 ద్వారా ప్రచురింపబడినది.

---

# ముందుమాట

(నిజానికి కన్నడ సాహిత్యంలో ఈ శతాబ్ది ప్రారంభాన్ని కన్నడ నవలలు క్రొత్త పుంతలు తొక్కిన ఒక యుగంగా పరిగణించవచ్చు. కానీ అప్పటికీ, ఇప్పటికీ కన్నడులందరికీ, జగమెరిగిన బ్రాహ్మణునికి జంధ్యమేల అన్నట్లు, ఒక్క గళగనాథుని పేరు మాత్రమే చిరపరిచితం. గళగనాథుడు రచించిన నవలల్లో అధికం చారిత్రాత్మకమైనవీ లేక చారిత్రిక సంఘటనలు ఆధారంగా రాసినవే అయినప్పటికీ కథాంశాలు సమకాలీన జీవనాన్నీ, పరిస్థితులనూ ప్రతిబింబిస్తాయి.

గళగనాథుడిది ఒక నిర్దిష్టమైన శైలి; అది సుస్పష్టమైనది కూడ. నవలలు రచించడంలో ఆయన ఈ చాతుర్యాన్నే ప్రదర్శించారు. తమ కన్నడ భాషలో ప్రయోజనకరము, ప్రబోధాత్మకములైన మంచి నవలల కోసరం అలమటిస్తున్న కన్నడులకు, గళగనాథుని నవలలు వరప్రసాదములు. గళగనాథుని శైలీ, రచనారీతిలో ఆయన ప్రదర్శించు వైఖరీ - ఇతర రచయితలకు ఉత్తేజాన్ని కల్పించడమే కాక, తమ శైలినీ రచనా పాటవాన్నీ మెరుగుపరుచుకొని క్రొత్తదారులు త్రొక్కే ధైర్యాన్నీ, ఆత్మస్థైర్యాన్నీ ఇచ్చాయి. తత్ఫలితంగా క్రొత్త రచయితల వర్గమొకటి తలయెత్తింది. క్రొత్త తరానికి చెందిన ఈ రచయితల వర్గం పురోగామి రచయితలుగా; శృంగార రచయితలుగా; నియమనిబంధనలకు, కట్టుదిట్టాలకు లోబడి రచనలు చేసేవారిగా - వేరువేరుదారులు త్రొక్కి ప్రస్తుత కన్నడ సాహిత్య కృషిచేస్తున్నారు. ఇందులో రెండు ఆసక్తికరమైన అంశాలు ఉన్నాయి. మొదటిది ఆధునిక రచయితలు మినహా ఇతరులందరూ పాతపద్ధతులను అనుసరిస్తూ సంతృప్తి పొందుతున్నారు; రెండవది, ఏ వర్గానికీ, బృందానికీ చెందని ఇతరులు తమ స్వంతబాణిని ఏర్పరచుకొని, తమ ప్రత్యేకతను, ప్రాముఖ్యాన్నీ పదిలపరచుకొన్నారు.

భైరప్పను ప్రత్యేకంగా వీరికి ప్రముఖునిగా పేర్కొనవచ్చును. ఈనాటి కన్నడ రచయితలందరిలో భైరప్ప, కోట శివరామ కారంత్‌లది అగ్ర తాంబూలం.

వీరిద్దరూ కన్నడసాహిత్య ప్రతినిధులుగా, సాహిత్యభారాన్ని తమ భుజస్కంధాలపై మోస్తున్నారు. ఈ రచయితలిద్దరూ అన్ని రకాల రచనాప్రక్రియలకూ అతీతంగా రచనలు చేస్తూ కన్నడసాహిత్యంలో తమ స్వంత బాణీలు ఏర్పరచుకొని స్థిరపడ్డారు. తమ చుట్టూవున్న వాస్తవిక జగతిని చూసి తెలుసుకొనేందుకు భైరప్ప, కారంత్‌లు తమ నవలలను ఒక సాధనంగా ఉపయోగిస్తున్నారు. ఈ కృషిలో - వారు సృజనాత్మక రచయితలగా, వాస్తవికతను తెలియపరచవలెనని దృఢనిశ్చయంతో కృషిచేస్తున్న రచయితలుగా పరిగణింపబడ్డారు. అనేకమంది రచయితలు ఏదో ఒక సిద్ధాంతానికి కట్టుబడి రచనలు చేస్తూనో లేక ఒక వర్గపు రచయితలతో చేరి రచనలు చేస్తూనో సాహిత్యంలో తమ స్వంత ఒరవడిని ఏర్పరచుకోలేక పోయారు. అనేకమంది ఆధునిక రచయితలకు అనుభవం ఎంతో పరిమితంగా ఉంది.

సాహిత్యాన్ని మన జీవితాలని, పరిసరాలని సరియైన విధంగా చూపించే ఉపకరణంగా వాడిన రచయితలు కొందరున్నారు. పేరెన్నికగన్న నాటక రచయిత శ్రీరంగ కన్నడ సాహిత్యంలో మొట్టమొదటి మనోవైజ్ఞానిక నవలను సృష్టించాడు. అతని అనుభవాలనీ, ఆవేశాలనీ ఉజ్జ్వలంగా చూపించడంలో 'దేవుడు' విజయవంతమైనది. తన 'సర్వమంగళ' ద్వారా చదురంగ కన్నడ నవలలో దుఃఖాంతాలని తిరిగి ప్రవేశపెట్టాడు. వినాయక్(వి.కె.గోకక్) తన 'సమరసజీవన' లో తరతరాల కథావస్తువును వ్యక్తపరిచే శిల్పాన్ని నిరూపించాడు. పల్లెప్రజల జీవనంలో ఉండే పురాణానికి విస్తృతిని కువెంపు తన నవలలు కామూరు సుబ్బమ్మ, 'మల్లెమగల్లి - మదుమగలు' లో చూపించాడు. రావుబహదూర్ తన 'గ్రామాయణ'లో గ్రామాన్ని ముఖ్య ఇతివృత్తంగా తీసుకొని గ్రామాన్ని వేధించే పీడల్ని ఎత్తిచూపించాడు. ఇలా ఎన్నో ఉదాహరణలు చూపవచ్చు. కానీ గమనించవలసిన విషయమేమంటే ఈ నవలారచయిత నవలలూ క్షణికమైన ఆవేశజన్యములే. ఈ రచయితలందరూ పరిసర జీవనాన్ని నవలల ద్వారా మాత్రమే చూసినవారు కాదు. వారికి వారి అనుభూతుల్ని వ్యక్తం చేయడానికి నవల ఒకటే ఏకైకమార్గం కాదు. చాలామంది సాహిత్యపు యితర రూపాలలో కూడా నిష్ణాతులు. ఇటీవల డా. శంకర్ మొకాషి పువేకర్ రచించిన ఒకే ఒక నవల 'గంగమ్మ మత్తుగం గామాయి,' డా. యు.ఆర్. అనంతమూర్తి యొక్క 'సంస్కార' పైన ఎక్కువ వాగ్వాదాలు జరిగాయి. ఈ

రెండు నవలలు కూడా క్షణికమైన ఆవేశాన్ని ఆధారంగా తీసుకొని రచింప బడ్డవేనని గుర్తుంచుకోవాలి.)

ఈదృష్ట్యా భైరప్పకు కారంత్ తరువాత స్థానం లభిస్తుంది. తన అభిప్రాయాలను, అనుభవాలను, ఉద్దేశాలను తన నవలలద్వారా వ్యక్తపరచడంలో భైరప్ప కృతకృత్యుడయ్యాడు. తనను తాను వ్యక్తం చేసుకొనేందుకు నవలలను సాధనంగా ఉపయోగించుకొన్నాడు. ఈరోజు మనం కన్నడంలో చాలామంది నవలా రచయితలను, నవలలను చూస్తున్నాము. కాని భైరప్పవలె వ్రాయగలవారులేరు. సమాజంలోని అనేక విషయాలను భైరప్పవలె చిత్రించగల వారులేరు.

(ప్రస్తుతం మన దేశం ఒక సంధిగ్దావస్థలో ఉన్నది. ఇట్టి తరుణంలో మన ప్రజల సమస్యలు, కష్టాలు నవలలుద్వారానేచిత్రించగలము. కనుక రచయితలకు సంఘం వల్ల బాధ్యతలు పెరిగాయి. భైరప్ప ఈ విషయం గుర్తించాడు. పాతక్రొత్తల సంఘర్షణ, పరిణామ దశలోని వాతావరణవిశేషము, మానసిక విప్లవము ఆయన తన నవలలలో బాగా చిత్రించాడు.(అతని మొదటి నవల 'ధర్మ శ్రీ' ప్రాణేశ్వరి కోసరం క్రైస్తవమతం స్వీకరించి, ద్వంద్వత్వానికి గురి అయిన యువకుని కథ. మనస్సుకీ, హృదయానికీ మధ్య జరిగే సంఘర్షణ భైరప్ప యొక్క పెక్కు నవలల కధావస్తువు. దీని బీజాలు మనకు 'ధర్మ శ్రీ'లో కనిపిస్తాయి. దీనిలో భైరప్ప మతాంతరీకరణము పరమావధి కాదని, దానిద్వారా కులతత్వాన్నే నిరాకరించగలగాలని ప్రబోధించాడు.

భైరప్ప తన రెండవనవల 'దూరసరితీరు'లో వైజ్ఞానిక అసమస్థితి యొక్క ప్రభావాలను, ఫలితాలను చిత్రించడానికి ప్రయత్నించాడు. కానీ అది రెండు పాత్రల మధ్య సంభాషణగా మాత్రమే తయారై చెప్పవలసిన విషయం సూటిగా చెప్పటం జరగలేదు.)

'వంశవృక్ష'ను భైరప్పయొక్క ముఖ్యకృతిగా పరిగణించవచ్చు. దీనిలో భైరప్ప సంధియుగపు సమస్యలను నిర్దిష్టంగా చూపించటమేకాక, కాత్యాయని యొక్క విషాదగాథను హృద్యమంగా చిత్రించగలిగాడు. వితంతువైన కాత్యాయని సంఘపు కట్టుబాట్లని కాదని పునర్వివాహం చేసుకొంటుంది. కాత్యాయని, శ్రోతిపాత్రలు సమాంతరాలుగా నిలుస్తాయి. ప్రాచీనత్వానికీ, నవీనత్వానికీ మధ్య సారూప్యం అతిశక్తివంతంగా, వాగ్వాదాలతో నిమిత్తం లేకుండా నిరూపించగలిగాడు రచయిత. (ఈ నవల చిత్రీకరింపబడి, రాష్ట్రపతి బహుమతి నందుకున్నది. దీనిలో భైరప్ప

యావద్భారత కీర్తిపొందాడు.

వైవాహిక జీవితాన్ని, వివాహపుటుద్దేశాన్నీ అతి సుందరంగా చిత్రిస్తుంది భైరప్ప 'జలపాత'. జీవితం పట్ల, ముఖ్యంగా వైవాహిక జీవితం పట్ల లొంగని, వైజ్ఞానిక దృక్పథం కష్టానికి దారితీస్తుంది. ఒక కళాకారుడు కుటుంబ నియంత్రణకై చేసిన ప్రయత్నాలు తన సృజనాత్మకశక్తిపై వాటి విరుద్ధ ప్రభావాలు ఈ నవలలో చిత్రీకరింపబడ్డాయి. 'జలపాత', 'దూరసరిదారు' కంటె విస్తృతమైన పరిణితి చెందిన నిర్మాణాత్మకమైన నవల. (భైరప్ప తరువాతి నవలలలో 'నాయినేరాలు' విభిన్నమైనది. దీని కథావస్తువు పునర్జన్మ. 'నాయినేరాలు' కన్నడ సాహిత్యంలో మార్గదర్శిగా రూపొందింది. ఈ నవల చదివిన తరువాత పాత్రలు గుర్తుండకపోవచ్చును. కానీ సంఘటలు మాత్రం మరపురావు. ఈ నవలలోని జోగయ్యను 'గృహభంగ'లోని అయ్యనవారుతో పోల్చవచ్చును. దీనిలోకూడా సనాతన-వైజ్ఞానిక దృక్పథానికి మధ్య సంఘర్షణ కానవస్తుంది. ఈ సంఘర్షణే భైరప్పకూ తన నవలలకూ మధ్య సూత్రం. ఇదే సంఘర్షణ 'తబ్బలియు నీ దే మాగనే' నవలలో విపులీకరించబడింది. ఇది ఆవు, ఎద్దు కథలా తోస్తుంది. కానీ మన పల్లెటూరి జీవితం యావత్తూ ప్రతిబింబిస్తుంది. ఒకగొల్ల పిల్లవాడు చదువుకొని, విదేశాలకు వెళ్ళి తిరిగివచ్చి తన గ్రామాన్నిబాగుచేయడానికి వైజ్ఞానిక పద్ధతులపై పునర్నిర్మించడానికి పూనుకుంటాడు. అతని అమెరికన్‌సతీమణి అతనికి చేదోడుగా ఉంటుంది. ఈ అమెరికన్‌యువతికి స్వదేశానికి తిరిగి వెళ్ళిపోవాలా అన్న సమస్య కూడా వస్తుంది. పచ్చిక బయలులో తిండిగింజలు పండిస్తే వచ్చే సమస్యలుకూడా చర్చించబడ్డాయి.

కళింగ, అధునాతన సనాతన శక్తుల మధ్య సతమతమవుతున్న జీవి కట్టుబాట్లుగల వాతావరణం మధ్య పెరిగినప్పటికీ వెంకటరమణ అతి అధునాతనమైన పద్ధతులను తెలుసుకొని ఆచరించడానికి ఇష్టపడతాడు. ఈ రెండు విభిన్న పాత్రలు అతి సుందరంగా ప్రభాయుతంగా మలచబడ్డాయి. దీనిలో పాతకొత్తల మధ్య సంఘర్షణ పట్ల భైరప్పగల ప్రవృత్తి క్రొత్తమలుపు తిరిగింది. ఈ నవలలో మన గ్రామాల గురించి భైరప్పకు జ్ఞానం విశదమవుతుంది.)

భైరప్ప నవలలలో 'మతదాన' క్రొత్త మలుపు. ఇది భైరప్ప నవలల రాజకీయ

ఇతివృత్తం కలిగిన మొదటి నవల. ఇది రాజకీయాలలో దిగి కష్టాలపాలైన డాక్టరు గాధ. ముఖ్యంగా ప్రస్తుత రాజకీయాల అధోగతిని చిత్రిస్తుంది. దీనినే అతి విపులంగా చర్చిస్తాడు భైరప్ప తన నవల 'దాటు'లో.

ఇంతవరకు భైరప్ప నవలలు భావస్ఫోరకాలు. కాని 'గృహభంగ' కొత్త తరహాకు చెందినది. ఏళ్ళతరబడి రచయిత ప్రతిపాదిస్తున్న విలువలనే ఈ నవల శంకిస్తుంది. కథావస్తువు తిప్టూరు, చెన్నరాయపట్టణ తాలూకాలలో 1920-1945 ల మధ్య జరిగిన సంఘటన నవల గ్రామపెద్ద రామన్న కుటుంబంతో ప్రారంభమవుతుంది. తన వై. ఏ. మాటల్లో ఏ విధమైన సున్నితత్వంగాని, అడ్డులుగాని లేని వితం ువుగంగమ్మ. ఆమెవల్లనే కుటుంబనాశనం (గృహభంగ) సుతుది. గంగమ్మకి ఇద్దరు కొడుకులు, చెన్నిగిరాయ, అప్పణ్ణయ్య. జీవన విధానంలోగాని, శీలంలోగాని వారిలో పోలిక శూన్యం. చెన్నిగిరాయ నిరక్షరాస్యుడు, సంస్కారహీనుడు, కానీ స్వార్థపరుడు. తన భార్యాబిడ్డల గురించి కూడా లెక్కచేయని స్వార్థపరత్వం అతనిది. కానీ అతి పిరికివాడు. భార్యమీద అధికారం చెలాయించుదామనుకొంటాడు కాని చేయలేడు. అతని భార్య నంజమ్మ అప్పణ్ణయ్య భార్యలాగ అతన్ని ఎదిరిస్తే చెన్నిగిరాయ బాగుపడేవాడేమోననిపిస్తుంది. కాంతిజోషికి పుట్టినప్పటికీ నంజమ్మ అతి శాంతమూర్తి, రెండు కుటుంబాల గౌరవం కాపాడినప్పటకీ ఆమె జీవితం కష్టాల పాలయింది. భర్త చదువురానివాడు. అత్త కర్కోటకురాలు, ఈ నరకాన్ని స్వర్గంగా మార్చదలచింది నంజమ్మ. కానీ ఆమె ప్రయత్నాలు విఫలమవుతాయి. పెళ్ళయిన కూతురు, చదువుకొని, సంస్కారంఉన్న కొడుకు ప్లేగుతో మరణిస్తారు. తన మరణంతోనే ఆమెకు శాంతి లభిస్తుంది. కాంతిజోషి పాత్ర వంశవృక్షలోని శ్రోత్రి పాత్రకు చాలా విభిన్నమైనది. కాంతి జోషి భూతప్రేత విద్యలలో అరితేరిన నాస్తికుడు. కాని దుర్మార్గుడు కాదు. దయాగుణం కలవాడు. భైరప్ప ఇటువంటి పాత్రను సృష్టించడం ఇదే ప్రథమం. అదేవిధంగా ఈ నవలలోని అయ్యనవారు కూడా సంకుచితుడు కాదు. వార్ధక్యంలో కూడా తన కులం కాని బాలుడికోసరం ప్రయాసపడతాడు, వివేకవంతులు అనుకొనే బ్రాహ్మణులలో కూడా చెన్నిగిరాయ వంటి అవివేకులుంటారని ఈ నవల నిరూపిస్తుంది. ఇంతవరకు భైరప్ప సనాతన - అధునాతనత్వాల ఆదర్శాల గురించి చర్చించాడు. 'గృహభంగ'లో మాత్రం కథావస్తువు కంటె పాత్రలకి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చాడు. అందుకనే కథానాయకుని

తల్లి నంజమ్మ నిజమైన సాహసమూ, ధైర్యమూ చూపగలిగింది. చదువులేని వాణ్ణి పెళ్లిచేసుకొని అతి నికృష్టమైన జీవితం గడపవలసి వచ్చినప్పటికీ ఆమె సమర్థురాలు. ఆమె పాత్ర పట్ల మనకు జాలి, భయమూ కూడా కలుగుతాయి. ఈ విధంగా భైరప్ప గ్రామీణ జీవనంలో నుంచి, మరుపురాని పాత్రలను సృష్టించాడు. ఈనవలలో ప్లేగు మనజీవితాలలో తారసపడే కష్టాలకు ప్రతీక. అదికూడా ఈ నవలలోని పాత్రల ప్రతిభని తగ్గించలేదు.

గ్రామీణ జీవితాన్నిగాని, గ్రామీణ వాతావరణాన్నిగాని తన నవలలకి కధావస్తువుగా తీసుకొంటే భైరప్ప వాస్తవికంగా కనిపిస్తాడు. అదే నగర జీవితాన్ని గాని, పట్టణ వాతావరణాన్ని గాని చిత్రి విజ్ఞానదాయకాలుగా ఉంటాయి. భైరప్పలోని ఈ ప్రతిభని 'గృహభంగ' ఎత్తి చూపుతుంది.

'గృహభంగ' మనజీవితాలనే చిత్రించిందా? అనిపిస్తుంది. కధాకధన విధానంలో విశిష్టత ఉంది. మంచి నవలకి కావలసిన లక్షణాలన్నీ ఈ నవలలో కనిపిస్తాయి. ఈ నవలలోని భాష పల్లె ప్రజలు ఉపయోగించేది కావడంవల్ల చైతన్యవంతమైనది. కన్నడసాహిత్యంలో ఈ నవల అతిప్రధానమైనది, జనరంజకమైనది కాగలిగింది.

వంశవృక్షను కొన్ని భావాలకు ప్రతిచర్యగా తీసుకొనవచ్చును. కానీ 'గృహభంగ' కేవలసాహిత్యప్రతీక. 'గృహభంగ'ను 'గ్రామాయణ'తో పోలిస్తే భైరప్ప, రావుబహదూర్‌ల దృక్పధాలలోగల వ్యత్యాసంగోచరిస్తుంది. 'గ్రామాయణ' దేశం మొతాన్ని చిత్రిస్తుంది. గ్రామపతనం దేశపతనంగా చూపింపబడింది. 'గృహభంగ' ఒక నిస్సహాయస్త్రీ జీవి తానికి సంబంధించినది. ఆమె చుట్టూ వాతావరణం; సంఘం; చదువులేని దయా దాక్షిణ్యాలులేని ప్రజలు; ఈ నవలలోని అంశాలు. భైరప్ప ఒక వ్యక్తి ఎదుర్కొన్న అగచాట్లని చిత్రిస్తే రావుబహదూర్ సమాజం ఎదుర్కొనే అగచాట్లని చిత్రించాడు.

'గృహభంగ'లో రచయిత పాత్రలను యధాతధంగా చిత్రించి నవలకి జీవం పోశాడు. పాత్రలను కృత్రిమంగా మలచలేదు. ఏ సమస్యల ప్రచారంగాని, ప్రబోధంగాని చేయలేదు. మనచుట్టూ వున్న జీవితం ఉన్నది ఉన్నట్లు చిత్రించబడింది. ఈ కృషిలో భైరప్ప కృతకృత్యుడయ్యాడని చెప్పవచ్చు.

గృహభంగ తరువాత భైరప్ప నిరాకరణ, గ్రహణ అనే రెండు నవలలు వ్రాశాడు. గ్రహణ కొంతవరకు పేలవంగా వుంది. ఒక సన్యాసి వివాహం చేసుకోవడానికి

తీసుకొన్న నిర్ణయం మీద గ్రామంలో చెలరేగిన దుమారం గురించిన కథ 'గ్రహణ'. వివాహం మానవజీవితంలో స్వాభావికం కనుక దీనిని గ్రహణానికి విడుపుగా చిత్రించ బడింది. కాని ఈ నిర్ణయం తీసుకొవడంలో స్వామీజీ మనోవేదన చిత్రణకి న్యాయం చేకూరలేదు. 'నిరాకరణ' భార్యావియోగం పొంది, పిల్లలను పెంపకం ఇచ్చి సన్యసించిన వ్యక్తి గాధ. ఈ నవల శివరామకారంత్ 'అవిడమేలె' నవలను గుర్తుచేస్తుంది. ఈ నవల భారమైన ఇతివృత్తం కలదేకాని కన్నడ సాహిత్యం మీద ముద్రవేయలేక పోయింది.

కారంత్ తరువాత పేర్కొనదగిన ఉత్తమ నవలారచయితగా నిలుస్తాడు. భైరప్ప, తన యిటీవల నవల 'దాటు' ద్వారా. విమర్శకులు దీనిని ప్రశంసించారు. కులం, కులతత్వం విపులంగా చర్చింబడే ఈ రోజుల్లో కులాల పుట్టుకని గూర్చి నిష్పాక్షికంగా విశదీకరించాడు భైరప్ప. విప్లవం గురించి నవల వ్రాయవచ్చును. రచన ద్వారా విప్లవం లేవదీయవచ్చును. దాటు బహుశః ఈ రెండవ కోవకు చెందినది. కానీ ఈ నవలలోని పాత్రలు విప్లవం అనే ఆలోచనతో సతమతమైపోరు. కులతత్వంగూడ ఈ నవలలో అంతర్భాగమే. కథానాయకి అన్యకులస్థుడివి వివాహమాడుతుంది. తత్ఫలితంగా తనవాళ్ళు నడిపే కాలేజిలో ఉద్యోగం పోతుంది. మంత్రి దొడ్డగౌడ, తండ్రి మాలెగిరిగౌడ హరిజనుల దేవాలయ ప్రవేశాన్ని తీవ్రంగా నిరసిస్తారు. అది జరిగిన తరువాత దేవాలయాన్ని గోమూత్రంతో పవిత్రంచేసి, బ్రాహ్మణుల కంటె సనాతనుడనని దంభాలు పలుకుతాడు. ఈ విధంగా భైరప్ప మన ఉద్దేశాలలోని, నీతులలోని ద్వంద్వత్వాన్ని, కృత్రిమాన్ని చాటాడు.

ఏ నవలలోనైనా ఏదైనా ప్రబోధమో భావప్రతిపాదమో ఉంటేనే పాత్రల అంతరాంతరాల్లో ఉండే భావాలు వ్యక్తం అవుతాయంటారు. కాని 'దాటు' దీన్ని ఖండించగలిగింది. ఏ సమస్యనైనా వేరువేరు కోణాల్లో చూడడమనే శిల్పం అనుకొన్నంతగా కనిపించనప్పటికీ కన్నడసాహిత్యానికి వేగు చుక్క అయింది ఈ నవల. సమకాలీన సమస్యలను ఎత్తిచూపడం కష్టమే. నవలారచయితకు ఇది ఒక పరీక్ష. ఈ దృష్ట్యా భైరప్ప కృతకృత్యుడు.

గత అయిదు సంవత్సరాలుగా భైరప్ప మహాభారతం ఇతివృత్తంగా ఒక పెద్ద నవల వ్రాస్తున్నారు. ప్రస్తుతం వీరు ఈ విషయమై పరిశోధన చేస్తున్నారు.

– మాధవ కులకర్ణి

మైసూరు సంస్థానంలో, తుమకూరు జిల్లా తిపటూరు తాలూకా కంబవకె
రామసంద్రం కరణం రామణ్ణగారు స్వర్గస్థులయ్యాక, ఇంట్లో మిగిలిన
ఆయన భార్య గంగమ్మ, ఇద్దరు కొడుకులు - చెన్నిగరాయుడు, అప్పు
రామణ్ణగారు గతించి అప్పుడే ఆరేళ్ళయింది. అంటే మోక్షగుండం విశ్వేశ్వరం
దివాన్ బహద్దర్ అయిన సంవత్సరమన్నమాట. అప్పటికి ఆయన భార్య గం
పాతికేళ్ళ వయస్సు. పెద్దకుర్రాడు చెన్నిగరాయుడు తొమ్మిదేళ్ళవాడు. రెం
అప్పణ్ణయకు ఏడేళ్ళు. రామణ్ణగారు చనిపోయాక వంశపారంపర్యంగా వ
కరణీకం గ్రామ మునసబ్ అయిన శివేగౌడగారి బావమరది శివలింగేగౌడ చూస్తు
మరో మూడేళ్ళకి చెన్నిగరాయుడు 'మైనార్టీ' తీరి తండ్రి అధికారాన్ని సె
చేసుకోవాలి. కరణీకం చేయడమంటే మాటలా? దానికీ, దానికి తగ్గ విద్య
కనీసం 'జైమిని' అయినా అర్థం చేసుకోగలిగిన జ్ఞానముంటే గాని ఖాత, ఖిర్ది,
ఖానీషు మారి లెక్కలు బోధపడవు. గ్రామంలో వున్న వీధిబడి మాస్టారు
చెన్నకేశవయ్య వద్దే చెన్నిగరాయుడు చదువుకుంటున్నాడు.

రెండోవాడు అప్పణ్యయ్య పదమూడేళ్ళయినా బడికి వెళ్ళలేదు; ఇ
'ఓనామః' అని రాయనూ లేదు. ఇంకా వుపనయనం కూడా కాలేదు.

"అప్పణ్ణా! బడికెళ్తావా, వెళ్లవా?" తల్లి కోపంగా అడిగింది.

"ఎల్లకపోతే నీ పుట్టేంములిగిందే గాడిదముండ?"- అని కొడుకు ఎదిరిం

"నన్ను ముండా అంటావ్రా? నీ వంశం నిర్వంశంగాను, లంజాకొ
అంది తల్లి.

"నీ వంశమే నిర్వంశ మవుతుందే" అని కొడుకు అంటూ వు
బయటినుంచి నీరుగంటి ముద్ద వచ్చాడు.

"నన్ను గాడిదముండా అని అంటున్నాడు. ఈ ముండాకొడుకుని ల
చెన్నకేశవయ్య కాడ వదిలేసి రారా ముద్దా" అని గంగమ్మ హుకుం జారి

అది వినగానే అప్పణ్ణయ్య బయటికి వుడాయించాడు. కానీ ముద్ద భారీ మనిషి. పది అడుగుల్లోనే వాణ్ణి జుట్టట్టుకొని కుయ్యోమొర్రో అని గింజుకుంటున్నా వదలకుండా గంగమ్మ ముందు తెచ్చి నుంచోబెట్టాడు. "ఈ లంజాకొడుకుని ఎడాపెడా వాయించి లాక్కెళ్లు" అని ఆవిడ ఆదేశించింది. అయినా బాపనకుర్రాడిమీద ముద్ద చేయిచేసుకోవటం ఎలాగ? చేసుకుంటే ఉన్న కళ్ళు ఊడిపోతాయని వాడికి తెలియదా ఏమిటి? కుర్రాణ్ణి బుజ్జిమ్చుకొని అవతలికి లాక్కెళ్ళాడు.

చిన్నవాడు అవతలికెళ్ళాక గంగమ్మ దృష్టి ఇంట్లోనే వున్న పెద్దకొడుకు మీదికి మళ్ళింది.

"వెన్నిగా! పొన్నవళ్ళి కెళ్ళి సీతారామయ్యగారి దగ్గిర లెక్కలు నేర్చుకురమ్మని ఎంతని వెత్తీనోరూ మొత్తుకోమురా. రేపు పెండరాళే వెడతావా లేక రెండంటించాలా?"

"ఆఁ అల్లాగని నా జోలికిరా. చూద్దువుగాని. మంగలి రుద్రన్నని పిలిచి నీ బుర్ర గీయించేస్తాను" స్తంభం చాటునుంచే కొడుకు గుర్రుమన్నాడు.

'మీ నాన్న చచ్చిన్నాడే నా బుర్ర గీయించేశారు. అమ్మని. తిట్టిన జిహ్వ పుటుక్కులడ పోతుందిరా ముండాకొడుకా"

పొన్నవళ్ళి రామసంద్రానికి పద్దెనిమిది మైళ్ళ దూరపు గ్రామం. రెండూ ఒకే తాలూకాకు చేరినా ఫిర్కాలు మాత్రం వేరువేరు. రామసంద్రం కంబవకెరె ఫిర్కాలోనిదైతే పొన్నవళ్ళి ఫిర్కాకేంద్రం. వెనుక తాలూకా కేంద్రంగా కూడా వుండేది. తిపటూరు పుంజుకున్నాక ఇది వెనకబడ్డది. తాలూకా ఆఫీసు తిపటూరికి వెళ్ళిపోయింది. చిక్కమగళూరు, కడూరును ముక్కలు చేసినట్లు సీతారామయ్యగారు పొన్నవళ్ళి తాలూకా కేంద్రంగా వున్నప్పుడే ఆ వూరికి కరణం గారట. లెక్కలలో ఉద్దండపిండం మాత్రమేకాదు. తహసీల్దారునే అల్లాడించే బాపతు. ఆయన దగ్గిర లెక్కలు నేర్చుకుంటే ఎవరైనా సరే తేలికగా కరణీకం నిర్వహించవచ్చు. ఈ మాట, అరిసికెరె, గండసి, జావగల్లుల కరణాలు, గ్రామమునసబులు కూడా అంటూ వుంటారు. అయినా సీతారామయ్యగారి చేతికింద నలగడమంటే సామాన్యం కాదు. చిట్టాకు 'హెడ్డింగు' కట్టి ఎర్రసిరా గీతలు గీయడం నేర్చుకోవాలి అంటే ఆయన రూళ్ళకర్రతో ఎముకలు పిండిచేయించుకోవాలి. వేలాది ఉలిపోట్లు తినకుండా రాయి విగ్రహమవుతుందా అని పీఠబడి ఓనయ్యలాగే ఆయనా అనేవారు.

కొడుకులిద్దరి నడతా చూసి గంగమ్మకు ఒళ్ళు మండింది. ఏడుపు వచ్చినంత పనై కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. ఇతరుల పిల్లలు తల్లులంటే భయపడి చస్తారు. ఈ వెధవలకే మొచ్చింది రారాని రోగం? ఇదంతా నా తలరాత. అని వంటింట్లో కెళ్ళి అట్లకాడ తీసి పొయ్యిలో పెట్టింది. అప్పటికే మధ్యాహ్నం దాటి మూడుగంటలు కావడం వల్ల పొయ్యిలో నిప్పులు చల్లారిపోతున్నాయి. కాలిపోయిన కొబ్బరి మట్టల నివురుకప్పిన నిప్పు బూడిదయ్యే స్థితిలో వుంది. అమ్మ తనకి చురకలెయ్యాలనే అట్లకాడని కాలుస్తోందని పదిహేవేళ్ళ 'జైమిని' చదివిన కొడుక్కి తెలిసిపోయింది. వాడు ఏకధాటిగా "గాడిదముండ, బోడిముండ, లంజముండ, మాలముండ, మాదిగముండ అని తిడుతూ ఇంటినుంచి పారిపోయాడు. ఇహవాణ్ణి పట్టుకోవటం తనకి సాధ్యం కాదని గంగమ్మకు తెలుసు. అయినా ఆవిడ తన ఓటమిని ఒప్పుకోలేకపోయింది. ఈ వెధవల్ని మాటవినేలా చేయడమెలాగా అని ఆలోచిస్తూ కూర్చుండిపోయింది. అట్లకాడ నివురు కప్పిన నిప్పునే కొద్దికొద్దిగా వేడెక్కులోంది.

పెళ్ళయి ఈ యింటికి వచ్చినప్పుడు గంగమ్మ పదమూడేళ్ళ పడుచు. మొగుడికి నలభై అయిదేళ్ళు. మొదటి భార్యకు ఇద్దరు పిల్లలు పుట్టి చచ్చిపోయారు. చివరికి ఆవిడా చచ్చిపోయింది. మొదటి భార్య కూడా గంగమ్మ వైపుపడుచే - అంటే జావగల్లు అమ్మాయి. ఆ సంబంధం మూలాన్నే రామణ్ణగారికి గంగమ్మనిచ్చింది. రామసంద్రంతోపాటు, మూడూళ్ళ కరణీకం, ఆరెకరాల మెట్టపొలం, ఎనిమిదెకరాల మాగాణి, మూడువందల కొబ్బరిచెట్లు, ఇంట్లో కావలసిన పాత్రలు గిత్రలూ, వెండీ బంగారమూ వున్న అయన్ని చూసి ఎవరు పిల్లనివ్వరు? రామణ్ణగారు మొదటినుంచి మహసాధువని వూళ్ళోవాళ్ళంతా చెప్పుకుంటారు. సాధువంటే గంగిగోవులాంటి సాధువు. లేగదూడ లాంటి సాధువు. గంగమ్మ మాత్రం ఆడపులి - అని ప్రజలనుకోవడం కద్దు. అది తన చెవిలో పడ్డప్పుడు, వీళ్ళనోళ్ళల్లో నా యెడమకాలి పాత చెప్పెట్టా - 'లంజా కొడుకులు' అని ఆవిడ తిట్టడమూ కద్దు. కొడుకులిద్దరూ బుద్ధిమంతులై మాటవింటే ఆవిణ్ణి పట్టేవాళ్ళుండరు. ప్రజలనోళ్ళకి పాతచెప్పు తప్పేదికాదు. కాని ఆ వెధవలిలాగై పోయారు. వీళ్ళకి బుద్ధిచెప్పాలి. చెప్పకపోతే నేను జావగల్లు పడుచేకాను. ఆ అట్లకాడ అక్కడే కాలుతూ వుండనీ, సాయంత్రం పిండం

మెక్కటానికి ఎలాగూ వస్తారు. కాళ్ళకి రెండు చురకలంటిస్తాను - కోడెదూడలకిమల్లే. చురకలెయ్యాందే కోడెదూడలు చెప్పిన మాటవింటాయా? కురబరహట్టి వేలూర చెబుతూ వుంటాడు. పశువులకి వాతలెట్టకపోతే ములుగురోగమొస్తుందట. అదొట్టి అబద్ధం. మాళ్ళవినాలనే కదా వాతలెట్టేది. అనుకుంటూ కాలిన అట్లకాడపిడి చివరని తన ఎర్రచీరకొంగుతో పుచ్చుకుని ఓమాటు తిప్పి మళ్ళీ నివురు కప్పిన నిప్పులోనికి చొప్పించింది.

ఇంతలో ఇంటి బిళ్ళపెంకు కప్పుమీద ఎవడో దొంగ మెల్లిగా అడుగులేస్తూ వెళ్ళినట్టయింయది. ఈ పట్టపగలు ఏ దొంగలొస్తారు? కోతులయ్యుండవచ్చు. తోటలో కొబ్బరి బొండాలొదిలి వీటికి ఇళ్ళమీద పడే ధైర్యమొచ్చిందే. వీటి దుంపదెగ - అని అనుకుంటూ వుండగానే అవి సరిగ్గా తన నెత్తిమీదికే వచ్చినట్టయింది. "మీ దుంపదెగ! మీ తల్లి సిగ్గొయ్య" అని తిట్లకి లంకించుకుంటూ స్వరం పెంచబోతూ, ఇంతలోకే 'అయ్యో ఆంజనేయస్వామి అవతారాలు. పెద్దగా తలిస్తే శాపం పెడతాడట' అని వెంటనే నాలికనొక్కుకొని తలెత్తి చూసింది. కప్పిన బిళ్ళపెంకు మీద ఎవరోదుడ్డుకర్రతో బాదినట్లయింది. పది పదిహేను పెంకులు ముక్కలుముక్కలై ఆవిడబోడి తలమీద, ముఖం మీద పడ్డాయి. మళ్ళీ 'వీటి కొంపకూల' అని కేకతీయగానే 'అక్కడే వుంది. ఎత్తి మరో నాలుగు దంపులు దంపరా అప్పణ్ణయ్య' అని చెన్నిగరాయుడుపై నుంచి చెప్పటం వినపడ్డది. అన్నదమ్ములిద్దరూ చెరోరోకలి చేతబుచ్చుకుని, ఆవిడకి సరిగ్గా నెత్తిమీదున్న బిళ్ళ పెంకులమీద భుజబలం చూపెడుతున్నారు. "లంజాకొడుకుల్లారా! మునసబు శివేగౌడతో చెప్పి మీ తొక్కలొలిపించేస్తానాగండి." అని కేకలేస్తూ గంగమ్మ వీధిలోకి పరుగెట్టింది.

"శివేగౌడగారిని తీసుకొస్తుందిరా చన్నయ్యా" అని అప్పణ్ణయ్య అన్నను హెచ్చరించాడు. ఇద్దరూ ఎక్కడి రోకళ్ళక్కడే వదిలేసి, పెంకుల మీద పెరటి మూరుదాకా పరుగెట్టి అక్కడినుంచి వీధికాలువ అవతలికి దూకి పారిపోయారు.

## 2

వెనుక ఎప్పుడో రామసంద్రం అయిదువందల గడపలుండిన గ్రామమట. ఇప్పుడు కరణీకపు ఖానీషుమారి లెక్కలలో వున్నవే నూటనలభై యేడు కుటుం

బాలు. వూరిని రెండు వేపులా ఆవరించివున్న చెరువునీళ్ళు పాడుబడి, యేటేటా మట్టికప్పుకపోతూన్న కోటగోడల్ని తంతూవుంటాయి. దక్షిణానికున్న చోళేశ్వరుని గుడిమూల లింగమిప్పుడు చెరువుకట్టమీది గుడిలో వుంది. వూళ్లో వున్న గుడికి ముందున్న వీధి చివర బ్రహ్మదేవుని మండపం. దాని దగ్గరే హనుమంతరాయుని గుడి. గ్రామం చివర తోట దగ్గిరే గ్రామదేవత కాళ్ళమ్మ గుడి. బలిజ, నాణబ, సాలె, తెలిక, కురుబ మొదలైన ఒక్కొక్క కులానికి ఒక్కొక్కసందుంది. ఒక జాతి వున్న సందులో వేరేజాతి వాళ్ళు లేరని కాదు. కాని నీచు, మాంసంతినే కులాల మధ్య బాహ్మణ, లింగాయుత, సాతాని మొదలైన కులాలున్నది చాలా తక్కువ.

మునసబు శివేగౌడయింటికీ, కీర్తిశేషులైన కరణం రామణ్ణగారి యింటికీ మధ్య రెండు సందులు దూరం, అంటే ఇరవైయిళ్ళ తరువాత అన్నమాట.

గౌడ ఇంట్లోనే వున్నాడు. గంగమ్మతివ్వగా లోపలికెళ్ళి "త్వరగాలేచొచ్చి చూడు శివేగౌడ. మా చెన్నిగరాయలు, అప్పణ్ణయ్య ఇంటి కప్పెక్కి రోకళ్ళతో పెంకుల్ని బాదుతున్నారు. చూడు నాతల మీదపడి నెత్తురు కారింది".

'ఎందుకేటి'?

'బడికెల్లరా అన్నాను. ఎహెనాకొద్దు' అని యిలా మొదలెట్టారు" గౌడ భార్య గౌరమ్మ "ఆళ్ళకి వొళ్ళుపొగరెక్కింది. ఎల్లి రెండంటించి రండి" అని అంది. గౌడ తన పెద్ద బొజ్జ మోసుకుంటూ కాళ్ళకి జోళ్ళు తొడుక్కుని గజగమనంతో వాళ్ళింటికెళ్ళాడు. వచ్చి చూసే సరికల్లా అన్నదమ్ములిద్దరూ పత్తాలేకుండా వుడాయించారు. అంతలోనే ఇంటి ముందరి గుడిలోని మాదేవయ్యగారు ఇంకా పదిపదిహేనుమంది పోగయ్యారు. వంటింటిమంచి పెరటి చూరుదాకా పెంకులు ముక్కలు చెక్కలైపోయాయి. అక్కడ పోగయిన నలుగురితో 'ఎహె ఎల్లండసే ఆళ్ళెతకండి' అన్నాడు! గౌడ.

వంటిల్లు చూడగానే గంగమ్మకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "శివేగౌడా! ఆ లంజకొడుకుల్ని పట్టుకొని కాళ్ళిరిచి కూచోపెట్టాలి' అంది.

కుర్రాళ్ళ పత్తా ఎక్కడా దొరకలేదు. రాత్రయింది. చీకటి పడ్డది. అయినా వాళ్ళ జాడ తెలియలేదు. వీళ్ళ దుంపదెగ ఎక్కడికెళ్ళారో అని గంగమ్మ పదిసార్లయినా అనుకుంది. ఇంట్లో ఆవిడ ఒక్కతే, పెరటివైపు పెంకులన్నీ పగిలిపోయాయి. ఒక్కతే వుండటానికి భయమేమీ లేదు. వేనుంటే దెయ్యం

కూడా జడిపి తిరిగిచూడదు అని ఆవిడే అంటుంది. అయినా ఆ వెధవపీనుగు లెక్కడ తగలడ్డారో. వాళ్ళ క్షేమాన్ని గూర్చి ఎలాంటి ఆందోళనా లేదావిడకి. ఎక్కడో దాక్కొని వుటారు. రాత్రి తిండికేంచేస్తారో! తోటలో బొండ్లాలు తాగి కాయకసరు తిని పడుంటారు. పొలంవైపు వెళ్ళుంటే చెరుకు గడలు నమిలుంటారు.అయినా ఇంతటి అరిందా వెధవలు ఇంటికి రావద్దూ? రేపు పెందరాళే రొట్టె ముక్కకని రానీ చెబుతాను.

వాళ్ళయింటిముందే చోళేశ్వరుని గుడి. గుడి సింహద్వారం ఉత్తరానికుంటుంది. వీళ్ళింటి తలుపు తూర్పు దిక్కుగా వుంటుంది, అంటే గుడి ఎడమభాగం వీళ్ళింటికి ముందుంటుంది. గుడికీ ఇంటికీ మధ్య ఓ చిన్న బయలు. అది వెనక గుడికి చేరిందే, అవడానికి గుర్తులింకా వున్నాయి. గుడిలో మాదేవయ్య గారొక్కరే కూర్చుని తంబూరా మీటుతూ, ఎడమచెత్తో చిటికలు వాయిస్తూ "హరహర ఎనుతలి రుద్రాక్షి ధరిసలు హరివుడు భవగళ పరమ ధరిసిద రుద్రాక్షి . . ." అని భజన చేసుకుంటూ వుండేవారు. ప్రతిరోజూ అంతే, అర్ధరాత్రి దాకా భజన చేస్తారు. తెల్లారికోళ్ళు కూయక ముందే లేచి కూర్చుని మళ్ళీ మొదలెడతారు. ఆయనదేవూరో, ఏ దేశమో ఎవరికీ తెలియదు. ఈ వూరికి వచ్చి అప్పుడే ఇరవై యేళ్ళకు పైబడిపోయింది. గంగమ్మకు పెళ్ళై కాపురానికి వచ్చినదానికంటే కొంతముందే ఆయన ఇక్కడికి వచ్చారట. చోళేశ్వరుని గుడిలో నివాసం, భజన; భిక్షాటనం చేసి పొట్టపోసుకుంటున్నాడు. ఎత్తయిన మనిషి. నిండుగా గుండ్రంగా వున్న ముఖం. నుదుటిమీద పెద్దగా మూడు విభూతి పట్టెలు. బొమల మధ్యగానే కాక చెవులదాకా విభూతిలాగి నున్నగా క్షవరం చేయించుకున్న తల, కావిపంచ, కావిచొక్కా ఆయన వేషం.

గంగమ్మ పడుకున్నా నిద్రపట్టలేదు. కుర్రాళ్ళింకా ఇంటికి రాలేదాయె. అప్పటికే మాదేవయ్య భజన పూర్తికావస్తోంది." మంగళారతియిండు అంగనామణులెల్ల సంగయ్య దేవనన్నకూ..." అని పాడ ప్రారంభించారు. గంగమ్మ లేచి వీధితలుపు చేరవేసి అక్కడికి వెళ్ళింది. గుడి ముందు భాగం తలుపులు లేని పెద్ద మండపంలా వుంటుంది. అయ్యగారక్కడే కూర్చుని భజన చేసేది. భజన వినటానికీ, వారితోపాటు చిటికలువేస్తూ భజన చేయటానికీ వూళ్ళో కొందరు వచ్చి కూర్చుంటారు.

అప్పటికప్పుడే అర్ధరాత్రియింది. గుడిలో ఎవరూలేరు. గంగమ్మవచ్చి అయ్యగారి ఎదరస్తంభం దగ్గర కూర్చుంది. ఆయన చివరిపాదం ముగించి, తంబూరా చిటికలు ఆపిన తరువాత ఆవిడే అడిగింది. "ఈ లంజాకొడుకులకి బుద్ధి ఎప్పుడొస్తుంది మాదేవయ్యగారూ?"

"గంగవ్వా! బుద్ధి నెమ్మదిగా వస్తుంది. మీరు మంచిమాటలుమాట్లాడటం మొదట నేర్చుకోండి".

'నేనేం చెడ్డమాటలన్నాను?'

'ఈ లంజాకొడుకులకు అని ఎందుకంటారు? మా కుర్రాళ్ళకి అనండి'.

తన మాటల్ని సరిదిద్దుకొమ్మని మాదేవయ్యగారు గంగమ్మకు చెబుతున్నది ఇదే మొదటిసారికాదు. ఆవిణ్ణి సరిదిద్దడం బ్రహ్మతరం కాదని తెలిసివున్నా ఆయవ ఇలాంటి సందర్భంవస్తే చెబుతూనే వుంటారు.కుర్రాళ్ళింకా ఇంటికి రాలేదన్న సంగతి గంగమ్మ చెప్పింది.

"గంగవ్వా! మీకు వాళ్ళని దండించాలని వుంటే మునసబు శివేగౌడని పిలవటాని కెందుకెళ్ళారు?"

"అసలు వాళ్ళు నాచేతికి దొరికితేగా!"

"తప్పుమీదే" ఆ? అయ్యగారు మళ్ళీ అన్నారు. "ఇంటికి పెద్ద, తల్లి, తన్నుతాను సవరించుకోకుండా కుర్రాళ్ళని సవరించడమెలాగ" అన్న వారిపాత హితోపదేశం ఆమెను ఉక్కిరి బిక్కిరి చేసింది.

"బడికి పంపించారు కదా అప్పణ్ణయ్యను. అక్కడ వాడు ఓచయ్యగారినే లంజాకొడుకా అని తిట్టి పారిపోయొచ్చేశాడట. ఆ బూతుమాటలెక్కడ నేర్చుకున్నాడు?"

"నా ప్రారబ్ధమండీ, అదే వాడి నాలికమీద కూర్చుని వాగిస్తోంది. ఆ తరువాత ఆ లంజాకొడుకుని ఓచయ్యగారూరికే వదిలేశారా?"

అక్కణ్ణుంచి పారిపోయొచ్చేకదా అన్నదమ్ములిద్దరూ పెంకులుబాదింది"

"ఈ ఎదవల్సిగ తరగ. అంతింటికి పెంకులు కప్పించాలంటే నేనెక్కణ్ణుంచి తేను?"

"మళ్ళీ ఆ చెడ్డమాటలేనా గంగవ్వా!... "అయ్యగారింకా ఏదో చెబుతున్నారు. ఇంతలో వీధిలో జనం అటూఇటూ తిరిగే సందడి వినపడ్డది. కొందరు "చెరుకుతోట లంటుకుపోతున్నాయి. పారిరండి పారిరండి" అని కేకలేశారు. వీరిద్దరు గుడి బయటికి వచ్చి చూశారు. చెరువు వెనకాతల బయలులో నిప్పు రాజుకొంటోంది. దాని వెలుతురులో పొగకూడా కనిపిస్తోంది.

"అయ్యో! మాకూ చెరకుతోటుంది కదా! ఏ కొంపలంటించే కొరువులు చేశాయో ఈ పని" అంటూ గంగమ్మ ఇంటికెళ్ళి తలుపు తాళం వేసి - వెడుతున్న జనంతోపాటు చెరువు కట్ట వైపు పరుగెట్టింది.

వూరి ముందరే చెరువు. వూరికి రెండువైపులా ఆవరించివున్న చెరువుకట్టమీదికి వెళ్ళాలంటే వూరి మొగదల నుంచి వెళ్ళాలి. అక్కడ నగానికిపెచ్చుగా చెరకు పండిస్తున్నారు. పడమటి తూము వైపుగా రెండు చెరకుగామగలాడుతుంటాయి. చెరుకుతోటల్లో తూర్పుగా మండుతోన్న మంటలు క్రమంగా పడమరగా పాకుతున్నాయి. చెరుకు పంట దాదాపు కోతకు వచ్చి మొదళ్ళలో వున్న ఆకులెండి ఒగుళ్ళయివ మూలాన మంటలు పాకటానికి వీలుగావుంది. గాలి లేకపోతే మంటలంత తొందరగా పెచ్చురేగేవికావు. కానీ గాలి దిక్కుతెలియకండా ఒకసారి పడమరగా, మరోసారి దక్షిణంగా ఈడ్చికొడుతూన్నందువల్ల మంటలు గబగబ పాకుతున్నాయి. పడమరగా వున్న రెండు గామగలవాళ్ళూ కట్టిన దున్నపోతుల్ని విప్పేసి చెరువు కట్టమీదికి తోలేశారు. పనివాళ్ళు బెల్లపు బస్తాలని అవతలికి సాగించటానికి మోసే యత్నం చేస్తున్నారు. బెల్ల పచ్చుల కర్రపేటలు ఇద్దరిద్దరు చొప్పున మోస్తూ కట్టమీదికి తెచ్చి పడేస్తున్నారు. వెదురుగడలతో, కొబ్బరిమట్టలతో చెరుకు గుడులతో కప్పిన గానుగ పాకలకి మరో అయిదు నిమిషాలలో నిప్పంటుకుని మంటలు ఆకాశాన్నంటడం కూడా నిజం.

వారివారి పొలాలకి మంటలు పాకుతూండగా ఆ పొలాల సొమ్ము కాపులు వారి కుటుంబాలు తమతమ వొంటిమీదే మంటలు పాకినంతగా బాధపడుతూ హాహాకారాలు చేస్తున్నారు. అసలు నిప్పెలా వచ్చింది? ఎవరు పెట్టారు? అన్న విషయం జనంలో తర్కవితర్కాలకు దారితీసింది.

చెరుకు గానుగకు చేరువగానే గంగమ్మ కొబ్బరితోట వుంది. నలభై చెట్లున్న దాని విస్తీర్ణ మొకయెకరా. కడమతోట భాగం వేరేపొలానికానుకొనివుంది.

మంటలప్పటికే నలువైపులా చుట్టుముట్టి తోట పక్కలోవున్న గానుగ పాకం మీదికి పాకగానే ఆ మంటలూ, పాగా తాడిప్రమాణంగా పైకిలేచాయి. తోటలోంచి ఎవరో "అయ్యయ్యో! రక్షించండి. రక్షించండి. చచ్చిపోతున్నాను. రక్షించండో" అని గట్టిగా కేకలేస్తూ లబలబ నోరు కొట్టుకోవటం మంటల చిటచిటలలోనే స్పష్టంగా వినపడ్డది. జనమంతా కంగారుపడుతూ ఎవరా అని ఆవైపు చూస్తూండగానే గంగమ్మ "మా చెన్నిగరాయని కంఠంలా వుంది. ఎదవముండా కొడుకు ఈ వేళప్పుడు తోటలో కూర్చోని ఏంచేస్తున్నాడు? బాబ్బాబు మీ పుణ్యముంటుంది మగాళ్ళెవరైనా ఎళ్లి తీసుకు రండి" అని ప్రాధేయపడ్డది. అయితే మంటలు చుట్టూతా ఆవరించి పక్కనే వున్న గానుగపాక లంటుకుని జ్వాలలు పైకిలేచి ధగధగ మండుతోంటే తోటలోనికెళ్ళడానికి సాహసించేదెవరు? తోటకంచెకు కూడా నిప్పంటుకుంది. తోటలో కర్రపోగుకూడావుంది. దానికి నిప్పంటుకోవచ్చు ఏమగాడూ ధైర్యంగా ముందుకు నడవలేదు. గుడి మాదేవయ్య గారు మాత్రం, 'తోటలోకి మంటలురావు రండి రండి' అంటూ కట్టదిగి గబగబ మండే పొలాలమధ్యగా వెళ్ళే నీరుకాలవలోనికి మళ్ళించి తోటచేరుకున్నారు.

"మరెవళ్లూ మగాళ్ళకు పుట్టిన లంజాకొడుకులు లేరేమిరోయ్ ఆడముండని నేనెడుతున్నాను" అని కేకలేస్తూ గంగమ్మకూడా కట్టదిగింది. బెస్త ముద్ద, మాలబేరూర, భజనకువచ్చే తోటమరి మొదలైన ఏడెనమండుగురు ఆవిడవెనకాలేదిగి ఆవిడ కంటె ముందుగా పరుగెట్టారు.

తోటలో చెన్నిగరాయుడు అంత ఎత్తుగాలేని కొబ్బరి చెట్టెక్కి నగమొండిన మట్టమీదకూర్చోని, ఇంకా, అయ్యయ్యయ్యో! అంటున్నాడు. మాదేవయ్యగారు – 'తోటకి నిప్పంటుకోలేదు. గబగబా దిగిరా చెన్నయ్యా' అని కేకేసి చెప్పారు. అయినా వాడికి దిగటానికి భయం "నాకు భయంగా వుందయ్యగారు" యేడ్చేశాడు. అంతలో ముద్ద, బేయూర, తోటమరి అంతా పరుగెట్టుకొచ్చారు. వెనకాలే గంగమ్మకూడా రొప్పుతూ రోజుతూ వచ్చింది. "దిగిరారా నాన్నా! అప్పట్నేడిరా?" అని అడిగింది. వాడు కోతిపిల్ల దిగినంత తేలికగా మరో చెట్టు మీదికి దూకి అవలీలగా దిగేశాడు. ఇంకా కాస్సేపు అక్కడే వుంటే కర్రలపోగు మీద నిప్పురవ్వలువడి అంటుకునే ప్రమాదం వుందని వాణ్ణితీసుకుని అందరు వెనక్కి వెళ్ళిపోయారు. వాళ్ళు నడిచివస్తున్న కాలువగట్టుకు రెండువైపులా చెరుకు మంటలు చల్లారి

పోతున్నాయి. గానుగపాకలమీది మంటలు మాత్రం మరీ విజృంభించి పైకిలేస్తున్నాయి. గానుగం పక్కనే ఎత్తుగా పోగుపడ్డ ఎండిన చెరుకు పిప్పి అగ్నికి ఆహుతై పోతోంది.

అందరూ చెరువు కట్టెక్కిన తరువాత మాదేవయ్యగారు చెన్నిగరాయణ్ణడిగారు “ఈ వేళప్పుడు కొబ్బరి చెట్టెక్కి ఎందుకు కూర్చున్నావు?”

“అమ్మ శివేగౌడను తీసుకొస్తానని వెళ్ళింది కదా - అందుకు?”

ఇంతలో అందరూ చుట్టుముట్టారు. శివేగౌడ కూడా వచ్చాడు.

“మీరన్నదమ్ములిద్దరు పెంకులెందుకు బాదారు.”

“అయ్యో! పెంకుటిల్లు పాడుగాను. అప్పణ్ణయ్య ఏడిరా?” గంగమ్మ బెంగెట్టుకుని అడిగింది.

“లింగాపురంవైపు పారిపోయాడు. వాడే చెరుకుతోటకు నిప్పెట్టింది”

“వాడెందుకు పెడతాడురా?”

“మనమిద్దరమూ కొబ్బరిచెట్టుమీద దాక్కుందాం రారా అన్నాను. వాడికి తిన్నగా చెట్టెక్కడంరాదు. నేను చెరుకుతోటలో వుంటాను అన్నాడు. అసలైతే గానుగపాకలో జనం చూస్తారని, అవతలి తూము కాలువ వైపెళ్ళాడు. బీడీ కాల్చాలని అగ్గిపుల్ల గీచాడట. చెరుకుగడంటుకుందట.”

అది వినగానే మునసబు శివేగౌడ “అణ్ణెల్లిలాక్కురాండ్రా” అని గర్జించాడు. కానీ మాదేవయ్యగారు “వీడు చెప్పాడని నమ్మడానికవుతుందా? వాడు బీడీ వెలిగించినప్పుడే నిప్పంటుకుంటుందని నీకెలా తెలుసు?” అని చెన్నిగరాయణ్ణడిగారు.

“నే వబద్ధాలాడటం లేదండీ అయ్యగారూ. కావలిస్తే దేవుడి మీద ఒట్టెట్టి చెబుతాను. వాడిక్కడి దాకా పరుగెట్టుకొచ్చి ‘ఇలాగయిందిరా. పురదప్పతోటకి నిప్పంటుకుంది. నీవెవ్వళ్ళకీ చెప్పకు. నేను లింగాపురం వేపు పారిపోతాను. నీవు కూడారా’, అనిపిలిచాడు. ‘నిప్పెట్టినవాడు నువ్వు. నేనెందుకొస్తాను. వెళ్ళన్నాను. వాడు పారిపోయాడు,’ అన్నాడు. తనవాదాన్ని మరింతబలపరుస్తూ. (ఆ మాటలంపూర్తి పరిణామమెల్లావుండాలన్నది మునసబు శివేగౌడకి మరికొందరు పెద్దలకీ అప్పుడే తట్టింది. గంగమ్మ కదేదీ బోధపడలేదు. మాదేవయ్యగారి కంతా అర్థమై, ఎలాగైనా తప్పించాలని “ఆ కుర్రాడి మాటనమ్మడంయెలా?” అన్నారు.)

“ఏం? ఎందుకు నమ్మగూడదు?” మునసబు దర్పంగా అడిగాడు.

"నిజమేనండి మునసబుగారు" చెన్నిగరాయమళ్ళీ ధ్రువపరుస్తూ తనదేమీ తప్పులేదని సూచించాడు. ఇంటిపెద్ద కొడుకే మొద్దబ్బాయిలా మాట్లాడుతుండగా తాము తెలివితేటలు ఉపయోగిస్తే మునసబుగారు, వూరిపెద్దలు తమమీదకే ఎదురు తిరుగుతారని ఆలోచించిన అయ్యగారు వూరుకున్నారు.

మునసబు వుత్తరువుమేరకు వెట్టి, తలారులు అప్పణ్ణయ్యను వెదకటానికి బయల్దేరారు. రాత్రి చీకటిలో వాడెంతో దూరం వెళ్ళనే లేదు. అవతల తూము కాలువకి చేరువగా బూలప్పరాయని మండపంలో ముంతుకూచొని వున్నాడు. అనుమానం తగిలి బెత్తముద్ద అందులోకెళ్ళేసరికి పట్టుబడ్డాడు. భయంతో రానని మారాం చేశాడు. బ్రతిమాలాడు. చివరికి మొండికెత్తాడు.కాని ముద్ద వాడికంటె మొండి. నాలుగుకాళ్ళూ కట్టిన గొర్రెపిల్లలాఎత్తిబుజాన వేసుకొని బయల్దేరాడు.

వూరువూరె చెరువుకట్ట మీదుంది. ఇంతలో ఇనుగ మాగు పూర్తిగా కాలిపోయి కణకణ మండే నిప్పులుమాత్రం ఎర్రగా కనిపిస్తున్నాయి. పొలాలలో చెరుకులుకాలి నల్లగా మిలికలు తిరిగి నిలబడ్డాయి. వెన్నెలలేకపోయినా అన్నీ మసకమసకగా తెలుస్తున్నాయి. అప్పణ్ణయ్యను తెచ్చి అందరి ముందు దించినప్పుడు వాడు భయంతో వణికిపోతున్నాడు వెనకజుట్టు వదలి ముందరక్షవరం చేయించుకున్న బుర్రమీదకూడా చెమటపట్టింది. ఏమైతేనేం కొడుకును చూడగానే గంగమ్మ మనసు కుదుటపడ్డది. శివేగౌడతో చెప్పి వాణ్ణి బాగా తన్నించాలని మొదటే నిర్ణయించుకుంది. కాని శివేగౌడగారి నిర్ణయం మరోలా వుంది

"చెరుకు తోటకెందుకోయ్ నిప్పెట్టావ్?" ఆయన అడిగారు. భయంతో అప్పణ్ణయ్య పలకలేదు. మరోమాట హుంకరించి అడిగేసరికి "నాకు తెలవదండి" అన్నాడు.

"ఓహో! తెలవదేం పాపం! బీడీ కాలుస్తూ ఓ నిప్పంటుకోలేదురా? అలాగని నువ్వు కొబ్బరిచెట్టుమీదున్న నాతో చెప్పలేదూ?" చెన్నిగరాయలు స్వయంప్రేరితమైన సాక్ష్యమిచ్చాడు అప్పణ్ణయ్య ఉలక్కుండా పలక్కుండా తలవంచుకుని నుంచున్నాడు. కాని వాడి కాళ్ళు గజగజ వణికిపోవడం కదులుతూన్న అడ్డపంచలోంచి కనిపిస్తోంది. ఆ గుంపులోవున్న అయ్యాశాస్త్రిగారు - "మౌనం సమ్మతి సూచకం అంటె వాడే నిప్పెట్టాడన్నది నిజమన్నమాట. ఇహ ముందరి సంగతి ఆలోచించండి" అన్నారు.

పొలంసొమ్ము కాపులు అంచనా వేయడం మొదలెట్టారు. "నాచీసీ చెరుకుతోట

పటిక బెల్లంలాంటి మాంచి బెల్లమయ్యేది. అణాకి కనీసం రెండచ్చులైనా లక్ష్మివారపు సంతలో చేతులమీద ఎగిరిపోయేది. ఎంతలేదన్నా మూడువందలకు పైపెచ్చే నష్టమయింది." అని కురబసణ్ణయ్య గ ణిగాడు. బలిజ రేవణ్ణశెట్టి "నా ముంగారు చెరుకుఅంతేననుకోండి. అయినా మరుగోలు పంటయితే నాలుగొందలొచ్చేది" అన్నాడు. ప్రతివాడు తన తన నష్టాన్ని అంచనావేసి ఏకరువు పెడుతున్నారు.

అయ్యాశాస్త్రులకి పొలంగిలం లేదు. అయినా తనకు కలిగే నష్టం బేరీజువేసి చెప్పాడు. 'నాకు పొలం లేదన్నమాట నిజమేకాని అందరూ పండితే గణపతి పూజకోసం - ఒక్కొక్క పంటకీ ఒక వుండబెల్లం నాకువచ్చేది. మొత్తం లెక్కేడితే ఏంలేదన్నా అయిదు వందలవుండలు లభించేవి. ధరకట్టితే యాభైరూపాయ లవుతుంది. అదనంగా దీనిమీద నాకు ఇచ్చేరుకుపాలు, వండేటప్పుడు దొరికే వేడి బెల్లం ఇవన్నీ..."

"శాస్త్రిగారూ! మీ వడ్డీ లెక్కలు చాలా సొగసుగా వున్నాయి. చెరుకుతోటలున్న వాళ్ళు లబోదిబో అనడం న్యాయం. గణప్ప పూజకు అయితే గియితే వచ్చే వుండలమీది నష్టాన్ని కట్టడం సబబుగాలేదు" అని మాదేవయ్యగారు సగంలోనే అనేశారు. "చెరుకంతా పండించిన రేవణ్ణశెట్టి మరుగోలు పంటకు నాలుగొందలు నష్టమొద్దట! ఆయనకున్నదే ఎకరాన్నర పొలం.మూంగారుకే వందచేతికి రాలేదు. మరిహ మరుగోలికి నాలుగొందలట! నాకు మరుగోలక్షరలేదు. పొలందుక్కిచేసి వరి చేస్తాను. చెరుకేసి పొలం పాడయింది అని ఆయనే నాతో చెప్పాడుకదా!"

ఇంకా ఎంతమంది ఎన్ని విధాల తమ నష్టాన్ని వివరించే వారో! అయ్యగారి మాటలలో, పదిమంది అవుననేలా కాస్త ఆలోచించి వాళ్ళు చెప్పవలసి వచ్చింది. (అయ్యగారే ఇంకా ఇలా అన్నారు. "గణప్ప పూజకని కట్టేవి చిన్న వుండలు. అలాంటివి అయిదొందలిస్తే ఎవడయ్యా యాభైరూపాయిలిచ్చేది. అంటే రూపాయికి పదివుండలయింది. రూపాయికి నలభైదాకా బెల్లపచ్చులే ఇస్తున్నారు. చిన్ని వుండలకి అణాన్నర ఎలా ఇస్తారు?"

దాంతో అయ్యాశాస్త్రిగారి నోరు పూర్తిగా మూతపడిపోయింది. మాదేవయ్యగారు ఆఖరు తీర్పు చెప్పేలా నిటారుగా నుంచుని అన్నారు. "నష్టాలు వివరిస్తే ఎవళ్ళకీ ఏమీ గిట్టదు. అబ్బాయి కావాలని చేయలేదు. వేలెడు కుర్రాడు బీడి కాలుస్తాడంటే వాడికి బుద్ధి చెప్పాలి. కర్రుచ్చుగుని నాలుగు వడ్డించి పంపండి. లేకపోతే

ఓచయ్యగారితో చెప్పి 'కోదండం' వేయించండి".

"లేదండి, లేదండి... నన్ను 'కోదండం' వేయించకండి బాబ్బాబు" అని అప్పణ్ణ కాళ్ళావేళ్ళాపడ్డాడు. "నాదేమీ తప్పులేదు వాణ్ణే కోదండం వేయండి" అని చెన్నిగరాయలు కలిపించుకున్నాడు.

కాని శివేగౌడ మరోలా నిర్ణయించాడు. "అయ్యగారూ! మీరేమో సన్యాసులు. కొంపాగోడీలేదు. పెళ్ళాంలేదు. పిల్లల్లేరు. కుఱ్ఱాడికి బుద్ధి చెప్పడమన్నది వేరేమాట. ఇప్పుడయిన నష్టాన్ని ఎవడుకట్టిస్తాడు? నేను వూరి మునసబుని. న్యాయం చెబుతాను. మొత్తం మీద వీళ్ళు వూరి మొత్తానికి ఇంత జరిమానా అని ఇచ్చుకోవాలి. దాన్ని ఎవళ్ళెవళ్ళు నష్టపడ్డారో వాళ్ళకి పంచాలి".

"బావుంది, న్యాయం బావుంది" అని అనేకులు తలాడించారు. రేవణ్ణశెట్టి, అయ్యాశాస్త్రులు గట్టిగానే "ఒక అయ్యా అమ్మకుపుట్టిన వారిమాట అంటే ఇది" అన్నారు. మాదేవయ్యను దెప్పి పొడవాలనే వాళ్ళలా అన్నది. అయ్యగారు దాన్ని పట్టించుకోలేదు. వ్యవహారం ఎటువేపు తిరుగుతోందో ఇప్పటికి గంగమ్మకి బోధపడ్డది. ఆవిడ చేతులు నలుపుకుంటూ "నేను మొగుడు చచ్చిన ముండని, అళ్ళు బుద్ధిలేకుండా ఏదో చేశారు..." అని ఇంకా ఏదో చెబుతూ వుండగా చెన్నిగరాయలు కలిపించుకుని "ఇందులో నా తప్పేమి లేదమ్మా. వాణ్ణే మాత్రమను" అన్నాడు. గంగమ్మ దాన్ని ఖాతరు చేయకుండానే ప్రాధేయపడ్డది. "తప్పుజేసినందుకు వాడికి 'కోదండం' వేయించండి. జరిమానా గిరిమానా అంటే వేనిచ్చుగోలేను".

"నన్ను కోదండం వేయించకండి బాబూ! జరిమానేయే, కట్టించుకోండి" అప్పణ్ణయ్య ఏడుస్తూ మొరపెట్టుకున్నాడు.

పెద్దలలోనే మాటమంతీ జరిగింది. అయిన నష్టాన్ని అందరూ అంచనావేశారు. పూర్తి నష్టపరిహారం కాకపోయినా, కొంతకు కొంత చెల్లించినా గంగమ్మ రెండు వేలరూపాయలిచ్చుకోవాలి. గణపతి వుండలు రానందున అయ్యాశాస్త్రులకి మొత్తం మీద పదీ, లేవి మరుగోలు పంటకయిన నష్టానికి రేవణ్ణశెట్టికి పాతిక రూపాయలివ్వాలని తీర్పు చేయబడ్డది.

గంగమ్మ దేవురించింది. మొత్తుకుంది. చేతులు పిసుక్కుంది. అయినా ఎవళ్ళూ వినలేదు. ఆవిడ పక్షాన మాట్లాడినా లాభం లేదని ఎరిగిన మాదేవయ్యగారు వూరుకున్నారు. తన దగ్గర ఒక ఎర్ర ఏగానీ లేదని గంగమ్మ అన్నందుకు శివేగౌడ

పరిష్కారమార్గం చెప్పాడు. "నీ మెరక మాగాణి, తోట, దొడ్డి, ఇల్లూ అన్నీ నాకు తణఖా రాయించు. నేను డబ్బిస్తాను. తరువాత డబ్బిచ్చి తణఖా విడిపించుకో."

(గంగమ్మకు దిక్కుతోచలేదు. అయ్యాశాస్త్రుల ముఖం చూసింది. తనకు వచ్చే పదిరాళ్ళూ ఆయనెందుకు వదులు కుంటాడు? ఆయనవల్ల ఏమీ లాభం లేకపోయింది. గ్రామంలో వున్న మరో పురోహితుడు అణ్ణాజోస్యులు. అయ్యాశాస్త్రుల జ్ఞాతి. దూరపుసంబంధం. నగునకి అన్నగారి కొడుకు. బాబాయి చెప్పిన మాటకి నిష్కారణంగాలయన ఎదురుచెప్పరు. గ్రామపెద్దలంతా కలిసి చేసిన తీర్పాయె. ఆమె ఒప్పుకోక తప్పింది కాదాయె.

జరిమానా తప్పించాలని మాదేవయ్యగారు మొదటే ప్రయత్నం చేశారు. సాగలేదు. అయినా గంగమ్మ కొకమంచి మాట చెప్పారు. "పొలంతణఖాపెట్టి అప్పుచేయకండి. మీ ఇంట్లో వెండి బంగారం ఏమున్నా అమ్మేయండి. తక్కువపడితే ఇంట్లోవున్న ధాన్యం గీన్యం అమ్మేసి భర్తీ చేయండి. స్థిరాస్థి మీద రాతకోతలు వొద్దు. అప్పంటూ చేస్తే దానివడ్డీయే మింగేస్తుంది. దాన్ని నిర్వహించే లౌక్యం మీకు తెలీదు.")

మునసబు శివేగౌడ అడిగాడు "దానికేం లౌక్యం కావాలండి? నేనావిడ దగ్గిర వడ్డీ పుచ్చుకుంటానా? మాటవరసకి తణఖా రాయించడ మంతే, పెళ్ళిలో పెద్దలెట్టిన నగానట్రాపోతే తిరిగొస్తయా? సన్యాసికి వెండి బంగారం అక్కరలేదుకానీ సంసారుల కక్కరలేదా? ఏం గంగమ్మ గారూ! ఈ సన్యాసి మాట వింటారా? గ్రామంలో పదిమంది పెద్దమనుషుల మాట వింటారా?"

పదిమందీ మునసబు మాటనే బలపరచారు. మునసబుగారిబావమరిది ప్రస్తుతం కరణీకం చూస్తున్న శివలింగే గౌడ "పెళ్ళిలో పెట్టిన బంగారమమ్మే హక్కు మొగుడుపోయిన పెళ్ళానికి లేదు. చట్టం ఒప్పుకోదు" అన్నాడు. ఇంతమంది ఏకాభిప్రాయాన్ని ఎదుర్కొనే చట్టజ్ఞానం మాదేవయ్యకు లేదు. ఉన్నా ఈ పంచాయితీ దార్ల మధ్య తమ అభిప్రాయాని కెంత విలువ? తమ మాట గంగమ్మ వింటుందన్న నమ్మకం కూడా ఆయనకు లేదు. ఆయన వూరుకున్నాడు.

న్యాయ విషయంలో ఆలస్యం పనికిరాదు. అప్పుడే రెండు బళ్ళు కట్టించి తలిమ్మా పెద్దలు తిపటూరు బయలుదేరారు. సబ్‌రిజిస్ట్రార్ ఆఫీసులో శివేగౌడ రెండువేల రూపాయలు నగదుగా లెక్కకట్టిచ్చాడు. తన కుటుంబ అవసరనిమిత్తం అన్న కారణం కనబరిచి ఆవిడ యావదాస్తి తణఖా రాయించుకోవడం జరిగింది.

పత్రం రాసిన యాక్టింగు కరణం శివలింగేగౌడ దిక్కులానికి అధమపక్షం పాతికరూపాయలైనా ఇవ్వాలని పట్టుపట్టాడు. ఈ సారి పంట వచ్చాక అనుములు అమ్మి ఆ డబ్బివ్వటానికి గంగమ్మ ఒప్పుకుంది. తన చెరుకుతోట నష్టం బాపతు నాలుగువందలు మినహాయించుకుని మిగతా పైకం శివేగౌడ ఇతరులకి పంచాడు.

తంచెడ్డ గంగమ్మ తిపటూరి హోటళ్ళలో తినటానికి కెలాగూ వీలులేదు. వేయించటానికి ముందు నీళ్ళుతగిలివుంటాయి కాబట్టి మరమరాలు కూడా ముట్టడానికి వీలులేదు. చెరువులో మునిగి తడిచీరతోటే ఇంత వేరుసెనగవేపుడు, ఇంత బెల్లం ముక్క తిని మళ్ళీ బండిలో కూర్చుంది. కొడుకులకి ఆవిడే అరణాలిచ్చి బ్రాహ్మణ హోటల్లో ఇరవైనాలుగు దోసెలు, ఇంతపచ్చడి ముద్ద కొనిపెట్టింది.

వూరికి వచ్చాక అవమానంతో నాలుగు రోజులెక్కడా బయటికి కదలలేదు. మూడుమైళ్ళదూరంలో వున్న సన్నేనహళ్ళి కుమ్మరి వాళ్ళకు పదహారు రూపాయలిచ్చి అయిదువందల బిళ్ళపెంకు తెప్పించి వెనకకప్పంతా పూర్తిగా వేయించింది.

వారం రోజులయ్యాక ఆవిడే గుడి మాదేవయ్యకు కబురు పెట్టింది. తన కష్టసుఖాలు చెప్పుకుని ముందరికేం చేయాలని అడిగితే ఆయనిలా అన్నాడు. అప్పణ్ణయ్యని ఓచయ్యకు అప్పచెపండి. కొంచెం చదువుకుంట బడితే వాడు తిన్నగా వుంటాడు. చెన్నిగ రాయణ్ణి హొన్నవళ్ళికి పంపండి. మీరేవెళ్ళి వాణ్ణక్కడ వదలి, ఇంటి కరణీకం పరాయివాళ్ళచేతుల్లో వుంది. వీణ్ణి బుద్ధిమంతుణ్ణి చేసి విద్యనేర్పండి అని అడిగిరండి. ఆలస్యం చేస్తే శ్రుతిమించి పోతుంది. వాడికప్పుడే పదిహేను నిండుతున్నాయి కదా".

గంగమ్మ ఒప్పుకుంది. చెన్నిగరాయణ్ణి హొన్నవళ్ళి కరణం సీతారామయ్యగారి చేతికింద లెక్కలు నేర్వటానికి వదులుతున్న సంగతి మునసబు శివేగౌడకు తెలిసింది. అతడే వచ్చి అడిగాడు "అంతదూరమెందుకమ్మా ఎల్లడం. మాసివలింగని కాడవగ్గియండి. ఈడే ఇంటికాడుండి నేరిస్తే పోలా?".

అయినా హొన్నవళ్ళి సీతారామయ్యగారి వద్ద నేర్పిన విద్యే విద్య అన్నది గంగమ్మ దృఢవిశ్వాసం కూడా. ఇతరులు కరణీకం చేయవచ్చు గాక, కాని దానికి గురుపీఠం వహించే యోగ్యత వున్నది ఈ ప్రాంతంలో ఒక్క హొన్నవళ్ళి వారికి మాత్రమే. జావగల్లు ప్రాంతంలో హళేబీడు వెంకట రమణయ్యగారికి కూడా

అలాంటి యోగ్యత వుంది. కానీ వారు ఈ ప్రాంతం వాడు కాదు. ఒక్కొక్క ప్రాంతంలోని అనుపానులు ఆప్రాంతంవాళ్ళకే తెలుస్తుంది.

మొత్తానికి గంగమ్మ బండి కట్టించుకుని, ఇద్దరు కొడుకుల్ని వెంటేసుకొని హొన్నవళ్ళికి బయలుదేరింది. వెళ్ళటానికి రెండు రోజులు ముందే చెన్నిగరాయలు మంగలి రుద్రన్నతో తల ముండనం చేయించుకుని నెత్తికి గంధం రాశాడు - మరుసటి రోజా తలంటి పోసుకున్నాడు. జంతికలు చలిమిడి మూట సిద్ధమయింది. కోటు, టోపి ధరించి వాడు బండెక్కబోతూంటే మాదేవయ్యగారన్నారు. "పెద్దచోటికెళ్తున్నావు. ఇహపైన నీ నోట్లో బూతుమాటలు రాకూడదు. బుద్ధిమంతుడై క్షేమంగావెళ్ళిలాభంగా తిరిగిరా."

హొన్నవళ్ళివారు, దివంగతులైన రామణ్ణగారి నెరిగిన వారు. గంగమ్మ కోరిక మన్నించి, చెన్నిగరాయని తమ యింట్లోవుంచుకుని లెక్కలునేర్పటానికి ఒప్పుకున్నారు. తల్లీ తమ్ముడు బండెక్కుతుండగా చెన్నిగరాయలేడుస్తూ మంచున్నాడు. చివరికి "ఎవరితోనైనా మరిన్ని జంతికలు, చలిమిడి పంపించు" అనిచెప్పాడు.

వూరికి తిరిగివచ్చాక సాతాని చెన్నకేశవయ్య గారి వీధిబడిలో అప్పణ్ణని చేర్పడమయింది. రోజూవాణ్ణి బడికి పంపాలంటే లాగు జేబు నిండా వేరుసెనగపప్పు, బెల్లం ముక్క, సగం కొబ్బరిచిప్ప ఇవ్వవలసిందే.

# 2వ అధ్యాయం

మొత్తం మీద చెన్నిగరాయడు హొన్నవళ్ళిలో మూడేళ్ళు శిష్యరికం చేశాడు. ఇప్పుడతడు సులువుగా ఎడమచేతి వ్రేళ్ళతో రూళ్ళకర్ర తిప్పగలడు. కుడిచేత్తో పాళీకలంతోగాని పెనిసిలుతోగాని సమంగా గీతలు గీయగలడు. లెక్కలు ఎడమవేపు తప్పులేక వ్రాయటమేకాక కుడివేపు కూడా వ్రాయటం తెలుసుకున్నాడు. అతని విద్య పూర్తి అయిందాలేదా అని చెప్పటం కష్టం. 'నువ్వు రూపాయలో పావలా భాగమయినా నేర్చుకోలేదు' అని అతని గురువు సీతారామయ్యగారన్నారు. దానికి బదులు చెప్పకపోయినా చెన్నిగరాయనికా మాటల మీద నమ్మకం లేదు "ఆయన లెక్కలే అస్తమానమూ రాస్తూ ఇక్కడే పడివుండనీ అని ఆయనలా అంటారు" అని వ్యాఖ్యానించాడు.

సంవత్సరానికి కనీసం రెండు మూడుసార్లైనా తనవూరికి నడిచివెళ్ళివచ్చేవాడు. వచ్చినవాడొకసారి తల్లితో చెప్పేశాడు. "ఇంకెన్నాళ్ళని అక్కడ కూర్చుని అఘోరించాలి? నేను మనూరికొచ్చి కరణీకం చార్జీతీసుకుంటాను."

"లెక్కలన్నీ తిన్నగా వొంటబట్టాయా!"

"ఓ దానికేం? అడుగు కావలిస్తే. ఒకటోనంబరు ఖాతేవాడి, రెండోనంబరు బంజరతఖ్తు. మూడోనంబరు పహణి. నాల్గోఖాతా, ఐదు రెంట్‌రూల్, ఆరు జాస్తి కమ్మి; ఏడు తకరారు తఖ్తు; ఎనిమిది ఇనాం రిజిస్టర్; తొమ్మిది జమాబంది గోష్వారం పదిరోజు ఖర్ది; పదకొండు రసీదుపట్టి, పండ్రెండోనంబరు ఖాసీషామారీ – ఈ పన్నెండు కరణీకపు బారానమూణ లెక్కలు అని, 'ప్రభవ, విభవ. అంటూ అరవై సంవత్సరాల పేర్లు కంఠస్థం చేసి చెప్పేవాడిలా అప్పచెప్పాడు.

కొడుకు విద్యావంతుడయ్యాడని తల్లికి నమ్మకం కలిగింది. అతడడిగాడు "నాకేమైనా పెళ్ళి పెటాకులు చేస్తావా? లేక నాకేంపట్టిందని వూరుకుంటావా?"

"చెయకేం? ఆగరా కరణీకంచేతికి రానీ".

"అదెలాగూ రానేవస్తుంది. నా కప్పుడే పద్దెనిమిదిదాటలేదూ? 'మెజార్టీ' వచ్చింది. తలిమ్మా వాళ్ళు పదహారేళ్ళకే కుర్రాళ్ళకు పెళ్ళిజేస్తున్నారు. మనమిలాగే వుంటే నలుగురూ ఏమంటారు? 'చెన్నిగరాయలకు పిల్లనిస్తామని అప్పటికే ఎందరో అడిగారు. గంగమ్మ ఇంకా అంత పట్టించుకోలేదు. ఇప్పుడు కొడుకే అడుగుతున్నాడు కాబట్టి చేసెయ్యాలి. దీన్ని గురించి మాదేవయ్యగారి సంహా అడిగితే "అతడింకా ఏడాది రెండేళ్ళు లెక్కలు బాగా నేర్చుకోనీ; కరణీకం చేతికొచ్చాక పెళ్ళి గిళ్ళి చేసుకోనీ" అన్నారు.

చెన్నిగరాయడికి కోపం వచ్చింది. "ఓహో ఇంకా రెండేళ్ళాగాలట! మీకేమెరిక? వూరుకోండయ్యగారు" అన్నాడు. చెవటి కెప్పుడూ అతడు మీకేమెరిక వూరుకోండి అనలేదు. ఆయన పాపం వూరుకున్నాడు. చెన్నిగరాయుడు మళ్ళీ పాహావ్వనాళ్ళకి వెళ్ళనేలేదు. ఒక రోజు అతడే శివలింగేగౌడతో "నాపని నాకు ఇచ్చేపెయ్యి" అన్నాడు. "ఇద్దాం పైమంచి రానీ" అన్నాడుగౌడ. తరువాత ఏం చెయ్యాలో కాబోయే కరణంగారికి తెలియలేదు. ఇంతలో పెళ్ళి సంబంధాలేవేవో రావటంవల్ల అతని దృష్టి కరణీకం మీదికి వెళ్ళలేదు.

ఒకరోజు పెద్ద తెల్లటిగుర్రం వచ్చి గుమ్మంముందాగింది. నిగనిగలాడే పల్లం, రికాబులు, కళ్ళెం వేసిన ఆ గుర్రంమీదనుంచి తెల్లటిలాగు, తెల్లటికోటు, కాళ్ళకు మేజోళ్ళు బూడ్సులు వేసుకుని ప్రౌఢప్రాయంలో వున్న ఒక భారీవ్యక్తి దిగాడు. ఆ తెల్లటి గుర్రాన్నీ, ఆయన దర్జానీ చూస్తే జిల్లా అధికారి డిప్యూటి కమిషనర్ గారేమో అని ఎవరైనా అనేలా వుంది. గంగమ్మ కూడా అలాగే భావించి లోపలికెళ్ళి చెన్నిగరాయడుతో చెప్పింది. అతడు బయటికి వచ్చి భయభక్తులతో వంగి, చేతులు జోడించి "దొరగారు దయచేయాలి" అని తలవంచి, తడబడుతూ ఆహ్వానించాడు. తనకు కరణీకం దత్తంచేయడానికని డెప్యూటి కమిషనర్‌గారే స్వయంగా వచ్చారని వూహించాడు.

"శివలింగే గౌడని పిలిపించేదా! అని అడిగాడు"

"ఎందుకూ?"

"ఇప్పుడు కరణీకం వాళ్ళ అతని [illegible] వుంది. [illegible] దొరగారు వా
కిప్పించాలి. హక్కుదారు కరణం రామణ్ణగారి పెద్దకొడుకుని [illegible]"

"ఇప్పిద్దాం లోపలికి పదండి"

ఆయన లోపలికి వచ్చారు. ఇంట్లో కుర్చీలు లేవు. అణ్ణాజోస్యుల ఇంట్లోవున్న ఒక్క కర్రకుర్చీ మినహాయించి ఆ వూళ్ళో ఎవళ్ళింటిలోను లేవు. వచ్చిన పెద్దమనిషి చిరుచాప మీదే కూర్చున్నారు. చెన్నిగరాయుడు లోపలనుంచీ మంచినీళ్ళు తెచ్చి ముందుంచగా "మేము ముందే మంచి నీళ్ళుతాగరాదు" అన్నాడు. తల్లీ కొడుకులిద్దరికీ ఎందుకలా అన్నారో బోధపడలేదు. చివరికి ఆయనే చెప్పారు. "నాగలాపురం అని వినేవుంటారు. మే మావూరి పురోహితులం. నన్ను కంఠీజోస్యులు అంటారు. మా అమ్మాయి వుంది. పేరు నంజమ్మ. రేవతీనక్షత్రం రెండవపాదం. పన్నెండు నడుస్తోంది. జాతకం పట్టుకొచ్చాను. మీ అబ్బాయి జాతకమిలా ఇవ్వండి."

డెప్యూటీ కమీషనర్ అన్న వూహనుంచీ, ఆయన నాగలాపురం కంఠీజోస్యులన్న యథార్థానికి రావటానికి గంగమ్మకు కొంతకాలం పట్టింది. ఆయన తన ఇంటికి పిల్లనిస్తానని వచ్చాడన్న సంగతి తెలిసి ఆమెలో అంతకు ముందులేని ఆత్మవిశ్వాసం తలెత్తింది. అయినా పెద్ద గుర్రమెక్కి వచ్చారాయె. డిప్యూటీ కమీషనర్లా దుస్తులు వేసుకున్నారాయె" ఆమె అంది కరణీకం ఛార్జివచ్చేదాకా నేను వీడిపెళ్ళి చేయదలుచుకోలేదు."

"నీకేంతెలుసు వూరుకోవమ్మా; ఛార్జి ఇప్పిస్తానని వారు మొదలే చెప్పలే?" చెన్నిగరాయుడు తల్లినోరు నొక్కేశాడు.

"అదంతా నాకు తెలుసు; మీ హక్కు మీకు వచ్చేలా చేయట మెంతసేపు? నేను తాసీల్దారులో చెబుతాను ముందు పెళ్ళవనీ."

చివరికి గంగమ్మ కొడుకు జాతకం ఇచ్చింది. కంఠీజోస్యులేది ఎలా వున్నా స్వయంగానే జోస్యులు. అక్కడే కూర్చుని కాసేపు గుణించి చూసి "భేషుగ్గా కుదిరింది" తరువాత అడగవల-సింది అడగండి" అన్నారు.

## 2

నాగలాపురం రామసముద్రానికి పడమరగా పండ్రెండు మైళ్ళదూరంలోవున్న గ్రామం. ఆవూరి కంఠీజోస్యుల కీర్తి ప్రతిష్ఠలు ఎవని వాళ్ళేలేరు. రామసంద్రం తిపటూరు తాలూకా తుమకూరు జిల్లాకూ, నాగలాపురం చెన్నరాయపట్టణం తాలూకా హాసనజిల్లాకూ చెందడంవల్ల ఈ ప్రాంతంలోవున్న వాళ్ళకు జోస్యుల పేరు అంత పరిచితంకాదు. చెన్నరాయపట్టణం, శాంతిగ్రామం, హాసన, కౌశిక,

మొదలైన వూళ్ళల్లో ఆయన్ను గురించి విననివాళ్ళేవుండరు.

ఎత్తైన మనిషి; విశాలమైన నుదురు, చురుకైన కళ్ళు; గంభీరమూర్తి. ఆయనకు పదహారేళ్ళకే పెళ్ళయింది. ఇరవైయేళ్ళకి పెళ్ళాం కాపురానికి వచ్చింది. రెండేళ్ళకొక కొడుకుపుట్టాడు. మరోరెండేళ్ళకో ఆడపిల్ల పుట్టిపోయింది. ఆ తరువాత ఇద్దరు పిల్లలు కలిగి వాళ్ళూపోయాక, ఆఖరి పురిటిలో పెళ్ళామే చచ్చిపోయింది. ఆఖరిపిల్లని కంఠీజోస్యుల తల్లే పెంచిపెద్దజేసింది. జోస్యులు మళ్ళీ వివాహం చేసుకోలేదు. ఇప్పుడాయనకున్నది ఇద్దరే సంతానం. పెద్దకొడుకు కల్లేకు పోలీసుకానిస్టేబులుగా శ్రవణ బెళగొళలో పనిచేస్తున్నాడు. తల్లిచనిపోతూ వదిలిపెట్టిపోయిన నంజమ్మనే ఇప్పుడు చెన్నిగరాయడికిచ్చి పెళ్ళిచేస్తున్నది. అందరిలాగా, కొందు చెక్కభజనగాళ్ళు చుట్టూచేరి కంఠీజోస్యులు సుప్రసిద్ధులుకాలేదు. ప్రసిద్ధికికూడా కొన్ని సిద్ధులు కావాలిమరి. మాంచి భీముడిలాంటి శరీరసౌష్ఠవంతో ఒక్కసారి చూస్తే చాలు ఎవళ్ళయినా మరువటానికి వీలు లేని వ్యక్తి. మొదటినుంచీ నాటకాల్లో, యక్షగానాల్లో వేస్తున్న ఆయన వేషాన్ని ఒక్కసారి చూశారా. ఎవరూ మరచిపోరు. 'కాళిదాసు' నాటకంలో భోజరాజుపార్టు ఆయనే చేయాలి. చూడాలి. మరెవళ్ళు వేసినా వచ్చేదికాదు.మహాభారతనర్తనంలో దుర్యోధనుని వేషం ఆయనకే చెల్లును. యక్షగానంలో వీరవేషం వేసినప్పుడు రెండుమూడు బల్లలు విరిగేదాకా గెంతడం మానేవాడుకాదు. తారస్థాయిలో రాగాన్ని లాగిలాగి, కందపద్యం కమ్మగా పాడేవాడు. హార్మోనియం వాయించడమేకాక, తబలా కొట్టడం కూడా వచ్చు. శుభ, అపరకర్మలు రెండూ చేయగల పౌరోహిత్యం; దానికితోడు జ్యోతిషం; చేతబడి గీతబడికూడా ఆయనకి తెలుసు. వీటిని మించి తాసిల్దారుతో ఇంగ్లీషులో మాట్లాడే ధీమా, సాయిబులతో పుర్దూలో సర్దుకుపోయేనేర్పూ వున్నాయి.

గుండెధైర్యమే ఆయనకు ప్రసిద్ధిని సంపాదించి పెట్టింది. వెనుక ఏవేవో కోర్టుకేసులలో నెగ్గిన ఆయన, ఒకటి రెండు ఖూనీలు కూడా చేసి విజయాన్ని సాధించారని ప్రజలనుకునేవారు. అది నిజమో కాదో ఎరిగినవాళ్ళులేరు. జోస్యులు మాత్రమది శుద్ధ అబద్ధమంటారు. ఎవళ్ళతోనైనా పోట్లాడేటప్పుడు "నిన్ను ఖూనీ చేయిస్తాను" లాంటి మాటలు, నోటిలోనుంచీ వచ్చే దర్పాన్ని చూస్తే ఆయన ఎన్ని ఖూనీలు చేశాడో అన్న భయం ప్రజలలో కలిగితే ఆశ్చర్యం లేదు. చీకటంటే భయంలేని నిశాచరుడాయన. నడుంలో పిడిబాకు జోపుకుని

బయలుదేరితే తెల్లారేసరికల్లా ఒక్కడే 'బుల్దాలుతిట్ట' దాటి ఇరవైవాల్గు మైళ్ళదూరంలో వున్న హాసన చేరుకునే వాడు. జోస్యులు పగటిపూట ప్రయాణం చేయటమే అరుదు. కొరివిదయ్యాలనే కాక జడలదయ్యాలను కూడా ధైర్యంగా ఎదుర్కొని కాలికి బుద్ధి చెప్పించే ఆయన కీర్తి వ్యాపించడంలో ఆశ్చర్యంలేదు.

చెన్నిగరాయడిపెళ్ళికి రామసముద్రం బ్రాహ్మణ సమూహమంతా రావటమేకాక, అతని కరణీకం కిందవున్న కురుబలేహళ్ళి గ్రామమునసబు గుండే గౌడ, ఇంకా కొందరు గ్రామపెద్దలు కూడా వచ్చారు. పెళ్ళికొడుకు వారంతా మొత్తం పదిబళ్ళు కట్టించుకుని బయల్దేరారు. నాగలాపురం చెరువుకట్టవద్దే కొమ్ము సన్నాయి వూదించి, వీళ్ళకి ఎదురురావటానికి వచ్చిన పెళ్ళికూతురువైపువాళ్ళు పెళ్ళికొడుకునెక్కించుకుని తీసుకెళ్ళటానికి కంఠీజోస్యుల తెల్లగుర్రాన్నే తెచ్చారు. గుర్రమెక్కి కూర్చోవటానికి చెన్నిగరాయడికి తగని భయమూ, కంగారు. అయినా ఎక్కకపోతేమొత్తం రామసంద్రానికే అవమానం "థూ! పిరికిముండా కొడుకా!" అని గంగమ్మ చాటుగా తిట్టాక అతడు గుర్రమెక్కి కూర్చున్నాడు. గుర్రం బెదరకుండా పెళ్ళికూతురి అన్న కల్లేసు కళ్ళాన్ని చేత్తో పట్టుకుని సమంగా నడిపిస్తూ పక్కనే వచ్చాడు.

పెళ్ళికివచ్చిన పెళ్ళికొడుకువైపు వాళ్ళందరికీ కంఠీజోస్యులవ్యక్తిత్వం అనుభవానికి వచ్చింది. గొప్ప శ్రీమంతుడుకాక పోయినా షడ్రసోపేతమైన భోజనాలుమాత్రం మహావైభవంగా ఆయన పెట్టించారు. పెళ్ళికి హాసన నుంచీ ఒకలాయరు - ఆయన లాయరని కంఠీజోస్యులే చెప్పారు - వచ్చారు. పెళ్ళికొడుకు తరపున పురోహితులుగా అయ్యాశాస్త్రులు అణ్ణాజోస్యులు - ఇద్దరూ వెళ్ళారు. అయ్యాశాస్త్రులకు ప్రాతిమాసికశ్రద్ధ పుణ్యాహవచనం, గౌరీగణేశుల వ్రతాలు, మినహాయించి ఇతరకర్మల పౌరోహిత్యం పాఠం కాలేదు. అణ్ణాజోస్యులు వయస్సులో చిన్నవాడైనా శింధఘట్టపు సూరన్నజోస్యుల కిందక్రమంగా అధ్యయనం ముగించుకుని ఆ చుట్టుపట్ల పేరుప్రఖ్యాతలు సంపాదించాడు. అప్పటికే లెక్కలేనన్ని పెళ్ళిళ్ళు ఉపనయనాలు, చేయించి మంత్రాలు గడగడనీళ్ళు తాగినట్టు చెప్పే అభ్యాసమున్నవాడు. పెళ్ళికొడుకు విడిదిలో హోమం చేయిస్తూ అణ్ణాజోస్యులుగట్టిగా చెబుతున్నాడు "ఓం భూరగ్నియే ప్రాణాయస్వాహా! ఇదమగ్నియే ప్రాణాయస్వాహా!.."

పెళ్ళికొడుకు వాళ్ళవిడిది పెళ్ళికూతురింటిపక్కనేవుంది. ఆయన పలికే

మంత్రం పెళ్ళి కూతురింటివాళ్ళకూ వినపడుతోంది. అది చెవిలో పడగానే కంఠీజోస్యులక్కడికివెళ్ళి అడిగాడు, "జోస్యులుగారూ! అగ్నికి ఆహుతిచ్చే మంత్రాన్ని మరోసారి పలకండి."

"ఎందుకూ?"

"కాస్త వినాలి, పలకండి."

"అలాగని వేదమంత్రాన్ని మళ్ళీ పఠించరాదు" అని అయ్యా శాస్త్రుల మొఖంకేసి చూశారు.

"ఎందుకు పఠించరాదు? మీరు తప్పులు పలకవచ్చా?"

"నా మంత్రపఠనం తప్పా? శింధఘట్టపు సూరన్న జోస్యుల పాఠం తప్పా? వినండి బాబయ్యా! వేనీ పెళ్ళి చేయించాలా లేచి వెళ్ళిపోవాలా?" అని జోస్యులు లేచినుంచున్నాడు.

"మీ గురువుల సంగతి నాకు బాగా తెలుసు. ఆయనకు సంస్కృతమంతబాగా రాదు. భూరగ్నియే అనటంతప్పు. అగ్నయే అనాలి. మీరు చెప్పేది వ్యాకరణ శుద్ధంకాదు. గ్రంథంలో తీసి చూపమంటారా? వేదమంత్రం తప్పుగా పలికితే-తల వెయ్యిముక్కలవుతుంది."

అంతటితో అణ్ణాజోస్యులూరుకున్నారు. కంఠీజోస్యుల మంత్ర జ్ఞానాన్ని గూర్చి రామసంద్రం వాళ్ళంతా ఆశ్చర్యపడ్డారు. తరువాత ధారాదత్తం చేసే సమయంలో కన్యాదాతమంత్రాన్ని ఆయనే పెద్దగా కంచుకంఠంతో పఠించగా మొత్తం పెళ్ళిపందిరంతా గంభీరంగా ఆలకించింది. పెళ్ళయ్యాక, పెళ్ళికొడుకువాళ్ళు బయలుదేరేముందు. అణ్ణాజోస్యులు కంఠీజోస్యుల దగ్గిరకువచ్చి "నాకు కేవలం పాఠమయింది. వ్యాకరణ జ్ఞానం కాస్త తక్కువే అనాలి. అధ్యయనం పూర్తి కాకుండానే మా తండ్రిగారు పోయారు. సగంలోనే వదిలేసి వచ్చి కదమది పుస్తకపాఠం చేశాను. తప్పులుంటే క్షమించండి" అని అన్నాడు.

పెళ్ళి సలక్షణంగా జరిగింది. పిల్లకు నాగర, చేమంతిపూవు, కుప్పెలు, వెండి ఒడ్డాణము, కాళ్ళకు పాంజేబులు వేశారు. పెళ్ళికొడుకువాళ్ళు, ఆనవాయితీమేరకు తాళిబొట్టు, దుద్దులు, ముక్కుపుడకలు తెచ్చారు. తండ్రిలాగే ఒడ్డూపాడువూవున్న ఒళ్ళు విశాలమైన మదురు, చేరడేసి కళ్ళతో, వధువు సలక్షణంగా వుంది. "మా చెన్నిగరాయడికి ఇలాంటి పెళ్ళాందొరికిందంటే పుణ్యం చేశాడన్నమాట" అని రామసంద్రం వాళ్ళే అన్నారు. ఈ మాట గంగమ్మకు మాత్రం రుచించలేదు.

చెన్నిగరాయుడు భూమక్క వడ్డించిన భక్ష్యభోజ్యాలను చిన్న ముక్కకూడా వదలకుండా తిన్న విషయాన్ని గురించి నాగలాపురం వాళ్ళు విడ్డూరంగా చెప్పుకున్నారట. అలా తిని వుండకూడదని రామచంద్రం వాళ్ళు కూడా తరువాత అతనికి చెప్పారట. "కమ్మగావుంది ఘుమఘుమలాడే వాటినెలా ఎంగిలిచేసి పారెయ్యగలమో నాకు బోధపడదు" అని చెన్నిగరాయుడు తాను చేసింది సమర్థించుకున్నాడు.

## 3

చెన్నిగరాయుడు ఎన్ని సారులు అడిగినా శివలింగే గౌడ అతనికి కరణీక మివ్వలేదు. మొదట కొన్ని రోజులు "ఇద్దాం ఇద్దాం" అని అంటూవుండేవాడు. దాని అర్థమేమిటో తెలియని చెన్నిగరాయుడు కొన్ని రోజులాగి చూశాడు. మళ్ళీ అడిగినా అదేమాట. ఒకరోజు "సాలాఖరు లెక్కలు పూర్తికావాలి. తరువాత చూద్దాం" అని అన్నాడు. సాలాఖరు అంటే ఏప్రిల్ చివర, అప్పటికింకా అయిదు నెలలు గడవాలి, "సాలు లెక్కలు పూర్తి చెయ్యకుండా ఇస్తే నీకేమర్థమవుద్ది?" అని వాడడిగింది నిజమని ఇతడు ఒప్పేసుకున్నాడు!

ఇంట్లో మరోపనేమీలేదు. పెళ్ళామింకా పెద్దమనిషికాలేదు. కాబట్టి గర్భాదానం కాలేదు. పుట్టినింటిలోనే వుంది. రెండేళ్ళు ఓచయ్యగారి బడికెళ్ళినా అప్పణ్ణయ్యకు పూర్వజన్మపుణ్యం లేనందువల్ల విద్యరాలేదని ఓచయ్యగారే వాణ్ణి వదిలించుకున్నారు. ఇప్పుడు తోటచుట్టూ కంచెలో పెట్టిన తేనెతుట్టల వొడవటం, బొండ్లాలురాల్చి కొట్టి తాగడం తోటే కాలక్షేపం చేసేవాడు. మునుముందు కరణం కాబోతున్న చెన్నిగరాయుడు పొద్దుటేలేచి, స్నానంచేశాక తలనొప్పికి పట్టివేసేలా దళసరిగా విభూతి పూసుకుని, తడికౌపీనంతో సంధ్యావందనం చేసి యజ్ఞోపవీతపు బ్రహ్మముడి చేత్తో పట్టుకుని ఓంతత్సత్ ఓం తత్సత్ అని తంబూరా మీటినట్టు గట్టిగా అష్టోత్తర సహస్రగాయత్రీ జపం చేసేవాడు.

సాలాఖరుకు వెళ్ళి అడిగితే శివలింగే గౌడ అన్నాడుకదా పైనుంచి ఆర్డర్‌లేందే కర్ణీకం నీకెట్లాగివ్వను?"

"నాది నాకివ్వటానికి పైనించీ రావటమేమిటి?"

"వూ, నీ బాబుదని రాసెట్టారేంటి? నాకూ పదేళ్ళ అనుభోగముంది. నీ కెట్టా గొస్తదో చూస్తాము"

చెన్నిగరాయనికి మాటవినగానే ఏడుపొచ్చినంతపనైంది. "అయ్యో! నీయమ్మనా" అని వాణ్ణి తిట్టాలని. నోటిదాకావచ్చాకా ధైర్యంలేక పూరుకున్నాడు. శివలింగే గౌడ బానమరిదీ, గ్రామ మునసబు అయిన శివే గౌడ నడిగితే అతడు "వురేయ్ తమ్ముడూ! కరణీకం చేయటం నీచే తవుద్దా అంట! అదేమి అల్లాటప్పా పని అనుకున్నావా?" అన్నాడు.

చెన్నిగరాయనికేమి చెప్పాలో తోచలేదు. మునసబుగారెదట మాట్లాడే ధైర్యం అతనికి రావడములేదు ఎలాగా? చిన్నతనం నించీ అతణ్ణి బెదిరించటానికి గంగమ్మ పిలుస్తున్నది ఈ మునసబుగారినేకదా? అతడు తిన్నగా ఇంటికెళ్లి శివలింగే గౌడ, గ్రామమునసబు, చెప్పిన మాటల్ని అమ్మతో చెప్పాడు. గంగమ్మ వూరుకునే మనిషా! మునసబు గుమ్మం ముందు వీధిలోనుంచుని గట్టిగా అడిగింది. శివేగౌడ, పరాయివాళ్ళ పియ్యి ఇంకెన్నాళ్ళు తిందా మనుకున్నావు? నీ పెళ్ళాం తాడుతెగి, నీకొంప ముదనష్టపు కొంపవుతుంది చూస్కో."

ఈ మాటలు విన్న మునసబు పెళ్ళాం గౌరమ్మకు భయం పట్టుకుంది. బ్రాహ్మణవిధవ శాపం తమకు తగిలితే ఇంకేమైనావుందా? మొగుడితో చెప్పిందామె. "అళ్ళవుజ్జోగం మన కెందుకొచ్చిందంట? అళ్ళదాళ్ళకి పారెయ్యవలల అని శివలింగణ్ణకు ఎంటనే చెప్పెయ్యి"

మునసబు తానే బయటికివచ్చి "గంగవ్వా! ఆ పెద్దమాటలతో ఏంపని? రా, కూకో, మాట్లాడుదాం" అన్నాడు.

గౌరమ్మ అరుగుమీద పీటవేసింది. గంగమ్మ దానిమీద కూర్చున్నాక మునసబు ఒక తలగడా తెప్పించి దానిమీద చేరబడి కూర్చున్నాడు. కాబోయే కరణం చెన్నిగరాయడు చూరుకింద నుంచున్నాడు. మునసబు కబురెట్టాక అక్కడికి వచ్చాడు. అప్పటికే కరణం శివలింగే గౌడ మరో అరుగుమీద కాలుమీద కాలేసుకుని కూర్చున్నాడు. మునసబే మొదలెట్టాడు." శివా! చార్జీ ఇయ్యటానికెందుకిల్లేదో అమ్మగార్కి కాస్త వివరంగాచెప్పు."

శివలింగడు గంగమ్మ నడిగాడు. "మీ కుర్రాడి వయస్సెంత?"

"పంతొమ్మిది నడుస్తోంది కదా?"

"అట్టాగని మీరంటారు. సర్కారు లెక్కల్లో ఇంకా పదహారేళ్ళనే వుంది. అతడింకా మెజార్టికే రాలేదు. గౌరుమీటువని ఎట్టాగిచ్చే కవుద్ది?"

"వీడు పుట్టినప్పుడాయనే కరణీకం చేసేవారు. తప్పురాశారంటావా ఆయన, సరిగ్గాచూడు."

"జననమరణ రెజెస్ట్రు మనకాడుండదు. దాన్ని చూడాలంటే గౌరమెంటుకు పీజుకట్టుకోవాలి. యాభైరూపాయలిలాపడేయండి ముందు. తిప్పూరుకెళ్ళి చూపించుకొస్తాను."

జననమరణం రిజిస్టరు కరణంవద్ద వుంటుందో వుండదో దాన్ని చూడటానికి ఫీజు యాభైరూపాయలిచ్చుకోవాలో, అక్కరలేదో, ఇచ్చుకోవాలంటే యాభైరూపాయలూ ఇవ్వాలా అన్నవిషయం గంగమ్మకేమీ తెలియదు. "ఇవ్వాలంటారా? లెక్కలు గట్రా నేర్చుకున్నవాడివి నువు - చెప్పరా" అని కొడుకు నడిగితే చూరుకిందే బితుకుబితుకుమంటూ నుంచున్న కొడుకు కొక్కెరలా మెడతిప్పి ఆలోచించడం మొదలెట్టాడు. "అదేమిటో యేడవరా" అని మరోసారి అడిగాక "నాకుతెలవదమ్మా" అన్నాడు.

"నాకు లెక్కలన్నీ వచ్చునన్నావుకదరా, వచ్చు పెద్దమ్మా! అప్పుడు శివలింగడు కలిపించుకుని పొన్నవళ్ళికరణం కాడికెళ్ళి నేర్చుకున్నానన్నావు? ఆ బాపనోడికి లెక్కలొస్తేగా వీకు చెప్ప టానికి పోనిద్దూ. మించిపోయిందేం? ఇప్పటికైనా ఓనాలుగేళ్ళు మా ఇంటిదగ్గ్రాలు మోస్తే నేనే నేర్పుతాను" అన్నాడు.

మునసబు శివేగౌడ "పోనీలే గంగవ్వా! యాభైరూపాయలుపట్రా. అతడి వయస్సెంతో పైకి రాసి తెప్పిందాం" అన్నాడు.

"డబ్బెందుకివ్వాలి శివేగౌడ?"

"అదేటి గౌర్మెంటా మరోటా?"

గంగమ్మకుమరోమార్గంలేకపోయింది. యాభైరూపాయలిచ్చుకోందే కొడుకు వయస్సును గూర్చిన భోగట్టా తెలియదు. అది లేనిదే కరణీకం చేతికిరాదు. కానీ ఇంట్లో అంతడబ్బులేదు. ఇంటికెళ్ళి తన పెట్టెలో వెతికి చూసింది. ముప్పై రాణితల రూపాయలున్నాయి. దానికితోడు ఆరుబస్తాల రాగులు శివలింగడికిచ్చి, "బేగి వాటి లెక్కలు తెప్పించిపెట్టు. మా ఇంటాయన కరణీకం వీడు చేయడం నేను చూడాలి" అంది.

మరో మూడు నెలలు గడచినా దాని వూసేమీ తెలియలేదు. గంగమ్మే వెళ్ళి అడిగేసరికి గౌర్మెంటు లెకలంటే తొందరగా తేల్తాయా ఏటి? డిప్యూటీకమిషనర్

కెళ్ళి ఆపైన మీర్జాదొరగారు చూసిరావాలి. నింపాదిగా వస్తది. ఎందుకట్టా చిందులేస్తారు. కాస్తా ఆగండి" అని శివలింగే గౌడ అన్నాడు.

గంగమ్మ దిగాలు పడిపోయింది. ఇంటికెళ్ళి "చెన్నయ్యా! వీడెలాగూ ఇచ్చేలా అవుపించదు. నువ్వే తిప్టూరుకెళ్ళి తాసిల్దారుగారి కాళ్ళట్టుగుని కరణీకం సంపాదించుకురా, వెళ్ళు" అంది.

ఒంటరిగా వెళ్ళి తాసిల్దారును చూడాలంటే చెన్నిగరాయడికి భయమేసింది. ఆయన కోప్పడితే ఏంజేయాలి? నీ వయస్సెంత? నిజం చెప్పు అంటే ఏంజెప్పాలి? తనకు నిజంగా పదహారేళ్ళేనేమో తనజాతకము తప్పేమో? "అమ్మా నాకింకా పదహారేళ్ళేకాబోసు. మరోరెండేళ్ళాగి చూద్దాం" అన్నాడు.

"థూ! లంజాకొడకా! నిన్ను కన్నముండని నేనింకా ఇక్కడే వున్నాను. నాకు తెలిదట్రా నీ వయస్సు? పంతొమ్మిదీ నిండుతోందిరా కుంకా. వెళ్ళి తాసిల్దారుగారి కాళ్ళట్టుగో ముండాకొడుకా" గంగమ్మ కోపంగా అంది.

"నాకు భయమేస్తుందమ్మా."

"సిగ్గులేదట్రా? పిరికి ముండాకొడుకా! కూడా నేనూ వస్తానురా" అని గంగమ్మ చెప్పనేమో చెప్పిందికాని సర్కారుపనిలో ఆడాళ్ళుకలగజేసుకోరాదని జ్ఞాపకం వచ్చివూరుకుంది. ఆడాళ్ళు సర్కారు లెక్కలు తాకినట్టు తెలిసిందా పోలీసువాళ్ళు జైల్లోపడేస్తారట. అలాంటప్పుడు తానేవెళ్ళి తాసిల్దారుగారి ఎదరనుంచుంటే మరేమైనా వుందా?

అప్పటికి మరోవుపాయం లేకపోయింది. ఇలాగే నెలరోజులు గడిచాక గంగమ్మే చెప్పింది. "ఎల్లాగైతే అలా అవుతుంది. ఓసారి నాగలాపురానికెళ్ళి మీ మావయ్యనడుగు. ఆయనేదో దారి చూపెడతారు."

## 4

చెన్నిగరాయడు పెళ్ళయ్యాక ఒకటిన్నర సంవత్సరమైనా ఒక్కసారి కూడా మామగారింటికి వెళ్ళలేదు. వెళ్ళాలనే వుబలాటంలేక కాదు. అయితే ఎవళ్ళూవచ్చి వాణ్ణిపిలవలేదు. తానై వెళ్ళ టానికి సిగ్గో భయమే అతడికి తెలియదు. కరణీకపు వుద్యోగాన్ని గురించి తల్లే అక్కడికెళ్ళిరమ్మని చెప్పేసరికి అతడికి సంతోషమయింది. ఒకరోజు తెల్లారగట్ల లేచి, స్నానంచేసి, మూడు ఆచమనాలతో సంధ్యావందనం

ముగించి, అవపగింజల రొట్టెలు, వేరుసెనగపచ్చడి వేసుకుని తిని, పెరుగుతాగి, దారిలో వుండనీ అని మూడు రొట్టెలు పచ్చడి మూటకట్టుకుని, పెళ్ళి కోటువేసుకుని 'నంకలికె' పంచకట్టుకుని, జోడుతొడుక్కుని నడిచే అలవాటు లేనందువల్ల పొట్టికాళ్ళతోటే పన్నెండు మైళ్ళదూరంలో వున్న నాగలాపురానికి పడమరదిక్కుగా బయలుదేరాడు.

రామసంద్రానికి మూడుమైళ్ళలో ఒక మెట్ట ఎక్కిదిగగానే 'చోళనగుడ్డ' వస్తుంది. 'కరేకల్లు'కు చెందిన చోళనగుడ్డ మైదానంలోనే మరళహళ్ళ వుంది. దాని రెండువైపులా మోదుగచెట్లు దట్టంగా వున్నాయి. నాగలాపురం దారిలోనే పల్లంలో వున్న మెట్లబావి చూసిన చెన్నిగరాయడు దానిదగ్గిరకెళ్ళి కూర్చుని, రొట్టెలు పచ్చడి శుభ్రంగా తినేసి, ఆరుదోసిళ్ళు నీళ్ళుతాగి, మళ్ళీప్రయాణం మొదలెట్టాడు. చోళనగుడ్డను కుడివేపుగా వదిలేసి, మిట్టదిగి ముందుకువెడితే 'కెమ్మణ్ణుహళ్ళ' వస్తుంది. దానితరువాతే కటిగేహళ్ళి. ఆ తరువాత కొంచెం ముందకున్న హూలినహళ్ళి నాగలాపుర ఫిర్కాకి చెందిందే. ఆవూరికి మైలు దూరంలో నాగలాపుగం పెద్ద చెరువు అగుపిస్తుంది. అయినా దాన్ని చుట్టుకొని వెళ్ళాలంటే బ్రహ్మదెముడు పుంతదాటి ఇంకా రెండుమైళ్ళునడవాలి. చెరువు కట్టమీదుగా ఓమైలు నడిచి వూరివైపున్న తూముదాటాక సంతతోపు గుండా వెడితే, అదే నాగలాపురం.

చెరువుకు చేరువగా వూరిదగ్గిరికొచ్చేసరికి అతడికోరకమైన భయమేసింది. తన్నెవరైనా గుర్తిస్తే? ఇప్పుడెందుకొచ్చావంటే? మావయ్యే అలా అడిగితే ఏంజెప్పాలి? పెళ్ళాం ఎలా వుందో! అది తనతో మాట్లాడుతుందో లేదో! మాట్లాడకపోనీ తగినశాస్తి జేస్తాను. అదింకా పెద్దమనిషై మావూరికొచ్చేదెప్పుడో! ఇప్పుడు పదమూడునిండాయట. ఇంకా ఎన్నాళ్ళకో - ఇలా ఆలోచిస్తూ చెరువుకట్టమీదనడుస్తూ వూరివైపున్న తూమును చేరుకున్నాడు. వూళ్ళోకి ప్రవేశించే ముందు మళ్ళీ భయం. పెళ్ళివాడు వూరేగింపు జరిగిన వీధిలోనే ఇప్పుడు నడు స్తున్నాడు. ఎవరైనా గుర్తిస్తే!

అంటిపెట్టుకున్న ఇళ్ళు గుంపుగా వున్న ఆగ్రామాన్ని ప్రవేశించగానే వచ్చే ఒకే ఒక వీధిపేరే కరణాలవీధి. ఊరికరణం శామణ్ణగారు మహాదర్జాగా అధికారం చేస్తారట. అందుచేతే ఆ వీధికాపేరు. అక్కణ్ణుంచి వెడితే చెన్నిగరాయడి మావగారి

ఇల్లువస్తుంది. ఆ ఇల్లు ఇరుకుసందులో వుంది. మొత్తం వూళ్ళో వున్న ఇళ్ళన్నీ అలాగే వున్నాయి. అయినా వున్న వాటిలో కంఠీ జోస్యులది పెద్ద ఇల్లనే చెప్పాలి.

దడదడలాడే గుండెని అదుపులోకి తెచ్చుకుని, సగం తెరిచిన తలుపులోసుకుని లోపలికెడితే ఎక్కడా చడీచప్పుడు లేదు. ఒక్కనిముషమాగి చూసి, చివరికి ధైర్యంతెచ్చుకుని గట్టిగా 'ఎవరులోపల?" అన్నాడు.

వంటింట్లో నుంచీ ముసలమ్మడిగింది "ఎవరయ్యా అది? కాళేగౌడేనా?"

"కాదు; మాది రామసంద్రం. రామణ్ణగారి కొడుకు చెన్నిగరాయలు."

"రావయ్యా! రా, రా!" అని ముసలమ్మ లోపలినుంచీ పరుగెత్తుకొచ్చి ఒక చిరుచాప పరిచి "కూర్చో" అని చెప్పి పెద్దరాగి పంచపాత్రలో మంచినీళ్ళుతెచ్చి ముందుంచింది. "వూళ్ళో అంతా కులాసాగా వున్నారా" అని అడుగుతుండగా పెరటి తలుపులోసుకుని చెన్నిగరాయడి భార్య వుతికి, పిండిన చీరా, రవికా చేత్తో బుచ్చుకుని, ఏమీ ఎరక్కుండా,లోపలికొచ్చి కను-చీకటిగావున్న నడవలో, ఆ ఆగంతుకుడున్నది చూడక పిండినచీర బామ్మకివ్వటానికి అక్కడే నుంచుంది.

"నంజీ! మీ ఆయనొచ్చాడే. అక్కడే కూర్చున్నాడు. చీకట్లో అవుపించలేదా?"" అని బామ్మ అన్నదే తడువుగా అందిస్తున్న చీర కాళ్ళకు తగులుకుని తూలిపడబోతున్నా లెక్క చేయకుండా పెరటితలుపుగుండా పరుగెత్తుకెళ్ళింది.

ముసలమ్మే ఇంటి అల్లుడికి కాళ్ళకు నీళ్ళిచ్చి, వేడిగా మజ్జిగపులుసు, అప్పడాలు, వూర గాయ, నెయ్యి, పెరుగు పోసి భోజనంపెట్టింది. ముసలమ్మ వద్దంటున్నా చెన్నిగరాయడే "పరవాలేదు వెయ్యండి అని ఒకటిన్నర రాగిముద్ద వేయించుకుని తిన్నాడు".

భోజనమయ్యాక తెలిసింది. మావగారు సామాన్యంగా వూళ్లోవుండరనీ, చన్నరాయపట్టణం నరసీపురం, హాసన-ఇలావూళ్ళ మీద తిరుగుతూ వుంటారనీ. ఈసారి వెళ్ళి ఇర్వైరోజులయింది. రెండు మూడురోజుల్లో రావచ్చు. ఇక్కడిదాకా వచ్చి ఆయనతో మాట్లాడకుండా వెడితే బావుం డదు. ముసలమ్మ కూడా బలవంతం చేసింది. చెన్నిగరాయుడుండిపోయాడు. ఇరుగు పొరుగువాళ్ళు వచ్చి అతణ్ణి షికారు తీసుకెళ్ళి కంఠీజోస్యుల పొలమూపుల్లా చూపెట్టారు. మరుసటిరోజు ముసలమ్మే అతడికి తలంటిపోసింది. నంజమ్మ మాత్రం అతని కంటపడటంలేదు. మసకచీకటిలో బామ్మకి తడిచీర ఇవ్వటానికని వచ్చినప్పుడు చూసినదెంతో

అంతే. ఇరుగు-పొరుగిళ్ళకు వెళ్ళటానికి భయమో, జంకో, చెప్పలేదు. కాలక్షేపం కావడంలేదు. వూళ్ళోలాగే ఇక్కడకూడా అతడు పెందరాళే స్నానంచేసి నుదిటిమీద విభూతి పెట్టెలులాగి, తడిగోచీకిబదులు, తడిగోపంచాతో కూర్చుని, సంధ్యావందనంతో పాటు అష్టోత్తర సహస్రగాయత్రి జపించేవాడు. దాన్ని చూసి ముసలవ్వకు పట్టరాని సంతోషం.

నాలుగవరోజు అర్ధరాత్రివేళ వున్నదున్నట్టుగా వీధికుక్కలు మొరగటం ప్రారంభించాయి. ఎక్కణ్ణించో టకటకమన్న శబ్దం వినిపిస్తోంది. కుక్కల హడావుడి ఎక్కువయింది. ఇంతలో "తేరిభాంచోత్" అన్న శబ్దం టకటకమన్న శబ్దం వీళ్ళింటిముందే వచ్చి ఆగింది. ఎవళ్ళోవీధి తలుపుతడుతూ "నంజీ! తలుపుతెరు" అని పిలవటం వినిపించింది. కంఠస్వరాన్ని పోల్చుకుని మావగారే అని చెన్నిగరాయడు నిశ్చయించుకున్నాడు. తానేలేచి తలుపుతెరవటానికి ఒకమోస్తరు జడుపు. వూరికే దుప్పటిముసుగెట్టుకుని, అందులోనూ కళ్ళుమూసుకుని పడుకున్నాడు.

వచ్చింది తనతండ్రే అని వంటిట్లో ముసలమ్మ పక్కన పడుకున్న నంజమ్మకు తెలిసిపోయింది. అయినా పెనిమిటి అవతల నడవలో పడుకున్నాడని తానే వెళ్ళితలుపు తీయటానికి సిగ్గేసి బామ్మను తట్టిలేపింది. కిరసనాయిల్ బుడ్డిదీపం వెలిగించి, ముసలమ్మే వచ్చి తలుపుతీసింది. వీధితలుపుగుండా గుర్రాన్ని తీసుకెళ్ళి పెరటిలో కట్టేసివచ్చి "ఎవరిక్కడ పడుకున్నది?" అని కంఠీజోస్యులడిగాడు.

"చెన్నిగరాయలు వచ్చాడు, నాలుగురోజులయింది. నీకోసం కనిపెట్టుకు కూర్చున్నాడు"

"చెన్నిగరాయా!" అని తలమీద కొట్టినట్టు పెద్దగొంతుతో ఒకసారి జోస్యులు పిలిచాడు. "నిద్రపోతున్నాడు లేపకబ్బాయ్" అని తల్లి చెప్పాక ఆయన వూరుకున్నాడు. భోంచేసేవచ్చాను ఇప్పుడేమక్కరలేదని ముసలమ్మకు చెప్పి ఓసారి కొద్దిగా పొగాకువేసుకున్నాక పక్కదులిపి వేయటానికి కూతుర్ని లేపకుండా చెన్నిగరాయడు పడుకున్న నడవలోనే పక్కఅంకణంలో కంబళిపరచి, తనకోటు లాగు విప్పేసి ధోవతి కట్టుకున్నాడు.

## 5

ఉదయం పదిగంటలకి లేచిన కంఠీజోస్యులు అల్లుణ్ణి వచ్చిన పనేమిటో చెప్పమన్నాడు. అన్నీచెప్పి, శివలింగమే తమవద్ద యాభైరూపాయలు పుచ్చుకున్నది చెప్పినప్పుడు "నీ బుర్రలో వున్నది బుద్ధా? బంకమట్టా! కరణీకం రూల్సు తెలియనివాడివి నీవేమి వెలగబెడతావు?" అని అడిగాడు.

చెన్నిగరాయుడు కొద్దిగా వణుకుతూ తలవంచి కూర్చుండిపోయాడు. తానక్కడికి వచ్చినరోజే విషయమంతా చెన్నిగరాయుడు ముసలమ్మకు చెప్పాడు. ఇప్పుడా సంగతే మావగారితో చెబుతుండగా ముసలమ్మ దగ్గిరే వుంది. అల్లుణ్ణిలా కోప్పడ్డందుకు ఆవిడే కలిపించుకుని "ఏమిట్రా కంఠీ! అలా అంటావు. వాడేమో కుర్రాడాయె. తెలవదు. నీ నోరెప్పుడూ దురుసేనా? వెళ్ళి వాడిహక్కు వాడికిప్పించిరా" అంది.

కంఠీజోస్యులు మళ్ళీ మాట్లాడలేదు. లేచిస్నానం చేసి సంధ్యావందనం ముగించి, లోపల నంజమ్మవండి, ముసలమ్మ తెచ్చిపెట్టిన బియ్యపునూక వుప్పిండి, కారం పెట్టిన వంకాయకూర అల్లుడితోపాటు ఆరగించాడు. ఇంతపొగాకునమిలి, నాలుగైదుసార్లు వుమ్మేసి వచ్చాక రామసంద్రం గ్రామసంబంధైన నాలుగైదు ప్రశ్నలువేశాడు. చెన్నిగరాయుడు తనకు తెలిసిన సమాధానాలిచ్చాడు. జోస్యులు తమ వీధి మూలలోవున్న పాలంపాలికావు. హొన్నణ్ణి పిలిపించి వాడికోవుత్తరం వ్రాసిచ్చి, వెంటనే శ్రవణ బెళగొళ వెళ్ళి ఆయన కుమారుడు పోలీసుకానిస్టేబులు కల్లేశుకు ఇచ్చి జవాబు పట్రమ్మని పంపించాడు. ఆ తరువాత జోస్యులల్లుడితో ఏమీమాట్లాడలేదు. ఆయన వూరికి వచ్చారన్న సంగతి తెలిసి, మంత్రాలకనీ, తంత్రాలకనీ, దెయ్యాలు పిశాచాలు వదిలించటానికనీ, కొందరుపోగై ఇల్లంతా నిండిపోయారు. అల్లుడికి విసుగెత్తవచ్చని ముసలమ్మ అతణ్ణి వంటిట్లోకే పిలిచి కూర్చోబెట్టుకుంది. నంజమ్మ పెట్టెలగదిలో వుండిపోయింది.

హొన్నడు మరుసటిరోజు పదకొండుగంటలకి శ్రవణబెళగొళ నుంచివచ్చి జోస్యులకో వుత్తరమిచ్చాడు. వాడింటికెళ్ళాక జోస్యులు తల్లితో అన్నాడు. "అమ్మా! నేనూ అల్లుడూ రాత్రి రామసంద్రానికెడతాం"

"అదేమిట్రా! ఈరోజే బయల్దేరుతానంటావు? నేనుతిండి గిండీ ఏమీ చెయ్యలేదే?"

"పాయంత్రానికల్లా చేసెయ్యి. రాత్రికి పాయసం గీయసంపండు."

"నీవేమో కొరివిదెయ్యంలా రాత్రిపూట తిరుగుతావు. చీకట్లో వాణ్ణెందుకురా తీసుకెళ్ళాలి?"

"వాడేం ఆడపిల్లా? మగాడికదా నాకూతురువిచ్చింది?"

చీకటంటే అట్టేభయం లేకపోయాక దెయ్యాలూ పిశాచాలు వుంటాయని జ్ఞాపకం రాగానే చెన్నిగరాయడికి కొద్దిగా గుండెవెనకాడింది. చోళేశ్వరునిమెట్ట సమీపంలో దుమ్ముగుండ్లు వుంటాయట! ఆ విషయం మావఁగారితో చెబితే చీవాట్లు పడవచ్చని జడుపు ఉభయసంకటంలో అతడి చిక్కడిపోయి వూరుకున్నాడు.

ముసలమ్మ ఆ హడావుడిలోనే 'కోడుబళ్ళు' వేయించింది. నంజమ్మ నిన్ననే జంతికలకని పిండి విసిరింది. జంతికలు కూడా తయారయ్యాయి. రాత్రి పాయసం భోజనమయ్యాక జోస్యులు మేజోళ్ళు బూడ్సులు, తెల్లటి లాగు, కాకికోటు వేసుకుని నెత్తిమీద కాకి హేట్ పెట్టుకున్నాడు. ఆరోజుదయమే మంగలి దిద్ది తీర్చి కత్తిరించిన మీసాలు ముఖానికి హుందా తనాన్నిస్తున్నాయి. గుర్రానికి జీనూకళ్ళెమువేసి, కావలిసిన గుడ్డలు గిడ్డలూ ఒక సంచిలోవుంపి, జీను ముందుభాగంలో అంకెంలా రెండువేపులా దిగవేశాడు. బయల్దేరే ముందు చెన్నిగరాయడు ముసలమ్మకు మావగారికీ దండంపెట్టాడు. "నంజీ! మీ ఆయనకి దండం పెడుదువుగాని రా" అని ముసలమ్మ పిలిచింది. ఆమెరాలేదు. రెండోసారి జోస్యులే పిలిచాక వచ్చి దూరంనించే నేలమీదికి వంగి నమస్కారం చేసి వెళ్ళిపోయింది. పెళ్ళాన్ని చూడాలని చెన్నిగరాయడికెంతో ఆశగా వున్నా మావఁగారెదురుగావున్నందున జడిసి కళ్ళుకూడా అటువైపు తిప్పలేదు.

రాత్రిపదిగంటలకి ఇల్లువదిలారు. ఆరోజు అమావాస్యకావటం వల్ల ఎక్కడ చూసినా గాఢాంధకారం కమ్ముకునివుంది. వూరు వదిలి బయటికి వచ్చాక జోస్యులల్లునితో "నువ్వూ గుర్రమెక్కు ఇద్దరమూ కూర్చుందాం" అనగా "వాకలవాటు లేదు భయమేస్తుంది" అన్నాడు. 'నేను పట్టు కుంటాముగా' అన్నా 'వూహుఁ మీరేమైనా అనండి వావల్ల కానేకాదు' అని మొండికెత్తాడు.

"సరే! నడిచేవెడదాంపద; అని కటికచీకట్లో కూడా దారిస్పష్టంగాకనిపించేలా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ నడవటం మొదలెట్టాడు. వెనకాల గుర్రం

వెంబడిస్తోంది. దానికి వెనకాల నాలుగు బారల దూరంలో చెన్నిగరాయడు చిన్న పరుగుతో వెండిస్తున్నాడు. మామగారు మౌనంగా నడుస్తున్నాడు. అల్లుడికి అలసటతోపాటు లోపల భయమేస్తోంది. ఆ భయంకరమైన చీకట్లో గాలి రుంయ్‌మని వీస్తోంది.

# 6

వాళ్ళు చెరువుకట్టదాటి హూళినహళ్ళి, కటిగేహళ్ళి గడచి, చోళేశ్వరుని మెట్టుకు కింది భాగంలో తగిలే కెమ్మణ్ణుహళ్ళి పల్లాన్ని దాటుతున్నారు. అప్పటికే ఎనిమిది మైళ్ళు నడిచారు.

కంఠీజోస్యులు ముందరనడుస్తున్నాడు. ఆయన వెనకాలే ఎత్తైన తెల్లటిగుర్రం. దానివెనకాలే కాళ్ళు లాగుతూ సగంపరుగుతో సగం నడకతో వెంబడిస్తున్న చెన్నిగరాయనికి గుర్రపు తెల్లటిరంగు చీకట్లోకూడా సవసవగా అవుపిస్తోంది. మావఁగారు హఠాత్తుగా ఆగిపొయ్యారు. గుర్రమూ ఆగింది. మరో అడుగువేస్తే గుర్రాన్ని ఢీకొనేదాకా వచ్చి అల్లుడూ ఆగాడు. వాళ్ళదారికి కుడివేపు, కొంతదూరంలో వెలుగవుపించింది. "కాస్త ముందుకురా" అని మావఁయ్య పిలిచాడు. అతడు గుర్రాన్ని చుట్టుకొని ఆయన వద్దకు వెళ్ళాడు. వెలుగువేపు చేత్తోచూపెడుతూ "అక్కడ చూడు" అన్నాడు. చూడగానే అతడికి ఒళ్ళంతా చెమటలు పోశాయి. చేతులూ కాళ్ళూ గడగడ వణకడం ప్రారంభించాయి.

సుమారు నడుముదాకా వచ్చే కాళికా విగ్రహం కపాలమాల వేసుకుని భయంకరంగా కనిపించింది. తెరిచిన దానినోట్లోంచి రక్తరంజితమైన నాలిక వెళ్ళుకొచ్చి కిందికి వేళ్ళాడుతోంది. మెడలో పెద్ద ఎర్రగన్నేరు పూలదండ, రెండువైపులా మట్టి ప్రమిదలలో దీపాలు కాగడాలలా మండుతున్నాయి. ఎదురుగుండా మెడ విరిచేసిన మూడు కోళ్ళు చచ్చిపడున్నాయి. పక్కనే రెండుగా తరిగిన బూడిదగుమ్మడి కాయముక్కలు, రెండుమూడు అరటిపళ్ళ హస్తాలు, వున్నాయి. ఎక్కడ చూచినా యథేచ్ఛంగా చల్లిన కుంకుమ, కాళికా విగ్రహంమీదంతా పసుపూ, కుంకుమా మెత్తారు. పసుపుదారం, రాగిరేకు తాయెత్తు, మనుష్యులవో, జంతువులవో బొమికలు చుట్టూ పడివున్నాయి.

గడ్డకట్టిన చీకటిని చీల్చుకుని నిటారుగా నుంచున్న అగ్ని శిఖలావుంది

విగ్రహం.

"చూశావా?" మావయ్య అడిగాడు.

"హుం"అని అనటానికి కూడా అల్లుడి నాలిక తడబడుతోంది.)

"చూడబ్బాయి. అక్కడికెళ్ళి ఆ అరటిపళ్ళు పట్రా. ఆ విగ్రహం గుండెమీద ఓతాపుతాచి కిందికి పడెయ్యి. నీకు డబ్బు దొరుకుతుంది."

ఈ మాటలు వినేసరికి అతడికి కంపరమెత్తింది. "వ.వ.వద్దండి. వ.వ.వద్దండి.అని తడబడు తూనే చెప్పాడు. అయితే నువ్వీ గుర్రం,కళ్ళెంపుచ్చుకో" అని దాన్ని అతడి చేతికిచ్చి ముందుకువెళ్ళాడు. తిన్నగా విగ్రహం దగ్గిరికెళ్ళి అరటిపళ్ళన్నీ చేత్తో బుచ్చుకున్నాడు. పరీక్షించేలా రెండు నిమిషాలు చూసి, తరువాత దాని బుజాలమీద నాలికమీద, తలమీద, చేతి లోని పుర్రెలోను, చెయ్యిపెట్టి ఏవో తీసుకున్నాడు. వెండిరూపాయలు నాణ్యాలు కాబోసు. తరువాత ఆయన తన ఎడమకాలు బూటుతో దాని గుండెమీద ఓ తాపుతా వాడు. అది విరిగి పడిపోయింది. పడ్డచోట కొన్ని నాణ్యాలు రాలాయి. వాటిలో బంగారపు కాసులాంటిదేదో వుంది. వాటినన్నీ ఏరి జేబులో పడేసుకుని వెనక్కితిరిగొచ్చి గుర్రపు కళ్ళెంపుచ్చుగుని 'నడవండి' అని చెబుతూ ముందుకు సాగాడు.

ఇప్పుడు కూడా కంఠీజోస్యులుముందు, మధ్యలో గుర్రం వెనకాల చెప్పిగరాయలు. మారి విగ్రహం వేసే అతడున్నాడు. ఆవైపు తిరిగి చూట్టానికి భయం. చూడకపోతే అది తన్నే వెంబడించి వీపుమీద చరిచి మెడపట్టుకుంటుందేమో అన్న భీతి. దానికి తోడు మౌనం మరింత భయాన్ని కలిగిస్తోంది. మావయ్య మాట్లాడకుండా ఓ దెయ్యంలా గబగబా ముందుకు నడిచి వెడుతున్నాడు. ఏదైనా మాట్లాడుతూవుంటే భయం కాస్త తగ్గుతుందేమో అని అతడే అడిగాడు "అదేమిటది?"

"ఈరోజు అమావాస్యకదూ?"

"దా.దా. దానికేం చే.చే.చేశారు?"

"ఎవళ్ళో చేతబడి చేయించారు. కరీగెరె వీరానారి అని వున్నాడు. వాడే ఇలాంటివన్నీ చేసేది. ఇలా చేయించేవాళ్ళ ఎదురుగుండా ఇవన్నీ చేసి వాళ్ళతో కూడా వీడూ వెళ్ళాడు. విగ్రహం లోపల నాలికమీద, బుజాలమీద, వుంచిన డబ్బూ అరటిపళ్ళూ అన్నీ తరువాత ఒంట రిగా వచ్చిపట్టుకెడతాడు. ఇప్పుడొచ్చి చూడనీ, వాడికి దొరికేది బుగ్గే"

"దా...దా...దాన్ని తా.తాకి తీసుకున్నారుకదా? మీ...మీకేమీ అవదూ?"

"గుండెమీద చెయ్యేసి చూసుకోవాలి అది గట్టిగా వుంటే వెంట్రుక ముక్కైనా తెగదు. లేక పోతే నెత్తురు కక్కుకుంటూ పడిచచ్చే పెంటినాకొడుకులూవుంటారు".

చివరిమాటలువిని చెన్నిగరాయడికి భయమేసింది. ఇంతలో మెట్టెక్కి చేతబడి చేయించిన స్థలంకూడా కంటికి కనబడనంతటి దూరం వెళ్ళారు. అతడొకసారి ధైర్యంతెచ్చుకుని వెనక్కితిరిగి చూశాడు. నల్లని చీకటి మినహాయించి మరేమీ అవుపించలేదు. మిట్టుదిగడల మొదలయింది. మోదుగు చెట్లున్న పల్లం గడిచిపోతోంది. మొత్తం దారంతా చిరపరిచితమైనట్టు మావయ్య గడ్డకట్టిన చీకట్లో గబగబానడుస్తున్నాడు.

## 7

ఇద్దరూ ఇల్లుచేరుకునేసరికి రాత్రిరెండుగంటలయింది. కంఠీజోస్యుల కొడుకు కల్లోకు తనతోటి ఒక దఫేదారుని వెంటబెట్టుకుని, అప్పటికే గంగమ్మ ఇంటికి వచ్చి వున్నాడు. తన వియ్యప్పువైపు కల్లోకుని గంగమ్మ అప్పణ్ణయ్య గుర్తుపట్టారు. అప్పటికి వాళ్ళిద్దరూ వచ్చి ఇంకా అర్ధగంటే అయింది. ఇద్దరూ కాకీడ్రస్సువేసుకుని కాళ్ళకు పట్టీలు చుట్టి పోలీసుజోళ్ళు వేసు ·కున్నారు. మోకాళ్ళ కిందికి వేళ్ళాడుతున్న పోలీసు వులన్ ఓవర్‌కోట్లు వేసుకుని, చేతుల్లో హంటర్ కేన్‌లుపట్టుకున్నారు. అంతరాత్రివేళ వాళ్ళెందుకొచ్చారో గంగమ్మకు బోధపడలేదు. వాళ్ళూ చెప్పలేదు. వచ్చిన వాళ్ళకు వేడివేడి వుప్మా చేసి పెట్టింది. ఆవిడకి కాఫీ తయారు చేయుటమూ రాదు. అంతరాత్రివేళలో పాలూ లేవు. తామేతెచ్చిన కాఫీపొడి వేసి, వాళ్ళు బెల్లపు డికాక్షన్ తాగారు. చెన్నిగరాయలింతలోనే మావయ్యతోటి ఇంటికి వస్తాడని వాళ్ళద్వారానే తెలిసింది.

తమ గుర్రం తోటి, అల్లుడితోటి వచ్చిన కంఠీజోస్యులు కొడుక్కి కరణీకం విషయం వివరించి చెప్పాడు. "ఇప్పుడేనడు. ఛార్జి ఇప్పించేద్దాం". అని ఆయన చెప్పేసరికి కల్లోకుకి తోటి వచ్చిన దఫేదారడిగాడు. "ఎలా ఇప్పించటం?"

"మీరూరికే నాతోరండి" అన్న కంఠీజోస్యులు, బయటికి వచ్చి గుర్రమెక్కి అల్లుణ్ణి "పడు, వాళ్ళిల్లు చూపెట్టు" అని ఆజ్ఞాపించాడు.

చెన్నిగరాయనికి అయోమయంగా వుంది. ఒక మోస్తరు భయమేసింది.

"ఎందుకు?" అని అడిగితే ఆయనేమంటారో అని మరొకమైన భీతికూడా కలిగింది. అయినా అతడు ముందు నడిచాడు. వెనుక గుర్రం మీద కంటీజోన్సులు. శివలింగే గౌడ ఇంటిముందుకువచ్చి ఆగాక "తలుపుతట్టి వాణ్ణి లెగ్గొట్టు" అన్నాడు. గుర్రంమీది మనిషి.

చెన్నిగరాయడు తలుపుతట్టినప్పుడు లోపలినుంచి శివలింగణ్ణి పెళ్ళాం "ఎవరూ?" అని అడిగింది.

"నేను శివమ్మ! శివలింగణ్ణను లేపు" అని చెన్నిగరాయుడు చెప్పేలోపుగా, మెలకువై వాడేవచ్చి తలుపుతీసి, "ఇదేటయ్యా వేళాపాళాలేదు. అర్ధరేత్తిరికాడ నిద్దర చెడగొట్టేత్తున్నావ్? అనేవాళ్ళేవళ్ళూ లేరనా?" అంటున్న వాడు, పెద్ద గుర్రంమీదున్న భారీమనిషిని పోలీసుల్నీ, పెళ్ళాం తెచ్చిన దీపపు వెలుగులో చూసిన వెంటనే, గుండె కొట్టుకోవటం తప్పమని ఆగిపోయి నట్టు అక్కడికేమాట తుంచేశాడు. గుర్రంమీదువ్న వ్యక్తి - "వీణ్ణి పట్టి అరెస్టుచేయండి" అని దర్పంగా ఆజ్ఞాపించాడు. పోలీసులిద్దరూ వెళ్లి చెరోజబ్బాపుచ్చుకున్నారు. తలుపువెనకాలేవున్న శివమ్మ "అయ్యో! కొంపకూలిందిరా శివుడా! నా మొగుడేం తప్పుచేశాడు?" అని అరిచేలోపుగా "నోరెత్తావంటే పట్టుకెళ్ళి సంకెళ్ళు తగిలిస్తాం. నోరు మూసుకో" అన్నాడు కల్లేకు. ఆవిడ తన రెండు చేతులతో నోరు గట్టిగా మూసుకుంది.

ఆయన గుర్రందిగి "లోపలికి నడవండి" అన్నాడు. శివలింగణ్ణి తోసుకుంటూ పోలీసులు లోపలికెళ్ళారు. చెన్నిగరాయుని తోటివచ్చి, గుర్రం దిగిన వ్యక్తి లోపలివించీ తలుపువేసుకుని శివలింగణ్ణి అడిగాడు. "పుట్టిన తేదీ కాగితం తెప్పించి ఇస్తానని యాభైరూపాయలు తిన్నావా? మాకు కంప్లేటు వచ్చింది. నిన్నురితీయించేస్తాను బద్మాష్ తొత్తుకొడుకా."

"చెన్నిగరాయుడు" దా. దాంతో ఏం పానివ్వండి అంటూ వుండగానే, ఆయనఅతడివేపు తిరిగి "నీవు నోరుమూసుకో" అన్నాడు. మళ్ళీ శివలింగనివేపు తిరిగి, "ఇది మహారాజా సర్కారు దివాన్ మీర్జాసాహేబ్‌గారి హుకుం. గాంచాత్ చల్తానై. వారేభాంచోత్ భాడకావ్‌తొత్తుకొడుకా! సర్కారు పేరుచెప్పి తిన్నావా? ఉరికంబమెక్కించాలి నిన్ను అని యూరోపియన్ ఇంగ్లీషు దొరలనుంచి ఆర్డర్ వచ్చింది. ఇన్కోహాత్‌కోబేడీలగావ్."

అంటూ వుండగానే శివలింగడు గడగడ వణికి పోయాడు. వాడి పెళ్ళాంమలాగే నేలమీద కూలిపోయి ఆయన కాళ్ళుపట్టుకుంది. "ఆ యాభైరూపాయలూ

పత్రా" అని ఆయన గర్జించాడు. శివలింగడు "ఇ ఇ ఇ నపెట్టెలో వున్నై. త త తలుపుతీసియ్యే" అన్నాడు పెళ్ళాంతో పక్కకిందున్న తాళంతో పెట్టెతెరిచి, యాభైరూపాయిలు లెక్కెట్టి తెచ్చి అప్పచెప్పిందావిడ. "ఇన్స్పెక్టర్! ఆ డబ్బుతీసుకుని జేబులో వుంచుకోండి. రేపు ట్రెజరీలో కట్టాలి." అని ఆయన చెప్పగానే దఫేదారు డబ్బు జేబులో పడేసుకున్నాడు.

గుర్రం మీద వచ్చిన వ్యక్తి తరవాతి విషయానికి వచ్చాడు. "హక్కుదారుకు కరణీకమివ్వకుండా ఏదో నాటకమాడుతూ నానేస్తున్నావట ఎందుకోయ్? భేవకూఫ్ భోసుడీ భాంచోత్ భాడకోవ్,దొంగతొత్తుకొడుకా?

"లే... లే...లేదు అని శివలింగడు తడబడ్డాడు.

"వాణ్ణి వదిలెయ్యండి" - ఆ వ్యక్తి హుకుం జారీచేశాడు. పోలీసులు వాణ్ణి వదిలిపెట్టాక "తెల్ల కాగితం కలం తీసుకు కూర్చో" అన్నాడు.

చెప్పినట్టు శివలింగడు చేశాక ఒకసారి పులిలా హుంకరించి "నేను చెప్పినట్టు రాయాలి... భాంచోత్ ....హుం... వెయ్యిన్నితొమ్మిది వందల .... తేదీలో మైసూరు సంస్థానపు మహారాజా వారి ఏలుబడిలోని తుముకూరు జిల్లా తిపటూరి తాలూకా కంబోన కెరెఫిర్కా రామసంద్రం గ్రామం హక్కుదారు శాలిరామణ్ణగారి పెద్దకుమారుడు హక్కుదారుకరణం చెన్నిగరాయనికి, సదరు జిల్లా, సదరుతాలూకా, సదరు ఫిర్కా, సదరుగ్రామపు బదిలీ కరణమయిన శివలింగే గౌడనైన నేను వ్రాసి ఇచ్చిన చార్జి అప్పగింత పత్రం ఏమంటే - ఈ పైకనబరచిన ఫిర్కాకరణీకం మీకేచెంది, మీరు మైనరయినందువల్ల నేను చూస్తున్నది, ఇప్పుడు మీరు మెజార్టీపొంది, ఒకటిన్నర సంవత్సరమైనందువల్ల సదరు చార్జీని ఈ రోజుఇచ్చి, దాఖలు లెక్కపత్రములను తమామ్ మీరు జడ్తీ చేసుకున్నమేరకు, మీకు అప్పగిస్తున్నాను అనడంలో వాతకరారు ఏమీ లేదు. అంతేకాక నాకు సఖల్ జబ్బుచేసి సర్కారుపని చూచుట సాధ్యంకానందువల్ల సర్కారునుంచీ హుకుం రాకముందే మీకు అన్నీ అప్పగించాను. మీరు అన్నీ చూసుకునేది" - అని వ్రాసి యిచ్చిన చార్జు పట్టీ వివరాలు : ఒకటవనంబర్ ఖాతావార్ పత్రిక, రెండవనంబరు బంజారు తఖ్తు ఇత్యాది బారా నమూనా లెక్కపత్రములు. బదిలి కరణం శివలింగే గౌడ వ్రాలు.

చార్జుపట్టీ తమచేతికి తీసుకున్నాక ఆయన అన్నాడు. "లెక్కల పుస్తకాలన్నీ తెచ్చిపెట్టు" శివలింగడు లెక్కల పుస్తకాల మూటంతా తెచ్చిపెట్టాక "వీటిని నీవూ

నీ పెళ్ళామూ మోసుకవచ్చి వీళ్ళింటిలో పెట్టండి."

శివలింగడూ వాడి పెళ్ళామూ, ఇంతలో లేచి జడిసి వణుకుతూ నుంచున్న వాడి పిల్లలూ అందరూ లెక్కల పుస్తకాలు చెన్నిగరాయని ఇంటికి చేర్చాక "తోకాడించావా తోక నికాల్ చేయిస్తాను. నోరుమూసుకుని ఇంటికెళ్ళి పడుకో. పోలీసులు పారా తిరుగుతారు" అన్నారు..

శివలింగడు పెళ్ళాం పిల్లలతోటి ఇంటికెళ్ళి తలుపులేసుకుని పడుకున్నాడు. అనీషితంగా ఇలా కలలో జరిగినట్టు అంతా జరిగి పోవడం అతణ్ణి వణికించేసింది. అయినా తమకేమీ పెద్ద ఆపద కలగలేదని పెళ్ళాం వాణ్ణి ఓదార్చింది.

పోలీసువాళ్ళిద్దరూ పడుకుని నిద్రపోయారు. గంగమ్మ, అప్పణ్ణయ్య, చెన్నిగరాయడు వంటిట్లో పడుకున్నారు. చెన్నిగరాయనికి నిద్దరేరాలేదు. ఏదో మోన్తరు గాబరాతో జ్వరం వచ్చి నట్టయింది. కంఠీజోస్యులు రాత్రిపడుకున్నాడో లేదో ఎవరికీ తెలియదు. ఆయనకు ఆక లేసిందేమో! తెల్లారి లేచేపరికి, రాత్రి చేతబడిచేసిన చోటునించి తెచ్చిన అరటిపళ్ళు రెండు హస్తాలు వొలిచితిని, తొక్కంతా స్తంభం చాటున పోగువేశాడు. తెల్లారి ఏడుగంటలకి అప్పణ్ణయ్యని పిలిచి, వూరివెట్టిని తీసుకరమ్మన్నాడు. వాడు రాగానే హుకుమిచ్చాడు. "డప్పులు తీసుకుని హక్కుదారు చెన్నిగరాయులకు కరణీకం ఇవ్వడమయింది; అందరూ ఆయన చెప్పినట్టే వినాలి. లేకపోతే తక్సీరవుతుంది. అని గ్రామమంతా చాటించి రావాలి. పోలీసులు లోపల పడు కున్నారు. అళ్ళుటోపీలు స్తంభం దగ్గిరున్నాయి. అగుపిస్తున్నాయా?"

వెట్టివంగి చేతులు జోడించి వెళ్ళిపోయాడు. చెన్నిగరాయడు కరణమయ్యాడని అర్ధగంటలో వూరంతా చాటింపు జరిగింది. అదే పిర్కాకు చెందిన 'కురుబరహళ్ళి', లింగాపురం గ్రామాలలో చాటించాలని వెట్టిబయల్దేరాడు.

పదకొండు గంటలకి లేచిన పోలీసులు వేన్నీళ్ళస్నానం పాలువేసిన బెల్లంకాఫీలు అయ్యాక భోజనం కూడా చేశారు. కల్లేశుడి తోటి వచ్చిన దఫేదారుకు పాతికరూపాయలిచ్చి, కడమపాతిక రూపాయలు తీసుకుని కంఠీజోస్యులు గుర్రమెక్కి రెవెన్యూ ఇన్స్పెక్టర్‌ను చూసి కరణీకం మార్పును క్రమపరచటానికి కంబనకెరె బయల్దేరారు. భోజనాలయ్యాక కల్లేశు దఫేదారు శ్రవణ బెళగొళకువెళ్ళారు.)

రాత్రి పదింటికి కంఠీజోస్యులు గుర్రంమీద తిరిగివచ్చి చూస్తాడుగదా కొత్తకరణం చెన్నిగరాయునికి నిప్పులా కాలుతున్న జ్వరం. కొడుకు తలకు పట్టువేసి

పాతగుడ్డ గట్టిగా కట్టింది గంగమ్మ. చెన్నిగరాయుడు జ్వరతాపంలో పలవరిస్తున్నాడు. అయ్యయ్యో... నేను తన్నలేదు. తప్పయిందమ్మా..." అన్న పలవరింత ఎవరికీ అర్థం కాలేదు. లోపలికి వెళ్ళి చూడగానే కంఠోజోస్యులకు కారణం తెలిసిపోయింది! ఒక తాటాకు తెప్పించి దానిమీద చక్రంవేసి, మట్టమట్టి, పసుపుదారం కట్టి, పురెక్కించిన తాడు బిగించి ఒక కొబ్బరికాయకొట్టి దాని నీళ్ళను మూడుసార్లు దిగదుడిచి వెళ్ళమని రోగిముఖానికి చల్లి, తాటాకు తాయిత్తు అతని మెడకు కట్టి ఈతచీపురుతో మూడుచుట్లు దిగదుడిచి, తలమీద నాలుగు మార్లు కొట్టాడు. గంగమ్మతో చెప్పి లవంగాలు, మిరియాలు, శొంఠివేసిన కషాయం కాయించి తాగించాడు. కరణం గారు మొద్దులా నిద్రపోయాడు.

మరుసటిరోజు తెల్లారేసరికి జ్వరం చప్పగా వదిలిపోయింది.

# 3వ అధ్యాయం

వెంజమ్మ పెద్దమనిషి అయ్యాక గర్భాదానం జరిగి ఇంటికి వచ్చింది. కరణం చెన్నిగరాయలకు పెళ్ళామంటే మోజు . ఆవిడ మీదపెత్తనం చెలాయించాలనే ఆహంకూడా. పెళ్ళాంమీద పెత్తనం చెలాయించడమంటే ఏమిటి? అప్పుడప్పుడు నాలుగు తన్నాలి. కాని అది అతని చేతకాదు. పొట్లమారి ఆవునుకాని, అంకెకురాని దూడనుకాని కొట్టిన అలవాటు కూడా లేదు. అంచేత పెళ్ళాంమీద పెత్తనమంతా నోటితోటే చూపేవాడు. అతనినోటికి అవలీలగా వచ్చే 'ముండా' అన్నపదానికి బోడి, లంజా, మాలమాదిగ వంటి వుపపదాలు విశేషణాలుగా చేర్చి కసిదీరా అనేసి వూరుకునేవాడు.దానికంటే గొప్ప భాషాపటిమ అతనికి లేదు. ఎంతైనా గంగమ్మ కొడుకు. అయినా, మరీ శ్రుతిమించి పోతే మావయ్యకెక్కడ తెలుస్తుందో అన్న బెదురు లోలోపల వుండనేవుంది.

కోడల్ని ఏలుకోవాలన్న మోజూ, తిట్లపరిభాషలో వేర్పు, గంగమ్మకు సమృద్ధిగానే వున్నాయి. ఆవిడకు కూడా వియ్యంకుడంటే కాస్త పక్కబెదురే. అందుచేత గుర్రుమని వురుముటం తోటే తృప్తి పడుతోంది.

కరణీకం చేతికివచ్చిన మొదటి సంవత్సరం చెన్నిగరాయలు, తావే లెక్కలు తయారుచేసి, జమాబందికి పట్టుకెళ్ళాడు. అది కేవలం తాలూకా జమాబంది. హుజూరు జమాబంది కూడా కాదు. మామూళ్ళు సక్రమంగా చెల్లించినా హెడ్‌గుమాస్తా అతని లెక్కలలో లక్షా తొంభై తప్పులుతీసి చూపించాడు. ఫలితం? అతని లెక్కల జమాబంది కాలేదు "థూ వీళ్ళమ్మవ్...." అని అతడు మనసులోనే తిట్టుకున్నాడేకాని నోరెత్తి ఎవళ్ళనీ ఏమీ అనలేదు. అతని జమాబంది చేయడం సాధ్యం కాదనీ మరో రెణ్ణెల్ల లోపుగా అతడే తివుటూరికి వచ్చి దొరగారి సంతకం పొందాలని హెడ్‌గుమాస్తాగారే చెప్పారు. దొరగారి ముందు నుంచుని చీవాట్లు తినే యోగం తప్పింది.

అదే జమాబందికి వచ్చిన తిమ్మలాపురం కరణం దేవరసయ్యగారికి తప్పులు లేకుండా లెక్కలు రాస్తారని పెద్ద పేరుంది. కరణీకం అంటే భోజనానికి రుచి ఇచ్చే పూరగాయవంటిదేగాని, దానివల్లే కడుపునిండదని ఆయనే అనేవారు. చెన్నిగరాయుడు దేవరసయ్యను ఆశ్రయించాడు. ఇప్పటివే కాక ఏటేటా లెక్కలన్నీ వ్రాసిస్తాననీ మొత్తంమీద సంవత్సరానికి యాభైరూపాయలు సంభావన ఇవ్వాలనీ ఆయన అడిగారు. చెన్నిగరాయనికి ఫిర్కాలోని మూడుపల్లెలమీద కలిసి వచ్చే వోటిగె[1] నూట ఇరవైరెండు రూపాయల ఏడణాల తొమ్మిది పైసలు. దానిలో పచ్చ నోటుమీద చిల్లరంతా కాగితాలకు, సిరాకే ఖర్చవుతుంది. సాలాఖరులో తనకు కావలసిన వోటిగె లెక్కలుకట్టేటప్పుడు సిరస్తాదారుకు పది(అందులో తాసీల్దారుకు ఆరు, సిరస్తాదారుకు నాలుగట) హెడ్‌గుమాస్తాకురెండు, కడమ గుమాస్తాలకు రెండు, బంట్రోతులకు తలా ఎనిమిదణాలు మొత్తం పదిహేడు, పద్దెనిమిది ఖర్చవుతుంది. అదీకాక, తాలూకాకు వచ్చినప్పుడు భోజనానికనీ, తిండికనీ, ఖర్చుండనే వుంటుంది. ఇవన్నీపోను చెన్నిగరాయల లెక్కల తయారీకి యాభైరూపాయలిచ్చుగుంటే తకు మిగిలేదేమిటి శ్రాద్ధం. వసూళ్ళకాలంలో మాత్రం పదిరూపాయలకంటే ఎక్కువపన్ను కట్టే రైతులు ఒకరూపాయి, దానికంటే తక్కువ కట్టేవాళ్ళు ఎనిమిదణాలు, రెండురూపాయలపన్ను చెల్లించేవాళ్ళు పావలా సిరామామూళ్ళివ్వటమేమో వుంది. కాని రామసంద్రం మామూళ్ళు మునసబే తినేస్తున్నాడు. లింగాపురంనించీ ఏమీరాదు. కురబరహళ్ళి నించి మాత్రం నలభైరూపాయలు గిట్టుబడి అయ్యేవి.ఇదికాకపై సంపాదన ఏదైనా వుందంటే అది కరణంగారి శక్తికొద్దీ అర్జీలు, అమ్మకాలు, తణఖాలు, పోరంబోకు ఆక్రమణలు, దరఖాస్తులు - వీటిమీద సంపాదిస్తే సంపాదించాలి. ఖాతా, ఖర్డి లెక్కలే నిర్వహించలేని చెన్నిగరాయలు ఇవేం జేయగలడు? అతడికి పై సంపాదన లేదు.

తిమ్మలాపురం దేవరసయ్యగారు రామసంద్రానికే వచ్చి పదిహేనురోజులు తిష్టవేశారు. ఆయన భోజనసదుపాయాలు గంగమ్మ, నంజమ్మలు చూసుకున్నారు. కడమ వుపచారాలన్నీ చెన్నిగరాయడు చేశాడు. లెక్కలు పూర్తిచేసి అతణ్ణి వెంటబెట్టుకొని వెళ్ళి హెడ్‌గుమాస్తాకు రెండు, సిరస్తాదారుకు అయిదు, ముడుపు

1. వసూళ్ళు చేసినందుకు కరణానికి ఇచ్చే కమీషన్

చెల్లింపచేసి దేవరసయ్యగారు జమాబంది సంతకం చేయించి ఇచ్చారు. కోటువేసి, తలపాగా చుట్టి, పైన కండువా వేసుకుని చెన్నిగరాయలు తాలూకాకచ్చేరికి వెళ్ళివచ్చాడు. దొరగారు సంతకం చేస్తుండగా ఇతడు చేతులు కట్టుకుని నుంచున్నా, అదృష్టంకొద్దీ ఈయన ఇతణ్ణేమీ అడగలేదు. హెడ్‌గుమాస్తా చూపెట్టిన చోట సంతకం చేశారు.

తిపటూరినించీ బండ్లో మొదట తిమ్మలాపురానికి వచ్చి దేవరసయ్య నక్కడే దిగబెట్టి, పూరికివచ్చిన మధ్యాహ్నమే, చెన్నిగరాయలు పెళ్ళాన్ని "ఏమేవ్! ఎక్కడ చచ్చావు? జమాబంది చేసుకుని వచ్చేసరికి నా ఒళ్ళంతా ఒకటే నొప్పులే. ఆముదంతో తలంటి కాళ్ళూచేతులు మర్దనం చేద్దువుగాని రా" అని పిలిచాడు.

నంజమ్మ మంచి పొడగరే కాక ఎదిగి పుష్టిగా కండపట్టి దిట్టంగా వున్న పడుచుపిల్ల. పెరట్లో మాతిపీళ్ళు గిలకమీదతోడి, తోడి, కాగులో పోసి, మంటెట్టి సలసల కాచింది. భర్తగారికి ఆముదంతో తలంటి, రుద్ది, తట్టి, వీపు, చేతులు మర్దనం చేసి, పాదాలకు మానెరాసి, వాననివ్చి, వేడివేడి నీళ్ళుపోసి, నున్నగా విసిరివ పీకాయితో తలా, వీపూ, చేతులూ కాళ్ళూరుద్ది- అతడు ఒళ్ళు తుడుచుకున్నాక తలకు తుండుగుడ్డ చుట్టి, పక్కేసి పడుకోబెట్టి, దుప్పటి రగ్గు జోడించి కప్పి, పక్కలో కూర్చుని, అతడు చాలనేదాకా కాళ్ళూచేతులూ, ఒళ్ళూ పట్టింది.

చేసివుంటే అప్పణ్ణయ్యకు కూడా రెండేళ్ళ క్రితమే పెళ్ళిచేసి వుండాలి. అయినా అప్పుడప్పుడే చెన్నిగరాయని పెళ్ళి జరిగింది. ఆ తరవాత అతడు కరణం కావటం, అయ్యాక దాన్ని నిర్వహించే కార్యకలాపాలలో సతమతం కావడంతో సరిపోయింది. అంచేత ఆలస్యమై పోయింది. ఇప్పుడు కంకణబలం కూడా కలిసి వచ్చింది.

అప్పణ్ణయ్య చెన్నకేశవయ్య బడికి కూడా వెళ్ళినమాట వాస్తవమే. కాని విద్య అన్నది వాడి నుదుట వ్రాయలేదని ఓచయ్యగారే చెప్పారు. అది వాడి తప్పు ఎలా అవుతుంది? ఇసుకలో అక్షరాలు దిద్ది దిద్ది, వాడి గోళ్ళు మొద్దుబారాయి. అక్షరాలు మాత్రం ఇసుకలోనే కలిసిపోయాయి. దాన్ని గురించి ఎవళ్ళకీ బాధలేదు. వాణ్ణి బడికి పంపడమైనా దేనికి? చెరుకు తోటలకెళ్ళి బీడి కాలుస్తూ మళ్ళీ వాటిని తగలేస్తాడనేకదా?

అతడికి పిల్లనిచ్చిన వాళ్ళు కడూరు సీమలో నుగ్గేకెరె గ్రామం పురోహితులు శ్యామాభట్లు. గంగమ్మ పుట్టింటి జావగల్లు బంధువుల ద్వారా ఈ వరుడున్నాడన్న సంగతి తెలిసి, ఆయనే వచ్చి చూసి ఈ సంబంధం స్థిరపరచుకున్నాడు. ఉన్నది ఒక్కతే కూతురు. కొడుకులు లేరు వంటా వార్పుతో పాటు అల్లికపనిలో వటపత్రశాయి కృష్ణుణ్ణి వేసే నేర్పుకూడా వుంది. అంటే నాగరకత గల పిల్లే. కానీ ఆ సంగతి మాత్రం శ్యామాభట్లు గంగమ్మతో చెప్పలేదు. చెప్పేవుంటే అలాంటి నాగరికపు పిల్లను కోడలుగా చేసుకోవటానికి ఒప్పుకునేది కాదు.

ఒకసేరు బరువున్న వెండి పంచపాత్ర మొదలుకొని, పట్టుపంచలు, జరీపంచలు, జరీతల పాగ-అన్నీ ఇచ్చి పెళ్ళి లక్షణంగా చేశారు. వరుని మాతాపితరుల స్థానంలో అన్నయ్యా వదినా కూర్చుని కన్యాదానం చేయించుకున్నారు. పెళ్ళయిన ఆరునెలలకే సాతమ్మ పెద్దమనిషై శోభనం కూడా జరిగి ఇంటికి వచ్చింది.

పెళ్ళాన్ని ఎలా పిలుకోవాలన్నది అప్పణ్ణయ్యకు మొదట్లో సమస్య అయిపోయింది. అన్నయ్య వదినను పిలుకున్నట్టే తాను పిలుకోవాలని అతడు నిశ్చయించుకున్నాడు. ఆమె వచ్చిన తొలిరోజు వుదయమే అతడు పెళ్ళాన్ని కేకేసి పిలిచాడు. "ఒసేవ్! ముండా! నాకు నూనెరాద్దువుగాని రా."

ఈమాటలు ఎవరిని వుద్దేశించి అన్నవో సాతమ్మకు అర్థమవలేదు. ఆవిడ తనధోరణిలో తాను ఇల్లు తుడుస్తోంది. "ఒసేవ్! నిన్నే పిలిచింది. సాతుముండా! వినపడలేదా?" అని మొగుడు అన్నప్పుడు నిర్ఘాంతపోయి అతని వేపు చూసింది. "అదేమిటలా చూస్తావు? చెప్పింది అర్థమవ లేదా? గాడిదముండా!" అని అతడడిగాడు. సాతుకు ఏడుపే వచ్చింది. తుడుస్తున్న చీపురక్కడే పడేసి అత్తయ్యదగ్గిరికెళ్ళి "మీ కొడుకు మాటలు విన్నారా అత్తయ్య పెళ్ళాన్ని ఇలాంటి మాటలనటం ఆయన కెవరు నేర్పారు?" అంది.

కోడలుపిల్ల ఇంత ధైర్యంగా అడగగలదని గంగమ్మ కలలో కూడా అనుకోలేదు. పెద్దకోడల్ని చెన్నిగరాయలిలాగే అనటంలేదూ? అది పల్లెత్తుమాటైనా అనకుండా పడివుంటోంది. కాని ఈ చుప్పనాతి తన్నే వచ్చి ఇలా అడుగుతుందేమిటి?

"మొగుడు పెళ్ళాన్నింకెలా పిలవాలే మాయలాడీ?"

"నేనెందుకవుతాను మాయలాడిని ? అలా అనేవారే అయ్యుండాలి."

గంగమ్మ ఆ మాటవిని మండిపడ్డది "వురేయ్ ఆడలంజాకొడుకా! నీ పెళ్ళాం నీకన్న తల్లినే ఏమందో విన్నవట్రా? నేనే మాయలాడినట! తిన్నగా పెళ్ళాన్ని

ఏలుకోగలవట్రా? శిఖండిముండాకొడుకా?"

అప్పణ్ణ పౌరుషం దెబ్బతిని లేచినుంచుంది. వెళ్ళి ఒక చేత్తో పెళ్ళాం మెడపట్టుకుని మరోచేత్తో టపీ టపీమని రెండు కొట్టాడు. సాతమ్మ తలతిరిగి కిందపడిపోయింది. "చంపేస్తాను, ఈ బోడిలంజాముండని"-అని అతడు గర్జించేలోపుగా, అంతావింటున్న నంజమ్మ వంటింటిలోనుంచీ పరుగెట్టుకొచ్చింది. ఇంతవరకూ ఆమె అప్పణ్ణయ్య ఎదరనుంచుని మాట్లాడి ఎరగదు. అయినా ఇప్పుడు "అప్పణ్ణయా! ఇంటికి వచ్చిన కోడళ్ళని ఇలా వేపుకుతింటే మీ చేతులు పడిపోతాయి. మీకిదేం దుర్బుద్ధి?" అని, లోపలనుంచి నీళ్ళుతెచ్చి సాతమ్మ ముఖంమీదా తలమీదా చిలకరించింది. అప్పణ్ణయ్య నోరు 'ముండా' అన్న పదాన్ని వదినమీదకూడా ప్రయోగించబోయింది. కానీ ఏదో భయంతో- ఆమె తండ్రి కంఠీజోస్యులు జ్ఞాపకం వచ్చాడు కాబోలు వూరుకున్నాడు. సాతమ్మ పూర్తిగా స్మృతి తప్పి పడిపోలేదు. కాసేపటికావిడే తేరుకుని లేచి కూర్చుని "మంచి వంశంలో పుట్టివుంటే కదా వీళ్ళనోటంట మంచి మాటవచ్చేది" అని అంది.

"సాతూ! నువ్వు మాట్లాడకు వూరికే రా" అని నంజమ్మ మెల్లెక్కించి అటకమీదికి తీసుకెళ్ళింది. "దీని చెవిలో ఏదో వూదటానికి తీసుకెడుతోంది ఈ పెద్దముప్పాతి" అని గంగమ్మ అన్నమాటలు నంజమ్మ వినీ విననట్టు పట్టించుకోకుండా వెళ్ళిపోయింది.

"బ్రాహ్మణులై ఇలాంటిమాటలు వీళ్ళనోటంట రావచ్చా?" అటకమీది బల్లమీద కూర్చున్నాక సాతు అడిగింది.

"నీ కిది కొత్త. ఈఇంటి లక్షణమే అంత."

" అయితే బావగారూ మిమ్మల్నిలాగే అంటారా?"

"ఇక్కడికి వచ్చాక రెండేళ్ళనుంచీ నాకలవాటయింది."

"వింటూ మీరెందూ కూరుకున్నారు? అంచేతే వీళ్ళకి ధైర్యం."

దానికి నంజమ్మ సమాధానం చెప్పలేదు. ఆమె తనలో తానేదో ఆలోచిస్తోంది. సాతు మళ్ళీ అంది. "మీ నాన్నగారు చాలా గొప్పవారు కదా! నా పెళ్ళికి కూడా వచ్చారు. పెండ్లింట్లో ఆయన్ని చూస్తే అందరికీ హడలే. ఆయన చాలా గొప్పవారని అందరూ అన్నారు. బావగారికి కరణీకం ఇప్పించింది కూడా ఆయనేగా? మానాన్నకి చెబుతానని ఓసారి జడిపించండి. వీళ్ళనోళ్ళు కట్టడిపోతాయి. పోనీ ఆయనతోటి మీరే ఓసారి చెప్పరాదూ? వీళ్ళకి బుద్ధి చెబుతారు."

"పాతూ! నీవింకా చిన్నదానివి. ఏమీ తెలవదు. బుద్ధి చెప్పండి అని ఆడదెప్పుడూ తండ్రిపడగరాదు." అని చెప్పిందే కాని తనతండ్రి పూర్తి స్వభావాన్ని నోరువిప్పి చెప్పలేదు. ఆయనకు ఎవరిమీద కోపం వచ్చినా సరే మీదపడి, పిలకుచ్చుకుని, దవడ పళ్ళూడేలా వాయించి, తరవాతే మాట్లాడేవారు. కాని మరోపద్ధతి ఎరగరు. మామగారి ముందు అల్లుడు తన మర్యాద నిలుపుకోలేదని ఆమెకు తెలుసు. పిరికివందల్ని ఆమెతండ్రి ఎన్నడూ గౌరవించలేడు. అది ఆయన స్వభావం. ఆడది అయినతాను, తన భర్త మర్యాదను కాయకపోతే ఎలా?

పాతు అంది "అయితే వీళ్ళకి మీరే బుద్ధి చెప్పండి. ఇహమీద నన్నిలా అవకుండా చూడండి."

ఇంతలో కిందనుంచీ చెన్నిగరాయని గొంతు వినిపించింది. "ఎక్కడికెళ్ళావే? నీ కొంపకూల ఇంకా రొట్టెలు చేసి పచ్చడి రుబ్బలేదేమే?"

"విన్నావా! మీ బావగారిమాటలు నేను వెళ్ళి రొట్టెలు చేస్తాను. నువ్వు పచ్చడి రుబ్బుదువు గానిరా. లేదా మీ ఆయనకి తలంటు పోయి" అని నంజమ్మ లేచి నుంచుంది.

"నేను పచ్చడి రుబ్బుతాను. కావలిస్తే వాళ్ళమ్మతోటి తలంటించుకోనీ" పాతు తనలో తాననుకుంది.

# 4వ అధ్యాయం

నంజమ్మకు ఏడవ నెలలో ఒకరోజు కంఠీజోస్యులు తన తెల్లగుర్రమెక్కి రామసంద్రానికి వచ్చాడు. ఈసారి పగటిపూటే వచ్చాడు. ఆయన వచ్చాక రెండు గంటలకి దిళ్ళూ, మెత్తా వేసిన సవారి బండి కూడా వచ్చింది. (అమ్మాయిని పురుటికి తీసుకెళ్ళాలని వచ్చిన జోస్యులు కల్లేశంకు పెళ్ళి కుదిరిందన్న వార్త కూడా తెలిపారు. ఆనాటికి సరిగ్గా పదిహేను రోజులుకే పెళ్ళి. పెళ్ళి కూతురింట్లోనే జరుగుతుంది, హాసనపల్లె. అందరూ పెళ్ళికి ముందురోజే నాగలాపురానికి రావాలనీ, అక్కణ్ణించీ అంతా కలిసి బళ్ళల్లో హసనకి వెళ్ళొచ్చనీ చెప్పి, కూతుర్ని వెంటబెట్టుకుని బయల్దేరాడు. నంజమ్మ బండిలో కూర్చుంది. ముందువేపు సేనాధిపతిలా హుందాగా కంఠీజోస్యులు తెల్లగుర్రమెక్కి సవారి చేశారు. )

నాగలాపురం ఇంట్లో ఇప్పుడు ముసలమ్మొక్కత్తే వుంది. నంజమ్మను చిన్నతనం మంచీ పెంచి పెద్దచేసింది ఆమే గనక, ఆ అక్కమ్మను చూడగానే నంజమ్మ కళ్ళు చెమ్మగిల్లాయి. చాలా రోజులు నాయనమ్మను వదిలి వున్నందుకో, మరిదేనికో ఆవిడికే తెలియదు. కడుపుతో వున్న మనమరాలిని అంతకుముందే పుట్టింటికి పిలిపించుకోవాలని అక్కమ్మ కోరిక. కానీ ఎక్కడెక్కడో సంచారం చేస్తున్న కంఠీజోస్యులు ఇంటికి రావటమే విన్న రాత్రాయె. అందులోను కొడుకు పెళ్ళీ, ముహూర్తమూ, నిర్ణయించకునే వచ్చాడు. కొడుక్కి ఎప్పుడో అంతకుముందే పెళ్ళి చెయ్యాలిపింది. దాన్ని గురించి ఆయన ఆలోచించనే లేదు. కొన్ని రోజుల బట్టీ వాడి నడత కాస్త పట్టా తప్పిందని మరో కానిస్టేబులు ద్వారా తెలిసి, వెంటనే రెండే రెండు రోజుల్లో వధువును చూసి లగ్నం కూడా నిశ్చయించాడు.

అన్నయ్య పెళ్లికి నంజమ్మ కూడా సన్నాహాలు చేయసాగింది. ఇంటికి వెల్లవేసే కూలీలు మొదలైన వాళ్ళ మీది అజమాయిషీ అంతా ఆమెదే. పూళ్ళో పట్టుమని పదిరోజులుండటం కంఠీజోస్యుల జాతకంలోనే లేదు. గుర్రమెక్కి వెళ్ళిన జోస్యులు మళ్ళీ వారం రోజులకి వచ్చాడు. ఇంకా పెళ్ళి ఆరు రోజు

లుండవగానే కల్లేశు పోలీసు దుస్తులతోటే వూరికి వచ్చాడు. అన్ని పనిపాటల్లోనూ అతడు బుద్ధిమంతుడు. పెళ్ళి సన్నాహాలలో చెల్లికి, బామ్మకీ కావలసిన సహాయమంతా చేశాడు. వాళ్ళ దగ్గిర బంధువులంటే రామసంద్రం వాళ్ళే. పెళ్ళి కొడుకును చేయటానికో రోజు ముందే చెన్నిగరాయడు, అప్పణ్ణయ్య, సాతు బండి కట్టుకుని వచ్చారు. సుమంగలి కాని తాను పెళ్ళికి రానని గంగమ్మ కబురెట్టింది. పెళ్ళికొడుకును చేసిన రాత్రే అందరూ బయల్దేరాలి. కాని కడుపుతో వున్న నంజమ్మకు మధ్యాహ్నం నుంచీ ఆయాసంగా జ్వరం వచ్చినట్టుంది. సాయంత్రానికల్లా ఓపిక లేక పడుకుంది. రాత్రివేళ అందులోను ఎడ్లబండిలో ఆమె ఇరవైనాలుగు మైళ్ళు ప్రయాణం చేయటం క్షేమం కాదని అందరూ నిర్ణయించారు. నంజమ్మ, అక్కమ్మ వూళ్ళోనే వుండిపోవాలని నిర్ణయం జరిగింది.

వూళ్ళో తానూ బామ్మా ఇద్దరే. అందులోనూ మొదటి పురుడు. నంజమ్మకు ఈ కొత్త అనుభవంలో సాధారణంగా వుండే భయమొకవేపు. అందుచేత భర్త తన తోటే వుండిపోతే బావుండునని అనుకుంది. తానున్న చోటికి అతన్ని పిలిపించింది. ఎడ్ల బండిలో రాత్రి నిద్రపోవటానికి అనుకూలమైన చోటు ముందే ఆక్రమించే ప్రయత్నంలో వున్న చెన్నిగరాయడు వచ్చి కర్కశంగానే – కడంవాళ్ళకు వినపడలేదు గాని "ఏమిటి?" అని అడిగాడు.

"నాకెందుకో ఓలా వుంది. ఇంట్లో మగదిక్కు లేదు. పెళ్ళికి అప్పణ్ణయ్య, సాతు• వెళ్ళనీ మీరిక్కడే వుండండి."

"అదెలా వీలవుతుంది?" అని అడిగిన అతని కంఠంలో, పెండింట్లో గోపురంలా వడ్డించే అన్నం, పులుసూ, వొత్తి రాశిగా పడేసిన బొబ్బట్లు– అన్నీ తనకు లేకుండా ఎవరో ఎత్తుకుపోయిన నిరాశ కనిపించింది.

"ఎందుకు కాదూ! మీరిక్కడే వుండాలని అన్నయ్యకూ, నాన్నకూ చెబుతాను."

"అక్కరలేదు. కావలిస్తే సాతమ్మనిక్కడే వుంచుకో."

నంజమ్మ మళ్ళీ మాట్లాడలేదు. రెండేళ్ళు సంసారం చేసిన తనకు అతని స్వభావమెలాంటిదో బాగా తెలుసు. "ఫరవాలేదు. మీరు వెళ్ళండి" అంది. అతడు వెళ్ళి సవారీ బండిలో అంతకు ముందే మూసిపెట్టుకున్న చలివేయని చోటు ఆక్రమించి చేరబడి కూర్చున్నాడు. సాతు తనంతట తానే వచ్చి "నేను మీతోటి వుండిపోనా అక్కా?" అని అడిగింది.

"అక్కరలేదు. నువ్వెళ్ళిరా" అని నంజమ్మ చెప్పినా వినిపించుకోలేదు. ఆవిడే

అక్కమ్మ దగ్గిరికెళ్ళి చెప్పింది." మీరొక్కరేం వుంటారు. మునలితనం. ఇంట్లో ఎవరూ వుండరు. నేనిక్కడే వుంటాను."

"అక్కడ మనవేపు తిరగటానికి ముత్తైదువులే వుండరమ్మా. నీవైనా వెళ్ళి పెళ్ళి పనులు చూసుకో. ఇక్కడ నంజమ్మను నేను చూసుకుంటాను. ఫరవాలేదు" అని అక్కమ్మే బలవంతం చేశాక ఆమె బయల్దేరింది.

రాత్రి ఎనిమిదింటికి బళ్ళకు నొగళ్ళెత్తారు. కంఠీజోస్యులు బలాఢ్యులు. లాగు, కోటు వేసుకుని గుర్రమెక్కి ముందర బయల్దేరాడు. స్నేహితులైన కొందరు పోలీసు బంట్రోతుల తోటి, దఫేదారుతోటి కల్లేశం చివరి బండ్లో కూర్చున్నాడు. నంజమ్మ లేచి గుమ్మంలో నుంచుని నాలుగు బళ్ళూ మలుపు తిరిగి కనుమరుగయ్యే దాకా చూసింది.

ఆరాత్రి పడుకోబోతూ అక్కమ్మ అంది : "చూడు నంజీ! వున్నది మీరిద్దరే పిల్లలు. నీకిప్పుడు ఏడు నెలలని మీ నాన్నకి తెలుసు. అయినా ఇప్పుడే కల్లేశు పెళ్ళి ఏర్పాటు చేసుకొచ్చాడు. వాడికి బుద్ధుందనాలా? లేదనాలా? (వాడి స్వభావం మొదటి నుంచీ ఒకటే. ఎడ్డెమంటే తెడ్డెమంటాడు) నిన్నూ కని మీ అమ్మ పోయిన నాటి నుంచీ నేనొంటరి దాన్నే.నీవు పుట్టినప్పుడు కల్లేశుకు ఏడేళ్ళు కదా? మగపిల్లలెలాగో పెరుగుతారు. మీ నాన్న మూడు రోజులింటి పట్టున వుంటే ముప్పైరోజులుండడు. పెళ్ళై నీవు వెళ్ళిపోయాక ఒక్కత్తెనే వుండి వుండి ప్రాణం విసుగెత్తింది. ఏదో నీకడుపు పండితే నాలుగు పురుళ్ళు పోద్దామనే ఆశ వుండేది. దేవుడు చల్లగా చూసి దాన్ని తీరుస్తున్నాడు. అయినా ఆడపిల్లలను ఒకరి చేతిలో పెట్టాక మనం రమ్మన్నప్పుడు వస్తారా?."

"ఇహ ఫరవాలేదు. వదిన వస్తుంది కదా! నీకు తోడుగా వుంటుంది."

"నీ వెర్రి కాకపోతే, వాడు చేసేది పోలీసు వుద్యోగం. ఏ వూరికి బదిలీ చేస్తే ఆ వూరికి వెడుతూ వుంటాడు. వాడి పెళ్ళామూ వెడుతుంది. ఇంతకూ అది పట్టణపుపిల్ల. కొడుక్కు పెళ్ళి కూతుర్ని నిశ్చయించే ముందు మీ నాన్న నాతో ఒక ముక్కయినా చెప్పాడా? వాడి ఇష్టమే ఇష్టం. ఈ పెంకి ఘటాన్ని కన్న నా పుణ్యాన్ని అనాలి."

నంజమ్మ మనస్సు తండ్రి స్వభావాన్ని గూర్చి ఆలోచించటం మొదలెట్టింది. ఇంతలో అక్కమ్మ అడిగింది " మీ అత్త నిన్ను బాగా చూసుకుంటోందా?"

"వూఁ బాగానే చూస్తారు."

"అంతే చాలు, ఆడపిల్లలకి అంతకంటే ఏం కావాలి?" అని అక్కమ్మ విరమించింది.

కాపేపయ్యాక మళ్ళీ ఆవిడే మొదలెట్టింది. "చూడవే చిన్నీ! నీవప్పుడు పాడేదానివి. సీతావనవాసం పాట, లవకుశుల యుద్ధం అవింకా జ్ఞాపకమున్నాయా?."

"అక్కడికెళ్ళాక ఒక్కసారి కూడా చెప్పుకోలేదు. తెల్లారి రాగులు విసురుతూ ఓ రోజు పాడుకుందామని మొదలెట్టాను. నా నిద్ర పాడుచెయ్యకు అవి ఆయనన్నారు. నేను విసురుతూ వూరుకుండిపోయాను."

"రేపటి నుంచీ రోజూ పాడవే. నాకే వినాలని ఆశగా వుంది" అన్నావిడ. ఏదో చటుక్కున జ్ఞాపకం వచ్చి "అక్కరలేదులే. కడుపుతో వున్నప్పుడు సీతావనవాసం లాంటి ఆపాట చెప్పనూ రాదు, విననూ రాదు" అంది.

రెండు నిమిషాలయ్యాక మళ్ళీ ప్రారంభించింది "చూడు నీవు వెళ్ళిపోయాక మన వూళ్ళో పాడే అమ్మాయిలు లేరంటే నమ్ము. ఎవళ్ళింట్లో అయినా పేరంటం జరిగితే కళే లేదని అందరూ అంటారు. అవునే నీ పాటల పుస్తకం ఇక్కడే మరిచిపోయావట. ఆ రోజెప్పుడో కంఠీకి దొరికితే పాపది అని వాడెక్కడో దాచాడు. తెల్లారి వెదికితీసి పాడుకో. లేకపోతే అసలే అన్నీ మరిచిపోతావు."

## 2

కల్లేకు పెళ్లిరోజే నాగలాపురం బెస్తవీధిలో ఎలకపడ్డది. అంటే ప్లేగు మహామారి వూరికి వస్తుందన్నమాట. తనకెవళ్ళు ముడుపులు చెల్లించరో, ఎవళ్ళు భయభక్తులతో నడుచుకోరో, వాళ్ళందరినీ నమిలి మింగి, నీళ్ళు తాగేస్తుంది. గ్రామానికి ఆమె వచ్చేలోపుగా జనమంతా ఇళ్ళూవాకిళ్ళూ వదిలి వూరవతల పొలాల్లోనో, తోటలలోనో పాకలు వేసుకుని వుండాలి. దాదాపు మూణ్ణెల్లు గ్రామంలో వుండి అమ్మవారు వెళ్ళిపోయాక జనమంతా వూరికి తిరిగి వెళ్ళిపోవచ్చు.

ఆ మరుసటి రోజే వూరికి 'బూరుబూరుసుంకలమ్మ' వచ్చింది. పిడికెడు లావు, బారెడు పొడవూ వున్న కొరడా, పసుపుకుంకుమ పూసుకున్న తన ఒంటి మీద ఛళీమని చరుచుకుంటూ అమ్మవారి పూజారి 'గూడు' నెత్తిమీదెట్టుకుని వచ్చాడు. వాడి వెనకాలే వాడిపెళ్ళాం సోది చెబుతోంది." సుట్టూతా అర్దై నాల్గు పల్లెల్లో అమ్మోరవుపించి; సించి సెండాడ్తది. తల్లినొదిలి పిల్లని తింటది; తల్లుల పిల్లల్ని తన్నుకపోద్ది; మొగుణ్ణి సేరని పిల్లని మొత్తుకపోద్ది; సోబనీపు సిన్నోణ్ణి

సుబ్బరంగా కరకర నమిలి తింటది; కడుపుతో వున్నమ్మ పేణాల్ని గడగడ తాగేస్తది; హా....లలలల ఛలీర్ ఛట్" అని మధ్య మధ్య పూజారి కొరడాతో ఒంటిమీద చరుచుకుంటువ్నాడు.

ఇలాగ బూరుబూరుసుంకలమ్మ రావటమూ, వచ్చి సోదె చెప్పటమూ వింతకాదు. కాని 'కడుపుతో వున్నమ్మ పేణాలు గడగడ తాగేస్తది' అన్న సోదె విని అక్కమ్మకు కంగారుపుట్టింది. అందరికంటె ముందు పసుపు కుంకుమ, బియ్యం, కందిపప్పు, కొబ్బరికాయ, పైన కాని దక్షిణా, ఓ చేటలో పెట్టుకుని తానే స్వయంగా వెళ్ళి అమ్మవారికి అర్పించి ఆమె ప్రసాదం, కుంకుమ తెచ్చి, పెట్టుకొమ్మని వంజమ్మకిచ్చింది.

మరువటి రోజు మరి కొన్ని ఎలకలు పడ్డాయి. వూళ్ళో కడమ వీధుల్లో పడ్డాయి. చుట్టుపక్కల వున్న పల్లెల్లో అప్పుడే జనం వూళ్ళు వదులుతువ్న వార్తలు వచ్చాయి. ఇహ వీళ్ళూ సాధ్యమయినంత త్వరలో షెడ్లు వేసుకోవాలి. వూరి కరణం శామణ్ణగారు సాయంత్రం ఇంటికొకడు చొప్పున పిలిపించి, పంచాయతీ చేసి వచ్చే సోమవారం లోపుగా అందరూ వూరు వదిలి పోవాలని తీర్మానించారు. మరుసటి రోజు వుదయం నుంచే జనాలు తమ తమ పొలాల్లో, తోటల్లో సొంతం పొలం లేని వాళ్ళు ఇతరుల పొలాల్లో షెడ్లు వేసుకోవటం మొదలెట్టారు. అలగాజనం సామాన్లు సాగించేశారు.

కంఠీజోస్యులు కొడుకు పెళ్ళి చేసుకుని వూరికి తిరిగి రావలసిన రోజుకే చాలా ఇళ్ళవాళ్ళు సామాన్లు సాగించేశారు. పెళ్ళి సన్నాహాల హడావుడి తగ్గి కాస్త విశ్రాంతి తీసుకునే సమయానికి అక్కమ్మకి ఈ బాధ్యత ఒకటి తగిలింది. కొత్తగా వెల్లవేయించిన ఇల్లు ఖాళీచేయాలి. వూరు వదలాలంటే వూరి పురోహితుణ్ణడిగి వర్జ్యం వారం నిర్ణయించడమే మామూలు వాడుక. చిన్న చిన్న పౌరోహిత్యాతలకు పుట్టాభట్లు అనే ఎడతూరి వేపు బీద బ్రాహ్మణ్ణొకణ్ణి కంఠీజోస్యులే ఏర్పాటు చేసి, దాని ఆదాయమంతా ఆయవకే వదిలేశాడు. కానీ ఈమాటు శామణ్ణగాడ పుట్టాభట్లను అడగనూ లేదు పిలిపించనూ లేదు. తానే అన్ని తీర్మానాలు చేశాడు. అతనికీ వీరికీ మొదటి మంచీ వైరం. దానికితోడు నిరుడు ఇద్దరికీ పొలం నీటిని గురించి తగువు వచ్చింది. అప్పటినుంచీ ఆయన ఇలాగే ఏవో చేస్తూ వుండేవాడు. ఆయన తీర్మానాన్ని ఎదిరించాలి.

పెళ్ళివాళ్ళు తిరిగి వచ్చిన మరుసటి రోజే పదహారు రోజుల పండుగ శాసం

చేసి పందిరి కదిపేశారు. చెన్నిగరాయలు, అప్పణ్నయ్య, సాతు, ముగ్గురూ బండిలో రామసంద్రానికి వెళ్ళిపోయారు.

ఈ శామణ్ణకు ఏం శాస్తి చేయాలి. వాడు చేసిన తీర్మానాన్ని ఎదురించాలి. కాని అప్పటికే జనం సామాన్లు సాగించి ఇళ్ళకు తాళాలు వేసి, అక్షరాస్యులైన వాళ్ళు తలుపుల మీద 'రేపురా' అని రాసి కొత్తగా వేసుకున్న పాకలకీ, షెడ్లకీ వెడుతున్నారు. ఒకరు వూరు వదిలితే చాలు. తతిమ్మా వాళ్ళంతా భయంతో గబగబా ఎగబడి సామాను కట్టేస్తారు. 'నేను శాస్త్రం చూశాను. గ్రామానికేమీ అవదు ఎవరూ వదలి వెళ్ళకండి' అని కంఠీజోస్యులు చెప్పినా ఎవళ్ళూ వినిపించుకోలేదు. "అవుతే మీరు వూళ్ళోనే వుంటారా?" అని ఎవరో అడిగారు. "హుం; వుంటాను" అని పట్టుదల మీది వుద్రేగంలో అనేశాడు. తానన్న మాట నిలుపుకోవాలి. అందరూ వదిలేసిన వూళ్ళో తానొక్కడే వుండిపోవాలని నిశ్చయించాడు.

ఈ నిశ్చయాన్ని అక్కమ్మ తీవ్రంగా ప్రతిఘటించింది. "మనుమరాలు తొలి పురుటికొచ్చింది. పాడు పడ్డ వూళ్ళో ఒకే ఒక కుటుంబముండటం ఎలాగ? మనం వదిలితీరాలి. లేకపోతే దాన్ని దాని అత్తారింటికి పంపించేస్తాను. పురుడోసే తాహత్తు లేక పంపించేశారని వాళ్ళనుకుంటే అనుకోనీ. కావలిస్తే నేనే అక్కడికెళ్ళి పురుడోసి బాలెంతతనం చేసి వస్తాను."

"నేను వూరు వదిలిపెట్టనని గర్వంగా చెప్పేశానుగదా? నా పరువేంగాను?"

"ఇందులో పరువేంటి? వచ్చెయ్."

కంఠీజోస్యులు తన పరువు నిలుపుకోవాలని పట్టుపట్టాడు. కొంత వాగ్వివాదమయ్యాక వూరవతల తమ పొలంలో షెడ్డు వేయించి అందులో అక్కమ్మ, నంజమ్మా వుండేలాగూ, నంజమ్మ పురుడు అక్కడే జరిగేలాగూ, కంఠీజోస్యులు మాత్రం వూళ్ళో తమ ఇంట్లో వుండిపోయేలా నిశ్చయించారు.

"నీదెప్పుడూ పెంకిబుద్దే. నీవొక్కడవే ఎందుకుండాలి? అక్కడికే రారాదూ?"

"ప్లేగు మహామారి నన్నేం చేయగలదు? నేను మగాణ్ణి. ఇక్కడే వుంటాను."

మరో గత్యంతరం లేదు. ఆయన వేయించి ఇచ్చిన షెడ్డుకు సామాను తోలించి ముసలమ్మ, మనుమరాలు వెళ్ళారు. కానీ, వదిలేసిన వూళ్ళో ఆయనొక్కడే వుండటంచేత ఆయన ఒంటి మీద అమ్మవారు వుంటుంది కాబట్టి, ఆయన వూరవతల షెడ్డుకెళ్ళి తమ తల్లినీ, అమ్మాయినీ, చూడరాదని శామణ్ణ వూరి పెద్ద మనుషులతో పంచాయతీ చేయించి ఆంక్ష వేయించాడు. అంటే నంజమ్మకు

పురుడో గిరుడో వస్తే దాని బాధ్యతంతా ముసలవ్వ అక్కమ్మ మీదే పడిందన్నమాట.

వూళ్ళో కంఠీజోస్యులొక్కడే వుండిపోయాడు. ఒక ఆవుని పెద్దుకుతోలి, మరోపాడి ఆవుని దూడని తన ఇంట్లో వుంచుకున్నాడు. తన వంట తానే వండుకుంటున్నాడు. ఇల్లూడ్చి శుభ్రంగా వుంచుకుని పులి చర్మం మీద కూర్చుని జ్యోతిష్యపు తాటాకు పుస్తకాలు చదువుతూ రకరకాలైన చక్రాలు, త్రికోణ, చతుష్కోణ' పంచకోణాది ఆకృతులు ఓం హ్రీం, ధీం మొదలైన మంత్రశక్తుల ప్రభావాన్ని గూర్చి మనసులోనే భావన చేస్తాడు. లేదా ఏదో ఒక మంత్రాన్ని గట్టిగా చదువుతూ పెరట్లో పచార్లు చేస్తాడు. మరీ విసుగెత్తితే ఒక్కోరోజు గుర్రమెక్కి దూరంగా వున్న చన్నరాయపట్టణం వేపు వెళ్తాడు.

ఆయన వరుసగా ఇన్ని రోజులు వూళ్ళో వున్నదే లేదు. ఇప్పుడు కూడా వుండవవసరం లేదు. కరణం శామణ్ణ మీదున్న ఒక రకమైన ఆగ్రహం కావచ్చు లేదా తాను వద్దన్నా వినక జడిసి వూరొదిలిన మొత్తం గ్రామస్థుల మీద వున్న ఆగ్రహం కావచ్చు. ఎక్కడికీ వెళ్ళకుండా, జనమంతా వదిలిన వూళ్ళో ఒంటరిగా వుండే పట్టుదలను మొత్తానికి పెంచింది. చీకటి అన్నా, ఒకంటరితనమన్నా, దొంగలన్నా, దోపిడీదార్లన్నా, పురుగన్నా, పుట్రన్నా, భయపడటమన్నది ఆయన రక్తంలో లేదు.

ఒకనాడు జనం వదిలేసిన ఆ వూళ్ళోకి ఒక వ్యక్తి వచ్చాడు. సుమారు యాభై ఏళ్ళుండచ్చు. అర్ధ చంద్రాకారంగా నెత్తి ముందు భాగం గొరిగించుకున్నాడు. వెనకాల వున్న తెల్లని జుట్టు ముడి వేసుకున్న ఆ వ్యక్తి ఎర్రటి చొక్కా, మాసిన నల్లని కోటు వేసుకుని, గోచీ వేసి పంచ కట్టుకున్నాడు. ముందరి రెండు పళ్ళు లేనందున పొగాకు వేసుకునే అభ్యాసాన్ని చూపుతోంది నోరు. కుడిచేతి నడిమివేలికి బంగారు తీగతో చేసిన మాంత్రికుల వుంగరం వుంది. వచ్చిన వ్యక్తిని వెంటనే పోల్చుకోలేకపోయినా, కాసేపయ్యాక జ్ఞాపకం వచ్చి కంఠీజోస్యులు పలకరించాడు. "ఏంటోయ్, వీరాచారి! శూన్యగ్రామానికి వచ్చేశావ్?"

"తమరి దర్శనం చేసుకుందామని రెండేళ్ళలో నాలుగు సార్లైనా వచ్చి వుంటాను. మీరూళ్ళో వుంటారు, వుండరు అన్నది ఎవ్వళ్ళకీ తెలవదు. ఈ రోజూ అలా తమరిని చూసి వెడదామని మళ్ళీ వచ్చాను."

"రా, రా, లోపలికి రా."

వీరాచారి లోపలికి వచ్చి కూర్చున్నాడు. శామ ఆసనం దగ్గిరే జోస్యులు

వాలుగు పాతచెప్పులుంచారు. "పాత చెప్పుల శకితి మీరొప్పుకుంటారా అయ్యగోరూ?"

"హుం. చేతబుచ్చుకుని నుంచుంటే ఎవడైనా మాట వింటాడు."

"అది కాదు నేనంది. గాలి పీడ వుంటే తరిమేస్తదట అది."

"అది కూడా వుందనుకో. కానీ నేనిక్కడుంచింది మనుషులకోసం."

కాసేపు ఆ మాటా ఈ మాట మాట్లాడాక జోస్యులే అడిగాడు.

"అసలు నువ్వొచ్చిన పనేంటి?"

"అలాగొచ్చాను. ఈటికి రెండేళ్ళ క్రితం ఓపని జరిగింది. చోళన్న గుడ్డకాడ కటికీ హళ్ళి వాళ్ళ బాపతు చేతబడోటి చేశాను అమాసరోజు. చౌడమ్మ మీదెట్టిన దక్షిణడబ్బులూ, మూడస్తాంరటిపళ్ళూ, అన్నీ ఎవళ్ళో ఎగరేసుక వెళ్ళారు. మీకేమైనా ఎరికేమో అని అడగాలని వచ్చాను."

"చేతబడి చేసే వాడికి గవ్వలేసి శాస్త్రం చూట్టం రాదేట్రా? నన్నడుగుతావు వచ్చి. శాస్త్రం చూట్టం నీకంటే నాకు బాగా వచ్చునా?"

"దీనికి శాస్త్రమూ వొద్దు; చట్టుబండలూ వొద్దు. ఆరేత్తిరి తిరిగొచ్చి చూసేసరికే తెల్సిపోయింది. నేం జేసిన చౌడమ్మ నిరగ్గాట్టి, అమ్మ మీదుంచిన డబ్బు కాజేసి, నైవేద్యమెట్టిన అరటిపళ్ళు తిని ఆరిగించుకునే శక్తి మరెవ్వళ్ళకీ లేదు. అమాస అర్ధరేత్తిరికాడ ఆడికెళ్ళే గుండెలెవరికుంటాయి ఈ సీమలో? కంటయ్యగోర్నొదిలితే మరెవళ్ళకీ సాద్దెమయ్యే బాపతు కాదని నాకు తెల్సిపోయింది. నిజం చెప్పండయ్యగోరూ!"

"నీకూ బుద్ధుందిరా ఆచారి! ఇప్పుడా డబ్బడగటానికి వచ్చావేంటి?"

"ఆ౹ వెధవ డబ్బు పోతే పోయిందిగాని అదిగాదు నేనన్నది. ఇహ మీద నేసెయ్యేట్టిన కాడ మీరు కాలెట్టకపోతే అంతే చాలయ్యగోరు' మీకు సేతులెత్తి దండం చేస్తాను."

"సరే వదిలెయ్, నేనింకా వంట చేసుకోలేదు ఇప్పుడిద్దరికీ సేస్తాను వుండి భోంచేసి వెడుదువు గాని."

వీరాచారి భోజనానికి వుండిపోయాడు. సాయంత్రం నాలుగు గంటల దాకా వుండి వెళ్ళిపోయాడు. ఆరోజు వున్నదున్నట్టుగా అమ్మాయి జ్ఞాపకం వచ్చింది జోస్యులకి. పురుటి రోజు దగ్గరపడి వుండచ్చు, నేను వెళ్ళి చూడనే లేదు. ఆ బద్మాష్ శామణ్ణ కట్టుబాటు చేశాడని భయపడి నేనెందుకు వెళ్ళకండా వుండాలి.

రేపెళ్ళి చూడనే చూస్తాను. నాదేం పెరుక్కుంటాడో పెరుక్కోనీ. వాడి షెడ్ మా షెడ్ దగ్గరే వుంది. పచ్చిగ్గా వాడి ఎదటే వెడతాను. వాడేమైనా చెప్పుండనే వుంది. మాదర్‌చోత్ ఇన్ని రోజు లక్కడికి వెళ్ళింది నాదే పొరబాటు. "నా పంచాయతీ కట్టుబాటుకు జడిసి కంఠి రాలేదు చూడు అని వాడు తెగనీల్గుతూ మీసాలు తిప్పుతూ వుంటాడు. నా వుచ్చోసి గౌరిగించాలి ఆ అడ్డగాడిద లంజాకొడుకు మీసాల్ని" అని అనుకుంటూ ఆమూల నుంచి ఈ మూలకు పచారు చేస్తుండగా, ఇంటి బిళ్ళపెంకుమీద ఏదో పడ్డట్టయింది. మరో నిమిషానికి రెండు రాళ్ళు పడ్డ చప్పుడయింది. ఈ వీరాచారి గాడి పాత్రేమైనా వుందా? ఇందులో అన్న ఆలోచన కలిగేలోపుగా ఇంటిమీద టపటప మంటూ ఇరవై ముప్పై రాళ్ళు రంయ్ రంయ్ మని వచ్చి పడ్డాయి. 'వీరాచారికి దీనికి ఏమీ సంబంధంలేదు. ఈ వూరివాళ్ళే ఎవళ్ళో అయ్యుండాలి . నన్ను భయపెట్టాలి అని ఏదో చేస్తున్నారు. కాని ఈ శిఖండి లొత్తుకొడుకులకి నా తడాఖా చూపెడతాను' అని ఆయన చప్పుడు కాకుండా వెనకవేపు తలుపు తెరుచుకుని పెరట్లోకి వచ్చాడు. మెల్లిగా పెరటిగోడ దాటి, పక్కింటిని చుట్టుకొని వీధిలోకి వచ్చి గట్టిగా "ఎవడ్రా వాడు! లొత్తుకొడుకా! విన్నాహుతి తీసుకుంటాను" అని పొలికేక వేశాడు. నలుగురైదుగురు దిక్కుతెన్నూ తెలవకుండా అటూ ఇటూ పారిపోజొచ్చారు. వాళ్ళు భయంతో పడలెత్తిపోతూ వుండగానే ఆయన మరో పొలికేక వేసి ముందుకు దూసుకుని వెళ్ళి వాళ్ళల్లో ఒకణ్ణి పట్టుకున్నాడు. తతిమ్మా వాళ్ళు తప్పించుకుని వుడాయించాడు.

దొరికిన వాడి పేరు జుట్టుగ. కరణం శామణ్ణగారి పొలాన్ని చేసే పాలికాపువాడు. గుండెలు దీసిన బంటన్నది నిజమే కాని ఇప్పుడు పడలెత్తి వణికిపోతున్నాడు.

కంఠీజోస్యులంటే ఒక మహామారితో సమానం. వదిలిపెట్టిన వూళ్ళో మారెమ్మ వుండనే వుంటుందని వాడు ఆ నోటా ఈ నోటా విన్నాడు. చీకట్లో ఈ అర్ధరాత్రి తన సహచరులంతా పారిపోతే పొలికేక వేసుకుంటూ వచ్చి పట్టుకుని లోపింది మహామారయ్యో, కంఠీజోస్యులో! వాడికి ఖచ్చితంగా తెలియలేదు. కంఠీజోస్యులే అని స్పష్టంగా తెలిసి వున్నా ఆయన మహామారి కాదనే విశ్వాసం కలిగే పరిస్థితిలో లేదు.

"అయ్ య్ య్ య్యో న ...... న ...... నన్నొగ్గెయ్" అని దండం పెట్టాడు.

"ఎవరు నువ్వు? శామణ్ణ పంపించాడేంట్రా?"

"వూం!"

"ఇక్కడికి రావటానికెన్ని గుండెల్రా నీకు?"

"మీ ... మీరూళ్ళో వుండ్రని అన్నారు."

"నేనూళ్ళో లేకపోయినా నాయింటి మీద రాళ్ళు రువ్వే మగతనమెలా వచ్చిందిరా నీకు?"

"మువ్వెళ్లకపోతే పాలమివ్వనన్నారు?"

"తతిమ్మా వాళ్ళెవళ్ళురా"

"తిమ్మక్కింటి గిడ్డ, మ్యాగళకేరి గుళ్ళిగ, తలారి సిద్దూర."

"వాళ్ళకెలా ధైర్యమొచ్చింది?"

"లేకపోతే దరకాస్తెట్టుకున్న పోరంబోకు జమీను రాదన్నారు"

"సరే. నీ పెళ్ళాం తాడు తెగాలని నీకిష్టంగా వుందా?"

"బాబ్బాబు, అట్టా సెకండి."

"వాఇంటి మీద రాళ్ళు రువ్వి నువ్వేలా బతకాలనుకున్నావో చెప్పు."

జాట్టగ మరేం మాట్లాడకండా నుంచుండిపోయాడు. అప్పుడే వెళ్ళి కరణం శామణ్ణ షెడ్డుకు కిరసనాయిలు పోసి అంటించాలని జోస్యుల కనిపించింది. కాని ఆయన షెడ్డు దగ్గిరే తన తల్లీకూతురూ వున్న షెడ్డూ వుంది. మంటలటుమంచీ ఇటు పాకవచ్చునని ఆయన వదిలేశాడు. ఆ కుక్కకి బుద్ధి చెప్పాలంటే పట్టపగలే చెప్పాలి. రాత్రిపూట ఏదైనా చేస్తే వాడికి నాకూ తేడా ఏమిటి? అన్న ప్రశ్న కూడా కలిగింది. జాట్టగ అక్కడే చేతులు కట్టుకుని నుంచున్నాడు.

"మా షెడ్ వేపు వెళ్ళావట్రా?"

"లోపలికెల్లలేదు. దగ్గిరికెల్లాను."

"అమ్మగారెలా వున్నారు?"

"నంజమ్మ గోర్కి ఈయాల మద్దేన్నం ఆడకూతురు పుట్టిందట. పిల్లా, తల్లీ లచ్చనంగా వుండారంట."

ఈ మాట విని ఆయన మనస్సు కాస్త తృప్తి పడ్డది. రేపు వుదయమే అక్కడికెళ్ళి వాళ్లని చూసి రావాలి. అలాగే ఆ శామణ్ణ పంగతేమిటో చూడాలి అని నిశ్చయించి జాట్టగతో

"సరే నువ్వెళ్ళు" అన్నాడు.

కానీ వాడు వెళ్ళకండా అక్కడే నుంచున్నాడు. "ఏరా!" అని అడిగితే "ఒకణ్ణే ఎల్లటానికి బెదురుగా వుంది కూడా మీరూ వొచ్చి వొగ్గేయండి" అన్నాడు.

"వారేవా! తొత్తుకొడుకా! ఇక్కడికి రావటానికి జడుపు లేదు. ఇప్పుడు వెళ్ళరా అంటే తోడు కావాలా? నోరు మూసుకు వెడతావా వీపు తాట వొలిచెయ్యాలా?"

"లేదయ్యగోరూ వెడతాను" అని వాడు చకచకా పూరి బయటికి నడిచాడు. కాని సందులు గొందులు గడిచి, మారి మొత్తిన ఆ గ్రామం దాటి వెళ్ళాలంటే మున్నూరుడుగులైనా వెళ్ళాలి. ఏదో ధైర్యంతో కంఠీజోస్యం సందు దాటిన వాడు దూరం నుంచీ వున్నట్టుండి "అయ్యయ్యో" అని వికారంగా అరిచి పారిపోయేలా వినపడ్డది.

వీధి తలుపుకి లోపల నుంచీ గడియ వేసివందువల్ల జోస్యులు మళ్ళీ పెరటి గోడదాటి, దాన్ని చుట్టి వచ్చి దొడ్డి గుమ్మం ద్వారా, లోపలికెళ్ళి పడుకున్నాడు. కానీ వెంటనే నిద్ర పట్టలేదు. రేపు శామణ్ణకేం జేయాలి? అన్న రకరకాల ఆలోచనలు మెదడులో కదులుతున్నాయి. వాళ్ళ నాన్నగారి కాలం నుంచీ వాళ్ళకూ వీళ్ళకూ పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేది. కరణీకమంటే అంతఃపురం కొలువట! వాళ్ళు రాజప్రతినిధులట! శామణ్ణ తండ్రి నరసింహయ్య అలాగని చెప్పుకునేవాడు. ఈ బోడి వెధవా అదే మాటంటాడు. వాడిది అంతఃపురం నౌకరీ అయితే మాది ఆచార్యపదవి. ఇన్నాళ్ళూ వాళ్ళు వీళ్ళని ఏడిపించుకతిన్నారు. నాకాలానికది ఆగిపోయింది. యాయవారం చేసి పొట్టపోసుకుంటూ వాళ్ళు చెప్పినట్టు చేస్తే వాళ్ళకు మంచి. నాలాంటి మగపులి జోస్యులైతే వాళ్ళ ఆటలు సాగవు. కంఠీజోస్యులంటే ఏమనుకున్నారో! కంఠీ అంటే రణధీర కంఠీరవ అన్నమాట. ఆ అంతఃపుర నౌకర్లను పాలించే మిందభూపతి. రేపు చూపెడతాను ఆ లంజాకొడుకులకు అన్న ఆలోచనలతో వేకువజాములో నిద్రపట్టింది.

ఉదయం మెలకువ వచ్చేసరికి పది గంటలయింది. శామణ్ణ షెడ్డుకు వెళ్ళాలని లేచి పెరటివేపు వెళ్ళి వచ్చేసరికి ఇంటి ముందొక పోలీసు కానిస్టేబులు నుంచున్నాడు. సంగతేమని అడగ్గానే "మీ కొడుకు కల్లోలుకు ప్లేగు తగిలింది. ఎడమ చంకలో గడ్డ కట్టింది. మీరు వెంటనే రావాలి" అన్నాడు.

"ఆఁ ఎక్కడ?"

"బెళగొళలోనే వున్నాడు. ఇంకా తెలివిగానే వున్నాడు మిమ్మల్ని పిలుచుకరమ్మని దఫేదారుగారు పంపించారు. పల్లెబీటు కెల్లినప్పుడు అమ్మోరు తగిలింది కాబోలు ఎంటనే బయల్దేరండి."

మరింకేమీ మాట్లాడే అవకాశం లేదు. పెరట్లో కెళ్ళి అక్కడ కట్టి వుంచిన

ఆవును దూడను విప్పేసి వూరవతలికి తోలుకొని వెళ్ళి, ఎదురుపడ్డ మేడిలోటో "వీటిని మా షెడ్డుకు తోలు" అని చెప్పి పంపించేశాడు. ఇంటికి తాళం వేసి కానిస్టేబులును తనవెనకాలే కూర్చోబెట్టుకుని గుర్రమెక్కి శ్రవణ బెళగొళవేపు వేగంగా దౌడు తీయించాడు.

## 4

ఈసారి ప్లేగు నాగలాపురంలో ఎవరికీ తగలలేదు చుట్టుప్రక్కల ఎక్కడ చూసినా జనం వూళ్ళు వదిలి వెళ్ళారు. రామసంద్రం వాళ్ళు వూరొదిలి వెళ్ళినా ముగ్గిరికి తగిలింది. కడమ వూళ్ళల్లో కూడా కావలిసినంత మంది బలి అయ్యారు. అలా చూస్తే, నాగలాపురంలో అమ్మవారికి ఒక్క బలి కూడా లేదని చెప్పటానికి వీలులేదు. రాత్రివేళ కంఠీజోస్యుల ఇంటిమీద రాళ్ళు రువ్వటానికెళ్ళి దొరికిపోయిన జొట్టగ ఇంటికెళ్ళిన కాసేపటికి జ్వరంతో పడుకున్నాడు. తాను వూళ్ళోకి వెళ్ళినట్టూ తిరిగి వస్తుండగా ఒక సందులో వెనకనుంచీ ఎత్తుగా నల్లగా వున్న ఆడదొకటి తనమీద నల్లని చీరకొంగు కప్పినట్టయిందని వాడు పెళ్ళాంతో చెప్పాడు. జ్వరం క్షణాల మీద తీవ్రమై పోయింది. దిగనేలేదు. మరుసటిరోజు మధ్యాహ్నానికి వాడికి తెలివి తప్పింది. సాయంత్రానికి కాస్త స్పృహ వచ్చి వాడు "కంటయ్యదోస్యులు కాడికెళ్లి మంతరమేయించు" అని పెళ్ళాంతో చెప్పాడు. అది తన చిన్న మావని వూళ్ళోకి తరిమింది. ఇల్లు తాళమేసుంది. జోస్యులెక్కడి కెళ్ళారో ఏమో! మరుసటి రోజు మళ్ళీ చూసినా వేసిన తాళం వేసినట్టే వుంది. జొట్టగకు మళ్ళీ ఒకసారి తెలివి వచ్చింది. "దోస్యులొచ్చారా?" అని అడిగేడు. లేదని తెలియగానే కళ్ళు మూసుకున్నాడు. మూసిన కళ్ళు మళ్ళీ తెరవనే లేదు. రెండు రోజుల్లో శాశ్వతంగా కళ్ళు మూశాడు. వాడికి గడ్డలు కట్టాయో లేదో ఎవరూ చూడలేదు. అమ్మవారు తాకితే గడ్డలు కట్టిబొబ్బ కనపడాలి మరి. మొత్తానికి జొట్టగ పెళ్ళాం తాడు తెగింది. అది అలా అవకూడదనే కంఠీజోస్యుల ముందు వాడు దేబిరించాడు.

నంజమ్మకు ఆడపిల్ల పుట్టిందనీ. పిల్ల-బాలెంత సుఖంగా వున్నారనీ కంఠీకి తెలపమని అక్కమ్మ, పాలికాపు హొన్నణ్ణి పురుడొచ్చిన మరురోజు మధ్యాహ్నమే వూళ్ళోకి పంపింది. ఇంటికి తాళం వేశారని వాడొచ్చి చెప్పాడు. రాళ్ళు రువ్వడానికెళ్ళిన తిమ్మక్కింటి గిడ్డగాని, మ్యాగళకేరి గుళ్ళిగకానీ, తలారి సిద్దార

కానీ, ఎవళ్ళతోటీ తామూళ్ళోకెళ్ళిన వూసెత్తలేదు. అందుచేత ఆ విషయం అక్కమ్మ నంజమ్మలకు బొత్తిగా తెలియదు. అవునూ, దూడనీ షెడ్డుకు తోలేసి, కొడుకు ఎక్కడో సంచారానికి బయలుదేరాడనీ, ఇంకా రాలేదనీ అక్కమ్మ వూహించుకుంది. పురోహితులు పుట్టాభట్లు భార్య అక్కమ్మకు మరీ సన్నిహితమయింది. పుట్టాభట్లనే రామసంద్రానికెళ్ళి సమాచారం తెలిపి, బారసాలకి వచ్చేలా చెన్నిగరాయల్ని పిలిచి రమ్మని అక్కమ్మ అడిగింది. వదిలేసిన వూరి నుంచీ వెళ్ళచ్చో కూడదో అని ఆయన సందేహించగా, తడక కవతల పురుటి గదిలో పడుకున్న నంజమ్మే 'ఆ వూరూ వదిలేశారు. మా షెడ్డు కూడా వూరి ముందు అమ్మవారి గుడి వెనకాల మేడి చెట్టు దగ్గరే వుండమకుంటాను. మా తోటవున్నదీ అక్కడే మీరెళ్ళిరండి" అంది. పుట్టాభట్లు నాగలాపురానికి బయల్దేరాడు.

పదవరోజు చెన్నిగరాయలు బారసాలకు నడిచే వెళ్ళాడు. బండి కట్టుకుని, అప్పణ్యయ్యను సొతును కూడా తీసుకెళ్ళమ్మ కాని సొతు ఇప్పుడు కడుపుతో వుంది. వేవిళ్ళు, డోకులెడుతున్నాయి. కాని ఆవిడిప్పుడు గంగమ్మతోగానీ, మొగుడితోగానీ మాట్లాడటం లేదు. ఒక రోజు ఇద్దరినీ, తిరగబడి శుభ్రంగా దులిపేసింది. బావ తానై తాను ఆవిడతో ఎన్నడూ మాట్లాడింది లేదు. అందుచేత అతడొక్కడే నాగలాపురానికి బయలుదేరాడు.

పదకొండు గంటలకి అతడు మరళహళ్ళ దాటి బోళనగుడ్డ కట్టిగెహళ్ళి దాటి, హూవిన హళ్ళి చేరుకున్నాడు. పల్లె ముందరే చిన్న దుకాణంలో మాగిన 'రసబాళె' అరటిపళ్ళ గెల వేళ్ళాడగట్టారు. మూడణాలకి ఓ హస్తంలా మొత్తం మూడు హస్తాలు కొన్నాడు. రేపు బారసాలకి తాంబూలపు పళ్ళెంలో వుంచటానికవుతుందని మనసులో అనుకున్నాడు. దుకాణంలో ఒక డబ్బాలో వుంచిన పంచదార కంటపడింది. కాగితపు పొట్లంలో సేరున్నర కట్టించాడు. అన్నీ మూట కట్టుకుని మళ్ళీ బయల్దేరాడు.

రెండు మైళ్ళు నడిచాక అతడికో ఆలోచన తట్టింది. తనపెళ్ళాం బాలెంత. అంటే మూడు రోజులకోసారి తలంటి నీళ్ళోసుకోవటం, భోజనంలో ముద్దముద్దకీ చెరెడేసి నెయ్యి, ఘుమఘుమలాడే లేహ్యం – ఇవన్ని తిని సుఖంగా నిద్రపోవటం కదా! నాకు మాత్రమేమీ లేవు. మా ఆవిడ నాగలాపురానికి వెళ్ళాక నాకు నూనె రాచి నీళ్ళోసిన వాళ్ళే లేరు. చేతులూ కాళ్ళూ సలుపుతూ పట్టుకపోవూ! దాని నాయనమ్మ వుంది కదా ఆ ముసల్ది అక్కమ్మ. ఆవిడేమో మనుమరాలికి వేవిళ్ళని

అడిగి కోరింది చేసిపెట్టేదట. ఆ సంగతి పుల్టాభట్లే చెప్పాడుకదా నన్ను పిలవటానికి వచ్చినప్పుడు. కానీ నాకేమైనా పంపించారా! పోనీ ఇలాంటివి వండుతాం మవ్వూరా అని నన్నేమైనా పిలిచారా? వీళ్ళమర్యాద ఏడ్చినట్టే వుంది.

అతడిలా తర్కించుకుంటూ నడుస్తూ వుండగా దారిలో ఓపెద్ద రావిచెట్టు అగుపించింది దానికి పదిగజాల దూరంలో ఓ కోనేరుంది. తమకు తెలియకుండానే కరణంగారు చెట్టునీడలో మూటదించి కూర్చున్నారు. ఈ అరటి పళ్ళు పంచదారా అక్కడికెందుకు పట్టుకెళ్ళాలి? అన్నప్రశ్న మనస్సులో వుదయించగానే అరటిపళ్ళు బయటికి తీశాడు. పంచదార పొట్లంవిప్పి ముందుంచుకుని, ఒకటొకటే తొక్కతీసి పంచదారలో అద్దుకుని సగం నమిలీ నమలకముందే గుటుక్కుమనా మింగి, మరో పండు తొక్కతీసి పంచదారలో అద్దుతూ వచ్చాడు.

మొత్తం ముప్పై ఎనిమిది పళ్ళూ, సవాసేరు పంచదారా లోపలికి వెళ్ళాక పాపం దాహం వేసింది. కోనేట్లో నీళ్ళు తాగి వచ్చి, తెచ్చినమూట తలకడగా చేసుకుని పొయంత్రం దాకా నిద్రపోయాడు. మెలకువ వచ్చాక హడావుడిగా లేచి నాగలాపురం వేపు నడిచాడు. వాళ్ళషెడ్డు ఫలానా చోట అని పుల్టాభట్లు చెప్పటం వల్ల పోల్చుకోవటం కష్టంకాలేదు. అప్పటిదాకా అతడొస్తాడని నిరీక్షిస్తున్న అక్కమ్మ మధ్యాహ్నపు వంట చల్లారిపోయిందని వేడివేడిగా మళ్ళీ వంటచేయాలని లోపలికెళ్ళింది. షెడ్డులోనే బాలెంతకని కట్టిన గదిలో మంచంమీద పాపలోటి వంజమ్మ పడుకుని వుంది. చెన్నిగరాయలు తలుపుదగ్గిరికెళ్ళినప్పుడు ఆమె అడిగింది. "మధ్యాహ్నం మీకోసం చేసిన వంటంతా చల్లారిపోయింది. తిన్నగా వచ్చేయకుండా ఆ చెట్టు కింద ఎందుకు పడుకున్నారు?"

ఆ మాటలు విని చెన్నిగరాయల కాశ్చర్యం వేసింది. "అదెవడు చెప్పాడు నీకు?"

"హూ వివహాళ్ళ దుకాణం చెన్నయ్య మా పౌరోహిత్యంలోని వాడే. మీరు వాడి అంగట్లో మూడు హస్తాలు అరటిపళ్ళు, సవాసేరు పంచదార కొన్నాక, అంగడి పరుకులకని ఈ వూరికి బయల్దేరాడట! వచ్చేదారిలో మీరు రావిచెట్టు కింద పడుకున్నది చూశాడు. అరటిపళ్ళతొక్కలు పక్కలో పొగడ్డాయట!

"అలాగని చెప్పాడా వాడు? వాడమ్మని..." అనబోయేలోగా అతణ్ణి సగంలోనే ఆపి ఆమె అడిగింది. "ఆ అసభ్యపు మాటలెందుకూ? దారిలో ఆకలేసింది. పళ్ళుతిన్నారు. ఎవళ్ళూ చేయని పనా ఏమిటి? గబగబావచ్చి ఇంట్లో భోజనమే

చేసివుండకూడదా?"

అతడికేమి సమాధానం చెప్పాలో తోచలేదు చటుక్కున వరైన బూతుమాటకూడా స్ఫురించలేదు.

పుట్టాభట్లు, ఆయన భార్యా సహాయం చేయటంవల్ల అక్కమ్మ పదిమందిని భోజనానికి పిలిచే బారసాల చేయించింది. కరణం కామన్న ఇంటివాళ్ళుకూడా వచ్చారు. తొలిచూలు ఆడపిల్ల కావటంచేత దానికి నాయనమ్మ పేరుపెట్టాలి. కాని ఆవిడ బతికేవున్నందువల్ల పిలవటానికి సులువుగా వుండేలా, జన్మనక్షత్రానికి సరిపోయేలా, పార్వతి అని పేరుపెట్టారు. చెన్నిగరాయలు వారంరోజులక్కడేవుండి, అక్కమ్మ చేసిన వేడివేడి వంటలూ, ఆదరోపచారాలు అనుభవించాడు. బాలెంతకని తెచ్చిన కొబ్బెర, బెల్లం అతడినోటికి కూడా రుచిగా వున్నై. బాలింతే తమలపాకులకి సున్నం రాచి మడిచి ఇచ్చేది. మనవరాలి భర్తకు రకరకాలుగా వండివార్చాలని కోరికేమో ముసలమ్మకుంది కాని చేసే శక్తిమాత్రం లేదు. అవసరమైన వస్తువులు ధారాళంగా కొనటానికి చేతిలోడబ్బూలేదు. కొడుకు కంఠి ఎక్కడికెళ్ళాడో ఎవరికీ తెలియదు.

వంజమ్మ ఒకరోజు మొగుడితో "వూళ్ళో కరణీకంవుంది. మీరు రెవెన్యూ ఇన్స్పెక్టరుకు కూడా తెలపకుండా ఇక్కడే కూర్చుంటే ఎలాగ?" అంది.

"అవుతే ఆయనకో వుత్తరం వ్రాసిపడేయనా."

"వసూళ్లు చేయాలికదా మీరే వూళ్ళోవుండకపోతే దేవరసయ్యగారెంతకని చేయగలరు. ఇంతకీ వసూళ్ళు చేసే బాధ్యత మీది కదా? ఇప్పటికప్పుడే పదిహేనోపదహారో తేదీ కావచ్చింది. ఒకదుక్కి వర్షం కూడా పడిందాయె. వూళ్ళో పొలంసంగతి చూసుకోరాదూ?"

వూరికి బయలుదేరక తప్పలేదు. కరణం చెన్నిగరాయలు మరుసటి రోజు తిండి తిని, ముసలమ్మ చేసిన మావిడకాయ పులిహోరకట్టిన ఒకపొత్తిక వంచిలో వుంచుకుని బయలురేరాడు. అతడువెళ్ళాక అక్కమ్మ అంది. "వంజీ మీ ఆయన చంటిపిల్ల నొకసారైనా ఎత్తుకోలేదా? ఆడపిల్ల అని వుషేక్షా?"

వంజమ్మ బదులు చెప్పలేదు. ఆమె కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. మగపిల్లాడైనా ఇంతే. ఎత్తుకుని వుండేవారు కాదు. అవి నాలిక చివరి–దాకా వచ్చినా ఆపుకుంది. బామ్మమాట తనకు వినిపించలేదన్నట్టుగా వూరుకుండిపోయి కన్నీళ్ళు తుడుచుకుంది.

## 5

కంఠీ జోస్యులు వచ్చేసరికి కల్లేశుని చంకలోని గడ్డవాచి, పెద్దదై చాలానొప్పిగా వుంది. గవర్నమెంటు ఆసుపత్రి డాక్టరు మందిచ్చాడు. దీనికి పెద్ద డాక్టరయితే మంచిది. కానీ రోగిని ఇలాంటి పరిస్థితిలో తీసుకెళ్ళటం కష్టం. నాచేతనయింది నేను చేస్తాను" అన్నారు. జోస్యులు వెళ్ళగానే బాధ్యతంతా తానే తీసుకుని దఫేదారువడిగారు. "మీ రొక వాన్ ఇప్పించండి. నేను హాసనకు తీసుకెడతాను."

దఫేదారు చన్నరాయపట్టణానికెళ్ళి తెచ్చిన వ్యాన్‌లో కల్లేశుని పడుకోబెట్టి హాసనకు చేర్చారు. దారిలో అతడు చనిపోయినా చనిపోయుండవచ్చు. కానీ చావలేదు. పెద్దాసుపత్రిలో చేర్చుకున్నారు. కల్లేశుని మావయ్య రంగణ్ణగారు గడచిన పాతికేళ్ళగా ఆవూళ్ళో పోస్టుమాన్‌గా పనిచేస్తున్నాడు. ఆయనకు పెద్దాసుపత్రి డాక్టర్ గారితో పరిచయముంది. డాక్టరుగారు తమకు సాధ్యమయిన ప్రయత్నం చేశారు. చంకలో గడ్డకోసి చీమూ, కుళ్ళిపోయిన భాగమూ తీసేసి మందువేసి కట్టుకట్టారు. ప్రాణానికి భయం లేదనిపించింది. అతడు బాగానీరసించి పోయాడు. ఇంకాపదిహేను రోజులానుపత్రిలోవుండనీ అని డాక్టరు చెప్పారు. అందాకా కంఠీజోస్యులు రంగణ్ణగారింట్లోనేవుండి కొడుకును చూసుకున్నాడు.

ఆసుపత్రినుంచి విడుదలయ్యేరోజువచ్చినా అతని ఎడమచెయ్యి ఇంకా స్వాధీనానికి రాలేదు. గడ్డ ఏర్పడిం దాచంకలోనే. అతడి వూళ్ళోనే వుండనీ, మందివ్వాలి అని డాక్టరు చెప్పారు. రంగణ్ణగారు అల్లుణ్ణి తమ ఇంటికి తీసుకెళ్ళారు. వారం రోజులయ్యాక కంఠీజోస్యులు గుర్రమెక్కి వూరికి బయల్దేరాడు. గడచిన ఇరవై, ఇరవైఅయిదురోజులుగా బాగా నలిగిపోయిందెవరంటే జోస్యుల గుర్రం. రంగణ్ణగారింట్లో జోస్యులకేమో తిండితీర్థం జరిగిపోయింది. హాసనపట్టణంలో పోస్టుమాన్ రంగణ్ణగారింట్లో కంఠీజోస్యులు తినే ప్రమాణంలో పాలూ నెయ్యీ లభించకపోయినా కడుపునిండా తినడానికి లోపంలేదు. కానీ ఆయన తెల్లగుర్రానికి మేత ఎక్కడ తేగలరు?

ఆయన తిరిగి వచ్చేసరికి ప్లేగు లక్షణాలన్నీ పోయి, ఆ ప్రాంతంలో రెండు దుక్కులవర్షం పడ్డది. నాగలాపురం జనం షెడ్లు వదిలి వూళ్ళో ప్రవేశించారు. కల్లేశుకు ప్లేగు తగలడమూ, అతణ్ణి హాసనకు తీసుకెళ్ళి నయంచేయించడమూ,

కంఠి అక్కడే వుండటమూ, అక్కమ్మ నంజమ్మలకి ఏవో గాలివార్తలవల్ల తెలిసింది. వూళ్ళోకెళ్ళడానికి కొడుకు కోసమని కబిపెట్టుక్కూర్చుంటే తెమిలే వ్యవహారం కాదు. వాళ్ళ పాలికాపులున్నారు. పుట్టాభట్లున్నారు. వాళ్ళ సహాయంతో తానే షెడ్డునుంచీ సామానుసాగించి, బాలెంతను పిల్లను ఇంటికి తీసుకెళ్ళాలని నిశ్చయించి అక్కమ్మ తానుముందుగా ఇంటికెళ్ళి, కంసాలినిపిలిపించి, తలుపుతాళం విరగ్గొట్టించి, లోపలికెళ్ళి చూసిందికదా! వర్షం నీళ్ళు లోపలంతా కురిసి నేలంతా బురదై, అడుగువేస్తే కిచపిచమంటోంది. అటకమీదున్న డబ్బాల మీదంతా నీళ్ళుకారి, అవి ఇంకా ఆరక తడిగానే వున్నాయి. ఇవన్నీ, తుంటరులెవళ్ళో ఇంటిమీద రాళ్ళురువ్వారన్న సంగతి చెప్పకుండానే చెబుతున్నాయి. ఎవరు చేశారని ఆరాతీస్తూ కూర్చునే వ్యవధి లేదు. పాలికాపు హొన్నడు నిచ్చెన వేసుకుని అటకెక్కి కిందనుంచే పెంకులటూ ఇటూ సర్ది బావుచేశాడు. గాలికి నేల ఆరాలని రెండు వేపుల తలుపులు తెరిచి వుంచారు. అయినా కొత్తమట్టి ఇసుకావేసి దిమ్మిసా చేయక తప్పలేదు. మొత్తానికి ఇరుగుపొరుగువాళ్ళకంటే నాలుగురోజు లాలస్యంగా అక్కమ్మ బాలెంతతోటి, చంటిపిల్లతోటి ఇంట్లో ప్రవేశించింది. నంజమ్మ పురుడోసుకుని నెలరోజులయింది. లేచి పనిలో ఏదైనా సహాయం చేస్తానన్నా అక్కమ్మ ఒప్పుకోలేదు. ఇల్లు తుడవటం, బూజు దులపటం, మొదలుకొని పాలుపితికేదాకా అన్నిపనులూ ఆవిడే చేసుకుపోతోంది.

వాళ్ళింటికి వచ్చిన నాల్గవరోజు మధ్యాహ్నం మూడుగంటలకి కంఠీజోస్యులు గుర్రంమీద ఇంటికి వచ్చాడు. కల్లేశుని క్షేమసమాచారం, అక్కమ్మకూ నంజమ్మకూ చెప్పాక, ఆయన దృష్టి నేలమీది కెళ్ళింది. "ఇదేం! నేల కొత్తగా దిమ్మిసా చేయించారు? దేనికి?"

"చూడు నాయనా! ఇంటిమీదికెవళ్ళయినా రాళ్ళురువ్వారో, లేదా గద్దలేమైనా కూర్చుని పెంకులు కదిపాయోగాని, వర్షం నీళ్ళన్నీ లోపలకురిసి నేలంతా బాడిబంద అయిపోయింది. లోపల కాలెట్టడానికి కూడా వీల్లేదు. హొన్నడితో మట్టీ అదీ వేయించి దిమ్మిసాచేయించి ఆతరువాత సామాను సాగించాము."

"వీడమ్మను మాదిగాడు .... చేస్తాను భాడ్‌కోవు నాకొడుక్కి" అంటూ కంఠీజోస్యులు బయటికి వెళ్ళాడు. ఎందుకో అక్కమ్మకుగాని నంజమ్మకుగాని తెలియలేదు.

మధ్యాహ్నం భోజనాలయ్యాక కరణం శామణ్ణగారింటి పెద్దపంచటరుగు మీద

కొంతమంది వూరిపెద్దలు పొగె సాయంత్రందాకా పాచికలాడటం అలవాటు. అంతపొద్దులో శామణ్ణ అక్కడే వుంటాడని కంఠీజోస్యులకు తెలుసు. ఆయన తిన్నగా వెళ్ళి అరుగెక్కినుంచుని అడిగాడు:

"రాత్రిపూట నాయింటిమీద రాళ్ళురువ్విస్తావ్రా దగా కోరు నా కొడుకా! మగతనముంటే పగలురావాలి. అదీ అందరూ వున్న వూళ్ళోరావాలి. వురేయ్! నేనంటే ఏమనుకున్నావు? మగాణ్ణి; మీ అమ్మకి రంకుమొగుణ్ణి అనుకో భాంచోత్."

తలవని తలంపుగా అతని రాకవల్లేకాక, ఆ రీతిగా అవిరీక్షితమైన యుద్ధప్రకటన వల్లకూడా పాచికలాడుతున్న వాళ్ళంతా నిర్ఘాంత పడిపోవటమేకాక, శామణ్ణకూడా కంగారుపడ్డాడు. కంఠీజోస్యులు తిన్నగా శామణ్ణ ఇంటిలోదూరి, తలుపువెనకాల, రోటిదగ్గిర గోడకానించి వుంచిన రోకలొకటి కుడిచేతపుచ్చుకున్నాడు. అటకకు చేరవేసిన వెదురునిచ్చెన ఎడమచేత్తో పుచ్చుకుని బయటికి వచ్చినిచ్చెన మూరుకుజేరవేసి, పెంకులమీదికెక్కి, రోకటితో పెంకులన్నీ చిందరవందరగా ఎగిరిపోయేలా చితకబాదటం మొదలెట్టాడు. రెండునిమిషాలలో వాళ్ళు పాచికలాడుతున్న అంకణంమీది పెంకంతా ముక్కలు చెక్కలై, అతడింకా పైకెక్కాడు.

వీధి అరుగుమీది పెంకులమీదరోకలిపోయి పడ్డదోలేదో పాచికలాడే పెద్దమనుషులందరూ గభీమని వీధిలోకి దూకేశారు. భీముడిలా నుంచున్న కంఠీజోస్యులు ఒకసారి అటుచూసి "వురేయ్ పేడిముండాకొడుకుల్లారా! అక్కడేవుండండి మీ పెళ్ళాల బుర్రలు గీయించి తాళ్ళు తెంచేస్తాను." అని గర్జిస్తూ రెండు పెంకులూ లాగి రంయ్‌మని వాళ్ళవేపు విసిరేవరికి ఒకడికి మాడుపగిలి, మరొకటికి భుజంచెక్కుకుపోయి నెత్తురు చిమ్మింది. జనం చెల్లాచెదరైపోయారు. తానే పైకెక్కి కంఠీజోస్యుల తలతిక్క దించాలన్నవూహ శామణ్ణకు కలుగకపోలేదు. అతడుకూడా అంతో ఇంతో పెంకితనంవున్నవాడే. కానీ పైకెక్కడం ప్రమాదమని తన మనస్సు చెప్పడమే కాక, మరో వుపాయమేదో అన్వేషించిందికూడ.

సుమారు పదివేల పెంకులు తయారుచేయటానికి కుమ్మరాడికెంతకాలం పడుతుందోగాని కంఠీజోస్యుల గుదియపెట్టుకి అర్ధగంటలోపలే ఇంటికప్పంతా చితికి పోయింది. తరువాత నెమ్మదిగా దిగి వచ్చిన జోస్యులు రోకలీ, నిచ్చెనా యథాస్థానాలలో వుంచేసి బయటికి వచ్చాడు. భయంతో వీధిలోకి వచ్చి ఎదరింటి అరుగుమీద బిక్కుబిక్కుమంటూ తన పిల్లలతోటినుంచున్న శామణ్ణ భార్య ఎదరనుంచుని 'చూడమ్మా! నువ్వు తూచినకెరెతమ్మయ్య జోస్యుల

కూతురవని వీటో చెబుతున్నాను. తమ్మయ్యగారు నాకు గురుపమానులు. పదిలేపిన వూళ్ళో వేహాకణ్ణే వున్నానని నీమొగు డర్ధరాత్రివేళ జవాన్ని పంపి ఇంటిమీద రాళ్ళు రువ్వించాడు. కానీ నేను చూడు. పట్టపగలు వచ్చి పగతీర్చుకున్నాను. కంఠీ అంటే మగాడు. ఇక మీదటైనా గాజులు తొడుక్కున్న శిఖండి పనులు మానేసి మగాడు చేసేలా పనులు చేయమని నీ మొగుడితో చెప్పు. ఆ రంకుమొగుళ్ళకి పుట్టినతొత్తుకొడుకుతో నేను మాట్లాడను" అని చెప్పి తన ఇంటికి తాను వెళ్ళిపోయాడు. కామణ్ణ భార్య బెంబేలుపడి నుంచుండిపోయింది.

తిన్నగా ఇంటికెళ్ళిన కంఠీజోస్యులు పంటింట్లోకి వెళ్ళాడు. అప్పటికే అత్తెసరుపెట్టి అక్కమ్మ పొయ్యిమీద పడేసిన ఎర్రటి 'చెన్నంగి' బియ్యపు అన్నపు తప్పేలా కుతకుతలాడి పోతోంది. పొరుగింటి పులుసు కలాయిచేసిన ఒకగిన్నెలోవుంది. జోస్యులు పెరట్లో కెళ్ళి రెండు బిందెలనీళ్ళు నెత్తిమీద దిమ్మరించుకుని స్నానంచేశాడు. ఒళ్ళు తుడుచుకుంటూనే తన కంచుకంఠంతో గట్టిగా సంధ్యావందనపు మంత్రాలు చెబుతూ ధోవతి కట్టుకున్నాడు. దేవుడిగూటిలో వున్న మేధావి బొట్టుతీసి చాది నుదుటికి పెట్టుకుని, వేళ్ళుకడుక్కుని భోజనానికి కూర్చున్నాడు. సేరుబియ్యమన్నం తయారై వేడివేడిగా సిద్ధంగావుంది. ఆవునెయ్యి బాలెంతకుకాగా మిగిలింది వుండనేవుంది! మొదట ఆకునిండా పులుసుతో కలుపుకున్న అన్నం మూడే నిముషాలలో ముగిశాక, నూనె పోసుకుని వూరగాయతో కలుపుకుంటూ "ఆవిచ్చేపాలు నెయ్యీ అవీ అమ్మాయికి సరిపోతున్నాయా?" అని అడగాడు తల్లిని.

"లక్షణంగా పరిపోతున్నాయి. ఇంకా ముంతెడునెయ్యిదాచే వుంచాను."

"మరీ మంచిది. అమ్మాయత్తారింటి కెళ్ళేసరికి మరినాలుగు వీసెలు నెయ్యి పోగుచేసి పంపించు. సుఖంగా భోంచేయనీ. చిట్టాముదాలు పండించావా? పెద్దాముదాలు పండించావా?"

"ఇంకాపచ్చిబాలెంత, చిట్టాముదంతో ఎవరు నీళ్ళోస్తారు? జలుబు చేస్తుంది."

"సరే - బారసాలయిందా?"

"వూం; చెన్నిగరాయుడొచ్చాడు. పార్వతి అవిపేరెట్టాం."

పెరుగన్నంతిని ముగించి గట్టిగాతేన్చుకుంటూ ఆయన బాలెంత పడుకున్న గదికెళ్ళి "నంజీ! నీ పాపనిలాతే చూద్దాం" అన్నాడు.

చంటిపిల్లవెత్తుకుని తొడమీద పడుకోబెట్టుకుంటూ ఆయన గడపమీదే

కూర్చున్నాడు. పిల్ల తెల్లగా ఒళ్ళుచేసి బొద్దుగా చురుగ్గా వుంది. "ఇదీ నీలాగే వుందమ్మాయ్. చూడు నుదురెంత పెద్దదో! నక్షత్రమేమన్నారు?"

"పుట్టాభట్లు అదేదో చెప్పారు. జాతకం మీరొచ్చాక మీరేరాయాలనీ - ఆయన నాకంటే బాగా రాస్తారనీ" అన్నారు.

"సరే రేపు జ్ఞాపకం చేయి. పుట్టిన టైము సరిగ్గావేసి వుంచారా? ఏదీ వాక్కు కాస్త తాంబూలమివ్వు, తెల్లారినుంచీ పొగాకే వేసుకోలేదు" అని చంటిపిల్లను ఎత్తుకునే వంటింట్లో కెళ్ళి "అమ్మా! కారం లేహ్యం-వీటి కంతా డబ్బుకేంజేశావు? నాకివన్నీ జ్ఞాపకమేరాలేదుసుమా! ఆగాగు. అంటూ బయటికివచ్చి తనకోటు జేబునుంచి ముప్ఫైరూపాయలు తీసిచ్చి "ఎక్కడైనా అప్పోగిప్పో చేసివుంటే ఇచ్చేసెయ్. ఇహనేనూళ్ళోనే వుంటాను. మరో ఇరవై రోజులయ్యాక పోసనకెళ్ళి కల్లేటుకి నయమైతే తీసుకరావాలి" అన్నాడు.

కూతురుచుట్టి ఇచ్చిన తమలపాకులు వేసుకుని, చంటిపిల్లను ఆమె తొడమీద పడుకోబెట్టి, ఎడమ చేతిలో రెండుతుంపులు పొగాకు వేసుకుని కుడిచేతి బొటనవేలితో కుర్దినలిపి, నోట్లో వేసుకుని, అయిదారుసార్లు బయటికెళ్ళి వీధిలో తుపుక్కున వుమ్మేసి వచ్చాక ఒక చాపపరుచుకుని, తలకిందో పీటబెట్టుగుని చిన్న కునుకు తీశాడు. సాయంత్రంలేచి పొలంవేపు వెళ్ళొచ్చి రాత్రి వేడివేడి అన్నం పులుసు 'రాగిముద్ద' భోంచేసి వెచ్చగా హాయిగా పడుకున్నాడు.

## 6

అర్ధరాత్రివేళ ఎవరో వీధి తలుపు తట్టినట్టయింది. 'ఎవడ్రావాడు'? అని కంఠీజోస్యులే మెలకువవచ్చి అడగ్గా వచ్చిన సమాధానం ఆయన్ని కొంత చకితుణ్ణిచేసింది. "మీ అత్తారింటి వాళ్ళం. నోరుమూసుకుని తలుపు తీయండి ముందు."

అదెవడ్రా! బుద్ధి స్వాధీనంలో లేదా హైవాన్ అని కోపంగా గడియతీసి, తలుపు తెరిచి చూసేసరికల్లా నలుగురు పోలీసులు ముందుకు చొచ్చుకుని పోయి, ఆయన జబ్బలుగట్టిగా పట్టుకున్నారు. విదిలించుకున్నా వదలలేదు. దఫేదారొక ఈల వేశాడు. పెరటివేపు తలుపు దగ్గిర నుంచున్న ఇద్దరుపోలీసులు ఇల్లు చుట్టుకుని వచ్చి వాళ్ళని కలుసుకున్నారు.

"ఎందుకండీ ఏంజేశానని నన్ను పట్టుకున్నారు? మీకేం అధారిటీ వుండి?" అని

ఆయన అడగ్గా. దఫేదారు "మీరేమైనా అడగదలిస్తే స్టేషన్‌లో అడుగుదురుగాని రండి" అని బయల్దేరాడు: అంతలో మెలకువవచ్చి అక్కమ్మ, నంజమ్మ ఏడవటం మొదలెట్టారు. కంఠీజోస్యులే "అమ్మా! ఏడవకు. ఆ నాకొడుకు శామణ్ణగాడికుట్ర అనిపిస్తోంది. నేను చన్నరాయపట్టణందాకా వెళ్ళొస్తాను. మీరు తలుపేసుకోండి. నేను లేనప్పుడింటిదగ్గిరి కెవడైనా వెఱ్ఱికుక్కవస్తే చీపురుచ్చుగుని కొట్టిపంపండి" అని చెప్పి వాళ్ళతో వెళ్ళిపోయాడు. పూరిబయట పోలీసువాన్ ఆపివుంది. దానిలో కూర్చోబెట్టుకుని పోలీసువాళ్ళు చన్నరాయపట్టణానికి వెళ్ళారు. శామణ్ణ వూళ్ళోనే వుండిపోయాడు.

కొడుకెళ్ళి శామణ్ణ ఇంటి పెంకంతా చితగ్గొట్టిన సంగతి సాయంత్రం మతడు పొలంవేపు వెళ్ళినప్పుడు అక్కమ్మ చెవిలోపడ్డది. దానికి కారణమూ తెలిసింది. ఇలా పోలీసుల్ని పిలిపించి శామణ్ణ తనకొడుకుని పట్టించాడని అక్కమ్మకు మహాచెడ్డకోపం వచ్చింది. రాత్రి తానొక్కతే శామణ్ణ ఇంటిదాకా వెళ్ళి గుమ్మానికెదురుగా వీధిలో మంచుని మట్టిపోగుచేసి, దోసిళ్ళతో దుమ్మెత్తి పోస్తూ తిట్టడానికి మొదలెట్టింది. "నీ నోట్లో పుండుపుట్టా పెంటివెధవా! రాత్రిపూట మా ఇంటిమీదికి రాళ్ళురువ్వమని పంపావట్రా పిరికి ముండాకొడుకా! అంచేతే పట్టపగలొచ్చి నాకొడుకు నీ ఇంటి పెంకులు చితగ్గొట్టాడు. భయపడి పోలీసోళ్ళకాళ్ళట్టుగున్నావా? నీవేం గాజులు తొడుక్కున్నావా? నీ వంశం నిర్వంశంగానూ, నీపిల్లలణగారిపోనూ, నీపెళ్ళామ్ముండామొయ్యా! లంజాకొడుకా! నే నయ్యానికదా అలా తలగొరిగించుకుని ఎఱ్ఱచీరకట్టుకుని నీ పెళ్ళామూ ఇలాగే అఘోరిస్తుంది చూడుకావలిస్తే , ముసలిముండ శాపమంటే ఏమనుకున్నావ్?"

ఇంతలో ఇరుగుపొరుగు వాళ్ళెందరో లేచివచ్చి ఈ విడ్డూరం చూస్తూ నుంచుండిపోయారు. అందరికీ జరిగిన విషయం తెలిసిపోయింది. ఎవరూ కిమ్మనలేదు. శామణ్ణ తలుపుతీయలేదు. నంజమ్మ ఒక్కర్తే చంటిపిల్లతో వుందని జ్ఞాపకం వచ్చి అక్కమ్మ మరో పది శాపనార్థాలుపెట్టి ఇంటికి వెళ్ళిపోయింది.

చన్నరాయపట్టణం పోలీసుస్టేషన్‌కు వెళ్ళినప్పుడు రాత్రి ఇక్కడే వుండండి; "తెల్లారి ఇన్స్‌పెక్టర్ వచ్చాక మీ స్టేటుమెంటు తీసుకుంటారు అని దఫేదారు చెబితే కంఠీజోస్యులు ఒప్పుకోలేదు" ఆయన్ను ఇప్పుడే పిలిపించండి. తీసుకునేదేదో తీసుకోనీ. "మీ స్టేషన్‌లో పడివుండటానికి నేనేం నేరం చేయలేదు" అని కాస్త జబర్దస్తీగా దబాయించాడు. కొట్టినోరుమూయించడానికి పోలీసులకి భయం.

అయిన్ని గురించిన భోగట్టా చాలానే విన్నారు. సబ్‌ఇన్స్పెక్టర్ అప్పుడే వచ్చాడు. శామణ్ణ కరణం; అంటే ప్రభుత్వాధికారి. ఆయన ఇంటి పెంకుల్ని చితగ్గొట్టడమేకాక, లోపలికిదూరి, కరణీకపు లెక్కలపుస్తకాలెత్తుకపోయాడన్నది వాది చేసిన ఫిర్యాదు. పెంకులు చితకబాదించాడంటే పోలీసులు తత్‌క్షణం చర్యతీసుకునేవారోలేదో కానీ, ప్రభుత్వపు లెక్కలపుస్తకాలు అపహరించాడన్న అభియోగం వల్ల అరెస్ట్ చేయడానికి వీలులేక పోయింది. ఈ నేరారోపణ చేస్తూ ఇచ్చిన అర్జీ ప్రతిని శామణ్ణ తాసిల్దారుకు కూడా సమర్పించుకున్నాడు.

"నాకేమీ తెలియదు. నేనతనింటికెళ్ళనేలేదు. ఇదంతా అబద్ధం" అని కంఠీజోస్యులు స్టేటుమెంటిచ్చాడు. మరుసటిరోజు స్థానిక మేజస్ట్రేటయిన తాసిల్దారు దగ్గరకూడా అదే స్టేటుమెంటు ఇచ్చాడు. పోలీసువాళ్ళు ఆయన మీద కేసునమోదు చేసుకున్నారు. స్థానిక మునిసిపాలిటి మెంబరు హనుమంతశెట్టి జామీను పడటంవల్ల కంఠీజోస్యులను పోలీసువశం నుంచి విడుదలచేశారు. వూరికి వచ్చిన ఆయన మీసం మెలివేస్తూ అన్ని వీధులూ ఒకసారి తిరిగి మరీ ఇంటికి వెళ్ళాడు.

శామణ్ణను జుట్టుపట్టుకుని వంచి చావబాదాలని ముక్కుదాకా కోపమేమోవచ్చింది కాని తనమీద కేసున్నప్పుడది మంచిదికాదనే విచక్షణ అడ్డుతగిలింది. కొన్ని రోజులకి హొళెనరసీపురం కోర్టు సమన్సు వచ్చాయి. సుప్రద్ధులైన ప్లీడరు వెంకటరావుగారిని తన వకీలుగా పెట్టుకున్నాడు. మూణ్ణెల్లు కంఠీజోస్యులు హొళెనరసీపురానికి, హసనకు చాలాసార్లు తిరిగాడు.

సాక్షి విచారణరోజు ఆయన వెళ్ళి లాయరును చూడాలని తమవూరినుంచి రాత్రి గుర్రంమీద బలల్దేరి చన్నరాయపట్టణాన్నిదాటి రేవుదగ్గిరికి వచ్చేసరికి వాగు పరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తోంది. అది అకాలప్రవాహం. ఎలాగైనా వాగుదాటి తెల్లారేసరికి నరసీపురం చేరుకోకతప్పదు. అప్పటికే అర్ధరాత్రయింది. వెన్నెట్లో హోరుమంటూ పెద్దమోతతో వాగురెండుగట్లూ ఒరిసి ప్రవహిస్తోంది. ఇహ గుర్రంమీద వెళ్ళడం సాధ్యంకాదు. వాగు గట్టుమీదేవున్న రహదారి బంగళాకు వెళ్ళి బంట్రోతును లేపి అడిగితే "రెండురోజులుగా అరిగోలు గూడా వెయ్యటంలేదు. దీని దుంపదెగ తెరిపిచ్చేదాకా వద్దు బాబూ" అన్నాడు. కాని జోస్యులు ఆగిపోవటానికి లేదు. వెండిరూపాయలున్న "అమ్మణ్ణి" సంచి నడుముకు బిగించి కట్టాడు. విప్పిన కోటూ, చొక్కా, లాగూ మూటకట్టి తువ్వాలుతో తలమీద కట్టుకున్నాడు.

లంగ్రోతు వద్దంటున్నా రేవుకు కొస్త పైకెళ్ళి ప్రవహంలో ఈదుతూవెళ్ళాడు.

సుమారు అర్ధమైలు దిగువగా వాగు అవతలిగట్టు అందుకున్నాడు. పెట్టుకున్న గోచీ, ఒళ్ళుమాత్రమే తడిగా వున్నాయి. తలకు చుట్టుకున్న గుడ్డలు కొద్దిగాతడిశాయి. అలాగే అర్ధమైలు నడిచేసరికి ఒళ్ళంతా ఆరిపోయింది. లాగుచొక్కా తొడుక్కుని వేసుకుని వట్టి కాళ్ళతోముందుకు సాగిపోయాడు. వున్నది ఎనిమిది మైళ్ళదూరమే. కోడికూసేవేళకి నరసాపురం వచ్చింది. ఏటిగట్టుకెళ్ళి ప్రాతిర్విధులు పూర్తిచేసుకుని, స్నానం చేసి, సంధ్యావందనం ముగించి, తెల్లారేసరికి లాయరింటికి వెళ్ళాడు.

ఆరోజు ఇద్దరు ముఖ్యమైన సాక్షులవిచారణ జరగాలి. అందులో ఒకటి శామణ్ణ భార్య సాక్ష్యం. కోర్టుకెదురుగావున్న బావన్నను ఆమె చేత్తో తాకించి ప్రమాణం చేయించి అబద్ధమాడితే భర్తాపిల్లలూ చస్తారని ప్లీడరన్నప్పుడు ఆమె కక్కమ్మ అన్నమాటలు జ్ఞాపకానికి వచ్చి సగం ఏడుపేవచ్చింది. "కంటయ్యజోస్యులు మా ఇంట్లోకి దూరి రోకలుచ్చుగుని పెంకులేమో చితగ్గొట్టారు. పూరొదిలినప్పుడు మా ఇంటాయన జుట్టగ, గుళ్ళగ, పిద్దూరలనిపంపి కంటయ్యగారింటి మీద రాళ్ళురువ్వించేరు. దాని కలాచేశారుట."

అక్కడేవున్న శామణ్ణ పెళ్ళాన్ని మింగేలా చూశాడు. జోస్యుల లాయరామెనడిగాడు! "అమ్మా! నిజం చెప్పండి. దేవుడి మీద ప్రమాణం చేశారు. జోస్యులు మీ ఇంట్లోదూరి కరణీకపు లెక్కలపుస్తకాలను ఎత్తుకుపోవడమబద్ధంకదా?"

"లెక్కలపుస్తకాలేవీ ఎత్తుకుపోలేదు. వేనక్కడేవున్నాము."

వూరికి వెళ్ళాక శామణ్ణ పెళ్ళాన్ని ఎముకలు విరిగేలా తన్నాడట!

శ్రవణ బెళగొళదఫేదారుగారు జోస్యులపరంగా, "ఆ సంఘటన రోజు మధ్యాహ్నం మూడుగంటల సమయంలో, తాను పొసనకు వెళ్ళినట్టూ, కంఠీజోస్యులవక్కడ చూసి పల్కరించి" నట్టూ సాక్షమిచ్చారు. ఆయన తమ ఇంట్లో దూరి కరణీకపు లెక్కలపుస్తకాలు దొంగతనం చేసింది పెంకులు చితకబాదిందీ ఆరోజు మధ్యాహ్నం మూడుగంటలేనని శామణ్ణ చేసిన ఫిర్యాదు.

తీర్పు చెప్పేరోజు శామణ్ణకూడా వచ్చాడు. కంఠీజోస్యులూ వచ్చాడు. ఒంటిగంటకు సరిగ్గా జడ్జి తీర్పు చదివారు. కరణీకపు పుస్తకాలను చేత్తో కూడా తాకలేదని వాది భార్యే చెప్పింది. ప్రతివాది ఇంటిమీద వాది రాత్రిపూట రాళ్ళు రువ్వించాడట! దానికి ప్రతీకారంగా ప్రతివాది వీరింటి పెంకులు చితగ్గొట్టి

వుండవచ్చును. కాని ముఖ్యమైన ఆపాదన ఏమంటే ప్రభుత్వపు లెక్కల పుస్తకాలను ప్రతివాది అపహరించాడన్నదే. ఈ సంఘటన జరిగిందని ఆపాదించిన సమయంలో ప్రతివాదిని హాసనలో చూసి పలకరించినట్లు శ్రవణ బెళగొళ దఫేదారు సాక్ష్యముంది. ఈ అన్ని అంశాలు సాకల్యంగా పరిశీలిస్తే నేరారోపణలో బలంలేదని తెలుస్తోంది. వీరిద్దరికీ పరస్పరం ద్వేషముండి చిన్న చిన్న కలహాలేమో వచ్చి వుండవచ్చును. ఈ కేసును కొట్టివేయడమైనది.

## 7

తన లాయరు కివ్వాలని కంఠీజోస్యులు యాభైరూపాయలుతెచ్చారు. ఆ డబ్బు ఇంటికెళ్ళిఇవ్వాలి. లాయరుగారు కోర్టు ఆఫీసులో ఏదో పనివుంది చూసుకుంటున్నారు. ఇంతలో వెళ్ళి భోంచేసి వస్తానని చెప్పి, కోర్టు ఆవరణందాటి వచ్చి, బయట చెట్టుకు కట్టేసిన గుర్రమెక్కి ఒక ఫర్లాంగు ముందుకు వెళ్ళాడోలేదో శామణ్ణ అదేదారిలో ఒంటరిగా వెడుతున్నది చూశాడు. హఠాత్తుగా, పట్టరానికోపం ఒళ్ళెరగని కోపం అతణ్ణి వున్మత్తుణ్ణిచేశాయి.

"వురేయ్! నీయమ్మా ... వురేయ్! ఏం పెరుక్కున్నావురా కోర్టుకెళ్ళి?" అని గుర్రం దిగి అతని ముందుకొచ్చి కుడికాలుబూటు వూడదీసి దాంతో అతని నెత్తిమీద, ముఖంమీద టపీ టపీమని వాయించాడు. శామణ్ణకూడా కలియబడ్డాడు. జోస్యులు తన బలమంతా వుపయోగించి, అతని మెడవంచి వీపుమీద గుద్దిన గుద్దుకు అతడు బోర్లా పడటమేకాక నోట్లోనించీ రక్తం కారి తెలివితప్పింది. అంతవరకు కంఠీజోస్యులకు, ఒళ్ళెరగని కోపంలో ఏంజేస్తున్నదీ తెలియదు. కాని శామణ్ణ నెత్తురు కక్కుతూ పడగానే కంగారుపుట్టింది. ఇంతలో ఎవరో వెనకనుంచీ "మర్డర్‌కేసుకావచ్చు. వెంటనే పట్టుకో" అని కేకేయటం వినపడ్డది. వెనక్కితిరిగిచూశాడు. ఆ కేకేసింది తనకేసు విచారణ చేసిన జడ్జిగారే. తమ అంగరక్షకుడుగా వస్తున్న పోలీసు నాదేశించారు. జోస్యులకు ఒళ్ళంతా చెమట పోసింది. పోలీసువాడు దూసుకొని ముందుకొచ్చాడు. మరో నాలుగడుగులేస్తే పోలీసుకు దొరికేవాడే. అంతలో గుర్రంమీదికి చెంగున ఎగిరి బాణంలా దౌడుతీయించాడు. ఆపద అడుగులో తప్పిపోయింది. జోస్యులు వెనక్కి తిరిగి చూడలేదు.

వంతెన మీదుగా గుర్రాన్ని వడిగాపోనిచ్చి, అక్కణ్ణించి కుడివేపు పల్లంలోనికి

మళ్ళించాడు. దారి తెన్నూ చూడకుండా గుర్రాన్ని పోనిచ్చి హాయంత్రానికి బరగూరు దగ్గరికి వచ్చాడు. పోలీసువాళ్ళు తప్పకుండా తనవెనకాలే బయల్దేరివుంటారు. హంతకుణ్ణి ఎక్కడున్నాసరే పట్టుకోవాలని ఆర్డరిచ్చి వుంటారు. వురిశిక్ష ఎలాగూ తప్పదు. జడ్జీగారే స్వయంగా చూడటంవల్ల ఏలాయరూ ఏమీ చేయలేడు. ఈ సంస్థానమే వదిలేసి వెళ్ళాలి అనే నిర్ణయానికి వచ్చాడు. ఈ గుర్రంమీద వెళ్ళటం అపాయమన్న సంగతి గుర్తించినా దాన్ని ఎక్కడవదలాలి అన్న ఆలోచనకూడా కలిగింది. కుడివేపుగా నాలుగు మైళ్ళువెళ్ళాక అలిసిపోయిన గుర్రాన్ని ఆపి, తమ వూరివేపుతోలేశాడు. అక్కడికి నాగలాపురం అయిదుమైళ్ళు. గుర్రానికి పరిచితమైన దారి. ఎలావెళ్ళినా ఇంటికెడుతుంది. లేదా ఎవళ్ళయినా పట్టి కట్టేసుకుని కావలిస్తే సవారీచేయనీ. అక్కణ్ణుంచి ఎడమవేపుగా వెళ్ళి ఒక పల్లెచేరుకున్నాడు. అది బేవినహళ్ళి అని అతడికి తెలుసు. అక్కడొక బట్టల దుకాణముంది. అక్కడికెళ్ళి ఒక ముతకపంచకొన్నాడు. దాని పక్కనేవున్న చిన్న దుకాణంలో అణాపసుపు, ఒక అగ్గిపెట్టెకొని వూరిబయటికి వెళ్ళాడు. తోటలోవున్న మోటబావిలో కొత్తపంచ తడిపి గంజి పోయేలా వుతికి, తెచ్చిన పసుపుపూసి, తనతాంబూలపు సంచిలో వున్న సున్నంతీసి పులిసి పారాణిచేసి పంచను కావిశాటిగా మార్చాడు. దాన్ని తలమీదవేసుకుని వుత్తరదిక్కుగా కొంతదూరం వెళ్ళేసరికి ఆరిపోయింది.

దగ్గరేవున్న ఇసకపుంతలో, ఒక గొయ్యి చేశాడు. కావిపంచ కట్టుకుని, తన కోటు, చొక్కాలాగు గోతిలోపడేసి, చిదుగులు పోగుచేసి, వాటిని తగలబెట్టాడు. అన్నీ కాలి బూడిదయ్యాక, దానిమీద మళ్ళీసమంగా ఇసక కప్పేశాడు. వున్న డబ్బంతా తీసి మూటకట్టి లంగోటాలో దాచాడు. మరో ఎనిమిది మైళ్ళు నడిస్తే అరిసేకెరె వస్తుంది. ఆలస్యం చేస్తే ప్రమాదం. చకాచకానడిచి అరిసేకెరె రైల్వేస్టేషన్ చేరుకుని భోగట్టా చేయగా హుబ్బళ్ళివేపు వెళ్ళేరైలు తెల్లారాకవెడుతుందని తెలిసింది. ధైర్యంగా స్టేషన్‌లోనే దానికోసం కనిపెట్టుక్కూర్చుని తెల్లారి ఆబండిలో బయల్దేరాడు. సంస్థానపు చివరిస్టేషన్ హరహర దాటితే ఇంగ్లీషు వాళ్ళరాజ్యం. అదికాస్తాదాటావంటే ఈనాకొడుకులు నా వెంట్రుక ముక్కకూడా పెరుక్కోలేరు. అనే ధైర్యం వుండనేవుంది.

## 8

ఎనిమిది నెలలు ఏకరీతిగా మందులు మాకులు ఇచ్చినా కల్లేశుని ఎడమ చేయి స్వాధీనానికి రాదేదు. వణుకు స్పష్టంగా అగుపించడంలేదుకానీ, ఎడమచేత్తో దేన్నైనా పట్టడానికి, ఎత్తడానికి వీలులేదు. కుడిచెయ్యొకటే వుపయోగించి సైకిలు తొక్కటం సాధ్యంకాదు. మొత్తం మీద మళ్ళీ కానిస్టేబులుగా పనిచేయటం వీలుకాదు. తృప్తికరమైన దేహపాటవంలేదని అతణ్ణి పనిలోనుంచీ తొలగించి వేశారు. పోలీసుశాఖలో అట్టడుగు వుద్యోగంలో కానిస్టేబులుగావున్నా అంతదాకా ప్రభుత్వోద్యోగపు దర్పమూ దర్జా అన్నీ అనుభవించాడు. ఇప్పుడది కాస్తా వూడింది. నిజానికి చూస్తే జీవనోపాధికి ఇబ్బందిలేదు. పొలమూ పుట్రా, తోటదొడ్డీ, ఇల్లూవాకిలీ - అన్నీ వున్నాయి.

ఈ మధ్య నరసీపురంకేసు తమతండ్రిపరమై, ఆ తరువాత శామణ్ణను దొరకబుచ్చుకుని నోట్లోరక్తం కారేలాకొట్టి ఆయన ఎక్కడికో వెళ్ళిపోయిన సంగతి అతడికి తెలిసింది. నిజానికి శామణ్ణ చచ్చిపోలేదు. బూటుదెబ్బ, నోటిమీద బలంగా పడటం చేత ముందున్న రెండు పళ్ళూ పగిలి, నెత్తురు కారి తెలివి తప్పింది. జడ్జీ గారక్కడేవుండి డాక్టరును పిలిపించారు,. డాక్టరు వచ్చేలోపుగా అతనికి తెలివివచ్చింది. రెండవసారి కంఠీజోస్యులమీద కేసువేయటానికి శామణ్ణ ఒప్పుకోలేదు. కేసువేసి అతడికి జరిమానా వేయించవచ్చు. లేదా ఖైదుశిక్షవేయించవచ్చు. కాని జైలునుంచీ వచ్చాక అతడు రాత్రిపూట , బయటతాళంవేసి, పైనుంచీ కిరసనాయిలుపోసి తన ఇల్లు తగలబెడితే దిక్కెవరు? అన్న వూహకలిగి అతడూరుకున్నాడు.

కంఠీజోస్యుల గుర్రమిల్లుచేరుకుంది. అక్కమ్మ హణ్ణణ్ణి పిలిపించి దాన్ని పెరట్లో కట్టివేయించింది. కొడుకు ఎక్కడికోవెళ్ళాడు. ఎందుకెళ్ళాడో ఆమెకుకానీ కల్లేశుకూనీ బోధపడలేదు. ఇటీవలే కల్లేశు వూరికి వచ్చి, ఎడమచేతికి వుడుమునేతితో చికిత్సప్రారంభించాడు. కంఠీజోస్యులను గురించి అతడుకూడా ఏమీ తెలుసుకోలేకపోయాడు.

ఇంతలో కల్లేశుని భార్య కమల పెద్దమనిషయింది. ఆరునెలలు గడిచినా కంఠీజోస్యుల జాడతెలియలేదు. వాడికోసం కనిపెట్టుక్కూర్చోవటం వృధా. శోభనం చేసుకుని పెళ్ళాన్ని తెచ్చుకోవాలి. ఇంకాను వూరికే వుంటే బావుండదు, అని అక్కమ్మ చెప్పింది. శుభదినం నిర్ణయించారు. కల్లేశురామసంద్రానికెళ్ళి

చెల్లెమ్మనూ, మేనకోడల్నీ, బావమరిదినీ తీసుకొచ్చాడు. అక్కమ్మను వెంటబెట్టుకుని అందరూకలిసి రెండెడ్ల సవారీబండిలో పోసనకు వెళ్ళారు.

గర్భాదానపు గదిలో వదిలాక కమల భర్తకు ససేమిరా అవకాశమివ్వలేదు. మొండికెత్తి ముదురుకుని మూడంకెవేసింది. కల్లేశు ఆడదాన్నే ఎరగని పురుషుడుకాదు. ఏ సంగతీతెలియని వాడుకాదు. ఏడునెలలువాళ్ళింటిలోనే వుండటంవల్ల కమలతో బాగాపరిచయంవుంది. కాని ఇప్పుడు రకరకాలుగా ఎంతో సానుభూతితో లాలించి, బుజ్జగించి చూసినా ఆవిడలొంగలేదు. మాట్లాడనూలేదు. మరుసటిరోజు గదిలోనికి వదిలినప్పుడు చివరికి చెప్పింది. "ఆపాడు పల్లెటూరికి వచ్చివుండటం నావల్లకాదు."

కల్లేశుకు దాని ఆంతర్యమేమిటో తెలిసిపోయింది. కానీ అతడికేమి చేయాలో తోచలేదు. "పల్లెటూరైతేనేమి? రెండావుల పాడివుంది. ఈ పూళ్ళోలాగ పాలూ పెరుగు నేతికి లోటులేదు. ధాన్యం, పప్పులు, మిరపకాయలు , చింతపండు అన్నీ సమృద్ధిగా పండుతాయి. మనకేలోపమూ వుండదు. అని ఎన్నో విధాల సౌమ్యంగా నచ్చజెప్పాడు.

"నేను పల్లెటూళ్ళో వుండలేను".

"నేనూ వుద్యోగంలో వుండినవాణ్ణేకదా? అదృష్టమిలావుంది మరి ఏంచేద్దాం? వూళ్ళో పాలమూ ఇల్లూవున్నాయి. సుఖంగా వుందా."

"మరోవుద్యోగం చూసుకోరాదూ?" గోడవేపు తిరిగి పడుకునే ఆమె మాట్లాడుతోంది.

'చూద్దాం. మెడికల్ అన్ఫిట్ అని పోలీసుశాఖ అన్నాక మరొకరు తీసుకుంటారో లేదో?'

"నా కదంతా తెలవదు", అని అందేగాని అవకాశంమాత్రమివ్వలేదు. నాచేలా లాగి నాలుగు లెంపకాయలిద్దామని అతడికుడిచెయ్యేమో దురదెట్టింది. కాని బయట మావయ్య బంధువు అంతా వున్నారు. అప్పుడు గొడవచెయ్యటం సభ్యత కాదని వూరుకుండిపోయాడు.

మరోకారణం కూడా లేకపోలేదు. తామజబ్బుపడ్డప్పుడు అన్ని నెలలూ తమ ఇంట్లో వుంచుకుని సేవలు చేశారు. అందులోను మావయ్య ఎంతో ఆప్యాయతతో తనకోసం, తనచెయ్యి స్వాధీనంకావటం కోసం ఎంతో కష్టపడ్డారు. ఆయన మనస్సు బాధపెట్టడం కల్లేశుకు నచ్చలేదు. వూరుకున్నాడు.

మరుసటిరోజు అందరూ ప్రయాణ సన్నాహంలోవుండగా కమల తల్లితో

అంది "నేనాపూరికెళ్ళను."

"ఎవళ్ళైనానవ్విపోతారూరుకో. తప్పు,అలాఅనరాదు" అంతకుమించి ఆవిడేమీ అనలేదు. అత్తారింటికెళ్ళే ఆడపిల్లలలా అనటం అసహజంకాదని ఆవిడ పట్టించుకోలేదు. కమల తల్లీ, తండ్రీ చెల్లెండ్లు అందరూ బండిలో నాగలాపురానికి వచ్చారు. నాలుగురోజులుండి విందువినోదం ముగించుకుని తిరిగి వెళ్ళారు. అదేరోజు వంజమ్మకూడా భర్తతో చంటిపిల్లను తీసుకుని తనవూరెళ్ళిపోయింది.

ఆ రాత్రి మళ్ళీకమల అదేమాట అంది. కల్లేశు నచ్చచెప్పాడు. "నీవు చూశావుకదా. మా ఇంట్లో దేనికిలోటు లేదు. ఇంతపాలూ, పెరుగూ, నెయ్యీ, కాయగూరలూ హాసనలో దొరుకుతాయా నువ్వేచెప్పు."

"నాకదంతా తెలవదు" అని ఆవిడగోడవేపుతిరిగి ముడుచుకుపడుకుంది. అత్తయ్య మావయ్య వుండేదాకా కల్లేశు ఎంతో ఓపికపట్టాడు. ఇప్పుడిక సహించలేకపోయాడు. లాగి లెంపకాయిచ్చాడు. ఆమె వెక్కివెక్కి ఏడ్చింది. మాజీపోలీసు ఆవిడ వీపుమీద నాలుగు పిడిగుద్దులు గుద్దాడు. బయటపడుకున్న అక్కమ్మ "అదేమిట్రా అది?" అని అడిగింది.

రణపెంకిముండ! ఏమీ ఎన్నడూ ఎరగనట్టే ఆడుతుంది" అని అతడు తన పక్కతెచ్చి గది బయటవేసుకుని పడుకున్నాడు. అక్కమ్మతో సంగతంతా చెప్పగా ఆవిడ గదిలోకెళ్ళి కమలని బుజ్జగించబోయి "ఎందుకలా అంటావే? ఇక్కడ నీకేమితక్కువనీ? తిండికి లేదా? బట్టకులేదా? అలా అనకూడదమ్మాయ్. మేము నీకేమి ఇబ్బంది కలిగించాము? అంది.

"నాకి పల్లెటూరంటేనే పడదు". వెక్కుతూనే సమాధానం చెప్పింది.

ఏమి బదులు చెప్పాలో అక్కమ్మకు తెలియలేదు. ఊపట్టణపు పిల్లని ఏర్పాటుచేశానన్నప్పుడే ఆవిడకేదో అనుమానం. కంఠీ ఎవళ్ళనయినా అడిగాడా పెట్టాడా? ఇప్పుడేమని ఏం లాభం; చేయిదాటిపోయాక, అయిందేదో అయింది. ఎలాగైనా అన్యోన్యంగా వుండాలనే ముసలమ్మకోరిక.

బయటవున్న కల్లేశుహెచ్చరించాడు. 'అదేదోతలతిక్కగావుంటే నీవేంటి బతిమలాడు తున్నావు? ఇవతలొచ్చెయ్.'

తనకుతోచిన బుద్ధులు చెప్పి అక్కమ్మ వచ్చి పడుకుంది. కల్లేశు కాసేపయ్యాక నిద్రపోయాడు. తెల్లారిలేచి స్నానంచేసి, తిండితిని తండ్రిగారి గుర్రమెక్కి శ్రవణబెళగొళకి వెళ్ళాడు. అతని పాత స్నేహితులక్కడే దగ్గిర పల్లెలో వున్నారు.

# 5వ అధ్యాయం

**పొతు** కడుపుతో వున్న అయిదవ నెలలోనే ఆమె తండ్రి వచ్చి పుట్టికని తీసుకువెళ్ళారు. నంజమ్మకు మళ్ళీ కడుపు వచ్చింది.

కరణీకం లెక్కలు వ్రాస్తున్న తిమ్మలాపురం దేవరయ్య వయస్సు అరవైకి పైబడి వుంటుంది. తమ పిర్కా లెక్కలేకాక చెన్నిగరాయల పనికూడా చేసిపెట్టాలంటే కష్టంగానే వుంది. వాళ్ళిస్తున్న య్యాభైరూపాయల కోసమే కాక ఆయన కెందువేతనో ఆయింటిమీద ఏదో అభిమానం కలిగింది. ఒక్కొక్కరూ ఒక్కొక్క రకమైన మూర్ఖులైన ఆ కుటుంబంలో కోడలు నంజమ్మ గుణగణాలు చూసి ఆయనకు చెప్పలేని గౌరవం.

ఒకరోజు ఇంట్లో నంజమ్మ తప్ప మరెవళ్ళూ లేరు. చెన్నిగరాయలు ఎదురున్న దేవాలయానికెళ్ళి పొగాకు నములుతూ మాదేవయ్యగారి భజనవింటూ కూర్చున్నాడు. అప్పణ్ణయ్య బెస్తవీధిలో మాటన్న ఇంట్లో బీడీకాలుస్తూ కూర్చున్నాడు. గంగమ్మ తెలిక ఈరక్క ఇంటి ముందు నువ్వులు గాను గాడిస్తోంది.

దేవరయ్యగారు నంజమ్మతో అన్నారు. "చూడమ్మా! నాకూ వయస్సాయింది. మహా అయితే రెండేళ్ళీ లెక్కలు రాయగలనేమో! మన చెన్నిగరాయలు లెక్కలవూసే పట్టించుకోడు. నేర్చుకోడు, ఆ తరవాత గతేమిటి?"

"మీరే ఆయనకన్నీ వివరంగా చెప్పండి మామయ్యా!"

" ఈ లెక్కలేం బ్రహ్మవిద్యా? హొన్నవళ్ళి సీతారామయ్య వద్దే మూడేళ్ళుండి కూడా నేర్చుకోలేదంటే ఇతడికేంజేసినా రావనే అర్థం" ఇన్నిరోజులుగా నేనిక్కడుండి రాస్తున్నానుకదా! అంతా నామీద పడేసి ఆయన హాయిగా పడుకుని నిద్రపోతాడేగాని నాతోకూడా కూర్చుని రాస్తారా? రాస్తూ రాస్తూ వుంటే అదే వస్తుంది. అడిగితే నేర్పించగలను, తమ వ్యవహారం తాము సొంతంగా చూసుకోవాలిగాని ఎన్నాళ్ళని డబ్బిచ్చి ఇలా వ్రాయించటం?"

నంజమ్మ కి వూహాలన్నీ రెండేళ్ళక్రితమే కలిగాయి కానీ, ఆమేం జేయగలదు?

"మావయ్యా! నా అదృష్టమెలాంటిదో మీకుతెలియంది కాదు. ఏంచేయాలో మీరే సెలవివ్వండి."

"అమ్మా! నీకు చక్కగా రాయటం, చదవటం వచ్చు. నీపాటల పుస్తకం నేను చూశాను. ముద్దుగా ముత్యాలలాంటి అక్షరాలు రాస్తావు. నే జెప్పిస్తానుగా. నీవంతా నేర్చుకో. ఇంట్లో కూర్చుని అంతారాసివ్వు చెన్నిగరాయలు కోటు తలపాగా ధరించి జమాబంది చేసుగునిరానీ. లేకపోతే లాభంలేదు."

" ఆడాళ్లు సర్కారు లెక్కలు రాయచ్చా?"

ఈ సందేహానికి సమాధానం దేవరసయ్యకు వెంటనే స్ఫురించలేదు. దీన్ని గురించి గవర్నమెంటు రూలేమిటో ఆయనకూ తెలియదు. అయినా ఆయనన్నారు! "చూడమ్మా! నువ్వు కరణీకం చార్జి తీసుకోవటంలేదు. మగాళ్ళు రాస్తున్నారో ఆడాళ్ళు రాస్తున్నారో పై వాళ్ళ కెలా తెలుస్తుంది. నువ్వు మాట్లాడకుండా నేర్చుకో చెబుతాను."

ఆయన రూళ్ళు వేస్తున్న పుస్తకాన్ని ముందుకు తోసి,"ఏదీ దీనికి రూళ్ళు వెయ్యి చూద్దాం; ఇలా చూడు రూళ్ళకర్ర ఎర్రగీత హెడ్డింగుకు సమంగా రావాలి. ఎడమచేతి వేళ్ళతో రూళ్ళకర్ర తేలిగ్గా తిప్పాలి. పాళీనుంచీ సిరా కక్కకుండా చూసుగోవాలి. గీయి చూద్దాం."

నంజమ్మ ఆయన చెప్పినమేరకి రూళ్ళు వేసింది. ఆయనలా గబగబా కాకపోయినా, తిన్నగా సమాంతరంలో ఒకే సమంగా వచ్చాయి. "చాలా సొగసుగా వుంది. పుస్తకాని కంతటికీ ఇలాగే గీతలు వేసిపెట్టు." అని చెప్పి ఆయన చెరువు వేపు వెళ్ళాడు. నంజమ్మకు ఇది కొత్త అనుభవం. వెనకెప్పుడో చిన్నతనంలో తనపాటలపుస్తకానికి పలక చట్రంతో రూళ్ళుగీసింది. కానీ రూళ్ళకర్రతో, అందులోను, ప్రభుత్వపు లెక్కల పుస్తకాలలో గీయాలంటే ఓ రకమైన సంభ్రమం కలిగింది. అదీకాక మొదటి దఫాకే వంకరటింక లేకుండా గీతలు తిన్నగావచ్చాయి. "కరణీకమంటే ఏమిటి? తిన్నగా రూళ్లు వేయాలంటే ఆరేళ్ళయినా వేళ్ళగణుపులు వాచేలా రూళ్ళకర్రతో దెబ్బలు తినాలి. లెక్కలంటే తేరకు రాలేదు. ఆ"అవి కరణాలు అనటం వినిందామె.

ఆమె రూళ్ళువేస్తుండగా అప్పణ్ణయ్య ఇంటికి వచ్చాడు. వదినె చేస్తున్న పని చూసి తన కళ్ళు తానే నమ్మలేక తబ్బిబ్బయ్యాడు. కోపమూ వచ్చింది. తిన్నగా తెలిక వీధికెళ్ళి అమ్మతో చెప్పాడు. "చూడమ్మా! ఆవిడ లెక్కల పుస్తకాలన్నీ

పాడు చేస్తోంది."

"ఎవర్రా?"

"నీ పెద్దకోడలు. పుస్తకంలో రూళ్ళు గీస్తోంది."

"ఇదేం పోయేరోగంరా? గాడిదముండకి?" అంటూ గంగమ్మ పురుకులు పరుగులుగా వచ్చింది. ఆమె వచ్చేసరికి దేవరసయ్యగారు చెరువునుంచీ వచ్చి అరుగుమీద కూర్చుని పాదుము చేతిలో వేసుకుని చిటికె వదులుతున్నాడు. కోడలు లోపల రూళ్ళు వేస్తున్నది. "నీ బుద్ధిం పెడదారిపట్టిందేమే 'భోసుడీ!' ఏంజేస్తున్నావు? అన్న ఆవిడ గొంతువిని దేవరసయ్యగారే లోపలికెళ్ళి అడిగారు. "ఏం? ఏం జరిగింది?"

"అవ్వ! లెక్కలపుస్తకాలలో ఇది ఇలాగీయచ్చా?"

"అదికాదమ్మా! రూళ్ళుగీయమని నేనే చెప్పాను. నాకు ఒంట్లో సుస్తీగా వుంది. లెక్కలు సమయానికి సరిగ్గా పూర్తిచేయాలి. చెన్నిగరాయలవలే పట్టించుకోడు."

"ఆడ ముండతో లెక్కలు రాయిస్తారా?"

"ఆ దుర్భాషలెందుకమ్మా? రాస్తే ఏమీ మునిగిపోలేదు."

"మా ఇంటాయన చేసిన కరణీకం తాలూకు లెక్కలది రాకచ్చా?"

" మీ ఆయన కోడలే కదండీ ఈమె! మరెవరో కాదు"-

ఇంతలో నంజమ్మ రూళ్ళకర్ర, పాళీ, కలం అక్కడే వదిలేసి లేచి లోపలికెళ్ళింది. దేవరసయ్యగారే పిలిచి "నంజమ్మా! ఎందుకెళ్ళిపోయావమ్మా! రా, నీ పని నువ్వు చూసుకో. మీ అత్తయ్యతోటి నేను చెప్పాను."

గంగమ్మ దేవాలయానికెళ్ళి కొడుకును తీసుకొచ్చింది. కోడలిని చూపుతూ గంగమ్మ అంది! "చూడరా! నీ పెళ్ళాం నీతో సమానంగా కరణీకం చేయటం మొదలెట్టింది."

దేవరసయ్యగారు కలిపించుకొని కొడుకును చెన్నిగరాయలతో చెప్పారు. "చూడండి కరణంగారూ! నాకు ఒంట్లో నలతగా వుంది. ఓపికలేదు కూర్చుని రూళ్ళు గీసిగీసి నడుం నొప్పెడుతోంది. పుస్తకాలు కుట్టటం రూళ్ళుగీయటం ఎడమవేపు లెక్కలు చేయటం- ఇవన్నీ చేస్తానని నేను ఒప్పుకోలేదు. ఇవి మీరు చేసిపెడితే తరువాత నేను లెక్కలు వ్రాస్తాను. మీ భార్య ఎంతో సొగసుగా రూళ్ళు గీస్తుంది. గుండ్రంగా అక్షరాలు వ్రాస్తుంది. ఆమె చేతగీయిస్తారో లేదా మీరే

కూర్చుని చేసిపెడతారో చెప్పండి. వీలుకాదంటే తిన్నగా నాదారిని నేను వెళ్ళిపోతాను."

చెన్నిగరాయలిరకాటంలో పడ్డాడు. కాసేపాలోచించి, "ఈముండతోటి వేయించుకోండి, నేను భజన వినటానికి వెళ్ళాలి, అనేసి వెళ్ళిపోయాడు. కొడుకును తిట్టుకుంటూ గంగమ్మ తెలిక వీధికి కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయింది.

దేవరసయ్యగారు నంజమ్మకు చెప్పారు. "అమ్మా! ఈ ఇంటి సంగతి నాకు ముందునుంచీ తెలుసు. మీ మామగారికి మొదటి భార్యపోయి ఈ పెళ్ళయినప్పుడు నలభై దాటింది కాబోసు. మీ అత్తయ్య బుద్ధే అంత. ఆవిడేమైనా అనుకోనీ నువ్వు శ్రద్ధగా లెక్కలు నేర్చుకోలేకపోతే సంసారం కుదుటపడదు. మీ మామగారు కరణీకం చేస్తున్నప్పుడు వెనక వన్నోసారి ఆదుకున్నారు: దానికే నాకువచ్చిన లెక్కలన్నీ నీకు నేర్పాలని వుంది. నేను చెప్పినట్లు ప్రతిదీ చేస్తారా. (ఇదైన మూల్లెల్లకి సాలాఖరు లెక్కలు పూర్తి చెయ్యాలి. కరణీకం లెక్కల్లో ఇది చాలా ముఖ్యమైనది. వచ్చే యేటి లెక్కల్లో తప్పులు రావటానికి వీలులేదు. అమ్మా! దేవుడు నీకింత తెలివి తేటలిచ్చాడు. తతిమ్మా వాళ్ళు నాలుగేళ్ళయినా కుడి ఎడమ లెక్కల్లో తికమక పడతారు. అర్థం చేసుకోరు. కష్టమయినా నా సలహా మేరకి ఇవన్నీ వ్రాయి. తరువాత సాలాఖరు లెక్కలు నేర్పుతాను" అని ఆమె వ్రాయవలసిన లెక్కల నమూనా చూపి దేవరసయ్యగారూరికి వెళ్ళారు. ఆయన వచ్చేసరికల్లా ఆమె ఆ లెక్కలు పూర్తి చేయాలి.)

నంజమ్మ కిప్పుడు ఆరవనెలనడుస్తోంది. సాతు పురుటికని పుట్టింటి కెళ్ళింది. పురుడు వచ్చిందో లేదో వీళ్ళకు తెలవదు. ఇంటిపనులూ అవీ చేసుకుని గర్భవతి గంటల తరబడి కూర్చుని లెక్కలు వ్రాయటం సాధ్యంకాదు. "ఆడముండ మగాడిలా లెక్కలు రాస్తూ కూచుంటే నేనెందుకు పనిచేయాలి?" అని గంగమ్మ వంటకూడా చేయకుండా మొండికెత్తింది.

ఒకరోజు నంజమ్మ భోజనమయ్యాక పుస్తకాలు ముందు పడేసుకుని లెక్కలు వ్రాస్తోంది. చెన్నిగరాయలు, అప్పణ్ణయ్య అదే అంకణంలో పడుకుని ఒకరిని మించి ఒకరు కప్పెగిరిపోయేలా గురకలెడుతున్నారు. గంగమ్మ తలుపు దగ్గర కూర్చుని రాత్రి ఫలహారానికి గుగ్గిళ్ళకని పెసలు బాగుచేస్తోంది, చిన్నపాప పార్వతి లోపల పడుకుంది.)

బయట కట్టేసిన ఆవునెవళ్ళూ విప్పి మేపటానికి తీసుకెళ్ళలేదు. దాని

మొహానింత ఎండుగడ్డయినా వడేసి పీత్చుపెట్టలేదు. రెండు సారులు అంబా అని అరిచి, కట్టిన గుంజ చుట్టూ తొక్కిళ్ళు మొదలెట్టింది ఆవు. నంజమ్మ మొగుణ్ణి పిలిచింది "ఏమి! మిమ్మల్లే వింటున్నారా?"

అతడికి మెలకువరాలేదు. అప్పణ్ణయ్య మాత్రం పక్కకు తిరిగి ఒత్తిగిల్లి పడుకున్నాడు. ఆమె అతని తోటి చెప్పింది. "అప్పణ్ణయ్యా! లేచే వున్నారా?"

"వూం!" అని అతడు మళ్ళీ ముసుగుతన్ని పడుకున్నాడు.

"మనమంతా భోంచేశాం. పాపం గోమాత వుపవాసముంది.దాన్ని తోటవేపు తోలుకెళ్ళి మేపి తెస్తే బావుంటుందేమో?"

"వూం" అని అతడు మళ్ళీ మూలిగేడు, లేవలేదు.

పదినిమిషాలయ్యాక నంజమ్మ పైకి గట్టిగా అంది " అదేమో రోజూకి రెండువూటలా పాలివ్వాలి. దాని మేత గురించి ఎవళ్ళూ పట్టించుకోరు. ఇంత పొమరులయితే ఎలా? దేవుడు తినే తిండయినా తిన్నగా ఇవ్వద్దూ?"

ఆ మాటలకి గంగమ్మకు కోపమొచ్చింది. "ఏమిటే నువ్వు కూసింది?" అని అడిగింది.

"నేనేం తప్పనలేదు. ఆవును పస్తుంచారన్నాను."

"అలాంటి దానివి నువ్వేవెళ్ళి మేపుకు రారాదూ?"

"ఇక్కడి లెక్కలెవరు రాస్తారు?"

"ఓహెూహెూ! చప్పనాతి. లెక్కలు రాస్తున్నాను కదా అని సుబేదారు దౌలకి వచ్చిందా నీకు? నవరేగి నాట్యమాడుతున్నావే దొంగముండా!"

కంఠీజోయ్స్ ఉన్నట్టుండి మాయమైపోయి, తిరిగి వస్తాడన్న ఆశకూడా తొలగిపోయాక కోడలంటే గంగమ్మకు మరీ లోకువై కొంచెమైనా సభ్యత లేకుండా పోయింది. ఆవిడ ముండా రండా అన్న మాటలు విచ్చలవిడిగా ప్రయోగిస్తోంది. నంజమ్మకు కూడా అలవాటై పోతోంది.

తల్లి అరుపులకి మెలకువ వచ్చిన అప్పణ్ణయ్య నిద్రాభంగమయిందనే కోపంతో "ఏంటమ్మా! వెధవగోల?" అంటూ అటువేపుతిరిగి అడిగాడు.

"నేను లెక్కలురాస్తూ రాజ్యాలేల్తాను. మీరూరికే తిని పందుల్లా పడున్నారు. లేచివెళ్ళి ఆవుల్ని గేదెల్ని మేపుకరండిరా లంజకొడుకుల్లారా" అని మీమీద పెత్తనం చెలాయిస్తోంది చూడది."

చిర్రెత్తి అప్పణ్ణయ్య లేచి కూర్చుని అడిగాడు "ఏమిటే? అలాగన్నావా?

ఒళ్ళుపొగరెక్కిందా?"

"అత్తయ్యా! అబద్ధాలెందుకాడుతారు. దైవప్రమాణంగా చెప్పండి నేనలా అన్నానా?"

"చూడరా అప్పణ్ణా! నేను దైవప్రమాణం చేయాలట! అబద్ధాలాడటానికి నేనే మన్నంతింటున్నానా? గడ్డితింటున్నానా? మీ అమ్మని అబద్ధాలముండ అందికదరా ఈ గుడిసెట్టి లంజ? అదేమలా తెల్లమొహమేసి చూస్తావు? లాగి నాలుగివ్వకుండా తొత్తుముండని" అని గంగమ్మ నోటిమాట నోట్లో వుండగానే అప్పణ్ణయ్య లేచి వచ్చి కుడికాలెత్తి వదిన వీపుమీద తన్నాడు. ఆమె నేలమీద పడిపోయింది. "నీ గుండె పిండి రక్తం తాగేస్తాను చూడు మాఅమ్మనలా అన్నావంటే" అని గర్జిస్తున్నాడు. ఇంతలో బయటినుంచీ ఎవరో పోలీసులు వచ్చారు. కాకీషరాయి, కాకీహాటు, కాళ్ళకి బూట్సు చేతిలో చర్మపు సంచీ, నల్లనికోటూ— అంటే, పోలీసులే. ఇద్దరు కాకీ తలపాగాలు చుట్టిన వ్యక్తులు చర్మంవంచీ, ఇనపగొలుసూ, ఇనపవూచా ఇంకా మరేవో పట్టుకొని వచ్చారు. అప్పణ్ణయ్యకు పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. "అయ్యో బాబోయ్ కొంప మునిగింది" అనుకుని తలుపు గుండాదూరి వీధిలోకి వుడాయించాడు: అక్కణ్ణుంచే పక్కసందులోనికి పరుగెట్టే హడావుడి చూసి వీధికుక్కలు వెంటబడి మొరిగాయి.

వాళ్ళను చూసి గంగమ్మ కూడా నిర్ఘాంతపోయింది. వణుకుతూ లేచినుంచుంది. అప్పణ్ణయ్య అలా అరుస్తూ పరుగెట్టిన చప్పుడికి లోపల చిన్నపాప ఏడవటం మొదలెట్టింది. అతి కష్టంగా పక్కకు తిరిగి వచ్చిన వాళ్ళను చూసిన వంజమ్మ లేచి పాప నెత్తుకుని లోపలికెళ్దామని లేవబోయింది. నడుం విపరీతంగా నొప్పెడులోంది అలాగే వంగి లోపలికెళ్ళేసరికి చెన్నిగరాయడు లేచి వినయ వేధేయతతో పలకరించాడు. "ద.. ద. దయచేయండి దయచేయండయ్యగారూ."

"మీరేనా కరణం చెన్నిగరాయలు?"

"అవునండి!"

"ఆయనెవరు మీ తమ్ముడా పెళ్ళాన్ని తంతున్నది?"

"అది నాపెళ్ళామండి"

"ఓహో! వదినగారిని తంతున్నాడా?"

"లేదండి ..."

"ఏమండి ప్రభుత్వోద్యోగం చేస్తూ అబద్ధాలాడుతారు తిన్నగా చూడలేరూ

పెళ్ళాన్ని?"

"గంగమ్మకు ముచ్చెమటలు పోశాయి. వచ్చిన వాళ్ళు అంతకన్న ఎక్కువేమీ అవలేదు. చెన్నిగరాయ అరుగుమీద చాపపరిచి వాళ్ళని కూర్చోబెట్టి చేతులు కట్టుకుని నుంచున్నాడు. ఇంతలో గంగమ్మ మెల్లిగా ఇంటినుంచి జారుకుని తిన్నగా తెలిక వీధికి వెళ్ళింది. మాటన్న ఇంటికెళ్ళి ఏదో అడిగితే వాడు ఆవిడతో రహస్యంగా "అటక మీద కాగులో దాచివుంచాను" అని గుసగుసలాడేడు. గంగమ్మే నిచ్చెన వేసుకుని అటకెక్కి ఏదో తెచ్చి, కొడుకుతో గుసగుసలాడింది "వచ్చిన వాళ్ళ దగ్గిర ఏమున్నాయో చూశావా? వురితాడులాంటి ఇనపగొలుసుంది. పొడుగాటి వ్రాచవుంది. దొరికితే చేతులకి ఇనపగొలుసేసి గొయ్యితీసి వురేస్తారేమో! దాని అన్న పోలీసుగా వుండేవాడు. వాడి తాలుకు జనం. నువ్వు తోటవేపునుంచీ వుడాయించు. మరో అయిదారు నెలలు నీమొహం చూపకు జావగల్లు వేపు వెళ్ళిపో."

(అప్పణ్ణయ్య "ఎలాగ?" అని కళ్ళు తేలవేశాడు.) "మావాయన కదూ! తొరగా వెళ్ళరా. ఈముదనష్టపు ముండ ఇంట్లో అడుగెట్టిందో లేదో, అన్నీ గ్రహచారాలే మనకి" అంది. అతడు కుమ్మరావం దిగి వీధివేపు అటూ ఇటూ తొంగి చూసి కంచెపక్కగా వుడాయించాడు. అతడు చెరువు కట్టదిగి కనుమరుగయ్యేదాకా కంచె సందులో నుంచీ చూస్తున్న గంగమ్మ కాస్త తేరుకుని ధైర్యం తెచ్చుకుంది.

ఇక్కడ ఇంటికి వచ్చిన వాళ్ళు ప్రభుత్వపు సర్వే ఆఫీసరు. సంస్థానంలో సాగుబడిలో వున్న పొలాలన్నీ ఆయా భూస్వాముల లెక్కల ప్రకారం కొత్తగా కొలతలెట్టి విస్తీర్ణాన్ని ఆకారాన్ని నిర్ణయించి జాబితా తయారు చేయాలని రెవిన్యూ కమీషనర్ ఆర్డర్ చేశారు. కొలతకని నియోజితుడైన సర్వేయర్ తన తాబేదార్లతో అక్కడికొచ్చాడు. దాదాపు మూణ్ణెల్లు రామసంద్రంలో క్యాంపు వేసి చుట్టు పక్కలపల్లెలలో వున్న పొలాలన్నీ కొలిచి నిర్ణయించటమాయన కర్తవ్యం. ఆయనకు నివాస సదుపాయాలు మొదలుకొని తలారి, తోటి, వెట్టి మొదలైన గ్రామ నౌకర్ల సహాయం సమకూర్చే బాధ్యతంతా కరణం గారిదే.

రెండవ పూరిటికి అక్కమ్మే బండి కట్టించుకుని వచ్చి నంజమ్మని తీసుకెళ్ళింది. ఇప్పుడు కల్లేశుని చెయ్యి కాస్త మెరుగ్గా వుంది. రెండు చేతుల తోటి కొబ్బరి చెల్లెకుతున్నాడు. పొలంపనులూ, తోటపనులూ కొద్దిగా చూసుకుంటున్నాడు. అతడి పెళ్ళానికి పల్లెటూరు బొత్తిగా పడకపోయినా అతనికి ప్రభుత్వపు నౌకరీ

దొరికే అవకాశంలేదు. అతడికవసరమూలేదు. అసలావిడ పల్లెటూళ్ళలో సర్దుకుపోలేదో ఆవిడ స్వభావమే అలాంటిదో మొత్తానికి ముసలమ్మకీ మనమడికి ఆవిడవల్ల సుఖంలేదు.

నంజమ్మ పురుటికి వచ్చినప్పుడు ఆమెతో కూడా చిన్నపాప పార్వతి కూడా వచ్చింది. కల్లేశు దాన్ని ఎత్తుకొని ఆడించేవాడు. ఒక రోజతడు పొలంవేపు వెళ్ళినపుడు కమల తనలో తాను సణుక్కుంటునట్టు పైకి గట్టిగానే అంది "పందిలా మీద మీద కడుపొస్తేసరా? అత్తారింట్లో పురుడోసే యోగ్యతలేని వాళ్ళు కడుపెందుకు తెచ్చుకోవాలి?" పుట్టింటి వాళ్ళు చేస్తారని వాళ్ళనెత్తురు పిడేదాకా తృప్తిలేదు.

ఈమాటలు నంజమ్మకు వినిపించాయి. తనకు మంచి అత్తయ్య దొరకలేదు. అలాగే మంచి వదినా దొరకలేదు. తలరాత అలావుంది. ఇంకా ఇప్పుడు ఏడునెలలు పురుడొచ్చాక మూణ్ణెల్లైనా గడవాలంటే కనీసం యైదారు నెలలుండాలి. వూరికెళ్ళడమే మంచిదేమో! అక్కడ అత్తయ్య దెప్పిపొడుస్తుంది. పురిటికని పుట్టింటికి వచ్చి తిరిగి వెడితే అత్తయ్య బతకనివ్వదు. పెళ్ళాన్ని వెనకేసుకుని మాట్లాడే మొగుడా కాదు. పుణ్యం కొద్దీ పురుషుడు దానం కొద్దీ బిడ్డలన్నారు. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

కమల మాటలు అక్కమ్మకు కూడా వినబడ్డాయి. ఎంతో ఓర్పుగుని అన్నీ సహించి వున్న ఆవిడకి మనమరాలి కంట్లో నీళ్ళు నిలవగానే ఒళ్ళెరగని కోపం వచ్చింది. కమల వద్దకెళ్ళి అడిగింది "గర్భాదానమై ఏడాదయినా కాయాలేని కసరూలేని గొడ్రాలివి నువ్వు. దాన్ని పంది అంటావేమిటే కట్టలో నీళ్ళులేవు పొట్టలో పిల్లలు లేరనట్టు నీలాంటి పాపిష్టిదానికి పిల్లలెలా పుడతారు? కడుపెలావస్తుంది?"

" నీ మనమడెళ్ళి వూళ్ళోవున్న ముండలదెగ్గిర పడుకుని వస్తూ వుంటే కడుపెలా వస్తుందే ముసలమ్మా! ఇలాంటి కాని తిరుగుళ్ళు తిరిగే చవటలు మీ ఇంట్లో పుట్టారు."

" సిగ్గు లేకుండా మాట్లాడకు గాడిదముండా! తిన్నగా మొగుడిపక్కన పడుకోవటం తెలిసుంటే మగాడు బయటికెందు కెడతాడు? నువ్వసలాడదానివే కాదు."

ఈ మాటలతో నంజమ్మకు కొత్తవిషయాలు తెలిశాయి అయినా బామ్మతో

అంది "బామ్మా! మెల్లిగా మాట్లాడండి. ఇరుగు పొరుగు వింటారు."

"ఇరుగు పొరుగేం ఖర్మ! వూరంతా తెలుసు– ఈ ముప్పనాతి బాగోతం. ఇదొచ్చిన నెలరోజులకే మనింటి మర్యాద మట్టి కలిసింది. చెరువు నీళ్ళకెళ్ళినప్పుడల్లా ఇంటిగుట్టు వూరంతా చాటివస్తుంది. మర్యాదున్న కుటుంబంలో పుడితే మంచితన మొస్తుంది.

"వుసేవ్! ముసిలిముండా! మా వుట్టింటి వాళ్ళనంటావా? మాయింటి మురికిగుంటలో మునిగి మడికట్టుకున్నా తరించిపోతావు."

"బామ్మా! మరిమాట్లాడకు లోపలికిరా" అని నంజమ్మ లోపలికి లాక్కెళ్ళింది. మళ్ళీ నడవలోనికి వచ్చి వదినతో అంది. వదినా! కాస్త ఓపికపట్టకపోతే ఎలా చెప్పు? ఇంటిగుట్టు పై వాళ్ళకి తెలిస్తే చాటుగా నవ్వుకుంటారు."

"మొగుడింట్లో మింగమెతుకులేక పుట్టింటికొచ్చిన నువ్వా నాకు బోడి సలహా చెప్పొచ్చావా? అవతలికెళ్ళు.

నంజమ్మ మౌనంగా లోపలి కెళ్ళిపోయింది. కమల పడకగదిలో కెళ్ళి చాపమీద పడిపోయింది. కోపగృహంలో కైకేయి పడ్డట్టు. తలవిరబోసుగుని నుదుటి కుంకుమ తుడిచేసుగుని మొదలే బూరటిల్లిన ముఖం మరింత బూరటించుగుని. ఆమెనెవరూ పలకరించే పరిస్థితిలో లేరు

ఒంటిగంటకి కల్లేశు ఇంటికివచ్చి స్నానం చేశాడు. ఇంట్లో పెళ్ళాం తిరుగుతున్న అలికిడి లేదన్న సంగతి అతడు గమనించనేలేదు. కమల వూరుకుంటుందా? లోపలనుంచీ సణుగుతూ తిట్లకి లంకించుకుంది. అతని దృష్టి అటువెళ్ళింది. శరవేగంతో వస్తున్న తిట్లదండకం మరింత స్పష్టమయింది. "లంజాకొడుకులు వీళ్ళకొంప తగలడా వీళ్ళదుంపదెగా. వీళ్ళమొహం బోర్లాపిసి ఈడ్చా. వీళ్ళనోట్లో పుండు పుట్టా. వీళ్ళవంశం నిర్వంశంగాను వీళ్ళకమ్మవారుపోసి అణగా ముండాకొడుకులు. ముండా కొడుకులు. ముండాకొడుకులు. ముండా....."

పొలంలో పనిచేసి. ఎండలో వచ్చిన కల్లేశు చిరాగ్గా అడిగాడు "ఎవరినే భోముడీ! నువ్వు తిడుతున్నది?"

"ముండా కొడుకులు, ముండా కొడుకులు, ముండా కొడుకులు .... " అని మంత్రంలా జపిస్తూ ఆవిడ చేతులు కలిపి చిటపట మెటికలు విరిచింది.

"మాయదారి భాంచోత్" అని అతడు కుడిచేత్తో వీపు మీద ఓ గుద్దుగుద్దాడు.

ముఖం తిప్పి ఆమె అంది "ముండాకొడుకా! నన్ను గుద్దుతావ్రా! ఎడమ

చెయ్యిలాగే కుడిచెయ్యి పడిపోనూ నాశానమంటే ఏమనుకున్నావు?".

మరో గుద్దు దభీమంది. ఆవిడ నోరు మరింత విజృంభించింది. మరీ గట్టిగా "రోగముని పడుకుని మా పుట్టింట్లో ఎనిమిది నెల్లు వేలెడితే అందేదాకా తిన్నావు కదారా? కుంకా? నన్ను తన్నడానికెలా వొచ్చింది చెయ్యి. నీ చేతిలో పురుగుండ."

ఇంతలో నంజమ్మ అక్కడికి పరుగెట్టి కొచ్చింది. కొట్టే చప్పుళ్ళకి పార్వతి వంటింట్లోనే ఏడవటం ప్రారంభించింది. నంజమ్మ కల్లేశుని చెయ్యిపట్టి లాగుతూ "అన్నయ్యా! నీకు బద్ధి తిన్నగా లేదా? పెళ్ళాన్నిలా కొడతారా? ఏమైనా అయితే ఎలా? రా లోపలికొచ్చి భోంచేద్దువుగాని?" అంది.

"వదిలెయ్ నాచెయ్యి. ఈ భాంచేత్ రక్తం కళ్ళ చూస్తానీవేళ" అని అతడు పిపమెత్తాడు.

పడుకున్న కమల నారితెగిన వింటిలా పైకి రివ్వున లేచి అతడి కేపి వీపుతిప్పి ముంచుని పవాలు చేసింది. "కొడతావేరా కొట్టు. చెయ్యివిరిగే దాకా కొట్టు. నిన్ను పురితీయిస్తాను ఇదే ఆఖరురోజా ఎంత కొట్టగలవో కొట్టు."

నంజమ్మ అన్నచేతిని మరింత బలంగా పట్టుకుని లాగింది. ఆమె బలమైన మనిషి. అతడూ తక్కువైన వాడు కాదు. ఇద్దరూ కంఠీజోస్యుల సంతానమే. అతడు చెయ్యి వదిలించుకోలేదు. ఎడమకాలెత్తి కమల నడుమమీద తన్నాడు. ఆ తవుకామె ముందుకు తూలిపడ్డది. "భాంచోత్ మళ్లీ మాయదారి వేషాలు వేసి చాడు. ఎముకలిరగదంతాను" అంటూ బయటికివచ్చాడు. "నిన్నురి తీయిస్తాను చూడు" అని ఆవిడలోపలి నుంచీ ప్రతిఘటించింది.

కల్లేశం లోపల కూర్చుని భోంచేస్తున్నాడు. ఆనాటి ఆ సంఘటన ఆ యింటికేమీ కొత్తది కాదు. కానీ ఆ రోజు కాస్త శ్రుతిమించి రాగాన పడ్డది. ఏంజేసి లొంగదీసుకోవాలో బోధపడక అతడు మౌనంగా 'ముద్ద' తీసుకుని పులుసులో అద్ది గుటుక్కున మింగుతున్నాడు. అతనితో కూర్చోక నంజమ్మ "నేను తరువాత భోంచేస్తాను" అని పెరట్లో గుడ్డలుతుకుతోంది. అక్కమ్మ 'రాగి ముద్ద' జేసిన చట్టిలో నీళ్ళుపోసి నానవేస్తుంది. ఇంతలో నంజమ్మ పెరట్లో నుంచీ కేకవేసింది "అన్నయ్యా! త్వరగారా! వదిన నూతిలోపడ్డది."

"దీనమ్మ ...." అని కల్లేశు నాలుగంగల్లో ఎంగిలి చేత్తోటే నూతి దగ్గరికి పరుగెట్టుకొచ్చాడు. అక్కమ్మ కూడా తన వంగిపోయిన నడుముతో పరుగెడుతూ వచ్చింది. చేదతాడు లోపలికి వదలి రాటకుకట్టి "దీన్ని గట్టిగా పట్టుకో" అని

చెల్లెలితో చెప్పి కల్లోశ సుబ్రమని నూతిలోనికి దిగాడు. నూతి గోడకు కాలూని నంజమ్మ తాడు గట్టిగా పట్టుకుంది.

నంజమ్మ కేకేసి పిలవటం పక్కింటి కుపీపతయి భార్యకు వినపడ్డది "కమలమ్మ మాతిలో పడ్డదట వెళ్ళండి అని మొగుడికి చెబుతూ తామూ వచ్చింది. కుపీపతయ్య ఈ వార్త ఇరుగు పొరుగుకు చాటూతూ అక్కడికి వచ్చాడు. విసీ వినగానే జనమంతా బిలబిల పోగయ్యారు. ఆ వార్త మెరుపులా పక్క వీధులకు కూడా పాకింది. వాళ్ళూ వచ్చారు.

కమల ఒకసారి మునిగి లేచి, మళ్ళీ మునిగిపోయింది. పైకితీసినప్పుడు ప్రాణం మీది తీపికొద్దీ రెండు చేతులతోటి నీళ్ళమీద కొట్టింది. ఆవిడ చావాలని నూతిలో దూకలేదు. మొగుడుకి పురిశిక్ష వేయిస్తానన్న తన పంతం నిలుపుకోవాలని నూతిలో పడ్డది. కానీ నీళ్ళల్లో ఒకసారి మునిగి తేలాక బతకాలనే ఆశ, చావంటే భయం పట్టుకుని ఒకసారి గట్టిగా కేకవేసింది. అది నంజమ్మకు వినిపించేలోపుగా నీళ్ళు మళ్ళీ రెండవసారి లోపలికి లాక్కున్నాయి. మళ్ళీ నీళ్ళు తాగించి చివరిసారి అవకాశమివ్వటానికి గంగమ్మతల్లి ఆవిణ్ణి పైకి తేల్చింది. కల్లేశు గట్టిగా ఆమె జడ పట్టుకున్నాడు ఇంతలో కుపీపతయ్య ఇంకా ఇతరులు పోగయ్యారు. 'తాడు కాస్త పైకి లాక్కో' అని అతడు లోపలినుంచి అరిచాడు. ఎడమ చేత్తో తాడు పట్టుకున్నాడు. కుడి చేతిలో జడ వుంది. అతడు రొమ్ముదాకా నీటి మీదున్నాడు. అతని ఎడమచేతికి చాలినంత పట్టు దొరకలేదు. బరువును చాలాసేపు ఓర్చే శక్తి ఆ చేతికి లేదు. నూతిలో దిగటాకని పెట్టిన పిత్తగూళ్ళు తడుముకొని, పాదాలు తన్నిపట్టి కాస్త నిలదొక్కి మంచున్నాడు "బాబోయ్! బాబోయ్! నాకు భయమేస్తోంది. తొరగా పైకి తీయండి" అని ఆవిడ దేబిరిస్తోంది.

అంతలో పైనున్నవాళ్ళు చిన్న వుయ్యేల తెచ్చి గట్టిగా తాళ్ళతో కట్టి నెమ్మదిగా మాతిలోనికి దించారు. దాన్ని నీటి మట్టందాకా లాక్కుని కల్లేశవిణ్ణి నెమ్మదిగా అందులోకెత్తి కూర్చోబెట్టాడు. 'తాడు లాగండి' అనేసరికి "బాబోయ్ నాకు భయమేస్తోంది, వల్లకాదు" అంది. వుయ్యేలని పైకి లాగుతూండగా ఆవిడ దాంట్లో కోతిలా గెంతుతూ చిందులు తొక్కి ఎక్కడ కిందున్న తనమీద పడుతుందో అని, కట్టుకున్న పంచ విప్పి ఆవిణ్ణి వుయ్యేలకి గట్టిగా కట్టేశాడు. వేసుకున్న బనీను తీసి లంగోటీగా పెట్టుకున్నాడు. వుయ్యేల నెమ్మదిగా పైకెళ్ళింది. నలుగురైదుగురు పట్టి లాగిన వుయ్యేలలో కూర్చుని, తొమ్మిది

మూరల పంచెతో కట్టేసిన ఆవిడ చెరువులేని వూళ్ళో నూతిలో నుంచీ వచ్చిన గౌరీదేవిలా పైకి వచ్చింది.

ఆమె వెనకాలే కల్లేశు కూడా ఎక్కివచ్చాడు. నీళ్ళుతాగి ఆమె పొట్ట వుబికింది. భయమూ, కంగారూ, సిగ్గూ, అవమానమూ అన్నీ కలిసి ఆమె కళ్ళు ఎర్రగా వున్నాయి. పైనుంచీ దూకినప్పుడు నూతి గోడ తగిలి బుజము, వీపూ కుడివేపు తలా కాస్త చెక్కుకుపోయి రక్తం కారుతోంది. ముఖం మీద పడ్డ వెంట్రుకలనుంచీ నీళ్ళోడుతున్నాయి. మొదట ఆవిణ్ణి బోర్లా పడుకోబెట్టి నడుము మీద చేతుల్తో మెల్లిగా నొక్కాడు. తాగిన నీళ్ళు నోట్లోనుంచి బయటికి కక్కేసింది. రక్తం కారుతున్న ప్రదేశాలు బాగా పొడిగుడ్డతో తుడిచి పసుపు మొత్తేసరికి 'బాబోయ్ బాబోయ్ మంట" అని మొత్తుకుంది.

గుంపుగా కూడిన జనంతో "మీకేం పని ఇక్కడ వెళ్ళండి" అని కల్లేశు అన్నా జనం కదలలేదు. తాను, అక్కమ్మ ఇరుగుపొరుగు వాళ్ళిద్దరు చేరి చివరికెలాగో అందరినీ పంపిచి వేశారు.

"వేడిగా ఒక గ్లాసు కాఫీ వేసివ్వండావిడకి" అంది కపినీపతయ్య భార్య పుట్టమ్మ."

"ఈ ముండ మొహానికి కాఫీ ఒకటి దండుగ. దీనమ్మని మాదిగాడు ...." అని కల్లేశు వేరే ధోవతి కట్టుకోవాలని లోపలికెళ్ళాడు. అతడు పోలీసు పనిచేయుటంవల్ల కాఫీ అలవాటయిన వాడే. అయినా రోజూ వుండి తీరాలనే పట్టుదల లేదు. హాసనలాంటి పట్టణంలో పెరిగి అందులోనూ పోస్టుమాన్ కూతురై, పల్లెటూరికి వచ్చిన కమలకి కాఫీ లేకపోతే ఎలా? అంచేతే వాళ్ళింట్లో కాఫీపొడి వుంది. వంజమ్మే వెళ్ళి ఒక గ్లాసు కాఫీ వేసి వేడిగా వదినకు తెచ్చి అందించింది. ఒక్కసారి చప్పరించి పీల్చి, గుటకేశాక, గ్లాసు నేలమీద పెడుతూ "థూ! ఈ పల్లెటూరి మొహాలకి కాఫీ చేయటం తిన్నగా రాదు; ఎన్నడైనా తాగుంటేగా" అన్నమాటలు కల్లేశు చెవిని పడ్డాయి. అతడు లోపల్నించీ వచ్చి ఆ గ్లాసు మిగిలిన కాఫీ ఆవిడ తలమీద గుమ్మరించాడు. ఆవిడ మళ్ళీ నోరు విప్పలేదు. అతడు ఇంట్లోకి వెళ్ళిపోయాడు. "లే, లే, వేరే చీర కట్టుకుందువుగాని" అని అక్కమ్మ ఆవిడతో చెప్పింది. అక్కడుండిన మరిద్దరు మగాళ్ళు లోపలికెళ్ళారు. ఆడాళ్ళు మాత్రం మిగిలిపోయారు. ఆవిడ లేవనూ లేదు తడిచీర మార్చుకోనూ లేదు. చెదిరిన తడిజుట్టుతో నూతిపళ్ళెం మీదే కూర్చుండిపోయింది.

ఆ రోజిల్లా కమల అన్నంతినలేదు ... కల్లేశు మాత్రం తన భోజనం తాను చేశాడు. నంజమ్మ వద్దన్నా, అక్కమ్మ బలవంతం చేసి ఒక్తిమనిషికి కావని వడ్డించింది. ఎలాగూ అక్కమ్మ రాత్రిపూట భోంచేయదు. వయస్సయినందువల్ల జీర్ణం కాదని ఫలహారం కూడా మానేసి అప్పుడే పదేళ్ళయింది.

రాత్రి కమల పడకగదిలో పక్కమీద అడ్డంగా పడివుంది. వీధి తలుపు పెరటి తలుపుల దగ్గిరే పడుకొమ్మని అక్కమ్మకి నంజమ్మకి సూచించాడు కల్లేశు. మళ్ళీ వెళ్ళి రాత్రి నూతిలో పడ వచ్చుని పోలీశు శాఖలో పనిచేసిన కల్లేశు శంకించాడు. వాళ్ళిద్దరూ అలా పడుకోవటం వల్ల ఎవరూ రాత్రివేళ తలుపులు తీసుకుని బయటికి వెళ్ళే అవకాశం లేదు. పడకగది తలుపు దగ్గిరే పక్కేసుకుని కల్లేశు పడుకున్నాడు. అతనికి ఓ పట్టాన నిద్రపట్టలేదు. ఏవేవో ఆలోచనలు. తనకిలాటి భార్యను మెడకు కట్టాడని తండ్రిమీద కోపం. తనకంతకుముందే ఏర్పడ్డ స్నేహాల స్మృతి. చాలా పేపటికిగాని కళ్ళు మూతలు పడలేదు.

ఎంచేతో వున్నట్టుండి మెలకువ వచ్చింది. వంటింట్లో వెలుతురు కనిపించింది. పడుకునే తలెత్తి పడకగదిలోనికి చూశాడు. కమలక్కడ లేదు. చప్పుడు కాకుండా లేచి పిల్లిలా నడిచి వంటింట తలుపుచాటున మంచుని చూశాడు. కమల కుంపటిముందు కూర్చుంది. తలవెంట్రుకలు విరబోసుకుంది. దేవుడి గూట్లో చిన్న ప్రమిద వెలుగుతోంది. మెల్లిగా మరో అడుగు ముందుకు వేసి చూశాడు. రాత్రి భోంచేయనని భీష్మించు కూర్చున్న కమల ఇప్పుడన్నపు తప్పేలాలోనే పులుపోసుకుని కలిపి మింగుతోంది. పక్కలోనే మజ్జిగ గిన్నె ఉంది.

చప్పుడు కాకుండా మెల్లిగా వెనక్కి వచ్చేసి అతడు పడుకున్నాడు. ఆమె వెనక ఎన్నో దఫాలు మంకుపట్టు పట్టి భోజనం మానేయడం కద్దు. తరువాత అందరూ పడుకున్నాక ఇలానే ఏకాంతంగా నిశాభోజనం ముగించి ఏమీ ఎరగనట్టు వచ్చి పడుకుని, హాయిగా నిద్రపోయి, తెల్లారి లేచి, "నిన్నరాత్రి నన్ను పస్తుంచారు. నీళ్ళకొంప తగలెయ్యా" అని తిడుతూ మెటికలు విరిచేది. ఆవిడలా చేస్తుందనటానికి రాత్రి మూతెట్టి వుంచిన అన్నం మాయం కావటమే సాక్ష్యం. కానీ దాన్ని ఈ రోజా కళ్ళారా ప్రత్యక్షంగా చూట్టం జరిగింది. మరో పెళ్ళి చేసుకోవాలి. ఈ ముదనష్టపు ముండని బయటికితన్ని తగలేయాలి అని ఆలోచిస్తున్నాడు. ఇంతలో మోటారు కారు శబ్దంలాంటి చప్పుడేదో వినపడ్డది. ఏమైయ్యుండచ్చు? ఎవరింటికి? అని వూహించుకుంటూ వుండగానే, కారుదిగి వచ్చిన జనం వాళ్ళతలుపే తట్టారు

"ఎవరూ?" అంటూ అతడు లేచి దీపం వెలిగించి తలుపునానుకుని పడుకున్న అక్కమ్మను లేపి తలుపు తీశాడు. వచ్చినవాళ్ళతని మామయ్యా అత్తయ్యాను. తోడుగా వాళ్ళ బంధువులు నలుగురు. కారు డ్రయివరెవరో అతనికి తెలియలేదు. వాళ్ళచూసి అతడికాశ్చర్యమేసింది.

"కమలెలావుంది?" అని రాగాలు తీస్తూనే ఆమె తల్లి లోపలికి వచ్చింది.

"వంటింట్లో చూడండి" అని అతడన్నాడు.

వాళ్ళక్కడికెళ్ళి చూసేసరికి ఆవిడక్కడ లేదు. దేవుడి దీపమప్పుడే ఆర్పేసిన వత్తి కాలిన వాసన వస్తోంది. అరే ఇంతలో ఎక్కడికెళ్ళింది అని అతడు పడగ్గదిలో చూశాడు. చాపమీద బోర్లాపడుకుని, తామపైకి లేవనేలేదన్నట్టు కళ్ళుమూసుకుని పడుకుని వుంది.

"చూడండి, మీరొచ్చేసరికి, వంటింట్లో కూర్చుని అన్నపు తప్పేలాలోనే పులుసోసుగుని దొంగతనంగా తింటోంది. ఇప్పుడు దీపమార్పేసి ఏమీ ఎరగనట్టు పడుకుంది. మీరే చూద్దురుగాని రండి" అని వాళ్ళని తీసికెళ్ళి చూపించాడు.

"ఈ గొడవంతా ఎందుకు వదిలెయ్యండి - అసలేమైంది? అంతా కులాసా కదా?" మామయ్య అడిగాడు.

"మీరెందుకొచ్చారు? ఏమిటి సంగతి?" మాజీ పోలీసు కానిస్టేబులు ఎదురు ప్రశ్నవేశాడు.

"మాకు నువ్వే టెలిఫోన్ చేయించావుగా? కమల నూతిలో దూకింది రండని."

"ఓహో అదా సంగతి? మీకు ఫోను చేసిందెవరో సెలవిస్తారా? ఆ హడావుడిలో మరిచి పోయాను."

"ఎవడైతే ఎందుకియనకి?" అని కమల లోపలనుంచే చటుక్కున అవేసింది.

మొత్తానికెవరైతేనేం చేయించిందావిడే అని అందరికీ తెలిసి పోయింది. ఆమె తరఫున చేసిందెవరు? అన్నది మాత్రం తెలియలేదు. దాని కూపీ లాగడం కష్టంకాదని, ఆ విషయ మంతటితో కల్లేసు తుంచేశాడు. అతడు తిన్నగా పక్కింటికెళ్ళి తలుపు తట్టాడు. కారు శబ్దానికి వాళ్ళకి మెలకువ వచ్చింది. కపిసీపతయ్యను ఆయన భార్య పుట్టమ్మనూ ఇద్దరినీ వెంట బెట్టుకొచ్చాడు అలాగే ఇవతల పక్కనున్న ఇంటి వాళ్ళనీ లేపి తీసుకొచ్చాడు. కూర్చున్నాక ప్రారంభించాడు. "మేము చెబితే అబద్ధాలనిపించవచ్చు. వాళ్ళనే అడగండి. "కపిసీ మామయ్యా

వున్న సంగతి మీరే చెప్పండి వీళ్ళకి."

ఇరుగు పొరుగు వాళ్ళేమీ మాట్లాడలేదు. కల్లోళే జరిగింది చెప్పాడు. తాను కొట్టానని చెప్పాడే కాని, కాలితో తన్నిందని చెప్పలేదు. అతడు చెప్పినదంతా నిజమేనని ఇరుగుపొరుగులు తలాడించారు. కల్లోళుని చూసి అత్తయ్య అంది "ఎంతో గారాబంగా కనిపెంచి పెద్దచేసిన అమ్మాయిని మీ చేతిలో పెట్టి ఈ పల్లెటూరికి పంపించాం. మీరు సరిపెట్టుకుపోవాలి".

మావయ్య, పోస్టుమాన్ రంగణ్ణ మాత్రం దించిన తల ఎత్తలేదు. కల్లోళు ఆయన్నే అడిగాడు. "మీరిప్పుడు చెప్పండి ఏ లంజాకొడుకు మీకు ఫోను చేశాడో."

"నా నోట్లో అబద్ధం రాదు. ఫోను వచ్చింది చన్నరాయపట్టణం నుంచి. అక్కడి ఎలక్ట్రిక్ క్యాంపునుంచి హాసన ఎలక్ట్రిక్ క్యాంపుతో మాట్లాడారట! పోస్టుమాన్ రంగణ్ణగారికి వెంటనే తెలపమని చెప్పారట. రోజూవుత్తరాలు పంచటానికని ఆ వేపు వెడతాను కదా నేను; నన్నెరు గుదురు. ఎలక్ట్రిక్ ఫోర్‌మాన్ వచ్చి సంగతి చెప్పాడు. కల్లోళనే అతనే ఫోన్ చేశారు అని అన్నాడు. ఏమిటి గ్రహచారమని వెంటనే యాభైరూపాయలద్దెయిచ్చి కారులో బయల్దేరాం హడావుడిగా."

"ఇప్పుడెలాగూ వచ్చారు. కారూ వుంది, మీ అమ్మాయికి విసుగెత్తింది తీసుకెళ్ళండి."

"అలాగే ఓ నాలుగు రోజులొచ్చి విశ్రాంతి తీసుకోనీ" అని అత్తయ్య వెంటనే అనేసింది.

మామగారు వెంటనే అడ్డుపడ్డారు. "వొద్దొద్దు. భార్యాభర్తలకి మనస్తాపమున్నప్పుడు మనం పిల్లని తీసుకెళ్ళరాదు. వాళ్ళు సంతోషంగా వున్నప్పుడే రావాలి, వెళ్ళాలి."

"మన పిల్లని మనింటికి తీసుకెళ్ళడానికేమండీ?" పెళ్ళామడిగింది.

"నీకు తెలవదూరుకో. ఇప్పుడు కాదు" భర్త అన్నాడు.

"నేను రానే వస్తాను" అని, చిచ్చుబుడ్డిలా లేచి, వచ్చి తల్లిపక్కన కూర్చుంది.

"అమ్మాయీ! నేను చెప్పినట్టు చేయాలి. నువ్విప్పుడు రాకూడదు!! అని తండ్రి చెబితే ఆమె వినలేదు. మరిక ఆలస్యం చేయరాదని వూహించిన ఆయన లేచి, తనతో వచ్చిన వాళ్ళని "అందరూ లేవండి. కారులో కూర్చోండి. వూరికెళ్ళాలి" అని లేవగొట్టాడు. "మన అమ్మాయి...." అనబోతున్న పెళ్ళాంతో

"మొదటి నంచీ నీ మాటవినే ఇలా అయింది. ఇహ చాలు నోరు మూసుకో" అని అవ్వాయిచువ్వాయిలాగా ఆకాశాన్నంటుకున్నాడు. అందరూ వెళ్ళి కారులో కూర్చున్నారు. కమల కూడా పట్టుపట్టి తానూ కారులో కూర్చోవాలని ఎక్కబోయింది. రంగణ్ణగారే చెయ్యిపట్టి ఆపేశారు. నంజమ్మ పరిగెట్టుకొచ్చి కల్లేశుని అత్తయ్యకు కుంకుమ ఇచ్చేలోపుగా, పరిస్థితి అర్థం చేసుకున్న డ్రైవరు కారు స్టార్టు చేసి ముందుకు నడిపించాడు. "యాభైరూపాయలు దండుగై పోయింది ఒకటిన్నర నెలజీతం ఎక్కణ్ణించీ తేగలను?" అన్న రంగణ్ణగారి మాటలు నంజమ్మకు వినిపించాయి.

ఇరవైగజాలు ముందుకు వెళ్ళాక కారు కాస్త ఆగింది. "నాయనా! కల్లేశా! కాస్త ఇలారా బాబూ!" అని రంగణ్ణగారు పిలిచారు. కల్లేశు వెళ్ళి కారు పక్కన నుంచున్నాడు. కిందికి దిగి అల్లుడి చేతులు పట్టుకుని "కోపగించుకోకు, పొల్లమారి అవును తెచ్చినా మేతేసి, కట్టేసి, లొంగదీయాలి బాబూ! దాని మొహం కాదు. నామొహం చూడు" అని చెబుతుండగా ఆయన కళ్ళవెంట నీళ్ళు టపటప రాలాయి.

"అదేవిటి మీ వెర్రివాగుడు మీరున్నూ . మనపిల్లే పొల్లమారి అంటారా?" పెళ్ళాం మొగుణ్ణి అడిగింది.

"మాట్లాడి లాభం లేదు" అని రంగణ్ణ మళ్ళీ కారెక్కి కూర్చున్నాడు. డ్రయివరు కారును ముందుకు నడిపించాడు.

ఇరుగు పొరుగు జనం వెళ్ళి పడుకున్నారు. కల్లేశు ఇంట్లోనూ అంతా పడుకున్నారు. మాట్లాడవలసింది బోలెడంతున్నా ఎవరూ ఏమీ అనలేదు. "వంగవాచి వంగముల్లు" అని అక్కమ్మ నాలుగు సార్లైనా పణిగి వుంటుంది. నంజమ్మ ఎప్పటిలా మౌనంగా వుంది. కల్లేశు కూడా నోరు బిగించుకుని వున్నందున అక్కమ్మకు మాట్లాడే అవకాశం దొరకలేదు. అతడి చేతిమీద రాలిన మావయ్య కన్నీటి బొట్లు అతని మనస్సును కలవరపరిచాయి. తనకు ప్లేగు తగిలినప్పుడు కంటికి రెప్పలా కాపాడారు. ఆయన మంచితనం చూసి, ఆయన ఆప్యాయత చూసి, కల్లేశుకు ఎంతో గౌరవమేర్పడ్డది. లేచి వెళ్ళి పెళ్ళాన్ని ఎముకలు విరిగేలా తన్నాలనిపించింది. కానీ మామగారి కన్నీళ్ళు అడ్డుపడి కదలకుండా కట్టేసి పక్కనంటిపెట్టుకుని పడుకునేలా చేశాయి.

# 6వ అధ్యాయం

సుమారు ఆరునెలలయ్యాక ఒకనాడు అర్ధరాత్రిపూట అప్పణ్ణయ్య వచ్చి బెస్తవీధిలో మాటన్న ఇంటి తలుపు తట్టాడు. లోపలనుంచీ లేచి వచ్చిన మాటన్న అతణ్ణి చూడగానే "అదెక్కడికెళ్ళారు బాబూ ఇన్నాళ్ళూ? అని అడిగాడు.

"పోలీసులింకా గాలిస్తున్నారా నన్ను?"

"అదేటి పోలీసులు బాబూ?"

"అదే ఆ రోజా ...."

మాటన్నకి వెనకటి సంగతి గుర్తొచ్చింది. "ఆళ్ళు పోలీసులు కారట! పొలాలు కొలిసేవోళ్ళట. మనూళ్ళో మూణ్ణెల్లున్నారు. మీరెందుకిన్నిరోజులు దాంకున్నారు బాబూ? అమ్మగారికి మాచిట్టిబాబెక్కడికెళ్ళాడో ఏమో అని ఒకటే బెంగనుకోండి" అన్నాడు వాడు.

"అయితే నేనింటికెళ్ళా?"

"పదండి బాబూ!"

"నాకు భయమేస్తోంది. కూడా నువ్వురా" అని మాటన్నను వెంటబెట్టుకుని ఆ అర్ధరాత్రివేళ గుండె పీచుపీచుమంటూనే ఇంటి తలుపు తట్టాడు ."ఆడెవడురా అర్ధరాత్రివేళ అంకమ్మసివాలన్నట్టు తలుపుతడుతున్నది?" అని లోపలినుంచి అడిగిన గంగమ్మకు మాటన్నే బదులు చెప్పాడు. కిరసనాయిలు బుడ్డీదీపాన్ని వెలిగించుకుని బయటికి వచ్చిన గంగమ్మ కొడుకుని చూసి "ఓరి వెర్రినాన్నా! ఇన్నాళ్ళెక్కడికెళ్ళావురా? ఆ దరిద్రపు ముండకి భయపడి ఎక్కడెక్కడ తిరిగావో ఏమో!" అని కంట తడిబెట్టుకుంది. చెన్నిగరాయనిది అంత త్వరగా మెలుకవ వచ్చే నిద్ర కాదు. "భోజనానికి ఎంత అవస్థ పడ్డాడో పాపం" అని అన్నీ అడిగి తెలుసుకుంది గంగమ్మ.

"నేనేం భయపడలేదు. అన్ని చోట్లా వెగ్గుకునే వచ్చాను" వీరకుమారుడు తన సాహస గాథ చెప్పాడు "ఇక్కణ్ణుంచి జావగల్లువేవు వెళ్ళాను. దారిలో మేదర

పట్టేగౌడ ఇంటికెళ్ళి "మేం బ్రాహ్మలం స్వయంపాకాని కిప్పించండి" అన్నాను. రెండుసేర్ల బియ్యం, అనపగింజలు, కారప్పొడి, నెయ్యి అన్నీ ఇప్పించాడు. భోంచేసి మిగిలిన సరుకు మూటకట్టుకుని జావగల్లు వేపెళ్ళాను. అక్కడ నెల రోజులున్నాను. ఇప్పుడెందుకొచ్చావు? వూళ్ళో అంతా ఎలా వున్నారు? వాళ్ళంతా ఎందుకు రాలేదు? అని ఆవిడుందే ఆ ముప్పనాతి ముండ యంకటాచలం పెళ్ళామడిగింది. ఒకరోజు రాత్రి అక్కణ్ణుంచి బయల్దేరి అరిసికెరె వేపెళ్ళాను. అలా అదంతా తిరిగి వచ్చి బాణావర, కడూరు, మ్యాల్హాసి, శివమొగ్గ కూడా వెళ్ళాను. అక్కడ నది ఒడ్డుమీదే 'చిక్కని కల్లు' మఠమని ఒకటుంది. అక్కడే నా మకాం. వుండటం పడుకోవటం.

"భోజనాని కేంచేశావురా?"

"ఆ మఠంలో వాళ్ళే వుపాయం చెప్పారు. వాళ్ళు లింగాయతులు. నేనక్కడెలా భోంచేస్తాను? ఆ వూళ్ళో పెద్ద బ్రాహ్మణ వీధి అని వీధే వుంది. అందరూ వున్నవాళ్ళే. రోజూ భిక్షాన్నం తెచ్చి తినేవాణ్ణి. అమ్మా నువ్వు వంద చెప్పు వెయ్యి చెప్పు భిక్షాన్నంముందు వండుకున్నది ఎలా చేసినా బలాదూర్ అనుకో. జోలెలో అన్నం, గిన్నెడు పులుసూ చారూ తెచ్చి ఏటి ఒడ్డున, బండ శుభ్రంగా కడిగి కలుపుకొని కొట్టేసేవాణ్ణి."

"బిచ్చాన్నమంటే ఏటి బాబూ?" మాటన్న అడిగాడు.

"భోజనాల వేళలో వెళ్ళి, గుమ్మంముందు నుంచుని భవతీ! భిక్షాందేహి! అంటే జోలెలో అన్నం, పులుసో, చారో, కూరలో, చేసివుంటే ఏవైనా భక్ష్యాలో అన్నీ తెచ్చివేస్తారు. ఆ తరువాత కలుపుకుని తింటే ఎంత మజా, ఏం రుచనుకున్నావు?"

"ఎందుకుండదు బాబు. పొరుగింటి పుల్లగూర రుచి అంటారుగా" అని లొట్టలు వేస్తూ చెప్పాడు మాటన్న.

"అమ్మా! ఆ పాడు శివమొగ్గలో వుట్టి వరిబువ్వతిని ప్రాణం విసుగెత్తిందనుకో. కాస్త 'రాగిముద్ద' వండిపెట్టు ఆకలేస్తోంది."

"వేళకాని వేళ ఏమిటిరా?"

"రాత్రేమీ తినలేదు మరి."

"ఆ ముండ లెవళ్ళయినా వుంటే కాస్త వండి పడేయమందును. ఎవళ్ళూ లేరు. అన్నణ్ణయ్యా నీ పెళ్ళానికి ఆడపిల్లట! బారసాలకి పిలవటానికి వచ్చారు.

ఇప్పుడే నాలుగు నెలలు కావస్తోంది. వెళ్ళి తీసుకురా. వండి వార్చి నా నడుము లాగుతోంది" అంటూ గంగమ్మ మెల్లిగా పైకి లేచింది.

## 2

పోడిమి తలెత్తుకుని నాలుగురోజులు తిరిగాక అప్పణ్ణయ్య పెళ్ళాన్నీ కూతుర్నీ తీసుకు రావాలని మగ్గేకరి వెళ్ళాడు. రొట్టెలూ, పచ్చడి మూట కట్టుకుని భుజాన వేసుకుని, తిపటూరిదాకా నడిచివెళ్ళి, రైల్లో ఒక్కడే కడూరుకెళ్ళి, అక్కణ్ణుంచీ తొమ్మిది మైళ్ళు నడిచి, చివరికి మావగారిల్లు చేరుకున్నాడు. పిల్లకు నాలుగు నెలలు. వాళ్ళే జయలక్ష్మి అని పేరు పెట్టారు.

అప్పణ్ణ వెళ్ళేసరికి సాయంత్రమయింది. సాతు ఇంకా బాలెంత గదిలోనే వుంది. అతడు వెళ్ళి కూతుర్ని ఎత్తుకుని ఆడించాడు. పెళ్ళాన్ని ఆప్యాయంగా పలకరించాడు. రాత్రి భోజనమయ్యాక నడవలో మావయ్య పక్కనే అతని పక్క వేశారు. ముఖం చప్పగా వాడిపోయి పక్కమీద కూర్చున్నప్పుడు మామగారడిగారు. "బాయిహొలకి కబురెట్టాం అప్పుడెక్కడి కెళ్ళావు?"

"శివమొగ్గకు కాదు ... జావగల్లుకు."

"పెళ్ళానికి పురుటి రోజులని గుర్తు రాలేదా? అదేంటి అలా ఎవళ్ళతోటి చెప్పకుండా వూరొదిలి పోవటం?"

"కాస్త పని తగిలింది."

పురుటి గదిలో పడుకున్న సాతు లేచికూర్చుని అడిగింది. "అదేం మునిగిపోయే పని? అబద్ధాలెందుకాడుతారు? నిజం చెప్పండి వదినగారిని కాల్తో తన్ని, పోలీసులు పట్టుకుంటారని దొంగతనంగా పారిపోలేదూ?"

అప్పణ్ణ సమాధానం చెప్పలేదు. తలవంచి కూర్చున్నాడు. సాతమ్మే మళ్ళీ అంది. "మీ అమ్మ తన్నరా అంది. మీరు తన్నారు. ఆ గయ్యాళిగంప పోతేగాని సంసారం బాగుండదు."

తన తల్లిని దూషించినందుకు అప్పణ్ణయ్యకు పట్టరాని కోపం వచ్చింది. దాన్ని పైకి చూపటానికిది సమయం కాదు. సాతు వదినలా సాధువు కాదు. అంచేత వూరుకున్నాడు. సాతమ్మే మళ్ళీ అంది "మీ అమ్మతోటి కాపురం చేసి వేగలేము. మీ ఇంటి వెనకాల ఖాళీ స్థలముంది కదా? అక్కడో చిన్న ఇల్లు కట్టండి. వేరే వుండటానికేర్పాటు చేయండి. తరువాత వచ్చి నన్నూ కూతుర్నీ తీసుకెళ్ళండి."

"అదెలా అవుతుంది?" కూరుకుపోయిన పీకని సవరించుకుంటూ అన్నాడు.

"ఎందుకవదు? మీరుండటానికో చిన్న ఇల్లు కట్టించండి. అన్నదమ్ములు వాటాలు పంచేసుకోండి. ఇంటికి కావలసిన పాత్రలన్నీ నా పెళ్ళిలో ఇచ్చినవే వున్నాయి. చాలకపోతే మరికొన్ని పట్టుకొస్తాను."

అతడప్పటికి ఏమనలేదు. సాతమ్మ మళ్ళీ అంది "మీరు విడిపోవాలని కాదు. అన్నాదమ్ములు కలిసే వుండండి. నేను అక్కతోటే ఉంటాను. కానీ మీ అమ్మ మాత్రం వేరే వుండాలి. కావలిస్తే ఆవిడకి వేరే గది కట్టించి దూరంగా వుంచండి. తరువాత నన్నూ పిల్లని తీసుకెళ్ళండి."

తల్లిని దూషించినందుకతనికి కోపంవచ్చి ముఖమదోలా వుంది. దాన్ని గుర్తించిన అత్తయ్య ఇలా అంది : "మా అప్పణ్ణ స్వభావం మంచిది. అతడు బంగారంలాంటివాడు సాతు పదే పదే చెబుతూనే వుంటుంది. అత్తా కోడళ్ళకి పడదు. మీరు వేరే కాపురం పెట్టండి. అవసరమైతే సాతు వెళ్ళి మీ అమ్మగారికి సహాయం చేస్తుంది" ఇప్పుడతని ముఖం ప్రసన్నమయింది.

మామగారు చివరికి తమ అభిప్రాయం తెలియజేశారు. "మొత్తం మీద మీరు భార్యభర్తలు అన్యోన్యంగా సంతోషంగా వుండటమే మాకు కావలసింది. తెల్లారేసరికల్లా ముండే, రండా అని తిట్లేమిటి? అన్నీ మానెయ్యాలి. పరే చెప్పిన సదుపాయాలన్నీ చేసి నీ పెళ్ళాన్ని నువ్వు తీసుకెళ్ళు. మాకున్నదల్లా ఒక్కతే అమ్మాయి."

అప్పణ్ణ వారం రోజులు మామగారింట్లో వున్నాడు. పెళ్ళాన్ని తిట్టకుండా, సంతోషంగా కూతుర్నెత్తుకుని ఆడించేవాడు. కానీ అతడి మాటల్లో, వ్యవహారాల్లో నిష్కారణంగా కనిపించే మొరటుతనం, పెంకితనం చూస్తే అందరికీ చిరాకుగాను, బాధగాను వుండేది. ఒక రోజు కొబ్బరికాయ పీచు తీస్తూ ఎంతకూ అది రాకపోయేసరికి "దీవమ్మని ... " అనేశాడు. మరో రోజు గొడ్లపాకలో ఆవు కొమ్మాడించబోతే "ఒరి నీయమ్మని...." అన్నప్పుడత్తయ్య దగ్గరే వుంది. అతణ్ణి బాగుచేయడమంటే సామాన్య విషయం కాదని వాళ్ళకి తెలుసు. తమ అమ్మాయి రాత అలా వుందని బాధపడ్డారు.

వూరికి బయల్దేరేముందు వేరే కాపురం పెట్టే ప్రయత్నం చేయమని మళ్ళీ గుర్తు చేసింది సాతు. అతని చేత 'వూ' అనిపించింది. అతడు కదూరుదాకా నడిచివచ్చి అక్కడ రైలెక్కి తిపటూరిలో దిగాడు. తిపటూరి నుంచి వూరికి

పదహారు మైళ్ళు. మొదలియారు కంపెనీవాళ్ళు బస్సు నడిపినా, అది రోజు మార్చి రోజు వెడుతుంది. బస్సున్నది సోమవారం, బుధవారం, శుక్రవారం మాత్రమే. అప్పణ్ణయ్య అప్పటికే ఒక రోజు బస్సులో కూర్చుని దాని సుఖం రుచి చూశాడు. అతినికి భయమేమీ లేదు. రైల్లో ఒంటరిగా కూర్చుని వచ్చిన అతడికి బస్సో లెక్కా? కానీ ఆ రోజు శుక్రవారం. సాయంత్రం కావచ్చింది. రేపూ ఎల్లుండీ బస్సు వుండదు తనకు నడిచి వెళ్ళటం కష్టం కాదు. కానీ బస్సు ప్రయాణంలోని సుఖముంటుందా మరి?

అప్పటికే సాయంత్రం కావటంవల్ల అతడు తిపటూరిలో వుండిపోయాడు. హోటల్లో వుల్లిపాయ, బంగాళాదుంపల పులుసు, వంకాయ కూర, అప్పడాలు, వడియం, చారు, పెరుగు సమృద్ధిగా మూడు సార్లు కలుపుకుని భోంచేశాడు. సత్రపు అరుగుమీద పడుకుని, తెల్లారి లేచి చెరువువేపు వెళ్ళొచ్చి, అదే హోటల్లో మసాలా దోసె తిన్నాడు. అతడు శివమొగ్గలో కూడా మసాలా దోసె రెండు రోజులు తిన్నాడు. కానీ తిపటూరిలో వీళ్ళు చేసినంత రుచిగా వుండలేదు. మెరపకాయలు, కొత్తిమీర, బంగాళాదుంపలు, నీరుల్లి పాయలు వేసిన కూర, లోపల దోసెకు రాచిన కందిపచ్చడి, కొద్దిగా కారంగా వున్నా లొట్టలు వేసుకుంటూ ముగించి, మళ్ళీ ఆరు దోసెల కార్డరిచ్చాడు. వేడి వేడిగా వచ్చిన ఆరింటినీ తిని మొత్తం ఏడణాలిచ్చి, కాలిబాటలో రామసంద్రానికి బయల్దేరాడు. రెండు మైళ్ళు నడిచేసరికి దాహం వేసింది. "దీనమ్మని ... ఆ దోసెలు తిన్నందుకే దాహం" అని దారి కుడివైపున కొబ్బరి తోటవైపు చూశాడు. ఎవళ్ళూ కనిపించలేదు. మెల్లగా కంచె కాస్త పక్కకు తోసి, తోటలోపలికెళ్ళి, పొట్టిగా వున్న కొబ్బరి చెట్టు నుంచీ మూడు బొండ్లాలు కోసి అక్కడే పడివున్న వూచతో వాటి కళ్ళు పొడిచి గడగడా నోట్లోకి వంచేసుకున్నాడు. లేత కొబ్బరి మీద ఆశగా వున్నా, దొరికిపోతానేమో అన్న భయంకొద్దీ బొండ్లాలక్కడే వదిలేసి కంచెదాటి, దారిలో పడి వూరి వైపు గబగబా అడుగులేమ్మా నడిచాడు. దారిలో కనబడ్డ పసుల కాపరి ఒకడు తనకో బీడి ఇచ్చాడు. అప్పణ్ణయ్య తనంతట తాను డబ్బెట్టి కొని కాల్చేవాడు కాదు. చెరుకులోట తగలడ్డాక దాన్ని వదిలేశాడు. అడిగితే ఎవళ్ళైనా తేరకిస్తే తాగి అక్కడే పారేసేవాడు.

## 3

అప్పణ్ణయ్య వూరు చేరేసరికి సాయంత్రం నాలుగు గంటలయింది. అతడింటికి వచ్చేసరికి అప్పుడే మునసబు శివేగౌడ, అతడి బావమరిది, మాజీ బదిలీ కరణం శివలింగేగౌడ వచ్చి కూర్చున్నారు. అతడు వెళ్ళీ వెళ్ళగానే శివేగౌడ మొదలెట్టాడు.

"గంగమ్మా! కబురెట్టినట్టు అప్పణ్ణయ్య వొచ్చాడు నా డబ్బు విషయమేంజేశావ్?"

ఏ డబ్బు అన్నది గంగమ్మకి రెండు నిమిషాలకుగానీ గుర్తుకు రాలేదు. శివేగౌడే చెప్పాడు "అసలు రెండువేలు, ఏడేళ్ళ వడ్డీ అంటే పద్దెనిమిదొందలాయనప్పై. ఇన్నేళ్ళుగా పైసా వడ్డీ చెల్లించలేదు. దాని వొడ్డీ కడ్తే మరో ఆరొందలు, నెల రోజుల్లో నా డబ్బు నాకిచ్చేయండి. గడువుదాటి పోద్ది. లేదంటారా కోర్టు తప్పదు."

"ఏదో కుర్రాడెరక్క ఎప్పుడో చేసిందానికి ఇంత డబ్బు నేనెక్కణ్ణించి తేను శివేగౌడ?"

"కుర్రాడు చేశాడని నేను డబ్బిచ్చింది అబద్ధమా? ఏం మాట్లాడు? చెన్నయ్యా కరణీకం చేస్తావు. నువ్వే సెప్పు నేను డబ్బిచ్చానా లేదా?"

"చెన్నిగరాయుడు మాట్లాడలేదు. వారం రోజుల్లో నా డబ్బు నాకివ్వక పోతే కేసేస్తాను. నా మీద తప్పులేదు వూం" అనేసి శివేగౌడ, శివలింగే గౌడతోటి లేచి, కండువా దులుపుకుని వెళ్ళిపోయాడు.

"ఇప్పుడేం చేయాలిరా చెన్నిగరాయా?" గంగమ్మ అడిగింది.

"నాకేం తెలుసు?"

"కరణంవి నీకు తెలవదట్రా?"

అప్పణ్ణయ్య అన్నాడు. "మన దగ్గర ఏం పెరుక్కుంటాడో పెరుక్కోనీ మూద్దాం. ఇవ్వనను"

"అందామేరా?"

"అమ్మా! నా కాకలేస్తోంది. ముందు వడ్డించెయ్. వాడేం పెరుక్కుంటాడో తరవాత మూద్దాం" అన్న అప్పణ్ణయ్యకు వడ్డించటానికామె లోపలికెళ్ళింది.

ఈ విషయంలో ఎవరి సలహా అడిగితే బావుంటుందో ఆమె ఆలోచించింది. వెంటనే రేవణ్ణశెట్టి పేరు గుర్తుకొచ్చింది. రేవణ్ణశెట్టిని ఎంతోమంది వూళ్ళో ప్లీడరనే పిలుస్తారు. ఏ వేవో కేసుల కోసమతడప్పుడప్పుడు తిపటూరికి

వెళ్ళొచ్చేవాడు. పెద్ద పెద్ద లాయర్లకి కూడా తెలియని పాయింట్లు కూడా అతడికి తెలుసంటారు. గంగమ్మ తిన్నగా అతనింటికి వెళ్ళింది. అతడి భార్య సర్వక్క "ఆయన లేడు కొడిపల్లెకెళ్ళారు" అంది.

"ఏం పని?"

"గంగమ్మగోరూ! తెలవదా మీకు?" అని కాస్త సందేహించి "పేకాటకి. మీరే పనిమీదొచ్చారు? కూకోండి. పిటేస్తాను" అంది.

గంగమ్మ పీటమీద కూచుంటూ, శివేగౌడ తన ఇంటికి వచ్చిన సంగతి వెనక పొలమూ పుల్లా తణఖా వుంచిన సంగతి చెప్పింది. పొలం తణఖా వుంచిన విషయం వూరందరికీ తెలిసిందే. ఆడి డబ్బాడికి ముందే ఇస్తే పోలా? ఇన్ని రోజులెందుకూరికే కూర్చున్నారు?"

"అదేం మేం కొన్నదా? తిన్నదా? ఎలాగిచ్చేది?"

దానికి సమాధానమివ్వగల తెలివితేటలు సర్వక్కకు లేవు. ఆమె వయస్సు సుమారు ముప్పై. అయిదురుగు పిల్లలు. ఇంకా ముగ్గురు చచ్చిపోయారు. రెండేళ్ళుగా కడుపురాలేదు. అప్పణ్ణయ్య చెరుకు తోటలు తగలెట్టినప్పుడు ఆవిడ మొగుడు మరుగోలు పంటపేరెట్టి యాభైరూపాయలు కాజేసింది ఆవిడ మరిచిపోలేదు. మరుగోలు పంట వొద్దని ఆయేడు మొదటి నుంచి అంటున్న అతడా నెపంతోటే డబ్బిచ్చుకోవట మన్యాయమని చెప్పి లెంపకాయ తిన్నదీ గుర్తుంది.

వాళ్ళు పిచ్చాపాటీ మాట్లాడుతూ వుండగానే రేవణ్ణశెట్టి వచ్చాడు. కొంగ రెక్కల్లాంటి తెల్లని ధోవతి, కాళ్ళకి రబ్బరు జోళ్ళు, ఇస్త్రీ తోమిన చొక్కా, మెడలో కనిపించే బంగారపు గొలుసు, వేళ్ళకి ఎర్రగా మెరుస్తున్న మూడుంగరాలతో, ప్రాయాన్ని చూపెట్టేలా కత్తిరించిన మీసకట్టుతో, వచ్చిన రేవణ్ణశెట్టిని చూడగానే గంగమ్మకు శివేగౌడ కేసు వీగిపోతుందన్న విశ్వాసం కలిగింది.

ఆమె చెప్పింది విన్నాక అతడన్నాడు "ఎవడిబాబుసొమ్మనుకున్నాడో ఆ దగాకోరు నాకొడుకు? కోర్టుకెడతాడా? ఎళ్ళి, ఎళ్ళి మీదేం పెరుక్కుంటాడో పెరుక్కో అనండి. తిప్పూర్లో పెద్ద పెద్ద ప్లీడర్లు నాకెరిక."

గంగమ్మకు ధైర్యం వచ్చింది, "నే నల్లాగని వెళ్ళి చెప్పిరావా రేవణ్ణా?"

"ఎల్లుండమ్మగోరూ! బయపడకండి. కడమది నేన్జూసుకుంటాగా".

"నువ్వూరా నాతోటి."

"నేవొస్తే బావుండదు. నే వెనకాతలుండి నడిపిస్తాను. మీకేటి బయం? గంగమ్మగోరికున్న దయిర్యం చుట్టూరా అరవైనాలుగు పల్లెల్లో ఏమగముండా కొడుక్కి లేదంటారు జనం. మీకేటి బయం?"

ఆ మాటలు ఆపేక్షించిన పరిణామాన్ని కలిగించాయి. "నేనేం భయపడే పిరికిముండను కాను" అని పైకి లేచిన గంగమ్మ శివేగౌడ ఇంటికెళ్ళి గుమ్మందగ్గరే నుంచిని, "మా ఆయన కరణీకం చేసే రోజుల్లో కుక్కలా పడుండే వాడివి కదరా గౌడా? ఇప్పుడన్యాయంగా దండుగ పెట్టించి కోర్టుకెడతానని బెదిరిస్తున్నావా? కోర్టుకి కాకపోతే దివాన్ సాహేబ్ దాకా వెళ్ళు, నేనూ ప్లీడర్నెడుతాను. మా నుంచీ ఒక పైసా కూడా లాక్కోలేవు. ఆడముండ బెదిరిపోతుందనుకునేవు? హూం, చెబుతున్నా జాగర్త" అని ప్రతాపం ప్రకటించింది.

లోపలినుంచి వచ్చిన శివేగౌడ అడిగాడు "ఇదేంటమ్మా! రెండుగంటల క్రితమేగా న్యాయంగా మాట్లాడేరు. ఇప్పుడిట్టాగంటారు?"

"అనకండా ఏంజేయమంటావు? నాకూ కష్టకాలంలో ఆదుకునే వాళ్ళున్నారు. నేనేం దిక్కుమాలిన దాన్నికాను" అనేసి గంగమ్మ తిన్నగా ఇంటికెళ్ళింది.

ఆవిడింటికొచ్చేసరికి రేవణ్ణశెట్టి వచ్చి కూర్చునివున్నాడు. ముఖం చూడగానే ఆమె శివేగౌడతో ఏమని వుంటుందో వూహించుకున్నాడు. అతడ అడిగాడు "అమ్మగారూ! మీరూ మీ కుర్రాళ్ళు, అప్పుడప్పుడు బండి కట్టించుకుని నాలుగు దఫాలైనా తిపటూరికి వెళ్ళాల్సిన పనుంటుంది. వెళ్ళి ఇదంతా అన్యాయమని జడ్జీగారిముందే చెప్పుకుంటే కేసు మీవైపే అవుద్ది" మొత్తం మీద అయిదొందలు ఖర్చవ్వచ్చు."

"తిపటూరికెడితే తిండి తీర్థమెలాగ?" అప్పణ్ణయ్యడిగాడు.

"హోటళ్ళు లేవా?"

హోటలనగానే అప్పణ్ణయ్య నోరూరింది. బంగాళాదుంపలు, వుల్లిపాయలు వేసిన పులుసు, కూరలు, వేరుసెనగపచ్చడి, పెరుగు, పైగా మసాలా దోసెలు" - అలాగేనమ్మా తిపటూరికెళ్ళి కేసేద్దాం అని వంత పలికాడు.

"ఏమంటావురా కరణం?" అన్న తల్లి ప్రశ్నకి చెన్నిగరాయలు......

"ఎవర్నైనా తెలిసిన బుద్ధిమంతుల్నడగాలి" అన్నాడు.

శివగౌడ దావా వేశాడు. వీళ్ళు ముగ్గురూ రేవణ్ణశెట్టితో తిపటూరికెళ్ళి అతడు చూపెట్టిన మహాంతయ్యను తమ ప్లీడరుగా కుదుర్చుకున్నారు. వీళ్ళ కేసు

రేవణ్ణశెట్టి వివరించి చెప్పాడు. "వూళ్ళో కొందరు పోగై చెరుకుతోట లంటించి, అర్థంశుభం తెలియని కుర్రాడిమీద తోసి డబ్బుగుంజారు. దీనికి చేవ్రాలువేసింది మైనర్లయిన ఇద్దరు కుర్రాళ్ళు. తణఖా వుంచింది పిత్రార్జితమైన ఆస్తి, పత్రం వ్రాసి దిక్కులంవేసిన వాడు తణఖా వుంచుకున్నవాడి బావమరిది. ఇట్టాగుంటే కేసు నెగ్గదా సార్?"

"నెగ్గకేం జేస్తుంది?" అన్నాడు లాయరు.

మొదటి రోజు ఖర్చులకని వాళ్ళింట్లో వున్న బంగారమమ్మి రెండు వందల రూపాయలు తీసుకొచ్చారు. అందరి ఎదటా డబ్బిస్తే లాయరు పుచ్చుగోరని చెప్పి రేవణ్ణశెట్టి నూటయాభైరూపాయలు తీసుకుని తానొకడే ఆ తరువాత లాయరింటికి వెళ్ళొచ్చాడు. అప్పణ్ణయ్య హోటల్లో భోంచేయడమే కాక మూడు మసాలా దోసెలు కూడా తిన్నాడు. కరణం చెన్నిగరాయులు హోటలు రుచి బాగా ఎరిగిన వాడు. సంవత్సరానికి నాలుగైదు సార్లయినా దేవరసయ్యతోటి తిపటూరికి వచ్చివెళ్ళే అలవాటున్నవాడు. ఆయన కారప్పూస, రవ్వలడ్డు, మైసూరుపాకు, ఇలాంటివే తిన్నాడు. గంగాభాగీరథీ సమానురాలైన గంగమ్మ వూరినించీ తెచ్చిన పేలపిండితోటి, నాలుగరటిపళ్ళతోటి ఫలహారం పూర్తిచేసింది.

## 4

నంజమ్మకు మగపిల్లాడు పుట్టాడు. బారసాలకి వచ్చి, చెన్నిగరాయలు తమ అమ్మ కోరినట్టుగా రామణ్ణ అని తన తండ్రి పేరే పెట్టాడు. ఈసారి అల్లుడు మామ గారింట్లో చాలా రోజులుండలేదు. బావగారిని చూస్తే అతడికి లోలోపల ఏదో భయం. అదీ కాక అతడి భార్య కమల ఎప్పుడూ ధుమధుమలాడుతూ వుండేది.

పురుడొచ్చి మూణ్ణెల్లయ్యాక వూరికి వచ్చిన రెండవరోజే శివేగౌడతో కోర్టులో నడుస్తున్న కేసు విషయం నంజమ్మకు తెలిసింది. శివేగౌడకి వీళ్ళప్పుపడి వుండటం, ఆవిడికి తెలుసు. పొలం తాకట్టుపెట్టి మునసబు వద్ద రెండువేల రూపాయలు తీసుకుని, చెరుకు తోటలు తగలేసినందుకు వూరికంతా దండుగ ఇచ్చుకున్నారని-ఈ ఇంటి కోడలుగా వచ్చిన నెలరోజులకే చెరువుకి నీళ్ళకెళ్ళినప్పుడు అమ్మలక్కలనుకోగా వినింది. దాన్ని గురించి ఇంట్లో తానెవళ్ళనీ అడగలేదు. ఒక రోజు యదాలాంపగా మొగుణ్ణడిగితే "నీకెందుకా పెత్తనం, నోరు మూసుకూర్చోకే" అని జవాబిచ్చాడు.

తాను కరణీకం లెక్కలు వ్రాయటం ప్రారంభించాక ఆమెకు తాకట్టు, దాని వడ్డీ బాపతు పరిణామమేమి కానున్నదో తెలిసింది. స్వయంగా తానే ఈ సంగతెత్తి దాని విషయమాలోచించాలని వూహిస్తున్నపుడే అప్పణ్ణయ్య ఆవిణ్ణి కాలితో తన్ని, వూరు వదిలి పారిపోయింది. "ఈ అప్రాచ్యపు ముండ వల్లే నా చిట్టితండ్రి దేశాలు పట్టిపోయాడని" మొదలేట అత్తగారు రాగాలు తీస్తున్నది. ఇప్పుడీ మాట ఎత్తితే ఏమిటీ ఏట్రింత పెత్తనమని చీవాట్లు తినక తప్పదని భయపడి వూరుకుంది. ఇంతలో పురుటికని వూరెళ్ళి వచ్చేసరికి వ్యవహారం ముదిరి కోర్టెక్కింది. ఒక రోజు ఉపాయంగా భర్తనడిగేసరికి "ఆ నా కొడుక్కి ఒక్క పైసా కూడా రాల్చేదిలేదు. కోర్టులో వాడిచేతే డబ్బు కక్కిస్తాం" అని ప్రగల్భాలు పలికాడు.

"కేసు నెగ్గుతుందని మీకెవరు చెప్పారు?"

"రేవణ్ణశెట్టిగారు"

"రేవణ్ణశెట్టిగారిని నమ్మడమెలాగ? ఆయనెలాంటి వాడో మీరెరగరా?"

"గాడిదముండా! ఆయన్నంటావేమే? ఇది అలా అంటోందని రేపాయనతోటి చెబుతాను చూడు."

భర్త వట్టి అవివేకి అని ఆవిడ కొత్తగా తెలుసుకున్నది కాదు. కానీ ఆ అవివేకం ఈ మట్టంలో వుందని తెలిసినప్పుడామె కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. అంతటితో ఆ మాట వదిలేసింది. కానీ ఆ ఆలోచనే ఆవిణ్ణి కుంగదీస్తోంది. రేవణ్ణశెట్టి పేకాడుతాడు, తాగుతాడు. అతడు వీధిలో వెడుతూ ఆడాళ్ళవేపు చూసే వైఖరి బాగులేదు. ఇంట్లో అతని భార్య సర్వక్కకు సంతోషం లేదు. అన్నవన్నీ ఆమెకు తెలుసు. అవి వూళ్ళో అందరికీ తెలిసిన విషయాలే. మరుసటి రోజు బిందెలు తోమటానికని చెరువుకెళ్ళినప్పుడు రేవణ్ణశెట్టిగారి పెద్దమ్మాయి రుద్రాణి ఆమెకు పక్క బండమీదే కూర్చుని వుంది "రుద్రాణీ! మీ అమ్మ ఇంట్లోనే వుందా?"

"వూం వుంది."

"మీ నాన్న?"

"కోటిపల్లికెళ్ళాడు" పేకాటకని అందరెరిగిన విషయమే.

"అయితే ఇప్పుడే ఇంటికెళ్ళి నేను రమ్మన్నానని మీ అమ్మనోసారి పంపగలవా? నీ బిందెలిక్కడే వుండనీ, నేను చూస్తుంటానుగాని నువ్వింట్లో వుండి మీ అమ్మని పంపించు."

పది నిమిషాలలో సర్వక్క వచ్చింది. ఓ రెండు నిమిషాలు కులాసా కబుర్లు

చెప్పాకున్నాక, నంజమ్మ ఓసారి చుట్టూతా చూసి ఎవరూ లేరని నిశ్చయించుకున్నాక అడిగింది. "చూడండి, నేనో విషయం రహస్యంగా అడుగుతున్నాను. మీరు చెప్పాలి."

"ఏమిటో చెప్పండి"

"మీ ఇంటాయన మాకేసు నడిపించటానికి మద్దతిచ్చారట. అది నిజంగా నెగ్గుతుందంటారా?"

"నంజమ్మగారూ! మగాళ్ళూ మగాళ్ళ మధ్యున్న సంగతులు మనకెలా తెలుస్తాయి. ఆ మాటొదిలెయ్యండి."

"వీల్లేదు మీకెరిగుంటే తప్పకుండా చెప్పాలిసుమా."

తానూ అటూ ఇటూ పరికించి సర్వక్క అంది. "మా శెట్టిగారికి తెలిస్తే చంపేస్తారు. ఎవళ్ళకీ చెప్పనని గంగమీనొట్టేసి చెప్పండి."

"గంగమ్మ తల్లిమీద ఒట్టేసి చెబుతున్నాను. ఎవరికీ చెప్పను". అని నంజమ్మ చెరువు నీటిని తాకి ప్రమాణం చేసి చెప్పింది.

"మా ఇంటాయన హొగేరళ్ళి నింగప్పింటి అన్నాదమ్ముల ఎవారంలో లాయరీ చేశారుకదా! నేను నెగ్గిస్తానని డబ్బంతా మింగేశారు. ఆళ్ళోడిపోయారు. ఓరోజు మా ఇంటికాడికొచ్చి అమ్మా ఆలీ అక్కా అని వరసెట్టి తిట్టి నీ కడుపు మండా అని దుమ్ము తూరుపెత్తి మరీ వెళ్ళారు. ఆ పాడు పేకాటకని నానాకక్కుర్తి లాయరీ వేషాలేస్తారు."

తాను భావించినట్టే సర్వక్కకూడా చెప్పింది. ఈ కోర్టు వ్యవహారంనుంచి బయటపడేదెలా? పొలాన్ని నిలుపుకునే మార్గమేమిటా? అని ఆలోచిస్తూ నంజమ్మ పూరుకుండిపోయింది. సర్వక్క దీర్ఘంగా నిట్టూర్చి మళ్ళీ "నంజమ్మగోరూ! మీదీవాదీ ఒకటే రాతనుకోండి. మా ఇంటాయనకు కొంపలుకూల్చేబుద్ధయితే మీ ఆయన కసలు బుద్దనేదే లేదు. ఎవళ్ళకీ సుఖంలేదు. నేనెళ్ళొస్తాను మరి. నేజెప్పింది మాత్రమెవళ్ళకీ చెప్పకండేం. గంగమీనొట్టెట్టారు"అని తన బిందెలు నింపుకుని ఇంటికెళ్ళింది.

నంజమ్మ ఆ రాత్రంతా నిద్రపోలేదు. తెల్లారిలేచి, ఓపాత కాగితంమీద క్షేమసమాచారం తెలిపి ఇక్కడి పొలమంతా తాకట్టుపెట్టారు. ఇప్పుడు కోర్టులో కేసునడుస్తోంది. తప్పకుండా మీరొకసారిక్కడికి వచ్చివేళ్ళేది అని అన్నయ్యకు

వ్రాసి బిందెలుతీసుకుని చెరువుకు వెళ్ళింది. చెరువుదగ్గిర ఎవరైనా కనిపిస్తే వాళ్ళచేత దాన్ని పుట్టింటికి పంపాలని ఆమెకోరిక, అక్కడెవరూ కనిపించలేదు. కాని గుడిమాదేవయ్యగారు జోలెలోవున్న గన్నేరుపూలు బిల్వపత్రాలు నీళ్ళల్లో తడపటానికని ఆమె వున్నచోటికే వస్తున్నారు. అయ్యగారంటే గంగమ్మకు చాలా భక్తి విశ్వాసము వుండేవి. ఆయన ఇటీవల వీళ్ళింటి కెక్కువగా రాకపోయినా ఆ పెద్దకోడలంటే ఆయనకూ చాలా గౌరవముండేది. నంజమ్మ ఆ పెద్దకోడలంటే ఆయనకూ చాలా గౌరవముండేది. నంజమ్మ "అయ్యగారూ! కాస్త ఇలా వస్తారా?" అని పిలిచింది. చుట్టూ ఓసారి చూసి తనబొడ్డులో దాచితెచ్చిన కాగితం మడత ఆయన దగ్గిర పడేలా విసిరి "దాన్ని మీరు చదువుకోండి. మీకేతెలుస్తుంది. ఏమైనా చేసి అది మా అన్నయ్యకు చేరేలా చేయండి. ఎవళ్ళకీ తెలియరాదు." అని చెప్పి ఏమీ ఎరగనట్టు తలవంచుకుని బిందెలు తోమటం మొదలెట్టింది.

కాగితం మడత తీసి అయ్యగారు తన కావి చొక్కాజేబులో పెట్టుకుని "అలాగేనమ్మా!" అని చెప్పి జోలెలోని పూలూ పత్రాలు నీళ్ళలో అద్దుకుని వెళ్ళిపోయారు. ఆ రోజాయన వూళ్ళో భిక్షకెళ్ళలేదు. శివగెరె వేపున్న పల్లెంక వెళ్ళారట.

మూడవరోజా కల్లేశం కాలినడకతో చెల్లాయిఇంటికి వచ్చాడు. అన్నయ్యతో అన్నీ మాట్లాడటానికి అనుకూలమైన చోటంటూ దొరకలేదు. అలా ఎక్కడికైనా వెళ్లి మాట్లాడటంకంటే ఎదురుగుండా కూర్చుని చెప్పటమే మంచిదని నిశ్చయించుకున్న ఆమె అందరూ వుండగానే ఈ మాట ఎత్తింది. జరిగిన విషయమంతా వివరంగా చెప్పి, ముందు తామేమి చేయాలన్నదాన్ని గూర్చి అతని సలహా అడిగింది.

ఎవరి ద్వారానో కబురెట్టి కోడలు తన అన్నయ్యని పిలిపించిందన్న అనుమానం గంగమ్మకి కలగకపోలేదు. అయినా పోలీసుద్యోగం చేసిన అతని ఎదర ఏమీ మాట్లాడరాదని వూరుకుంది. వీళ్ళు తాకట్టు పత్రంలో వ్రాసిన తబిసీళ్ళేమిటో కల్లేశుకు తెలియదు. కరణంగారైన బావమరిదినడిగితే 'అదేమిటో నాకు తెలవదు. శివలింగడు రాశాడు' అన్నాడు.

"ఏమీ తెలవకుండా మీరు కోర్టుకెలావెళ్ళారు?" అని అడిగితే రేవణ్ణశెట్టిగారికీ ప్లీడరుగారికితెలుసు. "వాళ్ళేమి అబద్ధాలాడుతారా? కేసు నెగ్గి తీరుతుంది" అన్నాడు.

నంజమ్మ ధైర్యంగా రేవణ్ణశెట్టి ఎలాంటి బాపతుమనిషో వివరించింది. ఆయన్ని

నమ్ముకుంటే పుట్టిములుగుతుంది. ఇప్పుడు మనకులోచినట్టు విచక్షణతో ప్రవర్తించాలి. ఇతరులవలహాలు మనకువద్దు".

"బావా! నాతోకూడారా. శివేగౌడ ఇంటికెళ్ళి పత్రంలో ఏం రాసుందో తెలుసుకుందాం" కల్లేశు పిలిచాడు.

కానీ అతనింటికెళ్ళడానికి కరణంగారికి భయం "ఇప్పుడొచ్చావా అబ్బాయీ కాళ్ళబేరానికి? వున్నదేదో కోర్టులోనే తేల్చుకో అని అతడూదరగొట్టి పంపించేస్తాడన్న భయం లోపలే బాధిస్తోంది. అతడన్నాడు. "ఆ బోడిముండా కొడుకింటి కెళ్ళేదేమిటి? మన కేసు నెగ్గుతుంది. వాకా మాత్రం తెలవదా?"

కల్లేశు తానొక్కడే శివేగౌడ ఇంటికి వెళ్ళాడు. అనుకున్నట్టే శివేగౌడ జవాబిచ్చి పంపించివేశాడు. తిమ్మలాపురంవెళ్ళి దేవరసయ్యతో మాట్లాడమని నంజమ్మ చెప్పింది.

ఆ వూరికెలా వెళ్ళాలో తెలుసుకుని, జోళ్ళేసుకుని కల్లేశు బయల్దేరాడు. అతడు వెళ్ళిపదినిమిషాలయిందో లేదో గంగమ్మ కోడల్ని అడిగింది "ఎవళ్ళతో కబురెట్టి పిలిపించావే ఈ రంకుమొగుణ్ణి. ఈ రాత్రి వాడిపక్కనే పడుకుంటావా?"

ఈ మాటలు విన్న నంజమ్మకు పట్టరాని కోపం రావటమేకాక, అంతకుముందెన్నడూ లేని ధైర్యమూ వచ్చింది. ఆమె అంది. "అలాంటిపనులు మీరు చేశావారేమో! అందుచేత అలాంటి మాటల మీనోటవస్తాయి. నాలికకాస్త బిగబట్టండి. చిన్నతనం నుంచీ తిన్నగా వుంటే మీరెందుకిలా తయారవుతారు?"

"విన్నావట్రా చెన్నయ్యా? లేచి ఆ ముండ నడుము విరగదన్నరా."

"నాజోలికి రండి చెబుతాను. మా అన్నయ్య సాయంత్రానికెలాగూ వస్తాడు!

లేచి పెళ్ళాన్ని తన్నేధైర్యంలేదో లేదా లేవటానికి బద్ధకమో, మొత్తానికి చెన్నిగరాయుడు పైకిలేవలేదు. గంగమ్మ రెండవ కొడుక్కి ఆమాట చెప్పలేదు. చెప్పినా అతడు మరోసారి ధైర్యంగా తన్నేవాడు కాదేమో!

కల్లేశు మరుసటి రోజూరాలేదు. రెండవరోజు వచ్చాడు. అతనితో కూడా దేవరసయ్యగారు వచ్చారు. మొన్నటిరోజు తిమ్మలాపురంలోనేవుండి నిన్నటిరోజు దేవరసయ్యను వెంటబెట్టుకుని తిపటూరికి వెళ్ళి శివగౌడ ప్లీడరునే చూసివచ్చాడతడు. వీళ్ళయావదాస్తి తాకట్టుపెట్టారనీ – అయినా అసలు, వడ్డీ, కోర్టుఖర్చులు చెల్లిస్తే కష్టదార్లను ఒప్పించి, కేసు వుపసంహరించుకునేలా శివేగౌడకు తాము చెబుతామన్నాడు.

గంగమ్మను, బావనూ, అప్పణ్ణయ్యనూ కూర్చోబెట్టుకుని కల్లేశు వివరించాడు. "అసలు ఎవరూ వదులుకోరు. కోర్టుఖర్చులూ వదల్రు. వడ్డీలో కాస్త వదలమని వాణ్ణడగవచ్చు. మొత్తంమీద అయిదువేలకి ఈవ్యవహారంతెగేలా ఏదో కొంతపొలం అమ్మేసో లేదా వాడికి ఖరీదుకు కట్టో, తతిమ్మా పొలాన్ని నిలుపుకోవచ్చు. వాడింటికి వెడదాం పదవండి."

ఈ సలహా గంగమ్మకు రుచించలేదు. కాని కల్లేశు వదంలేదు. దీనికితోడు దేవరసయ్యగారు చెన్నిగరాయనికి బోధించారు. మొత్తానికి తల్లి ఇద్దరు కొడుకులూ, కల్లేశు, దేవరసయ్యగారూ - అయిదుగురూ, శివేగౌడింటికి వెళ్ళారు. వీళ్ళువీళ్ళు వచ్చారని వాడు టెక్కుగా బిర్రబిగిసి కూర్చున్నాడు. కానీ కల్లేశు, దేవరసయ్యగారూ, వాడన్నదానికంతా ఓర్పుతో నేర్పుతో సమాధానం చెబుతూ ఒప్పిస్తున్నారు. శివేగౌడ ఒకసారి గంగమ్మవేపు తిరిగి పగతీర్చుకునే వైఖరితో అడిగాడు. "ఏమమ్మా! నన్ను కుక్కా అని తిట్టి నా నుంచీ ఒకపైసాకూడా పెరుక్కోలేవని అన్నావు. ఇప్పుడు మళ్ళీ నా ఇంటికాడికే వచ్చావుకదా? సిగ్గేయదూ?"

"అమ్మా! ఇప్పుడు మీరూరుకోవాలి". అని దేవరసయ్యగారు చెబుతూనేవున్నారు. అంతలో ఆవిడ అగ్గిమీది గుగ్గిలంలా భగ్గుమంది. "ఏరాగౌడ! నన్ను ఆడముండా అనుకున్నావట్రా? నీ వెంత? నీయోగ్యతెంత? కుక్కా."

"అవుతే నాకాడేం పెరుక్కుంటావో పెరుక్కో."

"నువ్వివ్వకపోతే కోర్టులోనే కక్కిస్తాను. నువ్వునన్ను నువ్విగివ్వా అంటావట్రా నీ జిమ్మడా! వురేయ్! అప్పణ్ణయ్యా! చెన్నయ్యా! లెండిరా ఇంటికెడదాం. లేవరేంరా? తండ్రికి పుట్టిన బిడ్డలుకారా మీరు?"

అప్పణ్ణయ్యవెంటనే లేచి తల్లిపక్కన నుంచున్నాడు. గంగమ్మ చెన్నయ్యనురెచ్చగొట్టింది. "వురేయ్! చెన్నిగా! నువ్వక్కడే కూర్చున్నావేరా? నువ్వు మీ తండ్రికి పుట్టా? రంకు మొగుళ్ళకి పుట్టావా? ముండాకొడుకా లే పైకి."

కరణం చెన్నిగరాయలకు ఆత్మాభిమానం పుట్టుకొచ్చింది. అతడు తన తండ్రికే పుట్టానని, తన బావముందు, దేవరసయ్యముందు, ప్రతికక్షి శివేగౌడముందు, లోపల తలుపు వెనకాలనుంచున్నవాడి భార్యముందు, తలుపుదగ్గిరేవున్న తలారిముందు ప్రకటించడమెలాగ? తానూపైకిలేచి తల్లీతమ్ముడివెంట ఇంటికి వెళ్ళిపోయాడు. కల్లేశు, దేవరసయ్యగారు అక్కడే వుండిపోయి సర్దిమాట్లాడాలని ప్రయత్నం చేశారు. కానీ శివేగౌడ బిగుసుకపోయి అవకాశమివ్వలేదు. "ఆవిడికే

అంత వుక్రోషమైతే నాకెంతవుండాలి? ఆ నా కొడుకులు నీదంట ముష్టెత్తుకు తినేలా చేయకపోతే నేను మా అయ్యకి పుట్టిన ముండాకొడుకునేకాను. కోర్టులో కేసు నెగ్గకపోతే థూ ఖాంచోత్ అని ఎదురుగుండా అని మీకాడుచ్చుక్కొట్టుండి. చీకొట్టదాకా ఎళ్ళి. మహారాజుల్దాకా ఎళ్ళినాఎళ్ళి "అని తన మెడలోవున్న వెండి కరడిగ కుడిచేత్తో పట్టుకుని ప్రమాణంచేసి "ఆ బలిజ నా కొడుకు రేవణ్ణకాళ్ళట్టుకుని వేళ్ళాడుతున్నారు. చూపెడతాను ఎలాంటి నాణాదినో నేను" అన్నాడు.

ఇహ రాజీమాటలతో ప్రయోజనంలేదని కల్లేశు, దేవరపయ్య ఇంటికి వచ్చేశారు. గంగమ్మ అరుగుమీద కూర్చుని ప్రగల్భాలు పలుకుతోంది. కరణంగారు తాపీగా తమలపాకులూ పొగాకునములుతున్నారు. మాతృభక్తి పరాయణుడైన అప్పణ్ణయ్య శివేగౌడ పెళ్ళాంతల గొరిగిస్తాననే ప్రతాపాలు పలుకుతున్నాడు. కల్లేశుకు ఒళ్ళుమండిపోయింది.

అరుగు దగ్గరికి వచ్చి నుంచుని "ఓరి గుడ్డినా కొడుకుల్లారా? మీకు స్వయంగా బుద్ధి లేదు. ఎవ్వరైనా వచ్చి ఏదైనా దారి చూపాలని నుంచుంటే ఇలా అఘోరిస్తారు. వుసేవ్! ముసలిముండా! నువ్వు చస్తేగాని ఈ సంసారం బాగుపడదు. నీలాంటి రాకాసి ఇంటికి పిల్లనిచ్చిన మావాన్నని చెప్పుచ్చుక్కొట్టాలి."

గంగమ్మ మొదలే భద్రకాళిలా మండిపోతోంది. ఇంటికి వచ్చి తన కాళ్ళకు దండంపెట్టదగిన వియ్యంకుడి కొడుకు అలా అనేసరికి మరీ రెచ్చిపోయింది. "పాపిష్టిముండాకొడుకా! నన్నే అంటావ్రా! నిన్నెవడు పిల్చాడిబోడి పెత్తనానికి? అది పిలిపించిందని దొంగచాటుగా వచ్చావా దాని పక్కలో పడుకుందామని? వురేయ్ అవణ్ణా చూస్తావేరా వాడికి నాలుగు లెంపకాయ లివ్వకుండా."

అప్పణ్ణయ్యకా ధైర్యం ఎక్కడనుంచి వస్తుంది? కల్లేశు మళ్ళీ "పాపిముండా! నీమన్నమాటలకి నీనోట్లో పుండుపుట్టా! శివలింగడిచేతిలో వున్న కరణీకం తీసుకోలేక చచ్చిచెడి మావాన్న కాళ్ళావేళ్ళా పడ్డారే! అప్పుడెక్కడ చచ్చింది మీ పౌరుషం?"

అతడు గడపదాటి లోపలికివెళ్ళి చెల్లాయితో చెప్పాడు. "వుసేవ్! నంజీ! ఈలంజాకొడుకుల ఇంట్లో ఎలా సంసారం చేస్తావు? పిల్లల్ని తీసుకుని బయల్దేరు. నా ఇంట్లో దేవుడిచ్చిన కలోగంజో తిని వుందువుగానీ."

నంజమ్మ తొణక్కుండా ప్రశాంతంగా నుంచుని వుంది. కల్లేశు అడిగాడు "ఎందుకే నుంచున్నావు? బయల్లేరు".

"అన్నయ్యా! కోపంలో తొందరపడరాదు. లోపలికి వచ్చికూర్చో."

"ఈ భోసుడి ఇంట్లో ఓగ్లాసు మంచినీళ్ళుకూడా ముట్టను నేను" అని చెప్పి ఎదురుగుండా చిలకకొయ్యికి వేళ్ళాడుతున్న తనసంచీ తీసుకుని, జోళ్ళు తొడుక్కుని వెళ్ళిపోయాడు. "అన్నయ్యా! ఇదేం ఇలా చేస్తావు?" అని ఆవిడ పిలిచినా పలకలేదు. నిలవలేదు. శివేగౌడ ఇంటిలో వాడన్నమాటలు ఈ సమయంలో తాను నంజమ్మకు చెబితే అరుగుమీద వున్నావిడ మరీవెర్రెత్తి రెచ్చిపోతుందని ఎరిగిన దేవరసయ్యగారు వూరికి వెళ్ళిపోయారు.

## 5

ఇప్పుడు నంజమ్మకు వెనకటికి లేని ధైర్యంవచ్చింది. సొతుతండ్రికి విషయం తెలిపితే ఆయనైనా వచ్చి వీళ్ళకు కాస్త బుద్ధి చెప్పవచ్చు – అనే ఆశ ఒకటి కలిగింది. కల్లోయితే సొంతఅన్నయ్య, వుత్తరంవ్రాసింది. కాని ఆయనకెలా వ్రాయటం? ఎలాగూ ఆయనకూడా తనకుతండ్రితో సమానంకదా అని ఆలోచించి, ఒక మధ్యాహ్నం, వాళ్ళందరూ పడుకున్నప్పుడు కూర్చుని ఒక కాగితంమీద వ్రాసింది. కడూరుజిల్లా, కసబాతాల్లూకా నుగ్గేకెరెగ్రామపు వేశ్యామాభట్లు అనే విలాసం ఆవిడకి తెలుసు. వూరికి వారానికోసారి కంబన కెరెనుంచీ పోస్టుమాన్ వానప్పగారెలాగూ వస్తారు. ఈ గ్రామానికి వచ్చినట్టు గుర్తుగా, కరణం చెన్నిగరాయల సంతకం చేయించుకుని వెడతారు. ఆ విషయం నంజమ్మకు తెలుసు.

ఆ వారం ఆయన వచ్చినవేళకి పిల్లలు మినహా ఇంట్లో మరెవ్వరూలేదు. "వానప్పగారూ! నాకోకవరు కావాలి. కానీ నాదగ్గర డబ్బులేదు. రెండు కొబ్బరిచిప్పలిస్తాను. సరిపోతుందా?" అని నంజమ్మ అడిగింది.

"అమ్మా! అదేం మహాభాగ్యం, నేను వచ్చినప్పుడల్లా ఏదోతిండి పెడుతూనే వున్నారు. ఏదోపుచ్చుకుని కవరివ్వాలా? దానివెలఎంత మహా! తీసుకోండి?

"ఈ సంగతి ఎవరితోటి చెప్పకండి. మా ఇంటికేను మీకూ తెలుసుకదా? మామరిదిగారి మావగార్ని రమ్మని రాశాను" అని వుత్తరం ఆయన చేతికిచ్చి అడ్రసు చెప్పింది. వేస్తానని చెప్పి ఆయన ఆ కవరు తన కాకీ జేబులో వుంచుకున్నారు. కరణంగారు వూరిముందున్న వీరాచారి కొలిమిదగ్గరో, గుడిమాదేవయ్యా ముందో కూర్చుని పొగాకు నములుతూ వుంటారని ఆయనకు తెలుసు. అక్కడే సంతకం చేయించుకుంటానని చెప్పి వెళ్ళిపోయాడు.

తాను తప్పుపనిచేశానేమో అని ఆయన వెళ్ళిపోయాక ఆవిడ కనిపించింది.

తల్లిని వేరే కాపురముంచినట్టయితే, పచ్చి పెళ్ళాన్నీ కూతుర్నీ తీసుకెళ్ళచ్చని ఆయన చెప్పిన సంగతి అప్పణ్ణయ్య వూరికి వచ్చినకొన్ని రోజులకు తల్లితో చెప్పాడు. "మా సంసారం ముక్కలు చేయాలనుకున్నాడా ఆ కడూరుసీమ జోస్యులు?" అని గంగమ్మ కొన్ని రోజులు తిట్టిపోసింది. అదయ్యాక లిపటూరికి పదేపదే తిరిగే అవసరమేర్పడి మాట్లాడటానికి వేరేవిషయాలున్నందున వియ్యంకుని దూషణ ప్రసంగాలలో రావటంలేదు. మొదలే ద్వేషం, ఆయన వస్తే ఈమె నోరు వూరుకోదు. తానైతాను ఆయన్ను పిలిపించి, పోట్లాటపెట్టినట్టవుతుందనే ఆలోచన ఆమెకు కలిగింది. అయినా తానుచేసింది పూర్తి తప్పుకాదన్న వూహకూడా ఒకవేపు కలిగి ఆ ఆలోచనకి సమాధానం చెబుతోంది.

ఆమె వానప్పగారితో వుత్తరం పంపిన పన్నెండోరోజు సాయంత్రం నాలుగు గంటలవేళకి శ్యామాభట్లు ఒక్కడేవచ్చాడు. తోటలో పొన్నగంటాకు కోసుకరావటానికి గంగమ్మ వెళ్ళింది. అప్పణ్ణయ్య ఆవుతోదూడ అన్నట్టు తల్లివెంటవెళ్ళాడు. చెన్నిగరాయలు ఇంట్లోనే వున్నాడు. వచ్చిన ఆయనకి కాళ్ళకి నీళ్ళిచ్చి భోజనం వడ్డిస్తూ నంజమ్మ కోర్టుకేసు విషయమూ, తన అన్నయ్య వచ్చిన సంగతీ - అంతా చెప్పింది. పెళ్ళాం ఈ విషయం చెబుతూ వుంటే కరణంగారికి కోపమేమో వచ్చింది. కాని వియ్యంకుల ఎదర ఆమెను తిట్టే సాహసం లేనందువల్లో, పిగ్గువేతో, ఆయన నడవలో కూర్చుని, పొగాకురసం బయటికి కారకుండా నోట్లోనే వుంచుకునే సాహసం చేస్తున్నాడు.

శ్యామాభట్లు భోంచేసివచ్చి పడుంపేల్చేవేళకి, గంగమ్మ ఒక తట్టనిండా పొన్నగంటాకు కోసుకుని వచ్చింది. ఆమె వెనకాలే అప్పణ్ణయ్య తరపేదూడని పలుగుచ్చుగుని తెచ్చి గొడ్లపాకవేపు వెళ్ళాడు. వియ్యంకుణ్ణి చూసిన గంగమ్మ అగ్గిమీద గుగ్గిలమయింది. నా కొడుక్కు వేరేకాపురం పెట్టాలని నూరిపోసిన ఈ కొంపలు కూల్చే లంజాకొడుకు సిగ్గులేకుండా వచ్చి కూర్చున్నాడు. వుండనీ వీడి భరతం పడతాను. అని లోపలికివెళ్ళి ఆకులతట్ట వంటింట్లో దబీసుని కుక్కేసింది. బయటికి వచ్చి వియ్యంకుడి ముందు నుంచుని "ఏరా! నా కొడుకుని వేరేచేద్దామని వచ్చావా? బ్రాహ్మణార్థాంలో పొట్టగడుపుకునే జోస్యులూ?" అని విరుచుకపడ్డది.

తన వియ్యంకురాలి నోటికి కళ్ళెంలేదన్నసంగతి శ్యామాభట్లుకు తెలును. కానీ తనముందే తన్నిలా అనగలదనేవూహ ఆయనకురాలేదు. మాటరాకుంటే రెండు నిమిషాలపాటు గుడ్లప్పజెప్పి ఆవిణ్ణే చూస్తూ కూర్చుని చివరికన్నాడు.

"చూడండి. మీరు కాస్త సహనం వహించాలి. మీ కొడుకు మీతోవుంటే మాకేమీ కడుపుమంట లేదు. అయినా ఇప్పుడు నేను వచ్చిన ముఖ్యవిషయమేమిటంటే, మీరిప్పుడు కోర్టుకెళ్ళి పెద్దలు సంపాదించిన ఆస్తి పోగొట్టుకోరాదు. విచక్షణతో ప్రవర్తించి ...

ఇంకా మాట పూర్తిచేయకముందే గంగమ్మ మనస్సులో, ఆయనకిదంతా తెలిపి ఎలా వచ్చిరవ్వది, చెకుముకి రాతికుండి లేచేనిప్పురవ్వలా మెరిసింది. వంటింటి తలుపుదగ్గిరకెళ్ళి కోడలివేపు మెడతిప్పి "ఏమే తాటకి! అప్పుడు మీ అన్నయ్యకు కబురెట్టి వాడి పక్కన పడుకున్నావు. ఇప్పుడీ ముసిలిజోస్యుడికి కబురెట్టావా? ఈ రాత్రి వీడితో సరసాలాడాలనా? మదపిచ్చి ఎత్తిందానీకు?" అని (నాలుగూ కక్కేసి ఓసారి అరుగుచివరికెళ్ళి తాంబూలం వుమ్మేసి వచ్చి మళ్ళీ కూర్చున్న కొడుకు దగ్గిరకెళ్ళి "ఏరా! షండ లంజాకొడుకా! మీనాన్నకి వుట్టలే దూమవ్వు? నీ పెళ్ళాం వీడికుత్తరంరాసి పిలిపించిందిరా చవటా! ఈ రాత్రి నువ్వు బయట అరుగుమీద పడుకో. అది వీడితో అటకమీద సరసాలాడని?" అంది.)

అంతలో తన రెండు చేతులలోటి చెవులు మూసుకుంటూ, నోటితో 'రామ!రామ!' అంటున్న శ్యామాభట్లు కళ్ళుమాత్రం వియ్యపురాలివేపు చూస్తున్నాయి. ఇంతవాగిన గంగమ్మ అంతటితో ఆగక బయటికి వచ్చి అప్పల్లయ్యను తీసుకుని రేవణ్ణశెట్టి ఇంటికి వెళ్ళింది.

చెవులను గట్టిగా మూసిన చేతులుతీసి శ్యామాభట్లు చెన్నిగరాయునితో అన్నాడు. "చూడండి ఇంటికి పెత్తనదార్లని మీతో చెబుతున్నాను. ఇంట్లోవున్న పెద్దాళ్ళు ఇలా బరితెగి నోటికి వచ్చిందల్లా కూస్తే సంసారం నిలవడమెలాగ? మా పొతు చెబుతూనే వుంటుంది. మీ కుటుంబంలో నంజమ్మ గుణగణాలు, తెలివితేటలూ చాలాగొప్పవీ మంచివీ అని. ఆ అమ్మాయినే అందులోనూ పెద్దకోడల్ని నా కళ్ళెదుటే ఇలా అంటే ఇహ చిన్న కోడల్ని మా అమ్మాయిని ఏమంటుంది అన్నది తెలుస్తూనే వుంది. ఏదో జావగల్లువేపు వాళ్ళు - బంధువులే అనుకోండి - చెప్పారని మేమీఇంటికి పిల్లనిచ్చాం. ఇప్పుడెలాగు వుభయసంకటంలో పడ్డాం. నేను చెప్పింది విన్నారా?"

"మరో రెండాకులు పట్రావే", కరణంగారు పెళ్ళాన్ని ఆదేశించారు. నంజమ్మ తెచ్చిపెట్టాక, వాటికి సున్నంరాచి, మడిచి బుగ్గనెట్టుకున్నాక పొగాకు తుంపు నవరిస్తూ ఆయన "హుం" అన్నాడు.

"మిమ్మల్ని వేరుచేయాలని మా వుద్దేశంకాదు. కానీ ఇంట్లో మగాళ్ళు మీరు కాస్త తెలివితేట లుపయోగించాలి. ఇప్పుడు మీకొచ్చిన వాళ్ళతోటి రాజీపడి వ్యవహారం తేముల్చుకోండి. వంజమ్మన్నట్లు ఏ రెండుపొలాలు వాడికిచ్చి అప్పుతీరింది అనిపించుకుని తాకట్టుపత్రంమీద వంతకం చేయించి తీసుకోండి. వున్నదాంట్లోనే ఎలాగో జీవనం చేయవచ్చు."

కరణంగారు బుగ్గలో పూరుతువ్న తాంబూలరస చర్వణంలో నిమగ్నులైవున్నాడు. ఆయన ప్రత్యుత్తరానికి నిరీక్షించని శ్యామాభట్లు "ఏమంటారు?" అని అడిగేసరికి, ఏదో చెప్పబోతున్నట్టు ముఖాన్ని అటకవేపెత్తి నోరుతెరిచాడేకాని, తాంబూలరసం నుంచి పైకి లేచి వాలికేమీ పలకలేదు. ఆయన లేచివెళ్ళి వుమ్మేసి వచ్చేదాకా వేచివున్న ముసలాయన మరోసారడిగాడు. "ఇప్పుడు మీరు సమాధానం చెప్పితీరాలి."

చెన్నిగారాయంకేమి చెప్పాలన్నా భయం. చివరికెలాగో ఒకనిశ్చయానికి వచ్చి, "నాకుతెలుసు, మీరున్నారు. మా అమ్మవుంది. మీ ఇష్టం" అని చెప్పి బయటికి వెళిపోయాడు.

"అమ్మా! విన్నావా?" భట్లు అడిగాడు.

వంజమ్మ ఇవతలకి వచ్చి అంది. "ఈయిన స్వభావం మీకుబాగా తెలవదు. మీ అల్లుణ్ణి నిలదెట్టి అడగండి. ఏంలేదన్నా 'మా మా కొంపలు మాకురానీ. అప్పుచెరిసగం తీర్చేస్తాం' అని అప్పణ్ణయ్య పట్టుపట్టితే ఒకదారికొస్తుందేమో!"

"అతడి యోగ్యత ఏమిటో నీకుతెలియదా? ఈ కోర్టువ్యవహారం మాకు తెలియదు. కానీ అంతకముందే నిశ్చయించుకున్నాం. ఉన్నదొక్కతే కూతురు. ఎలాగో పోషించగలం. దేవుడు రెండు పూటలా అయిదువేళ్ళలోనికి పోనిస్తున్నాడు. ఈ అత్తదగ్గిరికి మా అమ్మాయినెలా పంపటం? అంచేతే కూతుడొచ్చాక కూడా అక్కడేవుంచుకున్నాం."

ఏం చెప్పాలో తోచక వంజమ్మ వూరికే నుంచుంటి. ఇంతలో ఇంట్లోకి దూసుకవచ్చిన గంగమ్మ కోడల్ని చూడగానే మండిపడ్డది. "అయిందేమే రంకుమొగుడితో సరసాలు. నీ మొగుడు ఇల్లొదిలి గుళ్ళో చతికిలబడ్డాడుగావును?"

వంజమ్మకు తిక్కరేగడమేకాదు. ధైర్యమూ వచ్చింది. తిరగబడి "అలాంటిపనులు మీరేచేస్తారు కాబోసు. అంచేతే మర్యాదగావున్న కోడళ్ళనంటారు. మీనోట్లో పురుగులడ, నోరుమూసుకూర్చుంటారా లేదా? చెప్పండి."

"మాలముండా! నన్నే అనేదాకావచ్చావా? నీ తాళి తెంపించకపోతే నేను

జానగల్ల ఆడదేకాను" అని పిచమెత్తి గంగమ్మ గుడికెళ్ళి కొడుకుముందు మంచుని గర్జించింది. "నీ తండ్రికి పుట్టిన ముండాకొడుకైతే వచ్చి నీపెళ్ళాం పళ్ళూడగొట్టి దాని తాళి తెంచిపారెయ్‌రా. వానోట్లో పురుగుండ అనింది కదరా ఆ ముప్పాతి !"

తంబూరామీటుతూ "మేలుకోరాతమ్ముడా! హాముకరవక మున్న..." అని పాడుతూవున్న మాదేవయ్యగారు చటుక్కున ఆపి చూస్తూ కూర్చున్నారు. "నీ తండ్రికి పుట్టావో లేదో చెప్పేశెయ్‌రా. తండ్రికిపుడితే నువ్వొచ్చి దాని తాళితెంచేస్తావు"- అని మరోసారి సవాలుచేసేసరికి తనపుట్టుకలోని పవిత్రతను తల్లికి నిరూపించగల మార్గం తోచక రెండు నిముషాలు అటూ ఇటూ లోలోపల గిజగిజలాడి చెన్నిగరాయుడు చివరికి ధైర్యం చేసి పైకి లేచాడు. దగ్గిరేకూర్చున్న మాదేవయ్యగారు అతడి చెయ్యి పట్టుకుని లాగి కూర్చోబెట్టి "కరణంగారూ! ఇందాకా భజన వింటున్నారు. ఎక్కడి కెళ్ళింది మనస్సు?" అని అడిగారు.

మళ్ళీ ఏమీ ఎరగనట్లు కరణంగారు "పానిద్దురూ! పాడండి విందాం" అన్నాడు. తంబూరా మీటుతూ మాదేవయ్య ఆ భజనపాటే పాడటం మొదలెట్టేసరికి గంగమ్మ "ఈ చవట ఆ నవ్నానిమాట వింటాడేకాని కన్నతల్లి పరువుగంగపాలుచేస్తున్నాడు" అంటూ మళ్ళీ రేవణ్ణశెట్టి ఇంటికి వెళ్ళింది.

ఇక్కడ శ్యామాభట్లు వంజమ్మతో "అమ్మా! నేను వచ్చీ ఏమిప్రయోజనం లేదు. నేను వెడతాను. నాకూ పద్దెనిమిది వూళ్ళ పౌరోహిత్యముంది. కూతుర్ని. మనవరాలినీ ఎలాగో పోషించగలను" అని చెప్పి సంచీ గొడుగు తీసుకున్నాడు. "ఎలాగైతే అలా అవుతుంది. సాతూని పంపండి" అని ఆవిడ అన్నదానికి "ఎందుకు పంపాలి? నీ కంతా తెలుసుగా?" అన్నాడు.

ఆమె మళ్ళీ మాట్లాడలేదు. బయల్దేరిన ఆయనకి నమస్కారం చేసింది. "దీర్ఘసుమంగళీభవ. సకలసన్మంగళాని భవంతు" అని ఆశీర్వదించి ఆయన బయల్దేరాడు. తలుపుదగ్గిరకు వచ్చిన వంజమ్మ "తిపటూరివేపే తిమ్మలాపురం అని వుంది. ఆ వూళ్ళో కరణం దేవరసయ్యగారని వున్నారు. ఆయనింటికెళ్ళి రాత్రి అక్కడేవుండి తెల్లారివెళ్ళండి. చీకటిపడ్డాక తిపటూరిదాకా నడిచివెళ్ళకండి. బిక్కనతిట్టులో దొంగలున్నారట. ఒకటి అరా బళ్ళల్లో జనం వెడుతున్నా మీదపడి వున్నదంతా దోచుకుంటారట" అని హెచ్చరించింది.

# 7వ అధ్యాయం

రామణ్ణకు ఒకటిన్నర సంవత్సరం పూర్తికావస్తోంది. నంజమ్మ మళ్ళీ నీళ్ళోసుకుంది. కోర్టు వ్యవహారంలో వున్న పొలమంతా వూడ్చుకుపోతుందని ఆమె అంతరంగం చెబుతూనే వుంది. "పులిమీద పుట్ర అన్నట్టు ఇంకా ఎందుకీ పిల్లలు?" అని ఒకోసారి విసుక్కునేది. అయితే పెళ్ళై ఇన్ని రోజులైనా అన్నయ్యకి పిల్లలు లేరు. దేవుడు మనకిస్తున్నప్పుడు వద్దనరాదు, అని సమాధానం చెప్పుకునేది.

అదే సమయంలో వూళ్ళో రెండు సంఘటనలు జరిగాయి. మొదటిది వూరికి ప్లేగు రావటం. అది ఆ చుట్టుపక్కల కొత్తదేంకాదు. రెండుమూడేళ్ళకోసారి వూరు వదిలి, పొలాల్లో షెడ్లు వేసుకుని వుండటం ప్రజల కలవాటై పోయింది. రెండవ అపూర్వమైన విషయమేమిటంటే కాశింబడ్డి అనే షావుకారు ఆ వూరికి వచ్చి వడ్డీ వ్యాపారం ప్రారంభించటం. వెండి బంగారంమీద, ఇత్తడి రాగి పాత్రంమీద, తాకట్టు పెడితే, అప్పిచ్చి రూపాయికి రోజుకి పైసా చొప్పున వడ్డీ లాగే అతడు మలబారుకు చెందిన మాప్లె ముసల్మాన్. లంబాడి లంగాలాంటి గళ్ళపంచకట్టుకుని తలకి కుచ్చుటోపీ పెట్టుకునేవాడు. వయస్సు దాదాపు యాభై. 'రోజుకో పైసా ఓ లెక్కా! అవసరానికి ఆదుకోవాలిగాని అంటూ శివేగౌడ జనానికి అతడు అప్పుపెట్టే ఔదార్యాన్ని ప్రచారం చేసేవాడు. అతడే ఆ పరదేశస్థుడికి వుండటానికి ఇల్లిచ్చాడు. శివేగౌడకు వూళ్ళో మొత్తంమీద మూడిళ్ళున్నాయి. వీధికి కాస్తపక్కగావున్న చిన్న ఇంట్లో పెద్ద ఇనప్పెట్టి తెచ్చిపెట్టుకుని అతడులావాదేవీ ప్రారంభించాడు. ఆ ఇంటికి సంవత్సరానికి పద్దెనిమిది రూపాయలు అద్దె ఇస్తాడట. శివేగౌడ తనకూ అతని వడ్డీ వ్యాపారానికి ఎలాంటి సంబంధమూలేదని స్వయంగా అందరితోటి చెప్పేవాడు.

కాశిం బడ్డి సావుకారు వూరికివచ్చిన రెండుమూడు నెలల్లో ఇంచుమించు వూళ్ళోవాళ్ళంతా అతడిదగ్గిర అప్పుచేయటం మొదలెట్టారు. శివేగౌడకూడా అవసరమైతే వడ్డీకి అతని దగ్గిరే అప్పుతీసుకుంటాడట. లెక్కల్లో మోసం లేదు.

దగాలేదు. వడ్డీకట్టడంలో పేచీలేదు. రోజుకు రూపాయికి పైసా అంతే. అంచేత వూరికంతా అతడు త్వరలోనే కావలసిన కల్పవృక్షమయ్యాడు. ప్లేగువచ్చి వూరువదిలేటప్పుడు కాళిందబిట్టికూడా శివేగౌడ తోటలో అతని షెడ్డుపక్కనే షెడ్డువేయించుకున్నాడు. లావాదేవీ - ఇనప్పెట్టితోసహా అక్కడే దేదీప్యమానంగా వెలిసింది.

గంగమ్మ కుటుంబం కూడా ఎప్పటిలాగే వూరుముందున్న తమ తోటలో షెడ్డు వేసుకుంది. నంజమ్మ కిప్పటికింకా మూణ్ణెల్లు వేవిళ్ళు, మధ్యమధ్య డోక్కుంటూనే ఇంటిసామానంతా కట్టి అక్కడికి సాగించి సర్దుబాటుచేసే వ్యవహారమంతా ఆవిడ మీదే పడ్డది. మాదేవయ్యగారు కూడా గుడి వదిలిపెట్టాలి. చోళేశ్వరుని గుడి మూలలింగం చెరువు కట్టమీదిగుడిలో వుంది. చెరువుకట్టమీది గుడి రాతి కట్టడం. జక్కణాచారి కట్టిందని అందరూ అంటారు. అక్కడ పాములెక్కువ అని అందరెరిగినదే. పామంటే ఏమిటి? శివుని కంఠాభరణంకాదా? అది ముప్పేందేస్తుంది? అని అయ్యగారు తమ తంబూరా, చిటికెలు, జోలె, పంచెలు, వున్న గింజాగట్రా అన్నీ తీసుకుని అక్కడికే వెళ్ళారు. గంగమ్మ షెడ్డుకూ కట్టమీది గుడికి చాలా దూరమే వుంది. అంచేత కరణం చెన్నిగరాయలు ఇప్పుడక్కడికెక్కువగా వెళ్ళటంలేదు. కాళిందబిడ్డ కూడా పొగాకు వేస్తాడు. అంచేత చెన్నిగరాయులు ఆయన షెడ్డుకు వెళ్ళికూర్చునేవాడు. అక్కడికి ఒకోసారి శివేగౌడ కూడా వచ్చి కూర్చునేవాడు. వాళ్ళిద్దరు పరస్పరం మాట్లాడటం మానెయ్యలేదు. ఎంతైనా మునసబుగారు, కరణంగారు తప్పుతుందా? అదీకాక పోట్లాట జరుగుతున్నది గంగమ్మ శివేగౌడలమధ్య, కాని కొడుకక్కడి వెడుతున్నాడని తెలిసినప్పుడు అతణ్ణి నోటికి వచ్చిన బండ తిట్లు తిట్టేది.

వూరువదిలేముందు ప్లేగు తగిలి చచ్చిపోయిన ఆరుగురు పెద్దవాళ్ళు, ఇద్దరు పిల్లలు మినహా గ్రామంలో ఈసారి చాలామంది చచ్చిపోలేదు. వూళ్ళోవాళ్ళంతా మారెమ్మ పూజచేయించారు. వెంటనే వూరువదిలి వచ్చేశారు. వ్యాధితో మరణాలు లేనందువల్ల అందరిమనస్సులూ వూరట చెందినా నిష్కారణంగా సివార్లలో వుండటం అందరికీ విసుగెత్తింది. కానీ ఆ విసుగుదలని మరపిస్తూ కాలక్షేపానికి మేతగా కొత్తవిషయమొకటి అందరికీ దొరికింది.

గంగమ్మ శివేగౌడలకేసు కోర్టులో ఆఖరు దశలోవుంది. రెండువేపుల ప్లీడర్లూ బల్లగుద్ది వాదించారట. 'మా ప్లీడరువేసిన పాయింటుకు జడ్జిగారే అల్లాడిపోయారు'

అని రేవణ్ణశెట్టి చెప్పిన మాట వూరంతా పాకింది. 'మా ప్లీడరు వేసిన పాయింటుకు గంగమ్మ ప్లీడరిక్కడే వుచ్చోసుకున్నాడు' అని శివేగౌడ ఎదురుప్రచారం చేశాడు. రెండువేపులవాళ్ళూ వుత్సాహంగా తిపటూరికి వెళ్ళొస్తున్నారు. అప్పణ్ణయ్య అందరికంటె ముందు బండిదిగిదిగగానే తిపటూరి హోటలుకు దారితీసేవాడు. చెన్నిగరాయలు తమ్ముడికెప్పుడూ తీసికట్టుకాదు. శివేగౌడ 'రాగిరొట్టెలో నువ్వుల పొడిలో తృప్తిపడి కోర్టుపని ముగించుకుని తిరిగివచ్చేవాడు.

తీర్పుచెప్పేరోజు ఇరుపక్షాలవారు బళ్ళు కట్టించుకుని వెళ్ళారు. గంగమ్మ గుండెమీద చేతులెట్టుకుని జడ్జిగారి తీర్పువిన్నది. శివేగౌడనుంచీ వీళ్ళ డబ్బు తీసుకున్నది నిజం. దానివడ్డీ, వడ్డీకివడ్డీ, అతని కోర్టు ఖర్చులు అన్నీ వెరసి అయిదువేల అయిదువందలరూపాయలు వీళ్ళుకోర్టుకు కట్టాలి. లేని పక్షంలో కోర్టువారే పొలమంతా వేలంవేసి అప్పిచ్చిన ఆసామికి మొత్తం చెల్లిస్తారు. 'నీ పెళ్ళాం ముండమొయ్యా! లంజాకొడుకా!' అని జడ్జీగారిని తిట్టాలని నాలికదాకా వచ్చినా కోర్టుద్వారం దగ్గిరేవున్న పోలీసులు గుర్తుకువచ్చి ఆవిడ వూరుకుంది.

కోర్టునుంచీ వచ్చాక ప్లీడరు మహంతయ్యగారన్నారు. "తమకూరు కోర్టుకు వెళ్ళచ్చు. డబ్బుఖర్చవుతుంది. తెచ్చారా?"

"ప్లీడరుగారూ! మాఇంట్లోవున్న వెండి, బంగారం, పాత్రసామాను అన్నీ తాకట్టుపెట్టాను. మొగుడు చచ్చినముండని. డబ్బెక్కణ్ణుంచీ తేను?"

అంతలో శివేగౌడ ప్లీడరుగారుకూడా అక్కడికి వచ్చారు. వాళ్ళిద్దరూ ఇంగ్లీషులో ఏదోమాట్లాడుకున్నాక, గంగమ్మప్లీడరు "చూడమ్మా! శివేగౌడతో చెప్పి మీకింతాఅని డబ్బిప్పిస్తారట. మీ అప్పుతీరినట్టవుతుంది. పొలమంతా అతనికి రాసిస్తారా? మీకూ చివరికన్యాయం జరగకూడదు."

"పొలమిచ్చేస్తే పొట్టపోషించుకోవటమెలాగ ప్లీడరుగారూ?" గంగమ్మ అడిగింది. నోట్లో పొగాకురసం వున్నందున చెన్నిగరాయలు మాట్లాడలేదు.

"లేకపోతే హైకోర్టుకు వెళ్ళాలి. దానికి వేలకొద్ది రూపాయలుకావాలి. డబ్బెలాగైనా సర్దగలము అంటే అది వేరేమాట."

మరోమార్గం లేదు. శివేగౌడను అక్కడికే పిలిపించారు. తానే రెండువేలిస్తానని శివేగౌడ ఒప్పుకున్నాడు. కోర్టుద్వారా వేలంవేస్తే మరెవళ్ళయినా పాటపాడేవాళ్ళు పుట్టుకొస్తారేమో అని అతడిభయమతనిది. గంగమ్మకు దిక్కుతోచలేదు. శివేగౌడ అప్పటికప్పుడే కొబ్బెరమండికి వెళ్ళి రెండువేలరూపాయలు తెచ్చిచ్చాడు.

ఇద్దరు ప్లీడర్లూ చేరి కాగితం పత్రం వ్రాసి తీర్మానించారు. మహంతయ్యగారి చివం "పిజా వందరూపాయలిచ్చుకోవాలి. రేవణ్ణశెట్టి అది ఇవ్వలేదని ఆయన చెప్పారు.

"మీకు మొత్తం మీద ఎనిమిదొందలు ముట్టచెప్పానండీ" అని గంగమ్మ ప్రమాణంచేసి చెప్పింది.

"మొత్తం మీద నాకు వందయాభై మాత్రంముట్టాయి". అని ఆయనన్నారు.

తీర్పుచెప్పే రోజు "మీరు బండ్లో ఎల్లండి. నేను పొద్దుట బస్సులో వొస్తాను" అని చెప్పిన రేవణ్ణశెట్టి రానేలేదు. చివరికి ఆమె ప్లీడరుగారికి వందరూపాయలిచ్చింది. మరునాటిరోజు ఆ పత్రాలు రిజిస్టరు చేయించాక బండి కట్టించుకుని వూరికి బయల్దేరారు. పందొమ్మిది వందలరూపాయలు మూట కట్టుకుని గంగమ్మ తానే ఒడిలో దాచుకుని బండిలో, కన్నుమూయకుండా కూర్చుని వూరికి వచ్చింది.

వచ్చాక ఆమె కోర్టు తీర్పునుగురించి ఎవ్వరితోటి చెప్పలేదు. కానీ శివేగౌడ చెప్పకుండా వుంటాడా? వార్త పొక్కగానే కోర్టుఖర్చులకని వందా, యాభై చొప్పున నోటు వ్రాసి తెచ్చిన అప్పులవాళ్ళంతా షెడ్డుమీదికి వచ్చిపడ్డారు. మొత్తం ఎనిమిదివందలు అప్పుల కింద తీర్చింది. మిగిలింది గంగమ్మ తన పక్కకింద వుంచుకుని దానిమీద జాగర్తగా పడుకునేది. ఒకరోజు రేవణ్ణశెట్టి షెడ్డుకువెళ్ళి అడిగింది. "రేవణ్ణా! నువ్వుప్లీడరు గారికి పూర్తిడబ్బు ఇవ్వనేలేదట. వాదగ్గర వందరూపాయలుచ్చుగున్నారు."

"ఎవడు చెప్పాడు?"

"ప్లీడరుగారే చెప్పారు"

"రంకుమొగుళ్ళకి పుట్టిన నాకొడుకు. పదండి నా ఎదర ఆమాట చెబితే చెప్పుచ్చుక్కొడతాను. దొంగనాకొడుకు" అని రేవణ్ణశెట్టి గుడ్లెర్రజేశాడు. ఎంచేతో గంగమ్మకు మరిమాట్లాడబుద్దేయలేదు. భయమో, విసుగో, లేదా రేవణ్ణశెట్టి సత్యసంధతమీది నమ్మకమో వూరుకుంది.

"రేవణ్ణా! వెగ్గించి ఇస్తానన్నారుకదా ప్లీడరుగారు. ఎందుకు పీగిపోయింది?"

"జడ్జిగారికి రెండుచేతులా లంచంపోశారట! శివేగౌడ ఆయనకి ముందురోజు రెండువేల రూపాలయిలిచ్చాడట. వాడు బండికట్టుకుని ఓరోజు ముందెవెళ్ళాడుగా? నాకు ముందేతెలుసు. మనకాడ రెండు వేలరూపాయలుంటే మనమూ ఇచ్చుండచ్చు. మీ దగ్గరలేవని నాకు తెలుసు. అంచేతే తీర్పురోజు వేనురాంది."

గంగమ్మ నోరుమూసుకుని తనషెడ్డుకు వెళ్ళింది.

## 2

ఎంతోమంది గంగమ్మ షెడ్డుకెళ్ళి శివేగౌడను జడ్జీగారిని తమకు తోచినట్టు తిట్టి ఆమెకు సానుభూతి తెలియజేశారు. ఒకరోజు వుదయమే అయ్యాశాస్త్రులొచ్చి శివేగౌడను దూషించి, "గంగమ్మా! మా ఆవిడ నీతో ఏదో మాట్లాడాలనుకుంటోంది. రా మాట్లాడుదువుగాని, అని తన షెడ్డుకు తీసుకెళ్ళాడు. అక్కడ శాస్త్రిగారు, ఆయనభార్యా కలిసి మళ్ళీ శివేగౌడను రకరకాలుగా ఆడిపోసుకున్నారు. ఆ జడ్జీగారి భార్యాపిల్లలు చచ్చిపోతారని శాస్త్రిగారు పంచాంగం చూసి జోస్యం చెప్పారు."

"గంగక్కా! పట్టుబట్టవుంది. నువ్విక్కడే మడికట్టుకుని భోంచెయ్యి. నిన్నెవరు అయ్యోపాపమనేవాళ్ళు?" అని శాస్త్రిగారి భార్య సుబ్బమ్మ బలవంతం చేస్తే గంగమ్మ తన కోడల్ని మనసారా తిట్టడం ప్రారంభించింది. "ఆ చుప్పనాతిముండ మా ఇంట్లో అడుగెట్టిందోలేదో కష్టాలు, కష్టాలు మొదలెట్టాయి. పొలమంతా పోయింది. పుడుతూ పుడుతూ పిల్లల పుణ్యం, వస్తూ వస్తూ కోడలిపుణ్యం అన్నసామెత అబద్ధంకాదు." ఆమె స్నానంచేసి పట్టుబట్టకట్టుకుని విభూతి రాసుకుని, మూడుసార్లు ఆచమనం చేసేసరికి శాస్త్రిగారామె షెడ్డుకెళ్ళి అప్పణ్ణయ్యనుకూడా తీసుకవచ్చాడు. శాస్త్రిగారి పెదనాన్న మనవడు అణ్ణాజోస్యులా వేళక్కడికి వచ్చాడు. వీళ్ళిద్దరికీ సుబ్బమ్మ వంట చేసే వుంది. దూడిదగుమ్మడికాయ మజ్జిగపులుసు, 'ముద్ద' అన్నం, మజ్జిగ, పోకుట్టల్లో వడ్డించి ఆమె వుపచరిస్తున్నప్పుడు అయ్యాశాస్త్రులిలా అన్నారు. "రామణ్ణగారు బతికుంటే ఆకథేవేరు, నేను మా ఆవిడతో చెప్పి ఎంత ఇదవుతానో దాన్నే అడుగు. ఆయనే పోవటంవల్ల మనవూరి గోపురం పడిపోయినట్లయింది."

"ఇలాంటి కోడళ్ళు రావాలని వా నుదట రాసినప్పుడాయనెలా వుంటారుచెప్పండి?"

సుబ్బమ్మ అడిగింది "గంగక్కా! నీకు ముట్లాగి రెండేళ్ళవలేదూ?"

"మూడేళ్ళయింది."

శాస్త్రిగారన్నారు. "మొత్తానికి నువ్వుపుణ్యాత్మురాలివి. జీవితమంతా ఏకొరతా లేకుండా గడిచింది. నువ్వుచేయని వ్రతం, దానం, ధర్మమంటూ ఏదీలేదు. ముట్లుడిగాక ఆడాళ్ళు ఋషిపంచమివ్రతం విధిగా చేయాలి. చేశావంటే నీ కష్టాలన్నీ గట్టెక్కుతాయి."

అణ్ణాజోస్యులు బాబాయి కంటె మంత్రాలు క్షుణ్ణంగా తెలిసినవాడు. శింధమ్మన్న మూరన్నజోస్యుల శిష్యుడు. ఋషిపంచమి వ్రతమహిమను మంత్రసమేతంగా వివరించాడు.

"గంగక్కా! ఎలాగైతే అలా అవుతుంది. నువ్వదొక్కటే చేసై. షెడ్డులోవున్నా పేచీలేదు. నీకు కావలసిన సహాయం నేంజేస్తానుగా. అప్పణ్ణ భార్య వెంకటలక్ష్మి ఎలాగూవుంది. వ్రతానికని వేరే పందిరివేస్తేసరి. మనషెడ్డుముందర పెద్దగా వేద్దాం. మీ షెడ్డుదగ్గరయితే జవాలరద్దీ, గొడవ, మడీగిడీతిన్నగాజరగవు"– అంది సుబ్బమ్మ.

"వేద్దామేరా అప్పణ్ణయ్యా!" రాగిముద్దతిని మజ్జిగపులుసోసుగుని అన్నం కలుపుతున్న గంగమ్మ కొడుకునడిగింది. చెన్నేనహళ్ళి వెంకటాచలమయ్యగారి తల్లి ఋషిపంచమివ్రతం చేసినప్పుడు భోజనానికి అప్పణ్ణయ్యకూడా వెళ్ళాడు. బొబ్బట్లు, మామిడికాయపులిహెూర, మొదలైనవి ముక్కోంట నోటంట నీళ్ళూరేలా వంటచేశారు. వాడికి వెంటనే అది గుర్తొచ్చి తన ముందువున్న మజ్జిగపులుసు రాగి ముద్దల స్థానంలో మామిడికాయ పులిహెూర, బొబ్బట్ల దొంతరలు కనిపించాయి.

"వేద్దామమ్మా! ఆ యంకటాచలమయ్యకంటె మనం తీసిపొయ్యామా?"

మొత్తానికి వ్రతం చేయాలని నిశ్చయించారు. సుబ్బమ్మ అంది! "గంగక్కంటే ఏమనుకున్నారు. మాటంటే మాటే. బ్రహ్మదేముడు దిగొచ్చినా ఆమె అన్నదంటే జరిగి తీరాల్సిందే."

గంగమ్మ మనస్సు మార్చుకోలేదు. మార్చుకుంటే మర్యాదకేభంగం. అణ్ణాజోస్యులు భోంచేశాక కూర్చుని పంచాంగంచూసి రెండుచేతులు వేళ్ళరేఖల సహాయంతో లెక్కేట్టి శుభదినం నిశ్చయించాడు. చెన్నేనహళ్ళి వెంకటాచలమయ్య తన తల్లిచేత చేయించినట్టు 'గోహిలపు' ఋషిపంచమి చేయటం గంగమ్మ హెూదాకు తగదు. గొప్పగా చేయాలి. దానికి సరిపడా సామాను తేవాలి. అయ్యాశాస్త్రిగారి ఇంట్లోవున్న కరక్కాయ సిరాతో సరుకుల పట్టీ తయారుచేశారు. వూళ్ళోవున్న పురోహితులిద్దరికీ పట్టుపంచెలు, మేలుకోటపంచెలు, వాళ్ళ భార్యలకి చెరో యాభైరూపాయలచీర, దానానికి ఇంట్లోనవున్న ఆవే సరిపోతుంది. ఇహపోతే, సన్నరకం బియ్యం, పప్పులు, పంచదార, రవ్వ, మొదలైనవి కావాలి. మొత్తంమీద సామానుకోసం తిపటూరికి బండి కట్టించుకవెళ్ళాలి. కూడా అణ్ణాజోస్యులు, అయ్యాశాస్త్రులు వెళ్ళాలని నిశ్చయించారు. అప్పణ్ణయ్యకు మరోసారి తిపటూరికి వెళ్ళేయోగం పట్టింది.

# 3

ఋషిపంచమి బ్రహ్మాండంగా జరిగింది. వారం రోజులయ్యాక అందరూ వూళ్ళో ప్రవేశించాలని నిర్ణయంజరిగింది. వ్రతానికని తెచ్చిన పంచదార, రవ్వ, నెయ్యి మిగిలిపోయాయి. గంగమ్మ ఓరోజు కోడలితో చెప్పేసింది. "నువ్వింట్లో ఏరోజు అడుగెట్టావో చుప్పనాతి, ఇల్లు గుల్లయిపోయింది. పొలమంతా తుడుచుకపోయింది. వూళ్ళోకి వస్తే నువ్వు, నీపిల్లలు వేరే వుండండి. మేమింట్లో వుంటాం."

"నువ్వు నీ పిల్లలు" అన్న అత్తగారి మాటలకర్థం నంజమ్మకు వెంటనే బోధపడలేదు. ఆమె అడిగింది "ఏ ఇంట్లోవుంటారు?"

"ఏ ఇంట్లో? నా మొగుడు కట్టించిన ఇంట్లో వుంటాం."

"శివేగౌడ మిమ్మల్నింట్లో అడుగుపెట్టనిస్తేగా?" అని అందామని నాలికచివరిదాకా వచ్చినా, బయటికనలేదు. వాళ్ళకున్న పొలమంతా కోర్టుకేసులో తుడుచుకుపోతుందని ఆమె అంతరాత్మ స్పష్టంగా చెబుతూనే వుండేది. తరువాత శివేగౌడనుంచీ రెండువేలు వస్తుందని ఆమె ఎదురుచూడలేదు. వచ్చినా దాన్నెలా పొదుపుచేయాలో చెప్పే గౌడవకి వెళ్ళలేదు. చెబితే దెబ్బలాట లేనిపోని బండతిట్లు తినాలి. ఇప్పుడావిడకి ఆరునెలలు. గర్భవతులు దుర్భాషలు వినరాదు. చెడుగా ఆలోచించరాదు. ఎప్పుడూ మంచివేవింటూ వుల్లాసంగా వుండాలని, ఆమె చిన్నతనంనుంచీ వింటూ వచ్చింది. మొదటిరెండుసార్లు కడుపుతో వున్నప్పుడు ఈ మాటల్ని అంతగాపట్టించుకునేదికాదు. ఇప్పుడున్నట్టుండి మనసంతా తూట్లుపడిపోతోంది. రోజూ ఎప్పుడో ఓసారి ధ్రువచరిత్ర, ప్రహ్లాదచరిత్ర, రామపట్టాభిషేకం కథల పాటలు పాడుకుంటుంది. ఎల్లప్పుడూ ఇలాంటి కథలతోటే మనస్సులగ్నమై వుంటోంది.

ఆరోజు మధ్యాహ్నం భర్తభోంచేసి పడుకోబోతూవుండగా అత్తగారి ఆదేశాన్ని తెలిపి "వేరే వెళ్ళమన్నారు. ఎక్కడికెళ్ళాలి? జీవనోపాధికేంచేయాలి? ఆలోచించారా?" అని అడిగింది.

"నిమ్మా, నీనడతా చూసే మా అమ్మ అలా అంది. నువ్వు నీ పిల్లలూ ఏమైనా చేసుకోండి."

"నానడత ఎలాంటిదో వూళ్ళో అందరికీ తెలుసు. ఇప్పుడామాటలెందుకు? ఇహముందేంచేయాలో చెప్పండి."

"నేను చెప్పానుగా! నేను మా అమ్మతోటే వుంటాను" అని కరణంగారు ముసుగుతన్ని పడుకున్నారు.

ఆమెకు మండిపోయింది "ఏమి మాట్లాడుతున్నారు? బుద్ధితిన్నగా వుందాలేదా?"

"పోవే వెధవముండా, నా నిద్రపాడుచేయకు."

పంజమ్మ మళ్ళీ మాట్లాడలేదు. తాము వేరేవుండక తప్పదని ఆమెకు తెలుసు. కానీ అత్తగారు తన కొడుకును, తమనుంచీ వేరు చేస్తుందని వూహించలేదు. పొలమంతా పోయాక తల్లీ కొడుకు నెన్ని రోజులుంచుకోగలదు అన్నభావం కూడా ఒకవేపు లేకపోలేదు. ఏమైతేనేం ఈ సంసారాన్ని పోషించే బాధ్యత తనమీదపడ్డది. పిల్లలతోటి అందరినీ పోషించే బరువంతా తన మీదపడుతుందని ఆమెకు తెలుసు. ఇలా అవుతుందని ఆమె పసికట్టలేదు. ఎంతకష్టం వచ్చినా, కడుపులో వున్న తానేడవరాదు. మనస్సును కలతపెట్టుకోరాదు - అని ఆవిడ నిశ్చయించుకుంది.

మొగుడు నిద్రపోయాక కొడుకునెత్తుకుంది. అప్పటిక కడుపు ముందుకు వచ్చి పెరగటంచేత కుర్రాణ్ణి బుజానవేసుకుని, కుడిచేత్తో పార్వతి చెయ్యిచ్చుగుని చెరువుకట్టమీదుగా నడిచివెళ్ళింది. చెరువులో నీళ్ళుండలేదు. బంకమట్టి ఎండి బీటలువారింది. దారిలో మట్టికూడాకాలి ఎండవడ కొడుతోంది. ఎగశ్వాస దిగశ్వాసగా వున్నందున నింపాదిగా నడిచి గుడిప్రాకారాన్ని దాటుతూ వుండగా మాదేవయ్యగారప్పుడే స్నానం చేసి కావిపంచె నారవేస్తున్నారు. ఇటికల పొయ్యిమీద కుండలో అన్నముడుకుతోంది. ఆయనే "రాతల్లీ, రా, నేనే మీ షెడ్డుకు రావాలనుకున్నాను, అత్తయ్య ఏమంటుందో అని రాలేదు" అని అన్నారు.

"ఇహమీద అత్తయ్య ఏమీ అనే పరిస్థితిలో లేదు." నేనే వచ్చాను.

ఈ సంసారాన్ని గురించి మాదేవయ్యగారికేకాదు, వూళ్ళో వున్న అందరికీ తెలియని విషయమంటూ లేదు. అంచేత దేన్నీగురించిగానీ ఆయనకు ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. తన్నువేరుగా వుండమని అత్త ఆజ్ఞాపించడమూ, తానడగ్గా మొగుడిచ్చిన సమాధానం - ఈ రెండే ఆమె తెలిపింది.

"రెండువేలొచ్చాయికదా. అందులో అప్పులుపోగా వెయ్యిమిగిలాయట. జోస్యులవలలోపడి ఆవిడ పంచమివ్రతమని మురిగిపోతూ దుబారా చేస్తే మవ్వెందుకూరుకున్నావు?"

"అయ్యగారూ! అంతా ఎలా పోయిందో ఇదీ అలాగే పోయింది. నేను వద్దంటే

ఆమె ఏవేరకమా? వూరికే దెబ్బలాటెందుకు?"

"నీమాటా నిజమే."

అయ్యగారు అన్నమూ, ఆనపగింజలపులుసూ , అల్యూమినియమ్ కంచంలో వడ్డించుకుని భోంచేశారు. ప్రతిరోజూ ఆయన లింగాయతుల ఇళ్ళలో జోలెభిక్షమెత్తి భోంచేసేవాడు. కాని మధ్యాహ్నం కాస్త పొద్దువాలారితే జోలెభిక్షాని కెళ్ళేవాడు కాదు. ఆ రోజు సోమవారం కావటంచేత దూరపు పల్లెలకి భిక్షానికెళ్ళి, రావటానికాలస్యమై తానేవంట వండుకున్నాడు. నంజమ్మకూ, పార్వతికీ తినటానికి కొబ్బరిముక్క బెల్లమిచ్చి, ఆయనా ఆలోచిమ్తూ కాసేపూరికే కూర్చున్నాడు.

"అయ్యగారూ! మా పుట్టింటి విషయం మీకు తెలుసోతెలియదో. మా ఇంటిగుట్టు మేమే రట్టు చేమకోరాదు. నేనెవరికీ చెప్పలేదు. వదిన స్వభావం మంచిదికాదు. ఇహ పురిటికి గాని, మరేకష్ట సుఖానికి గాని నేనక్కడికెళ్ళే ప్రమేయం లేదు. ఇక్కడికేరమ్మని తీసుకొస్తే మా నాయనమ్మే వచ్చి చేస్తుంది. ఆవిడకీ డెభై అయిదు దాటింది. చేతకాదు. అయినా తిప్పలుపడుతుంది. కానీ వుండటానికో నీడ, తినటానికి పిడికెడు కవళం కావాలిగా? అదీకాక ఈ మహానుభావుడూ వట్టేట వదిలేస్తే ఏంజేయను?"

అయ్యగారాలోచించి చెప్పారు. "చెన్నయ్యరెండురోజుల్లో వెతుక్కుంటూ వొస్తాడు. ఆ బెంగెట్టుకోకు. కురుబరహళ్ళి గుండే గౌడగార్నెరుగుదువుగా? ఆయన పూనుకుంటే వదల్రు. ఈవూళ్ళో నివ్వాదుకునేవాళ్ళెవళ్ళూ లేరు."

కురుబరహళ్ళి వాళ్ళ కరణీకానికి చెందిన గ్రామం. వూళ్ళో వున్న నలభై గడపా ఒకటేకులం. గుండే గౌడగారు నలభై ఏళ్ళుగా ఆవూరి మునసబుగా పనిచేస్తున్నారు. ధర్మరాజు మునసబుగారు - అని ఆ చుట్టుపక్కల జనమంతా చెప్పుకోవటం నంజమ్మకూడా విన్నది ఆయన మునసబైన ఇన్నేళ్ళుబట్టీ ఆవూళ్ళో ఒక దొంగతనం జరగలేదు. ఎవరూ కాని తిరుగుళ్ళు తిరగలేదు. పొట్టగడవదని ఎవరూ వేరేవూరికి వలసపోలేదట!

అయ్యగారే అన్నారు. "కింది వీధిలో ఆయనదే ఇల్లొందిగా ఖాళీగావుంచారు. దానిలో వుంటాను అని అడగండి. లేదనడు."

నంజమ్మకిప్పుడు గుర్తొచ్చింది. రామసంద్రంలో గుండేగౌడ గారి ఇల్లొకటుంది. దానిలో ఎవళ్ళూ వుండటంలేదు. దానికాయన ఒప్పుకుంటే, తలదాచుకునే నీడదొరుకుతుంది. ఆయన్ను ఆవిడ చూసింది. కానీ బాగా పరిచయం లేదు. వీరి

కరణీకానికి చెందిన మునసబు కావటంచేత ఎన్నోదఫాలు వీరింటికి వచ్చాడు. అప్పుడప్పుడాయనకు నంజమ్మ భోజనం కూడా పెట్టింది. బుర్రమీసాలు వెడల్పాయిన ముఖం. కుడిచేతి మణికట్టుకు వేలిడులావున్న బంగారుకడియం. కోటువేసుకున్నా మోకాళ్ళు కనిపించేలా అడ్డపంచె చుట్టుకుని కొప్పలి ముచ్చెకుట్టిన కిర్రుచెప్పులు వేసుకుంటాడు.

"రేపు తొమ్మిది పదిగంటలమధ్య మీరు కురుబరహళ్ళికెళ్ళండి. నేనూ భిక్షానికని వస్తాను. గౌడగారిని అడగండి. నేనూ చెబుతాను. ఆయన కాదనడు. చెన్నయ్య అమ్మదగ్గిరవుంటానన్న విషయమక్కడెత్తకండి." అని అయ్యగారు చెప్పాక నంజమ్మ తమషెడ్డుకు వెళ్ళిపోయింది.

"బసవి. ఎక్కడో వూళ్ళో తిరగటానికెళ్ళింది" అని గంగమ్మగొణిగినా నంజమ్మ మాట్లాడలేదు.

మరుసటిరోజు లేచి స్నానంచేసి, పిల్లలకూ స్నానంచేయించి, రొట్టెలు చేసి, వాళ్ళకూ ఇచ్చి తానూ తిన్నది. తలదువ్వుకుని నుదుట ఎర్రటికుంకుమ బొట్టు పెట్టుకుంది. రామణ్ణను బుజానవేసుకుని, పార్వతి చెయ్యిపుచ్చుగుని షెడ్డునుంచీ బయలుదేరినప్పుడు, ఎదర చెట్టుకింద కూర్చున్న గంగమ్మ "ఏ రంకుమొగుడింటికి బయల్దేరావే బసవి?" అని గట్టిగా అడిగినా బదులు చెప్పకుండా తనదారిని తాను వెళ్ళిపోయింది. కొంతదూరం వెళ్ళాక వెనక్కితిరిగి చూచింది. అత్తగాని, మొగుడుగాని, మరదిగాని, ఆమెక్కడికెడుతుందో చూద్దామని వెంబడించలేదు.

కురుబరహళ్ళకీ రామసంద్రానికీ రెండుమైళ్ళదూరం. మధ్య ఒక మెరకవుంది. ఎక్కిదిగాలి. నంజమ్మకు ఒంటరిగా వెడుతున్నానన్న భయం కలగలేదు. కాని బుజాన వేసుకున్న కుర్రాణ్ణి ఎత్తుకుని మెరకెక్కినప్పుడు ప్రాణాలు తోడినట్టయింది. నాలుగేళ్ళునిండని పార్వతి కాళ్ళులాగుతున్నాయని ఏడుస్తూ తల్లికుడిచేయిపట్టుకుని నడుస్తోంది. నంజమ్మకు హఠాత్తుగా దుఃఖం పొంగిపొర్లింది. కుర్రాణ్ణి కిందికి దించి, నేలమీదకూర్చుని, ఒకసారి గట్టిగా ఏడ్చి చీరకొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంది. ఏదో చెరువో నుయ్యోచూసి, పిల్లల్నితోసి తానూ పడాలన్న వూహ క్షణం కలిగింది. కడుపుతోవున్న తాను ఇలాచెడుగా ఆలోచించరాదు. ఏడవనూరాదు. అన్నసంగతి గుర్తొచ్చి మళ్ళీ పైకిలేచింది. ఈసారి కుర్రాణ్ణి కుడిబుజాన వేసుకుని, పార్వతిని ఎడమచేత్తోపట్టుకుని ముందుకుసాగింది. మెరకెక్కాక కురుబరహళ్ళి కనిపిస్తుంది. వూరిమధ్య కనిపించేదే బసవన్నగుడి, గుడిపక్కనే గుండే గౌడ గారి

ఇల్లట! గుండే గౌడకు దయకలిగేలా చేయమని మనస్సులో దేవుణ్ణి ప్రార్థిస్తూ వంజమ్మ మెరకదిగి ముందుకు నడచింది.

గౌడ అరుగుమీద కూర్చొని పొగాకు నములుతున్నాడు. ఆయన్ను చూసే వంజమ్మ, ఇల్లు గుర్తుపట్టింది. ఆమెను చూడగానే గౌడలేచి 'రా తల్లీ, రా తల్లీ, రా! లక్ష్మీదేవిలా ఇంటికొచ్చావు. కుర్రాణ్ణెత్తుకునే వొచ్చావా ఎండలో?' అని ఇంటిలోనికి చూస్తూ, వుసేవ్! మన కరణాలమ్మగో రొచ్చారే. ఒక చాపెయ్యండే. అని లోపలికి తీసుకెళ్ళాడు. గోడకానుకుని పిల్లలతోటి వంజమ్మ కూర్చొంది. స్తంభానికి చేరబడి గౌడకూర్చున్నాడు. ఇంకా ఏడుస్తున్న పార్వతికి కొబ్బెర బెల్లమిచ్చి గౌడెత లక్కమ్మ, శాంతింపజేసింది.

"మా ఇంటిసమాచారమంతా తెలిసిందా గౌడగారూ?"

"తెలిసింది తల్లీ. మీ అత్తమ్మంటే వత్తులులేని దివిటీ. మట్టవత్తులున్న దివిటీమండుతుంది. అవితీసేస్తే మిగిలేదేమి నా బొంద. మీ మావయ్య నాలాంటి అక్కుపక్షి. ఈవిడ వచ్చీరాగానే పుణ్యాత్మురాలు ఇంటిపునాదులే తవ్వడం మొదలెట్టింది. ఏమైనా ఇంటిపరువు నువ్వు నిలపాలి" అని పెళ్ళాం వేపుతిరిగి కరణీకం లెక్కలన్నీ ఈవిడే రాస్తోందే. ఆ వెన్నయ్య చేతేమవుద్ది? డూడూబసవన్న. గడ్డి తింటావా బసవన్నా అను. వూం అంటుంది. నీళ్లు తాగుతావా బసవన్నా అను. వూం అంటుంది. పెరు మేశావా బసవన్నా? వూం అని తలాడిస్తుంది. పాలందున్నాలి అట్టిస్తావా బసవాన్న అను. వొద్దొద్దని, కొమ్మూడిస్తూ వుడాయిస్తుంది- నీ మొగుణ్ణి అన్నానని కోపంచేసుకోకు తల్లీ!" అన్నాడు.

"కోపమెందుకొస్తదీ. ఆ అయ్యచేసేదే అలాగ" - అదంది గౌడమ్మ.

ఆ మాట ఈమాట మాట్లాడుతూవుండగా, గౌడుపెళ్ళాం లోపలికెళ్ళి మూడు గ్లాసుల నిండ వేడిపాలు, బెల్లంవేసి, మూడుమూడు చంచాల నెయ్యి కరిగించుకుని తెచ్చి ముందుంచింది.

"నాకిప్పుడు పాలువద్దు" అని వంజమ్మంటే, గౌడమ్మ "కడుపుతో వున్నమ్మ పాలొద్దు అనరాదు. తాగండి" అంది.

"గౌడగారూ! మీ ఇంటి పాలు వద్దనను. అయితే నాకుసహాయం చేస్తానని మాటివ్వండి."

"ఏటో చెప్పుతల్లీ"

"మీరు వేరేకాపురమెట్టండి అని అత్తయ్య నిన్నచెప్పేసింది. మా

కుండటానికోసీడలేదు."

"సీడకేం? వాదే ఇల్లుందిగా? దాన్లో వుందురుగాని. పాలుతాగు."

గుండేగౌడము తానేమడగటానికి వచ్చిందో దాన్ని తానడగకముందే అతడిచ్చేశాడు. బతిమలాడించుకోలేదు. ఆయనకు దానంచేయడమంటే మహాతేలికన్నట్టు ఇచ్చేశాడు. నంజమ్మ పిల్లలచేత తాగించి తానూ పాలు తాగింది. గౌడగారు పెళ్ళాంతో అన్నాడు. "నేను నీకు చెబుతున్నానుగా, ఈమె మొహం చూడు. ఎంత కళగా వుందో. సీతమ్మోరు మొహమున్నట్టు లేదూ?"

అంతలో మాదేవయ్యగారు భిక్షకనివచ్చారు. నంజమ్మ కూర్చున్నది చూసి ఆయనా కూర్చున్నాడు. గౌడమ్మ ఆయనకు పీటవేసింది. తనకేమీ తెలియనట్టు నంజమ్మెందుకు వచ్చిందోఅడిగి, గౌడ ఆమె కుండటానికి ఇల్లిస్తానన్నాడన్న సంగతి విన్నాక అయ్యగారడిగారు. "గౌడయ్యా వుండటానికి సీడిచ్చారు. బావుంది తినడానికేం దారి?"

"కరణీకంలేదా? రెక్కలొంచి తిన్నాడికి దాని కన్నా ఆస్తి ఏటి?"

"ఆ మొగుడెలాంటివాడో మీకుతెలవదా?"

"అతడొట్టి ఎర్రిమాలోకం. వదిలెయ్యండి. కాడిలో ఓటిదక్కబైనా ఓటి మోపుగా వుంటే సరి" అని నంజమ్మ వేపు తిరిగి "నీమాటిని పడుండమను బసవన్నని. పొట్టకా లోటుండదు" అన్నాడు.

"చెప్పినమాట విని పడుండే బాపతా?" అయ్యగారడిగారు.

"తలరాతండీ. అనుభవించాలిమరి" - అంది గౌడమ్మ.

అప్పటికే మధ్యాహ్నమయింది. భోంచేయకండా వాళ్ళని ఆ దంపతులు పంపరు. గౌడమ్మ లోపలికెళ్ళి నాలుగిత్తడి గిన్నెలు, రెండు బిందెలు తెచ్చి వాళ్ళముందుంచింది. వూరికెడతానన్నా అయ్యగారిని కూడా వదలలేదు. పాత్రలన్నీ చింతపండెట్టి తోమి గుడిముందున్న నూతిలో నంజమ్మ మాదేవయ్యగారు విడివిడిగా నీళ్ళుతోడుకున్నారు. గుడిఅరుగుమీద గౌడగారి కొడుకు ఏర్పాటు చేసిచ్చిన మూడురాళ్ళ పొయ్యిమీద వేరువేరుగా అన్నం వండుకున్నారు. కొబ్బరి పచ్చడితో, పెరుగుతో భోజనంచేశారు. పిల్లకి మళ్ళీపాలిచ్చి, తమ బండికట్టించి, అందులో కడుపుతోవున్న నంజమ్మని, పిల్లల్ని కూర్చోపమన్నాడుగౌడ. తనజోలెతోపాటు మాదేవయ్యగారు కూడా అదేబండిలో కూర్చున్నారు.

## 4

పెద్దవదిలి వూళ్ళోకి ప్రవేశిస్తూ గంగమ్మ వెళ్ళి తన పాత ఇంటితలుపుతీసింది. ఆవిడలోపలికివెళ్ళి అప్పణ్ణయ్య సహాయంతో బూజూదులిపి వడవ ఇంకా తుడవలేదు. చేతిలో పెద్ద తాళంకప్ప తీసుకుని, శివేగౌడ ఇంటి పనిమనిషి వచ్చి చెప్పాడు. "మీసామాను తీసుకుని ఎల్లండి ఇంటికి తాళమేసుకరమ్మన్నారు గౌడగారు."

"ఏ లంజాకొడుకు గౌడరా అలాఅన్నది?"

"శివేగౌడ అమ్మగోరూ."

"అయ్యో వాడి కొంపతగలడ. పొలమంతాపోయింది. ఇల్లు కూడా కొట్టేద్దామనుకున్నాడు గావును. వాడి బాబుసొమ్మా?" అంటూ గంగమ్మ గౌడ ఇంటికివెళ్ళి, గుమ్మం దగ్గరమంచుని, పిలిచి, అడిగింది "ఇల్లేంమీబాబు సొమ్మనుకున్నావాగౌడా? కోర్టులో నీకు కట్టింది పొలం."

"కావలిస్తే తిపటూరికెళ్లి అడిగిరావమ్మా. నువ్వూ నీ కొడుకులూ రాసిచ్చిన దస్తావేజా ఇనప్పెట్టిలోవుంది. తెచ్చిచూపనా?" అంటూ గౌడ బయటికి వచ్చాడు.

"ఓరి వీడి కొంపకూల" అన్నమాటతప్ప గంగమ్మకేంచెప్పాలో తెలియలేదు. కాసేపు వెలవెలపోతూ నుంచున్న ఆవిడ "అవుతే మేమెక్కడపడి చావమూ? పూరిమునసబుని నువే చెప్పు" అని అడిగింది.

"ఇళ్ళులేని వాళ్ళకంతా, ఇల్లు కట్టించిస్తానని నేను మునసబుగిరి చేయటం లేదు. ఎళ్ళమ్మా ఎళ్ళు" – అని గౌడలోపలికెళ్ళి దభీమని తలుపేసుకున్నాడు."

"వీడి కొంపకూలి జిల్లేళ్ళుమొలవా. దగాచేసి ఆస్తివచ్చిందని మిడిసి పడుతున్నాడు దిక్కుమాలిన లంజాకొడుకు. నాకెవరూ లేకపోలేదు" అంటూ గంగమ్మ తిన్నగా రేవణ్ణశెట్టి ఇంటికెళ్ళి, జరిగిన సంగతంతా చెప్పి "మీ పశువులిల్లుందిగా! అందులో ఒకవేపు తడిక కట్టుకుని నేనూ, నా కొడుకులిద్దరూ వుంటాం, ఖాళీచేసివ్వు" అని అడిగింది.

"అమ్మగోరూ! మాగేదె ఇప్పుడో అప్పుడోదూడవేస్తుంది. దాన్నికట్టెయ్యడానికే జాగాలేదు. మీరెక్కడుంటారు? మీ వాళ్ళే అయ్యాశాస్త్రీగారున్నారుగా, అడిగి చూడండి.

"ఈ లంజాకొడుక్కి నాడబ్బు తినేదాకానా అవసరం" – అని తిట్టుకుంటూ ఆమె వెళ్ళి అయ్యాశాస్త్రులనడిగింది. ఆయన గొడ్లపాకలో కూడా ఆవిడకి చోటులేదు.

"వా డబ్బులిచ్చేదాకా నా అవసరం. ఇప్పుడు నాలుగుమూరల స్థలమివ్వాలంటే ఏడుస్తావేరా దరిచేపి జోస్యులూ" - అని ఆవిడ వీధిలో నుంచుని అడిగింది.

జోస్యులు కాస్త ఇరకాటంలో పడ్డాడు. ఆమెను గొడ్లచావిడిలో వుంచటం ఇష్టంలేదు. ఆమె రంకెలు వినటమూ కష్టంగా వుంది. చివరికి అణ్ణాజోస్యుల్ని పిలిపించి, మాట్లాడి ఒక వుపాయం సూచించాడు. వూరికి తూర్పున హనుమంతరాయని గుడివుంది. నాలుగంకణాల ఆగుడికి తలుపూ తాళం కూడా వున్నాయి. అణ్ణాజోస్యులే దానిపూజారి. ఆవిడా, ఇద్దరు కొడుకులు వుండటాని కభ్యంతరంలేదు. కాని గ్రామస్థుల అంగీకారం కావాలి. గ్రామస్థులంటే ఎవరు? కరణం, మునసబు, పంచాయతీచేర్మన్. దానిసభ్యులు తతిమ్మా వాళ్ళని ఒప్పించటం కష్టంకాదు. కానీ గ్రామానికి మునసబు చైర్మెన్ - రెండు హోదాలు కలిగిన శివేగౌడ ఒప్పుకుంటాడోలేదో! "గంగమ్మా! నువ్వు కాస్త నాలిక బిగబట్టాలి. వాణ్ణి వీధిలో నుంచుని, ముండాకొడుకా లంజాకొడుకా - అనితిట్టకు" అని అయ్యాశాస్త్రులు సలహాఇస్తే "నేనే లంజాకొడుక్కి భయపడనవసరం లేదులేండి" అంది.

జోస్యులిద్దరూ శివేగౌడ ఇంటికి రాయబారానికి వెళ్ళారు. అతడొప్పుకునే వాడోకాదో, అతడి పెళ్ళాంగౌరమ్మకు మాత్రమొక భయముండేది. గంగమ్మనోరు మంచిదికాదు. ఆవిడ నాలికమీద నల్లమచ్చవుందట. మంచివేళవుంటుంది. చెడువేళవుంటుంది. వీధిలో నుంచుని దుమ్మెత్తిపోసి తిట్లకి లంకించుకుంటుంది. ఇంతకీ హనుమంతరాయని గుడి బాపనాళ్ళదే. వాళ్ళూవాళ్ళూ ఏమైనా చేసుకోనీ అని గంగమ్మవాదం. మొగుణ్ణిలోపలికి తీసుకెళ్ళి చెవిలో గుసగుసలాడింది. చెప్పినవన్నీ శివేగౌడనమ్మాడో లేదోగాని, దానివల్ల తనకేమీ నష్టం లేదు గనక బయటికి వచ్చి "పోనిద్దురు. బతికిపోనీ. వుండమనండి" అన్నాడు.

వాళ్ళు హనుమంతరాయని గుడికి రావడంవల్ల అణ్ణాజోస్యులకొక అనుకూలం జరిగింది. పూజారికని అయిదెకరాల మెరకపొలం ఎకరామాగాణి, మాన్యమున్నగుడిఅది. పూజారి అణ్ణాజోస్యులామాన్యాన్ని అనుభవిస్తున్నాడు. కానీ రోజూవచ్చి, ప్రాకారం, అంకణం అన్నీ శుభ్రంగా వూడ్చి, కడిగి నీళ్ళుతెచ్చి దేవుడికి దీపధూపాలతో పూజచేయటం పడేదికాదు. దానానికనీ, దక్షిణలకనీ పల్లెంమీదవెళ్ళినప్పుడయితే పూజా పునస్కారాలులేక దేముడు బూజుపట్టేవాడు. ఎన్నోరోజులు పక్షులరెట్టలతో ప్రాంగణమంతా వాసనకొట్టేది. గ్రామమునసబు

కొన్నిసార్లు జోస్యులమీద ఫిర్యాదు చేశాడుకూడా. గర్భగుడి తలుపు కన్నంలోనుంచి చూస్తే లోపల దేవుడికి పూజజరిగిందీ లేనిదీ తెలిసిపొయ్యేది. జోస్యులు పూజాపునస్కారాలు చేయనిరోజు గ్రామప్రజలు చూసి పరీక్షించి మనసులోనే తిట్టేవాళ్ళు.

అణ్ణాజోస్యులప్పణయ్యతో చెప్పాడు. "నీకు గుడిలో వుండటానికి చోటిచ్చాం. నువ్వు రోజూ ప్రాకారం, ప్రాంగణం అన్నీ శుభ్రంగా వూడ్చి, నీళ్ళోసి కడగాలి. కాస్తంత మురికికూడా కనపడరాదు. మడిగా దేవుణ్ణి కడిగి పూలు గీలు తెచ్చి పూజచేయాలి. నువ్వు పూజచేస్తున్నావని ఎవరికీ చెప్పకు. చెబితే గుడిలోంచి తరిమేస్తాం. నేనూ అప్పుడప్పుడు వచ్చి పూజచేస్తాను.

అప్పణ్ణయ్య అంగీకరించాడు. దేవుడి పూజలంటే గంగమ్మ కాదనదు. ఆమె దైవభక్తి అగాధమైనదే. చెన్నిగరాయనికెలాగూ దేవతార్చన మంత్రం వచ్చు.

## 5

నంజమ్మ పెళ్ళిగో పుట్టింటి వాళ్ళుపెట్టిన 'వాగర' 'చేమంతిపూవు', ఒకజత బంగారు గాజులు, వెండికడియాలు, - ఇవన్నీ చెన్నిగరాయల కరణీకపు ముఖ్యమైన లెక్కలుంచేపెట్టెలో అట్టడుగున ఒకమూలలో దాచింది. అవైనా తెచ్చుకుందామని తానే వెళ్ళి అడగ్గా మొగుడు సరైన సమాధానమివ్వలేదు. మళ్ళీ నిలదీసి అడిగేసరికి "మీవాళ్ళుపెడితే మాత్రం అక్కడేవుంటుందేటి? ఖర్చయింది". అన్నాడు

"ఎలా ఖర్చయింది? ఏంజేశారు?"

"కోర్టుకోసం ఖర్చయింది."

"ఏంజేశారు?"

"కాశింబడ్డి దగ్గిర య్యాభైరూపాయలకు తాకట్టెట్టాం. కావలిస్తే డబ్బిచ్చి విడిపించుకో?"

"ఎన్ని రోజులయింది?"

"వెనకటి దీపావళి పండుగరోజుల్లో."

అంటే ఏడునెలలయింది. వడ్డీ య్యాభైరూపాయలకి పైపెచ్చే .ఇప్పుడు వందరూపాయలిచ్చి విడిపించుకోవటం సాధ్యంకాదు.

"నా పుట్టింటివాళ్ళిచ్చినవి నన్నడక్కుండా, నాకు చెప్పకుండా ఎలా వాడుకున్నారు?"

"అమ్మ తీసుకెళ్ళి పెట్టమంది, పెట్టాను."

దేనికైనా సరే సహనాన్ని కోల్పోరాదన్న ఆమెసంకల్పం నెగ్గలేదు. అత్తయ్య ఇంటి పాత్రలలో ఒకగిన్నె కూడా ఇవ్వలేదు. ఆవిడపెళ్ళిలో ఇచ్చిన తప్పేలాలు, గిన్నెలు, చెంబులు ఏవీ లేవంది. ఆ బంగారమైనా వుంటే ఆపదలో ఆదుకునేది. ఇప్పుడు సంసారం ప్రారంభించాలంటే ఒక చెంబు కూడా లేదు. ఇంట్లో పిల్లలకి రెండు రొట్టెలు, తట్టివ్వడానికి ఓపావు పిండిలేదు. ఈ పరిస్థితిలో తన పురుడు కూడా దగ్గిరకొస్తోంది. పుట్టింటికెళ్ళే అభిలాషకానీ, అవకాశం కానీ లేదు. అన్నయ్యకలాంటి పెళ్ళాం వచ్చిందిమరి.

పట్టరాని కోపం వచ్చి మొగుణ్ణడిగింది. "ఏమగాడైనా భార్యకి సొంత సంపాదనతో నగానట్రా చేయించిపెడతాడు. అలాంటప్పుడు నాగ్రహచారం కొద్దీ మా పుట్టింటివాళ్ళు పెట్టిందికూడా నాకు తెలియకుండా తల్లీకొడుకూ వేరి దగా చేశారే సిగ్గేయటంలేదూ?"

చెన్నిగరాయలు మాట్లాడలేదు. గొత్తెలా గుడ్లుతిప్పుతూ నుంచున్నాడు. "ఇప్పుడు పిల్లలపాట్లలు వింపడమెలాగ? వద్దోమొర్రోఅని చిలకకి చెప్పినట్టు చెప్పినా, కోర్టుకెళ్ళినందుకు వున్న పొలమంతా వూడ్చుకుపోయి చిప్పాదొప్పా చేతికి వచ్చాయి."

ఆవిడకేమి సమాధానం చెప్పాలో చెన్నిగరాయలకు తెలియలేదు. అంచేతే మరీ కోపంవచ్చింది. ఏదో తిట్టాలి. వెంటనే అవికూడా స్ఫురించలేదు. "ముండ, ముండ ముండ, గాడిదముండ, బోడిముండ అని మూడుసార్లు మామూలు ధోరణిలోను, రెండుసార్లు విశేషధోరణిలోనూ తిట్టి అక్కణ్ణుంచి లేచివెళ్ళిపోయాడు. నంజమ్మకు వుక్రోషంవచ్చింది. అక్కడే పదినిమిషాలు కూర్చుని, ఏడ్చి, కన్నీళ్ళు తుడుచుకుంది.

ఆరోజే ఆమె మాదేవయ్యగారి గుడికెళ్ళి అయిదురూపాయలప్పుతెచ్చింది. మరుసటిరోజు వుదయమే పిల్లల్ని చూసుకొమ్మని మొగుడిదగ్గిర వదలి, సాలెవీధి పుట్టమ్మను వెంటబెట్టుకుని, సన్నేనహళ్ళికి వెళ్ళింది. రామచంద్రానికి మూడు మైళ్ళలో వున్న సన్నేనహళ్ళిలో వున్నదంతా కుమ్మరాళ్ళే. పుట్టమ్మ తీసుకెళ్ళిన ఒకరింట్లో వంటకు కావలసిన చిన్నవీపెద్దవీ ఆరుచట్లు, నీళ్ళకి రెండుకుండలు, నీళ్ళుకాచుకుండేందుకోకాగు, మూకుళ్ళు ఇంకా సంసారానికి కావలసిన ముట్టిపాత్రలన్నీ తీసుకుంది. పుట్టమ్మ బేరమాడటంవల్ల అన్నీ పన్నెండణాలకి

వచ్చాయి. అందులో మూడువంతులు పుట్టమ్మ మోసుకొచ్చింది, కడమవి నంజమ్మ చేతబుచ్చుకుని వచ్చింది. ఎండలో పీళ్ళూరు చేరుకునే సరికి సూర్యుడు నెత్తిమీదికొచ్చాడు. పాత్రలన్నీ వూళ్ళో గుండే గౌడగారింట్లో పెట్టి తాళం వేసుకుని షెడ్డుకు వెళ్ళేసరికి, అత్తామరిది సామానంతా హనుమంతరాయనిగుడికి చేర్చి, షెడ్డుఖాళీచేశారు. షెడ్డుముందు రామణ్ణ ఏడుస్తూ కూర్చున్నాడు. పార్వతిలేదు. చెన్నిగరాయల అజాపజాలేదు. కుర్రాణ్ణెత్తుకుని దగ్గరేవున్న మోటబావిలో వాడి కాళ్ళకూ చేతులకూ మొత్తకున్న మట్టిని కడిగింది. అదృష్టంకొద్దీ కుర్రాడు మోటబావి దగ్గిరకు వెళ్ళలేదు. వెంటనే పార్వతి గుర్తుకు వచ్చింది. అందరూ షెడ్లు వదలి వూళ్ళోకి సామాను సాగిస్తున్నారు. ఇది ఎక్కడి కెళ్ళిందో ఏమో? కన్న తండ్రికి పీళ్ళ బాగోగు అవసరం లేదు. రామణ్ణ నెత్తుకుని ఆమె మళ్ళీ వూళ్ళోకి వచ్చింది. తామింతకు మునుపున్న ఇంటిముందరి గుడిలోనికి మాదేవయ్యగారు సామాను సాగిస్తున్నారు. చెన్నిగరాయులు గుడిఅరుగుమీద కూర్చుని పొగాకు చర్వణం చేస్తున్నారు. దగ్గిరకెళ్ళి "పార్వతి ఏదీ?" అని నంజమ్మ అడిగితే, ఆయన వీధిలోనికెళ్ళి నోట్లో వున్న తాంబూలం వుమ్మేసి "నాకేం తెలుసు, ఎక్కడుందో చూడు" అన్నాడు.

"అయ్యగారూ! పిల్లల్ని చూసుకోండని చెప్పి నేనింటికి కావలసిన మట్టి పాత్రలు తెద్దామని పన్నేనహళ్ళికి వెళ్ళాను. తిరిగొచ్చి చూస్తే పార్వతిలేదు. ఈయనిలా అంటారు చూడండి".

"ఏమండీ! తెల్లారినుంచీ ఇక్కడే కూర్చున్నారే. అమ్మాయేదండీ?" అని అయ్యగారడిగితే "ఎక్కడికెళ్ళిందో దిక్కుమాలినముండ. ఒక చోటంటూ చతికిలబడివుంటేగా అది" అన్నాడు.

వెదకటానికని నంజమ్మొక వేపు వెళ్ళింది. అయ్యగారు మరోవేపు వెళ్ళారు. అమ్మాయిని బెస్తవీధిలో చూచాయగా చూచామని ఎవరో చెప్పారు. నంజమ్మక్కడికే వెళ్ళింది. అదృష్టం కొద్దీ అమ్మాయి అక్కడే ఒక పంచటరుగుకింద ఏడుస్తూ కూర్చుని వుంది. అందరూ షెడ్డులమంచీ సామాను తరలించే హడావిడిలో వున్నారు. ఎవరమ్మాయో ఎవరూ గమనించలేదు.

అమ్మాయి చేయి పుచ్చుకుని నడిపించుకుని ఇంటికి వచ్చింది. ఇంటి పరిస్థితి తెలిసిన మాదేవయ్యగారు, చేటలో రెండు సేర్ల రాగిపిండి, ఇన్ని అనప గింజలు, కారప్పొడి, వుప్పు, చింతపండు, తమకు కాగా మిగిలిన కొబ్బరికోరు

పెట్టి పంపించారు. ఆకలేస్తోందని పిల్లలిద్దరూ గొడవచేస్తున్నారు. ఆమెకూ ఆకలేస్తోంది. ఎండలో ఆరుమైళ్ళు నడిచేసరికి ఒళ్ళు హూనమై పోయింది. దృఢంగా వున్నా ఈ మధ్య ఎన్నడూ ఆరుమైళ్ళు నడవలేదు. అదీకాక కడుపుతో అంతదూరం వెళ్ళిరావటమెవరికైనా కష్టమే.

నీరసంగా వుందని కూర్చుంటే జరగదు. లేచి కొత్త కుండలో నీళ్ళు తోడి తెచ్చింది. ఇంట్లో మట్టి పొయ్యి వుంది. దానిమీదే కాస్త నీళ్ళు చిలకరించింది. అయ్యగారే నాలుగుపుల్లలు, కొబ్బరిమట్టలు తెచ్చి పడేశారు. కొత్త చట్లు కడిగి మట్టివాసన వస్తుందని తెలిసినా, వాటిలోనే ఒకదానిలో అనపగింజల పులుసు, మరోదానిలో రాగిముద్ద చేయాలని పెట్టింది. నాలుగు గంటలకి వంట పూర్తి అయింది. వడ్డిస్తే పార్వతిమాత్ర మాకలి ఓర్చుకోలేక సగం ముద్ద ముక్కలు ముక్కలు చేసి పులుసులో ముంచుకుని ఎలాగో మింగింది. కానీ రేండేళ్ళయినా నిండని రామణ్ణ కది సహించలేదు. ఒకసారి నమిలి అంగిటముత్తుకోగా "నాకక్కరలేదు" అని గొడవ చేశాడు. దాంతో అర్ధశేరు పిండిలో రెండు గుప్పెళ్ళు తీసి, నాలుగుప్పురాళ్ళేసి, కలిపి మూకుడులో రొట్టె కాల్చి ఇచ్చింది. దాన్నే పులుసులో అద్దుకుని నములుతూ కుర్రాడేడుపు మానేసి వూరుకున్నాడు. సగం రొట్టె మిగిలిపోయింది.

ఇంతలో భర్తగారింటికొచ్చారు. వంటింటి తలుపు దగ్గిర కాసేపాగి లోపలికి చూశారు. తిన్నగా వెళ్ళి ఎవరింటి పెరట్లోనో ఓ పెద్ద అరటాకు ముక్క కోసి తెచ్చి, ఆమె ముందు పొయ్యి దగ్గర వేసుకుని దాని ముందు మఠం వేసుకుని కూర్చున్నాడు. వండుతున్నప్పుడు మొగుడు భోజనానికిక్కడికి వస్తాడు, రాడు అన్న వూహే కలగలేదు. ఆకలి కల్లాడిపోతూ గోలపెడుతున్న పిల్లలమీదే వుంది దృష్టంతా. ఇప్పుడు పిల్లలు శాంతించారు. మొగుడొచ్చి కూర్చున్నాడు. అమ్మతోటే వుంటానన్న వాడెందుకొచ్చాడు? అక్కడింకా వండలేదా? నీ పెళ్ళామింటికే వెళ్ళి తినమని కొడుక్కు చెప్పిందో, తనంతట తానే వచ్చాడో! తెల్లారినుంచీ నువ్వు బతికావా చచ్చావా అని అడగలేదు. పిల్లల మీద మక్కువ లేదు. ధర్మానికని అయ్యగారిచ్చిన పిండి వండటానికి ఓ కుండనీళ్ళు తోడి తెస్తానని రాలేదు. ఇప్పుడరిటాకు – అదీ తనకొక్కడికి – తెచ్చి వేసుకుని కూర్చున్నాడు. ఆయనకు వడ్డించాలో మానెయ్యాలో. విసుగుదల కొద్దీ అక్కడ కూర్చోలేక పోయింది. పిల్లల్నెత్తుకుని బయటికి వచ్చేసింది.

అప్పటికే పిల్లలిద్దరూ జోగుతున్నారు. వాళ్ళని పడుకోబెట్టటానికో వోపలేదు. పాతచీర పరిచి పడుకోబెట్టింది. తనకూ ఆయాసంగా వుంది. చెయ్యి తలకింద పెట్టుకుని రామణ్ణ పక్కలో పడుకుంది. తానే లేచి వెళ్ళి మొగుడికి వడ్డించాలా అని ఒకసారి ఆలోచించింది. ఆయనే పిలిస్తే వెడదామని మరొకవూహ. ఎటూ తేల్చుకోలేక అలాగే పడుకుంది. ఆ రోజు కలిగిన అలసటకీ, కడుపు మాడ్చే ఆకలికీ కళ్ళుమూసుకొచ్చాయి.

మెలకువ వచ్చేసరికప్పుడే గంటకుపైగా నిద్రపోయినట్టనిపించింది. బయట ఎండ తగ్గుతోంది. మొగుడు భోంచేశాడో, కోపగించుకుని వెళ్ళిపోయాడో! లేచి లోపలికెళ్ళి చూసింది. ఆయన భోంచేసి వదలిన అరటాకలాగే వుంది. వంట కుండలావులిస్తున్నాయి ఆమె మొత్తమయిదు ముద్దలు చేసింది. సగం ముద్ద పార్వతి తిన్నది. ఇంకా నాలుగున్నర ముద్దలు చట్టిలో వుంచింది. ఇప్పుడు చూస్తే సగం ముద్దే వుంది. చట్టిలో అట్టడుగున గరిటెడు పులుసుంది. దీన్ని పెళ్ళాం కోసమని దయదలచి వదిలాడో, కడుపులో ఖాళీ లేక వదిలాడో ఆమెకు తెలియలేదు. ఆమెకూ ఆకలి మండిపోతోంది. వున్న ఆ సగం ముద్ద తినాలని చేయి చాచింది. కానీ రాత్రి పిల్లలకేం పెట్టాలి? పావున్నర పిండేమో వుంది. దాంతో రొట్టె చేసివ్వచ్చు. కానీ మొగుడు తృప్తిగా మింగి వదిలేసిన సగం ముద్ద తినటానికసహ్యం వేసింది. ఆమె లేచి బయటికి వెళ్ళి స్తంభం దగ్గర కూర్చుంది.

పిల్లలింకా నిద్రపోతున్నారు. పొద్దు మునుగుతోంది. సందెవేళ నిద్రపోరాదు. వాళ్ళనామె లేపింది అప్పుడు గుర్తుకువచ్చింది, ఆ రోజు తానూ కానీ పిల్లలు కానీ స్నానం చేయలేదని. ఆమె సన్నేనహళ్ళి నుంచి వచ్చాక ముఖం కడుక్కుని బొట్టుకూడా పెట్టుకోలేదు కుంకుమ భరణి కూడా అత్తగారింట్లోనే వుండిపోయింది. దాన్నెవా ఇస్తుందో ఇవ్వదో. రాత్రి వెలిగించటానికి కిరసనాయిలు బుడ్డీ దీపం కూడా లేదు. తన దగ్గిర నాలుగుంబావలా మిగిలివుంది. పిల్లల్ని తీసుకుని, తలుపు తాళం వేసి ఆనే సాహెవీధిలో వున్న చెన్నశెట్టి అంగడికెళ్ళి, రెండు బుడ్డీ దీపాలు, ఒక సీసా కిరసనాయిలు, అగ్గిపెట్టె కొనిపట్టుకొచ్చింది. మొత్తం మూడున్నర అణాలయింది. అర్థణాకి పిల్లలకి పెప్పరుమెంట్లు కొనిపెట్టింది. ఇంటికి వచ్చి తనపాత చీర అంచు చించి, బయటికి వచ్చి కనుచీకటిలో ఒక బుడ్డీకి వత్తి వేసి ఎక్కించి, నూనెతో నింపింది. దాని వెలుగులో లోపల కూర్చుని మరో దానికి వత్తి, నూనె వేసి వుంచింది. మరేం చేయటానికీ తోచలేదు. ఒంట్లో శక్తి లేదు.

పిల్లలిద్దరూ చెరో తొడమీద తలపెట్టి పడుకున్నారు. కొత్త చోటు, వాళ్ళకేదో ఓ రకమైన భయం.

కొంచెం సేపయ్యాక వాళ్ళని లోపలికి తీసుకెళ్ళి, మిగిలిన సగం రొట్టె రామణ్ణకూ, సగం ముద్ద పార్వతికీ ఇచ్చింది. రామణ్ణ ఇచ్చినదానిలో సగంతోటే కడుపు నిండిందన్నాడు. పార్వతి కూడా కాస్త మిగిల్చి చాలంది. ఆమె కడుపు మాడిపోతోంది. పిల్లలు మిగిల్చిన రొట్టె, ముద్ద మిగిలిన పులుసులో నంజుకుని తినింది. మిగిలిన పావున్నర రాగిపిండితో రొట్టయినా తట్టి తినాలనిపించింది. కానీ ఏదో విసుగుదలతో, నిరపేక్షతో మనస్సు నిరోధించింది. లేచి పిల్లల్ని తీసుకుని ఎడమచేత్తో బుడ్డిదీపం పట్టుకుని నడవలోనికి వచ్చింది. అదే సమయానికి చెన్నిగరాయలు పక్కచుట్ట బుజానెట్టుకుని ఇంటికి వచ్చాడు. పిల్లల్ని దేనిమీద పడుకోబెట్టాలి అని ఆలోచిస్తుండగా, ఇదైనా తెచ్చారు కదా అని తృప్తి పడ్డది. అతడు తెచ్చిన పక్కచుట్ట విప్పి చూసింది. ఆమె పుట్టింటి వాళ్ళు గర్భాదాన సమయంలో ఇచ్చిన రెండు దుప్పట్లు, రెండు జముఖానాలు, తలగడా, రెండు నల్ల కంబళ్ళూ వున్నాయి. ఒక దుప్పటేమో పార్వతి రామణ్ణ వుచ్చలు పోసి పోసి పిగిలిపోయే స్థితికి వచ్చింది. కంబళి సగం చిరిగే పోయింది. పిలలిద్దరికీ ఒక దుప్పటి పరిచి దాని పక్కలో తానొక జముఖానా పరుచుకుని, తలగడా పెట్టుకుంది. మొగుడికి వేరే అంకణంలో పక్కవేసింది.

అదంతా చూస్తూ మంచున్న చెన్నిగరాయలడిగాడు: "నా పక్కదూరంగా వేశావేమే? నీ దాని పక్కనే ఎందుకేయలేదూ?"

ఆమె మాట్లాడలేదు. రామణ్ణను పడుకోబెట్టి జోకొడుతోంది.

"నువ్వు విడిగా పడుకోవాలనా నేనక్కణ్ణించీ కష్టపడి పక్కచుట్ట మోసుకొచ్చింది?"

అప్పటికీ ఆమె మాట్లాడలేదు.

"అదేమిటే ముండా మాట్లాడవు?"

సహనం కోల్పోరాదని నిశ్చయించుకుని ఆమె చెప్పింది. "వాకిప్పుడే ఆరునెలలు నిండాయి"

"నిండితే ఏం?" – అని అతడే మరో అంకణంలో వున్న తన పక్కని ఆమె జముఖానా దగ్గిరికి లాక్కున్నాడు. మండుతున్న బుడ్డి చేతిలో పట్టుకుని వంటింట్లో కెళ్ళి చూసి, లోపలినుంచే పిలిచి అడిగాడు.

"వాకేమీ వుంచలేదే?"

"మధ్యాహ్నం భోంచేసి ఏముంచిపోయారు మిగల్చటానికి?" ఆమె బయటమంచే సమాధానం చెప్పింది.

ఆయన మాట్లాడలేదు. చేటలో వున్న పావున్నర పిండి ఉప్పేసి కలిపాడు. తానే పొయ్యంటించి మూకుడులో లావుగా రెండు రొట్టెలు తట్టి తనకు తోచినట్టుగా కాల్చి, వేడివేడిగా తిని, ముంతెత్తి నీళ్ళుతాగి, బుడ్డీ పుచ్చుకుని వడవలోనికి వచ్చాడు. అప్పటికి పిల్లలిద్దరూ నిద్రపోయారు. పెళ్ళాం కళ్ళుమూసుకుని పడుకుని వుంది. ఆయన వెళ్ళి పక్కనే వున్న తన మెత్తటి పక్కమీద పడుకున్నాడు. వంజమ్మ నిద్రపోలేదు. పోవటం సాధ్యంకాదు. తెల్లారిమంచి కడుపులో ఏమీ పడనందువ నకనకలాడి పోతోంది. ఏదో మంట, ఏదో బాధ. ఈ పాడు పొట్టకి ఒక్కరోజు తిండి పడెయ్యకపోతే ఎంత గొడవ చేస్తుంది? అంత ఆకలిగా వున్నా తనపొట్ట బరువుగా వున్న సంగతి గుర్తొచ్చింది. కడుపుతో వున్నమ్మ వుపవాసముండరాదు. మనమెలాగో వుంటాం. కడుపులో వున్న పసికందు కాహారమెలా? అన్న ఆలోచన కలిగింది. నిన్నరోజు మధ్యాహ్నమాయన మిగిల్చిన సగం ముద్దైనా తినవలసింది. కానీ రాత్రికి పిల్లలకేమీ మిగిలి వుండేది కాదన్న సంగతి గుర్తొచ్చి తాను తినందే మంచిదనుకుంది. మిగలిన పావున్నర పిండిలోనైనా రొట్టె తట్టి తినవలసింది. కానీ రేపు లేచీ లేవగానే పిల్లలేడిస్తే ఏం చేయాలి? ఏమి చేసివ్వగలదు? ఇప్పుడా పిండినే రొట్టెలు కాల్చుకుని, ఆ పిల్లల తండ్రి హాయిగా తిన్నాడు. సాయంత్రమే నాలుగు ముద్దలు మింగిన ఆయన కింతత్వరగా ఆకలెలా వేసింది? కొందరికి జఠరాగ్ని విపరీతంగా వుంటుందట! నిజమేమో! మధ్యాహ్నం తానే కూర్చుని, అరిటాకు మీద వడ్డించుకున్నప్పుడు, తిన్నప్పుడు, పెళ్ళామాకలిగొన్నదన్న సంగతే గుర్తురాలేదేమో! ఇప్పుడు రొట్టెలు కాల్చుకుని తిన్నప్పుడూ రాలేదు. ఇప్పుడొచ్చి పక్కన పడుకుని దగ్గరికొచ్చారు. ఆమె ఆరోగ్యమేమేటి, ఎన్ని నెలలు గడిచాయి, తెల్లారినుంచీ పాపమేమైనా తిన్నదా లేదా, ఒంట్లో ఓపికవుందా లేదా అన్న ఆలోచన ఏ కోశానా లేదు. 'లేచి దూరంగా పడుకోండి' అవాలవిపించింది.

కానీ, తన తల్లితోటే వుంటానన్న శ్రీవారు తామై తామే వచ్చి, ముద్దమింగి, ఇప్పుడు రొట్టెలు తిని, తన దగ్గర పడుకోవాలని పక్కమట్టి పాపం మోసుకొచ్చారట. ఇప్పుడాయనన్ని దగ్గరకి రానివ్వకపోతే తన్నూ పిల్లల్నూ వదిలి మళ్ళీ తల్లితోటే వుంటాననవచ్చు. ఆయన తల్లి దగ్గర వుండడు. ఇదంతా రెండు రోజులే అని

అయ్యగారు చెప్పిన దాని కర్థమిదేగావును! నా సంసారం బద్దలు కారాదంటే ఈ ఖర్మ అనుభవించాలి. తప్పదు సన్నేనహళ్ళికి వెళ్ళొచ్చిన ఆయాసంతో, మధ్యాహ్నం నుంచీ చేసిన పనితో, నెలలు నిండినా పిడికెడన్నం నోచుకోని అలసటతో ఆమె శరీరం సొమ్మసిల్లిపోయింది. చెన్నిగరాయలు తింటున్నాడు తిరుగుతున్నాడు. ఆయాసానికి కారణమే లేదు.

ఆమెకున్నట్టుండి తండ్రి గుర్తొచ్చాడు. తండ్రిది రాక్షస ప్రవృత్తి. ఏదీ లెక్కలేదు. కోపమొస్తే పిచ్చికోపం. పెళ్ళామని లేదు పిల్లలని లేదు, తల్లని లేదు, చస్తారా బతుకుతారా అని లేదు, వెళ్ళి చావగొట్టే అసురప్రవృత్తి. కానీ అనురాగం ప్రేమ కలిగితే అంత తీవ్రంగానూ ద్రవిస్తాడు. కల్లేసుకు ప్లేగు తగిలినప్పుడొక రాత్రంతా వాడి తల తన తొడమీదే వుంచుకుని కూర్చున్నాడట. హే భగవాన్! మొగుడు పెళ్ళాన్ని కొట్టినా సరే - ఆవిడ తిన్నదా, పస్తున్నదా, పిల్లలకేం పెట్టింది అని అడిగే ఆదరణ కూడా నోచుకోని సంసారమొక సంసారమా? అలాటప్పుడు బతికి లాభమేం? ఎందుకు బతకాలి? అక్కమ్మ గుర్తొంచింది. తాను పుట్టాక తల్లిపాలు తాగనే లేదట. తాను పుట్టింది, తల్లి కళ్ళు మూసింది. అప్పటినుంచీ అక్కమ్మే పెంచింది. తానంటే పడిచచ్చేది బామ్మొక్కతే. ఆవిడకి డెభ్భైఅయిదు దాటాయి. ఆవిణ్ణయినా పిలిపించుకోవాలి. మాకే తిండికి లేదు. ఆమెను పిలిపిస్తే మరీ చావే? పురుడెవరు పోస్తారు? నాగలాపురానికి వెళ్ళడమంటూ ఇహ వుండదు. అక్కమ్మ నిక్కడికే పిలిపిస్తే వచ్చి ఒక నెలరోజులైనా నాకూ, కలిగేబిడ్డకూ మానెపెట్టి నీళ్ళోస్తుంది. ఆవిడ వస్తే ఇంట్లో తినడానికే లేదు. చుక్క ఆముదం కానీ, ఇంత సీకాయి పొడి కానీ లేవు. ఈ ఆలోచనలతో, రేపొద్దుట లేస్తే వంటకుండలన్నీ ఖాళీ అన్న సంగతి గుర్తొచ్చింది. పిల్లలకేమివ్వాలి? మలమల మాడే తన ఆకలి మళ్ళీ గుర్తొచ్చింది. ఒక వేపే ఒత్తిగిల్లి పడుకున్నందున కుడివేపు నొప్పిగా వుంది. ఎడమవేపుకు తిరిగింది. భర్త వెల్లకిలా పడుకుని గుర్రుపెడుతున్నాడు. ఆమె కసవ్యామేసింది. లేచి తన జముఖానా తలగడా తీసుకుని చీకట్లోనే పిల్లలకటువేపు పరుచుకుని, నిద్రపోతున్న పార్వతి మీద చెయ్యివేసి పడుకుంది.

## 6

తెల్లారిలేచి కుండలో నీళ్ళుతోడి ముఖం కడుక్కుంది. పిల్లల ముఖాలు కడిగి తన చీరతో తుడిచింది. నింపాదిగా వంటింట్లో కెళ్ళి బూడిదెత్తి, పొయ్యాలికి,

నిన్నటి వంటకుండలన్నీ కడిగింది. నిన్న ముద్ద చేసిన చట్టిలో నీళ్ళోసి వుంచడం మరిచిపోయింది. లోపలంతా ఎండి అట్టకట్టింది. దానినిండా నీళ్ళోసి నడవలోనికి వచ్చింది. శ్రీవారు వీధి తలుపు వేపు కాళ్ళు చాచి, సుఖంగా గుర్రుపెడుతున్నారు. వీధి తలుపు సగం తెరిచి, వట్టినీళ్ళు చల్లి, గుమ్మంముందర అలికింది. పెడదామన్నా ముగ్గు లేదు. పక్కింటి చిన్నశెట్టి కోడల్నడిగి ఓ చిప్ప ముగ్గుపిండి తెచ్చి గుమ్మంముందు నాలుగు కర్రలు వేసి, మిగిలింది లోపలెట్టి, వూరికే కూర్చుంది. తరువాత చేయదగ్గ పనేమీ లేదు. ఆ రోజు పొట్ట గడవడమెలాగో తెలియలేదు.

వీధిలో వెడుతున్న గేదె అరుపు కదిరిపడి చెన్నిగరాయలు "థూత్ దీనమ్మన్ ... " అని లేచి కూర్చున్నాడు. పక్కమీద కూర్చుని కౌసల్యా సుప్రజా రామ చెప్పుకుని చేతులు రాచుకుని పంచకన్యా స్మరేన్నిత్యం చెప్పుకుని, పైకి లేచి చెరువుకట్టవేపు వెళ్ళాడు. వంజమ్మ శ్రీవారి పక్కచుట్టి మూలలో పెడుతూ వుండగా మాదేవయ్యగారు భుజంమీద ఒక గోనిపంచి మోసుకొచ్చి, దాన్ని స్తంభం దగ్గిర దించి ఇలా అన్నారు; "నేను పల్లెం వేపు భిక్షానికెడుతున్నాను ఇందులో ఇరవై సేర్లు రాగులు, నాలుగు సేర్లు అనపగింజలున్నాయి. మీరు చేసుకోండి."

ఈ రోజు గడిచేదెలాగా అని ఆలోచిస్తున్న సమయంలో ఇంటికి ధాన్యం రావటం సంతోషంగా వున్నా ఆవిడడిగింది. "అయ్యగారూ! నిన్నా ఇచ్చారు. ఈ రోజివి తెచ్చారు. మీరే వూరూరూ తిరిగి భిక్షమెత్తుతున్నారు. ఇది మళ్ళీ తీర్చడమెలా నేను?"

"తల్లీ! వీటిని దేనికుపయోగిస్తానో తెలుసుగా నీకు. నాలాంటి సాధువులు, సన్యాసులు వస్తే వాళ్ళకనేగా వుంచాను. దీంతో మీరో వారం రోజులు భోంచేస్తే మునిగిపోయేదేముంది? చేసుక తినండి. శివుడా వేళకి ఏదో దారి చూపకపోడు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

అయ్యగారు నిన్న తెచ్చిచ్చిన చేట ఇంట్లోనే ఉంది. దానితో రెండు సేర్లు రాగులు బాగుచేసి విసరటానికి కూర్చుంది. ఆ ఇంట్లో నేలలో పాతిన తిరగలి, రోలు పాత్రం అన్నీ వున్నాయి. కాని పావు విసిరేసరికే అలిసిపోయింది. నిన్న తిండి లేదు. అయిదు నిమిషాలు విశ్రాంతి తీసుకుంది. ఇంతలో మొగుడింటికొచ్చాడు. రాగులెక్కడివి ఏమి అని అతడడగలేదు. స్తంభానికి చేరబడి జేబులోని తాంబూలాన్ని మడిచి, పొగాకు తుంపు బావుచేస్తూ కూర్చున్నాడు.

"నా చేతకాదు. దీన్ని కాస్త విసిరిస్తారా?" నంజమ్మ డిగింది. అతడు మాట్లాడలేదు. మళ్ళీ అడిగేసరికి "మగాళ్ళు తిరగలి వడతారా? విసురుతారా? నేనేం మగాణ్ణమకున్నావా ఆడముండననుకున్నావా" అని గర్జించాడు.

సహవం కోల్పోరాదన్న తన సంకల్పం గుర్తొచ్చి నంజమ్మ మళ్ళీ మాట్లాడలేదు. పాలెవీధికెళ్ళి పుట్టమ్మను తీసుకొచ్చింది. అర్థణానికి చేటెడు రాగులు విసరటానికొప్పుకుని పుట్టమ్మ తిరగలి ముందు కూర్చుంది. నంజమ్మ చన్నశెట్టి అంగడికెళ్ళి మెరపకాయలు, ధనియాలు, ఉప్పు, నూనె మొదలైనవి మొత్తం రూపాయి సరుకులు తెచ్చి వంట మొదలెట్టింది. పదకొండు గంటలకు అనపగింజల పులుసు, ముద్ద, రామణ్ణకు రొట్టె తయారయ్యాయి. నిన్నకూడా ఆమె స్నానం చేయలేదు. నూతిలో నీళ్ళుతోడుకుని, పిల్లలకి నీళ్ళోసి, తానూ స్నానం చేసి తడిచీరతోటే లోపలికి వచ్చి, చీరమార్చుకుని వంటింట్లోనికెళ్ళింది. నిన్నటిలాగే శ్రీవారు అరటాకు వేసుకుని రాగిముద్ద మింగుతున్నారు. తనకూ పిల్లలకూ కాస్త వుంచండని ఆవిడ అడగలేదు. కానీ అతడే మూడు ముద్దలుంచేసి తేన్చుకుంటూ లేచివెళ్ళాడు. ఆమె చేసింది. ఏడు ముద్దలు. నంజమ్మ పార్వతితోపాటు భోజనానికి కూర్చుంది. పార్వతికి సగం ముద్దకే కడుపు నిండింది. తాను ఒకటిన్నర ముద్ద పులుసులో నంజుకుని తిన్నది. రొట్టె ముక్కలు నములుతున్న రామణ్ణ, నాలుగు పార్లు నీళ్ళుతాగి "అన్నం" అంటూ ఏడవటం మొదలెట్టాడు. "అంగట్లో అణాన్నర ఇచ్చి సేరు బియ్యమైనా తేవలసింది," అని ఆలోచిస్తూ ఆమె భోజనం ముగించింది. కడుపులో కాస్త పడగానే మరీ నీరసమై కళ్ళుమూసుకొచ్చాయి. బయటికి వచ్చి జముఖానా పరుచుకుని పడుకుంది.

రాత్రికి వంటచేయడానికి కర్రలు లేవు. నిన్న అయ్యగారు తెచ్చిచ్చిన వయిపోయాయి. మొగుడు భుక్తాయాసం తీర్చుకుంటూ పడుకున్నాడు. "ఎక్కడికైనా వెళ్ళి రెండు క్రరపుల్లలు తేస్తే బావుండును."

"పో, పో, నే నెవణ్ణని అడగను?"

"అలా అంటే ఏంజేయను? తోటవేపెళ్ళి ఏవళ్ళనైనా అడిగి నాలుగెందుపుల్లలు, కొబ్బెర మట్టలు తెస్తే పోలా?"

"దూలయితే నువ్వే వెళ్ళి తీసుకురా. నా చేతకాదు."

కర్రలకని ఆమె ఎవరి తోటకూ వెళ్ళలేదు. పక్కింటి చిన్నయ్య భార్యనడిగేసరికి,

ఓ పెద్ద గంపనిండా కొబ్బెరచిప్పలు, పది పదిహేను కొబ్బెర ముక్కలు, నాలుగు కర్రలు ఇచ్చింది. నంజమ్మ చన్నశెట్టి అంగడికెళ్ళి "బియ్యమెలాగ చన్నశెట్టి?" అని అడిగింది.

"సన్నబియ్యం తొమ్మిది సేర్లు; ముతకబియ్యం పన్నెండు సేర్లు."

పావలా ఇచ్చి మూడు సేర్లు ముతక బియ్యం తెచ్చి రాత్రి కర్ణసేరు బియ్యమన్నం వండింది. పార్వతి రామణ్ణ ఇద్దరూ సంతోషంగా భోంచేశారు. చిన్నయ్య పెళ్లాం రంగమ్మ సగం గిన్నెడు మజ్జిగ కూడా ఇచ్చింది. పిల్లల భోజనమయ్యాక, మిగిలిన అన్నానికి మజ్జిగకు చెన్నిగరాయలు సిద్ధమయ్యాడు. అదృష్టం కొద్దీ పిల్లల భోంచేయక ముందే ఇంటికి రాలేదు.

మాదేవయ్యగారిచ్చిన రాగులు వారం పదిరోజులు రావచ్చు. తరవాతేం జేయాలి? అన్న ఆలోచన ఆవిణ్ణి వేధిస్తోంది. రేపు రామసంద్రం సంత. వెళ్ళి రెండు మూడు వంటగిన్నెలు, తాగటానికి అల్యూమినియం గ్లాసులు కొనాలనుకుంది. మరుసటి రోజు భోజనమయ్యాక మధ్యాహ్నం మూడుగంటలకు పిల్లలనూ తీసుకుని సంతకెళ్ళింది. వూరికర్ధమైలు దూరములో తోటలో జరిగే సంతకు తిపటూరి నుంచి సాయబులు అల్యూమినియం పాత్రలు తెస్తారన్న సంగతి ఆమెకు తెలుసు. వాళ్ళతో బేరమాడి నాలు గన్నంతినే కంచాలు, నాలుగు నీళ్ళుతాగే గ్లాసులు, గరిటా, స్నానం చేయటానికో చెంబు కొన్నది. మొత్తం రూపాయి ముప్పావలా అయింది. ఏడుస్తున్న పిల్లలకి కానీకానీకి చక్కెర చిలకలు, గిలకలు కొనిపెట్టి ఇంటికి బయల్దేరుతూ వుండగా గుండేగౌడ ఎదురుపడ్డాడు.

ఆయనే అడిగాడు "ఇల్లమకూలంగా వుందా తల్లీ?"

"వుందండీ,రండి ఒకసారింటికెళ్ళొద్దాం."

అల్యూమినియం పాత్రలు గౌడే తీసుకొస్తున్నాడు. రామణ్ణను బుజాన వేసుకుని ఆవిడ వెనకాల నడిచింది. ఇంటికొచ్చి, తాళం తీశాక ఇల్లంతా ఓసారి చూసి గౌడడిగాడు "తినడానికేం జేస్తున్నారు?"

"అది మిమ్మల్నే అడగాలనుకున్నాను."

"ఆరోజే అడిగితే పాతికసేర్లు రాగులిచ్చే వాణ్ణిగా."

"దాంతో ఎన్ని రోజులు గడుస్తుంది?" --వెంటనే ఏదో వుపాయం తట్టి అడిగింది. "మీరూరికే ఇవ్వటమెందుకూ? వద్దు. నేనో మాట చెప్తాను. అలా చేస్తే మీకూ తొందరుండదు. మాకూ వుపకారమవుతుంది.

"చెప్పుతల్లీ!"

"మీ మొత్తం పన్నెంత? ఎనభైరూపాయలుగా?"

"దేనికి?"

"ఓపని చేయండి. ఈ సంవత్సరం మీ పన్ను బాపతు యాభైరూపాయలు ముట్టినట్టు ఆయనతో రసీదు రాయించుకోండి. ఆ యాభై రూపాయలకు మాకు రాగులు, అనపగింజలు, మెరపకాయలు ఇంట్లో వుంటే కొంత వడ్లు ఇవ్వండి మా జీవనం గడుస్తుంది."

"ఇప్పుడు రసీదు రాయించుకుంటే తరువాత ఎలా కడతారు సర్కారు డబ్బు?"

"మాకు పాటిగె నూటాఇరవై రూపాయలుంటుందిగా. దావిలో సర్కారువాళ్ళు మినహాయించుకుంటారు."

గౌడుగారికీ వుపాయం సబబుగా తోచింది. "నీకు దివాన్ గిరి చేసే బుద్ధుంది తల్లీ" అని తన అంగీకారాన్ని తెలిపాడు. మొగుడు మాదేవయ్యగారి గుడిలో కూర్చుని పొగాకు నములుతూ వుంటాడని ఆమెకు తెలుసు. గుండేగౌడు గారొచ్చారని చెప్పి నాన్నని పిలుచుకరమ్మని పార్వతిని పంపింది. ఇంటికి వచ్చిన కరణంగారు, మునసబు గుండేగౌడ దగ్గర మరోసారి వక్కాకు పొగాకు తీసుకుని నమిలిన తరువాత గౌడడిగాడు ; "ఏది, నీ కాతా ఖిర్దీ కాస్త పైకితీ."

"ఇక్కడెక్కడుంది?"

"ఎక్కడుంది?"

"మా అమ్మింట్లో!"

"అది కాదయ్యా! కరణీకమంటే ఏటనుకున్నావు? నీ ఇల్లెక్కడుందో అక్కడే దస్త్రముండాలి. లెక్కలు పుస్తకాలుంచుకోండనేగా ఇల్లిచ్చింది. సర్కారు రూలు తెలుసా నీకు? ఏది, ఎల్లి దస్త్రం తీసుకురా."

కరణంగారు హనుమంతరాయని గుడికెళ్ళాడు. గంగమ్మ లెక్కల దస్త్రమివ్వలేదు. మునసబు గుండేగౌడ చెప్పాడనే సరికి ఆమిడే ఇక్కడికి వచ్చింది. "సర్కారు రూలే అలాగుందమ్మా!" అని ఆయన చెప్పాక 'అయితే నేనూ వచ్చి ఇక్కడే వుంటాము' అంది.

"వుండండి, నా సామ్మేమిపోయింది?"

కాని నంజమ్మ వెంటనే అంది "అది వీల్లేదు. ఒకసారి వేరే వుండమని తోసేశాక,

మీ అంతట మీరుండండి, మా అంతట మేముంటాం."

"మాశావా గుండేగౌడా? ఈ ముప్పావాతి ముండ మాటలు?"

"గంగవ్వా! నే నీ ఇల్లిచ్చింది కరణీకం లెక్కల పుస్తకాలకి, అవన్నీ రాసే ఈ అమ్మకి, తతిమ్మావోళ్ళకి కాదు. నువ్వూరికే నోరుపారేసుకోకు" అని గౌడ చెప్పేసరికి గంగమ్మ గట్టిగా శాపనార్థాలు పెడుతూ హనుమంతరాయని గుడికి వెళ్ళిపోయింది. కరణంగారు తామేవెళ్ళి లెక్కల పుస్తకాలు నాలుగు సార్లు తలమీద మోసుకుని తెచ్చారు. అవి వుంచే పెట్టె మాత్రం గంగమ్మ ఇవ్వలేదు.

అన్నీ తెచ్చాక గుండేగౌడడిగాడు "బసవన్నా! ఇన్నేళ్ళు కరణీకం చేశావు. సర్కారోళ్ళు తోటి, తలార్ని ఎందుకిచ్చారో తెలనదా?"

కరణంగారు మాట్లాడలేదు. గౌడే అడిగాడు. "ఈ దస్త్రాలన్నీ నువ్వే తలమీదెట్టుకుని తెచ్చావే. తోటిని కేకేసి, తెచ్చిపెట్రా అనడానికేం? ఏటదికారం సేస్తావో నువ్వు? సరేలేద్దూ. కాగితం కలము చ్చుగుని రాయి. అదేటో నువ్వు సెప్పుతల్లీ."

కరణం చెన్నిగరాయులు కలంపట్టాడు. పెళ్ళాం చెప్పింది. "రామసంద్రం పిర్కా కురుబరహళ్ళి మునసబు గుండేగౌడగారి నుండి ఆయన కట్టవలసిన ఈ సంవత్సరం పన్ను బాపతు యాభై రూపాయలు ముట్టినవి. వసూలు కాలంలో ఈ మొత్తాన్ని మినహాయించి, కదమది వసూలు చేసి మీ పట్టిలో వ్రాసుకుంటాము. కరణం చెన్నిగరాయలు. తేది..."

ఆమె చెప్పినట్టుగా వ్రాసి దాన్ని గౌడ చేతికిచ్చాడు. ఇచ్చిన పదినిమిషాలదాకా తావేమి వ్రాసిందీ అర్థంకాలేదు. తరవాత గుర్తొచ్చి "డబ్బేదండీ?" అన్నాడు.

"డబ్బెక్కడ పోద్ది? నన్ను చిర్రెత్తించకు వూరుకోవయ్యా" అన్నా. ఆయన సణగడం వదలలేదు.

ఆ మరుసటి రోజే గుండేగౌడ బండి కట్టించుకుని వచ్చి ఇంట్లో బస్తాలు దించి నంజమ్మతో చెప్పాడు "చూడు తల్లీ! అయిదు ఖండగల రాగులు. అంటే ఇరవైనాలుగు రూపాయలు. ఒక బస్తా అనపగింజలు ఎనిమిది రూపాయలు, ఒక మణువు మెరపకాయలు మూడు రూపాయలు, మొత్తమెంతయింది?"

"ముప్పై అయిదు."

"తీసుకో ఈ అయిదు రూపాయలు నలభై అయ్యాయిగా. మరో పది తిప్పర్లో కొబ్బరమ్మాకిస్తాను. మా ఇంట్లో వడ్లు లేవు. నువ్వే అంగట్లో

బియ్యంకొను."

నంజమ్మకు ధైర్యమొచ్చింది. ఈ అయిదు రూపాయలు, తన దగ్గిరున్న ఇంచుమించు రెండురూపాయలుకలిపి, ఓ గుడ్డలో చుట్టి, చీరమడతలో దాచింది.

## 7

ఎనిమిదవనెల నడుస్తోంది. ఒక మధ్యాహ్నం కూర్చుని నంజమ్మ పహణి పుస్తకానికి రూళ్ళు వేస్తోంది. కడుపు బాగా పెరగటం వల్ల గొంతుకూర్చుని గీతలు గీయటం సాధ్యం కాలేదు. అయినా ఎలాగో తంటాలుపడి కూర్చున్న భంగిమ మార్చి మార్చి గీతలు గీస్తోంది. చెన్నిగరాయలక్కడే మరో అంకణంలో గుర్రెట్టి నిద్రపోతున్నాడు.

వున్నదున్నట్టుగా గంగమ్మ గాలిదుమారంలా ఇంట్లో దూరింది. వెనక గుండేగౌడ కరణీకపు పుస్తకాలను తెప్పించిన రోజు మినహా ఆమె ఎన్నడూ ఈ ఇంటికి రాలేదు. ఇంట్లో కొచ్చిన గంగమ్మ ఎవరినీ అడగాలేదు పెట్టాలేదు. కణజం మూత తీసి తాను తెచ్చిన సంచికి రాగులు నింపడం మెదలెట్టింది. ఇప్పుడేం చేయాలి అన్నది తెలియని వంజమ్మ రెండు నిమిషాలూరికే వుండి, అడిగింది : "అత్తయ్యా! ఏం జేస్తున్నారు?"

"ఏంజేస్తున్నానా? రాగులు తీస్తున్నాను, అడగటానికి నువ్వెవరే?"

"మొదలా సంచి అక్కడ పెట్టి దూరంగా నుంచుని మాట్లాడండి. చెప్పా చెయ్యకండా మా ఇంటి ధాన్యం ఎలా తాకారు?"

"దీని ఇల్లు! మీ బాబు కట్టించాడా ఈ ఇల్లు? విన్నావట్రా శిఖండి లంజాకొడుకా? ఈ రోజు తెల్లారినుంచి ఇంట్లో తండులాలు నిండుకున్నాయని పొయ్యి రాజెయ్యలేదు. రాగులు తీసుకుందామని వస్తే దీని బాబు తెచ్చి వేసినట్టు గునుస్తుంది. కురుబరహళ్ళి గుండేగౌడ మా మునసబు. నీ రంకు మొగుడు కాదు తేరకివ్వటానికి."

అంతలో నిద్రమత్తు వొదిలిన చెన్నిగరాయలు "తీసుకుంటే తీసుకుంది లేవే, మీ అమ్మన్ ...." అన్నాడు.

"గుండేగౌడ మీకిమ్మని ధర్మానికి దానం చెయ్యలేదు. పన్నుకింద మినహాయించుకోండి అని నేను చెప్పి తెప్పించాను."

"కరణీకం నా మొగుడిది. మీ బాబుది కాదే. భోసుడిముండ" అంది అత్త.

"మా బావే గుర్రం మీద వచ్చి ఇప్పించింది. లేకపోతే చేతికి దక్కేదికాదు. గుర్తుంచుకోండి. ఇప్పుడు కంటికి వత్తులేసుకుని లెక్కలు రాస్తున్నది నేను. మా ఇంటికొచ్చి ధాన్యంగీవ్యం ఏమైనా ముట్టారా గుండేగౌడగారికే కబురెడతాను."

"ఈ రోజు తెల్లారి మంచి భోంచేయలేదు. ఏం చేయనురా ముండాకొడుకా?"

"వెళ్ళి శివేగౌడనో కాళింబడ్డినో అడగండి. లేకపోతే వున్నాడుగా రేవణ్ణశెట్టి అడగండి" నంజమ్మ సమాధానం చెప్పింది.

ఆ మాటల్లోని వెటకారం, ఈసడింపూ గంగమ్మకు బోధపడలేదు. సంచి అక్కడే వదిలేసి తిన్నగా శివేగౌడ ఇంటికెళ్ళింది. ఆవిడ వెళ్ళాక నంజమ్మకయ్యో పాపమనిపించింది. తెల్లారినుంచీ పస్తని వినికూడా తానలా పంపించి వుండరాదని మనములో తలపోసి, లోపలికెళ్ళి చేటలో మూడు సేర్ల రాగి పిండి వేసి దాన్నిచ్చి రమ్మని మొగుడికి చెప్పింది. చేటపట్టుకుని చెన్నిగరాయలు హనుమంతరాయని గుడికెళ్ళాడు.

గంగమ్మ తిన్నగా శివేగౌడ ఇంటికెళ్ళి అడిగింది. "ఏమయ్యా! మునసబూ! ఈ రోజు తెల్లారినుంచి పొయ్యిలో నిప్పేయలేదు. పాతిక సేర్లు రాగులివ్వు."

"నీకేం తమాషాగా వుందా? ఎక్కణ్ణించీ వొస్తాయి పాతికసేర్లు?"

"కొంపలు కూల్చే లంజాకొడుకా! నా ఆస్తి అంతా కొట్టేసి ఇప్పుడిలా కూస్తావేరా? నీ వంశం ముందుకురాదు."

"ఆస్తి కొట్టేశానా డబ్బు కురిపించలేదా ముండా? నోరు జాగర్తగా వుంచుకుని మాట్లాడుతావా, మెడబట్టి గెంటించమన్నావా?"

గౌడ భార్య గౌరమ్మ వెంటనే ముందుకు వచ్చి మొగుడితో అంది. "ఆవిడట్టా గంటుందని నువ్వేటి నోరుపారేసుకుంటావ్. వూరుకో తోటవైపెళ్ళు."

ఆ ముసిల్ది వీధిలో నుంచుని దుమ్మెత్తిపోసి శపిస్తే తమ కుటుంబానికేదైనా కీడు కలుగుతుందని గౌరమ్మ భయం. గంగమ్మతో వాగ్వివాదానికి దిగడం మునసబుగారికి ఇష్టం లేదు. పెళ్ళాంచెప్పిన నెపమే బావుంది. జోడు తొడుక్కుని తోటవేపు వెళ్ళిపోయాడు. గౌరమ్మ రెండు చేటలనిండా రాగులు నింపి, అలికిన గంపలో పోసి, తెచ్చి గంగమ్మ ముందుంచి "ఆయనంటారని కోపగించుకోకండి ఇందా తీసుకెళ్ళండి" అంది.

వుక్రోషంతో వుడికిపోతున్న గంగమ్మ దాన్ని వద్దనేదో ఏమో. కానీ గౌరమ్మ మళ్ళీ చేప్పేసరికి గంపనెత్తినెట్టుకుని తానున్న హనుమంతరాయని గుడికి విసవిస

వెళ్ళిపోయింది.

చెన్నిగరాయలు రాగిపిండి చేట అప్పణ్ణయ్యకిచ్చి మాదేవయ్య గుడికెళ్ళి కూర్చున్నాడు. నంజమ్మ మళ్ళీ కూర్చుని, తలవంచుకుని పుస్తకానికెఱ్ఱసిరా గీతలు గీస్తోంది. ఎవరో ఇంట్లోకి వచ్చినట్టయింది. ఎవరని తలెత్తి చూసేలోపుగా, గంగమ్మ రాగిపిండి చేటలోటి ఆవిడ ముందు నుంచుంది. ఏమిటి ఎందుకు అని అడిగే లోపుగా చాటెడు పిండి కోడలి నెత్తిమీద గుమ్మరించి, చేటతో ఓసారి మొట్టి "నీ ఇంటి ముష్టి ముద్ద నేను తింటాననుకున్నావా ముష్టిముండా? గంగమ్మ అంటే ఏమనుకున్నావ్?" అని పిఱ్ఱలు తిప్పుకుంటూ గబగబా వెళ్ళిపోయింది.

తల, చేతులు, ఒళ్ళు, పుస్తకం, ఎఱ్ఱసిరాబుడ్డీ అంతా రాగిపిండితో కప్పడిపోయాయి. లేచివెళ్ళి వెనకనించి అత్తయ్యను పట్టి నిలెయ్యాలన్న వూహ మనమ్సుకు కలిగింది. లేదా ఆవిడేం జేసిందో ఇద్దరు పుణ్యాత్ములకు చూపాలన్న ఆలోచన కలిగింది. కాని తన ఇంటి పోట్లాట పైవాళ్ళక తెలిస్తే వూరందరికీ నవ్వులపాలుగా వుంటుంది. ఇప్పటికే ఎందరో నవ్వి పోతున్నారని వూరుకుంది. పైకిలేచి చీరకొంగు దులుపుకుంది. అదృష్టకొద్దీ పిండంతా ఆవిడ కూర్చున్న ఈత చాపమీదే పడ్డది. పుస్తకాన్ని దులిపి, పిండంతా పోగుచేసి ఎత్తి జల్లెడపట్టి దాచింది. శిరస్నానం చేసి పిండి కడుక్కుని, సిరాబుడ్డీకడిగి చన్నశెట్టి కొట్టునించీ మూడుపైసాలిచ్చి రెండెఱ్ఱ సిరాపొడి పొట్లాలు తెప్పించి, సిరా చేసి మళ్ళీరూళ్ళు గీయడం మొదలెట్టింది.

## 8

ఇది జరిగిన మూడవరోజు వుదయం పదిగంటలప్పుడు, నంజమ్మ లోపల వంట చేస్తుండగా, బయటనుంచీ 'నంజా!' అని కేకేసినట్టనిపించింది. ధ్వనివినే అక్కమ్మదని వూహించి సంబరంతో ఆవిడ బయటకొచ్చి చూసేసరికి నిజంగా అక్కమ్మే! తలమీదో మూట, వెన్ను వంగిపోయింది. గుమ్మంలో నుంచుంది. ఆవిడ వెనకాలే తలంమీద గోనిసంచుల మూటల్తో ఇద్దరు మగాళ్ళు నుంచున్నారు. మనవరాలిని చూడగానే అక్కమ్మ ఆ మనుషుల్ని మూటలు దించమని చెప్పింది. "నంజా, నువ్వు కడుపులో వున్నట్టు కబురెట్టద్దూ? ఇలావుందని కష్టమో సుఖమో తెలపద్దూ?"

"కలురెట్టాలనే అనుకున్నాను. లోపలికి పద. మడికట్టుకో."

"నా మడి తరువాత చూద్దాం. వంటయ్యింటే ముందు వీళ్ళకి వడ్డించు. వాళ్ళూరికెళ్ళాలి."

లోపల పులుసు తయారవుతోంది. ముద్ద చేయటమొకటే తరవాయి. నంజమ్మ లోపలికెళ్ళి మంటపెద్దది చేసి పావుగంటలో పులుసు, ముద్ద తయారు చేసింది. చెరువు వేపు వెళ్ళి చేతులు కాళ్ళు కడుక్కుని వచ్చిన ఇద్దరికి వడ్డించేటప్పుడక్కమ్మ అడిగింది. 'మజ్జిగ లేదా?'

"ఎక్కణ్ణించి వస్తుంది?"

వాళ్ళిద్దరూ భోంచేశాక అందులో ఒకడితో అక్కమ్మ చెప్పింది. "హన్నా! లక్కడు నోరు విప్పేడుసుమా జాగర్త. వాడికి మరోసారి చెప్పు. ఇంటికెళ్ళగానే కల్లేశులో చెప్పు. ఇంట్లో పాడిలేదు. బాలెంతకు పాలు కావాలి. మన వెల్లావు తరపి దూడలేదు – నెలక్రితం ఈనింది దాన్ని తోలి పంపించమను. దాన్ని కన్యాదానం చేసినప్పుడు నంజమ్మకిచ్చాం. దాన్నిక్కడికి పంపలేదు. ఇప్పుడు దాని దూడనైనా పంపించమన్నానని నేను చెప్పినట్టుగా చెప్పు."

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. చన్నీళ్లతోటే స్నానంచేసి ఎర్రని తడిచీర చుట్టుకుని నుదట విభూతెట్టుకుని, మూడుసార్లు చమకం చేశాక అక్కమ్మ వంటింట్లోకెళ్ళి తడిచీర ఆర్పుకుంటూ పొయ్యిముందు కూర్చుంది. నంజమ్మడిగింది. "నీకెలా తెలిసింది?"

"మమారి సాలె తమ్మయ్యశెట్టికి ఈవూరి పిల్లనేగా ఇచ్చింది? వారంపదిరోజులక్రితం చెరువుకెళ్ళాను. తిరుమలమ్మా వచ్చింది. అంతాచెప్పింది. మీరిప్పుడు కురుబరహళ్ళి మునసబుగారింట్లో వున్నారనీ, ఏడెనిమిది నెలలకడుపనీ, మీ అత్తయ్య ఓచిన్న పంచపాత్రకూడా ఇవ్వలేదనీ చెప్పింది. కమలమంతాపోతుందని కల్లేశు ముందే చెప్పాడనుకో."

"నువ్వెప్పుడు బయల్దేరావు?"

"నిన్ననే బయల్దేరాను. సాయంత్రం, కుండపోతగావర్షం కురిసింది. ముగ్గురమూ దారిలో మెట్టవతల వుండే హావినహళ్ళి, అక్కడ మునసబింటి పంచటరుగుమీద పడుకున్నాం. మునసబింటివాళ్ళు మనుషులిద్దరికీ అన్నంపెట్టి కాసింత కొబ్బరికోరు బెల్లమిచ్చారు."

ఆటలాడటానికి బయటికెళ్ళిన పిల్లలింటికొచ్చారు. పార్వతి అక్కమ్మను

మరచిపోలేదు. జ్ఞాపకముంది, రామణ్ణకామె ఎవరో తెలియలేదు. కానీ అర్ధగంటలో పిల్లలిద్దరికీ చనువేర్పడి ఆమె దగ్గిరికెళ్ళారు. భోజనాలసమయానికి చెన్నిగరాయలింటికి వచ్చాడు. "బావున్నారా"? అని అడగటం మినహా మునలమ్మకెలాంటి ఆదరణ చూపలేదు. మునలమ్మకూడా పట్టించుకోలేదు. భోంచేశాక ఇంట్లో పడుకోకుండా మాదేవయ్యగారి గుడి అరుగు నాశ్రయించాడు. అక్కమ్మ తానుతెచ్చిన రెండు పంచలూ విప్పింది. ఒక దాంట్లో ఇత్తడిపాత్రలు, రాగిపాత్రలూ వున్నాయి. నాలుగిత్తడి గిన్నెలు, రెండిత్తడిచెంబులు, ఒక బిందె, అయిదిత్తడి గ్లాసులు, రెండు రాగిపంచపాత్రలు, అన్నపు తప్పేలాలు రెండు, రెండు చెవులగిన్నెలు మొదలైన మనిషి మోయగలిగినన్ని వున్నాయి. మరోసంచిలో అటుకులు, పేలపిండి, బెల్లపుండలు వున్నాయి. ఇవికాక పదిసేను సేర్ల 'ముంగేవరి' బియ్యంకూడా వున్నాయి.

"బామ్మా ! ఇవన్నీ ఎందుకుతెచ్చావు?"

"పెల్లయిన్న ఇల్లు, అటుకులు పేలపిండి చేసుకెళ్ళమని కల్లేశే చెప్పాడు. మైదానంలో గానుగ ఆడుతోంది. గణపతివుండ యింట్లో మూడు గూనలనిండా మూలుగుతున్నాయి. వాడే బెల్లమూ ఇచ్చాడు. బియ్యమూ ఇచ్చాడు."

"ఈ పాత్రలు?"

"చూడు, కల్లేశు పోలీసుద్యోగంలో వున్నప్పుడు దానంలోవచ్చిన పాత్రలన్నీ నేనే అటకమీద బుట్టల్లో నింపపెట్టాను. ఎన్నున్నాయో ఎవళ్ళకీ తెలియదు. ఇక్కడ నీకిలా అయిందని తెలిశాక, అది చెరువు కెళ్ళినప్పుడు ఏవో ఇన్నితీసి మూట కట్టి పెట్టాను. నేనొచ్చేటప్పుడు ఎవళ్ళకీ తెలియకుండా, వాటిని లక్కడిచేత మోయించి, పెన్నణ్ణి ముందుగానే చౌడేనహళ్ళి తూముదగ్గిర వుండమని చెప్పాను."

"అయినా ఇవి తెచ్చుండరాదు బామ్మా! తెలిస్తే అన్నయ్య అయినా వూరుకుంటాడా?"

"వాడికి తెలపదూరుకో. కంఠీవున్నప్పుడు దానంలో వచ్చినవి" - అనగానే కొడుకు గుర్తొచ్చి కంట తడిపెట్టుకుని "వెర్రివెధవ! ఎక్కడికెళ్ళాడో ఏమో! మొదటినుంచీ అంతే. ఏవోవో చేయబోతాడు. హాయిగా ఇంట్లోవుంది దేవుడిచ్చింది తిని కూర్చోక."

తండ్రిగుర్తొచ్చి నంజమ్మకూ బాధనిపించింది. "నాన్న సమాచారమేమయినా

తెలిసిందా?"

"ఏమీలేదు. వాడింకా ఎక్కడుంటాడు. ఎప్పుడో చచ్చి స్వర్గానికెళ్ళాడంటారు. వాడెలా చస్తాడు? మాంచి భీముడిలాంటి వుక్కుపిండం."

"చావా లేదు గీవాలేదు. అదబద్దం", అని మనవరాలన్నాక ముసలమ్మ మనస్సు కాస్త శాంతించింది.

అక్కమ్మకు నీరసంగా వుంది. ఇంట్లో మంచి చాపలేదు. మురికి ఈతచాప పనికి రాదు. పట్టేవేంమీదే వెన్నువాల్చింది.

"ఇప్పుడు వదినమ్మెలాగుంది?" నంజమ్మ ప్రశ్నించింది

"పుడుతూ వచ్చిన బుద్ధి పుడకల్తోగాని పోదట! మీనాన్న తలతిక్కనేమనాలి? ముందూ వెనకా చూడలేదు. నాలుగుచోట్ల భోగట్టా చేసి తెలుసుకోలేదు. ఇక్కడికొచ్చాడు నిచ్చిచ్చాడు. అక్కడికెళ్ళాడు దాన్ని తెచ్చాడు. దానికేం సుఖంగా తింటుంది. తిరుగుతుంది. పితికిన పాలుపెట్టిన చోట పెట్టినట్టే చాటుగా వంచుకుని తాగుతుంది. దొంగచాటుగా నేతిముద్దలు తీసితీసి మింగుతుంది. వారానికోసారి మూనెట్టుకుని తలంటిపోసుకుంటుంది. నన్నుకూడా పిలవదు. ఇంతపోషణచేసుకున్నా దానికి కడుపూ రాలేదు గిడుపూ రాలేదు."

"అలా మొగుడూ ఒద్దికగావున్నారా?"

"ఒద్దికేమిటి నాబొంద! నాలుగు రోజులు పడగ్గదిలో రాత్రిపడుకున్నప్పుడు గుసగుసమని చెవులుకొరుక్కుంటూ వుంటారు. నాలుగురోజులు దాన్ని పట్టుకుని చావగొట్టి చెవులుమూస్తాడు. నేనే మనవడికి చెప్పి దేహశుద్ధి చేయిస్తున్నానని దానికి రంధి. "వొద్దురా, పెళ్ళాన్ని కొట్టకురా" అంటే. "కొట్టకపోతే ఆ ముండ రోగం కుదరదు. క్రవంక పొయ్యేతీరుస్తుంది. "నువ్వూరుకో" అని నన్నే దబాయిస్తాడు. కెంపి అని వుండేదెరుగుదువా మాల కాళన్న కూతురు?"

"ఎరక్కేం? ఏమయిందేం?"

"కల్లేశు దానితోటి చెరుకుతోటలో వుంటాడని, వాళ్ళూ వీళ్ళూ అనేవారు. బెస్తవీధిలో మాయగ వుండేవాడు చూడు. మూడేళ్ళక్రితం చచ్చిపోయాడు. వాడిపెళ్ళాముంది. ఇద్దరు పిల్లలుకూడ. దానింట్లో అప్పుడప్పుడుంటాడట. ఇంకా ఏవేవో చెబుతారు. ఇదేమిట్రా అని ఒకరోజడిగేశాను, 'ఏలంజాకొడుకు నీకు చెప్పాడు? వాణ్ణి జోడుచ్చుక్కొడతాను' అన్నాడు. నేనెందుకు కదపాలి అని వూరుకున్నాను.

"ఇంట్లో పెళ్ళాముంది. అన్నయ్య అడ్డదారులు తొక్కడమెందుకూ?"

"అదో గయ్యాళిగంప. పెళ్ళయ్యాక తిన్నగావుంటే వాడెందుకిలా అవుతాడు? చెప్పు."

ముసలమ్మ మనవరాలి కష్టసుఖాలడిగి తెలుసుకుంది. తాను వచ్చాక వంటపని తనదే. నంజమ్మకప్పుడే ఎనిమిది నెలలు నిండాయి. రాత్రిపూట ఆమె అక్కమ్మ దగ్గరే ఈత చాపవేసుకుని పడుకుంటోంది. పిల్లలిద్దరూ అక్కమ్మను చెరోవేపు వాటేసుకుని పడుకుంటున్నారు. నిద్రపట్టేదాకా బామ్మా మనవరాలు ఏవేవో మాట్లాడుకునేవారు. చెన్నిగరాయలకింట్లో పడుకోవటం విసుగెత్తిపోయింది. ఒకరాత్రి భోంచేశాక అతడే తన పక్కచుట్ట మోసుకుని వెళ్ళి మాదేవయ్యగారి గుడి అరుగు నాశ్రయించాడు.

అక్కమ్మవచ్చిన వారంరోజులకి కల్లేశే వెల్లావునూ దూడనూ తోలుకొని వచ్చాడు. రెండురోజులు చెల్లాయి ఇంట్లో గడిపి వెళ్ళిపోయాడు. తొమ్మిది నెలలు నిండాక సంజమ్మకు పురుడొచ్చింది. మగపిల్లాడు పుట్టాడు. ఆరోగ్యంగా బొద్దుగా చూడముచ్చటగావున్నాడు. బారసాల చేయటానికి చేతిలో డబ్బులేదు. అక్కమ్మ బియ్యమూ బెల్లమూ తెచ్చింది. ఆమె వద్ద అయిదురూపాయలున్నాయి. దాంతోటే వూళ్ళోవున్న నాలుగు బ్రాహ్మల ఇళ్ళల్లోను, ఇద్దరు జోస్యుల ఇళ్ళలోనూ భోజనావాకి పిలిచి, బారసాల శాస్త్రం చేయించి 'విశ్వనాథ' అని పేరుపెట్టారు. ఆ రోజు గంగమ్మ, అప్పణ్ణయ్య వూళ్ళో వుండలేదు. ముందురోజే ఏవూరికో వెళ్ళారు.

# 8వ అధ్యాయం

అక్కమ్మ నాలుగు నెలలపాటు నంజమ్మకు బాలెంతతనం చేసింది. మనవరాలిని ఏపని చేయటానికీ వదలకుండా అతిగారాబంగా చూసుకుంటున్నా రెండవనెలలోనే ఆవిడ లేచి కూర్చుని, ఖానీషుమారి లెక్కలకు రూళ్ళేసి, మొగుడు తెచ్చిన మాగాణి మెరక పంటల వివరాలతో పహణి గోష్వారం తయారు చేయటం మొదలెట్టింది.

అక్కమ్మను తీసుకెళ్ళడానికి కల్లేశే వచ్చాడు. వాళ్ళిద్దరూ రేపు బయల్దేరు తారనగా ఆరోజు సాయంత్రం సెట్టి వచ్చి కరణంగారితో "లంగడి చెన్నసెట్టి ఇంట్లో పంచాయతీ జరుగుతోంది. రావాలట" అని పిలిచాడు.

"ఆదేమి పంచాయతీరా?" నంజమ్మడిగింది.

"చెన్నసెట్టి తనకోడలు వరసై నుంచుకున్నాట్ట. ఆవిడ మొగుడు పంచాయతీ చేయిస్తున్నాడు."

ఆదేమైనా సరే. పెద్దపెద్ద వాళ్ళున్నారు కదా. వాళ్ళనే చూడమను. మాఇంటికి బంధువులొచ్చారు. ఆయన రావటానికి వీల్లేదని చెప్పు.

"కరణంగారు వచ్చి తీరాలట. అందరూ తీసుకురమ్మన్నారు."

గ్రామన్యాయం, పంచాయితీలలో కరణంగారుండాలన్నది సబబే. చెన్నిగ రాయలను న్యాయస్థానంలో కూర్చోబెడితే పిండేదో, నూకేదో తేడా తెలియదని అందరెరుగుదురు. ఎలాంటివాడైనా కరణం విధిగా ఉండాలి. చెన్నిగరాయలు బయల్దేరాడు. అతనివెంట కల్లేశుకూడా వెళ్ళాడు. ఇలాంటి న్యాయవిచారణలో అతనికున్న తెలివితేటలు మరెవళ్ళకుంటాయి?

చెన్నసెట్టి ఇంటిలోగిట్లో గ్రామపెద్దలంతా కూర్చున్నారు. మునసబు శివేగౌడ, అతని బావమరిది, మాజీకరణం శివలింగ, రేవణ్ణశెట్టి, నలుగురు పంచాయతీసభ్యులు, ఇద్దరు జోస్యులు, ఇంకా పదిపదిహేనుమంది వున్నారు. అందరికీ, ఆకులు, వక్కలు, పొగాకు, బీడీలు తెచ్చి ముందుంచారు. పంచాయతీ ప్రారంభించేముందు

న్యాయపీఠంలో ఎవళ్ళని కూర్చోబెట్టాలి అన్న ప్రశ్న వచ్చింది. కరణంగారని ఎవళ్ళో అన్నందుకు మునసబు శివేగౌడ, "ఆ వెర్రిమాలోకానికేంతెలుస్తుంది?" అన్నాడు. మునసబుగారని మరొకరు సూచించారు. రేవణ్ణశెట్టి అడ్డుతగిలి పడనీలేదు. "వూరివాళ్ళెవళ్ళూవద్దు. పోలీసులో పనిచేసిన, కరణంగారి బావమరిది కల్లేశకోస్యులుండనీ" అని వాది గిరియసెట్టి సూచించేసరికి అందరూ ఒప్పుకున్నారు. అందరి కోరికమేరకు కల్లేశు మధ్యలో కూర్చుని పొగాకు వేసుకున్నాక అడిగాడు : "ఈ తగాయిదా ఏమిటి? ఎవళ్ళకన్యాయం జరిగింది? సభముందు తెలపండి."

గిరియసెట్టి ప్రారంభించాడు, "మా అయ్య నాపెళ్ళామ్నుంచుకున్నాడు. ఇద్దరికీ దండం విధించాలి."

"మీ అయ్య ఎవరు?"

"అడుగో, అడకూచున్న అలగా నాకొడుకు"- అని గిరియ స్తంభంచాటుగా తలవంచుకుని కూర్చున్న చెన్నసెట్టివేపు చేయి చూపెట్టాడు.

కల్లేశు వివరంగా అడిగిన తరువాత తెలిసింది. గిరియసెట్టి పొలం దున్నటానికెడతాడు. చెన్నసెట్టి ఎప్పుడూ అంగట్లో కూర్చుని వ్యాపారం చేస్తాడు. ఇంటి పంచటరుగుమీదే వుంది అంగడి. గిరియపెళ్ళాం నరిపి ఇంట్లోనే వుంటుంది. దానిపెళ్ళై ఎనిమిదేళ్ళయింది.

ఇలాంటి న్యాయవిచారణలో, దానికి సంబంధించిన ప్రతిఒక్కరూ ఏమి చెప్పుకుంటారో వివరంగా తెలుసుకోవాలని కల్లేశన్నాడు.

చెన్నసెట్టి భార్య చనిపోయి ఇరవైఏళ్ళయింది. అతడు మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు. తల్లిలేకుండా పెరిగిన గిరియసెట్టి కాస్త వామనావతారమనక తప్పదు.

కల్లేశు చెన్నసెట్టి వాదం విన్నాడు. తలవంచుకునే అతడు చెప్పాడు. "స్వామీ! నేనొక శనిముండాకొడుకును కన్నాను. నా పరువు తీయాలని, చెప్పినవాళ్ళ మాటవిని, ఈనాకొడుకు న్యాయపంచాయతీ పెట్టాడు. నా అంగడి సంపాదనలో ఈ పావర్నాకొడుక్కి ఒక్కపైసాకూడా ఇవ్వను. నా పొలమూ ఇవ్వను."

"మా అమ్మతోడు. నేనబద్ధమాడలేదు. కళ్ళారా నేనే చూశాను" అని గిరియసెట్టి ప్రమాణం చేశాడు.

"సరే. నీ పెళ్ళాం వాదంకూడా వినాలి. పిలు ఇక్కడికి" న్యాయపీఠంనుంచి కల్లేశు ఆదేశించాడు.

"రావమ్మా ఇక్కడికి"- అని అయ్యాశాస్త్రులు పిలిచారు. నరిపిరాలేదు. "న్యాయం

పిలుస్తోంది. రావాలి." అని ఆయన ఒత్తిడి చేశారు. కరణం చెన్నిగరాయని నోట్లో పొగాకురసం లేనందువల్ల అతడూ "హూం.హూం" అన్నాడు. నరసి వంటింటి తలుపుదగ్గరనుచుంది. ఆ హూళ్ళో ఆమెను చూడనివాళ్ళెవళ్ళూలేరు. కల్లేశు ఆవిడ్ని చూడగానే బిత్తరపోయాడు. ఎర్రగా, బుర్రగావున్న ముఖం, ఎత్తుగా గుత్తంగావున్న రొమ్ము చూసి, ఆవిడనుంచున్న తీరుచూసి, అతడికేమి న్యాయం చెప్పాలో తెలియలేదు. ఆవిడొచ్చి నుంచున్నాక అయ్యాశాస్త్రులన్నారు, "అమ్మా! భర్త తండ్రి, మామ అంటే తండ్రితో సమానం. కోడలంటే కూతురితో సమానం. ఇదెక్కడైనాకద్దా?" ఇలాగైతే వానలువస్తాయా? పైర్లు పండుతాయా? నేను చెప్పిందర్థమయిందా? ఆ! ఏమయ్యా చెన్నశెట్టి?"

అణ్ణాజోస్యులు మంత్రాలే చెప్పి ధర్మాధర్మ వివేచన గురించి వ్యాఖ్యానం ప్రారంభించారు. ఈ పురోహితులిద్దరి ధర్మసూక్ష్మజ్ఞానానికి తబిమ్మావాళ్ళు తలలూపుతున్నారు. కరణం చెన్నిగరాయలు అప్పుడే నోటికి నింపుకున్న పొగాకురసంలోని స్వాయత్వాన్ని ఆస్వాదిస్తున్నాడు. కాని రేవణ్ణశెట్టి అన్నాడు: 'కడమూవాళ్ళమాటల్తో పనేటి? ఆవిడేమంటుందో వినండి!

"హుం.హుం. నువ్వేమంటావో చెప్పమ్మా" కల్లేశడిగాడు.

"అయ్యగారూ! మీరింతగా చెబుతున్నారుగదా. నేనొకటడుగుతాను జవాబు చెబుతారా?" నరసి పురోహితద్వయాన్ని అడిగింది.

"అడుగు. అడుగు. దానికేం అవశ్యమడుగు"- ఇద్దరూ ఒకేసారి కలిసి పలికారు.

"ఆరుగజాల నూతిలో మూడుగజాల తాడొదిల్తే అందుద్దా?"

"ఆం!" ఏంచెప్పాలో తోచక అయ్యాశాస్త్రులు తికమకపడ్డారు. పంచాయతీ వారలందరూ స్తబ్ధులయ్యారు. రేవణ్ణశెట్టి కల్లేశుతో అన్నాడు: "అయ్యాగారూ! ఇహ తీర్పు చెప్పండి."

"ఈ ముండతో ఇహనేను కాపురం చెయ్యను"- అని గిరియశెట్టి తన నిశ్చయాన్ని తెలియజేశాడు.

కల్లేశు అయిదు నిమిషాలాలోచించి తీర్పు చెప్పాడు. "పెళ్ళాంతో ఇహమీద కాపురం చేయనని మొగుడంటున్నాడు. అతడి అభిమతానికి విరుద్ధంగా వుండమని చెప్పటం న్యాయంకాదు. కానీ మామకూ కోడలికీ సంబంధముందని అతడంటాడు. అబద్ధమని చెన్నశెట్టి ప్రమాణం చేశాడు. లేనిపోనిది ఒక వ్యక్తిమీద ఆరోపించరాదు.

కాని అతని మనస్సు సమాధానపడాలి అంటే మామ కోడలు వేరువేరుగా వుండే ఏర్పాటు చేయాలి. కానీ మొగుడామెతో ఉండనని అప్పుడే చెప్పేశాడు. అంచేత ఆవిడొక్కత్తే వేరే ఇంట్లో వుండనీ. తన కోడలే గనక చెన్నశెట్టి ఆవిడకో చిన్న ఇల్లు కట్టివ్వనీ. ఇహమీద తండ్రీకొడుకు తమకు తోచినట్టు వుండవచ్చు."

ఈ తీర్పులోని ధర్మసూక్ష్మం తతిమ్మా వాళ్ళకి తెలియలేదు. వాళ్ళు అయోమయంగా చూశారు.

"ఇదేటి తీర్పు?" అని శివగౌడ ప్రశ్నించాడు.

"కల్లేశయ్యగార్ని న్యాయపీఠంలో కూచోబెట్టాం. ఆయన చెప్పింది వినాలి. ఎవళ్ళూ ఏమనడానికి వీల్లేదు. నువ్వొప్పుకోవమ్మా నామాటవిని" అని నరిసివేప్ప తిరిగి చెప్పాడు.

"నలుగురు పెద్దమనుషులు చెప్పాక నేనెలా కాదనగల్ను?" అని నరసి న్యాయనిర్ణయానికి కట్టుబడింది.

మళ్ళీ వ్యవహారాన్నెవళ్ళూ అటూ-ఇటూ కదపకముందే రేవణ్ణశెట్టి పైకి లేచాడు. కల్లేశుకూడా న్యాయపీఠంనుంచీ లేచాడు. కడమవాళ్ళూ ఒక్కొక్కళ్ళే లేచారు.

ఇంటికి వచ్చాక చెన్నిగరాయలు కల్లేశు నడిగాడు : "ఆవిడదేదో చెప్పిందే ఏమిటి?"

"తెలియలేదా?"

"లేదు!"

"అంచేత నిన్ను తీర్పుచెప్పటానికి కూర్చోపెట్టలేదు. తెలియకపోతే ఇబ్బందిలేదు. నీకెందుకులే వూరుకో."

చెన్నిగరాయలు మరోసారి పొగాకుతుంపి నలిపి నోట్లో వేసుకున్నాడు.

## 2

రేవణ్ణశెట్టి పేకాటకి వెడుతున్నది కోటిపల్లెకు. గ్రామమునసబు చిక్కేగౌడ ఇంట్లోనే ముందువేవ్వు, గొడ్లచావిడి అట్టువమీద పేకాటకి అనుకూలంగా ఉంది. చిక్కేగౌడ రేవణ్ణ శెట్టికాక కందనకెరె చేర్మన్ లింగదేవుడు, సారా కంట్రాక్టర్ చిన్నస్వామి, చర్మాలవ్యాపారి హయాత్‌సాయిబు మొదలైనవాళ్ళుకూడా చేరడంకద్దు.

ఒకరోజు మధ్యాహ్నం రేవణ్ణశెట్టి చిక్కేగౌడనడిగాడు: "యాభైరూపాయలుంటే

ఇవ్వన్నా. కొబ్బెరమ్మాక ఇస్తాను."

"మువ్విప్పటిదాకా తీసుకున్నదేమయినట్టు? నాకాడ డబ్బులేదు."

"అట్టాగనకు. ఇవ్వన్నా."

వాడి కరువిచ్చినా చిక్కేగౌడకు నష్టంలేదు. ఆ డబ్బులో కొంతభాగం ఆటలో వాడికే వచ్చేది. ప్రోనోటు ఫారం, రెవెన్యూస్టాంపులు చిక్కేగౌడ దగ్గరే వుండేవి. వెనకోసారి దానిమీద యాభైరూపాయలకు వ్రాయించుకుని, తేదీ, రేవణ్ణశెట్టి సంతకం చేయించి, సంవత్సరానికి వడ్డీ నూటికారు రూపాయలుగొప్పున మినహాయించి, నలభైనాలుగివ్వగా అవి రేవణ్ణశెట్టి జేబులోకి కూడా వెళ్ళకుండా తిన్నగా పేకాట చాపమీదకే వెళ్ళాయి. నలభైనాలుగురూపాయలు చాలా చిన్నమొత్తం గనుక అతడు మూడు ముక్కలు వేయటానికొప్పుకోలేదు. రూపాయిచొప్పున ఇరవైఎనిమిది ప్రారంభించారు. ఆరోజు మరెవ్వళ్ళూ రానందున రేవణ్ణశెట్టి, చిక్కేగౌడ ఇద్దరే ఆడారు. సాయంత్రమూరుగంటలకి నలభైనాలుగురూపాయలు చిక్కేగౌడకువెళ్ళాయి. అయినా మళ్ళీ ఆడిదాన్ని గెలవాలన్న పట్టుదల రేవణ్ణశెట్టిది. చేబదులివ్వనని గౌడ చెప్పాడు. "దీనితస్సాదియ్యా! అయ్యిందవుతుంది. మరోయాభై ఇవ్వండి. నోటురాయించుకుని"- అని ప్రోనోటులో సంతకంచేసి, నలభైనాలుగు తీసుకుని రాత్రి పదకొండుదాకా ఆడి దాన్నీ గౌడకు సమర్పించి, పక్కలోఉన్న కండువా దులిపి భుజాన వేసుకుని వూరిదారి పట్టాడు.

ఇంట్లో సర్వక్క తన అయిదుగురు పిల్లల్ని వేసుకుని నిద్రపోతుంది. తలుపుతట్టి పెళ్ళాన్నిలేపి, భోజనం వడ్డించమని చెప్పాడు. కంచంలో ఆరిపోయిన రాగిముద్ద, తోటకూర పులుసు వడ్డించిన పెళ్ళాన్ని గదమాయించాడు "వేడిగా చేయడానికేమయిందే?"

"వేడిగానే చేసెట్టాను. మీరింతసేపయ్యాకొచ్చారు. ఆరిపోనాది."

"సీయమ్మన్...నేనెప్పుడొస్తానో అడగటానికి నువ్వెవతే భాంచోత్? తన్ని తగలేస్తాను చూడు" అని ముద్దను పులుసులో నంజుకుని, నోట్లో పెట్టుకుని, అది సులువుగా మింగుడుపడక, పైకిలేచి ఆవిణ్ణోతాపుతాచి, 'వేడిగా అన్నం చేసెట్టు' అన్నాడు.

"బియ్యం లేవేమరి?" బాధతో పొంగివస్తున్న ఏడుపులో వెక్కుతూ సమాధానమిచ్చింది.

"ఎప్పుడడిగినా లేదు! లేదు! లేదు! అని చస్తుంది దిక్కుమాలినముండ" అని

మరోతావు తాచి, కంచంలోని ఆరిపోయినముద్దనే తుంచి తుంచి పులుసులో అద్దుకుని తిని, వెళ్ళి మంచంమీదపడుకున్నాడు. సర్వక్క కంచం కడిగి, కింద నేలమీద చివరివాడు రుద్రేశుని పక్కన పడుకుంది.

## 3

తనకు తెలియనప్పుడు పుస్తకాలను వెట్టిచేత మోయించుకుని నంజమ్మ తిమ్మలాపురానికి వెళ్ళేది. దేవరసయ్యగారు, వివరించిచెప్పి, ఒకలెక్కకూ మరోలెక్కకూ తేడా చూపెట్టి, మనస్సుకెక్కేటట్టు చేసేవారు. వసూలుచేసేటప్పుడు సామాన్యంగా గ్రామమునసబుగారుంటారు. రామసంద్రంవసూళ్ళుమాత్రం శివేగౌడ తనవే అని చెప్పాడు. "పన్ను వసూలుచేసే బాధ్యత మునసబుది. కరణంగారు మునసబు చెప్పినట్టు లెక్కలురాస్తూ పడుండాలి." అన్నది అతని ధోరణి. అతణ్ణి ఎదిరించే శక్తిలేనందువల్ల, వూళ్ళో అలాగే జరుగుతూంది. మిరాశీ డబ్బు మునసబుగారికే దక్కుతుంది. వీళ్ళకో అణాకూడా రావటంలేదు. ఆగ్రామంలో ఏమైనా కొనుగోళ్ళు, తణఖాలు మొదలైనవి జరిగినప్పుడు జనం మాజీ కరణం శివలింగడి దగ్గరకెళ్ళేవారే కాని చెన్నిగరాయణ్ణి ఎవరూ పల్కరించేవాళ్ళుకారు. చెన్నిగరాయలకు దస్తావేజు వ్రాయడం చేతకాదన్నది ఒక కారణమయితే "ఆ అయ్యకాడ రాయించుకుని ఎవడు రికార్డు దక్కించుకున్నాడ్రా?" అని మునసబు బెదిరించిందీ మరోకారణం. శివలింగనికంటె నంజమ్మ రిజిస్టరు కాగితపత్రాలు బాగా రాయగలిగినా, సర్కారీ పత్రాలు ఆడదానిచేత రాయిస్తే అచ్చిరాదనే నమ్మకమొకటుంది. ఇన్నీ కలిసి రామసంద్రంనుంచీ కానీబిళ్ల రాలటంలేదు.

కురుబరహళ్ళి పద్ధతే ఒక మోస్తరుంటది. మునసబు గుండేగౌడ వసూళ్ళరోజు తామూ వున్నా చేస్తువ్వదిమాత్రం చెన్నిగరాయలే. 'కుళం'వారీగా వాళ్ళవాళ్ళపన్నుకు వరివడా గుండేగౌడే కరణంగారికి పిరాకానుక ఇప్పించేవాడు. తానూ రెండురూపాయలిచ్చేవాడు. ఆ వూళ్ళో మొత్తం నలభైరూపాయల రాబడి ఉండేది. దానికితోడు వీళ్ళు వేరుపోయాక నూర్పిళ్ళకాలంలో మొత్తండగరిశెడు రాగులు, యాభైశేర్లు అనపగింజలు ఇచ్చేలా గుండేగౌడ ఏర్పాటు చేశాడు. దాని ప్రకారం ఇస్తూనూ వచ్చారు. కురుబరహళ్ళిలో అమ్మకాలు కొనుగోళ్ళు, తణఖాలు వుండటం బహుకొద్ది. గనుక ఆబాపతు రాబడి ఏమీలేదు.

వీళ్ళ ఫిర్కాకు చెందిన మరో గ్రామం లింగాపురం. ముప్పైగడపలగ్రామం.

వున్నంతలో అందరూ అంతో ఇంతో వున్నవాళ్ళే. కానీ ఆవూరివాళ్ళకి రామచంద్రం శివేగౌడకు దూరపుసంబంధమేదో వుంది. కరణానికెందుకు సిరాకాసుక ఇవ్వాలన్న శివేగౌడవాదమక్కడికి పోకింది. మునసబు పురదప్పు అది తనకే చెందాలని పట్టుబట్టాడు. చెన్నిగరాయలు తండ్రి రామణ్ణగారు వున్నప్పుడావూరివాళ్ళంతా ఇంటికోరూపాయి ఇవ్వడం రివాజు. దీనికి వూళ్ళోవున్న వృద్ధులు కొందరు సాక్ష్యమివ్వగలరు. కానీ ఇప్పుడు కాలం మారింది. అంచేత ఆవూళ్ళోకూడా కానీ చూపరు. పైసాంపాదన సున్న.

నంజమ్మ కురుబరహళ్ళి పనూళ్ళకు వెళ్ళేది. కడమరెండుగ్రామాలదీ మునసబుగారే చూసుకునేవారు. లెక్కలుమాత్రమింట్లోకూర్చుని ఆమె వ్రాసేది. చెన్నిగరాయలు పొలంమీదికెళ్ళి పహణి, వూరిమీదకెళ్ళి ఖానేషుమారి లెక్కలు గుర్తేసుకుని వచ్చేవాడు. దాని గోష్వారంమొదలు జమాబందిలెక్కలుదాకా అంతా నంజమ్మే నిర్వహిస్తోంది. చెన్నిగరాయలు కోటువేసేకుని తలపాగా చుట్టుకుని, మెడచుట్టూ కండువా వేసుకుని జమాబందికెళ్ళి కాళ్ళూచేతులు వణుకుతూ హెడ్‌క్లార్కు సంభావన చెల్లించి, దొరగారి సంతకం చేయించుకుని, మగాడుగా ఊరికి తిరిగొచ్చేవాడు. గ్రామానికి రెవెన్యూ ఇనస్పెక్టరుగానీ, తహసీల్దారుగానీ దయచేస్తే నంజమ్మ పిల్లలనోరుకట్టి మిగిల్చిన నెయ్యి, అన్నం, చారు, కూరలు , అప్పడాలు, రుచిగా, శుచిగా చేసి వడ్డించి," మేము బీదవాళ్ళం. లెక్కల్లో తప్పులుంటే తమరు సరిపెట్టుకుపోవాలి" అంటూవుండేది. కానీ ఆ లెక్కలు తానే వ్రాస్తున్నానన్న రహస్యం బయటపెట్టేదికాదు.

దానికితోడు, ఆమొగుడితో వేగడం కష్టంగా ఉండేది. సంవత్సరమంతా కష్టపడి ఆమె లెక్కలు వ్రాసిస్తే సాలాఖరులో పోటీగెకని వెళ్ళిన చెన్నిగరాయలు పదిహేనురోజులు తిరిగిరాలేదు. తరువాత వచ్చి అయిదురూపాయలు మాత్రము మిగిలాయన్నాడు. దాన్నికూడా ఆమె చేతికివ్వక తాను తిపటూరినుంచి తెచ్చిన ట్రంకుపెట్టెలో పెట్టి తాళంవేసి తాళంచెవి మొలతాడుకు వేళ్ళాడగట్టుకున్నాడు. తాహసీల్దారు, రెవెన్యూ ఇన్స్పెక్టరు, హెడ్‌గుమాస్తా, పిర్కా గుమాస్తా, బంట్రోతులు– అందరికీ ఇచ్చినా కనీసం వందరూపాయలు మిగలాలి. అందులో గుండేగౌడ గారి సమ్మ దాసతు యాభైమినహాయిస్తే యాభైరూపాయలైనా చేతికిరావాలి. డబ్బంతా ఏమైనట్టు? చెన్నిగరాయలే చెప్పాడు,"నువ్వేసే పచ్చడిమెతుకులు ముద్ద తిని,తిని, నాకు విసుగెత్తిందేముండ. ఓ పదిహేనురోజులు హోటల్లో బంగాళాదుంపలు,

పిరుల్లిపూలును, వడ, దోసె, మైసూరుపాకు తింటూ హాయిగాఉన్నాను."

"మీరేమో తింటూ కూర్చున్నారా? ఇంట్లో పిల్లలు మైసూరుపాకంటే ఏమిటో కంటితో చూసిఎరుగరే, మీకెలావచ్చింది తినడానికినోరు?"

చెన్నిగరాయనికి ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు. "ముండా థూ ముండా, మాదర్‌చోద్‌ముండా, వూరుకోమాట్లాడక ముండా" అని మనసులోనే తిట్టుకుని మాదేవయ్య గుడికి వెళ్లిపోయాడు.

ఈ ఏడాదంతా బతికి బట్టకట్టడమెలాగ? మూడవకుంట్రాడు విశ్వానికిప్పుడెనిమిదినెలలు. ఆమె కడుపులో అప్పుడే రెండమూడునెలలు పసికందు. పోటీగ వచ్చేది పంవత్సరానికొకసారే. ఆడబ్బా ఇలా అయిపోతే ఇహ పిల్లలు పస్తుండి చావాలి. పెద్దాళ్ళకైనా రోజుకు రెండుముద్దలు లేకపోతే ప్రాణాలు శరీరానికి కంటిపెట్టుకుని వుంటాయా! పోటీగ నాకే ఇప్పించండి అని సర్కారువాళ్ళనడిగితే ఏమంటారో! ఇప్పుడేంగతి? అని ఆమె రెండురోజు లాలోచించింది. చివరికో వుపాయం తట్టింది.

మరుసటిరోజు పెందరాళే లేచి స్నానంచేసి, పిల్లలకూచేయించి, రొట్టెపచ్చడి ఇచ్చి, రామణ్ణను, పార్వతిని సాలెవీధిలోని పుట్టమ్మ ఇంట్లో వదిలి, చంటికుర్రాడు విశ్వాన్నెత్తుకుని కురుబరహళ్ళికి వెళ్ళింది. గుండేగౌడ ఇంటికివెళ్ళేసరికి, లోగిట్లో గంగమ్మ ఓసీటుమీద కూర్చుంది. ఆమె ముందు పరచిన ఎర్రచీర మీద గౌడపెళ్ళాం లక్కమ్మ చేటలోని రాగులు గుమ్మరిస్తోంది. గౌడ గోడకువ చేరబడి కూర్చుని తన పక్కకున్న వంచిలో ఏదో తడుముతున్నాడు. కోడలక్కడికిరావటంచూచిన గంగమ్మకు కోపమొచ్చింది. "నేను ముష్టెత్తి పొట్ట పోసుకుంటున్నాను. దానికి అడ్డుపుల్ల వేద్దామని వచ్చావేమే చుప్పనాతి?" అని గబుక్కున అడిగింది. నంజమ్మ కిక్కురుమనకుండా నుంచుడిపోయింది.

గౌడగారే "రాతల్లీ. ఇటేపురా కూకో" అన్న తరువాత వెళ్ళి చాపమీద కూర్చుంది. గంగమ్మ చీరలో రాగులు మూటకట్టుకుని వెళ్ళిపోయింది.

లక్కమ్మ అడిగింది "మీ అత్తమ్మ నిన్నెక్కటే తిట్టడం. నువ్వామెను చూస్తేనే మండిపడ్తావట. మొగుణ్ణి బుట్టలో వేసుకుని ఆడిస్తున్నావట. నువ్వేమగాడిలా వూరంతా తిరుగుతావట. ఇంకా ఏటేటో అంది. కరణీకంలో కాసుకూడా రాల్చావట."

"ఆవిడంటే అంటుంది. మవ్వూరుకో"- అని పెళ్ళానికి చెప్పినగౌడ "ఏంతల్లీ

వొచ్చావు? పోటిగె వచ్చిందా?"

"గౌడగారూ! అదే మిమ్మల్ని అడగాలని వచ్చాను"- అని నంజమ్మ తన పెనిమిటి చేసిందంతా చెప్పింది.

"ఆ అయ్యని పట్టి మెడకాయొంచి రెండివ్వాలి" అని లక్కమ్మంది.

"ఇస్తే బుద్ధొస్తదా? ఇప్పుడేంచెయ్యాలో నువ్వే చెప్పుతల్లీ. నీకన్నా నాకేమెరిక?"

"పోటిగె డబ్బు ఆయనచేతికి దొరక్కుండా చేస్తే సరి."

"అదేమిటి? నీకిస్తారా గౌరుమెంటోరు?"

"అక్కరలేదు. మొత్తం పోటిగె నూటిరవై రూపాయలు. దాంట్లో పోటిగె ఖర్చు వేసేటప్పుడు తాసిల్దారు శిరస్తాదారు- వీళ్ళదంతా మొత్తం పదిహేనురూపాయలుపోతాయి. దాన్ని వదిలెయ్యండి. కడమ వందరూపాయలకు పన్ను ముందుగానే పుచ్చుకున్నట్టు, విరుటిలాగే రసీదు రాయించుకోండి. మీదే ఎలాగు యనభైరూపాయల పన్నుంది. మరెవ్వళ్ళదైనా ఇరవైరూపాయలకు వ్రాయించుకోండి. దాన్ని పోటిగె ఇచ్చేటప్పుడు మినహాయించుకుంటారు. ఆయనచేతికి డబ్బురాదు. ఆ డబ్బులో వేనడిగినప్పుడల్లా రాగులు, అనుగింజలు, మెరపకాయలు, మీద అయిదో పదో ఇస్తూ రండి."

"బావుంది, బావుంది, నీది దివాన్‌గిరిచేసే బుర్ర. ఆ బసవన్ననేలుకునేది వొస్తే మై సూరుసీమనే ఏలచ్చు; రేపుటెల్లుండిలో నేనే వొస్తాను. అప్పుడు రాయిద్దాం."

బసవన్నగుడిలో వంటచేసుకుని తిని వెళ్ళమని లక్కమ్మ బలవంతం చేసిందికానీ వూళ్ళో పిల్లల్ని వదిలి వచ్చాను. వీల్లేదని చెప్పి నంజమ్మ బయలుదేరింది. పిల్లలికని ఇచ్చిన రెండు 'గిటకలు' కొబ్బెర, రెండచ్చుల బెల్లం కొంగులో కట్టుకుంది. తరువాత నెయ్యి, బెల్లం వేసి ముందుంచిన పాలు కుర్రాడికితాగించి తానూ తాగి వూరికి వచ్చేసింది.

ఇంట్లో చెన్నిగరాయలు పెళ్ళాన్నెక్కడికెళ్ళావని అడగలేదు. ఇంకా వంట కాలేదనిమాత్రం సినమెత్తాడు. ఆవిడకొంగున కట్టిన కొబ్బెరబెల్లం కంటబడగానే తీసుకుని విరిచి నమలటం మొదలెట్టాడు. రెండు గిటకలు, రెండచ్చులు పూర్తీ అయ్యాకన ఆయన చెయ్యి కడుక్కున్నాడు.

గుండేగౌడ మరునటిరోజె అక్కడికి వచ్చాడు. ఆయనచెప్పినట్టు నంజమ్మ మొగుడిముందు కాగితం కలం సిరాబుడ్డి వుంచింది. "ఆవిడ చెప్పినట్టు రాయనయ్యా"- గౌడ ఆదేశించాడు. "కురుబరహళ్ళి మునసబు గుండేగౌడగారి

సర్కారుపమ్నులాపతు ఎనభైరూపాయలు మాత్రం ముట్టినవి"- అని నంజమ్మ చెబుతుండగానే కరణంగారు కలం కిందెట్టి "ఇదెందుకురాయాలి? పాటిగెలో నాచేతికేమీరాదు" అని కూర్చుండిపోయాడు.

గౌడకు కోపమొచ్చింది. "చేతికిరాదట.చేతికి. రెండూమూసుకుని రాస్తావా లేదా?"అని ఆయన గద్దించినా కరణంగారు కలం పట్టలేదు. "రాయవేమిటయ్యా! మావూరికొస్తే నీ కాళ్ళిరిచేస్తాను. ఏటనుకున్నావో?"

"నా ఖర్చులకేంజేయాలి?"

"అది వేనిస్తాను రాయి."

మొత్తానికి వందరూపాయలకు రసీదులు రాసి సంతకంచేసి ఇచ్చాడు. "నాకేమైనా ఇవ్వండిమరి" అని అడిగేనరికి గౌడగారే మొలలోనుంచీ రెండురూపాయలుతీసి ఆయనముందు నాణాలుదొర్లించి, "తీసుకో నీ మిరాశిడబ్బు నీకిచ్చేశానిప్పుడే" అన్నారు.

కరణంగారు గబుక్కున దాన్ని తీసుకుని జేబులో వేసుకున్నాడు. గౌడవూరికెళ్ళాడు. మరుసటిరోజు శుక్రవారం. చెన్నిగరాయలు పొద్దుటే రొట్టెతిని కంబనకెరె సంతకు వెళ్ళిపోయాడు. సంతలో ఎవరో తిపటూరినుంచివచ్చి గుడారమేసి హొటలు పెడతారు. తిపటూరు నగరంలో చేసే మసాలదోసె, బంగాళాదుంపలకూర, మైసూరుపాకు, అరటికాయబొండా అన్నీ చేస్తారు.

పట్టి కరణీకంతో జీవనం గడవదని నంజమ్మ బహుత్వరగా గ్రహించింది. భూమీబుట్రా లేనివాళ్ళకి వృత్తివల్ల సంసారం గడవదు. తానింకేం చెయ్యాలి? తిమ్మలాపురానికెళ్ళినప్పుడు దేవరసయ్యగారి పక్కింటివాళ్ళు మోదుగాకుల్తో విస్తళ్ళు కుట్టి కట్టలు కట్టిపెట్టడం చూసింది. అవన్నీ తిపటూరికి పంపుతారట. పంద కారణాలచొప్పున అంగడివాళ్ళు మొత్తం కొనేసి డబ్బిస్తారట. ఇంటిపనులు, కరణీకం లెక్కలతోపాటు తానూ రోజూ యాభయ్యో వందో విస్తళ్ళు కుడితే కాదా అని ఆలోచించింది.

రామసంద్రం బ్రాహ్మలు మోదుగాకులు చోళేశ్వరుని గుడివద్దవున్న ఇపకపట్రనుంచి తెస్తారు. అంటే మూడుమైళ్ళవుతుంది. చోళేశ్వరునిగుడ్డవద్ద వున్నది తమవూరైన నాగలాపురం దారిలోనే. మోదుగాకులకాలం ఫాల్గుణమాసం వెళ్ళి తీసుకురావాలి. అంతదూరం తాను ఒంటరిగా వెళ్ళటం సబబుకాదు. తోడెవ్వరొస్తారు? మొగుణ్ణి రమ్మని పిలిచింది. ఆయనెందుకువస్తాడు? "దూలయితే

సంసారానికివన్నీ చేసుకోనీ తనకేం దురద? సమాధానధోరణిలో ఉంది. సాలెవీధిలోని పుట్టమ్మను వెంటబెట్టుకుని, చిన్నపిల్లల్ని పక్కనే చిన్నశెట్టి ఇంట్లో వదిలి పెందరాళే కాకి క్రవకముందే గోనిసంచులు, రొట్టెలు, పచ్చడి మూటగట్టుకుని బయల్దేరింది. పుట్టమ్మకు రోజుకు మూడణాలు కూలి. ఇద్దరూ గబాగబా నడిచి, పొద్దు పొడవకముందే పటపటమని మోదుగాకులు కోసి, గుండెకానించుకుని పేర్చడం. ఎనిమిదిగంటలదాకా కోసినతరువాత ఇద్దరూ రొట్టెతిని మరళహళ్ళలోని నీళ్ళుతాగి మళ్ళీ ఆకులు కోయడం, గోనిసంచులకదిమి నింపడం వాటి మూతులుకట్టి, నెత్తిమీదెట్టుకుని చకచకా వూరికిరావడం, ఇంట్లో సంచులన్నీ విప్పి ఆకులన్నీ గుమ్మరించడం, నిత్యకృత్యమయింది. దబ్బళానికి దారమెక్కించి ఇస్తే పార్వతి ఆకులన్నీ తొడిమదగ్గరగుచ్చి దొంతరగా కూర్చేది. రామణ్ణకూడా మరో చిన్న దొంతర కూర్చేవాడు. అంతలో నంజమ్మ వంట చేస్తుంది. భోజనం వేళకి శ్రీవారు ఇంటికివస్తారు. ఆయనకు పచ్చిమోదుగాకుల విస్తరిలో భోంచేయడం సరదా. పెద్దవిస్తరి తీసుకుని, మఠంవేసుక్కూర్చుని పరమానందంగా ముద్ద మింగుతాడు. తరువాత ఆయన విశ్రాంతి తీసుకుంటూ పడుకున్నప్పుడు, అంట్లు తోమి, కడమా ఆకులన్నీ పరాలుగా కూర్చి, ఇంకా మిగిలిపోయినవి వాలారిన ఎండలో ఆరేస్తుంది. అంతలో ఆరోజు గడిచిపోతుంది. రేపు పొద్దుట తనకూ పుట్టమ్మకూ తీసికెళ్ళటానికి, మొగుడికీ పిల్లలకీ ఇంట్లో తినడానికి రొట్టెలు చేసి పచ్చడిరుబ్బి పెట్టాలి. పెందరాళే లేవాలి గనక రాత్రి త్వరగా పడుకోవాలి.

మొత్తంమీద ముంగారు వర్షంపడి ఆకులుపగిలి, కన్నాలయిపడేలోపుగా నూటయాభై పరాలు గుదిగుచ్చి వుంచింది. అన్నీ కుడితే వంద రెండువందలు కట్టలు కావచ్చును. కట్టకి అరణాలైనా డెబ్భైఅయిదురూపాయలు కంటచూడవచ్చును. దీనికింకా ఏడాదిపాడుగునా, ఈన పుల్లలుచీల్చి వేళ్ళచర్మం చీరుకుపోతూ కుట్టాలి. కష్టపడకండా జీవనం గడవడమెలాగ? ఆమె ఆకులన్నీ తెచ్చి గుదిగూర్చి ముగించేసరికి, పన్నులు వసూళ్ళకాలం వచ్చింది. నాలుగవకిస్తీలో కురుబరహళ్ళివాళ్ళు సిరాకానుక ఇస్తారు. అప్పటికావిడకి ఆరునెలలు. "నువ్వెందుకురావాలి?" అని మొగుడు కసురుకున్నా ఆమెకూడా వసూళ్ళుచేసే రోజు వెళ్ళింది. గుండేగౌడ సిరాకానుక డబ్బంతా వసూలు చేసి తనదగ్గరే ఉంచుకున్నాడు. కరణంగారిచేతికైదురూపాయలిచ్చి "నీ యవసరమైనప్పుడిస్తాను

ఇప్పుడెందుకు డబ్బు?" అన్నాడు. చెన్నిగరాయలతణ్ణి కరకరనమిలిమింగేలా ఒకసారి చూశాడేగాని నోరెత్తడానికి భయం. కానీ ఇంటికివచాక గుండేగౌడని అతని పెళ్ళాన్ని కలిపి నోటికివచ్చిన బండబూతులు తిట్టి తవకోపాన్ని శాంతింపజేసుకున్నాడు. ఎలాగూ అయిదు రూపాయలు చేతికివచ్చాయి. ఇర్సాల్‌కు తిపటూరికి వెళ్ళినప్పుడు సుఖపడే యోగాన్ని తలుచుకుని పొంగిపోయాడు. ఇప్పుడు తిపటూరికి గుబ్బివీరణ్ణ నాటకం వచ్చిందట. అంతఃపురంలాగానే సీనరీ వేస్తారట. అరణాలు పారేసి చూపిరావాలి. ఆరాత్రి భోజనానికి బదులు కేవలం బొంబాయి బోండాలే తినాలి. లంజాకొడుకు గుండేగౌడ వందరూపాయలకు రసీదు రాయించుకున్నాడు. పోటీగ డబ్బులో తాలూకాఫీసువాళ్ళకు ఇచ్చేదిపోగా, నాలుగు మిగుల్తాయో అయిదుమిగుల్తాయో. దానికితోడు ఈ అయిదు. మొత్తం పది. వీటితో ఎన్నిరోజులు తినవచ్చు! ఒక్కమై సూరుపాకు తొమ్మిదిపైసాలు. పావలాకైతే ఆరిస్తారు లంజాకొడుకులు. మరో రెండిస్తే వాళ్ళబాబు సొమ్మేంపోయింది? వాళ్ళమ్మనీ....

ఇంతలో రామసంద్రానికి గవర్నమెంటు ప్రైమరీస్కూలు వచ్చింది. బడికి వెంటనే వేరే భవనం లేనందున ఎక్కడపెట్టాలి అని సర్కారువారు గ్రామస్థులందరినీ అడిగారు. హనుమంతరాయని గుడిసరిపోతుందని శివేగౌడ చెప్పాడు. అంటే గంగమ్మ అప్పణ్ణయ్య దాన్ని ఖాళీ చేయాలి. గంగమ్మవెళ్లి శివేగౌడ ఇంటిముందు దోసిట దుమ్మెత్తినుంచుంది. గుడిపూజారి అణ్ణాజోస్యులు కూడా దేవాలయంలో బడిపెట్టడానికి వీలులేదన్న తరువాత గంగమ్మ వునికికి వుపద్రవం తొలగింది. శివేగౌడదే ఒక ఇల్లు ఖాళీగా వుంది. దాన్ని సర్కారువారు సంవత్సరానికి ముప్పై ఆరురూపాయలకద్దెకు తీసుకునేలా అతడే ఏర్పాటు చేశాడు. కిక్కేరివేపు మనిషి, సూరప్పగారనే మాస్టారు వచ్చారు. కొందరు పిల్లల్ని బడికి చేర్చారు. ఆడపిల్లల్ని బడికి పంపాలా వద్దా అన్న చర్చ ఇంకా నడుస్తూనేవుంది. "ఆడపిల్లల్ని చేర్చండి. ఫరవాలేదు. ఇప్పుడు పెద్దపెద్దవూళ్ళల్లో ఆడపిల్లలు హైస్కూలుకెడుతున్నారు" అని మాస్టారుచెప్పినా ఎవరూ ఒప్పుకోలేదు. 'అమ్మా! రెండక్షరాలు నేర్చుకుంటే కష్టకాలంలో ఆడపిల్లయితేనే ఓ ఇరవైరూపాయల జీతం సంపాదిస్తుంది. విద్యావంతురాలైన నీకిది నేను చెప్పాలా'- అని మాస్టారన్నప్పుడు నంజమ్మ ఎవరినీ సంప్రతించకుండా తానే వెళ్ళి పార్వతిని బడిలో చేర్చివచ్చింది. "చూశారా ఆమె గడుసుదనం?" అని వూళ్ళోవాళ్ళంతా చెప్పుకున్నారు. పార్వతితోబాటు

రామణ్ణకూడా బడికి వెళ్ళాడు. ఈబడిలో మ స్టారు పిల్లల్ని కొట్టరు. ఇసుకలో అక్షరాలు దిద్దించరు. పలకమీద వ్రాయిస్తారు.

ఈసారికూడా పురిటికి వహాయానికని అక్కమ్మ వచ్చింది. కాని నంజమ్మకు కలిగిన ఆడపిల్ల పుట్టిన అర్ధగంటలోపుగానే పోయింది. "నంజా! కడుపులో వున్న మనిషి ఇన్నిన్ని మోదుగాకులు తెచ్చి విస్తళ్ళుకుడితే అవుతుందా? వేడిచేసి పిల్లకేమయిందో ఏమో! పుట్టగానే చచ్చిపోయింది" అంది అక్కమ్మ.

నంజమ్మ మాట్లాడలేదు. తనలో తానేడుస్తూవుంది. "ఏడవకుతల్లీ. ఒంటికి మంచిదికాదు. నీకేమైనా అయితే ఈ పిల్లంగతేమిటి?" అని అక్కమ్మ రెండురోజులు చెప్పాక ఆవిడ కాస్త శాంతించింది. గంగమ్మ దేవాలయంలోనే పదిరోజులు పురుడు, మళ్ళీ అందులోనే మూడురోజులు మాతకముంది కానీ, కోడలింటికివచ్చి పలకరించలేదు. పిల్లపోయాక అక్కమ్మమాత్రం మూణ్ణెల్లూ బాలెంతతనం చేసింది మనవరాలికి. ఆవిడ వూరికి బయల్దేరేముందు మనవరాలితో చెప్పింది: "నంజీ! నీమొగుడి వాలకమింతే. తనకు పుట్టిన పిల్లంమీదే ప్రీతిలేదు. తానాయె, తన పాట్టాయె, పట్టె తిండిపోతు. పిల్లల్ని పెంచడం నీకూ కష్టం. ఇహమీద వాణ్ణి దగ్గరకి చేర్చకు."

నంజా ఏమీ పలకలేదు. అక్కమ్మే అంది: "వాడికి కోపమొస్తే వొస్తుందిగాక. దూరముంచు." అన్నప్పుడంది "బామ్మా! ఇదంతా నా ప్రారబ్ధకర్మ. అలాచేస్తే పరువూ ప్రతిష్ఠా వుండవు. వీధిలో నుంచుని ఏవేవో పాడు బూతు కూతలను లంకించుకుని నావాహంగామా చేస్తారు. అదీ చేసి చూశాను."

"తలరాత "అని అక్కమ్మ వూరుకుంది.

అప్పటికే డెబ్బైఎనిమిది నడుస్తున్న అక్కమ్మ తాను నడిచే వెడతాననీ, తోడుగా ఓ మనిషిని పంపమని అడిగింది. కానీ మనవరాలెలా పంపుతుంది? మూడురూపాయలిచ్చి ఎర్రచీరకొనిపెట్టి, రూపాయిన్నరకు అద్దెబండి మాట్లాడి అందులో పంపింది బామ్మని.

## 5

ఒకరోజు మధ్యాహ్నం ఒంటిగంట సమయంలో రేవణ్ణశెట్టి పెళ్ళాం సర్వక్కవచ్చి అడిగింది; "నంజమ్మగోరూ! ఇంట్లో ఏమీలేవు రెండుసేర్లు రాగిపిండిప్పిస్తారా?"

"విసిరిన పిండి లేదుకదా సర్వక్కా, రండి, కూర్చోండి."

"అవుతే రొండుసేర్లు రాగులే ఇప్పించండి."

సర్వక్క తెచ్చిన డబ్బాలో రెండుసేర్ల రాగులు కొలిచి పోసింది నంజమ్మ. ఆ రోజు సాయంత్రం మళ్ళీ సర్వక్కవచ్చేసరికి నంజమ్మ విస్తళ్ళు కుడుతోంది. దగ్గరగా కూర్చుని సర్వక్క అంది. "ఎవళ్ళనడగాలి అనుకున్నాను. ఈ రోజు పిల్లలంతా పస్తు. పస్తుండి నాకూ నీరసంగా వుంది. మీరు రాగులిచ్చి అన్నంపెట్టారు."

"ఇదే మిల్లా అంటారు? భూమీ బుట్రా వున్నవాళ్ళు మీరే ఇలా అంటే నమ్మడమెలాగ?"

"నిజం చెప్పండి, మీకేమీతెలవదూ?"

"కాస్తా కూస్తో చెవిని పడ్డదనుకోండి. మరీ ఇంతగా తిండిగింజలు కూడా లేవన్న సంగతి తెలియదు"

"వేమ పెట్టిపుట్లేదు. ఎనక జల్మంలో శివపూజ తిన్నగా చేనుంటేగా?" అని సర్వక్క కంటతడిపెట్టుకుంది. తానే అంతా చెప్పింది.

రేవణ్ణశెట్టి కోడిహళ్ళికి వెళ్ళి పేకాటకని రాసిచ్చిన ప్రోనోట్ల మొత్తం మూడువేలదాకా వచ్చింది. అప్పుకింద వూరుముందున్న పొలం రాసివ్వాలనీ, లేకపోతే క్రరుచ్చుగుని చితకబాదుతానని చిక్కేగౌడ ఓరోజు విలేశాడట. అటుమంచీ అటే తిపటూరికెళ్ళి పొలం రిజిస్టర్‌చేసి ప్రోనోట్లు రద్దు చేయించుకున్నాడట. పోతే వాళ్ళకు మిగిలింది మూడురకల కొండ్రమాత్రమే. వానపడి, చెరువునిండి, పొలందున్ని, పంట వస్తే గిస్తే పన్నెండు ఖండుగల ధాన్యం వచ్చేది. కానీ చాకలిపంచెకట్టి తళతళలాడే రబ్బరు జోళ్ళు వేసే నకిలీ ప్లీడరు రేవణ్ణశెట్టి పొలమెలాదున్నగలడు? కోరు కిచ్చాడు గనుక నాలుగు ఖండుగలు వచ్చేవి. దాన్ని కూడా కాశింబడ్డి సావుకారువద్ద తాకట్టెట్టి ఎనిమిది వందలు తీసుకున్నాడట.

"తాకట్టెట్టి అప్పు చేయాల్సిన ఖర్చేంతగిలింది? రుద్రాణి పెళ్ళేమైనా ఏర్పాటు చేశారా?"

'నంజమ్మగోరూ! ఇంట్లో ఎదిగిన కూతురుందన్న గ్యానముంటేగా? అదంతా ఎందుకూ? కడుపు చించుకుంటే కాళ్ళమీదపడుద్ది. ఆ మొగుడిడిచిన ముండుంది చూశారూ, మానమంచుకున్న కోడలు, – అదిప్పుడు వూరుముందు తోటకాడ చిన్నపెంకుటిల్లు కట్టుకుని అంగడెట్టింది. దానికి డబ్బెలా వొచ్చిందంటారా? ఆ ఎనిమిదొందలు దాని వాతమకొట్టారట."

పోతే, వాళ్ళకున్నది యాభై చెట్లున్నతోట మాత్రమే. కొబ్బెరకాయలు ముదరకండానే కోసి అమ్మేస్తాడు. లేకపోతే రేవణ్ణశెట్టి తెల్లటి ముల్లు పంచెలు, కాలరుచొక్కాలు వుతకటానికి సబ్బు, ముఖక్షవరం చేసుకునే బ్లేడ్లు, కాల్చే ఏనుగుమార్కు సిగరెట్లు, ఎలావస్తాయి?

నరపి వూరిముందరి అమ్మవారి తోట దగ్గిర మూడంకణాల ఇల్లు కట్టించుకుని అంగడిపెట్టింది. ఆవిడ సంగతి తెలియని వాళ్ళేలేరు. ఆవిడ మామ చెన్నశెట్టి అవమానం భరించలేక రామసంద్రం వదిలి తిపటూరి కవతల చన్నాపురంలో అంగడిపెట్టుకున్నాడట. ఆవిడ మొగుడు గిరియశెట్టి కూడా వూరు వదిలి ఎక్కడో వెళ్ళిపోయాడు. అరిసికెరె దగ్గిర ఏదో వూళ్ళో అతడిప్పుడు ఇల్లరికమున్నాడని కొందరంటారు.

రేవణ్ణశెట్టికి సలహా ఇవ్వగలిగినవాళ్ళులేరు. అతని నోటికి జడిసి ఎవళ్ళూ ముందుకురారు. సర్వక్క పుట్టింట అన్నదమ్ములున్నారు. ఆవిడకూ, ఆవిడపిల్లలకూ చేయగలిగినంత చేశారు. అయినా వాళ్ళ సంసారాలు వాళ్ళకున్నాయి. ఈవిడ మాత్రమెంతని తన గొడవ చెప్పుకోగలదు. ఒకసారి బావకు సలహా ఇవ్వాలని ఆవిడ పెద్దన్నయ్య వాచ్చాడు. అమ్మ,అక్క, ఆలి అని తిట్టించుకుని, ఇహవాడి మొహం చూడనని వెళ్ళిపోయాడు.

సర్వక్క అంది, "నంజమ్మగోరూ! కన్న నేరానికి పిల్లల్నెలాగో పెంచాలి. మీలాగ విస్తళ్ళు కుట్టడం రాదనుకోండి. నాకు కాస్తనేర్పండి. నేర్చుకుంటాను. ఈసారి ఆకులకి చోళనగుడ్డకెడితే నన్ను తీసుకెళ్లండి."

"మీరాకులు కుడితే శెట్టిగారూరుకుంటారా?"

"వూరుకోకేం వురెట్టుకుంటాడా? ఈ రోజు మధ్యాహ్నం మీ ఇంట్లో పట్టుకెళ్ళిన రాగులిసిరి ముద్దచేస్తే కుక్కలా మింగలేదూ?"

మరుసటిరోజునుంచీ సర్వక్క రోజూ కాసేపు వచ్చి విస్తళ్ళు కుట్టేది నేర్చుకునేది. చొప్పఈవలెలా చీల్చాలి, ఆకు తొడిమలు తుంచి, నీళ్ళుచల్లి, పేర్చి, పీటకిందెట్టి పైన బరువులెలా ఎత్తాలి, మధ్యలో ఎలాంటి ఆకువేసి అంటువేయాలి, పుల్ల ఎలావిరవాలి అన్న వివరాలన్నీ తెలుసుకుని ఒకమోస్తరుగా కుట్టడం కూడా నేర్చుకుంది. "ఇలా కుడుతూవుంటే అభ్యాసమై గబగబ సనవుతుంది పని" - అని నంజమ్మ హామీ ఇచ్చాక ఆమెకు కాస్త ధైర్యం వచ్చింది.

## 6

ఒక రోజు మధ్యాహ్నం వూళ్ళో వున్న సర్కారు నూతిలో నీళ్ళు తోడటానికి వెళ్ళినప్పుడు కొలికి తెగి బిందె నూతిలో పడ్డది. ఇంట్లోవున్నది ఒకటే బిందె. కంబనకెరె కాసింసాయబు వస్తేనే నూతిలో దిగి బిందె పైకి తీయగలడు. ఇంటికెళ్ళి కుండయినా తేవాలి. సర్కారు నూతినుంచీ కుండలో నీళ్ళు తీసుకెళ్ళాలంటే చిన్నతనమనిపించింది. అయితే చేసేదేమిటి - అని ఇంటికి వచ్చేసరికి కల్లేశు వచ్చి కూర్చున్నాడు. పిల్లలందరూ అతడు తెచ్చిన పిప్పరుమెంటు బిళ్ళలు బుగ్గవెట్టుకుని చప్పరిస్తున్నారు.

"మంచినీళ్ళకెళ్ళావట. ఇదేం వట్టిచేతుల్తో వస్తున్నావు?" అతడడిగాడు.

"కొలిగి తెగి బిందె నూతిలో పడిపోయింది."

"నడు, నేను తీస్తాను" - అని అతడు లేచి బయల్దేరాడు. అతడి వెనకాలే నంజమ్మా వెళ్ళింది. మావ నూతిలో దిగటం చూడాలని పిల్లలూ వుత్సాహంతో వచ్చారు. నంజమ్మ ఇంటికి తాళం వేసింది

వూళ్ళోవున్న నూతులన్నింటిలో నీళ్ళు కాస్త చప్పగా వుంటాయి. కాని సర్కారు వాళ్ళు రెండేళ్ళక్రితం తవ్వించి రాతికట్టడం కట్టించిన ఈ నూతినీళ్ళుమాత్రం తీయగా రుచిగా వుంటాయి. శుచిగా కూడా వున్నాయి. మాలమాదిగ జనం మినహాయించి అన్ని కులాలవాళ్ళూ వంటకీ, తాగటానికీ అక్కణ్ణుంచీ నీళ్ళు తీసుకెళ్ళేవాళ్ళు. బ్రాహ్మణ, లింగాయత, కంసాలి, సాతాని మొదలైన వుత్తమ జాతి స్త్రీలుమాత్రం నీళ్ళు తోడటానికి తమచేంతాళ్ళు వదిలేముందు, ఇంటినుంచీ తెచ్చిన నీటితో ఒకచారెడు రాటమీదచల్లి మడిచేసుకునేవాళ్ళు.

కల్లేశు చేంతాడు నూతిలోనికి వదిలి, పైన రాట ఇనపవూచకి బందోబస్తుగా కట్టి, కట్టుకున్న పంచ, వేసుకున్న షర్టు కోటు విప్పి కిందపడేసి, చూస్తూ వుండ మని చెల్లాయికి చెప్పి, తాడట్టుకుని నూతిలోనికి సరసరా దిగాడు. రెండు బారల పొడవు ,రెండు బారల వెడల్పు వున్న ఆ నూతిలో నీళ్ళు పాతాళగంగ అని చెప్పాలి. దిగటానికి మూలల్లో చుంచురాళ్ళున్నాయి. నీళ్ళలోదిగి, ఒక్కమునకేసి పైకి వచ్చినప్పుడొక బిందెపైకి తెచ్చాడు. "కొలిక్కికట్టి పైకిలాక్కో" అని అరిచి సంజ్ఞచేశాక నంజమ్మ పైకి చేదింది. కానీ, అది ఆమె బిందెకాదు. 'దాన్నక్కడేవుంచు. ఎవళ్ళొచ్చినా ఇవ్వకు, మళ్ళీ తాడొదులు' - అని అరిచి మరోమునక వేశాడు.

మరో బిందె దొరికింది. కింద పదిపండ్రెడు బిందెలున్నట్టు నీళ్ళలో తడిమినప్పుడు తెలిసింది. అన్నీ తీసి పైకి పంపించాడు.

చేంతాడు పట్టుకుని మంచురాళ్ళమీద కాళ్ళెట్టి అతడు పైకొచ్చేసరికి నూతిదగ్గిర ఇరవైమందికి పైగా ఆడాళ్ళు మగాళ్ళు గుంపుకూడారు.

"నంజా, నీబిందె తీసి వేరేవుంచు" - అని చెల్లాయికి చెప్పి కల్లేశు అక్కడ పోగైన వాళ్ళతో "బిందెల సొంతదార్లు ఒక్కొక్క దానికి ఎనిమిదణాలు తెచ్చివ్వండి లేకపోతే ఇవన్నీ మా వూరికి పట్టుకెడతాను" అని అన్నాడు.

కొందరు డబ్బుకోసం ఇళ్ళకెళ్ళారు. అక్కడికి వచ్చిన మాజీ కరణం శివలింగ అడిగాడు. "మావూరి నూతిలో బిందెలు తీసి కొంచపోతానంటారే ఎవరొల్లి ఇచ్చేరు?"

"అయితే వీటికి నీళ్ళునింపి మళ్ళీ నూతిలోనే పడేస్తాను. వూపిరి బిగబట్టి మునిగింది వూరికేనా?"

శివలింగడికి సమాధానం తోచలేదు. అందరూ అర్ధరూపాయి చొప్పున ఇచ్చారు. కల్లేశుకు మొత్తం మీద ఆరున్నర రూపాయకట్టింది. డబ్బు కోటుజేబులో వేసుకుని, పంచె, చొక్కా, కోటు చేతబుచ్చుకుని తడి డ్రాయరుతోటే అతడింటికి వచ్చాడు.

రాక రాక వచ్చిన అన్నయ్య రెండురోజులైనా వుంటాడని వూహించి నంజమ్మ రేపేమైనా విందు చేయాలని, వెళ్లి సేమియాపాయసం చేయటానికి సరుకుతెచ్చింది. మధ్యాహ్నం భోంచేశాక కాపేపుపడుకుని లేచిన కల్లేశడిగాడు "ఇదేమిటి తెచ్చావు?"

"సేమియా పాయసంవండాలని. నీకిష్టంగా?"

"నేనుండను. ఈ సాయంత్రమే వెళ్ళిపోతాను."

"ఇదేమిటి ఇలావచ్చావు, అలా వెడతానంటావు. వుండుండు."

"లేదు. అర్జంటు పనుంది. నిన్ను చూసి వెడదామని వచ్చాను. నాకో గ్లాసు కాఫీ చేసివ్వు చాలు."

రామణ్ణను అంగడికి తరిమి ఆరుపైసాలకి కాఫీపొడి తెప్పించి బెల్లంవేసి ఓ కంచుగ్లాసునిండా కాఫీచేసి ఇచ్చింది. దాన్ని తాగి కల్లేశు వెంటనే బయల్దేరాడు. అప్పుడే పొద్దుములిగి చీకటిపడుతోంది. అతనికి అంతే-వాళ్ళ నాన్నలాగే చీకటంటే భయంలేదు.

అతడెళ్ళిన కాసేపటికి సర్వక్కవచ్చి అడిగింది. "నంజమ్మగోరూ! చ్వోళనగుడ్డ

కాడ మోదుగాకులు బంగారమాకుల్లా వున్నాయట! గుడి మాదేవయ్యగోరు హూవినహళ్ళికి బిచ్చానికెళ్లారట. దారిలో చూసి, మనసు పట్టలేక కోసుకొచ్చారు. నేనే చూశాను."

"ఇంకా మాఘమాసం కూడా గడవలేదే సర్వక్కా?"

"మార్గసిరంలో వర్షంపడ్డదిగా అంచేతే తొరగావొచ్చింది; రేపెడదాం పదండి."

ఆకులున్న కాలంలో గబగబా పోగెట్టకపోతే ముంగారువర్షాలు పడ్డాక దానికీ ఇబ్బందికావచ్చునని ఆలోచించిన నంజమ్మ సరే అంది. కాకి కర్రనకముందే బయల్దేరి వస్తానని చెప్పి సర్వక్క ఇంటికెళ్ళింది. ఆమెకది మొదటిరోజు. గనక రాత్రి సరిగ్గా నిద్రపోలేదు. మొత్తానికెల్లాగో రాత్రంతా గడిపి కాకి కూసేసరికి లేచి గోనిసంచి, రొట్టెల మూటా చంకనెట్టుకుని, తలమీద చెరగు ముసుగేసుకుని వచ్చి నంజమ్మ ఇంటి తలుపు తట్టింది. నంజమ్మా తయారై వచ్చింది. ఇంకా వెన్నెల వుంది. వెన్నెల వెల్తుర్లో కాకి కావుమని వుంటుందన్న అనుమానం నంజమ్మకు కలిగినా "లేదండీ పొద్దెక్కితే ఎండ. కష్టం. పదండి" అని సర్వక్క దారితీసింది. ఇద్దరూ వూరుదాటి వెళ్ళేటప్పుడు, వూరిముందున్న తోటదగ్గిర నరిసి కొత్తగా కట్టుకున్న ఇంటి తలుపు తెరిచినట్టయింది. ఎవడో మగాడు 'తప్పకుండా' అని మెల్లిగా చెప్పి బయటికొచ్చి, వీళ్ళు వెళ్ళేదారిలోనే వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళాడు. నరిసి తలుపువేసుకుంది.

ఆ వెళ్ళినమనిషి కర్లేశే అని నంజమ్మకు వెంటనే తెలిసింది. తలకు కొంగు ముసుగేసుకుని గోనిసంచి బుజానవేసుకుని, నడిచి వెడుతూవుంటే, ఆ ఇద్దరిలో ఒకరి తనచెల్లాయి అని అతనికి తెలియలేదు. వీళ్ళెవరన్న గొడవకూడా లేకండా అతడు వెళ్ళిపోయాడు. నంజమ్మే కాస్త అడుగు తగ్గించి వెనకబడ్డది. ముందువెడుతున్న వ్యక్తి వాళ్ళ కనుచూపుమేరదాటి వెళ్ళాక సర్వక్క అడిగింది. "ఆయన మీ అన్నయ్యాలా వుంది."

"ఎవడో తెలీదు."

"వూం. ఆయనే నంజమ్మగోరూ! పదిపదేనురోజులకోసారి వొస్తారట. రాత్రి చీకటడ్డాక వొచ్చి పెందరాడే కోడికూసే ముందే ఎల్లిపోతారట. ఆ నరసి ఎవళ్ళదగ్గిరో అందట."

నంజమ్మ మాట్లాడలేదు. తనకామాటలు చెవిలో పడనట్టే మౌనంగా అడుగులేస్తూ నడిచింది.

# 9వ అధ్యాయం

ఏదైనా సరే ఒకస్థలం చాలారోజు లోకరి అనుభవంలోనే వుంటే వాళ్ళదే అయినట్టు, హనుమంతరాయని గుడికూడా గంగమ్మ అప్పణ్ణయ్యల హక్కుభుక్తమై పోయింది. గుడిపూజారితనంలో మాత్రం అణ్ణాజోస్యుల హక్కుకేమీ భంగం కాలేదు. కాని ఇప్పుడుదాన్ని హనుమంతరాయ గుడి అనడంకంటే గంగమ్మగారి ఇల్లంటున్నారు జనం.

గంగమ్మ అప్పణ్ణయ్య అప్పుడప్పుడు వూళ్ళమీద తిరగడమూ కద్దు. రామసంద్రం శివేగౌడ పేరు మొదట్లో మూడుమైళ్ళు సరిహద్దు దాటితే తెలిసేది కాదు. ఇప్పుడు ఇరవైమైళ్ళదాకా తెలుసు. తల్లీ కొడుకూ పల్లెపల్లెకూ వెడతారు. "మా ఆస్తి అంతా ఒక పాపిలంజాకొడుకు దగాచేసి తినేశాడు. మాకు బతుకు తెరువు లేదు. ఏమైనా ఇవ్వండి" – అని ఇంటింటా, గడపగడపా అడుగుతారు. అలా చెప్పి తన పాతచీర నేలమీద పరిచేది గంగమ్మ. దాని మీద చేటలో తెచ్చి గుమ్మరించిన రాగులు, అనపగింజలు, మెరపకాయలు కట్టి తీసికెళ్ళి ఇస్తే మొత్తమన్నీ కలిపి గోని సంచిలో నింపి, నెత్తిమీది కెత్తుకుని వూరికి తెచ్చేపని అప్పణ్ణయ్యది. మాదేవయ్యగారూ ఇలాగే చేస్తారు. కానీ ఆయన భిక్ష మడిగినప్పుడు కారణమేమీ వుండదు. ఎంతైనా జంగం. కావిచొక్కా, కావిధోవతి, కావి పాగా, విభూతి ధరించే సన్యాసి ఆయన. గడపలోపల నిలబడి "భిక్షం, గురు రేవణ్ణగారి భిక్షం" అనడమే ఆయన కర్తవ్యం. దోసెడు రాగులు వచ్చి జోలెలో పడతాయి. కానీ గంగమ్మ ప్రతిఇంట్లోనూ తన ప్రవర చెప్పుకుని శివేగౌడ వంశాన్ని శపించాలి. ఇచ్చేవాళ్ళు చేటెడో సగమో ఇస్తారు. లేనివాళ్ళు ఛీ ఛీ వాట్లేసి పంపుతారు.

గంగమ్మ ఇంట్లో కూడా ఒక పెట్టెవుంది. పెట్టె నిండా రాగులు, రెండు పంచుల్లో అనపగింజలు, ఒక గూడనిండా మెరపకాయలు వున్నాయి. శివేగౌడ బతికిపోయిందేమి? తాను చెడ్డదేమి? అని గంగమ్మ ధర్మాచరణలోని సమత్వాన్ని నిరూపించబోతుంది.

ఒకరోజు మధ్యాహ్నం, ఒంటి గంట సమయంలో హనుమంతరాయని గుడి ముందర రెండు బళ్ళు వచ్చి ఆగాయి. గానుగ శింగశెట్టిదొకటి. పుప్పర ముక్కణ్ణ దింకోటి. రెండు బళ్ళనిండా పాత్రసామాను, పక్కలు, పెట్టెలు, గొడుగు, పీటలు, చాపలు మొదలైన సంసారానికి సరిపడా సకలసామగ్రీ వున్నాయి. వాటి వెనకాలే యాభై ఏళ్ళపూర్వ సువాసిని ఒకతి, సుమారు పాతికేళ్ళ యువతి ఒకతి, ఏడేళ్ళ కుర్రాడొకడు, నాలుగేళ్ళ అమ్మాయొకతి వున్నారు. వచ్చినవీళ్ళని మొట్టమొదట చూసిన అప్పణ్ణయ్య, ముఖంతప్పించి, గుడి వెనకాలకెళ్ళి అక్కణ్ణుంచి, గడ్డిమేటల సందుల్లో నక్కినక్కి ఎక్కడికో వెళ్ళాడు. నొగలు దించాక "ఇదేనమ్మ గంగమ్మగారిల్లు" అని చెప్పి బండిలోని సామాను దించడం మొదలెట్టాడు శింగ. వచ్చిన వాళ్ళలో పెద్దావిడ, ఏదో అనుమానిస్తూనే ఇంట్లో ప్రవేశించింది. గంగమ్మ పోల్చుకోలేదు. ఆవిడే మాది నుగ్గేకెరె. మా ఆయనపోయారు. రెండేళ్ళయింది. సాతూ పిల్లలూ వచ్చి మీ సేవచేయాలని అన్నారు. పిలుచుకవచ్చాను" అంది.

ఆమె చెప్పింది అర్థమవటానికి గంగమ్మకు రెండు నిమిషాలు పట్టింది. ఇంతలో సాతు ఇద్దరు పిల్లల్నీ చెయ్యట్టుకుని తీసుకొచ్చింది. అది చూసిందే తడవుగా గంగమ్మ వూహ తారాజువ్వలా పైకి లేచింది. "ఏమే బరితెగిన ముండా! ఈ పెద్ద పిల్లేమో మా అప్పణ్ణయ్యకు పుట్టింది. నువ్విక్కడున్నప్పుడే వాడితో కడుపొచ్చింది. ఈ రెండో కుర్రాణ్ణి ఎవడికి కన్నావే రంకులాడి? కరణం రామణ్ణగారి వంశం పాడుచెయ్యాలని వొచ్చావా ఇక్కడికి? ఏంజేస్తానో చూద్దువుగాని ఆగు"- అని పైకి లేచి మూలలోవున్న చీపురుకట్ట పుచ్చుకుని నుంచుంది.

"ఎందుకలా లేనిపోని మాటలంటారు? మీ అబ్బాయే మా వూరికి వచ్చాడు. మా అమ్మాయి అలాంటిది కాదు. కావలిస్తే మీ కొడుకునే పిలిచి అడగండి. బారసాలకు రమ్మనిరాసినా ఎందుకు రాలేదు"- అని వియ్యపురాలు అడిగినా ఆ మాటలు గంగమ్మ చెవి కెక్కనేలేదు.

సాతు గుడిలో నుంచీ బయటికి వచ్చింది. పిల్లలిద్దరూ భయపడి తల్లిచాటున నిలబడిపోయారు. సాతుతల్లి "ఇలాంటి ఆడదాన్ని నేనెక్కడా చూడలేదు. మంచిదే జరిగింది" అనుకుంటూ బయటికి వచ్చింది. బండి వెనక్కి మళ్ళించే వారోఏమో, సాతమ్మే - "అమ్మా! ఆయనతోటి మాట్లాడకుండా వెళ్ళటం మంచిదికాదు మా తోడికోడలు వేరే కాపురమున్నారట. ఇప్పటికి వాళ్ళింటి కెడదాం"-

అవేసరికి తల్లి ఒప్పుకుంది. ముక్కణ్ణ, శింగశెట్టి రెండు బళ్లూ కాడిపూన్చి, తెచ్చి నంజమ్మ ఇంటి ముందాపి సామాను ఒకటొకటే దించేస్తున్నారు. నంజమ్మ వీళ్ళెందుకొచ్చారని అడగలేదు. సాతు తల్లివేషం చూడగానే శ్యామాభట్లు పోయారని పోల్చుకుంది. ఏ కష్టంలో వున్నారోఏమో! ముందు లోపలికి పిలిచి, భోజనం గీజనం అయ్యాక విషయాలు తెలుసుకోవాలి. అందరినీ లోపలికి పిలిచి కూర్చోబెట్టింది. ఆ కుర్రాణ్ణి చూసి ఆమెకూ ఆశ్చర్యమే. కాని భర్తకు కలగని కుర్రాణ్ణి తీసుకుని ఏ ఆడదైతే మాత్రం ఇంత ధైర్యంగా రాగలదు' అన్న విశ్వాసం మాత్రమామెకుంది. సాతు ఏడుస్తూనే వుంది. ఆమెతల్లి తంగమ్మే చెప్పింది."అప్పణ్ణయ్య రెండు దఫాలువచ్చి, వచ్చినప్పుడల్లా పదిహేనురోజులున్నాడు. అప్పుడే రామకృష్ణపుట్టాడు. సాతు కానిపని చేసిందని వీధంతా వినేలా వాళ్ళత్త గావుకేక లేసింది. పరమరాక్షసి."

"సరే, లేచి మడికట్టుకోండి. బాబాయిగారు పోయి ఎన్నాళ్ళయింది?"

"రెండేళ్ళయింది. వారున్నంతదాకా పౌరోహిత్యంతో సుఖంగా జీవనం గడిచేది. తరువాత మగదిక్కులేని మమ్మల్నెవరు పిలుస్తారు? ఆడదైన తరువాత మొగుడితో కాపురమెల్లాగో చెయ్యాలిమరి. అక్కడికి వచ్చినప్పుడు అప్పణ్ణయ్యే చెప్పాడు తానేవచ్చి తీసుకెడతానని. ఇటీవల అతడూ రాలేదు. అంచేత మేమే వచ్చేశాం. తిపటూరి నుంచీ బస్సులో వచ్చిదిగాం. ఈ రెండు బళ్ళవాళ్ళూ ఎరువు వేసుకుని అటే పొలంవేపు వచ్చారు. నాలుగణాలు తీసుకుని సామాను బళ్ళకెత్తి తెచ్చారు.

"సాతు! మొదట పిల్లల భోజనం కానీ, ఎప్పుడుతిన్నారో ఏమో"అని నంజమ్మ అంటోంది. అంతలో "ఈ రంకుముండల్ని వెత్తి వెంట్రుకలూడేలా చెప్పుతో కొట్టించి వూళ్లో నుంచి తరమకపోతే నా పేరు గంగమ్మ కాదు" – అని గర్జిస్తూ గంగమ్మ అక్కడికి రావటం వినపడ్డది. విసురుగా వచ్చిన ఆవిడ – "ఏమే రంకు ముండా, దీనితోపాటు నువ్వూ మొదలెట్టాలని దీన్నింటికి చేర్చావా? నీకూ తగిన శాస్తి చేయకపోతే నా ముక్కు మూడుముక్కలుగా కోయించుకుంటాను" అంటూ వుండగానే వెనక నుంచి అయ్యాశాస్త్రులు, అణ్ణాజోస్యులు దిగబడ్డారు. అదేక్షణంలో శివేగౌడ, శివలింగే గౌడ లోపలికి వచ్చారు. వాళ్ళవెనకాలే రేవణ్ణశెట్టి వచ్చాడు. ఇంకా అయిదారుగురు లోపలేదో ఎలుగుబంటి వాడించేలా చూట్టానికి పోగయ్యారు. వీళ్ళందరినీ గంగమ్మే వెళ్ళి తీసుకొచ్చిందని ఎవరూ చెప్పక్కరలేదు.

"నా ఇంటి కెందుకొచ్చారు? మిమ్మల్నెవరు రమ్మన్నారు?" అని అడగాలన్నంత కోపం వచ్చింది నంజమ్మకు. కాని గ్రామపెద్దలతో విరోధం పెట్టుకోరాదన్న వివేకమొకవైపు ఎవళ్ళనీ లోపలికి రమ్మనలేదు. కూర్చొమ్మని చాపలువేయాలేదు. అందాకా పడుకుని నిద్రపోతున్న చెన్నిగరాయలు లేచి రెండు చాపలు వేశాడు. జోస్యులిద్దరికీ రెండు చిరుచాపలేశారు. సాతు, ఇద్దరుపిల్లలు, తంగమ్మ అందరూ వంటింట్లో కెళ్ళారు.

"ఎందుకు లోపలి కెడతావే. రావే బయటికి. వూరి ఎదట న్యాయం పలికిస్తాను."

"న్యాయమే, న్యాయమే ఇక్కడికే రండమ్మా" రేవణ్ణశెట్టి ధర్మప్రతినిధి పాత్ర వహించి పిలిచాడు.

"రేవణ్ణశెట్టిగారే పిలుస్తున్నారు, రావే" గంగమ్మ మళ్ళీ పిలిచింది.

రేవణ్ణశెట్టి ఇక్కడికి రావటంకానీ, అతడు గొప్పధర్మిష్ఠిలా మాట్లాడటం కానీ నంజమ్మ సహించలేకపోయింది. వాళ్ళనోళ్ళుమూసి పంపించే వుపాయమూ తోచలేదు. చివరికోదారి కనిపించింది. అదే సమయానికి పలకాపుస్తకాలు పట్టుకుని పార్వతి, రామణ్ణ ఇద్దరూ బడినుంచీ వచ్చారు. "పార్వతీ! గుడి మాదేవయ్యాగారినీ, మీ మాస్టారుగారినీ నేను చెప్పానని పిలుచుకురా, వెళ్ళు. ఇప్పుడే రావాలని చెప్పు. పరుగెత్తు" అంది ఇద్దరు పిల్లలూ అలాగే పరుగెట్టారు.

"ఎందుకమ్మా, మేము న్యాయం చెబితే చాలదా?" నంజమ్మ ముఖంకేసి చూస్తూ రేవణ్ణశెట్టి అడిగాడు. ఆమె లోపలికి వెళ్ళిపోయింది. "ఎందుకే లోపలికెళ్ళావు లాయరీ?" అని గంగమ్మ పిలిచినా బయటికి రాలేదు.

"వ్యభిచారం చేసిన స్త్రీ శిరచ్ఛేదం చేయాలని మనుధర్మశాస్త్రంలో వుంది. లేకపోతే సహస్రనాణ్యాలఖర్చుతో ప్రాయశ్చిత్తం చేయాలని వేదంలో వుంది.వాళ్ళు ప్రాయశ్చిత్తం చేసుకునేదాకా లోపలికి రానివ్వటం నంజమ్మదే తప్పు" అని అయ్యాశాస్త్రులు వ్యాఖ్యానించారు.

అంతలో మాదేవయ్యాగారు వచ్చారు. గంగమ్మ వీధిగుండా అరుస్తూ నానా హంగామా చేయటం వల్ల, విషయం వూళ్ళోవాళ్ళకంతా తెలిసి, ఇంటి ముందు దిక్కుమాలిన సంతగా జనం పోగయ్యారు. ఓరగా సందుచేసుకుని వచ్చిన మాదేవయ్యాగారికి విషయం ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. ఆయనరావటం తలుపుసందులో నుంచీ చూసిన నంజమ్మ బయటికివచ్చి అడిగింది. "అయ్యాగారు

ధర్మాధర్మాలు తెలిసిన వారు మీరు. న్యాయ విచారణ మీరు చేయాలి. తతిమ్మా వాళ్ళు తలా ఒకటి మాట్లాడరాదు. అప్పణ్ణయ్యే వచ్చాడు. వున్నాడు. అతడికే ఈ కుర్రాడు పుట్టాడని వాళ్ళు లోపల కూర్చుని ఇప్పటికీ దేవుడిమీద ప్రమాణం చేస్తున్నారు."

ఇక్కడ ఇంతలో ఏమిజరిగిందో అయ్యగారి కర్థమయింది. ఆయనన్నారు. "మొదట అప్పణ్ణయ్యను పిలిపించండి. ఆ తరువాత న్యాయం చూద్దాం."

"నా చిట్టితండ్రిదేమీ తప్పులేదు. వాడి కథం శుభం తెలవదు. వాడలాంటి వాడు కాదు" గంగమ్మ ప్రతిఘటించబోయింది.

"తప్పుందో లేదో విచారణచేద్దాం. మొగుడన్నవాడు పెళ్ళామింటికెడితే తప్పేంలేదుగా?" అని ఆవిడకి సమాధానం చెప్పి, అయ్యగారు తలుపుదగ్గిర నుంచున్న వాళ్ళతో "అప్పణ్ణగారు ఎక్కడున్నా వదలకుండా పిలుచుకురండి, వెళ్ళండి" అన్నారు. పది పన్నెండుమంది అన్వేషణోత్సుకులై పరుగెట్టారు. ఇంతలో మళ్ళీ మాట్లాడాలని ప్రయత్నించిన పురోహితద్వయంతో - "అప్పణ్ణయ్య వచ్చేదాకా ఎవరూ నోరెత్తకూడదు"- అని చెప్పి నోరునొక్కేశాడు.

పదిహేను నిముషాలలో అప్పణ్ణయ్యవచ్చాడు. అతడు బసప్పశెట్టి గారి గడ్డిమేట వెనకాల కూర్చున్నాడట. తప్పించుకుపోవాలని ప్రయత్నంచేసినా వెదకటానికి వెళ్ళిన ఇద్దరు దూకి పట్టుకుని తీసుకువచ్చారు. సభలో నట్టనడుమ స్తంభం దగ్గిర కొప్పువిడిపోయి వెంట్రుకలు ముఖమంతా కప్పేలా తలవంచుకుని నుంచున్నాడు. మాదేవయ్యగారతణ్ణేమీ అడగలేదు. లోపలినుంచీ ఓ దీపం వెలిగించి, దాంతోపాటు ఒక దేవుడిపటం కూడా తెమ్మని నంజమ్మకు చెప్పాడు. నంజమ్మ ఒక పీటవేసి, రెండు సెమ్మెలు వెలిగించి శ్రీరాముల పటం తెచ్చి దానిమీదపెట్టింది. అయ్యగారు కుంకుమభరిణి అడిగారు. తెచ్చాక ఆయనే కుంకమతీసి అప్పణ్ణయ్య నుదుటపెట్టి దేవుడి పటం అతడి చేతికిచ్చి, అడిగారు! "చూడుబాబూ అబద్ధమాడితే నీ చేతులూ కాళ్ళూ దేవుడు కత్తిరించేస్తాడు. సుంకలమ్మ మారివచ్చినిన్నెత్తుకుపోతుంది. నిజం చెప్పు. నువ్వు మీ అమ్మగారికి తెలీకుండా నీ పెళ్ళాం కాడికి ఎళ్ళావా లేదా?"

అప్పణ్ణయ్య మాట్లాడలేదు."నా చిట్టితండ్రితో,అబద్దాల ప్రమాణ మెందుకు చేయిస్తావు జంగమయ్యా!" అని గంగమ్మ అడిగింది. దాన్ని లెక్కచేయకుండా అయ్యగారు "మాట్లాడాలి, నిజం చెప్పకపోతే నీ చేతులు కాళ్ళూ పడిపోతాయి.

అక్కడమండే దీపం భగ్గుమని అంటుకుని కాల్చేస్తుంది. శని మాహాత్మ్యం చూడలేదూ? విక్రమార్కుడి చేతులు కాళ్ళు ఎలా కత్తిరించుక పోయాయి. వూం. మాట్లాడు."

అప్పణ్ణయ్య మనస్సులో భయం పట్టుకుంది. నాయిసింగేహళ్ళి దొంబి - దాసరయ్యలు ఆడిన 'శని మహాత్మ్య' మన్న యక్షగానంలో విక్రమార్కుని తొడ చీరుకుపోయి ఏడుస్తున్న దృశ్యం కళ్ళముందు నిల్చింది. మాదేవయ్యగారు మరోసారి 'అబద్ధాలాడితే శనిదేవుడు...' అనే లోపుగానే "నేనబద్ధాలాడనండీ! రెండుసార్లు నేను నుగ్గేకెరె వెళ్ళాను" అన్నాడు.

"ఎన్నాళ్ళున్నావు?"

"పదేను రోజులోసారి, మరోసారెన్ని రోజులో గుర్తులేదు."

"ఎన్నాళ్ళ కిందవెళ్ళావు?"

"ఇక్కడ రెండోసారి ప్లేగు వచ్చిందే అప్పుడు."

అంటే దాదాపు ఆరేళ్ళయింది. నంజమ్మ లోపలికెళ్ళి సాతమ్మకొడుకుని చెయ్యెట్టుకుని తెచ్చి నుంచోబెట్టింది. సుమారు అయిదేళ్ళ ఆ కుర్రాడు అప్పణ్ణయ్య ముఖంలో వూడి పడ్డట్టున్నాడు.

"తుంటరి వెధవకావ! జావగల్లు కెడతానని ఇలా చేశావట్రా చవటా! రేపటి నుంచీ అక్కడే పడిచావు. నేను కూడెట్టేది లేదు. రంకుముండా కొడుకా" అని పైకి లేచి గంగమ్మ అక్కణ్ణుంచీ వెళ్ళిపోయింది. ఇంతరాద్ధాంతము వుత్తిత్తిదే అని తేలాక గ్రామపెద్దలూ, పురోహితుల జంటా, ఒకరొకరే తోకదూడించారు.

## 2

అదే రోజు గంగమ్మ కొడుకును కూడా వెంటేసుకుని పల్లెంవేపు వెళ్ళిపోయింది. ఆవిడిలా వెళ్ళడం మొదటి సారికాదు. అణ్ణాజోస్యులదగ్గిర గుడి తలుపు తాళంచెవి మరోటుంది. తలుపుతీసి దేవుడి పూజ చేస్తున్నానని చెప్పటానికి కనుకూలంగా వుంది.

సాతు, ఇద్దరు పిల్లలు, తంగమ్మా, నంజమ్మ ఇంట్లోనే వుండిపోయారు. వీళ్ళకు సరిపడా రాగులు, అనపగింజలు నంజమ్మ ఇంట్లో వున్నాయి. కానీ వాళ్ళకి రాగిపిండి తింటే కడుపుకుట్టు వచ్చేది. అనపగింజల చారో, పులుసో వేసుకుంటే వాయువు. బియ్యం కందిపప్పు వేసి రోజూ చేయాలంటే నంజమ్మ

శక్తికి మించినవని.పండగో పబ్బమో అయితే ముతకబియ్యమన్నం చేసేది. రెవెన్యూ ఇన్స్పెక్టర్ వంటివాళ్ళొస్తే సన్నబియ్యమన్నం, కందిపప్పుచారు చేయటం ఆమె తాహత్తులోనిది. కానీ ఇప్పుడు విధిలేదు. తొణక్కుండా నంజమ్మ ప్రతిరోజూ సన్న బియ్యమన్నం, కందిపప్పు చారు చేసి వడ్డించేది. అన్నం చూస్తేతన పిల్లలూ వదలరు. అలాంటప్పుడు చెన్నిగరాయలు వదులుతాడా? అందరికీ అన్నంచేసి తావొక్కతే ముద్దతిని మాత్రం చేసే ఆదా ఎంత? మొత్తంమీద ఖర్చు భరించటం కష్టమయింది.

పదిహేనురోజులయ్యాక తల్లీ కొడుకూ వూరికి వచ్చారు. ఆ విషయం తెలిసి, నంజమ్మ దీపం వెలిగించాక "మీ బాబాయ్‌ని పిలుచుకురా, బామ్మ ఎదురుగుండా పిలవకు"– అని చెప్పి పార్వతిని పంపించింది. సూక్ష్మగ్రాహి అయిన అమ్మాయివెళ్ళి ఏకంగా అప్పణ్ణయ్యని వెంటబెట్టుకునే వచ్చింది. పెళ్ళాన్ని చూచిన అప్పణ్ణయ్యకు, ఒకవేపుమోజూ, మరో వైపు భయం. మరోరకంగా సిగ్గు. వచ్చినవాడు వూరికే స్తంభం చాటున నుంచున్నాడు. నంజమ్మే మాట్లాడించి కూర్చోమంది. లోపల సాతు వంటచేస్తోంది.

"అప్పణ్ణయ్యా! ఇక్కడే భోంచేయండి"– అంది నంజమ్మ

"అమ్మ ..."

"ఆమేమీ అనదులేండి. రాత్రిపూట ఎలాగూ ఫలహారానికేమో రొట్టె చేసుకుని తింటారు. లేవండి చేతులు కాళ్ళు కడుక్కోండి."

అప్పణ్ణయ్య చేతులు కాళ్ళు కడుక్కున్నాడు. చెన్నిగరాయలూ తయారయ్యాడు. పిల్లలనూ కూర్చోబెట్టి వడ్డించమని సాతమ్మతో చెప్పింది. చాలు, వద్దు అనటానికి కూడా అప్పణ్ణయ్యకదోలా వుంది. కావాలా అక్కరలేదా అనటానికి ఆవిడకూ సిగ్గూ, అవమానం, తిరస్కారవేదన. భోజనాల సమయంలో నంజమ్మ తంగమ్మ ముండువాలో వున్నారు. తరువాత అన్నాదమ్ములు తాంబూలం, పొగాకు వేసుకున్నారు. నంజమ్మ లోపలికెళ్ళి సాతుతో ఏదో గుసగుసలాడింది. ఆ సంభాషణలో తంగమ్మకూడా కలిపించుకుంది.

ఆ ఇంట్లో ధాన్యాలుంచే చీకటిగది ఒకటుంది. ఊడ్చి శుభ్రంచేసి చాపవేసి నంజమ్మ, సాతు తన వెంట తెచ్చిన రెండు పక్కలు చేర్చి వేసింది. అప్పణ్ణయ్య పైకి లేచినప్పుడు – 'ఈ వేళ, ఇక్కడేపడుకోండి'– అంది.

అతనికి ఈ అనిరీక్షితమైన ఆహ్వానం వల్ల కలిగిన సంతోషంతో పాటు గాభరా

అయింది. తనకు తెలియకుండానే "అమ్మ..." అన్నాడు. "అమ్మకు తోడు కావలిస్తే పార్వతిని, రామణ్ణను పంపుతాను. ఆవిడకు ఒంటరిగా వున్నా భయంలేదు. మీరా ధాన్యపు గదిలో పడుకోవచ్చు" వెళ్లండి అంది. చెన్నిగరాయలు మాత్రం "నీ కెందుకే లేనిపోని గొడవ?" అని ముఖం చిట్లించి పెళ్ళాంవేపు చూశాడు. పానకంలో పుడకలాగా మాట్లాడిన మొగుణ్ణి తినేసేలాచూసి నంజమ్మ "మీరు కాస్త వోరుమూనుకు కూర్చోండి తిరమలే గౌడ ఇంటివాళ్ళు జున్నుపాలు పంపించారు.లోపల పాయసం వండుతున్నాం. మీకు కావాలా అక్కరలేదా చెప్పండి?"

జున్నుపాల పాయసమన్న మాట వినగానే చెన్నిగరాయలు లేచి వంటింటి వేపు వెళ్ళాడు.అప్పణ్ణయ్య తనకేర్పాటుచేసిన గదిలోకి వెళ్ళాడు.వంటింటిలోకి వచ్చిన నంజమ్మ "మేము చేసి పిలుస్తాం. మీరందాకా మరోసారి పొగాకు వేసుకుంటూ వుండండి" అని బయటికి పంపింది. సాతుతో చెప్పి, ఆమెను అప్పణ్ణయ్య గదిలోకి పంపి తానే బయటనుంచీ తలుపులాక్కుంది.

సమయస్ఫూర్తితో జున్నుపాల మాటెత్తి రసాభాస కాకుండా చేసింది. కానీ ఇప్పుడే గెదెను తెచ్చి, ఏ ఆవునుతెచ్చి, ఈనించి జున్నుపాలు తీసి పాయసం చేయగలదు? అయినా ఆవిడ కంగారు పడలేదు. పిల్లలకంతా పక్కలువేసిచ్చి, మండువాలో పడోకోబెట్టి, ఓ కొబ్బరికాయి తురుమి, ఆకోరుతో ఇన్ని బియ్యమేసిరుబ్బి రెండుండలు బెల్లంవేసి పాయసం చేశాక, ఇన్ని మామూలు పాలువేసింది. తంగమ్మను బయటికి పంపి మొగుణ్ణి లోపలికి రమ్మంది. మేలుకుని, వెయ్యి కళ్ళతో ఎదురుచూస్తూ కూర్చున్న కరణంగారు, పిలుపు వినగానే లేచివచ్చి గొంతు కూర్చున్నాక పాయసపు గిన్నెముందుంచి, అల్యూమినియం కంచంలో కాస్తవేస్తూ చెప్పింది. "మీరే వంపుకుని తినండి. వాళ్ళింటిగేదె దూడవేసి అప్పుడే పదిహేనురోజులయిందట! ఆ జున్నుపాలు గడ్డకట్టలేదు. అయినా పాయసం ఏం చక్కావుందనుకున్నారు!"

చెన్నిగరాయలు గరిటెడు పాయసం కంచంలో వేసుకుని నాకారు. తీయగావున్న జున్ను పాయసం చప్పరిస్తే కమ్మగా వుంది. "నేనువెళ్ళనా? మీరు తింటారా?" అని అడిగిన దానికి "వూ" అనటానికి కూడా ఆయనకు వ్యవధిలేదు.

తెల్లారి లేచిన అప్పణ్ణయ్య చెరువు కట్టవేపు వెళ్ళాక గుడికి వచ్చి అమ్మతో అన్నాడు. "వాళ్ళనీ ఇక్కడికే తెద్దామా అమ్మా?"

"ఎవళ్ళనిరా?"

" ఆ నుగ్గేకేరే వాళ్ళని."

గంగమ్మకు నోటమాటరాలేదు క్షణంలో అంతా పసిగట్టింది. "ఓరి భడవా! రాత్రి దేవతాపురంలో మేళం చూడ్డానికి వెళ్ళావనుకున్నాను. వెళ్ళి ఆ రంకులాడి పక్కలో పడుకొని వచ్చావా?"

అప్పణ్ణ తలవంచుకుని నుంచున్నాడు. పొద్దారిపోయేదాకా పదిమిషాలాగకుండా తిట్టాక గంగమ్మ అడిగింది. "మమ్మల్నీ అక్కడికే తీసుకెళ్ళమని అడిగిందేరా ఆ రంకులాడి?"

అప్పణ్ణకు కాస్త ధైర్యం వచ్చింది! "అది అడగటమేమిటి? నేనే చెప్పాను. తీసుకొద్దాం. వాళ్ళ నక్కడెందుకుంచాలి?"

("తీసుకెళ్తానని దాంతో చెప్పొచ్చావట్రా మిండలకి పుట్టిన లంజాకొడుకా? ఆగు అణ్ణాజోస్యులకు చెప్పి నీ పని పట్టిస్తాను." అంటూ లేచి తిన్నగా వెళ్ళి జోస్యుల ఇంటి మూజారు కింద నుంచుని పిలిచింది.

"జోస్యులూ! ఇలా రావయ్య కాస్త.")

ఈమె పిలిచిన పిలుపుకి చుట్టుపక్కల వాళ్ళే ఏడెనమండుగురు పోగయ్యారు. బయటికి వచ్చిన జోస్యులతో చెప్పింది. "నిన్నరాత్రి వీడెళ్ళి ఆ రంకులాడి పక్కలో పడుకుని వచ్చాడు. ఈ రోజునుంచీ మా ఇంటికే తెస్తానంటున్నాడు. దేవుడి గుడిలో మొగుడూపెళ్ళాం కాపురం చేయచ్చా మీరే చెప్పండి."

హనుమంతరాయ డనలే బ్రహ్మచారిదేముడు. ఆయన గుడిలో ఆలుమగలూ వుండటం ధర్మ నిషిద్ధం. వాడికేదో మతి చెడ్డది. అలాచేస్తే అందరినీ దేవాలయం నుంచీ బయటికి పంపించేస్తాను. గ్రామంలో నానా వంగడీ రావాలా అక్కరలేదా?" అని అణ్ణాజోస్యులు, తానేగుడికి వచ్చి హెచ్చరిక చేసి వెళ్ళారు. అప్పణ్ణయ్య ముఖం దిగాలు పడిపోయింది. కానీ రాత్రి అనుభవించిన సుఖం గుర్తుకు వచ్చి పెళ్ళాన్ని వదిలి వుండటమూ అసాధ్యమనిపించింది. ధైర్యం కూడగట్టుకుని వదిన ఇంటికెళ్ళి జరిగిన సంగతి చెప్పాడు. అంతలో వెనకాలే విసురుగా వచ్చిన గంగమ్మ గుమ్మం అవతలే నుంచుని వంజమ్మను, చెన్నిగరాయల్నీ కలిపి తిట్లదండకం వల్లించింది. ఇంకాపడుకుని నిద్రపోతూ రాత్రితాగిన పాయసాన్ని అరిగించుకుంటున్న చెన్నిగరాయలు లేచి నుంచున్నాడు. ఆయన పెళ్ళానికి వషట్కారాలు తగిలించే వాడో ఏమోమరి, వెంటనే చెరువు కట్టవేపు వెళ్ళ

అవసరం ఏర్పడి, వులక్కుండా పలక్కుండా లేచి గబగబా చిన్న పరుగు తీస్తూ వెళ్ళిపోయాడు. ఈ కొడుకూ తనకు విరోధి అయ్యాడని భావించిన గంగమ్మ కాలు కాలిన పిల్లిలా అక్కడ నిలవకుండా తన ఇంటికి వెళ్ళిపోయింది.

## 3

అప్పణ్ణ ఆరోజూ వదిన ఇంట్లో వుండిపోయాడు. రెండుమూడు రోజుల్లో ఒక నిర్ణయానికి వచ్చారు. అప్పణ్ణయ్య పెళ్ళాం పిల్లలతో వేరుగా వుండాలి. అతని అత్తయ్యకూడా వాళ్ళతోటే వుండాలన్నది ప్రత్యేకంగా చెప్పక్కరలేదు. మరి జీవనోపాయానికి దారి? ఇన్నేళ్ళు తల్లి వెనకాల పల్లె పల్లెకూ తిరిగి యాయవారం చేసిన అతడు "ముష్టయినా ఎత్తి పెళ్ళాం పిల్లల్ని పోషిస్తాను. నేనేం మగాణ్ణికానూ?" అన్న ధీమాతో మాట్లాడాడు. పోతే, వాళ్ళుండటానికో జాగా ఏర్పాటు కావాలి.

కురుబరహళ్ళి గుండేగౌడగారిదే ఈ వూళ్ళో ఓ ఖాళీజాగా వుంది. ఎవళ్ళూ వుపయోగించడంలేదు. కంచె కూడాలేదు. హనుమంతరాయని గుడికి ముప్పై గజాల దూరంలో వుంటుంది. నంజమ్మ అప్పణ్ణయ్యను వెంటబెట్టుకుని కురుబరహళ్ళికి వెళ్ళి గుండే గౌడ నడిగింది. దానిలో అప్పణ్ణయ్య సొంత ఖర్చులతో పాకవేసుకుని వుంటే తన ఆక్షేపణేమీ లేదని గౌడ తన అంగీకారాన్ని తెలియజేశాడు. అప్పణ్ణయ్య చెన్నిగరాయలులాగ పనిదొంగ కాదు. ఎవళ్ళయినా వుబ్బవేస్తే, దారిచూపెడితే రోషం వచ్చి శరీరకష్టం చేసే సామర్థ్యం, వుత్సాహం రెండూ వున్నాయి. చాలా రోజులుగా ఎరగని పెళ్ళాంతోటి సహవాసం పౌరుషాన్నిచ్చింది. నంజమ్మగారి చూపే వరవడి లభించింది. సాతు తన వెంట తెచ్చిన సేరుబరువున్న వెండి పాత్ర పాతికరూపాయలకమ్మి ఆ డబ్బు అతనికిచ్చింది. పది వెదుళ్ళు, పదిబళ్ళ ఎర్రమట్టి, రెండు రాతిస్తంభాలు డబ్బిచ్చి కొన్నదెంతో అంతే. అప్పణ్ణయ్యే పునాదితీసి నడుముదాకా తడికగోడలేపి, రాతిస్తంభాలు పాతి వెదురుగడలు బద్దలు వేసి కట్టాడు. వాళ్ళ వీళ్ళ తోటలలో అడిగి తెచ్చిన అయిదారు వందల కొబ్బరి మట్టలతో కప్పుతయారయింది. వడ్రంగి ఆచారి మూడురూపాయలకు నాలుగడుగుల ఎత్తున్న ఒక తలుపు గొళ్ళెంతో సహా చేసి బిగించాడు. శుభదినం చూసి, పాలు పొంగించి, గృహప్రవేశం కూడా చేశారు. గృహప్రవేశం చేసేదాకా అందరి భోజనాలూ నంజమ్మ ఇంట్లోనే.

ఇక జీవనోపాధికి దారి చూడాలి. ఇప్పుడప్పణ్ణయ్య తానొక్కడే పల్లెల వేపు

వెడతాడు. శివేగౌడను శపించి, ఏదైనా ఇప్పించమని ఇంటింటా అడుగుతాడు. అతడు వీధి వాకిట నిలిచి జోలెపట్టే బిచ్చగాడు కాదు. ఇచ్చేవాళ్ళు అర్ధసేరుకు తక్కువ కాకుండా చేటలతోటే తెచ్చి పోస్తారు. ఇంతలో నూర్పిళ్ళ కాలం వచ్చింది. అతడు పొలాలకే వెడతాడు. రాగులు కొట్టి రాల్చాక తూరుపెత్తి రాశిపూజ చేసేవేళకి వచ్చినవాళ్ళకి చేటలతో దానమిస్తే రాశి పెద్దదవుతుందిగదా! గనక అతనికి చేటనిండా లభించేవి. ఎన్నో సార్లు ఒకే పొలంలో గంగమ్మ, అప్పణ్ణయ్య ఇద్దరూ కలిశారు. ఆమె కొడుకుతో మాట్లాడదు. అతడూ ముఖమెత్తి ఆమెను చూడడు. ఇద్దరూ వేరువేరని వేషాలేస్తూ వచ్చారా? రెండేసి సారులు లెక్కడ నుంచి తేము? అని మందలించేవారు లేకపోలేదు. పోనిమ్మని ఇద్దరికీ ఇచ్చేవాళ్ళూ వున్నారు.

ఇలాంటి పరిస్థితే పల్లెలో కూడా తటస్థపడేది. వెనక తల్లీ కొడుకూ కలిసిజతగా వెడుతున్న ఇళ్ళకిప్పుడు వీళ్ళల్లో ఎవరో ఒకరు ముందు వెడతారు. తరువాత వెళ్ళిన వాళ్ళతో "తల్లి కొడుకు వేరని వేషాలేస్తూ రెండేసి సార్లు వస్తే ఎక్కణ్ణించీ తెస్తాం" అని కొందరడిగేవారు. ఈ పేచీ ఎందుకని గంగమ్మ మొదలే మేలుకుని చుట్టుపక్కల పల్లెలన్నీ తిరిగొచ్చింది. తానొక్కతే, ఎంతకావాలి? ఖర్చుతక్కువ. మూడేళ్ళకు సరిపడా రాగులు, అనుపగింజలు, మిరపకాయలు అన్నీ నిలవవున్నాయి. అప్పణ్ణయ్య అయిదుగుర్ని పోషించాలి. అదీగాక దిక్కులేని మొగుడు లేని ముసలమ్మ ఇంటికి వచ్చి అడిగితే, జనానికి కలిగే జాలి, ప్రాయంలో దేరా మేకులా వున్న మగాడు వచ్చి అడిగితే కలుగుతుందా మరి? "కూలిచేసుకుని తినడానికేమొచ్చింది? చేతులు కాళ్ళూ పడిపోయాయా?" అని అడిగిన వాళ్ళూ వున్నారు.

పెళ్ళాం వచ్చిన కొత్తలో అప్పణ్ణయ్యకు విపరీతమైన వుత్సాహం కొన్నిరోజులయ్యాక అది కొంచెం తగ్గుముఖం పట్టింది. రోజల్లా వూరూరూ తిరిగి, ఎక్కేగడప దిగేగడప లెక్కేలేదు. వాళ్ళనే మాటలొక్కొక్కసారి శూలాల్లా మనస్సును తూట్లు పొడిచేస్తాయి. మనస్సు బాధపడుతోంది. వెనుక తల్లితో పాటు వెడితే యాచించేపని ఆవిడది. ఎర్రచీరలో మూటకట్టుకుని తెచ్చివడేస్తే, గోనిసంచికి నింపుకుని, నెత్తిన మోసుకుని వచ్చే కష్టం మాత్రమే తనది. ఇప్పుడు తానెళ్ళి దేహీ అనే దైన్యానికి గురి కావలసి వస్తోంది. అది అతని మనస్సుకు నచ్చలేదు.

ఒకరోజు నంజమ్మ వీళ్ళింటికి వచ్చింది. అప్పణ్ణయ్య పల్లెలమీద సంచారం వెళ్ళాడు. ఆ మాటా ఈ మాటా మాట్లాడిన నంజమ్మ అంది "మీ జయలక్ష్మికి కూడా మా పార్వతి వయస్సు. దాన్ని బడికి పంపండి. రామకృష్ణుణ్ణి కూడా చేర్పించండి, నాలుగక్షరాలు వస్తే ఎందుకేనా మంచిది".

"చేర్చాలి".

"మరో విషయం మీకు చెప్పాలనుకున్నాను. మీరు ఇంటికి తెచ్చిన రాగులు అమ్ముతున్నారట. అలా అమ్మరాదు. సూర్పిళ్ళకాలంలోను తరువాత రెండు మూడునెలలే గింజాగిట్రా ఇస్తారు జనం. జ్యేష్ఠాషాఢాలు పోతే ఎవళ్ళూ ఇవ్వరు. ఇప్పుడు ధాన్య మమ్ముకుంటే తరువాత చాలా కష్టం. సన్నేనహళ్ళి నుంచీ రెండు మట్టి గరిసెలు తెప్పించి నిలవచేయండి".

"ఈ పాడు రాగులుంచుకుని మాత్రం చేసేదేమిటి? ఎవరు తినగలరు వాటిని?" అని గంగాభాగీరథీ సమానురాలు తంగమ్మ పలికింది.

వీళ్ళకి రాగులు తింటే పడదని గంగమ్మకు తెలుసు. కానీ పల్లెటూళ్ళల్లో రాగులు కాక బియ్యం తినేవాళ్ళెంత మంది వున్నారు? అలవాటయితే అదే సయిస్తుంది. సహించకుండా దర్జాగా జీవించడం పెద్ద జమీందార్లకయితే సాధ్యం. వీళ్ళిలా అంటే ఎలాగ? తనకు తోచిన మంచి మాట తాను చెప్పింది. ఇంకా ఒకటిరెండు సలహాలివ్వాలనే ఆమె అనుకుంది. వాళ్ళకు కాఫీ తాగే అలవాటుంది. సాతు మొదట కాపురానికి వచ్చినప్పుడు అత్తయ్య భయానికి ఎలాగో నిగ్రహించుకుంది. ఇప్పుడు కాఫీకి అలవాటు పడ్డ జనం రామసంద్రంలోనూ ఎక్కువయ్యారు. కలవాళ్ళు తాగనూ వచ్చు కానీ అప్పణ్ణయ్య సంసారంలో ఈ నలుగురికి కావాలే ఎక్కణ్ణించీ వస్తుంది.

"మీరు కాఫీ వదిలేయండి ఎంతో ఆదా అవుతుంది"

"వస్తే మా వల్లకాదు. తెల్లారి లేవగానే కాఫీచుక్క పడకపోతే ఎలావుండేది? మీరయితే రొట్టెతిని వుండగలరు. మేమలా బతికిన వాళ్ళం కాము"- తంగమ్మ అంది. నంజమ్మ ఆ మాట అంతటితో ఆపింది.

ఒకరోజు సాతు తోడికోడలింటికి వచ్చి కూర్చుని మాట్లాడుతోంది. నంజమ్మ గబగబా రెండు మూడు నిమిషాల కోటి చొప్పున మోదుగ విస్తళ్ళు కుట్టి పారేస్తోంది. "అక్కా! మీరింత పని చేస్తారా, ఇంటిపని చేస్తారు, కరణీకం లెక్కలు రాస్తారు, ఆకులు మోసుకొచ్చి విస్తళ్ళు కుడుతారు. మావల్ల కాదమ్మా!!

నంజమ్మ అంది. "మూడు సాతు, నీతో చెప్పాలని రెండు మూడు నెలలుగా అనుకుంటున్నాను మీరేమనుకుంటారో అని వూరుకుండిపోయాను."

"ఏం చెప్పండి."

"మీ ఇంట్లో తినే వాళ్ళయిదుగురు. సంపాదించే వాడొకడు. అదీ భిక్షమెత్తి ఎవరూ బతకలేరు. ఏదోవొకటి సొంతంగా పనిచేయాలి. సొంతంగా చేసే తెలివి తేటలుంటే ఈసంసార మీస్థితిలో ఎందుకుంటుంది. మీరైనా ఏదైనా చేయండి. ఇంట్లో మీరిద్దరున్నారు. ఇంటిపనులు చేసుకుని ఆడుతూ పాడుతూ కుట్టినా రోజుకి మూడువందల విస్తళ్ళు కుట్టవచ్చు. ఇప్పుడు విస్తళ్ళు బాగా ధర పలుకుతున్నాయి. వంద ఏడణాలు, తిపటూరినుంచీ ఎంతైనా సగే బెంగుళూరికి లారీల్లో రవాణా చేస్తారు. నెలకు ముప్పై రూపాయలవ్వా ఎంతో అయింది కదా?"

"ఒకే మోస్తరుగా పొద్దస్తమానం మోదుగాకులు కుడితే వేడిచేయదూ?"

"అలవాటు చేసుకుంటే ఏమీ చేయదు. అంతా వేడయితే రాత్రి పడుకోబోయే ముందు అరికాళ్ళకు ఆముదం పెట్టుకుంటే సరి."

తానూ కూడా విస్తళ్ళు కుట్టాలని సాతు నిశ్చయించుకుంది. మరుసటి రోజు తోడికోడలింటికెళ్ళి ఆమెతో పాటు ఈనపుల్లలు కోసింది. నంజమ్మ నూటిరవై కుట్టేసరికి ఈవిడ పద్దెనిమిది కుట్టింది. అలవాటు కొద్దీ చకచకా పని జరుగుతుందని నంజమ్మ ప్రోత్సాహమిచ్చింది. కాని మరుసటిరోజు ఆమె కాళ్ళు చేతులు మంటలెత్తాయి. "కట్టుకున్న మొగుడు పెళ్ళాం పిల్లల్ని పోషించాలి. నువ్వు, విస్తళ్ళు గిస్తళ్ళు కుట్టకు తల్లీ" అని తంగమ్మ కూతురికి పోషణబాధ్యత గుర్తు చేసింది. అంతటితో ఆవిడ విస్తళ్ళ అధ్యాయం ముగిసింది. ఈ మధ్య ఆవిడకి నెలతప్పింది. డోకులూ ప్రారంభమయ్యాయి.

సాతు తండ్రి శ్యామాభట్లు స్వయంగా పురోహితులు. పురోహితుల వంశానికి చెందినవారు. అంచేత, మడి, మైల, ఆచారం వంటి విషయాలు తంగమ్మకు బాగా తెలుసు. గంగమ్మ ఇంట్లో మొదటినుంచీ మడి గిడీ కొంచెం తక్కువే అవాలి. నంజమ్మ పైకి కనపడేలా అంతో ఇంతో చేసేది కాని లోపలేమీ పట్టింపులేదు. మట్టి చట్టిలో చారుచేస్తుంది. అన్నం చేసినరోజు వేడిచేయదని తప్పెంకంటే మట్టికుండ లోనే వండుతుంది. కాపులకైతే అది సరిపోతుంది. బ్రాహ్మలిలా చేస్తారా? నంజమ్మ పిల్లలెన్నో రోజులు మాదేవయ్య ఇచ్చినవన్నీ తినేవారు.

మూడవవాడు, వాలుగేళ్ళ విశ్వం, మాదేవయ్యగారు స్వజాతి ఇళ్ళల్లో జోలెలో భిక్షం తెచ్చిన దాన్ని ఆయన తొడమీద కూర్చుని ఎన్నోసార్లు భోంచేసేవాడు. అది తెలిసివున్నా నంజమ్మ పిల్లల్ని తిట్టి కొట్టి తప్పని చెప్పేది కాదు. ఇది తంగమ్మకు అనాచారమనిపించింది. సాతమ్మకూ అనిష్టంగా వుంది.

గ్రామ పురోహితద్వయమైన అయ్యాశాస్త్రుల, అణ్ణాజోస్యుల పెళ్ళాలయితే ఆచార వ్యవహారం, మడి, మైల అన్నీ పెట్టుకున్నవాళ్ళు. అణ్ణాజోస్యుల భార్య వాకిటుంటే మొగుడి కంటకూడా పడేదికాదు. వాకిటున్న నంజమ్మ దొంగచాటుగా వంటచేసేది. "మా పార్వతి చేసిందని వుత్తిత్తినే చెబుతుందండీ" అని అణ్ణాజోస్యుల భార్య వెంకటలక్ష్మి చెప్పేసరికి, మరోసారి వాళ్ళింటికెళ్ళరాదని తంగమ్మ నిశ్చయించుకుంది.(ఇతరజాతుల్లో ఆడాళ్ళు బయటుంటే ఆరోజే స్నానం చేసి లోపలికెళ్ళి వంటావార్పూ చేసుకుంటారు. బ్రాహ్మణులై ఇలా చేస్తే తక్కువ జాతులకంటే చెడిందేమి? థూ.)

ఒకరోజు తంగమ్మ, సాతు అణ్ణాజోస్యుల ఇంటికెళ్ళినప్పుడు జోస్యులే ఈ వూసెత్తారు. "పిత్రార్జితమైన ఆస్తి అవ్వాక అన్నదమ్ములిద్దరికీ సగభాగం రావాలిగా? కడమ ఆస్తి అయితే పోయిందనుకోండి. కరణీకం చెన్నిగరాయలొక్కడే అనుభవించడం, అప్పణ్ణయ్యకందులో ఏమీ లేదనడం న్యాయంగా లేదు. అన్నదమ్ములిద్దరికీ దాని పోటీగా పంచాలని గవర్నమెంటు రూలే వుంది. ఇలా ఎన్ని రోజులని మీకు మోసం చేస్తారు వాళ్ళు?"

తంగమ్మ చెవులు రిక్కించి విన్నది. తమకు చెందవలసిన దాని విషయంలో నోరెత్తకుండా తెలివితేటలు చూపెడుతున్న తోడికోడలు నంజమ్మపట్ల, సాతమ్మకు లోలోపల మెరమెర మొదలయ్యింది. "అంతా బూటకమావిడిది" మనసులోనే అనుకుంది.

"మీరు అప్పణ్ణయ్యకూ చెప్పండి. వాళ్ళివ్వమంటే తిపటూరికెళ్ళి తాసిల్దారు కాళ్ళమీదపడి అడుక్కుంటే ఇప్పించకేం జేస్తారు?" జోస్యులు సలహా ఇచ్చారు.

ఆరోజు అప్పణ్ణయ్య పల్లి నుంచి వచ్చాక సాతమ్మే అన్నీ చెప్పింది. "మనకు పిల్లా జెల్లా వున్నారు. పిత్రార్జితమైన ఆస్తి వాళ్ళకేమీ వద్దా? నూట ఇరవై పోటీగెలో సగమంటే, అరవై రూపాయలు రావాలి. పైగా సిరాకానుక మాటేమిటి?"

అప్పణ్ణయ్యకు బొమ్మా బొరుసు తెలియదు. కరణీకం, మునసబుగిరి, ఎప్పుడూ పెద్దకొడుక్కే చెందుతుందని అతడు విన్నాడు. చూశాడు. అయితే

గవర్నమెంటు రూలే ఇలా వుందని ఎరగడు. అణ్ణా జోస్యులకంటే తనకేం తెలుసు.రాత్రి పొద్దుపోయినా జోస్యులింటికెళ్ళి అడిగాడు. అన్నదమ్ములకంతా దాంట్లో సగం రావాలని చెప్పి "ఇన్నేళ్ళూ, అంతా వాళ్ళే కాజేసి, నీకుచేతికి చిప్ప ఇచ్చారు కదరా చవటా" అని ఆయన హితం చెప్పేసరికి అప్పణ్ణయ్యకగ్గిలో ఆజ్యం పోసినట్టయింది. నడకతో చిన్న పరుగు జతచేసి అన్నగారిల్లు చేరుకున్నాడు. చెన్నిగరాయలింట్లో లేడు. కిరసనాయిలు దీపంలో పార్వతికి, రామణ్ణకు పాఠం చెబుతూ కూర్చున్న వదినె ముందు నుంచుని అడిగాడు: "ఇలా దగా చేస్తేనే నొప్పుకోను. పోటిగెలో నాకూ సగం ఇచ్చి తీరాలి."

అతడిమాట నంజమ్మ కర్థం కాలేదు. "ఏపోటిగెలో? ఏం మీరంటున్నది?"

"కరణీకం బాబతు. మా నాన్నకు చెన్నయొక్కడే కాదు. నేనూ పుట్టాను. నా సగం నాకివ్వకపోతే తాసిల్దారు దగ్గిరకెడతాను, హుం" అన్నవాడు. అన్నయ్య మాదేవయ్యగుడిలో వుంటాడని అక్కడికి బయల్దేరాడు. దారిపొడుగునా "మా నాన్న నన్నూ పుట్టించాడు. నాకూ సంగోరు పోటిగె ఇవ్వాలి. నేను పల్లెపల్లె తిరిగి ముష్టెత్తడం, ఈ బోడికొడుకులు పోటిగె తింటూ సుఖంగా వుండటమూనా?" అని వీధిలో వాళ్ళంతా వినేలా తనకు తానే వాగుతున్నాడు.

అతడు మాదేవయ్య గుడికెళ్ళింది నంజమ్మకు తెలియదు. అదేమిటో పూర్తిగాఅడిగి తెలుసుకుందామని ఆమె అప్పణ్ణయ్య ఇంటికెళ్ళింది. అతడు లేడు. "అప్పణ్ణయ్య మాఇంటికి వచ్చి, మాకూ పోటిగె సగం రావాలని ఏవేవో కేకలేసి వెళ్ళాడు. ఏమిటి సమాచారం?" అని తోడికోడల్ని అడిగింది.

సాతు –"అన్నాదమ్ములన్నాక ఇద్దరికీ రావాలిగా? ఈయనకేమీ తెలీదని ఇన్నిరోజులూ మీరొక్కరే తినవచ్చా? ఈకాలంలో ఎవరినీ నమ్మటానికి లేదు" అంది.

"సర్కారు రూలు అలాలేదు. మీ కెవరు చెప్పారు? పోటిగె మాట ఇర్వై వస్తుంది. నిజమే. దానికయ్యే ఖర్చెంత? లెక్కల పుస్తకాలకి కావలసిన కాగితాలు సిరా ఖర్చెంత? కంట్లో వత్తులెట్టుకుని రాత్రుళ్ళు వేసి లెక్కలు రాసేదెంత? ఏదీ ఆలోచించకుండా అప్పణ్ణయ్య ఇలా రచ్చకెక్కి రాద్ధాంతం చేస్తూ వెళ్ళచ్చా?"

"లెక్కలు రాయటమెంత కావాలిస్తే నేనూ రాస్తాను. రెక్కాడితేగాని డొక్కాడదు."

ఇహమాట పెంచరాదని నంజమ్మ ఇంటికి వెళ్ళిపోయింది. చెన్నిగరాయలు గుడిలో లేడు. చెరువు కట్టవేపు వెళ్ళినవాడింతలో వచ్చి సంధ్యావందనానికి

కూర్చున్నాడు. పిల్లలు దీపం దగ్గిర పాఠాలు వ్రాసుకుంటున్నారు. సంధ్యావందనం చేస్తుండగా మధ్యలో పలకరించరాదని నంజమ్మ లోపలికెళ్ళి వంటిల్లు వూడ్చి, కంచాలు వేసి, దేవుడికి దీపం వెలిగించి ప్రదక్షిణ నమస్కారం చేసింది. అప్పణ్ణయ్య స్వభావమామెకు కొత్తది కాదు. కాని సాతు ప్రవర్తన ఆశ్చర్యంగా వుంది. మొగుడికి ఆవిడే చెప్పి రెచ్చగొట్టింది. ఆవిడకెవరు బోధించారో? ఎవరైనా కానీ ఆవిడిలా మారిపోరాదు. ఈ కాలంలో ఎవళ్ళకీ వుపకారం చేయరాదు. మనుషులకి వుప్పు తిన్న జ్ఞాపకమే వుండదు - అని ఆలోచిస్తూ వూరికే కూర్చుండిపోయింది.

ఇంతలో అప్పణ్ణయ్య మళ్ళీ వస్తున్న సందడి వినిపించింది. అతడి వెంట ఎవళ్ళో కొందరు వస్తున్నారు. ఆ వెనకాలే గంగమ్మ గొంతుక వినిపిస్తోంది. నంజమ్మ బయటికి వచ్చి చూసింది. అణ్ణాజోస్యులు, అయ్యాశాస్త్రులు, రేవణ్ణశెట్టి, గానుగశింగ, మాజీకరణం శివలింగ - అంతా ఒక పంచాయతీకి సరిపడ్డా జనం పోగయ్యారు. మునసబు శివేగౌడ మాత్రం రాలేదు. నడవలో కూర్చుని సంధ్యావందనం చేస్తున్న చెన్నిగరాయలు లేచి పంచపాత్రను వంటింట్లో పెట్టి, ధోవతి కట్టుకున్నాడు. నంజమ్మ బయటికి రావటమే తడవుగా గంగమ్మ గడగడా ప్రారంభించింది. "తతిమ్మా పొలంలో మాత్రం బామ్మ వాటా అంటూ కేటాయించరూ? పుణ్యాత్ముడాయనికి వీళ్ళిద్దరూ పుట్టారు. నిజమే, నాకు తాళే కట్టలేదా? పోటికలో నాకూ వాటా రావాలి. నువ్వే చెప్పు రేవణ్ణశెట్టి."

రేవణ్ణశెట్టి అన్నాడు. "వెనక కరణీకం చేసిన శివలింగణ్ణగారికంతా తెలుసు. ఆయనే న్యాయస్థానంలో కూర్చోనివ్వండి."

శివలింగ వెంటనే వచ్చి స్తంభం వద్ద కూర్చుని "ఏమంటావు చెన్నయ్యా?" అన్నాడు. చెన్నిగరాయలి కింతలో విషయం బోధపడ్డది. కాని ఏమి చెప్పాలో తెలియలేదు. "ఆమెనే అడగండి" అని భార్యవేపు చేయెత్తి చూపి తాను బ్రతికి బయటపడ్డట్టు కూర్చున్నాడు. "మీరే అదేమిటో చెప్పండమ్మా-" అని నంజమ్మ ముఖాన్నే ఎగాదిగాచూస్తూ చూస్తూ చెప్పి కాసేపయ్యాక "భయపడకండి" అన్నాడు.

అంతలో సాతు, తంగమ్మ, ఇద్దరూ వచ్చి వీధి తలుపు వద్ద నుంచున్నారు. నంజమ్మకు కోపం వచ్చి తిక్కరేగింది. "మిమ్మల్నిక్కడికి పిలిపించిందెవరు? అడ్డమైన వాళ్ళంతా తగువు తీరుస్తామని పిలవని పేరంటమొస్తారు. మీమీ ఇళ్ళ తగువులు మీరు తీర్చుకుని మర్యాదగా వుండండి. తగుదునమ్మాఅవి అన్నింట్లో

ముక్కుదూర్చకండి. లేచి వెడతారా లేక తగిన మర్యాద చేయమంటారా?" అని గద్దించింది.

అలాంటి ప్రతిఘటన వస్తుందని ఎవరూ అనుకోలేదు. గానుగ శింగ, పొరకేరి గురవయ్య మొదలైనవాళ్ళకు ఇందులో తలాతోక తెలియదు. "పంచాయతీ అవుతోంది రండి" అని అప్పణ్ణయ్య వీధిలో పిలుస్తూ వెళ్ళాడు. వాళ్ళువచ్చారు. ఎందుకొచ్చిన గొడవ. వూరి కరణీకం లెక్కలు వీళ్ళచేతిలో వున్నాయి. తమకెందుకీ తగవులని లేచి వెళ్ళిపోయారు. వాళ్ళువెళ్ళగానే తక్కినవాళ్ళూ తటపటాయించారు. "వూరికే మర్యాదగా లేచివెడతారాలేదా మీరు?" అని ఆవిడ మరోసారి రెట్టించిన గొంతుకతో అడిగేసరికి శివలింగ, రేవణ్ణశెట్టి మొదలైన వాళ్ళు లేచివెళ్ళిపోయారు. "అప్పణ్ణయ్యా! ఏ కొంపలు కూల్చేకొరివి చెప్పాడు మీ కిదంతా" అని నంజమ్మ మళ్ళీ అడిగింది. అప్పణ్ణయ్య మాట్లాడలేదు. కానీ ఆవిడలా అడగ్గానే అణ్ణాజోస్యులు పైకి లేచి "సంధ్యావందనానికి పొద్దుపోతోంది. మీమీ ఇంటి గొడవ. వూరికే జనాన్ని పిలవకూ అన్నా. అప్పణ్ణయ్య వూళ్ళో అందరిని పిలిచాడు. వీడి కెప్పుడువస్తుందో బుద్ధి?" అంటూ వెళ్ళిపోయాడు. అయ్యాశాస్త్రులు కప్పుకున్న శాలువా సర్దుకుంటూ ఆయన్ను వెంబడించాడు.

"అప్పణ్ణయ్యా, కరణీక మేనాటికైనా పెద్దకొడుకుదే. మీరు కావలిస్తే వెళ్ళి తిపటూరిలో అడిగిరండి" అని నంజమ్మ అన్న వెంటనే అతడుపైకి లేచాడు. పంచాయితీదార్లు జారుకున్నప్పుడే అతనికి నట్టేటముంచినట్టయింది. గంగమ్మమాత్రం "ఈ ముండనోరు చూడు. వూళ్ళో అందర్నీ నోరుమూయించి తరిమిందే. కానీ. నా వాటామాత్రం నేను వదులుకోను". అని అరుస్తూ లేచివెళ్ళింది.

భోంచేస్తూ చెన్నిగరాయలి విషయాన్ని గురించి ఏమీమాట్లాడలేదు. "చూశారా వాళ్ళనడత?" అని నంజమ్మ అడిగినదానికి "అంటే అనుకుంటారు" - అని తనకావిషయంతో సంబంధమేలేనట్టు మధ్యాహ్నపు చద్దిపులుసు వంపేసుకున్నాడు. ఆ రాత్రినంజమ్మకు సరిగా నిద్రపట్టలేదు. తన తోడికోడల్లో కలిగిన పరిణామాన్ని చూసి బాధగావుంది. ఒకవేళ వాళ్ళకి వాటా ఇవ్వాలేమో అన్న సందేహం మొలకెత్తింది. ఒకఅడుగు తిమ్మలాపురానికి వెళ్ళి దేవరసయ్యగారినడిగి రావాలన్న వూహ అర్ధరాత్రయ్యాక కలిగింది.

పెందరాళే మొగుణ్ణి లేపితే "నావల్లకాదు. నువ్వేవెళ్ళిరా" అని ముసుగు

తీయకుండానే చెప్పాడు. పార్వతి, రామణ్ణలనులేపి ముఖాలు కడిగి పేలపిండికలిపి ఇచ్చి వెంటతీసుకెళ్ళింది.

ఇటీవల, ఏళ్ళుదాటి దేవరసయ్యగారి ఆరోగ్యం బాగాలేదు. అంచేత ఆయన చిరుచలిలో లేవకుండా పడుకునే వున్నారు. వేకువజామునే వచ్చిన నంజమ్మను చూచి ఆశ్చర్యమేసిందాయనకు. రెండేళ్ళుగా ఆమె ఇక్కడికి రానేలేదు. స్వతంత్రంగా కరణీకంలెక్కలు నిర్వహిస్తోందని తెలిసి ఆయనకో తృప్తి, గర్వమూ రెండువుండేవి. ఆవిడ వచ్చిన పని తెలిశాక "దానిలో సందేహమేలేదు. నాకు బాగా తెలుసు. పెద్దకొడుక్కుమాత్రమే అధికారం. మహారాజావారి పట్టంకూడా అంతేకదా? రాజ్యాన్ని అన్నదమ్ములిద్దరికి పంచుతారా?" అన్నారు.

నంజమ్మ పిల్లలుస్నానం చేసి తిండి తిన్నాక మళ్ళీచెప్పారు. "నీ మనస్సు తృప్తిపడాలి. కంబనకెరె అట్టేదూరం లేదు. ఇక్కడికి మూడుమైళ్ళు. నీ వొక అడుగు అక్కడికేవేసి, రెవెన్యూ ఇన్స్పెక్టర్‌గారి నడుగు. తరవాత మనస్సులో ముల్లు తీసినట్టుంటుంది."

దారిచూపటానికాయన ఒక మనిషిని పంపారు. పిల్లల్నీ తీసుకుని ఎఫిర్కా కేంద్రం కంబనకెరెకి నడిచి వెళ్ళింది. రెవెన్యూ ఇన్స్పెక్టరామెకు తెలుసు. రామసంద్రానికి వచ్చినప్పుడల్లా ఆవిడే ఆయనకి సన్నబియ్యమన్నం, చారు, పచ్చడి చేసి వడ్డిస్తుంది. చాలా సాధువు. మంచివాడు. ఎప్పుడూ "అమ్మా" అనే పలకరించేవాడు. అంచేత పెద్ద భయమూ, జంకూలేకుండా వాళ్ళింటి కెళ్ళింది. ఈమెను చూడగానే ఆయనే పల్కరించాడు. "ఏమమ్మా! కరణీకం పొటిగెలో తమ్ముడికి వాటా ఇవ్వాలా అక్కరలేదా అని అడగటానికి వచ్చావా?"

నంజమ్మకు ఆశ్చర్యంవేసింది. అదిగ్రహించి ఆయనేచెప్పాడు. "అరగంట కూడా అవలేదు. నీ మరిది అప్పణ్ణయ్య, అతని భార్యా, వచ్చి వెళ్ళారు. నాతో మాట్లాడటాని కకిద్దరికీభయం. తలుపువెనకాలే చేతులుముడుచుకుని చాటుగా నుంచున్నారు. అణ్ణాజోస్యులు, శివలింగేగౌడ అనే ఇద్దరువాళ్ళతరపున మాట్లాడారు. నలుగురి మొహాన వుమ్మేసి పంపించాను. మీరేమీ బెంగెట్టుకోకండి. ఇది పెద్దకొడుక్కుమాత్రమే అని ఎవళ్ళకు తెలియదు? దీన్నడగడానికింత దూరం నడచి వచ్చారా?"

నంజమ్మ మనస్సు స్తిమితపడ్డది. "ఎండలో వచ్చారు. లోపలికెళ్ళండి". అని చెప్పి రెవెన్యూ ఇన్స్పెక్టర్ ఆమెను పెళ్ళానికప్పజెప్పాడు. అందరూ భోంచేశాక,

కాస్త ఎండవేడిమి తగ్గాక, ఆమె బయల్దేరడానికి రెవెన్యూ ఇన్స్పెక్టరు అనుమతించారు. ఆయన భార్య ఇంటికి వచ్చిన ముత్తైదువుకు రవికగుడ్డ, కొబ్బరికాయ పెట్టి తాంబూలమిచ్చి పిల్లలిద్దరికీ బెల్లపుండలిచ్చింది.

కంబనకెరెకూ రామసంద్రానికీ తిన్నగా వెడితే అయిదుమైళ్ళు. దారిలో పిల్లలు కాళ్ళులాగుతున్నాయని గొడవచేశారు. ఉత్సాహంగావున్న ఆమె పిల్లలకి కథలు చెబుతూ నవ్విస్తూ, ఇద్దరినీ చేయిపుచ్చుకుని నింపాదిగా నడిపించుకుని చీకటిపడకముందే వూరుచేరింది.

## 4

అప్పణ్ణయ్య పెళ్ళాంతో వేరే కాపురం పెట్టాక గంగమ్మకు ఒంటరితనం దుస్సహం కావటమేకాక, తన కడుపున పుట్టిన కొడుకే తన్ను దూరం చేశాడన్న విషాదం కలిగింది. ఈ పరాజయాన్ని ఎలా సహిస్తుంది? తల్లీకొడుకుల్ని వేరుచెయ్యాలన్న దృష్టితోటే పెద్దకోడలు వీడికి పాకవేసుకోవటానికి సహాయం చేసిందని వ్యాఖ్యానం చేసుకుంది.

అతడి అత్త, పెళ్ళాం పిల్లలు వచ్చి అప్పుడే సంవత్సరం మీద ఆరునెలలయింది. పల్లెలుతిరిగి, ముష్టెత్తి, జనం అనరానిమాటలన్నా పడి, అతనికి విసుగెత్తి పోయింది. ఒకరోజు 'కెంచీగౌడన కొప్పలి'లో కల్లేగౌడ ఇంటికి వెళ్ళాడు. కూర్చోమనకపోయినా తానే వేలమీద కూర్చుని, ఇన్ని రాగులిప్పించమని అతణ్ణి అడిగిందే తడవుగా గౌడ ముఖంమీదే అనేశాడు. "నీకేం తమాషాగావుందా? ఇప్పుడే మీ అమ్మొచ్చి పట్టుకెళ్ళింది. ఎనకాలే నువ్వు తయారా? రాగులేం తేరకొస్తున్నాయా? పొలంలో ఇరుసాలుదున్ను. రొండు సేర్లట్టు కెళ్దువుగాని."

అప్పణ్ణ కూర్చునేవున్నాడు. "వూరికే లేచి, వచ్చిందార్నెడతావా మెడట్టి అవతలికి గెంటమన్నావా?"

అప్పణ్ణయ్యకు దుఃఖంపొంగిపొర్లింది. ఇన్నాళ్ళూ అతడక్కడక్కడ ఇలాంటి మాటలు పడ్డాడుగాని మెడపట్టి గెంటేస్తామని ఇంతవరకూ ఎవరూ అనలేదు. ఎదురుగుండా పరిచిన పాతపంచె, పక్కనువ్న చిన్న గోనిసంచీ చేతికి తీసుకుని, లేచి బయటికి తానేవచ్చాడు. ఇంతలో అతనికి ఏడుపే వచ్చింది. కన్నీళ్ళు తుడుచుకుంటూ ముందుకు పది అడుగులు వేశాడో లేదో, ఒడినిండా రాగులు నింపుకుని ఎదురుగుండా గంగమ్మ వచ్చింది. ఇంత వయస్సు వచ్చిన కొడుకు

కన్నీళ్ళు కారుస్తూ ఏడవటం చూసి కన్నతల్లి పేగు కరిగింది ఆమె పలకరించింది. "అయ్యో నా చిట్టి తండ్రీ! ఏడుస్తున్నావెందుకురా?" అది వినేసరికి ఏడుపు మరింత ఎక్కువయింది. చివరికి జరిగిన సంగతి చెప్పి "కల్లేగౌడ ఇలా అనచ్చా?" అని అడిగాడు.

"అప్పణ్ణా రా. బసవన్న గుడిలో కూర్చుని మాట్లాడుకుందాం" అని కొడుకును తీసుకుని వూరిముందున్న గుడి అరుగుమీద కూర్చోబెట్టి చెప్పింది. "తల్లీ కొడుకూ ఇద్దరూ అడగటానికెడితే ఏమంటారు మరి? నువ్వెందుకొచ్చావురా ఇక్కడడగటానికి?"

"రాకపోతే జీవనమెలాగ?"

"అయ్యో! నీ తలరాత. ఓరి వెర్రినాగన్నా! నా కడుపున పుట్టి నువ్వు బతకడమెలాగని బెంగెట్టుకోవాలా? ఇన్నిరోజులూ నిన్ను దొరబిడ్డలా పోషించానుకదరా? పల్లెపల్లెతిరిగి ముష్టెత్తి ఆముండల్నింతాపోషించడం నీకేం ఖర్మరా? అందరికాళ్ళట్టుగుని ఆపసోపాలుపడుతూ కడుపుకు గంజిలేదని ముష్టెత్తి నువ్వింట్లో రాగులు తెచ్చిపడేస్తే, ఆ ముండలు దాన్ని అమ్మి సన్నబియ్యమన్నం, కందిపప్పుచారు పోసుకుని మెక్కుతున్నారు. దానికి తోడు కాఫీలట! కాఫీలు! ఆ ముండలు కట్టుకునే చీరలు చూడు. సీతాకొక చిలకల్లాగ రంగులు రంగులు. నువ్వు కట్టుకున్న బ్రహ్మకమ్మిపంచె చూడు చిరుగులు చిరుగులు. లంజముండకెంతసేపూ తన సుఖమేగాని మిండని సుఖంతో పనేమి?"

అప్పణ్ణయ్యకు తల్లిమాట నిజమనిపించింది. పెళ్ళాంపిల్లలురాక ముందు అతడెవరినీ దేహి అని చేయిచాపి అడగలేదు. అడగటం అమ్మవంతు వూరిబయట ఎక్కడో తిరుగుతూ పొగాకు వేసుకుని చివరికి తల్లిపోగుచేసిన దాన్ని గోనిసంచీలో నింపి మోసుకురావటమే తనవంతు. పైగా ఇద్దరూ మూణ్ణెల్లు ముష్టెత్తితే చాలు కడమతొమ్మిది నెలలూ హాయిగా కాలుమీద కాలేసుకుని తినవచ్చు. "నీ పెళ్ళామని దాన్ని పోషిస్తున్నావు సరే. సిగ్గులేకుండా వచ్చిగాదెకింద పందికొక్కులా తింటున్న ఆ అత్తముండనూ ఎందుకుపోషించాలి? ఎందుకు తెచ్చిపడెయ్యాలి?"

ఆ రోజు అప్పణ్ణయ్య ఇంకెవరింటికి యాచనకు వెళ్ళలేదు. అమ్మ పోగెట్టినవన్నీ తన గోనిసంచీలో నింపి, నెత్తిమీదికెత్తుకున్నాడు. బరువులు మోయడమేమీ అతడికి కష్టంకాదు. దారిలో గంగమ్మ అంది. "ఆ మాదేవయ్యంటే సామాన్యుడా, కన్నతల్లికే కంచెల విప్పే తల్లికిమొగుడు. వాడేదో అబద్ధాల ప్రమాణం చేయించాడని

నువ్వు నమ్మెయ్యడమే? నువ్వు వాళ్ళూరికి ఒకసారైనా వెళ్ళావోలేదో. ఆ కుర్రాడు నీకేవ్వుట్టాడనీ, దాని కప్పుడే కడుపొచ్చిందనీ ఎలా తెలుసు?"

అప్పణ్ణయ్య ఏమీ మాట్లాడకుండా బరువు మోసుకుని వస్తున్నాడు. వూరు దగ్గరకు రాగానే గంగమ్మ అంది "నువ్వూరికే వాతోటి రా. ముందున్నట్టే సుఖంగావుండు.

కొడుకు మళ్ళీ తల్లి ఇంటికెళ్ళాడు. అతడేపనీ చేయలేదు. పడుకుని నిద్రపోయాడు. గంగమ్మ నీరుల్లి, ఒకవెల్లుల్లిపాయ నూరివేసి, గుత్తితో రుద్ది అనపగింజల ముద్దపప్పుచేసి, వేడివేడిగా రాగిపిండి వుడికించి ముద్దలు కట్టి కొడుకును లేపింది. భోజనానికి కూర్చుంటే అతడికి పద్దెనిమిది నెలల కిందటి స్వర్గమే ఎదురుగుండా వచ్చినుంచుంది. అతడికి మొదటినుంచీ ముద్ద అంటేనే ఇష్టం. అనపగింజలతో చేసిన ముద్దపప్పుకంటే గొప్పవంట ప్రపంచంలో ఏముంది? అతడి పెళ్ళాంకాని, అత్తకానీ ఒకరోజైనా ఇంట్లో ముద్ద వుడికించి పడేయ్యలేదు. అనపగింజలు వాయువట! అలగాజనంతింటారట! "భాంచోత్ ముండలు" - అని మనస్సులోనే తిట్టుకుని, గరిటెల కొద్దీ ముద్దపప్పేసుకుని దంచాడు.

ఆరోజునుంచీ పెళ్ళామింటికి అతడు వెళ్ళలేదు. మొదటిరోజింకా పల్లెనుంచీ రాలేదేమో అనుకున్న వాళ్ళకి అతడు తల్లిగారింట్లో మకాంపెట్టాడని తెలిసింది. తామే వెళ్ళి పిలిచే పరిస్థితి లేదు. మూడవరోజు, కుర్రాణ్ణి రామకృష్ణని పంపితే హనుమంతరాయుని గుడికి తాళం వేసివుంది. తల్లీకొడుకు మళ్ళీ పదిహేనురోజులూరికి రాలేదు. అమ్ముదామంటే ఇంట్లో రాగులు లేవు. వున్న బియ్యం అయిపోయాయి. కాఫీపొడి లేదు. చెరువుకింది బెల్లపు గానుగ వద్ద వంటదించుతూండగా, జయలక్ష్మి రామకృష్ణలు వెళ్ళి అడిగితే ఇచ్చిన బెల్లపు వుండలేమో వున్నాయి. కానీ వట్టి బెల్లంతో కాఫీకాదుగా. ఇప్పుడప్పణ్ణయ్యా, గంగమ్మా ఏకమయ్యారని వీరికంటే ముందు వూళ్ళో వాళ్ళకే తెలిసింది. అంగట్లో అరువు పుట్టదు. ఏంచేయాలి? పస్తుండలేరుకదా? కాఫీలేక తలనొప్పి, తాగితేగాని పోదు. ఇంట్లోవున్న పెద్ద వెండిగిన్నె తీసుకుని వెళ్ళి కాశింబట్టి షావుకారువద్ద తాకట్టుపెట్టి రెండురూపాయలు తెచ్చారు. ఒకరూపాయికి ఎనిమిది సేర్ల బియ్యం, రెండణాలిచ్చి కాఫీపొడి, అణాకిపాలు ఇంటికి వచ్చాయి.

అప్పణ్ణయ్య తల్లితోటి వూరికి వచ్చినా పెళ్ళామున్న ఇంటికి రాలేదు. నాలుగవనెల నడుస్తున్న సాతు రామకృష్ణని పంపింది. "వాడు రావటానికి లేదు.

అది ఎవణ్ణుంచుకుని నిన్ను కనిందో వాణ్ణే తెచ్చిపడెయ్యమని అడగండి" అని గంగమ్మ కుర్రాడితో చెప్పిపంపింది.

కుర్రాడింటికెళ్ళి తూ.చా. తప్పకుండా తల్లికి చెప్పాడు. పాతమ్మకు కోపంవచ్చింది. ఆమె తల్లి తంగమ్మ అట్టుడికినట్టుడికి పోతోంది. 'అమ్మా! నీవేమీ జోక్యం కలిగించుకోకు' అని కూతురు చెప్పినా వినకండా, అవిడే హనుమంతరాయని గుడికెళ్ళి "ఇన్ని రోజులుగా ఇంట్లో తిండికిలేదు. పెళ్ళాం పిల్లల్ని పోషించలేని వాడి భాగ్యానికెందుకు పెళ్ళిచేసుకోవాలి?" అని అడిగింది.

"రంకులాడి పెళ్ళాంతో నా కొడుకు కాపురం చేయడే జోస్యులపెళ్ళామా?" గంగమ్మ వూదరగొట్టింది.

"నా కూతురెందుకు రంకులాడవుతుంది. నువ్వే నీ కొడుకును రంకుపోయి కన్నావేమో! మేమేదో మర్యాదచూపితే నీకుక్కబుద్ధి పోనిచ్చావుకావు" అని తంగమ్మ చెబుతూవుండగానే పాతు అక్కడికి వచ్చింది. "అమ్మా! నీ కెందుకీ గోల? వాళ్ళేమైనా అనుకోనీ వాళ్ళన్న పాపం వాళ్ళనే కొడుతుంది" - అని ఆమె తల్లిని శాంతింపజేస్తూ వుండగానే గంగమ్మ, "అప్పణ్ణయ్య విన్నావట్రా ఈ వంగనాచి మాటలు! వెనకనించి చెప్పిపంపి ఇప్పుడు వేదన్నది పాపమంటుంది. మొగుడు లేనప్పుడు, కడుపొచ్చి పిల్లాణ్ణి కనేది పాపంకాదేమిట్రా?" అంటూవుండగానే అప్పణ్ణయ్య గాలిదుమారంలా లోపలనుంచీ దూసుకవచ్చి "వుమేవ్! నిన్ను జోడుచ్చుక్కొడతాను చూడుముండా. నీవేషాలు నాకు తెలీవనుకున్నావేమే?" అని అడిగాడు. ఆ గాండ్రింపుకు బెదిరి తంగమ్మా, పాతు ఇద్దరూ తమ ఇంటివేపు పరుగెత్తారు. గంగమ్మ "అలాచూస్తావేట్రా! దాని తాళి తెంచి, తన్ని తరమరా వూరొదిలిపోయేలా. నువ్వు కట్టినిల్లు నిప్పెట్టి అంటించరాదాన్ని! అంది

అప్పణ్ణయ్య వాళ్ళని తరుముతూ వెళ్ళాడు. ఇంటి ద్వారబంధం పొట్టిగా వుంది. వంగిలోపలికి వెళ్ళేలోపుగా పెళ్ళాం మెడమీదికి అతడి చెయ్యి వెళ్ళింది. వెనకనుంచి చేతికందిన నల్లపూసల మాంగల్యాన్ని పట్టి గబుక్కున లాగేసరికి దారంతెగిపోయి నల్లపూసలు నేలమీదరాలి చిందరవందరగా పడ్డాయి. మాంగల్యం, బంగారుపూసలు దారానికే తగుల్కొని వున్నాయి. మెడకు కుడివేపు కోసుకునిపోయి రక్తం వచ్చినపాతు "అయ్యయ్యో" అని అరుస్తూ కిందపడి వుండచుట్టుకపోయింది. అప్పణ్ణయ్య తిన్నగాలోపలికి దూరాడు. వంటింటి పొయ్యిమండుతోంది. ముందే కొరివి పుచ్చుకుని ఎత్తి చూరుమీది ఆకు కప్పుకంటించాడు. ఆకంటుకుంది.

పొగచుట్టుకొని పైభాగంలో మంట కనిపించింది. అంతలో ఈ దెబ్బలాట వివి వీధిలోనికి వచ్చిన జనం పొగయ్యారు.

"మా ఇంటి సామానంతా కాలిపోతోంది బయటికి లాగండ్రా"- అని తంగమ్మ అరిచింది. లోపలికి దూరిన జనం చేతికిదొరికిన పాత్రలు, బట్టలు, మంచం, పీటలు, పెట్టెలు, తిరగలి - అన్నీ గబగబాతెచ్చి దూరంగా బయట పడేశారు. కొబ్బరాకు కప్పిన పాకకి నీళ్ళుచల్లి ఆర్పడం సాధ్యంకాదు. దరిదాపుల్లో నీళ్ళూలేవు. పద్దెనిమిది నెలలక్రితం అప్పణ్ణయ్యే గునపమూ పికాసిపారా పట్టి, మట్టికలిపి, గోడలేపి ఆయాతోటల్లో తెచ్చిన కొబ్బరిమట్టలు తెచ్చి కట్టిన ఇల్లు అరగంటలో కాలి బూడిదైపోయింది. నాలుగువేపులావున్న గోడలు, రెండురాతిస్తంభాలు మాత్రం మంటల్లో మాడి నల్లగా మసికొట్టుకుని నిలబడ్డాయి.

"మాశావాముండా! ఏంచేశానోనేను"- అని అప్పణ్ణయ్య పులిలా గాండ్రించాడు.

"నీ చేతులు పడిపోను" అని తంగమ్మ శపిస్తోంది. లేచి దూరంలో మంచున్న సాతు -"అమ్మా! నామీద ఒట్టు. నువ్వేమీ మాట్లాడకు" అంది.

చేతిలో వున్న మాంగల్యాన్ని పైకెత్తి - "ఆ ముండ తాళి తెంచాను. అది నా పెళ్ళాంకాదు. నేను దాని మొగుణ్ణికాను. రంకులాడి" అని అరుస్తూ అప్పణ్ణయ్య వీధులు సందులు అన్నీ ఒకసారి తిరిగేశాడు.

ఇంటికి నిప్పంటుకున్నప్పుడు నంజమ్మకూడా పరుగెత్తివచ్చింది. తలిమ్మా వాళ్ళతోపాటు ఆమెకూడా లోపలికి దూరి దొరికిన సామానులాగి బయట పడేసింది. తరవాత ఏంజేయాలో, ఏం చెప్పాలో ఆమెకూ తెలియలేదు. సాతు దగ్గిరగావచ్చి 'అక్కా! మాకు మీరే దిక్కు' అంది. వాళ్ళకు తానెలాంటి 'దిక్కు' కాగలదో ఆమెకు బోధపడలేదు. ఈ సమయంలో అప్పణ్ణయ్యను పలకరించడం వివేకం కాదని ఆమెకు తెలుసు. గంగమ్మతో మాట్లాడడం అసంభవం.

"నేనేం చేయాలి నువ్వే చెప్పు" - ఆమె అడిగింది.

"ఒకటి రెండురోజులు మీ ఇంట్లో వుంటాం. తరువాత సంగతి ఆలోచిద్దాం".

"కాదు" అవడానికి నంజమ్మకు నోరురాలేదు. "ఈ సామాను మా ఇంటికి చేర్చండయ్యా!" అని ఇంకా అక్కడే వుండిపోయిన కొందరితో చెప్పింది. వాళ్ళతోటి ఆవిడా కొన్ని పట్టుకొచ్చింది. అన్నీ తెచ్చి ఇంటి ముందు మూలలో పడేశారు. నంజమ్మ వంటింట్లోకి వెళ్ళింది. వాళ్ళు రాగిపిండి తినరు. పండుగ పబ్బానికని దాచిన బియ్యం తీసి కడిగి అత్తెసరు పెట్టింది. ఇంట్లో కందిపప్పులేదు.

వాయుగుణాలిచ్చి పార్వతితో సేరు కందిపప్పు తెప్పించింది.

వీళ్ళందరూ మళ్ళీ పెద్ద కోడలింటికి వెళ్ళేసరికి గంగమ్మకు చిర్రెత్తింది. "అది మాయలాడి ముండ. మళ్ళీ ఏమైనా చేసి నాచిట్టి తండ్రిని వలలో పడేస్తుంది". అన్న వూహ కలిగింది. వెంటనే అణ్ణాజోస్యుల ఇంటికెళ్ళి అడిగింది "జోస్యులుగారూ! విన్నారాసంగతి?"

"ఏమిటి! తెలియదే" – గంగమ్మ ద్వారా గోరంతలు కొండంతలుగా రసవత్తరంగా వినాలని జోస్యుల కోరిక.

పెళ్ళాం తాళితెంచిన కొడుకు ప్రతాపాన్ని కళ్ళకు కట్టేలా వర్ణించి చెప్పిన గంగమ్మ అడిగింది "తాళి తెంచినదాన్ని అది తనింట్లో వుంచుకుందికదా, న్యాయ పంచాయతీ చేసి దాన్ని వెలివెయ్యక్కరలే? మీరే చెప్పండి."

ధర్మశాస్త్రంలో కొత్తపాయింటు జోస్యులకు సూచించినట్టయింది. నంజమ్మను పంచాయతీచేసి కనీసం పాతికరూపాయలైనా చేసిన తప్పుకు దండుగ చెల్లించేలా చేయాలని పన్నాగం పన్నుతున్నాడు. కానీ పోటిగెలో వాటా ఇవ్వాలని చేయబోయిన పంచాయతీలో ఆమె పెట్టిన చీవాట్లూ, మరుసటిరోజు రెవెన్యూ ఇన్స్పెక్టరు తమకు చేసిన ముఖ ప్రక్షాళనమూ గుర్తొచ్చి, కాసేపు వెనకంజవేశాడు. అప్పుడవమానం జరిగింది. ఇప్పుడా దెబ్బతీర్చుకోవాలని ధైర్యం తెచ్చుకుని ఒక నిశ్చయానికి వచ్చాడు. అక్కడే కూర్చొమ్మని గంగమ్మకు చెప్పి, తన బాబాయి అయ్యాశాస్త్రిగారింటికి వెళ్ళాడు. ఇటువంటి అవకాశాలలో ముసలి శాస్త్రి వూరికే వుండే ఘటంకాదు. ఇది బ్రాహ్మణుల సమస్య. బ్రాహ్మణధర్మం వుండాలా మంటగలవాలా?

ఈ ఇద్దరు ధర్మపాలకులు వూళ్ళోని కడమ నలుగురి బ్రాహ్మణులనూ కూడగట్టుకుని నంజమ్మ ఇంటికి వచ్చారు. వెనకాలే గంగమ్మా, అప్పణ్ణయ్య వచ్చారు. వీళ్ళంతా ఏదో న్యాయవిచారణకు వచ్చారని వెంటనే నంజమ్మ గ్రహించింది. అణ్ణాజోస్యులే ప్రారంభించాడు. "మాంగల్యంపోయిన ఆడది విధవతో సమానం. అయినా మొగుడుండి విధవ కావడమెలాగ? అంచేత ఆవిడ బతికినా చచ్చినదానితో సమానం. అలాంటి వాళ్ళ ముఖదర్శనం కూడా చేయరాదు. అలాంటిదాన్ని మీరింట్లోకి రానిచ్చి తప్పుచేశారు. ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. తప్పుదానికి దండుగ గిచ్చుకోవాలి."

చెన్నిగరాయులీమాటలు విని భయపడ్డాడు "నాకేం తెలవదండీ; ఈవిడే

వాళ్ళందర్నీ తీసుకొచ్చింది. కావలిస్తే నేనిప్పుడే వీళ్ళని మెడపెట్టి అవతలికి గెంటేస్తాను."

"అయితే ఆక్షేపణలేదు. కాని ఇప్పుడింట్లో వుంచుకున్నందుకు మాత్రం దండుగేమో ఇచ్చుకోవాలి."

"ఎంతివ్వాలి?"

"ఎంతటాబాయి?" అణ్ణాజోస్యులడగ్గా అయ్యాశాస్త్రులు, "పాపం వాళ్ళూ బీదవాళ్ళు. పాతికయితే సరిపోతుంది" అన్నాడు.

"ఇంతడబ్బు ఎక్కణ్ణుంచీ తెస్తామండిమేము? కాస్త తగ్గించండి శాస్త్రుల్లుగారూ?"

"డబ్బేం మాబాబు ఇంటికి వెడుతుందనుకున్నావా? శృంగేరి మఠానికి చేరేద్రవ్యం."

మరి మాట్లాడడానికి వీలేలేదు. చెన్నిగరాయలు పెళ్ళాం వేపు తిరిగి "నీకెందుకే ముండా ఈ పెత్తనం? ఈ అప్రాచ్యులవంతా ఎందుకు తీసుకొచ్చావు? వాళ్ళనిప్పుడు మెడట్టి గెంటేస్తావా లేదా?" అని కసురుతున్నాడు.

అందాకా వంటింటి తలుపువాటున నిలబడి అంతా వింటున్న తంగమ్మ బయటికి వచ్చి అడిగింది. "ఇన్ని రోజాలూ మాకు అప్పుల్లా వున్నారు. ఇప్పుడెందుకిలా చేస్తున్నారు జోస్యులు గారూ? మేమేం జేశాం మీకు?"

"మిమ్మల్నిచూస్తే మాకేం ద్వేషం కాదమ్మా. ధర్మశాస్త్రమలా వుందిమరి. చూపిచూపి మేమూరుకుంటే శృంగేరిమఠంవాళ్ళు మమ్మల్ని వూరికే వదుల్తారా?" అణ్ణాజోస్యులు సమాధానం చెప్పారు.

ఇంతదాకా వూరుకున్న నంజమ్మ సూటిగా అడిగింది. "తాళితెంచింది అప్పణ్ణయ్య. పెళ్ళాంతాళి తెంచే అధికారం శాస్త్రంలో ఆయన కిచ్చారా? దుండుగవేయాలంటే ఆయనకే వేయండి. కొంపకాలి వీధిలో పడ్డ ఆడాళ్ళని ఇంట్లో తలదాచుకోనివ్వక ఏంచేయాలి చెప్పండి? ఈ కష్టకాలంలో ఒకపూట సహాయం చేయరాదని రాసిందా మీ ధర్మశాస్త్రంలో?"

ఇద్దరు ధర్మపాలకులూ అస్తవ్యస్తమయ్యారు. ఈ చుప్పనాతి, మాయదారి కోడలు తనకొడుకుమీదకే కుంపటి దొర్లిస్తోందని మసిగట్టిన గంగమ్మకు ఇదిబ్బందిగానే వుంది. "వాడు కట్టిన తాళివాడు ..." అని ముసలి అయ్యాశాస్త్రులేదో చెప్పబోతుండగా, అర్ధాంతరంగా ఆపి, "బాబాయి! మీరూరుకోండి. మనువ్వకట్టినతాళి వాకక్కరలేదని ఆవిడే తెంచేసిందట! అవునా గంగమ్మా?" అని అణ్ణాజోస్యులడిగారు.

"హూం, హూం! ఆ ముండే నాకీ తాళి అక్కరలేదని తెంచి పారేసింది."

"అన్యాయంగా అలా ఎందుకంటారు? అలాగని ప్రమాణం చేస్తారా మీరంతా?" అని తంగమ్మ అడిగేసరికి, గంగమ్మ "వూరంతా చూసిన దానికి ప్రమాణ మెందుకే చువ్వాతి?" అని ఐదులు ప్రశ్నవేసింది.

ఇలాగ న్యాయం ఎక్కణ్ణించి ఎక్కడికో వెళ్ళింది. వీళ్ళతరుపున దబాయించి అడిగే మగాడుంటే మరోలానడిచేది కథ. అది గుర్తించిన నంజమ్మ అంది, "జోస్యులుగారూ! ఏం జరిగిందో మీరు కళ్ళారా చూడలేదు. వుత్తుత్తినే లోకువకట్టి, కాట్లుముడేసి, పోట్లాటపెట్టి తమాషా చూస్తున్నారా మీరు? ఇది పరువున్నవాళ్ళు చేసేపనికాదు. మిమ్మల్నెవరూ పిలవలేదు. వూరికే లేచివెళ్ళిపోండి. ఇహమీదట పిలవకుండా మా ఇంటికి న్యాయం, గాడిదగుడ్డు అంటూరాకండి."

"చూశారా జోస్యులుగారూ. ఈ ముండ అహంకారం–అని గంగమ్మ అంటూ వుండగానే, అందాకా వంటింటి తలుపుచాటున నుంచున్న సాతు దగ్గిరగావున్న చీపురుకట్ట తీసుకుని బయటికివచ్చి, "ఈ పాడుముండమూలాన్నే ఇంత రాద్ధాంతం జరిగింది"– అని చీపురుకట్టగంగమ్మ ముఖంమీదపడేలావిసిరింది. గంగమ్మ కాసేపు మూగబోయింది. అప్పణ్ణయ్య చురచుర చూస్తూ పైకిలేచాడు. పరిస్థితి విషమించక ముందే నంజమ్మ కంగారుగా, తంగమ్మను సాతును వంటింట్లోకి పంపి తలుపుచేరవేసి అడ్డంగా నుంచుని చెప్పింది. "మీరంతా లేచి బయటికెడతారా లేదా?"

జోస్యులిద్దరూ తోకముడుచుకుని వెళ్ళిపోయారు. ఈ వ్యవహారంలో తమ జోక్యమేమీ లేదన్నట్టు తతిమ్మా బ్రాహ్మలు వెంటనే లేచారు. ఇంతలో గంగమ్మ వాలిక కాస్త వేడిక్కింది. మూలలోవున్న రోకలిపుచ్చుకుని ఆవిడ వంటింటి వేపు దూసుకువెళ్ళింది. అడ్డంగా నుంచున్న నంజమ్మ– "మా ఇల్లంటే ఏమనుకున్నారు. కరణీకం ఇల్లు. మీరేమైనా గొడవ చేశారంటే రెవెన్యూ ఇన్స్పెక్టర్‌తో చెప్పి, పోలీసుల్ని పిలిపిస్తాను" అని దబాయించింది. గంగమ్మకూ కాడా గాబరా అయింది. అప్పణ్ణయ్యకు దడపట్టుకుని చెమటపట్టింది. "రామ్మా! ఎందుకీ గొడవ" అని తల్లిచేతిలోవున్న రోకలిలాక్కుని అవతల పెట్టి అతడు బయటికి వెళ్ళిపోయాడు. వెంటనే వెడితే పరువునష్టమని గంగమ్మ మళ్ళీ నాలుగుతిట్టి మరీవెళ్ళింది.

అన్నమూ చారూ సిద్ధంగా వున్నా సాతు, తంగమ్మ భోంచేయలేదు. ముముందు జీవనోపాధి ఏమిటి అన్న సమస్య వాళ్ళని వేధించుకు తింటోంది. ఆ రోజు మధ్యాహ్నంనుంచీ జరిగిన సంఘటనవల్ల వాళ్ళిద్దరికీ నోటమాటరాలేదు.

## 5

రాత్రంతా తల్లీకూతురుఏదో మాట్లాడుకున్నారు. తెల్లారిలేవగానే తంగమ్మ నంజమ్మతో అంది. "ఇహ ఈ వూళ్ళో వుండి లాభమేమి? వూళ్ళోమాది అంటూ ఒక ఇల్లు వుండేది. ఇక్కడికి రావటాని కారునెలల క్రితం దాన్ని అమ్మేశాం. ఇప్పటికీ పౌరోహిత్యపు పల్లెలున్నాయి. రామకృష్ణునికెలాగూ ఎనిమిదేళ్ళువచ్చాయి. అక్కడే ఎవళ్ళతోనైనా జందెపుపోగు వేయించి, పుణ్యాహవచనం, నవగ్రహదానం వంటివైనా చెప్పిస్తే పొట్టగడుస్తుంది. ఎవళ్ళయినా పుణ్యాత్ములజాగాలో పాకేసుకుంటాం."

నంజమ్మ వాళ్ళకెలాంటి సలహా ఇవ్వగలిగిన పరిస్థితిలో లేదు. ఈ తల్లీకూతుళ్ళకిద్దరికీ కష్టపడి పనిచేసి, బీదవాళ్ళ ముద్ద, రొట్టె తినే అలవాటు లేదు. అలవాటు చేసుకుందామన్న ప్రయత్నమూలేదు. అది చేసి వుంటే అప్పణ్ణయ్య ఇలా చేసి వుండేవాడు కాదేమో! వాళ్ళు తమవూరి కెళ్ళినా ఈ అగచాట్లు తప్పవు. కానీ తానేమిచెప్పడానికీ లేదని గ్రహించిన నంజమ్మ వాళ్ళు చెప్పినదానికి తలవూపింది. వూరు వదిలి ఎప్పుడు వెడదామా అని వాళ్ళు తహతహలాడుతున్నారు. సాతు, తనదుద్దులు తీసి అమ్మడానికి బయల్దేరింది. ఆ సందులోనే ఒకావిడ పాతిక రూపాయలిచ్చికొన్నది. దారి ఖర్చుకవుతుంది. ఆరోజు నంజమ్మ పాయసం చేసింది. మరుసటిరోజు సాతుకీ జయలక్ష్మికీ కుంకుమపెట్టి బండికట్టించి వాళ్ళసామానంతా ఎత్తించి, తామకూడా బస్సు వచ్చేరోడ్డుదాకా వెళ్ళింది. తిపటూరి వేపు వెళ్ళే మొదలియారు మోటారు కాసేపటిలో వస్తుందనగా సాతు కన్నీళ్ళు తుడుచుకుంటూ అంది. "అక్కా! ఈ ఇంటికి కోడళ్ళుగా మనమిద్దరమూ వచ్చాం. మీరెలాగో వేగుతున్నారు. నా తలరాత ఇలా అయింది."

నంజమ్మ దానికేమీ అనలేదు. పెళ్ళై తానీవూరికి వచ్చినప్పటినుంచీ జరిగినవన్నీ ఆమెమనస్సులో ఒక్కొక్కటే వరుసగా వచ్చి నిలబడ్డాయి. మేమెందుకు పుట్టామో? ఇలాంటి ఇంటికెందుకు వచ్చామో? అన్న ప్రశ్నలామె మనస్సులో తలెత్తుతున్నాయి. మోటారు టాపుమీద సామాను వేయించాక వాళ్ళు వెళ్ళి లోపల కూర్చున్నారు. "మావూరికి మీరొకసారి రావాలి"- అని చెప్పినప్పుడు మళ్లీ ఒకళ్లనొకళ్ళు కలుసుకుంటామన్న నమ్మకం వాళ్ళిద్దరిలోనూ లేదు.

ఖాళీ బండిలో కూర్చుని నంజమ్మ ఇంటికి వచ్చాక కాసేపటికి నూరొప్ప

మాష్టారు భార్య రుక్కమ్మ వచ్చింది. అదీ ఇదీ మాట్లాడాక మెల్లిగా చెప్పింది. "మీకు వెలి వేయించాలని అణ్ణాజోస్యులు శృంగేరికి వుత్తరం రాశారట."

రాసి ఏంజేస్తారట?"

"అయ్యో ! మీకు తెలవదా? వీళ్ళింటికెవళ్ళూ పోరాదు. రారాదు. నీళ్ళుగానీ నిప్పుగాని ఇవ్వకూడదు, అని మఠం నుంచీ శ్రీముఖం వస్తుంది. సాటికులవం వాళ్ళు వెలివేస్తే బతకడమెలాగ?"

ఆ మాటలు విని నంజమ్మకు కాస్త గాభరా అయింది. కానీ సాటికులంవాళ్ళు తనకు చేస్తున్న వుపకారమేమిటి? ఎవళ్ళూ ఇంటికి రాకపోతే మరీ మంచిది. అనుకుని వూరుకుంది.

పదిహేను రోజులయ్యాక, ఒకరోజు అణ్ణాజోస్యులు, అయ్యాశాస్త్రులు నంజమ్మ ఇంటికి వచ్చి ఆమెచేతికొక కాగితమిచ్చారు. శృంగేరి సంస్థానపు సర్వాధికారుల సంతకంతో వచ్చిన దానిలో "తనకు భర్త అక్కరలేదని మాంగల్యం తెంచిపారేసి వెళ్ళిన స్త్రీని ఇంట్లో చేర్చుకున్న కరణం చెన్నిగరాయల సంసారాన్ని వెలివేయడమైనది. శ్రీమఠానికి నూట ఒక్కరూపాయి తప్పుదండుగ ఇచ్చి, దర్భతో నాలుక కాల్చుకుని స్థానిక పురోహితులచేత ప్రాయశ్చిత్తం చేయించుకునేదాకా ఎవళ్ళూ నీరు, నిప్పు సంబంధం వుంచుకోరాదు. ఎవళ్ళయినా దీనికి విరుద్ధంగా నడిస్తే వాళ్ళను కూడా వెలివేసి శ్రీమఠానికి తెలుపవలసింది"- అని వ్రాసి మఠం ముద్రవేసి వుంది.

ఆమె చదివాక అయ్యాశాస్త్రులు "ఏం చేస్తావు?" అన్నాడు

"ఇవ్వేళ్ళూ శ్రీరామనవమికి పానకం పణ్యారం చేసి మీకంతా ఇచ్చేదాన్ని. ఇకమీద ఇవ్వటానికి లేదు"- అని నంజమ్మ అంది.

"ఇస్తే మేము రాముగా."

"అది మీ సంతోషం."

"రాజా నెదురించి నెగ్గకురావచ్చు. ఆచార్యపీఠాన్ని ఎదురించి బతకడం కష్టం తెలుసుకో" అని ఇద్దరూ చెప్పి వెళ్ళిపోయారు. నంజమ్మకు దీనివల్ల అవమానమనిపించింది. కాని భయం వేయలేదు. మరుసటి రోజు కూర్చుని జరిగిన సంగతంతా వివరించి, తల్లిమాటవిని మొగుడే పెళ్ళాం మాంగల్యం తెంచాడనీ, ఆమె తప్పేమీ లేదనీ, దిక్కులేని స్త్రీలను తామొక రోజు ఇంట్లో వుంచుకుని వూరికి పంపింది నిజమనీ, దీనిలో తమ తప్పేమీ లేదనీ వ్రాసి,

దానిమీద భర్త సంతకం చేయించి, సోమవారం పోస్టుమాన్ వచ్చినప్పుడు కవరు తీసుకుని, అతని చేతే అడ్రస్సు వ్రాయించి, పంపింది. కానీ ఎన్నిరోజులైనా మఠంనుంచీ ప్రత్యుత్తరమే రాలేదు.

పుష్యమాసంలో ఆమె మామగారి శ్రాద్ధం. ఇంతవరకూ జేష్ఠపుత్రుడు చెన్నిగరాయని ఇంట్లోనే జరిగేది. ఏ ఖర్చూ లేకుండా అప్పన్నయ్య ఇక్కడికే వచ్చి శ్రాద్ధం ముగించుకుని వెళ్ళేవాడు. 'ప్రాచీనావీతి' వేసుకునే బాధ్యత పెద్దకొడుకు చెన్నిగరాయలది. 'పవిత్రం' పెట్టుకుని వూరికే కూర్చుని జోస్యులు చెప్పినప్పుడు నమస్కారం చేయడమే తమ్ముడి కర్తవ్యం. వేరే కాపురం పెట్టాక కొన్నేళ్ళు గంగమ్మ భర్త ప్రసాదానికి కూడా ఈ ఇంటికి రాలేదు. తరువాత, ఈ ఒక్కరోజు మాత్రం వచ్చివెళ్ళేది. ఈ ఏడు, వాళ్ళని వెలివేశారు గనక శ్రాద్ధం చేయించడానికి కాని, నియంత్రణకిగానీ తాము రామని జోస్యులిద్దరూ మొదలే చెప్పారు. చెన్నిగరాయలిబ్బందిలో పడ్డాడు. దీనికంతా కారణమెవరు? పెళ్ళామేకదా? "వాళ్ళనెందుకు రానిచ్చావే గాడిదముండా?" అని పెళ్ళాన్ని తిట్టాడు. ఆవిడ జవాబు చెప్పకుండా వూరుకుంది. పెళ్ళాన్ని తిడితే సమస్య పరిష్కారం కాదు.

ఈసారి రామన్న శ్రాద్ధం గంగమ్మ వున్న దేవాలయంలోనే చేసేలాగా, అప్పన్నయ్యే 'ప్రాచీనావీతి' వేసుకునే లాగూ పురోహితు లిద్దరూ నిశ్చయించారు. 'ప్రాచీనావీతి' వేసుకోవడమంటే ప్రాధాన్యం వచ్చినట్టు. తానూ గణించదగ్గ వ్యక్తి అవుతున్నా నన్న భావంచేత అప్పన్నయ్య కడలిలాంటి వుత్సాహం కలిగింది. అదీకాక తద్దినం తమ ఇంట్లోనే చేస్తే, మిగిలిపోయే గారెలు, పూరీలు, రవ్వవుండలు, వారం రోజులైనా సుష్టుగా తినవచ్చు. కానీ ఖర్చంతా తామే భరించాలన్న వూహే అతడికి కలగలేదు.

గంగమ్మ ఆలోచన అదికాదు. పదిహేను పదహారు రూపాయలావిడెలాగో తంటాలుపడి సమకూర్చగలదు. మొగుడి తద్దినమని తాను తిరిగే పల్లెల్లో అడిగితే పుణ్యాత్ములైనవాళ్ళు పావలా, బేడా, ఇచ్చి పైగా కొబ్బెరకాయ, పండిన వాళ్ళు నువ్వులు, మినుములు, అనుములు ఇస్తే మూడు తద్దినాలు పెట్టగలిగినంత వస్తాయి. కానీ పెద్దకొడుకు బతికేవుండగా, పిండం వాడిచేతిమీదుగా కాక, చిన్నవాడుపెడితే, దాన్ని స్వర్గంనుంచి కాకిరూపంలో వచ్చే తన మొగుడు ముట్టుకుంటాడో లేదో! కరణీకమెలాగ పెద్దకొడుక్కు వెళ్ళాలనే సర్కారు నియమముందో, అలాగే శ్రాద్ధపిండమూ పెద్దవాడే పెట్టాలికదా? ఆమె అప్పుడే

జోస్యులతో చెప్పింది. నూట ఒక్కరూపాయి చెల్లించే శక్తి ఎవరికీ లేదు. వీళ్ళు చేసిన నేరానికి, చచ్చి స్వర్గంలోవున్న ఆమె మొగుడు పాటి రామన్నగారు సంవత్సరానికో రోజు కూడా అన్నం లేక మాడవలసిందేనా? అదీకాక తప్పుచేసింది ముప్పనాటి కోడలు కాని తన 'చిట్టితండ్రి' చెన్నయ్యకాదు. దీనికేదైనా చేసి తీరాలి.

ఆమె వాదాన్ని జోస్యులిద్దరూ ఒప్పేసుకున్నారు. అంతో ఇంతో 'తప్పుదండుగు' తీసుకుని చెన్నిగరాయలను కులంలో చేర్చుకోవాలనీ, అతని పెళ్ళాన్ని మాత్రం వెలివేసే వుంచాలనీ నిశ్చయించారు. దండుగిచ్చుకోవడానికి చెన్నిగరాయల దగ్గిరేముంది? జోస్యులిద్దరూ సమాలోచన చేసి నిర్ణయించారు వూళ్ళో అన్నాజోస్యులు కట్టవలసిన రెవెన్యూపన్ను తొమ్మిది రూపాయల ఎనిమిదణాలు, అయ్యాశాస్త్రి లారురూపాయల మూడణాల అయిదు పైసలు కట్టాలి. చెన్నిగరాయలు, వాళ్ళు కట్టవలసినపన్ను ఆ సంవత్సరానికి ముందే ముట్టినట్టుగా ఇద్దరికీ వేరువేరు రసీదులు వ్రాసిచ్చి పట్టీలో కూడా నమోదు చేసుకున్నాడు. ఆ డబ్బు తమ పోటిగెలో మినహాయించుకునే పద్ధతి ఎలాగూ వుండనే వుంది. మొత్తానికి కరణం చెన్నిగరాయలు తండ్రి శ్రాద్ధం చేసే ధార్మికమైన అధికారాన్ని మళ్ళీ సంపాదించాడు. ఆయనొక్కడే తల్లిగారింటి వెళ్ళి శ్రాద్ధం చేయాలి. ఆరోజు ఆయన భార్యకానీ, పిల్లలు కానీ ఆ వేపు రాకూడదని నిర్ణయం జరిగింది.

బ్రాహ్మణార్థమొప్పుకున్న అన్నాజోస్యులారోజు తెల్లారి నుంచీ వుపవాసముండ వలసి వచ్చింది. చేసే పనికూడా లేదాయె. భార్య వెంకటలక్ష్మి వంటింట్లో కూర్చుని కూరలతరుగుతోంది. వుపవాసమున్నందువల్లేమో, జోస్యుల మనస్సు, పూర్వమత్తారింట్లో ఒకసారి నేతిలో వేయించిన పూరీలు తిన్న సంగతి గుర్తు తెచ్చుకుంది. ఆయవపెళ్ళాంతో ఇలాఅన్నాడు- "మీఅమ్మ ఓసారినేతిలో వేయించిన పూరీలు పెట్టింది. దాని రుచేరుచి. నువ్వొక్క రోజైనా అలాచేసి పెట్టావూ?"

"దానిదేం భాగ్యం. మీరూ దానికి కావల్సిన వెన్న పట్రండి. మీరడిగిందల్లా నేతిలోనే వేయించి పెడతాను."

"పేరు వాలుగణాలే ఎక్కడ తేను?"

"అయితే ఎందుకీ తీరని కోరికలు? వూరికే వుండండి" జోస్యులు చప్పరించాడు. కానీ వెంటనేమెరపులా ఓ ఉపాయంతట్టింది. ఈరోజు వెన్నకాచిననేతిలో వేయించినవన్నాలే తింటాము చూడు కావలిస్తే, పెళ్ళాంతో సవాలుచేశాడు. "మీకు వండి వార్చడానికెవళ్ళూ సిద్ధంగా లేరూరుకోండి" అని వేళాకోళం చేసింది పెళ్ళాం.

"మాస్తూవుండు కావలిస్తే" అన్న జోస్యులు –" వురేయ్! నరసింహా ఇప్పుడే పరుగెత్తుకెళ్ళి అప్పణ్ణయ్యను పిలుచుకురా," వెళ్ళు– అని కొడుకును పురమాయించాడు.

మడికట్టుకుని, తడి తుండుగుడ్డతో వంటింట్లో తల్లికి సహాయం చేస్తున్న అప్పణ్ణయ్య, అలాగే అర్ధ నగ్నంగానే పరుగెత్తుకొచ్చాడు. "మాడు, అప్పణ్ణయ్యా, నాకు ఒంట్లో సుస్తీగా వుంది,. జలుబు, జ్వరం నేను బ్రాహ్మణార్థం కూర్చోలేను."

"ఇప్పుడిలా అంటే ఏంజేయం జోస్యులుగారూ! అప్పుడే పదిబారలు పొద్దెక్కింది. ఇప్పుడెవరిని తేవడం సాధ్యం?"

" మీ అమ్మను పిలు చెబుతాను."

పరుగెత్తుకొచ్చిన గంగమ్మ, సంగతంతా విని "జోస్యులుగారూ! నా మొగుణ్ణి పస్తు పడేస్తారా?" అని దూరం నుంచే దణ్ణాలు పెడుతూ ప్రాధేయపడ్డది.

"సరే నువ్వింతగా చెబుతూంటే లేదనడ మెలా. బ్రాహ్మణార్థానికి వచ్చిభక్ష్యాలు తినకపోతే శాస్త్రసమ్మతం కాదు. అయితే ఓ పని చేయి. భక్ష్యాలన్నీ నేతిలో వేయించు. నేను తింటాను. జబ్బు చేయదు."

"ఇప్పుడంత నెయ్యి ఎక్కడ దొరుకుతుంది జోస్యులుగారూ?"

"డబ్బట్టుకురా గౌడ ఇళ్ళల్లో కావలిస్తే నేనెళ్ళి తెస్తాను వెన్న. నేనింకా స్థానమెలాగూ చేయలేదు."

గంగమ్మ ఇంటికెళ్ళింది. ఒక బ్రాహ్మడికి నేతిలో వేయించి వడ్డించి మరొకడికి నూనెని వేయడానికి వీలులేదు. తమకేమో నూనెవే సరిపోతాయి. ఇద్దరికీ సరిపడ్డా, గారెలు, పూరీలు, బూరెలు వేయించాలంటే, కొలత – సేరున్నర నెయ్యి కావాలి. ఇంట్లో రెండురూపాయలే వున్నాయి. గంగమ్మ పెళ్ళిలో ఇచ్చిన వెండిపంచపాత్ర ఒకటి ఇంకా మిగిలింది. దాన్ని అప్పణ్ణయ్య కిచ్చి పంపింది. కాశింబడ్డి షావుకారు దాన్ని త్రాసులో తూచి, పన్నెండు తులాలవెండికి రెండురూపాయలిచ్చాడు. రోజుకు రెండు పైసాలు వడ్డీ.

వెన్నకాచిన నేతిలో వండిన భక్ష్యాలు తిని, తమ పిల్లలకని కడమవి అరిటాకులో కట్టించుకుని, ఇంటికి వచ్చిన జోస్యులుగారు పెళ్ళాంతో– "నువ్వూ తినవే" అన్నప్పుడు "మరో ఇంటి తిధి ప్రసాదం నేనెలా తినేదండీ" అంది.

"పీకట్టుకోదులే, తినూ పిల్లలకూ ఇవ్వు."

"చూడండి! నేనేమో లౌకికుల ఇంట్లో పుట్టాను. శాస్త్రం గీస్త్రం అంటే మాకు

చాలా భయం జోస్యులుగారికి ఏ భయమూ లేనట్టుంది" అని ఆవిడ గలగల నవ్వినప్పుడు జోస్యులకు తన ధైర్యం తనకే గర్వకారణమయింది.

## 6

బ్రాహ్మణుల భోజనమై, శ్రాద్ధకర్మ ముగిశాక చెన్నిగరాయలు కూర్చుని పుష్కలంగా ప్రసాదభోజనం చేశాడు. తరువాత చొక్కావేసుకుని చెరువు కట్టవేపు వెళ్ళాడు. అప్పటికి సాయంత్రం నాలుగున్నర అయింది. మధ్యాహ్నం స్నానం చేసినప్పటి నుంచీ ఆయన పొగాకు వేసుకోలేదు. హనుమంతరాయని గుడిలో పొగాకుందికాని ఆకులూ వక్కలు లేవు డబ్బిచ్చి కొందామంటే జేబులో పైసాకూడా లేదు. చెరువు కట్టమంచీ 'అమ్మతోపు' ద్వారా వూరివేపు వస్తే దారిలోనే నరిపి దుకాణం. తాను కట్టించుకున్న మూడంకణాల పెంకుటింటి వరండాలోనే దాని అంగడి లోపల సరుకులుంచుకునే గది. దానికి అవతల దాని వంటగది. అట్టువ మీదకూడా సరుకులు నింపి వుంచిందంట!

కరణంగారు వస్తూ వుండగా ఆవిడ అంగట్లో కూర్చుని వుంది. ఆవిడ కెదురుగా లేత తమలపాకుల కట్టలున్నాయి. నోరు కట్టలేక ఆయనే తలుపు దగ్గిరకెళ్ళి అడిగాడు :- "నరసమ్మా! ఓ రెండాకులు, వక్కా, కాసింత పొగాకు తుంపు, ఇస్తావా?"

నరసి కూడా ఆకులు నములుతోంది. చేరడేసి కళ్ళు, వెడల్పయిన ముఖం. ఆవిడ నోరెప్పుడూ తాంబూల రసంతో నిండి ఎర్రని పెదవుల మీదుగా జారి పోయెలా సమృద్ధిగా వుండేది. జీవితంలో ఎలాంటి కష్టమూ లేదన్నట్లున్న ఆవిడ నవ్వితే, ఎదుట నుంచున్న వాళ్ళని చొచ్చుకుపోయి, పడగొట్టే మెరుపు కళ్ళల్లో చిందులాడేది . "ఆవిడడిగింది :" అదేటి కరణంగోరూ! ఆకిమ్మని నన్నడుగు తుండారు. మీ పెళ్ళామీదేటి?"

"ఇంట్లో ఆకులు లేవమ్మా! మా తండ్రి ఆబ్దికం చేసుకుని చెరువువేపు వెళ్ళిన వాణ్ణలాగే వచ్చాను."

"రండి, రండిస్తాను. వూరికరణంగోరు మీకు లేదంటే అవుద్దా?" అని ఆవిడ కళ్ళు తిప్పి నవ్వింది. వూళ్ళో తన అధికారాన్ని ఈవిడైవా ఒప్పుకుంది కదా అని సంతోషపడుతూ ఆయన అంగట్లోకి వెళ్ళాడు. "లోపట్రండి" అని పైకి లేచి ఆయన్ని లోపలి అంకణం లోకి తీసుకెళ్ళింది. లోపల కనుచీకటిలో ఆయనకేవీ

సరిగ్గా అగుపించలేదు. అంగడిసరుకుల మూటలున్నాయి. గోడకానుకుని వున్న మంచం మీద పక్కవేసి వుంది. "ఈడకూకోండి"

అని ఆవిడంది. "చీకటిగావుందమ్మా" అని ఆయన తటపటాయిస్తే "చీకటేం చేస్తది కూకోండి రండి"- అని దగ్గిరగా వచ్చి, ఆయన రెండు భుజాలు పట్టుకుని లాగి మంచంమీద కూర్చోబెట్టి తానూ పక్కన కూర్చుంది. బయట నుంచి లోపలికి వచ్చిన కరణంగారి కిప్పుడు కాస్త కనిపిస్తోంది. కాని చేతులు కాళ్ళు మాత్రం చలిజ్వరం వచ్చిన వాడికి మల్లే గడగడ వణకడం ప్రారంభించాయి. కాసేపటిలో వణుకు మితిమీరి పోయి రెండు దవడలు దడదడలాడటం మొదలెట్టాయి.

"ఎందుకయ్యగోరూ వణికిపోతుండారు?"

"నను .... నువ్విలా నన్ను ముట్టవచ్చా?" ఎగశ్వాస దిగశ్వాసగా అడిగాడు.

"నాకాడికొచ్చి ఆకడిగారుగా?"

ఆవిడ వుద్దేశ మతడి కర్థమే కాలేదుః "డ...డ... డబ్బులేదు. అడిగాను."

"నేనేం డబ్బడిగానా?"

"అయితే ఎ... ఎ... ఎందుకు తాకావు?"

ఆయన భుజాలు పట్టి లేపి బయటికి తెచ్చి ఆమె అంది, "వూరికే ఇంటికెల్లండి." భయంతో వణుకుతూ అతడు వడివడిగా అడుగులేసుకుంటూ బయటికెళ్ళాడు.

"కాస్తా ఆగండి" - అని ఆవిడ అన్నప్పుడంత భయంగానూ ఆగిపోయాడు.

"కాస్త ఇసుంటా రండి మిమల్ని కొరికి తిననులే."

ఆయన మళ్ళీ అంగడి ముందు నుంచొన్నాడు. ఒక కట్ట ఆకులు, పిడికెడు వక్కలు, మూరెడు పొగాకు తీసి ఆయన చేతికిచ్చి "తీసుకెల్లండి. ఇంట్లో నంజమ్మ కాడ సున్నం పట్టించి ఏస్కోండి. చూడండి మీలాంటోళ్ళు ఇంట్లో పెళ్ళాం మాట ఇనుకునుండాల. తెల్సిందా?"

కరణంగారికి కాస్త కోపం వచ్చింది. కానీ ఆవిణ్ణెలా తిట్టాలో వెంటనే తోచ లేదు. చేతిలో ఆకులు, వక్కలు, పొగాకు పట్టుకుని వూళ్ళోకి వెళ్ళాడు. తిన్నగా ఇంటికెళ్ళేసరికి లెక్కలపుస్తకం చూస్తున్న నంజమ్మ అతణ్ణి పలకరించలేదు. అతడూ ఏమనలేదు. స్తంభం దగ్గిర పరిచిన చాపమీద, వెన్ను వాల్చి తాంబూలం, పొగాకు నమలడం ప్రారంభించాడు.

# 10వ అధ్యాయం

మొగుణ్ణి మాత్రం తమలో చేర్చుకుని తన్ను మాత్రం ఇంకా వెలివేసే వుంచిన సంగతి విన్నప్పుడు నంజమ్మకు దుఃఖంకంటే తిరస్కారభావమే కలిగింది. ధర్మకర్మలు, శ్రాద్ధం మొదలైనవాటిని గురించి ఆమెకున్న అభిప్రాయం ఇతరులకంటె భిన్నమైనది. ఆమె తండ్రి కంఠీజోస్యులు ఆ వూళ్ళోకేకాదు, ఆ చుట్టుపక్కల ఎక్కడా తన్ను మించిన వాళ్ళు లేరన్నంతగా పౌరోహిత్యం నేర్చినవాడు. శుభాశుభకర్మలు రెంటిలోనూ ఎవళ్ళకే సందేహం వచ్చినా ఆయనవద్దకు వచ్చి తెలుసుకుని వెళ్ళేవాళ్ళు. అలాంటి తన తండ్రి స్వయంగా శ్రాద్ధం చేసేవాడుకాడు. ఎవళ్ళయినా అడిగితే - "నేను గయకు వెళ్ళి పిండప్రదానం చేసివచ్చాను. ఇహ చేయనక్కరలేదు" అనేవాడు. గయలో పిండప్రదానం చేశాక ప్రతి సాంవత్సరిక శ్రాద్ధం చేయవలసిన అవసరం లేదన్న మంత్రాన్నే గడగడ చదివేవాడు. కానీ అతడు గయకు నిజంగా వెళ్ళాడో లేదో, ఒకవేళ గయకువెళ్ళినా అక్కడ పిండప్రదానం చేశాడో లేదో, అందరికీ సందేహమే. అక్కమ్మ కసలే నమ్మకం లేదు. కానీ కంఠీజోస్యుల ఎదురుగుండా నుంచుని మాట్లాడే గుండె ఎవరికుంది?

తండ్రయినా వుంటే ఈ వూరి జోస్యుల తోకలింతగా పెరిగేవికావు. మా పాలమూ పోయేది కాదు. వచ్చి ఒక్కవురుమువురిమితే, మొగుడు, అత్త, అందరూ గజ గజ వణికి, చెప్పినట్టు చేసేవారు. పాలం దక్కేది. ఎక్కడి కెళ్ళాడో ఏమో! అయిపులేదు. అతడు చచ్చిపోలేదు. అది మాత్రం నిజం. వెనక నా చిన్నతనంలో ఇలాగే వూరొదిలి వెళ్ళిన వాడు నాలుగేళ్ళదాకా రాలేదట. కాశీ, రామేశ్వరం, ఇంకా ఏవేవో తిరిగి వచ్చాడట! ఇప్పుడు మళ్ళీ ఎక్కడికెళ్ళాడో! కానీ ఈసారి వెళ్ళి అప్పుడే తొమ్మిదేళ్ళుకావస్తోంది. పార్వతి వుట్టాక ఎనిమిదోనెలలోనో, తొమ్మిదోనెలలోనో వెళ్ళాడు. ఇప్పుడు దానికి తొమ్మిది నడుస్తోంది. దేశాంతరాలు వెళ్ళటం ఆయన నుదట రాసిందో, మా తలరాతోమరి!

ఆబ్దికంరోజు మొగుడు తన తల్లి ఇంటికి వెళ్ళాక ఆమె మనస్సు వ్యాకులమయింది.

తన ఇంట్లో కర్మ జరిగి వుంటే ఆమె వుపవాసముండి శిరస్నానంచేసి, వంట చేయవలసివచ్చేది. ఇప్పుడు తన్నువెలివేశారు. తానేమైనా తినవచ్చో తినరాదో! ఇంటి కోడలుతాము. మొగుడు ప్రాచీనావీతి వేసుకుని కర్మచేస్తున్నాడు. తాము తినడమెలాగ? అని ఆలోచించి ఆమె, పిల్లలకు మాత్రం పచ్చడి, రొట్టె చేసి ఇచ్చింది.(కర్మ ఇక్కడే చేసి వుంటే పిల్లలు ప్రసాదం తినేవాళ్ళు(మధ్యాహ్నమక్కడికి పిల్లల్ని పిలుస్తారో లేదో! అనుమానమే. వాళ్ళకెనా వంటచేయాలా అక్కరలేదా? ఎటూ తేల్చుకోలేక చివరికెల్లాగైతే అలాగవుతుందని, మళ్ళీ ఏడెనిమిది రొట్టెలు చేసింది. పిలవకపోతే అవే తింటారు.

పిల్లలంతా బడికెళ్ళారు. పార్వతి, రామణ్ణ ఇద్దరూ నాలుగవక్లాసులో వున్నారు. విశ్వనాథుడు రెండవక్లాసు. నంజమ్మకూర్చుని విస్తళ్ళు కుడుతోంది. అత్తగారింట్లో శ్రాద్ధకర్మ ప్రారంభమయ్యే మధ్యాహ్న సమయం. ఇంటికి మాదేవయ్యగారు వచ్చారు. ఇంటికడపా దడపా వచ్చేవారే కాని ఈ వేళలో ఎప్పుడూ రాలేదు. ఆయన జోలెభిక్షమెత్తి భోంచేసే వేళ అది. పల్లెల వేపు భిక్షానికి వెళ్ళివుంటే ఇంకా అక్కడే వుండే వేళ. అయ్యగారింకా భోంచేసినట్లు కనిపించలేదు. ముఖం దిగాలుగా వుంది. "మేమైతే సంసారులం. తెల్లారి తీస్తే కాష్ఠవ్యసనం. సన్యాసి అయిన ఆయన ముఖం దిగులుగా వుండటానికేమిజరిగిందో!" అని ఆలోచిస్తూ నంజమ్మ చాపవేసి కూర్చోబెట్టి అడిగింది.

"ఏమయ్యగారూ! భోంచేసినట్టులేదు?"

"వూళ్ళో మాజాతి ఇళ్ళల్లో జోలె భిక్షమెత్తరాదని అనుకున్నాను తల్లీ."

"ఏమయింది?"

"పల్లెలమీదకెళ్ళి రాగులు తెస్తాను. పరదేశస్థులు సాధుసన్యాసులెవరైనా వూరికి వస్తే గుడిలో వాళ్ళకి స్వయంపాక మిస్తానుకదా! వూళ్ళోవుంటే జోలెభిక్షంతో నా భోజనం గడుస్తుంది. ఈ వూళ్ళో బణజిగులంతా ఏదో మాట్లాడుకున్నట్టుంది. ఈరోజు భిక్షానికెళ్ళాను. నాలుగిళ్ళకెడితే అందరూ " ఈ అయ్యగోరికి తెల్లారి 'కోరణ్యంభిక్ష' కావాలి, మధ్యాహ్నం జోలె భిక్షా కావాలి" అన్నారు. విసుగెత్తింది. వూరికే వచ్చేశాను.

నంజమ్మకూడా బాధపడ్డది. అయ్యగారు పల్లెల నుంచీ తెచ్చిన ధాన్యాదులమ్ముకుని డబ్బు మూట కట్టడంలేదు. తనదీ అంటూ ఆయనకి ప్రపంచంలో ఏమీలేదు. ఆయన కష్టపడి భిక్షమెత్తడం పరదేశిసన్యాసుల కన్నం

పెట్టడానికే.

"అయ్యగారు! మీరు గుడికెళ్ళి వంటచేసుకోరూ?"

"బుద్ధి పుట్టడం లేదు తల్లీ! ఆకలేమోవేస్తోంది. నువ్వేమైనా పెడితే తింటాను."

నంజమ్మకాశ్చర్యం కాలేదు. ఈ జంగమసన్యాసి తన ఇంట్లో ఇంతవరకూ వచ్చిగంగకూడా తాగివుండలేదు. ఇప్పుడాయనే భోంచేస్తానంటున్నాడు. "అలాకూర్చోండి, నిమిషంలో అన్నం చారుచేస్తాను" అని ఆమె అనేసరికి "అదంతా అక్కరలేదు. ఏముంటే అదేపెట్టుతల్లీ" అన్నాడు. నంజమ్మ లోపలికెళ్ళి చేసివ రొట్టెలు పచ్చడి, అల్యూమినియం గిన్నెనిండా పెరుగు తెచ్చి ఆయన ముందెట్టింది. లేచి చేతులు కడుక్కుని ఆయన రొట్టెవిరిచి తినడం ప్రారంభించారు. అది చూస్తున్న నంజమ్మకు వెంటనే అత్తయ్యింట్లో తన మామగారి ఆబ్దికం జరుగుతున్న పంగతి గుర్తొచ్చింది. "ఈ వేళకి అక్కడ బ్రాహ్మణ భోజనం మొదలయ్యుండవచ్చు" ఆమె అంది "అయ్యగారు! ఈరోజు మా మామగారి ఆబ్దికం. నన్ను మాత్రం వెలివేశారు తెలుసా?"

"తెలుసమ్మా తెలుసు. అంతా నేతిలోనే వండాలి. లేకపోతే నేను భోంచేయనని బ్రాహ్మణోత్తముడన్నాడట! అప్పణ్ణయ్య కాశింబడ్డి అంగట్లో వెండిగిన్నె రెండురూపాయలకి తాకట్టుపెట్టి వెన్నతెచ్చాడు. నేను తొమ్మిది పదిగంటలకాడ గుడివద్దే కూర్చున్నాను. దారిలో నన్ను చూసి చెప్పాడు. జోస్యులకు జ్వరమొచ్చిందట. నేతివైతే గారెలు, బూరెలు అన్నీ తింటాడట. నూనెవైతే తినడట."

వడ్డీ చెల్లించి వెండిగిన్నె విడిపించుకోలేరన్న విషయం ఎవరూ చెప్పక్కరలేదు. "అయ్యగారూ! ఈ తిథీ గిథీ అనేదంతా నిజమా! ఇలాంటి జోస్యులను పిలిచి, అన్నం పెట్టడంచూస్తే అదంతా అబద్ధమనిపిస్తుంది."

"అది నిజమో అబద్ధమో ఎవడికి తెలుసు? నిజమైనా కావచ్చు. రామణ్ణ కరణంగారున్నప్పుడు మీఅత్త ఒకరోజైనా సాయంత్రందాకా ముద్దవేసిందికాదు. మొగుణ్ణి తిన్నగా చూడలేదు. ఇప్పుడు పళ్లెల మీదికెళ్ళి ముష్టెత్తుకొచ్చి తిధిచేస్తోందావిడ."

"మా మామగారు బతికున్న రోజుల్లోకూడా మీరిక్కడే వున్నారా?"

"చన్నయ్య పుట్టడానికి మూడేళ్ళ ముందుగా ఇక్కడికొచ్చాను.

"అయితే మీవూరేది?"

"ఏదైతేనేమి? శివుడు పుట్టించాక చచ్చేదాకా ఏదో ఒకవూళ్ళో వుండాలికదా" అన్నాడే కాని తనువూరిపేరు చెప్పలేదు. ఈ వూరికి వచ్చిన కొత్తలో ఆయన హుబ్బళ్ళి ధారవాడవేపున్న వుత్తరసీమవాళ్ళయాసతో మాట్లాడేవాడట. 'బోరేసంతే', రామనాథపురం జాతరలలో ఎడ్లుకొనడానికి వచ్చే వుత్తరసీమవాళ్ళలా ఆయన మాట యాసగా వుండేదని జనమనుకునేవారు. మొదట రాగిముద్ద తినే అలవాటులేక రొట్టెలు మాత్రమే తినేవాడట. కానీ రెండు మూడేళ్ళలో ఇక్కడి వాళ్ళలాగే మాట్లాడడం నేర్చుకున్నారు. ముద్ద తినటం కూడా అలవాటుచేసుకున్నాడు. "మీదేవూరు?" అంటే 'రామసంద్రంచోళేశ్వరుని గుడి' అనటం ప్రారంభించాడు. ఇప్పుడెవరూ ఆయన్నిఏ వూరని అడగరు. చెన్నిగరాయలవంటి నడివయస్సులో వున్న వాళ్ళకంటె ఆయన రామసంద్రానికి ప్రాచీనుడు. నంజమ్మ ఆయన వూరేదన్ని మళ్ళీఅడగలేదు.

ఈలో అయ్యగారు రొట్టెతినటమయిపోయింది. మధ్యాహ్నం భోజనానికని పిల్లలింటక వచ్చారు. అమ్మ ఇచ్చిన రొట్టె పచ్చడి అల్లరి చేయకుండా తిని, నీళ్ళుతాగి బడికి వెళ్ళారు. నంజమ్మమాత్రం తినలేదు. పిల్లలు తిన్నాక ఏమీ మిగలలేదు. మళ్ళీచేయడానికి బుద్ధిపుట్టలేదు. అయ్యగారు బయట కూర్చునేవున్నారు. ఆమె బయటికి వచ్చి, అదివరకే మనసులో కదులుతున్న ఒక ప్రశ్న వేసింది. "అయ్యగారు! మళ్ళీ మిమ్మల్ని ఒక ప్రశ్న అడగాలనుకున్నాను. జవాబివ్వాలనుకుంటే ఇవ్వండి లేకపోతే అక్కరలేదు." "ఇల్లూ,వాకిలీ వొదిలి మీరెందుకిలా వచ్చేశారు?"

"ఇల్లూవాకిలీ వదిలి రావటమేమిటి? సంసారముంటేగా? పుడుతూనే సన్యాసిగా పుట్టాను. వూరూరూ తిరుగుతూ వచ్చాను. ఇక్కడెందుకో వుండిపోవాలనిపించింది వున్నాను" అని అన్నాడేకాని ఆవిడప్రశ్నకు సమాధానం చెప్పలేదు. ఆయన కిల్లూ, సంసారం వుండేవోలేదో! సమస్య సమస్యగానే వుండిపోయింది.

ఆయన తన పూర్వజీవితాన్ని గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు. పెళ్ళయిందోలేదో - అయ్యాక సంసారం వొదిలేసి ఇలావచ్చారో! బ్యారి సీమవారట! పెళ్ళామేదో తగనిపని చేసిందట; అందుచేత విసుగెత్తి, అన్నీవదులుకుని, ఇలా బయల్దేరి వచ్చారట - అని పక్కింటి పుట్టమ్మ ఒకరోజు నంజమ్మతో అంది. "ఇది నీకెలా తెలుసు?" అని అడిగితే "అలాగని ఎవరో అనుకునే వారమ్మా. వా చిన్నతనంలో మాట. అప్పటికాయనింకా ముసలాడు కాలేదు" అనిచెప్పింది.

పుట్టమ్మ మాట కూడా నమ్మడానికి లేదు. అయ్యగారు తనంతటతాను నోరువిప్పి తన విషయమెవళ్ళతోను చెప్పలేదు. "చెప్పకుంటే పోనీ, ఆయన మనస్సులో ఎలాంటి బాధవుందో మనకెందుకు" అని ఆవిడ వూరుకుంది. ఇద్దరూ ఒక్కమాటకూడా మాట్లాడలేదు. వూరికే కూర్చున్నారు. "ఏమిటాలోచిస్తున్నావు తల్లీ?" అయ్యగారడిగారు

"ఏమీలేదు."

"ఇన్ని రోజులీవూళ్ళో నీళ్ళఋణం, నిద్ర ఋణం వుండేది. ఇప్పుడు వేరే ఎక్కడికైనా వెళ్ళాలని ఆలోచిస్తున్నాను."

"అయ్యగారు! మీరెంతయినా సన్యాసులు. ఎవళ్ళో తెలియనివాళ్ళు నలుగురు ఏదో అన్నారని మీరు విసుగెత్తి ఈ జుగుప్స తెచ్చుకోరాదు. అదీకాక మీరేవూరెళ్ళినా అలాంటి వాళ్ళుండనే వుంటారు."

"అదీ నిజమే తల్లీ" అన్నాడు.

ఎక్కువగా మాట్లాడే వుత్సాహం ఆయనలో లేనట్టు తోచింది. కాసేపటికి లేచి గుడికి వెళ్ళిపోయారు.

## 2

ఆరోజు తెల్లారి పల్లెలవేపు వెళ్ళిన మాదేవయ్యగారు రెండు మూడు నెలలైనా రామసంద్రానికి తిరిగిరాలేదు. ఆయన వూరువదిలి వెళ్ళిపోయారేమో అని నంజమ్మ బాధపడ్డది. ఈవూళ్ళో మంచివాడు అని చెప్పుకోదగ్గ వ్యక్తి ఆయన ఒక్కడే. ఆయనా విసుగెత్తి వెళ్ళిపోయాడు. మళ్ళీ వస్తారో రారో! ఆయన సామాను మాత్రం గుడిలోనే వుంది. రెండుమూడు బస్తాలరాగులు రెండు మూటలు వులవలు, తట్టెడు మిరపకాయలు, అల్యూమినియంపాత్రలు కొన్ని, వాలుగెదు చాపలు - వున్న గదికి తాళం వేసి వుంది. తాళం చెవి పట్టుకెళ్ళారట. అయితే ఎప్పుడో ఒకరోజు తిరిగి రావచ్చునన్న ఆశ ఆవిడకుంది. ఆయన వెళ్ళాక దేవాలయంలో కళలేదు. నంజమ్మ అక్కడి కెప్పుడూ వెళ్ళిందికాదు. ఇప్పుడు చెన్నిగరాయలవంటి వారికి కూడా అక్కడికెళ్ళి కూర్చోవటానికి ఏ ఆకర్షణా లేదు.

పార్వతికి రామణ్ణకు ప్రైమరీస్కూలు చదువయిపోయింది. రామణ్ణ చాలా చురుకైనవాడు. తరగతికంతా మొదటివాడని సూరప్పమాస్టారే చెప్పారు. ముత్యాలు

కూర్చిపెట్టు ముద్దుగా అక్షరాలు వ్రాస్తాడు. కరణీకం పుస్తకాలకు తప్పులు లేకుండా రూళ్ళువేసేవాడు. అల్పప్రాణ మహాప్రాణాలుగాని, హ్రస్వదీర్ఘాక్షరాలు గానీ తప్పులు లేకండా చదివేవాడు. ముగ్గురు పిల్లలకూ నంజమ్మ 'శాంతాకారం భుజగశయనం' 'భజగోవిందం మూఢమతే' వంటి అనేక స్తోత్రాలు, శ్లోకాలు ఇంట్లోనే నేర్పింది. 'నలచరిత్ర', 'లవకుశుల యుద్ధం' పార్వతికి రామణ్ణకు కంఠతా వచ్చు. కరణీకం చేయటానికి 'ఇంతకంటే విద్యరావాలా? కాని నంజమ్మ కోరిక మరోలావుంది. ఈచని తనపిల్లలకక్కరలేదు. వాళ్ళు బాగా చదువుకుని వుద్యోగాలు చేయాలి. అదమపక్షం రెవెన్యూ ఇన్స్పెక్టరు కాదగిన విద్యఅయినా రావాలి.

"రామణ్ణనింకా ముందుకు చదివించండి; వదిలెయ్యకండి," అని సూరప్ప మేస్టారు చెప్పారు. మిడిల్ స్కూలు కంబనకెరెలో వుంది. రామసంద్రానికి అయిదుమైళ్ళదూరం. ఆ వూళ్ళో ఓ పాతిక ఇళ్ళైనా బ్రాహ్మలవి వుంటాయి. ఎవళ్ళైనా మగాళ్ళువెళ్ళి కుర్రాడికి వారాలు ఏర్పాటుచేస్తే చదుకోవచ్చు. శనివారం వూరికి వచ్చి, సోమవారం చద్దికట్టుకుని బడివేళకి వెడితే నాలుగు వారాలు దొరికితే చాలు. శనివారం మధ్యాహ్నం ఎవళ్ళయినా భోజనం పెడితే చాలు. రెవెన్యూ ఇన్స్పెక్టరు నడిగితే ఒక వారం ఇవ్వచ్చు. కడమా నాలుగు రోజులెవరి నడగాలి? సూరప్ప మేస్టారుకు, దేవరసయ్యగారికి అక్కడ ఎరిగున్న వాళ్ళు వుండవచ్చు.

అడ్డమయిన వాళ్ళింట్లో భోంచేయడం రామణ్ణకిష్టంలేదు. వాడికి వామర్దావేసిందో, భయమో, చెప్పలేము. రోజూ వూరినుంచీ కంబనకెరె దాకా నడిచే వెడతానన్నాడు. పోను అయిదు మైళ్ళు, రాను అయిదు మైళ్ళు. రామచంద్రం పొలిమేరలో అమ్మవారిగుడి దాటితే ముదిమావి వస్తుంది. ఆ తరువాత కబ్బళ్ళిమిట్ట ఎక్కిదిగితే పుట్టలదిబ్బ. పేరుకుతగ్గట్టుగా ఆ దిబ్బనిండా పుట్టలే. వాటిలో ఎన్ని వేలపాములున్నాయో! ఆ పుట్టలు, వాటికన్నాలు, చూస్తేనే భయమేస్తుంది. దాని తరవాతే గౌడకొప్పలు, ఆపైన బ్రహ్మదెముడు పుంతదాటితే కంబనకెరె. రామణ్ణకింకా తొమ్మిదేళ్ళు, ఒంటరిగా ఆ దారిలో వెళ్ళిరావాలి. కానీ కష్టపడందే చదువబ్బుతుందా? సూరప్పమాస్టారిచ్చిన ప్రైమరీస్కూలు సర్టిఫికేటు దేవుడి ముందెట్టి పూజచేసి, కళ్ళకద్దుకుని చేతిలో పుచ్చుకున్నాక, నంజమ్మ తాను చేసిన రొట్టెలు పచ్చడి మూటకట్టి కొడుక్కిచ్చింది. బడికెళ్ళి తామే చేర్పిస్తామని చెన్నిగరాయలెలాగో ఒప్పుకున్నాడు. బయల్దేరేరోజు

తెల్లారి ఏడుగంటలకే లేపేసరికి బద్ధకంగా ముసుగులోనే మూలుగుతూ "రేపెడితేపోలా" అని అటుతిరిగి పడుకున్నాడు. కానీ పంచాంగం చూసి నిర్ణయించిన ఆ మంచిరోజును వదులుకోవడమెలాగ. కొడుకువెంట నంజమ్మ బయల్దేరింది. దేముడికీ, తల్లికీ, అక్కయ్య పార్వతికీ రామణ్ణ నమస్కారం చేశాడు. పడుకున్న వాళ్ళకి నమస్కారం చేయరాదు. గనక తీర్థరూపులయిన తండ్రిగారికాయోగం పట్టలేదు. తల్లీకొడుకూ ఇద్దరూ బడికి వెళ్ళారు. కుర్రాడిపోషకులు - అనేచోట తల్లిసంతకమే చేయించుకుని ఎనిమిదణాల ప్రవేశరుసుం కట్టించుకుని హెడ్‌మాస్టరు రామణ్ణని బడిలో చేర్చుకున్నాడు. అక్కడికెళ్ళి కడమా పిల్లల్ని చూసినప్పుడు నంజమ్మ అనుకుంది. తన కొడుక్కి లుంగీ పంచ కొనిపెట్టాలి. తలకు నల్లటోపీ కావాలి. ఇది మిడిల్‌స్కూలు. లాగు చొక్కాతో వెళ్ళడం బావుండదు.

లుంగీ పంచలు రెండయినా కావాలి. ఒకటి వుతికితే మరోటి వుండాలికదా! రెండు పంచలకీ, టోపీకి కలిసి రెండురూపాయలవుతుంది. అదికాక పుస్తకాలు కొవాలి. నోటుపుస్తకాలు, పెనసళ్ళు, కట్టిచ్చిన రొట్టె పచ్చడి పట్టుకునే చేతిసంచికావాలి. వీటికంతా ఏడెనిమిది రూపాయలవుతుంది. ఇంట్లో అంతడబ్బులేదు. అటకమీద కుట్టి పడేసిన విస్తళ్ళకట్టలున్నాయి. ఈసారి పెళ్ళిళ్ళసమయంలో పల్లెటూళ్ళవాళ్ళే తమ ఇంటికి వచ్చి విస్తళ్ళుకొనిపట్టుకెళ్ళారు. మిగిలినవి అటకమీదున్నాయి. ఇంటికి వచ్చి నంజమ్మ అటకెక్కి చూసింది. లెక్కెడితే వంద కట్టలున్నాయి. కట్టకు ఏడణాలచొప్పున వేసుకున్నా నలభైనాలుగు రూపాయల పండ్రెండణాలు వస్తాయి. కానీ కేవలమీ వందకట్ల బండిలో తిపటూరికి సాగిస్తే అద్దెదండుగ. వెంటనే డబ్బువచ్చే మార్గమేది?

ఆమె సర్వక్కకు కబురెట్టింది. సర్వక్కవద్దకూడా ఎనభైకట్టలున్నాయి. అవీ ఇవీ కలిపి అద్దెబండిలో పంపితే ఖర్చు చెరిసగం వేసికోవచ్చు. "ఏదో కొట్టుపనిమీదసొక్కానికని మా ఇంటాయన రేపు తిపుటూరి కెడుతున్నారు. సవారి బండ్లో ఒకరే ఎడతారు. అందులో వేసి పంపుదాం " అని సర్వక్క సూచించింది.

"సర్వక్కా! దానికేం పంపచ్చు; కానీ మీ ఇంటాయన సంగతి నీకు బాగా తెలుసుగా?"

" అదీ నిజమే" - అని ఆమె ఒప్పుకుంది. చివరికో వుపాయం తోచింది. ఇద్దరి కట్టలూ బండ్లో వేసుకుని మొగుడుతోటి సర్వక్కా వెళ్ళాలి. వ్యాపారం చేసి ఆవిడే డబ్బు భద్రంగా తీసుకురావాలి. నంజమ్మ ఇచ్చిన సలహాబావుంది. సర్వక్క

ఒప్పుకుంది. అలాగే రామణ్ణకు పంచలు, టోపీ, పుస్తకాలు, చేతిసంచి కొనమని పట్టీరాసి ఇచ్చింది.

మరుసటిరోజు రాత్రి బండిలో మొగుడితోటి సర్వక్క బయల్దేరింది. డబ్బుతీసుకుని, నంజమ్మ చెప్పిన వస్తువులన్నీ కొని ఆ రెండవరోజురాత్రి మళ్ళీ బండెక్కింది. దారిలో అర్ధరాత్రయ్యాక ఆమెకు నిద్రపట్టింది. తెల్లారి వూరికి వచ్చి ఇంటి ముందుకు వచ్చి బండి దిగేసరికి, తానుకొనిపట్టుకొచ్చిన వస్తువులున్నాయి. మెడలో వేళ్ళాడవేసుకున్న డబ్బు సంచిమాత్రం లేదు. మొగుడితో చెబితే "గాడిదలా పడి నిద్దరోయావు దారిలో ఎక్కడ పడిపోయిందో ఏమో భాంచోత్‌ముండా!" అని రేవణ్ణశెట్టి వుగ్రుడైపోయాడు. కన్నీళ్ళు కార్చుకుంటూ పరుగెత్తుకొచ్చిన సర్వక్క చెప్పిన విషయమంతా విని నంజమ్మకేం జెప్పాలో తెలియలేదు. నంజమ్మ చెప్పిన సామానుకు ఖర్చయింది ఆరున్నరరూపాయ. ఇంకా ముప్పై ఎనిమిది రూపాయల పావలా ఇవ్వాలి. ఆమెవికూడా ముప్పై అయిదు రూపాయలు సంచితో పాటుపోయాయి.

"నంజమ్మగోరూ! నా మెడలోవుండే 'కరడిగె' మీద ఒట్టేసి చెబుతున్నాను. నమ్మద్దొంగ అనుకోకండి."

నంజమ్మ నెమ్మదిగా ఆలోచించి నాలుగైదు ప్రశ్నలు వేసింది. తరవాత "మీరేమైనా అనండి. డబ్బు మరోలాపోలేదు. మీరు జోగుతూవుండగా మీ ఇంటాయనే కొట్టేశారు."

అదే నిజమని సర్వక్కకు కూడా వెంటనే తోచింది. తిన్నగాఇంటికెళ్ళి "మీరే డబ్బుతీశారు. నంజమ్మగోరి డబ్బయినా ఇచ్చేయండి" అని అడిగేసరికి రేవణ్ణశెట్టి వీరభద్రుని జాతరలో గెంతేభూతంలా మారి ఆవిణ్ణి పట్టుకుని ఒళ్ళుహూనమై పోయేలా కొట్టాడు. కోర్టుకెళ్ళి సాక్షం చెప్పే పెద్దమనిషిని పట్టుకుని దొంగ అంటే సహిస్తాడా మరి?

అన్నిదెబ్బలు తిన్నా సర్వక్క మనసులోనే ఏదో నిశ్చయించుకుంది. మరుసటిరోజు తెల్లవారుజామున లేచి, కూతురు రుద్రాణిని వెంటబెట్టుకుని తనపుట్టింటికి శివగెరెకి నడిచి వెళ్ళింది. ఆమె మెడలో పుట్టింటి వాళ్ళు పెట్టిన బంగారపు 'కరడిగె' వుంది. దేవుడన్న భయం చేతో, మరెందుచేతోగాని రేవణ్ణశెట్టి దృష్టి దానిమీదపడలేదు. ఒక కంసాలికి దాన్ని నూటిరవైరూపాలకమ్మేసి ఎనిమిది రూపాయలెట్టి వెండి కరడిగె చేయించుకుంది. రెండు రోజులయ్యాక వూరికి

వచ్చి, నంజమ్మ డబ్బు నంజమ్మకిచ్చి, కడమడబ్బుకూడా ఆమె చేతికే ఇచ్చి "ఇంట్లో తినడానికి లేనిరోజు వచ్చి అడిగి, ఒకటీ అరా తీసుకెడతాను మీ దగ్గిరే వుంచుకోండి."

"ఇంతడబ్బు నేనెక్కడ దాచను సర్వక్కా?"

"చిన్న కుండలో వేసి అటక మీద ఆకుల సరాల కింద దాచండి ఎవళ్ళకీ తెలీదు"

నంజమ్మ అలాగే చేసింది.

రేవణ్ణశెట్టి వారం రోజాలు రాత్రిపూట ఇంట్లో పడుకోలేదు. పగలు మాత్రం ఇంట్లో పడుకుని నిద్రపోయేవాడు.

## 3

రామణ్ణ కంబనకెరె బడికి వెళ్ళటం మొదలెట్టాక పార్వతి ఇంట్లో వుంటోంది. అందాకా ఆ అమ్మాయిని గూర్చి చేయని కొత్త ఆలోచన నంజమ్మ మనస్సును కలవర పెడుతోంది. అమ్మాయికప్పుడే పన్నెండేళ్ళు. తనలాగా భారీగా వుండి పన్నెండేళ్ళ కంటే పెద్ద పిల్లలా కనిపిస్తుంది. పెళ్ళి చేయాలి. వరుణ్ణి వెదికేదెవరు? డబ్బు కూర్చుకునేదెలాగ? ఇన్ని రోజులైతే, కేవలం సంసారం గడిస్తే చాలు. ఇప్పుడు రామణ్ణ చదువుకు ఖర్చవుతోంది. ఈ ఖర్చులకు తోడు అమ్మాయి పెళ్ళి చేయడమంటే మాటలా? చేయక తప్పుతుందా?

పార్వతి బడికి వేళ్ళే రోజుల్లోనే తల్లికి వచ్చే పాటలన్నీ తానూ నేర్చుకుంది. పండగ వంట కూడా, నంజమ్మ ఇటీవల పార్వతి చేతే చేయిస్తుంది. బడి వదిలాక ఇంట్లో కూర్చుని చేసేదేమి? తెల్లారి నుంచి సాయంత్రం దాకా కూర్చుని రెండువందల విస్తళ్ళు చులాగ్గా కుట్టిపడేసేది. పెరిగే పిల్ల. పాలు నెయ్యి లేకపోతే ఎలా? విశ్వం పుట్టినప్పుడు అక్కమ్మ పంపించిన ఆవు పెయ్య దూడ ఇప్పుడీనింది. దానికి పత్తి గింజలు తవుడూ లేక, పచ్చికబయళ్ళ మీద మేసే వాళ్ళు లేక అంతమంచి జాతి ఆవు కూడా రోజుకు మూడు పావులే ఇస్తుంది. కనీసం మూడు గరిటెల పెరుగైనా వేయకపోతే శ్రీవారు లబో దిబో అంటారు. మిగిలినదాంట్లో ఎవళ్ళకెంతెంతని వేయగలదు. రోజూ మోదుగాకులు కుట్టి వేడి చేసే అమ్మాయి వుంది. రోజూ పదిమైళ్ళు నడిచి చదువుకునే అబ్బాయి వున్నాడు. వూళ్ళోనే బడికెళ్ళే చిన్నకుర్రాడువున్నాడు. వీళ్ళల్లో ఎవరికి పెడుతుంది; ఎవరికి మానుతుంది.

ఈ ఏడు జ్యేష్ఠ ఆషాఢమాసాలు వచ్చినా వర్షాలు లేవు. పల్లెసీమలోనే వర్షాలు లేవని ఎవరో చెప్పారు. పడమటి గాలి వీస్తోంది. వేసవిలో ఎండిపోయిన భూమి పచ్చగిల్లనే లేదు. పచ్చి గడ్డి లేక పావుకు దిగిపోయిన ఆవు, రానురాను వట్టిపోయింది. ఇంట్లో పిప్ప మజ్జిగ కూడా లేదు. ఎవ[illegible]లాలు దున్ననే లేదు. ఈ ఏడు వర్షాలు బొత్తిగా ఎగబెడతాయో ఏమో! ఎడగారైనా పండి రాగులు చేతికొస్తాయా రావా అని అందరూ ఆందోళన పడుతున్నారు. కొత్త సంవత్సరాని కెప్పటిలాగే నంజమ్మ మువపబు గుండేగౌడకు మరిద్దరికీ వెరసి వందరూపాయలకు మొగుడిచేత రసీదు వ్రాయించి ఇచ్చింది. కానీ, వర్షాలిలా ఎగబెట్టేసరికి గౌడగారన్నారు : "తల్లీ! నాగరికెల్లో వున్నరాగులు ఈసారి పంటలు రాకపోతే మా ఇంటిల్లిపాదికి పనిమనుమలకే సరిపోద్ది. జమ్మేనహళ్ళిలో మా ఆవిడ పుట్టింట్లో, ఒక గింజ కూడా లేదట. నాలుగు ఖండగాలు కావాలని కబురెట్టారు. ఇయ్యాలేం, మానాలేం. అదీ వున్న సంగతి. నీ రసీదుకు కావలిస్తే డబ్బిచ్చుకో ఈ ఏడు రాగుల్లేవు."

అప్పుడే డబ్బు తీసుకుని రాగులు కొనిపడేసి వుంటే బుద్ధిమంతురాలయ్యేది. ఇలా అవుతుందని ఆవిడకు మాత్రమెలా తెలుస్తుంది. ఇంట్లో కాస్త నిలవ వున్నాయి. అది రెణ్ణెల్ల దాకా వచ్చాయి. ఇంకా వర్షాలు పడలేదు. ఇంతలో రాగుల ధర ఆకాశాన్నంటుకుంటోంది. రూపాయికి ఎనిమిది సేర్లు. మూడు రూపాయలకు బస్తా ఎక్కడ? ఇప్పటి పన్నెండు రూపాయలకి బస్తా ఎక్కడ? ఆమె గుండె ఝల్లుమంది. ఒకరోజు డబ్బే అడుగుదామని కురుబరహళ్ళి వెళ్ళింది. గుండేగౌడ అన్నాడు. "మీ ఇంట్లో రాగులున్నాయనుకున్నాను. నువ్వూ రాలేదు. ఇప్పుడే దొరికినవి కొని వుంచేసుకో. మరో రెణ్ణెల్లు పోతే ఇత్తనానికి కూడా గింజ దొరకదు."

"అయితే మీరే ఎక్కడయినా ఇప్పించండి."

కురుబరహళ్ళి పక్కనే వున్న నాగేనహళ్ళి చిక్కతిమ్మే గౌడగారి పాతరాగులింకా పాతరలోనే వున్నాయి. ఆయన అమ్ముతారన్నది తెలుసుకుని గుండేగౌడ అయిదు బస్తాల రాగులు కొని పంపించారు. ఇప్పుడింకా వెల పెరిగింది. బస్తా పదహారు రూపాయలు. అంటే రూపాయి కారుసేర్లు. గుండేగౌడ పన్ను యావత్తూ దీనికే హరించుకుపోయింది. ఇహపోతే మిగిలింది ఇరవై రూపాయలు. పై ఖర్చుకుంటుందని దాన్ని నగదుగా తీసుకుంది.

అయిదుగురికి అధమపక్షం రోజుకు నాలుగు సేర్లయినా కావాలి. అదవంగా

పాలు, పెరుగు, కాయగూరలు, పప్పులు వుంటే పిండి ఖర్చు తక్కువవుతుంది. ఏవీ లేకుండా దానితోటే పొట్ట నింపుకోవాలంటే నాలుగు సేర్లు ఖచ్చితంగా కావాలి. పొద్దుట రొట్టె కాల్చడం మానేస్తే కాస్త ఆదా అవుతుంది. కాని రామణ్ణకు బడికి పట్టుకెళ్ళడానికి రొట్టె విధిగా తట్టాలి. పెద్దాడికి రొట్టె వుసిరిక వూరగాయి ఇస్తూ చివరి వాడికి మానడమెలాగ. పెరిగే పిల్ల పార్వతికి లేదనడమెలా? పిల్లలకు మసిపూసి మారేడుకాయ చేయచ్చు. శ్రీవారి చిన్ని బొజ్జకు శ్రీరామరక్ష చెప్పకపోతే ఎలా? లేవగానే రొట్టె సిద్ధంగా లేకపోతే వీధిలో నుంచుని ఇంటిపరువు రచ్చకీడుస్తూ యక్షగానంలో చిందులు తొక్కినట్టు తొక్కుతూ, వూరంతా వినిపించేలా "ముండా! రండా!' మంత్రం మొదలెడతారు. లేచీ లేవగానే ఇంటిపరువు వీధిని పడడం సహించలేదు. పెరిగే పిల్లల కాపాడుమాటలు చెవిలో పడకూడదు. దానికి గాను తనకు సాధ్యమయిన ప్రయత్నం తాను చేస్తోంది.

రోజుకు నాలుగు సేర్లయితే అయిదు బస్తాలు నాలుగునెలల్లో ఇట్టే ఎగిరిపోతాయి. మళ్ళీ కొనడానికి డబ్బు లేదు. గనక ముందర సంపాదన ఏమున్నా విస్తళ్ళవల్ల రావలసిందే. తల్లీ కూతురు చేరి రోజుకు నాలుగు వందలు కుట్టేవారు. ఈ ఏడు పహణీ వ్రాసే పని లేదు. ఎక్కడ చూసినా పొలాలు బీడుపడి, వూసురోమని వుంటే పహణీ వ్రాసేదేమిటి? బొంద! కానీ పుస్తకాలు కుట్టి రూళ్ళేసి, హెడ్డింగు కట్టి అడ్డగీతలు, నిలువుగీతలు ఎర్రసిరాతోటి పెనసలు తోటి వేసి తీరాలి. ప్రతి సర్వే నంబరు, ఖాతానంబరు, జాగాలో 'ఖాలీ', 'ఖాలీ' అని వ్రాసి తీరాలి. సర్కారు లెక్కంటే లెక్కే. 'బాగాయితు' నంబరు జాగాలో కొబ్బెర, మామిడి, చక్కెర, నిమ్మ అని వ్రాయాలి. అక్కడ 'ఖాలీ' అని వ్రాయడానికి వీలులేదు. ఇంటిపని, విస్తళ్ళతోపాటు నంజమ్మ దాన్ని కూడా నిర్వహించింది.

పుష్య మాఘ మాసాలు వచ్చేసరికి ప్రజలు పడుతున్న అవస్థ పశువులకు కూడా వ్యాపించింది. తాగడానికి నీళ్ళెక్కడా లేవు. మేయడానికి గడ్డిలేదు. గడ్డి నిలవ చేసినవాళ్ళు, ఇళ్ళమీదికి అట్టువల మీదికి మార్చారు. దొడ్లల్లో వుంటే దొంగిలించుకుపోతున్నారు. వున్నదాన్నే పొదుపుగా వాడుకుంటున్నారు. ప్రజల్లో లాగే పశువల్లో కూడా ప్రాణాలు శరీరాల కంటిపెట్టుకుని వుంటే చాలన్న దృష్టితో నాలుగు గడ్డిపోచలు విదిలిస్తున్నారు. మేత లేనివాళ్ళ పశువులు చచ్చిపోయాయి. తమ ఇంట్లో వేసిన కోడెదూడల్ని కాస్త పెద్దవి కాగానే నంజమ్మ ఎప్పటికప్పుడే అమ్మివేసేది. వున్నదల్లా రెండావులు, ఒక దూడ. గడ్డి లేకుండా

వచ్చే పరిస్థితికి వచ్చాయి. వాటిని నాగలాపురానికైనా పంపాలని ఆలోచించింది. అక్కడ కూడా వరపే. అది కేవలం రామసంద్రానికి మాత్రమే పరిమితం కాదు. తుమకూరు, హాసన, కోలారవంటి సీమల్లోనూ ఈ ఏడు వర్షాభావమే. మరి కొన్ని ప్రాంతాలలో ఇంత వరపు లేదు. ఎంతో మంది గన్ని శ్రీనివాసపూరాలకు వెళ్ళి బండెడు వరిగడ్డి యాభై రూపాయల చొప్పున కొని తెచ్చేవారు. రెండవసారి వెడితే బండి అరవై అయిదు రూపాయలకు పెంచారు. నంజమ్మకు ఏమి చేయాలో తోచలేదు. ఒకరోజు, తనరెండావుల్నీ, దూడనీ తోలుకొని కురుబరహళ్ళికి వెళ్ళి గుండేగౌడతో "గౌడగారూ! వీటిని గోదానం చేస్తున్నానని తీసుకోండి. రోజుకో పిడికెడైనా గడ్డివేసి బ్రతికించుకోండి. వుంటే మీ మనవలు పాలుతాగుతారు. అవి గడ్డి లేక చచ్చిపోతే నేను చూడలేను."

"తల్లీ! రైతుబిడ్డని నేను గోదానం పడతానా?"

"అయితే మూడింటికి ముక్కాని ఇవ్వండి. పలుగు మీ చేతికిచ్చి అమ్మేశానంటాను. అవి బతికి బయటపడటం ముఖ్యం."

గౌడకూ గడ్డికొరతే. అయినా సంవత్సరానికయ్యే గ్రాసం నిలవచేసే వుంచాడు. వచ్చే ఏడు కూడా వానదేవుడు చల్లని చూపు చూడకపోతే గతి ఏమి? రాబోయే అనిశ్చిత పరిస్థితికి జడిసి, ఇప్పుడు తమ గుమ్మం దగ్గిరకు వచ్చి, నంజమ్మలాంటి మనిషి కోరిన కోరిక కాదనడమెలాగ? అది కరణీకం చేస్తున్న నంజమ్మ అడిగిందని కాదు. మూడు మూగజీవాల చావుబ్రతుకుల సమస్య తీర్చాలి. "అట్లాగేలే పెట్టుకుని పోషిస్తాను. దానము వొద్దు, గీనమూ వొద్దు, ఖరీదు కసలేవొద్దు. దీనిజాతి ఆవుపెయ్య తరవాతెప్పుడో నాకిద్దువు గాని, వెల్లావు మంచి జాతిది."

నంజమ్మ గుండె బరువు తీరింది. వూరికి వచ్చేసింది. రామసంద్రంలో ఎన్నో పశువులు చచ్చాయి. ఎన్నో చావడానికి సిద్ధంగా వున్నాయి.

తల్లీకూతురు కూర్చుని గబగబా కుట్టేసిరికి ఆ ఏడు, ఆకుల సరాలు మార్గశిరమాసానికే అయిపోయాయి. అంతలో రాగుల గరిశ ఖాళీ అయింది. అటకెక్కి చూస్తే మొత్తం ఇరవై వేల ఆకులున్నాయి. ఇప్పుడు ధర పెరిగి వుండవచ్చు. అన్ని సరకుల ధరా పెరిగినప్పుడు అది పెరగదా? వంద ఎనిమిదణాలన్నా మొత్తం వందరూపాయలు రావచ్చు. రెండు బళ్ళు కట్టించుకుని నంజమ్మ రామణ్ణనీ సర్వక్కనీ వెంటతీసుకుని తిపటూరికి వెళ్ళింది. సర్వక్కవి ఆరువేలాకులున్నాయి. ఇన్ని కట్టలు ఒక్కసారిగా రావటం చూసి కోమటిశెట్టి

చౌకగా అడిగాడు. "అమ్మా! ఎక్కడ చూసినా కరవు. తినటానికే లేదు. విస్తళ్ళెవరికి కావాలి? ఏదో మీరు తెచ్చారని కొంటున్నాను. వంద నాలుగణాలు వేసుకుంటాను" అన్నాడు.

"ఇదేమి శెట్టిగారూ! మేము, కోసి, మోసి, పేర్చి, కూర్చి చేతులరగా కుట్టి తెస్తే నాలుగణాలంటే ఏం ధర్మం?"

"ధర్మం మాటకేం గాని, కావలిస్తే వేరే చోట అడిగి చూడండి."

వేరే అంగళల్లో అడిగితే వంద మూడణాల కడిగారు. మొదటివాడికే విస్తళ్ళ కట్టలన్నీ అమ్మి, నంజమ్మ మూడున్నర రూపాయి, సర్వక్క ఒకటిన్నర రూపాయి బండి అద్దె ఇచ్చారు. నంజమ్మ తనకూ కూతురికీ మూడు రూపాయల చొప్పున రెండు చీరెలూ, రామణ్ణకొక చొక్కా, విశ్వానికొక చొక్కా, ఒక లాగు కొన్నది. అన్నీ పోగా ఇంకా ముప్పై ఏడు రూపాయలు మిగిలాయి. వెంట తీసుకెళ్ళిన ఎండిపోయిన రొట్టెలే నమిలి మింగి, నీళ్ళు తాగి, అందరూ వూరికి తిరిగొచ్చారు. అంతలో రాగుల ధర బస్తాకు ఇరవై రూపాయల దాకా పెరిగింది. ముప్పై ఏడు రూపాయల రాగులెన్ని రోజులు వస్తాయి?"

## 4

అదే సమయానికి ఎక్కడ చూసినా ప్లేగు తలెత్తింది. ఈసారి బూరుబూరు సుంకలమ్మ రాలేదు. ఉన్న పళంగా తలెత్తిన మారి వూరూరా భయంకరంగా బలి తీసుకుంటూంది. చుట్టుపక్కల ఏ వూళ్ళో చూసినా ఎలకలు పడుతున్నాయి. కొన్ని వూళ్ళల్లో ఎలకలు ముందే మనుష్యులు ప్లేగు తగిలి చచ్చిపోయారు. రామసముద్రంలో కూడా కొందరికి గడ్డలు కట్టాయి. తక్షణమే వూరు వదిలేశారు. సొంత పొలమున్నవాళ్ళు తమ తమ పొలాలలో, తోటలలో షెడ్లు వేసుకుంటే, వున్న పొలం పోయిన నంజమ్మ, సర్వక్క లాంటి వాళ్ళు గ్రామదేవత గుడి వెనకాల వేసుకున్నారు.

ఈ ఏడు వానలు లేక, మోదుగు చెట్లు చిగిరించి పెద్ద పెద్దాకులు వేయలేదు. పాత ఆకులు ముదిరి గట్టిపడ్డాయి. వాటిని కోసి తెచ్చినా కుట్టలేం. షెడ్డులో గోళ్ళు కొరుక్కుంటూ కూచోవడమెలాగ? తిపటూరిలో విస్తళ్ళమ్మిన డబ్బుతో కొన్న రాగులు కూడా అయిపోవచ్చాయి. మరో మూడు రోజులు గడిస్తే పొయ్యి రాజెయ్యనక్కరలేదు. కొందరు మగాళ్ళు రాత్రిపూట వాళ్ళవీళ్ళ తోటల్లోకి

జొరబడి చెట్టెక్కి చేతికి దొరికిన లేతవో, ముదిరినవో కాయలు కోసి తెచ్చి వాటినే వొలిచి, ఆకలి తీర్చుకుంటున్నారు. అది తెలిసి సొంతదార్లు రాత్రిపూట కాపలా కాస్తే రాళ్ళ దెబ్బలు తగిలాయి. ఊపిరుంటే పుప్పమ్మకు తిన వచ్చని కాపలా కాయటం మానేశారు. ఏ దారీ లేనివాళ్ళ ఇంట్లో వున్న వెండీ బంగారం కాశింబడ్డీ షావుకారు అంగడి చేరుతున్నాయి. తరవాత ఇత్తడి రాగి పాత్రలు కూడా అక్కడికే వెళ్ళి కూర్చుంటున్నాయి.

నంజమ్మ ఇంట్లో రాగులయిపోయాయి. మరుసటిరోజు రామణ్ణ ఏమీ తినకుండానే బడికి నడిచి వెళ్ళాడు. కంబనకెరిలో బడి వూరవతల రెండు ఫర్లాంగుల దూరంలో ఎత్తైన జాగాలో వుండటంవల్ల దాన్ని వదలలేదు. మూయలేదు. చదువంటే రామణ్ణ చెవికోసుకుంటాడు. పాఠ్యపుస్తకాలలో తనకుకాని పాఠాలు కూడా తనకు తానే చదివేవాడు. ఇంగ్లీషుపుస్తక మా చివరనుండి ఈ చివరిదాకా కంఠస్థమయింది. ఒక రోజైనా బడి ఎగ్గొట్టడం వాడి కిష్టంగా వుండదు. అయిదు మైళ్ళు వస్తుతో నడిచి బడిలో నీరసంగా కూర్చున్నాడు. ఒకటిన్నర గంట కొట్టినప్పుడు ఆవూరి పిల్లలు తమ తమ షెడ్లకి అన్నంతినడానికి వెళ్ళారు. పల్లెటూళ్ళనుంచీ వచ్చిన పిల్లలు రొట్టెలు తినడానికి బడికి దగ్గిరేవున్న చెరువుకు వెళ్ళారు. ఎండిపోయిన చెరువులో ఒక నుయ్యి తోడారు. రామణ్ణ బడి వెనకాల చెట్టు నీడలో వుండ ముట్టుకుని కూర్చున్నాడు.

కొడుకు పస్తు వెళ్ళాడని నంజమ్మ బాధపడుతోంది. పార్వతి ముఖం వేళ్ళాడవేసుకుని ఓమూలలో కూర్చుంది. విశ్వమాకలేస్తోందని గోలచేస్తూ తల్లికొంగుపుచ్చుకుని లాగుతున్నాడు. ఒకరోజు వస్తుండవచ్చు. రెండురోజులుండవచ్చు. ఎన్నిరోజులుండదానికవుతుంది. ఇంతవరకూ నంజమ్మ ఏ పాత్రా కాశింబడ్డికి తాకట్టుపెట్టలేదు. ఇరవైరూపాయల వెలచేసే పాత్రకు కాశింబడ్డీ రెండు రూపాయలిస్తే ఎక్కువ. రాగుల ధర విపరీతంగా పెరిగిపోయింది. రూపాయికి రెండు సేర్లే. రెండురూపాయలిచ్చి నాలుగుసేర్లు తెచ్చినా, ఒకరోజు, రోజున్నరో వస్తే వస్తుంది. మళ్ళీమరో పాత్ర తాకట్టుపెట్టాలి. పదిహేను ఇరవైరోజుల్లోవున్న పాత్రలన్నీ వూడ్చుకుపోతే తరువాతయినా పస్తుండక తప్పదు. దేవుడు కష్టకాల మిలాగే వుంచుతాడా? మళ్ళీ తిండిగింజలు దొరకవచ్చు. కానీ పాత్రలన్నీ పోగొట్టుకుంటే మళ్ళీ సంపాదించడమెలాగ? అవి కూడా అక్కమ్మ తెచ్చిచ్చినవి.

నంజమ్మ విచక్షణ ఈ పద్ధతిలో సాగుతోంది. కానీ మెదడుకు పొట్టకూ చాలాదూరం. పార్వతి ఆకలితో పడుకుంది. ఏడ్చిరాద్ధాంతం చేసిన విశ్వ మమ్మను కొట్టి, అలిసిపోయి మాట్లాడకుండా ఓమూలలో పడివున్నాడు. నంజమ్మ కడుపుకూడా మాడిపోతోంది. మొగుడు మధ్యాహ్నం నుంచీ ఎక్కడికో వెళ్ళాడు. తల్లి ఇంటికి వెళ్ళి వుండవచ్చు. అక్కడే కడుపుకేమైనా పడివుంటుంది. గంగమ్మ వద్ద ఇంకారాగులున్నాయి. తల్లీకొడుకు ఇద్దరేగనక ఆమె చాలా నిలవచేసింది. గడచిన మూణ్ణెల్లల్లో రెండుసార్లు దూరదేశాలకు వెళ్ళి యాయవారంచేసి బియ్యంమూటే తెచ్చింది. రామణ్ణ ఇంకా బడినుంచీ రాలేదు. చీకటిపడి చాలా సేపయింది. కుర్రాడు వస్తువెళ్ళాడు. నడచి రావటానికి శక్తిలేక ఎక్కడైనా పడిపోయాడేమో! దారిలో కాస్తదూరమైనా వెళ్ళి చూసిరావాలి. ఈ చీకటిలో, ఆడది తాను, ఒంటరిగా వెళ్ళడమెలాగ? పార్వతికి పైకిలేచే ఓపికలేదు. దాన్ని తీసుకెడితే షెడ్డులో విశ్వమొకడే ఎలావుంటాడు. రాత్రివేళ షెడ్డుతాళంవేసి వెళ్ళినా అపాయమే. ఎవళ్ళయినా దూరి చేతికి దొరికింది పట్టుకుపోతే ఏంచేయాలి? కడుపు గడవని గడ్డురోజులలో ఏం దొరికినా దొరికినట్టే.

పార్వతినీ, విశ్వాన్ని ఇంట్లోనేవదిలి –' చెరువు వేపు వెళ్ళి ఇప్పుడే వస్తాను' అని చెప్పి ఆమె బయటికి వచ్చింది. కంబనకెరె దారిలో మూడు ఫర్లాంగులు నడిస్తే ముదిమామిడి చెట్టుంది. ఏనాటిదో ఆ చెట్టు. దానినిండా గూళ్ళుకట్టుకుని గుడ్లగూబలున్నాయి. "గూ–గ్గూ–గ్గూ, గుడ్లీతా" అన్న వాటి కూతలు కీడు సూచిస్తాయి. ఎవళ్ళింటిమీదైనా గూబ కూర్చుని "గూ, గ్గూ, గ్గూ–గుడ్లీతా" అంటే ఆ ఇంట్లో ఏ చంటి పిల్లో పిల్లాడో చచ్చిపోతారు. పెద్దాళ్ళు చస్తే కాలుస్తారు. చిన్నపిల్లలైతే పూడుస్తారు. బ్రాహ్మణులు కాకపోతే ఎవరు చచ్చినా పూడుస్తారు. గనక బ్రాహ్మణ ఇంటిమీద గూబ కూస్తే పిల్లలుమాత్రం చస్తారు. ఇతరుల ఇళ్ళమీదయితే ఎవళ్ళయినా చచ్చిపోవచ్చు. చెట్టుదగ్గిరికి వచ్చేసరికి నంజమ్మకు భయంవేసింది. వెనక్కివెడదామా అనుకుంది. కాని రామణ్ణ ఆ చెట్టుకిందనుంచీ రావాలి. తొమ్మిది పదేళ్ళ కుర్రాడు ధైర్యంగా ఎలారాగలడు?

ఆమె వెనక్కి రానూలేదు. అక్కడవుండనూలేదు. ఎలాగో మరో రెండు ఫర్లాంగులు నడిచింది. దారిప్రక్కనే ఒక పెద్ద బండవుంది. దాన్నెక్కి రామణ్ణ కోసం కనుచూపు ఆనేదాకా చూసింది. అరగంటయినా వాడు రాలేదు. ఆమె కెందుకో భయమేసింది. హరిశ్చంద్రుడి కథ గుర్తొచ్చింది. చంద్రమతి లోహితాశ్వుడి

కొరకిలాగే ఎదురుచూస్తుంది. కానీ లోహితాశ్వుడు పాము కరిచి చచ్చిపడిపోయాడు. తరువాత వాడితోకూడా వెళ్ళిన కుర్రాళ్ళు వచ్చి చెబుతారు. చంద్రమతి గొల్లుమని ఎంత ఏడ్చిందో! నంజమ్మకు కూడా ఏడుపు వచ్చింది. కబ్బళ్ళి మెట్ట కవతలవున్న పుట్టలదిబ్బ ప్రక్కనించేదారి. దిబ్బంతాపుట్టలే. చుట్టుపక్కల కప్పల్ని పట్టడానికి వెళ్ళేపాములన్నీ ఆ పుట్టల్లోనికే వెడతాయి. వస్తూ దారిలో కుర్రాడు చూడకుండా ఏదైనా పాముమీద అడుగువేశాడేమో! లేదా పుట్టలో నుంచి తలెత్తిన పాముమీద కుర్రతనం కొద్దీ రాయి రువ్వాడో! భగవంతుడా! అలాంటివేవీ జరక్కపోతే అంతే చాలు. రామణ్ణ బుద్ధిమంతుడు. అల్లరి చేసే రకం కాదు. విశ్వమల్లరి కుర్రాడు.

ఆమె కాసేపలాగే నుంచుంది. షెడ్డుకెళ్ళి, ఎవళ్ళయినా ఇరుగు పొరుగు మగాళ్ళకి చెప్పి వెదకడానికి పంపనా, వాళ్ళతో కూడా నేనూ వెళ్ళనా అనుకుంది. కన్నతండ్రికి గొడవే అక్కరలేదు. మధ్యాహ్నంనుంచీ ఆయనలేడు. షెడ్డుకు వెడదామని వెనక్కి తిరిగింది. మళ్ళీ కాసేపాగి చూద్దామనుకుంది. దృష్టి రామణ్ణ రావలసిన దారివేపే వుంది. చన్నేనహళ్ళి మునసబు శిద్దేగౌడను మూడేళ్ళక్రితమే ఆ పెద్దబండ దగ్గరే ఖూనీ చేశారు. ఆ బండమీద పడుకోబెట్టి, వాడితల రాళ్ళతో పగలగొట్టి చంపేశారు. శిద్దేగౌడ దయ్యమై ఆ బండదగ్గరే చీకటిరాత్రుల్లో తిరుగుతూవుంటాడట! ఒకోసారి వాడు గొల్లుమని ఏడవటం కూడా తిపటూరినుంచీ బళ్ళల్లో వచ్చేవాళ్ళు విన్నారట!

నంజమ్మకు భయమేసింది. ఒళ్ళంతా ఒకసారి కంపించింది. వెనక్కివెడదామనుకుంది. కానీ కొడుకు ఇంటికి రాలేదు. పెద్దది తానే భయపడి వెళ్ళిపోతే చిన్నకుర్రాడెలా రాగలడు? అని ఎదురుతెన్నులుచూస్తూ నుంచుండిపోయింది. చీకట్లో దూరంలో ఏముందో కనిపించదు.

దయ్యమొక చోటంటూ వుండదట! చుట్టుపక్కల తిరుగుతూ వుంటుంది. ఇక్కణ్ణించి కంబనకెరె వేపు సంచారం వెళ్ళి, ఒంటరిగా వస్తున్న రామణ్ణను పట్టుకుని వుంటే ఏంగతి? ఆఁ, ఈ దెయ్యం గియ్యం అన్నదంతా అబద్ధం. మానాన్న, కల్లేశు, గాఢాంధకారంలో నడిచివెళ్ళటం లేదూ? దెయ్యాలుంటే వాళ్ళనేమీ చేయవేం? ఈవూహవల్ల మనస్సు కాస్త స్తిమితపడ్డా రామణ్ణ చిన్నకుర్రాడన్నది గుర్తొచ్చి, మళ్ళీ భయమూ దిగులూ కలిగాయి.

ఇంతలో ఎవరోవచ్చిన అలికిడయ్యింది. అవును ఎవరో మనుష్యులే. తలమీదేదో

మూట వుండేలావుంది. ఐడికెళ్ళిన కుర్రాడికి తలమీదమూటేమిటి? రామణ్ణకాదు. మరెవరోకావచ్చు. అంతలో వాళ్ళాదారివదిలి తోటవేపు వెళ్ళినట్టయింది. తరువాత దేవో్న చూసి భయపడ్డట్టు గబగబా నడిచారు. ధైర్యం తెచ్చుకుని "ఎవరది?" అని ఆమే అడిగింది. వాళ్ళుమాట్లాడలేదు. మరోసారి "ఎవరావేపు వెడుతున్నది?" అవేపరికి వాళ్ళక్కడే నుంచున్నారు. తరవాత "ఎవరు? అమ్మేనా?" అని వినిపించేసరికి వాడు రామణ్ణే అని పోల్చుకుంది.

"నేనేరా బాబూ! అదేమిటలా వెడుతున్నావు ముళ్ళల్లోకి?" రామణ్ణ దగ్గిరికొచ్చాడు. వాడి తలమీద మూడుపెద్దపెద్ద పనసకాయలున్నాయి. ఈత తాటిలో కట్టిన ఆమూడింటిని తన అడ్డపంచెలో కట్టి నెత్తిమీదెట్టుకున్నాడు.

"ఎందుకలా వెడుతున్నావు బాబూ?" అమ్మ అడిగింది.

"అక్కణ్ణించీ దూరానికి నల్లగా కనిపించింది. ఇక్కడ - ఈ బండదగ్గిరే కదా చన్నెవహాళ్ళి శిద్దేగౌడను ఖూనీ చేసింది? వాడు దెయ్యమయ్యాడని అంటారుకదా? దెయ్యమనుకుని ఆవేపు పరుగెడుతున్నాను. నువ్వని నాకేం తెలుసు?"

"ఇవెక్కణ్ణించీ తెచ్చావు? "నేను తెస్తా నివ్వు" అని ఆమూట తన నెత్తికెత్తుకుంది.

"అక్కడే దారిలో గౌడనక్కొప్పలుందిగా. అక్కడో తోటలో పనసచెట్లులో వేళ్ళాడుతున్న కాయలు చూశాను. కావాలనే చీకటిపడ్డాక బయల్దేరాను. మెల్లిగా కంచెతొలగించి, ఆ మూడుకాయలూ కోసుకొచ్చాను. ఈతతాటి కంబనకెరె దగ్గిరే లాక్కుని సంచిలో వేసుకుని వచ్చాను. తరిగి కూరచేసి తింటే కడుపునిండదా అమ్మా!"

కొడుకు సాహసానికి, తెలివితేటలకూ ఏమనాలో ఆవిడికి బోధపడలేదు. దొంగతనం చేయడం, అబద్ధాలు చెప్పడం పాపమని పిల్లలకు నేర్పింది. రామణ్ణ మిడిల్ స్కూల్లో చదువుతున్నాడు. ఈ పాపపుణ్యాలు వాడికి తెలియనివి కావు. ఇప్పుడావిడ కొడుక్కి బుద్ధులు చెప్పే ప్రయత్నం చేయలేదు. ఇద్దరూ వడివడిగా అడుగులు వేశారు. ఇంట్లో పిల్లలు నీరసంగా పడివున్నారు. తామిద్దరూ ఆకలిగొన్నారు. రామణ్ణ పదిమైళ్ళు నడిచాడు. పనసకాయతరిగికూర వండితే అదేకాస్త ఆకలిబాధ తీరుస్తుంది.

వాళ్ళు షెడ్డుకు వచ్చేసరికి, చెన్నిగరాయలు పక్కమీద గుర్రెట్టి నిద్రపోతున్నాడు. కడుపునిండకపోతే కంటికి నిద్రఎలావస్తుంది? గురక ఎలా పెడతారు? అన్నది ఆవిడికి తెలియందికాదు. రామణ్ణకూ తెలుసు. ఇద్దరిలో ఎవరూ మాట్లాడలేదు.

ఆయమ్మ లేపనూలేదు. పార్వతీ -విశ్వం ఇద్దరూ వుండచుట్టుకుని పడుకుని నిద్రపోతున్నారు. కత్తిపీటతెచ్చి, నంజమ్మ మూడుకాయలు త్వరత్వరగా తరిగింది. తొక్కాపీచూ తీసేసి కాస్తముదిరిన పిక్కలు తొలుత వుడికించడానికి వేరుచేసింది. వాటికే కాస్త కారప్పొడి వేసింది.

అవి వుడుకుతూ వుండగా రామణ్ణ మెల్లిగా అడిగాడు "అమ్మా! 'ఒక్కలిగేల ఇంటి రొట్టె తింటే పాపం రాదా?"

"ఎందుకునాన్నా?"

"ఈరోజు మధ్యాహ్నం తిండిలేకండా చెట్టుకింద కూచున్నాను. నా స్నేహితుడొకడు కెంగలాపురం నరసిగౌడ అని వున్నాడు. వాడి రొట్టె మిగిలిపోయింది. నువ్వెందుకు రొట్టెతినలేదని అడిగాడు. నేను చెప్పలేదు. వాడే "తింటే ఏం కాదోయ్. నేనెవళ్ళకీ చెప్పనులే. తినరా' అని, ఒక రొట్టె, నువ్వుంపొడి ఇచ్చాడు. రొట్టె బాగా అరచేతిమందముంది. తినేశాను. వాడెవళ్ళకీ చెప్పనని చేతిలో చెయ్యేసి చెప్పాడు".

నంజమ్మ ఏమీ అనలేదు. రామణ్ణే "చెప్పమ్మా! పాప మూ అది? దేముడేమీ చేయడా?" అని మరోసారి అడిగాడు.

"విశ్వం మాదేవయ్య కంచంలో భోంచేశేవాడుగా?"

"వాడు కుర్రాడు నేను పెద్దాణ్ణిగా?"

కొడుకు ప్రశ్నకు సమాధానమావిడకి తెలియలేదు. పిల్లలకులేనిపాపం పెద్దవాళ్ళకెక్కడనుంచీ వస్తుంది? ఎలా వస్తుంది? అన్న ప్రశ్నలను గూర్చి మనస్సు ఆలోచిస్తోంది. రామణ్ణ మళ్ళీ అడగలేదు. పనసతొలలు వుడికాయి. వుప్పేసి దించిపెట్టి, పార్వతిని, విశ్వాన్ని లేపింది. "పనసకాయ కూర తింటారా" అని మొగుణ్ణడిగితే "నాకక్కరలేదు" అని నగం నిద్దట్లోనే చెప్పి మళ్ళీ గుర్రుపెట్టాడు. కూర ఎంతరుచిగావుందో! పిల్లలు కడుపునిండా తిన్నారు. నంజమ్మకు కూడా కడుపు నిండింది. రాత్రిపడుకున్నాక ఆమె రామణ్ణతో అంది. "మళ్ళీ ఆ తోట కెళ్ళకు. ఈరోజు దొంగతనమయిందని తెలిశాక తోటవాళ్ళు కాపలావుంటారు"

## 5

ఆహారం కరువైన కొద్దీ, దాని కోసం వెదికే ప్రయత్నం ఎక్కువయింది. చెరువంతా ఎండిపోయి, నల్లనిరేగడి బీటలువారింది. పూడుమట్టి తవ్వితే వేరు

వెళ్లింకి దొరుకుతుందని బెస్తమాట కనుక్కున్నాడు. ఒకరోజు వాడు యదాలాపంగా తెచ్చిందే తడవుగా, అందరూ చెరువువేపు పరుగెత్తారు. ఒక్కొక్కరొక్కక్క జాగాలో తవ్వడం మొదలెట్టారు. బొటనవేలి లావు వేళ్ళు చిలగడదుంపల్లాగ ఇక్కడోటి అక్కడోటి దొరికేవి. పొద్దస్తమానం ఒకరిలా తవ్వితీస్తే నలుగిరికి సరిపడావేరు దొరికేది. నంజమ్మ పార్వతి కూడా ఓపికాసి, తవ్వుగోల, గంప తీసుకుని బయలుదేరారు. విస్తళ్ళు కుట్టే బదులు ఈపని. ఏదైతేనేం, తలమీదికి చెరుగులాక్కున్నా, ఎండముఖంమీదా, చేతులు మీదా పడి మాడ్చేస్తోంది. మొదటిరోజు వేళ్ళు తెచ్చి, నూతినీళ్ళతో రుద్దిరుద్ది కడిగి, వుప్పు, కారం వేసి వుడికించారు. దాని వాసన చూస్తే తినబుద్దేయటంలేదు. కాని కడుపు తాళం వేస్తోంది. చివరికి వుడికించిన దేదీ మిగలలేదు. రేపు ఎండెక్కకముందే వెళ్ళాలని తల్లీకూతురు నిశ్చయించారు.

మరుసటిరోజు వీళ్ళు బయల్దేరేసరికి సర్వక్కాసిద్ధమయింది. ముగ్గురూ కలిపి మట్టి తవ్వుతూ వుండగా నంజమ్మ అంది. "చూడండి మాదేవయ్యగారు వెళ్ళేపోయారు. వూరికీ గతిపట్టింది. సాధు సజ్జనుల శాపం మంచిది కాదనడం ఇందుచేతే".

"ఎవరో నలుగురు ఎదవకుంకలన్నందుకు వూరికే ముప్పొచ్చింది"

"మీ జనమే ఆయన్నలా అన్నారు".

"నంజమ్మగోరూ! మీకింకా లోపలిగుట్టెరికలేదు. మాజనానికట్టాగ నేర్పింది మా ఇంటాయనే. ఇట్టాంటి లాయరీపాయింటాయన్కే ఎరిక"

"ఆయన మళ్ళీ వచ్చినా రావచ్చండీ. గుడిలో ఆయనవికొన్ని పాత్రలు, రాగులు, పప్పులు, మిరపకాయలు, వుంచేసి వెళ్ళారట. తాళం చెవి ఆయనవద్దేవుంది."

ఏడెనిమిది రోజులు సర్వక్కదుంపలు తవ్వటానికి వీళ్ళతోపాటు వచ్చింది. ఒకరోజావిడే ఎవళ్ళకీ తెలియకండా అయిదుసేర్లు రాగులు, సేరుబియ్యం తెచ్చిషెడ్డులో నంజమ్మకిచ్చి చెప్పింది. "నంజమ్మగోరూ! ఎవళ్ళకీ చెప్పకండి. మా ఆయన రెండుమూటలు రాగులు, పాతికసేర్లు బియ్యం, కాఫీగింజలు, - అన్నీ అట్టుగొచ్చిరు. కోర్టుపని మీద తిపటూరికెళ్ళారు".

ఈ రాగులు దాచేసి జాగర్తగా చేస్తే బడికి వెళ్ళే రామణ్ణకు, చిన్నకుర్రాడు విశ్వానికీ వారం రోజులైనా పొద్దుట రొట్టెచేసివ్వచ్చు ఈ దుంపలు తిని కడుపులో

ఒకటేమంట. ఒకరోజైనా అన్నం చేసి చారుపోసుకుని తినవచ్చు. సర్వక్క చూపిన ఆదరణకి నంజమ్మ సంతోషించింది. రేవణ్ణశెట్టిలో కడమదుర్గుణాలెన్నివున్నా, అవసరమైనప్పుడు బుద్ధి వుపయోగిస్తాడు. ఏదో కోర్టు గిరాకీతగిలి బ్రహ్మని తిమ్మి, తిమ్మని బ్రహ్మ చేసివుంటాడు. లేకపోతే రెండు బస్తాల రాగులేమిటి, పాతికసేర్ల బియ్యమేమిటి తేవడమేమిటి? కానీ అతని సంపాదనంతా కొంపలుకూల్చే సంపాదన - అనుకుని నంజమ్మ రాగులు తిరగలికి పోసి విసరడానికి కూర్చుంది.

అయిదారురోజుల్లో వూళ్లోవున్న బలిజలకూ, నొణబగౌడలకూ, తతిమ్మా కులాలవాళ్ళకీ పెద్ద పోరాటం జరిగింది. మాదేవయ్యగారు దేవాలయంలో తమగదిలో రాగులు, అనపగింజలు, వుంచివెళ్ళిన సంగతికి ఎంతమందికో తెలిసిపోయింది. నంజమ్మ యదాలాపంగా సర్వక్కకు చెప్పింది. సర్వక్క మొగుడితో చెప్పింది. ఆ సరకంతా తమ ఇంటికి రావాలన్న ఆశ ఆమెకు లేకపోలేదు. ఇలాంటి వ్యవహారాలలో రేవణ్ణశెట్టి బుద్ధి చాకులాంటిది. ఒకరోజు ఖాళీచేసిన వూళ్ళోకెళ్ళి ఆ గదితాళం పగలగొట్టి, వున్న సరకంతా కొట్టేయాలని పథకం వేశాడు. కాని వదిలిన వూళ్ళోకి ఒకడే వెళ్ళాలంటే భయం. సుంకాలమ్మ వూళ్ళోతిరుగుతూ వుంటుందట! ఈపనికి రాత్రిపూట వెళ్ళాలి. వెళ్ళి ఈశ్వరుని గుడిలో లోపలి అంకణాలో దూరి, తాళం బద్దలు గొట్టాలి. సుంకాలమ్మ అంటే ఈశ్వరుని భార్య పార్వతేగా? ఆమె గుడికే వెడితే వూరు కోదు. నెత్తురుకెక్కేలా కొట్టి చంపదూ? కాని అక్కడున్న రాగులు అవీ వదులు కోనూలేదు. ఒకడికంటే ఇద్దరయితే నయమని తన పథకాన్ని, దాయాది పుట్టణ్ణశెట్టికి చెప్పాడు. పుట్టన్న శెట్టి ఆరాత్రి తన పెళ్ళాం దగ్గిర మాటజారాడు. ఇల్లాగే అది బలిజకులానికంతా తెలిసింది. మాదేవయ్యగారు మా జాతి, మనమంతా కలిసిపంచుకుందాం అనేదాకా వ్యవహారం వెళ్ళింది. ఇది నొణబగౌడలకు తెలిసి, ఒక్కలిగ, కురుబ, సాతి, బెస్త-ఇలాగే ఇతరజనానికి పాకింది. అయ్యగారు కేవలం బణజిగల ఇళ్ళల్లోనేకాదు భిక్షమెత్తింది. మాజాతివాళ్ళూ పెట్టారు. మాకూ వాటారావాలి అని అన్నికులాలవాళ్ళు పట్టుపట్టారు. ఈ పట్టుదల, పోట్లాటగా మారి, ఒకరినొకరు తన్నుకునేదాకా వెళ్ళింది. చివరికి గ్రామ మునసబు శివేగౌడ న్యాయంచెప్పి, ఆ ధాన్యాన్ని అందరూ పంచుకోవాలని నిర్ణయం జరిగింది. అందరూ ఒప్పుకున్నారు. ప్రతి ఇంటికీ దీనివల్ల రెండు సేర్ల రాగులు రావచ్చు.

ఒకరోజు మధ్యాహ్నం ఇంటికోబంటు చొప్పున చేరి వూళ్ళో కెళ్ళారు. గుళ్ళోకెళ్ళి చూసేసరికి అయ్యగారి గదికి తాళమేలేదు. లోపలికెళ్ళి చూస్తే రాగుల బస్తాలులేవు. అనపగింజలూ లేవు. మిరపకాయలబుట్ట ఖాళీగా వుంది. అల్యూమినియం పాత్రలు మాత్రమున్నాయి.

"ఎవడో నా కొడుకు ఇచ్చాడ్రాలోకరా" అని అందరూ అన్నారేగాని, ఆ ఇచ్చిందెవడో తెలుసుకునే మార్గమేమిటో ఎవరికీ తోచలేదు. నిరాశతో నీళ్ళుకారిపోయి వెనక్కెళ్ళారు.

వేరు వెల్లంకి కూడా అయిపోయింది. చెరువుల్లో జనం తవ్వనిచోటు అంగుళం మేరకూడా లేదు. ఇంతలో ఎవరో జనుము కోసి, దానిదుంప తెచ్చి వుడికించి తిన్నారట! అదికూడా వేరు వెల్లంకిలాగే వుంటుందనేసరికి వూళ్ళో అందరిదృష్టి చుట్టుపక్కలవున్న జనపచెల్ల మీద పడి, అవి ధ్వంసమయ్యాయి. వేరువెల్లంకి అయితే తవ్వితవ్వితీయాలి. అలుపువచ్చేది, జనపదుంప తీయడం కష్టంకాదు. లావుగావుంటుంది. అందరూ దాన్ని కడుపు నిండా తిన్నారు.

తిన్న రెండవరోజే వూళ్ళోవాళ్ళకి విరేచనాలు పట్టుకున్నాయి. అసలే తినడానికేమీ లేక ఎండిపోయిన పొట్టలు ఈ విరేచనాలయ్యాక ఆరుకపోయి సొమ్మసిల్లి జేశాయి. వూళ్ళో మొత్తంమీద పదహారుగురు దానివల్ల చచ్చిపోయారు. తతిమ్మా వాళ్ళు విరేచనాలకు కారణం గుర్తించి జనపదుంపలు మానేవారు.

## 6

నంజమ్మ, పార్వతి, సర్వక్క ముగ్గురూ చెరువుకు వేరువెల్లంకి తేవటానికి వెళ్ళినప్పుడోరోజు పార్వతికి విపరీతంగా తలనొప్పి వచ్చింది. తలమీద చెరుగు ముసుగువేసుకున్నా ఎండవేడికి అది ఆగలేదు. "చిట్టీ నువ్వు షెడ్డుకెళ్ళి, నేను నంజమ్మగోరూ అయినకాడికి తెస్తాం". అని సర్వక్కచెప్పింది. నంజమ్మా అదేమాట చెప్పాక పార్వతి ఒక్కతే ఇంటికెళ్ళింది.

ఎండకుపగిలి బీటలువారిన రేగడిమీదుగా నడిచివెళ్ళి గుడివద్ద కట్ట ఎక్కిదానిమీద నడుస్తూ తమ షెడ్డువేపు వెడుతూవుంటే కట్టచివర నరసి ఎదురుపడ్డది పార్వతిని పలకరించింది "దుంపలు తవ్వటమయ్యిందా తల్లీ?"

"ఇంకా అవలేదు. తలనొప్పిగా వుంటే వచ్చేశాను."

"మా అంగడిదాకారా, ఇన్ని పప్పులిస్తాను. తిందువుగాని"

పార్వతి బదులు చెప్పలేదు. షెడ్డుకు తిరిగే మలుపు వచ్చేసరికి తనదారిన తానునడుస్తోంది. నరసమ్మే "సిగ్గెందుకూ రా తల్లీ! మేము చేసిన పప్పులు తింటే ఏమీ కాదులే" అంటూ వుండగానే షెడ్డు దగ్గిర ఆడుతూ వున్న విశ్వం అక్కనుచూచి దగ్గిరకు వచ్చాడు. నరసి మళ్ళీ పప్పులిస్తానన్నమాట విన్న విశ్వం "అక్కయ్యా! పద తీసుకొద్దాం". అని పట్టు పట్టాడు. ఇద్దరూ అంగడి దాకా వచ్చారు. నరసి ఇద్దరికీ చెరి చేరడేసి పప్పులు పెట్టింది. బెల్లం ముక్కలు కూడా ఇచ్చింది. విశ్వం తనకిచ్చినవి నోట్లో పోసుకుని నమలడం మొదలెట్టాడు. పార్వతి పిడికెడు నోట్లో వేసుకుంది. వెంటనే ఆవిడ కళ్ళల్లో నీళ్ళు నిండాయి. "ఎందుకమ్మాయ్ ఏడుస్తావ్?" నరిసి అడిగింది. మరింత దుఃఖంతో వెక్కి వెక్కి ఏడ్చింది. నరసి దగ్గిరకు వచ్చి లాలించి అడిగేసరికి చెప్పింది "మా రామణ్ణ పస్తుతో వెళ్ళాడు బడికి".

నరిసికి జాలీ దుఃఖమూ కలిగాయి. మరో చేరెడు పప్పులు, బెల్లం ముక్క పార్వతి కొంగులోపోసి "తమ్ముడొచ్చాక ఇవ్వు" అన్నాక పార్వతి కన్నీళ్ళాగిపోయాయి. "మేమెడతాం నరసమ్మా"- అని చెప్పి, విశ్వం చేయిపుచ్చుకుని షెడ్డుకు వెళ్ళింది. తాళంతీసి, లోపలికెళ్ళి, చాపేసుకుని, పడుకున్నాక ఆలోచించింది. తానింతకు ముందు నరసమ్మతో మాట్లాడలేదు. ఆవిడ మంచిదికాదట. ఈ రోజావిడే ముందు నరసమ్మతో మాట్లాడలేదు. ఈరోజావిడే పిలిచి పప్పులు పెట్టింది. తాను తినివుండకూడదు. అమ్మకుతెలిస్తే చీవాట్లు తప్పవు. అమ్మకు చెప్పరాదనుకుంది. రామణ్ణకని వుంచిన పప్పులు గుర్తొచ్చాయి. వాడు వచ్చాక ఎక్కడివని అడిగితే ఏం చెప్పాలి? - అని అర్ధగంట ఆలోచించింది. చివరికో వుపాయం తోచింది. కొంగులో వున్న పప్పులు బెల్లం తీసి విశ్వానికిచ్చి "ఇవీ నువ్వే తినరా" అంది.

"రామణ్ణకు?" వాడడిగాడు.

"వాడొచ్చేసరికి అమ్మ దుంపలుడికించి వుంటుంది. వాడికి పప్పులంటే పడదు. నువ్వే తిను."

"నీకు సగం. నాకు సగం" అని విశ్వం చెప్పినా వినక అన్నీ వాడిచేతే తినిపించింది. చెంబులో నీళ్ళు వంపుకుని తాగాక వాణ్ణి కూర్చోబెట్టుకుని "చూడు ఈరోజు నరసమ్మ కొట్టులో ఇవి తిన్నామని తెలిస్తే అమ్మ తంతుంది. ఎవళ్ళతోటి నువ్వు చెప్పరాదు."

"ఎందుకు తంతుంది?"

"ఎందుకో. నరసమ్మ చెడ్డదని అందరూ అనటంలేదూ? నువ్వెవళ్ళతోటి చెప్పరాదు"

"హూం"

"అలాగని ప్రమాణం చేయి"

విశ్వం అక్కయ్యచేతిలో చెయ్యేసి కొట్టి, ఒకసారి అరచేయి గిల్లి ప్రమాణం చేశాడు. కాని అంతటితో ఆవిడకి తృప్తి కాలేదు. వాణ్ణి దగ్గిరేవున్న కాళమ్మ గుడికి తీసుకెళ్ళి, తలుపువేసివున్నా గడపను తాకించి, ప్రమాణం చేయించి, "ఇప్పుడమ్మ మీద ఒట్టేట్టుకున్నావు. నువ్వేమైనా చెబితే గుళ్ళోవున్న బేతాళం వచ్చి నిన్నమాంతంగా మింగేస్తుంది" అని భయపెట్టింది.

"నేనేం చెప్పనే, చెప్పనంటే చెప్పను. నాకు తెలవదూ?"- అనివాడు కోపగించుకున్నాక అక్కయ్య వూరుకుంది.

సాయంత్రానికి అమ్మ వచ్చి దుంపలన్నీ కడిగి బాగుచేసి వుడికిస్తోంది. పొద్దుపోయాక రామణ్ణ వచ్చాడు. ఎక్కడికోవెళ్ళిన చెన్నిగరాయలూ షెడ్డు చేరుకున్నాడు. దుంపకూర తింటూ సగంలోనే నాకు చాలన్నాడు విశ్వం. "ఎందుకురా? ఏం తిన్నావు?"- అని అమ్మ అడిగేసరికి, పార్వతికి వూపిరాడలేదు.

కానీ విశ్వం "ఈ రోజెందుకో బాగులేదమ్మా. వాసన" అన్నాడే కాని మరేమీ చెప్పలేదు. అందరూ తిన్నాక వాడే అక్కనుషెడ్డు బయటికి తీసుకెళ్ళి "నేను చెప్పానేమే?" అని అడిగాడు.

"లేదు. నువ్వు చాలా తెలివైనవాడవు" - అని మెచ్చుకుని లోపలికెళ్ళింది.

## 7

చుట్టు పక్కలంతా ప్లేగు అణిగిపోయింది. అన్ని వూళ్లల్లోనూ షెడ్లు వదిలి వూళ్ళల్లోకి వెడుతున్నారు. రామసంద్రం వాళ్ళూ వూరు చేరుకున్నారు. వూరికి వచ్చినా, సివార్లలో వున్నా, తేడా ఏమీలేదు. అక్కడా తినడానికి లేదు. ఇక్కడాలేదు.

నంజమ్మ కో వుపాయం తట్టింది. వెనక అప్పణ్ణయ్య పాకవేసి, అటు తరువాత విప్పించిన గుండే గౌడ ఖాళీ జాగావుంది. ఈ ఏడాది వరపు వచ్చి పంటలు లేవుగనక సర్కారు వాళ్ళు భూమిపన్ను వినహాయింపు చేశారు. ఈ ఏడు నసూళ్ళకని కురుబరహళ్ళికి వెళ్ళలేదు. ఇటిటి పోటిగెలో మినహాయించుకోవాలని

గుండేగౌడ ఇచ్చి, ఇప్పించిన వందరూపాయలు తీర్చడమెలాగ?

చెన్నిగరాయలు వారం రోజులుగా వూళ్లోలేడు. ఎక్కడికెళ్ళాడన్నది ఎవరికీ తెలియదు.

నంజమ్మ కురబరహళ్ళికి వెళ్ళి అడిగింది. "గౌడగారూ! ఈ ఏడు పన్నులు లేవు. మీడబ్బు వచ్చే ఏటికి వేసుకుంటాను".

"సరేలే తల్లీ, ఇప్పుడిమ్మంటేమాత్ర మెక్కణ్ణించి తెస్తావు?"

"మరోమాట. మీ ఖాళీస్థలముందిగా మా వూళ్ళో. దానికి కంచవేసి తోటకూర పెంచుకుంటాను"

"పెంచుకో నాదేంపోయింది".

ముత్తైదవు ఇంటికి వచ్చిందని గౌడ ఒక కొబ్బెరకాయి, సేరు రాగిపిండి ఇచ్చి పంపించారు. ఆయన్ను ఆయన సంతతిని మనసారా దీవిస్తూ వూరికి వస్తూ ఏదో గుర్తు వచ్చింది. ఈ ఏడు భూమిపన్ను సర్కారు వాళ్ళు రెమిషనిచ్చారు. కానీ కరణీకపు పాటిగెమాత్రం వస్తుంది. శ్రీవారికి పాటిగె డబ్బుచేతిలో పడ్డదా, అది ఖర్చయ్యే దాకా తిపటూరి హోటలు వదిలి పెట్టరారు.డబ్బాయన చేతికి రాకుండా ఏమైనా చేయాలి. ఎవళ్ళు సహాయం చేయగలరు? కంబనకెరెవెళ్ళి రెవెన్యూ ఇన్స్పెక్టరుగారినే అడుక్కోవాలి. మరెవళ్ళూ సహాయం చేయలేరు.

శ్రీవారు వారంరోజులుగా వూళ్ళోలేరు. గంగమ్మ, అప్పణ్ణయ్య కూడా లేరు. వాళ్ళు దూరసీమల్లో వడ్లు - అడుక్కోవటానికి వెళ్ళారు. రోజూ కమ్మగా భోజనం దొరుకుతుందని ఈయనా తల్లీ తమ్ముణ్ణి అంటిపెట్టుకుని వుంటారు.

మరుసటిరోజు రామణ్ణను తీసుకుని ఆమె కంబనకెరె వెళ్ళింది. తల్లీ కొడుకు రెవెన్యూ ఇన్స్పెక్టర్ ఇంటికెళ్ళి ఆయనకు నమస్కారం చేశారు. "ఏమమ్మా వచ్చారు? ఈ ఏడు వసూళ్ళులేదు. పహణిలేదు. వచ్చే ఏడు ఏమవుతుందో ఏమో?"- అన్నారాయన.

నంజమ్మ తవ భర్త సంగతంతా చెప్పి, ప్రతి ఏడూ కురుబరహళ్ళి మునసబు గుండె గౌడే కాక, మరిద్దరి చేత పాటిగె డబ్బుతీసుకుని లెక్కల్లో సరిపెడుతున్నది తెలిపి, ఈ ఏడుపన్నురెమిషనయివందున కలిగినసమస్య వివరించింది.

"చూడండమ్మా, చెన్నిగరాయల సంగతినాకూ తెలుసు. ఈ ఫిర్కాలో ఆయన్ను గురించి మాట్లాడని కరణమే లేడు. కానీ రూలు మేరకు నేనేంచేయడానికీ లేదు. దొరగారికి ఒకమాట చెబుతాను"

"మీరేమైనా చేసి మా పిల్లల్ని రక్షించాలి."

రెవెన్యూ ఇన్స్పెక్టర్ భార్య మొగుడితో చెప్పింది."ఈరోజెలాగు తిపటూరికి వెడుతున్నారు.వీళ్ళనీ తీసికెళ్ళి దొరగారికి చూపెట్టి మీరే అన్నీచెప్పండి. అతడి సంగతి ఆయనకూ తెలియనీ".

పదకొండు గంటలకు వచ్చేమొదలియార్ మోటారులో తిపటూరికి రమ్మని రెవెన్యూ ఇన్స్పెక్టర్ పిలిచారు. బస్సుచార్జికయ్యే డబ్బు తాను తీసుకురాలేదని ప్రాణాలుపిండుకుని చెప్పాక "ఫరవాలేదు మీకు నాలుగణాలు, కుర్రాడి కర్థచార్జివేసుకొమ్మంటాను. ఆరణాలు నేనేఇస్తాను. (తల్లీకొడుకుల కిద్దరికీ ఆయన ఇంట్లో వుప్పిండి, కాఫీ ఇచ్చారు. బస్సెక్కి పన్నెండుగంటలకి తిపటూరికి వెళ్ళి వెళ్ళడంతోటే తాలూకాఫీసులో షిర్కాగుమాస్తానడిగారు రివెన్యూ ఇన్స్పెక్టరు "రామసంద్రానికి సంబంధించిన పోటీగె ఇచ్చి అప్పుడే వారంరోజులయింది సార్" అన్నాడు గుమాస్తా. )

నంజమ్మ గుండె గతుక్కుమన్నది. "ఇప్పుడేం చేయాలి?" రెవెన్యూ ఇన్స్పెక్టరడిగారు.

"అయితే ఆయన ఈ వూళ్ళోనే వుంటాడండీ. డబ్బంతా ఇంకా ఖర్చై వుండదు. మీరు దయచేసి ఆయన్ను బెదిరిస్తే మిగిలిందైనా ఇస్తారు."

"మాధవభట్టు హోటల్ దగ్గిరే వుంటారు సార్ ఆయన. మీరు కావలిస్తే అక్కడికెళ్ళండి. లోపల కూర్చుని కందా కొడుతూవుంటారు" - షిర్కా గుమాస్తా అన్నాడు.

అశ్వత్థపుకట్ట దగ్గిరున్న హోటల్‌కి ముగ్గురూ వెళ్ళారు. నంజమ్మ, రామణ్ణ బయట నుంచున్నారు. రెవెన్యూ ఇన్స్పెక్టరు భోజనాలహాలు తలుపు దగ్గిర నుంచుని లోపలికి చూశారు. గుమాస్తా మాట నిజమే. పీటమీద కూర్చుని అశ్రమున్న అరటాకులో, బంగాళాదుంపలు, వంకాయలు, నీరుల్లి వేసిన సాంబారుతో కలిపిన అన్నపురాశి వేసుకుని, ఆవురావురుమని తింటున్నాడు. అన్నపురాశి చుట్టూ కూరలు, పచ్చళ్ళు, వూరగాయ; అప్పడాలు వున్నాయి. రెవెన్యూ ఇన్స్పెక్టర్ అతణ్ణి మాట్లాడించలేదు. బయటికి వచ్చి ఒక కుర్చీలో కూర్చున్నారు. అరగంటసేపు బయట నంజమ్మ, రామణ్ణ, లోపల రెవెన్యూ ఇన్స్పెక్టర్ ఆయన కోసం నిరీక్షిస్తున్నారు. భోజనమయ్యాక కరణంగారు బయటికి వచ్చారు. రెవెన్యూ ఇన్స్పెక్టరును చూడగానే చేతులు జోడించి "నమస్కారం సార్"

అన్నాడు.

" ఏం కరణంగారు ఇటొచ్చారు?"

"ఇఇఇ ఇక్కడే కకక కాస్త పనుండి వచ్చాను సార్"

"ముందు వాళ్ళకి భోజనం బిల్లు చెల్లించండి. కాస్తమాట్లాడాలి" చెన్నిగరాయలు పదణాలిచ్చి హోటలు బయటికి వచ్చారు. భార్యా కొడుకు నుంచున్నారు. ఇన్స్పెక్టరు అన్నారు. "చూడండి మీమీద పోలీసు వారెంటుంది. తాసిల్దారుగారు మిమ్మల్ని అరెస్టు చేయించాలని చెప్పారు".

చెన్నిగరాయలకి దడపట్టుకుని వణుకుచ్చుకుంది. ఇన్స్పెక్టరన్నారు. "రైతుల నుంచీ పోటిగెలో మినహాయిస్తానని చెప్పి పన్ను వసూలు చేసి, ఇక్కడికొచ్చి పోటిగె తీసేసుకున్నారుకదా. అది క్రిమినల్ కాదా?"

"తప్పయింది సార్, ఈ ఈ ముం .." అనబోయి వెంటనే సంబాళించుకుని అడిగాడు : "ఈవిడ చెప్పిందా సార్?"

"ఎవరు చెబితేనేం ? దొరగారి ఆఫీసుకు రండి"

" మీ మీ కాళ్ళట్టుగుంటాను సార్, పోలీసువాళ్ళకి అప్పచెప్పకండి. నేను పరువున్నవాణ్ణి"

" సరే. డబ్బెంత వుంది మీ వద్ద? తీసివ్వండి. వెంటనే ఇవ్వాలి హుం"

" ఇస్తాను సార్ లోపలుంది"

"వున్నా పరవాలేదు. ఇక్కడే బయటికి తీసి ఇవ్వండి"

చెన్నిగరాయలు తమ చొక్కాఎత్తి, గోచీ వేసి కట్టిన పంచెలోపల లంగోటాలోని చిన్న సంచిలో దాచిన డబ్బు పైకి తీశారు. ఆరు పదిరూపాయల నోట్లు, అయిదు రూపాయల నోటొకటి, వున్నాయి డబ్బు లెక్కెడుతూ ఇన్స్పెక్ట రడిగారు "కడమదేమయింది"?

"ఖర్చయింది సార్"

"ఇంట్లో పెళ్ళాం పిల్లల్ని పస్తుపెట్టి ఇక్కడొచ్చి పందిలా తింటున్నావే సిగ్గులేదటయ్యా నీకు? ఆకలిగొన్న కుక్కకో రొట్టె పడేస్తే నోటితో పట్టుకెళ్ళి పిల్లలికిస్తుందే?" అని చీవాట్లు పెట్టి, ఆడబ్బు నంజమ్మ చేతికిచ్చి "కరణీకం లెక్కలు రాయటం నీకు చేతకాదు ఈవిడే అంతారాస్తోందని నాకు తెలుసు. ఇంకోగోజిలాగే పెళ్ళాం పిల్లల్ని దగాచేసి పోటిగె తీసుకుని తిన్నావా నిన్ను అరెస్టు చేయిస్తాను. నేను బదిలీ అయినా వచ్చే ఇన్స్పెక్టరుకూ చెబుతాను. తాసిల్దారు

దొరగారికి చెబుతాను" - అన్నారు రివెన్యూ ఇన్స్పెక్టరు

చెన్నిగరాయలు వీధిలోనే వంగి, బూట్సువేసుకున్న ఆయన కాళ్ళు పట్టుకుని "దొరగారికి చెప్పకండి సార్. నేను బీదవాణ్ణి." అని గజగజ వణికి పోతూ ప్రాధేయపడ్డాక ఇన్స్పెక్టరు "అమ్మా! నాలుగు గంటలకి బస్సుంది. ఇంతలో ఏమైనా కొనాలంటే కొనండి నేను తాలూకాఫీసుకు వెళ్ళాలిప్పుడు. అదే బస్సులో నేనూ వస్తాను." అనిచెప్పి వెళ్ళిపోయారు. చెన్నిగరాయలు శృంగభంగమైనట్టు అశ్వత్థపు కట్టమీద, ముఖం మోకాళ్ళసందున దాచుకుని గొంతుకూర్చున్నాడు రామణ్ణ "అమ్మా! హోటల్లో నేనెన్నడూ భోంచేయలేదు. ఇవేళ పెట్టించవూ?" అన్నాడు.

"పూళ్ళో అక్కయ్య, విశ్వం వస్తున్నారు కదా నాన్నా, తెల్లారి చెరో రొట్టె తిన్నారంతే"

వాడు మళ్ళీ మాట్లాడలేదు. ముఖం చిన్నబుచ్చుకున్నాడు. తల్లి పేగు చుర్రుమంది. కొడుకును లోపలికి తీసుకెళ్ళి " ఈకుర్రాడికి భోజనానికెంత?" అని అడిగింది. అరణాలన్నారు. 'వీడికి పెట్టండి" అంది. రామణ్ణ "అమ్మా! నువ్వు తినకపోతే నాకూ అక్కరలేదు" అన్నాడు ఆమే కూర్చుంది. వంట గమగమ లాడుతోంది."వస్తువులన్నీ వుంటే మనమూ ఇలాగే చేసుకోవచ్చు. నువ్వు పెద్దాడై జీతం తెస్తే నేనింత కమ్మగా చేసిపెడతాను" అని చెబుతూ భోంచేసి చెయ్యికడుక్కుంది. ఇద్దరికి రూపాయిపుచ్చుకున్నారు. ఇంట్లో పిల్లలకని పావలాకారపు పూసలు, పావలా చౌచౌ, అర్ధరూపాయికి మైసూరుపాకూ, కట్టించుకుని, దగ్గిరేవున్న పెద్ద అంగట్లో భోగట్టా చేస్తే బస్తారాగులు ముప్ఫైరూపాయలే అన్నారు. అదే రామసంద్రంలో యాభైరూపాయల కమ్ముతున్నారు. అరవైరూపాయలిచ్చి రెండు బస్తాలు రాగులుకొని, వాటిని బస్సుమీద వడేయమని కొట్టువాళ్ళనే అడిగింది. అదే బస్సుకు వచ్చిన రెవెన్యూ ఇన్స్పెక్టరు చెప్పేసరికి బస్సువాళ్ళు బస్తాలకి లగేజి లేకుండా వేసుకున్నారు. చెన్నిగరాయలెక్కడి కెళ్ళారో ఎవరికీ తెలియదు.

వూరికో మైలు దూరంలో రోడ్డు మీద రాగుల బస్తాలు దించి బస్సు వెళ్ళిపోయింది. రామణ్ణ వూళ్ళోకెళ్ళి వెట్టికి చెప్పి, బండి కట్టించుకుని వచ్చాడు. అందాకా బస్తాలకి కాపలాగా నంజమ్మ రోడ్డు పక్కనే కూర్చుంది.

చెన్నిగరాయలు మార్నాడు తిపటూరినుంచి నడిచే వచ్చాడు. నంజమ్మ

పలకరించలేదు. రామణ్ణ తండ్రిని ఈసడిస్తూ వెటకారంగా మాట్లాడబోతే "నాన్నా! ఆయన ఏంజేసినా మీకవ్న తండ్రి. నువ్వు మంచివాడివి అలా అనరాదు సుమా" అని మందలించి నోరుమూసింది.

ఇంటికి రెండు బస్తాల రాగులు రావటం ఇంటికి కామధేనువే వచ్చినట్టుగా వుంది. కడుపుకు తిండి లేక నంజమ్మ ఎండిన పత్తిచెట్టులా వుంది. నిండుగా ఎదిగే పార్వతి, రామణ్ణలు కూడా రెక్కలొచ్చిన కోళ్ళలా తయారయ్యారు. విశ్వం చిన్నతనం నుంచి పుష్టిగా వున్న కుర్రాడు వాడు కూడా బక్కచిక్కిపోయాడు. ఈ అవస్థ వీళ్ళకే కాదు. వూళ్ళో మూడువంతులిలాగే వున్నారు. ఒక వంతు బాగుంటే వుంటారు. వాళ్ళింట్లో చెన్నిగరాయలే కాస్త, సన్నగిల్లినా వున్నదాంట్లో మెరుగు.

కడుపునిండాతింటే ఇప్పుడు తెచ్చిన రాగులు రెణ్ణెల్లల్లో ఇట్టే ఖర్చవుతాయి. రోజుకు రెండుసేర్ల కంటే వాడ కూడదని నంజమ్మ నిశ్చయించుకుంది. ఈ ఏడు ఇంకా వర్షాలు పడలేదు. రాబోయే కాలం ఇంతకంటే అధ్వానం కావచ్చునని పార్వతితో చెప్పింది.:" పొద్దుట ఏడే ఏడు రొట్టెలు కాల్చు. అన్నీ సమంగా వుండవీ - చెరో రొట్టె. రామణ్ణ ఒకటి తీసుకెడతాడు. మధ్యాహ్నం విశ్వం నువ్వూ చెరిసగం తినండి. రాత్రిదాకా ఏమీ లేదు. రాత్రి సేరు రాగులు విసిరి సమంగా అయిదు ముద్దలు చేయి. ఎవళ్ళకైనా సరే! కావాలన్నా అంతే! వొద్దన్నా అంతే.

ఈ ఏర్పాటువల్ల పిల్లకెలాగో కడుపు నిండేది నంజమ్మ అర్థాకలితో వుండటానికి నిశ్చయించుకుంది. చెన్నిగరాయలకే ఇచ్చింది. ఆయన పెళ్ళాంమీద కోపగించు కుంటే పార్వతి రామణ్ణలే తిరగబడ్డారు. దీనికి తోడు చిన్నకుర్రాడు విశ్వం "నువ్వు నాన్నవికదా బియ్యం తెచ్చిపడేయ్ నాకన్నం కావాలి" అని అడిగాడు.

"పీడమ్మని . . . ." అని తిట్టుకుంటూ ఆయన చెరువుకట్టవేపు వెళ్ళిపోయాడు.

ఇంటిపనులూ, వంటా, అన్నీ పార్వతిమీదే వదిలేసి నంజమ్మ గుండేగౌడస్థలంలో కూరపాదులు తయారు చేయటానికి పూనుకుంది. అప్పణ్ణయ్య నిప్పెట్టాక, కాలి మసిపేరిన మొండిగోడలలాగే నుంచున్నాయి. వాటిని గునపంతో కూల్చి పారతో చుట్టూతా గట్టుగా వేశాక, నూతిలో నీళ్ళు తోడి ఎండిపోయిన భూమిని తడిపింది. ఏడాదిగా వానచినుకుపడక బిగుసుకుపోయిన నేల అడుగడుగూ బిందెడూ నీళ్ళు పీల్చేసింది. భూమి మెత్తబడ్డాక తానే ఒకవేపు నుంచి తవ్వటం మొదలెట్టింది. మాదిగ బేలూరకు రెండురూపాయలిచ్చి బండెడు ముళ్ళకంప తెప్పించింది. నాలుగు వేపులా రెండు సార్లు వరుసగా కంప నాటించింది.

గాలికెగిరిపోకుండా ఈతతాటతో అక్కడక్కడ కట్టించింది. మొత్తానికి కంచె బందోబస్తు చేసి, ఒక తడిక తలుపుపెట్టి తాళంవేసేలా ఏర్పాటు చేసింది. కొన్నిపాదుల్లో తోటకూర, కొన్నింటిలో ఆకుకూరల విత్తనాలువేసి, తానే కంబనకెరె వెళ్ళి సంతలో బీనిస్ విత్తనాలు, నీరొంకాయి విత్తనాలు తెచ్చింది. పంగవారుపోసి, పాదులు కట్టి బీనిస్ విత్తనాలు నాటింది. తిండికి లేకపోతే కాయరగూరలైనా వుడికించుకుని తినవచ్చు. రెండుపూటలా తోటకూర వండుకుంటే కడుపు నిండుతుంది. వానదేముడు వరమిచ్చినా, నూతిగంగమ్మ తల్లి మాయం కాలేదు. పట్టుదలతో రెండుపూటలా నీళ్ళుతోడి పాదులు తడుపుతోంది.

ఈమధ్య సర్వక్క కూతూరు రుద్రాణికి వాంతులు విరేచనాలు పట్టుకున్నాయి. రెండే రెండు రోజుల్లో బాగా నీరసించి ఆఖరికి చచ్చి పోయింది. దానికి విరేచనాలు వాంతులు వెళ్ళడం నంజమ్మకు కూడా తెలియదు. ఎవళ్ళకీ తెలియదు. వార్త వినగానే నంజమ్మ సర్వక్క ఇంటికి వెళ్ళింది. ఇంతలో శవం మీద తెల్లగుడ్డ కప్పి నలుగురు నాలుగు మూలలూ పట్టి ఎత్తి బుజాలమీద పాడె తీసుకెడుతున్నారు. రేవణ్ణశెట్టి తలవంచుకుని శవం వెనకాల నడిచివెడుతున్నాడు సర్వక్క గుమ్మం గడపకేసి తలబాదుకుంటూ కన్నీళ్ళు కారుస్తూవుందేగాని, గట్టిగా ఏడవటం లేదు.

రుద్రాణి పార్వతి కంటే నాలుగేళ్ళు పెద్దది. చేసుంటే పెళ్ళై ఇద్దరి బిడ్డల తల్లి కావల్సింది. సర్వక్కలాగే ఒడ్డూ పొడవూ; తలనిండా ఒత్తుగా వెంట్రుకలు; వెనకనుంచీ చూస్తే తల్లీకూతుళ్ళకి తేడా తెలియదు. నంజమ్మ వెళ్ళి, దగ్గిర కూర్చుని, సూతకం మైల సర్వక్కను చెయ్యిట్టుకుని "తలబాదుకుంటే ఏం లాభం! సర్వక్కా! లే చెబుతా. ఏమయిందమ్మాయికి?" అని అడిగేసరికి కూతుర్ని పోగొట్టుకున్న తల్లి "వచ్చింది వాళ్ళ నాన్న రోగం" అని చెబుతూ అంత దుఃఖంలోనూ నాలుక నొక్కుకుంది.

శవాన్ని మట్టిలో కలిపి రేవణ్ణశెట్టి ఇంటికి తిరిగి వచ్చేదాకా నంజమ్మ అక్కడే కూర్చుంది. చుట్టుపక్కల వాళ్ళెందరో ఆడా, మగా వచ్చారు. రేవణ్ణశెట్టి రాగానే ఆడాళ్ళంతా రాయి రువ్వితే పక్షులు చెదిరి చెల్లాచెదురుగా ఎగిరిపోయేలా తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. మగాళ్ళు మాత్రమక్కడే వున్నారు. నంజమ్మ కూడా తన ఇంటికి వచ్చింది. సర్వక్క ఇంటికీ నంజమ్మ కూరపాదులు పెరడుకూ చాలా దగ్గిర, సర్వక్కను అక్కడికే తీసుకెళ్ళి, కూర్చోబెట్టుకుని

రోజూ నంజమ్మ ఓదార్చేది. ఎవళ్ళని శాశ్వతం? దేముడెప్పుడు రమ్మంటే అప్పుడు వెళ్ళిపోవాలి. తల్లీ-కూతురు, మనం కన్నాం, మనల్ని కన్నారు అన్నదంతా వొట్టిమాయ, అని ఏదో తనకు తెలిసినట్టుగా ఓదార్చినా సర్వక్క దుఃఖమణగారలేదు. ఆవిడ తనంతట తానే నంజమ్మ కూరపాదుల పెరట్లో వచ్చి కూర్చునేది. పల్లెత్తు మాట పలికేది కాదు. నంజమ్మ తమ ఇంటినూతిలో నీళ్ళు తోడి చంకలో ఒకటి, కుడిచేత ఒకటి బిందె తీసుకుని వచ్చి, ఆకుకూరలూ, వంగనారు తడుపుతూ మాట్లాడించినా సర్వక్క మౌనంగా వుండేది. ఒకరోజు సాయంత్రం నంజమ్మ కూరపాదులకు నీళ్ళోశాక సర్వక్కే అంది. "పుట్టించిన తండ్రే కూతుర్ని పాట్టనెట్టుకుంటే తలరాతేం చేస్తది?"

"ఏం సర్వక్కా నీవన్నది?"

"పోనిద్దురూ"

"ఏమిటో నాతో చెప్పరాదా? ఎవళ్ళతోనైనా చెబుతాననా? మీమీదొట్టు"

"కొల్టులో సాచ్చానికని మావోరు రొండు బస్తాలు రాగులు, పాతికసేర్ల బియ్యం-అన్నీ అట్టుగొచ్చారని నేను మీకు కాసిన్ని తెచ్చిచ్చానుగా?"

"అవును"

"అది కోల్టుటీగాదు. పాడూగాదు ఆ పరదేశి నాకొడుకు కాశింబడ్డి వున్నాడే, వాడి పెళ్ళాంపిల్లలు మళయాళంలో వున్నారట! ఆడికాడ మావోరు డబ్బుచ్చుకున్నారు"

"పుచ్చుకుంటే ఏమయింది?"

"నేను మీరూ వేళ్ళదుంపలకని చెరువు కెల్తూ వుండ్లా? అప్పుడు మావోరే ఆణ్ణి మా శెడ్డుకు తీసుకొచ్చారట! రుద్రాణికి కడుపొచ్చింది."

సర్వక్క చెప్పినదాన్ని సరిగా సమన్వయం చేసుకునేసరికి నంజమ్మకు బాధవేసింది. ఈసారి వూరికి వచ్చిన వరపులో ఎంతోమంది ఆడాళ్ళు తమ మానాన్ని అమ్ముకుని పొట్టుపోసుకున్నారని ఆవిడ కూడా విన్నది. కానీ కన్నతండ్రే కూతిరికిల్లా అన్యాయం చేశాడంటే నమ్మలేకపోతోంది.

"చేసుకున్న మొగుడి మీద అబద్ధాలాడుతానా చెప్పండి? తండ్రి అన్న లంజాకొడుకు చెప్పాడే అనుకో. అదెలా ఒప్పుకుంది? శివగెరెవేపువాళ్ళడిగ టానికొచ్చారు. పెళ్ళి చేద్దామని నేను ఎంతెంతో చెప్పాను. అన్నం ఖర్చుకి డబ్బులేదాగు, తరువాత మాద్దామని ఈయనే చెప్పాడు."

"తరువాతేమయింది?"

"నాకు తెలవనే తెలవదు, మూణ్ణెల్లయ్యాక తెలిసిందండీ ముండా! నీదే తప్పని" ఆయన దాన్నే చితకబాదాడు. "లేదమ్మా! అయ్యో ఏం పరవాలేదు. భయపడొద్దు"; అని కాశింబడ్డిని లోపలికొదిలి ఆయన బయట తలుపేసుకున్నాడట. ..కేంజేస్తుంది. ఈయనే ఆ నరసికాడ తెచ్చి మూడు రోజులు మందు తాగించారు. ఒకటే సమంగా నెత్తురు కారింది. నిలిస్తేగా. అమ్మాయి చచ్చిపోనాది."

నంజమ్మ అన్నీ విని నిర్ఘాంతపోయింది. సర్వక్క మళ్లీ ఒకసారి గట్టిగా ఏడ్చి, కన్నీళ్ళు తుడుచుకుంటూ వుండగా నంజమ్మ ఆలోచనలు పార్వతి మీదికెళ్ళాయి. దానికప్పుడే పన్నెండు నిండులోంది. ఈ వరపు లేకపోతే కడుపు నిండా తిని వుంటే ఈపాటికినే పెద్దమనిషయ్యేదేమో! ఒకవేళ హఠాత్తుగా పెద్దమనిషయితే ఏంగతి? ఈ దుర్భిక్షంలో పెళ్ళి చేయడమెలాగ? ఎంత లేని వాళ్ళయినా, గ్రాసం, వాసం వున్న వాణ్ణి వెదికి పెళ్ళి చేయాలంటే ఏడెనిమిది వందలైనా కావాలి. రెండుపూటలా అయిదువేళ్ళూ సమంగా లోపలికెళ్ళవు. ఈ కష్టకాలంలో ఏడెనిమిది వందలు ఎక్కణ్ణించి పుట్టుకొస్తాయి?

"నంజమ్మగారూ! మీరెవళ్ళకీ చెప్పొద్దు."

"దేముడి మీదొట్టు. సర్వక్కా మీ పరువొకటీ, నా పరువొకటా?"

"ఈ చచ్చినోడితో కాపురం చాలు. వొగ్గేసి పుట్టింటికెడదామంటే ఆడా అంతే. వొదినమ్మగారి మోచేతి నీళ్ళు తాగాలి. మనల్నెందుకు పుట్టించాడో భగవంతుడు మీరైనా చెప్పండి."

సర్వక్క వేసిన ప్రశ్న, తనకు తానే ఎన్నో సార్లు వేసుకుంది నంజమ్మ. తన బతుకు మాత్రం ఏం పచ్చగా వుంది? ప్రేమించే భర్తా? ఆదరించే అత్తా? పుట్టింట మాత్రం బావుకునేదేముంది? అయినా తాను చావకుండా బతికుంది. పిల్లలయ్యారు. ఇప్పుడెందుకు బతకాలి? అనే ప్రశ్నకి సమాధానంగా పిల్లలెదురుగుండా కంటికి కనిపిస్తారు. పెరటి కూరగాదులకు నీళ్ళోసి, మొగుడు దొంగతనంగా పాటిగె తినకుండా కాపలాకాసి, పొద్దస్తమానంమోదుగ విస్తళ్ళు కుట్టి, వాళ్ళకో రొట్టె, సగం 'ముద్ద' అదీలేకపోతే పిడికెడాకుకూరా – ఇవన్నీ చిల్లులు పడితే మాట్లు వేసిన అల్యూమినియం కంచాలలో వడ్డించడానికే బతకాలా? అంతే, మరేముంది బతుకులో? అనుకుంది.

# 8

ప్లేగు బొత్తిగా అణగారిపోయాక, చాలా మందికి అంటువ్యాధులు పట్టుకున్నాయి. ఎవళ్ళకి చూసినా దురద, గజ్జి, కురుపులు, అందరూ, నుంచున్నా కూర్చున్నా, ఎక్కడ పడితే అక్కడ పరపరా గోక్కునేవాళ్ళే. కాళ్ళ మీదా, తొడల మీదా కురుపులు లేచిన వాళ్లు కుంటుతూ నడుస్తున్నారు. వేడి కాపడం పెట్టి అవి పగిలేదాకా వాళ్ళ యాతన చెప్పడానికి లేదు. గజ్జి లేచినవాళ్లు ఒంటిమీదా చేతుల మీదా కాళ్ల వేళ్ళసందుల్లో రసికారి అట్టకట్టుకుపోయి మెత్తుకుంటోంది.

నంజమ్మ ఇంట్లో కూడా గజ్జి కనిపించింది. మొదట రామణ్ణకు పట్టింది. తరువాత పార్వతికి విశ్వానికి వ్యాపించింది. తల్లికీ వచ్చింది. లేత ఎండకు కాపడమో, లేదా పోయిలో మంటేసి, నిప్పు వేడికి, గజ్జి లేచిన భాగాన్ని చూపి, 'హా' అనేలా కాపడమో వాళ్ళకు తెలిసిన వైద్యం. ఒక్కోరోజు తెల్లారి లేచేసరికి అరచేతిలో, ముంజేతిలో కలివిపళ్ళలాగ తెల్లగా కురుపులు పుట్టుకొచ్చేవి. వాటినలాగే సహించడం పిల్లల చేత కాదు. ఏదో వేసి చితికించి చీము బయటికి తీయాలి. తుమ్మముళ్ళు తీసుకుని గుచ్చి రసి బయటికొచ్చేలా నొక్కినప్పుడు చుట్టుప్రక్కల తగిలి అక్కడ కూడా బొబ్బలు లేచేవి. మొదట్లో విపరీతమైన దురద, దాన్ని ఓర్చుకోలేక గోకడం, తరువాత పుట్టే మంట ఓర్చుకోలేక విశ్వం గట్టిగా ఏడ్చేసేవాడు. రామణ్ణ, పార్వతి కూడా ఒకోసారి బాధ ఓర్చుకోలేక ఏడ్చేవారు. ఇందాకా ఇంటి పని అంతా పార్వతిదే. రెండు చేతులకు గజ్జి వచ్చాక ఆవిడ అంట్లు తోమలేదు. గుంజ పట్టుకుని తిరగలి విసరలేదు. నంజమ్మ కూడా చేంతాడు పట్టుకుని నీళ్లుతోడి కూరపాదులకు పోయడం కష్టమయింది. ఇన్నిరోజులు కష్టపడి చాకిరీచేసి, పెంచిన పాదుల్లోని మొక్కలు నీళ్లు చాలక తలలువాల్చాయి.

వూళ్ళో వాళ్లంతా నాగరాజుకు మొక్కుబళ్ళు చేశారు. నంజమ్మ కూడా వారంరోజులు చన్నీట స్నానం చేసింది. పిల్లలకూ చన్నీళ్ళు పోసింది. తమ్మేగౌడ ఇంటి నుంచీ తెచ్చిన అరపావు పాలు పుట్టలో పోయించి పిల్లల చేత దణ్ణం పెట్టించింది. కాని నాగరాజు ప్రసన్నుడు కాలేదు. గజ్జి దురద మరింత విజృంభించాయి.

వీళ్లందరికీ గజ్జి మొదలెట్టిన నెలరోజులకి చెన్నిగరాయలకూ అంటుకుంది. మొదటి బొబ్బకే అతడు తైతెక్కలాడాడు. వూళ్ళో అందరికీ గజ్జంటుకున్నా మునసబు లాంటి కలవారి ఇళ్ళల్లో ఎవరికీ ఏమీ అవలేదు. గంగమ్మ, అప్పణ్ణయ్యలకు దాని తడాఖా చూపలేదు. చేతి వేళ్ళ సందుల్లో రసికారుతున్న కురుపులతో

చెన్నిగరాయలు తల్లి ఇంటికెళ్ళినపుడు గంగమ్మ అంది. "శృంగేరి గురువులు వెలేశారు ఆ 'తాడి' ప్రాయశ్చిత్తం చేసుకోలేదు. ముట్టు గిట్టు లేదు. మడి మైలా అసలే లేదు. వాకిటుండి కూరపాదులకి నీళ్ళోస్తే నాగరాజూరికే వొదుల్తాడా? ఆ ముండ వల్ల నీకూ వొచ్చింది. ఏం రోయ్ చెన్నయ్యా! నువ్వు దాన్ని వొదిలెయ్యకపోతే నీకిది నయం కాదు".

వదిలేస్తానని చెప్పినా తన పెళ్ళాం భయపడదని చెన్నిగరాయలకు తెలుసు. ఆవిణ్ణి వదిలేస్తే తినడానికి బువ్వో? ఆవిడ వెళ్ళి ఇన్స్పెక్టర్‌తో చెబితే కొంపలంటుకుంటాయి. అంచేత తల్లి మాటల్ని యీ చెవితో విని ఆ చెవితో వదిలేశాడు. కాని వచ్చిన గజ్జి కేదైనా చేయాలి. తల్లీకొడుకూ ఇద్దరూ అణాజోస్యుల ఇంటికి వెళ్లారు. ఆయనేదో వుపాయం సూచించే లోపుగా అయ్యా శాస్త్రులు వచ్చారు. శాస్త్రిగారు వయస్సులో పెద్దవారు. ఎవరెవరి ఇంట్లో ఏ ఏ శాస్త్ర సంప్రదాయాలుండేవో, వున్నాయో ఎరిగినవాడు. ఆయనన్నాడు కదా: "గంగమ్మా! నీ మొగుడి కాలంలో 'నాగరు' చేసేదానికి గుర్తుందా? ఆయన పోయాక ఒక్కసారయినా చేయించావా, నాగరాజు పట్టిపీడించకుండా ఏం జేస్తాడు?"

గంగమ్మకు గుర్తొచ్చింది. శ్రద్ధాసక్తులతో చేయదగ్గ కర్మ అది. "ఏదో ఒక షష్ఠిరోజు ఇంటిల్లిపాది తోటకెళ్లాలి. ముందురోజే మగాళ్ళెల్లి తోటలో ఓ చిన్న నుయ్యి తవ్వి రావాలి. దానిలో వూరిన నీళ్లతో గారెలు, బొబ్బట్లు, పాయసం, అన్నం, చారు, పులుసు అన్నీ చేయాలి. ఇద్దరు పురోహితులను, వాళ్ళ భార్యల్ని, ఒక విధవని, ఒక విధురుణ్ణి, ఒక బ్రహ్మచారిని పైవాళ్లని భోజనానికి పిలవాలి. గోధుమపిండి, బియ్యప్పిండి కలిపి దాంతో పడగెత్తిన నాగరాజును చేసి, సకల పూజలూ చేసి, పిలిచిన బ్రాహ్మణులకూ, ముత్తైదువులకూ, విధురినికీ, విధవకూ, బ్రహ్మచారికీ, శ్రాద్ధదినం వడ్డించేలా ధారాళంగా వడ్డించి, భోజనం పెట్టి, అధమపక్షమొక్క వెండి బిళ్లయినా దక్షిణిచ్చి, మగాళ్ళకి పంచల చాపు, ఆడాళ్ళకు చీర రవిక , బ్రహ్మచారి కడ్డపంచె, ఒంటి యజ్ఞోపవీతం, దక్షిణ ఇవ్వాలి. తరువాత ప్రసాదం భోంచేసి, సాయంకాలం నాగరాజుకు మహామంగళారతి చేసి, ఆయన్నూ అక్కడికి తీసుకెళ్ళి, మిగిలిన బియ్యం, పప్పులు, గోధుమపిండి నూతిలో పడేసి, నుయ్యి కప్పేసి, మళ్లీ వెనక్కి చూడకుండా కనుచీకటిలో వూరికి తిరిగిరావాలి. ఇన్నీ చేస్తే గజ్జి, కురుపులు వాటంతటవే పోతాయి. నీ మొగుడున్నప్పుడు మీకెప్పుడైనా ఇలా అయిందా? మీరు చేసే కర్మ వదిలేశారు. గ్రహచారం

పట్టుకుంది"- అని తమకూ లేచిన గజ్జి దురద పెట్టి, చేతులు గోక్కుంటూ అయ్యా శాస్త్రులడిగేసరికి ఏమైనా కానీ 'నాగర' చెయ్యాలని నిశ్చయించింది గంగమ్మ.

అణ్ణా జోస్యులన్నారు! "కడమవంతా ఆలోచించకు. బ్రాహ్మణులుగా నేనూ, బాబాయి, ముత్తైదువులుగా మా ఆవిడే, పిన్నీ వుంటాము. బ్రహ్మచారిగా మా నరసింహుడే వున్నాడు. విధవంటావా కొండేమహళ్ళి నుంచి మా చెల్లాయిని పిలిపిస్తాను, రంగాపురంలో మా ఆవిడ అన్నే విధురుడున్నాడు. నువ్వు మిగతావన్నీ సిద్ధం చేసుకో."

త్వరలోవే తన ధార్మికవిధిని నిర్వహిస్తానని చెప్పి గంగమ్మ తన ఇంటికి వచ్చింది. "చెన్నయ్యా! సగం ఖర్చిమ్మని నీ పెళ్లాంతో చెప్పు" అని పురమాయించింది. మొగుడు చెప్పిన కథంతా విని నంజమ్మ అంచనా వేసింది. కనీసం వంద రూపాయలు కావాలి. దాంట్లో సగమంటే యాభై. దీనికి తోడు పురోహితులు తన్ను వెలివేసిన సమస్య కూడా ముడిపెట్టి డబ్బు గుంజేస్తారు. తినడానికి లేక చస్తూంటే దీనికెదురు పెట్టటమెలాగ? 'నాగర' వద్దు 'గీగర' వద్దు. అందే కానీ ఈ అంటురోగాలకు కారణమైన నాగరాజు అలిగి, ఎవళ్ళనయినా బలితీసుకుంటే చేసేదేమిటి-' అన్న భయమొకవేపు. కోడలు, కోడలి పిల్లలూ ఏమైనా కానీ, తనకూ అప్పణ్ణయ్యకూ గజ్జి వస్తే భరించడమెలాగన్న ఆలోచన గంగమ్మకు కలిగింది. వెంట చెన్నిగరాయణ్ణి కూడా తీసుకుని హొళెసీమవేపు, అంటే అక్కిహెబ్బాళు వేపు యాయవారానికి బయలుదేరింది. "పద్యం గడవాలి. ధర్మం చేయండి"-అని పల్లెల్లో ఇంటింటికి వెడితే డబ్బంటూ రాలేదు గాని, కనీసం రెండు సేర్లయినా దానం చేయనివాడేలేడు. అడిగి ధాన్యం పోగుజేసి, దాన్నంతా అమ్మి నెలలోపల వందరూపాయలు చేర్చి వూరికొచ్చి, ముగ్గురూ 'తోటనాగప్ప'ను చేసే రోజు నిశ్చయించారు.

గజ్జి విపరీతంగా వున్నా రామణ్ణ బడి మానలేదు. ఇప్పుడు వాడు చదువుతున్నది ఇంగ్లీషు రెండవక్లాసు. వాడి బడిలో గజ్జి వచ్చిన కుర్రాళ్ళు చాలామంది వున్నారు. వూరూరికీ ప్లేగు వచ్చినట్టే ఇప్పుడీ అంటురోగమెక్కడ చూసినా వుంది. గజ్జికురుపులున్న పిల్లల్ని మాస్టారు ప్రత్యేకంగా కూర్చోబెట్టారు. ఒకరోజు హెడ్‌మాస్టరే వీళ్ళ బాధ చూడలేక వెళ్లి గవర్నమెంటుఆస్పత్రి డాక్టరుతో చెప్పారు. గ్రామ పంచాయతీ ఛెర్‌మన్, డాక్టరూ కలిసిపైకి వ్రాసి మిల్క్ ఇంజక్షన్

ట్యూబులు తెప్పించారు. రెండురోజులు డాక్టరుగారు పిల్లలందరికీ సూదిమందిచ్చి పై పూతకి మలామిచ్చి పంపారు. గంధకంతో చేసిన ఆ మలాం వాడకుండానే, సూదిమందు తీసుకున్నాక, గజ్జి తనంతట తానే మాయమై కొద్దిరోజుల్లోనే పొక్కులు కట్టి రాలిపోయాయి.

రామణ్ణ తల్లితో చెప్పాడు. "ఈ సూదిమందు తీసుకున్నప్పుడు కాస్త చురుక్కుమంటుంది. అంతే నా చేతులు చూడు. మళ్ళీ శుభ్రంగా ఎప్పటిలా వున్నాయి. మీరంతా ఓ రోజు రండి. ఆసుపత్రిలో సూదిమందు వేయించుకోండి".

ఒకరోజు పార్వతిని, విశ్వాన్ని తీసుకుని నంజమ్మ కంబనకెరె వెళ్లింది. తన కష్టాలు చెప్పుకున్నాక డాక్టర్ డబ్బు లేకుండా సూదిమందిచ్చారు. నాలుగు రోజులయ్యాక మరోసారి సూదులు వేయించుకొచ్చారు. వాళ్ళ ఒంటిమీది గజ్జి వాడిపోయింది. ఒకరోజు రామణ్ణ చెప్పాడు "అమ్మా! మా హెడ్‌మాస్టర్ చెప్పాడు నిరుడు వర్షాలు లేవు. పంటలు లేవు. ఎవరికీ పాలుపెరుగు లేవు. తినడానికి తిండిలేక నానా వేళ్ల దుంపలు తిని రక్తం చెడి గజ్జి వచ్చిందట: 'నాగరు' 'గోగరు' అన్నదంతా వొట్టి అబద్ధమట! వూళ్ళో అందరూ యిలాగే సూదిమందు వేసుకుంటే నయమవుతుంది'.

ఇంతలో గంగమ్మ, అప్పణ్ణయ్య, చెన్నిగరాయలు, బ్రాహ్మణులకు, పంచెలు చీరలు దక్షిణా ఇచ్చి శ్రద్ధాభక్తులతో భోజనం పెట్టి 'తోట నాగరు' పూర్తి చేసుకుని వచ్చారు. నంజమ్మ పిల్లలతోపాటు వెళ్లి సూదిమందు తీసుకుందని తెలిశాక గంగమ్మ అంది. "నాగరు చేస్తూంటే ముండవెళ్లి మందుచ్చుకుంది. ఇది కుళ్ళి చస్తుంది చూడు. "నాగరాజంటే ఏమనుకుందో అది!"

నంజమ్మకూ, ఆమె పిల్లలకూ, పొక్కులన్నీ వూడి, మచ్చలు కూడా మాసి ఎప్పటిలాగా చర్మం నిగనిగలాడేసరికి, కడమా జనం ఒక్కొక్కళ్ళే కంబనకెరె వెళ్లారు. ఒక సూది మందు అయిదు రూపాయలు.

## 9

జేష్ఠ ఆషాడాలు గడిచినా ఒక్క చినుకు పడలేదు. ఈ ఏడు కూడా నిరుటిలాగే వరపు వచ్చే సూచనలున్నాయి. నిరుడు పాతధాన్యం నిలవజేసుకుని నెమ్మదిగా వున్న వాళ్ళు కూడా ఇప్పుడు కళ్లు తేలవేస్తున్నారు. ఆకాశంలో మేఘాలాడుతుంటాయి, కానీ ఎక్కణ్ణించో రయ్‌ని గాలివచ్చి వాటిని చిందరవందర

చేసి తరిమేస్తుంది. ఈ ఏడు మూడు పాళ్ళు వర్షమయితే తొమ్మిది పాళ్ళు గాలి అని పంచాంగంలో వ్రాశారట! వెర్రిగాలి తొమ్మిది పాళ్ళకు తొమ్మిదిపాళ్ళూ వీస్తోంది. కానీ మూడుపాళ్ల వర్షంలో ముప్పయ్యోవంతు చినుకులేదు. గజ్జి నయమయ్యాక నంజమ్మ రెండుపూటలూ కూరపాదుల పనిలోనే మునిగిపోయింది. ఇప్పుడు సేరు రాగుల్తోటే అందరి భోజనం కావాలి. కడుపు నిండేలా తోటకూర, వంకాయలు,బీన్సుమొదలైనవి వుడికించితింటారు. ఈఉపాయం చేస్తున్నదీ ఒక్క కుటుంబమే. తన పెరట్లో దొంగతనం జరిగితే వింతకాదు. అంచేతే రాత్రిపూట నాలుగైదు దఫాలు లేచి పిల్లలను వెంటబెట్టుకుని చూసి వస్తుంది. నిరుడు వర్షంలేక ఈ ఏడు కొబ్బెరచెట్లు కూడా కళగా లేవు. తోట సొంతదార్లు లేతకాయల్నే కోసి తిపటూరికి పంపించి అమ్ముతున్నారు. దొంగలకవి కూడా దొరకడం లేదు.

ఒకరోజు అర్ధరాత్రిలో వున్న దున్నట్టుగా వర్షం మొదలెట్టింది. ఆకాశం నుంచీ వడగళ్ళలా పెద్దపెద్ద చినుకులే పెంకుల మీద పటపటబాదుతూ పడ్డాయి. ముంగారు దాటి, ఎడగారు కూడా గడచే సమయంలో వున్న పళంగా ముంగారును మించిన వర్షం జోరుగా పడుతోంది. పడుకున్న వాళ్ళంతా లేచారు. గుమ్మాలలో నుంచుని చూస్తారు కదా గాలి కొంచెం కూడా లేదు. కుండ పోతగా వర్షం మాత్రమే. ఆకాశం నల్లగా వుంది. భూమిమీద దడదడధారాపాతంగా కురవటమే తన పనిలా వుంది. ఇన్నిరోజులుగా లేని మబ్బులాకాశంలో ఎలావచ్చి కమ్ముకున్నాయో! ఎప్పుడు కమ్ముకున్నాయో! అందుకే వానరాకడ ప్రాణం పోకడ తెలియదంటారు. అంతా గ్రామదైవం చోళేశ్వరుని దయ కాకపోతే మరేమిటి? లేకపోతే అకాలంలో ఇంత వాన ఎలా వస్తుంది. అర్ధగంటలో వీధులన్నీ జలమయమై పొంగిపొర్లుతూ వున్నాయి. ఇంత వర్షానికి, తనపాదుల్లో తోటకూర, వంగ, బీన్సు ఇంకా యితర కాయగూరలు అన్నీ కొట్టుకుపోతాయని నంజమ్మ కొకవేపు బెంగ, మరోవేపు సంతోషం. బాగా వర్షం పడి పంటలు పండితే తమకూ తినడానికి తిండి వుంటుంది. కూరగాయలు మొక్కలు పోతే పోతాయి. మళ్ళీ విత్తనాలు నాటి పెంచవచ్చు. పొలాలన్నీపండితే అదే పదివేలు. ధర్మమేలేదని ఇన్నాళ్ళూ ఇళ్ళపెంకులు సర్దుకున్న వాళ్ళు లేరు. అదీగాక వీచే వెర్రిగాలికి పెంకులు అటూఇటూ కొన్నిచోట్ల కదిలాయి. ఆ రాత్రి వర్షం కురవని ఇల్లే లేదు. ఇళ్ళు కారనీ, గోడలు కూలనీ, వర్షమొచ్చింది; అదే చాలు అని అందరూ అనుకున్నారు.

తెల్లారేసరికి వాన వెలిసింది. పొద్దుటలేచి జనం తమ తమ పొలాలవేపు వెళ్లారు

ఆ రాత్రి వర్షానికి వూరి చెరువు సగం నిండింది. అంటే పైన కూడా వర్షం పడిందన్నమాట.

నంజమ్మ కూరపాదులెలా వున్నాయో చూడటానికి వెళ్లింది. దారిలో మాదేవయ్యగారగుపించారు. ఈ వూరే వదిలిపెట్టివెళ్ళిన అయ్యగారు మళ్లీ రారేమో అని ఆవిడా అనుకుంది.

"అయ్యగారూ! మమ్మల్నింతా వొదిలి ఇన్నిరోజులు వెళ్ళిపోయారే?"

"కాశీకి వెళ్ళాను తల్లీ. ఇన్ని రోజులక్కడేవున్నాను. ఏమో మళ్ళీ ఇక్కడికి రావాలనిపించింది. వొచ్చాను".

అయ్యగారిని ఇంటికి తీసుకెళ్ళింది. అప్పటికే చెన్నిగరాయలులేచి బయటికి వెళ్ళాడు నంజమ్మ "ఎప్పుడొచ్చారు?" అని అడిగింది.

"రాత్రి పొద్దుపోయింది. నేనే వచ్చి మిమ్మల్ని లేపాలనుకున్నాను. ఇంతలో వర్షమొచ్చింది."

ఆయన ఈమాట అనేలోపుగ ఎందుకో సర్వక్క వచ్చింది. అయ్యగారు వూరికి వొచ్చారట. వచ్చినవెంటనే వానావొచ్చింది. ఆయనెళ్లి ఎన్రోజులయింది? వెంటనే ఆవిడకి గుర్తొచ్చింది. మా బణజిగలాయనకి జోలెబిచ్చం వెయ్యం పొమ్మన్నారట. కోపమొచ్చి అయ్యగారెళ్లిపోయారు. అప్పట్నుంచీ వరుసే. నిన్న రేత్రి వూళ్ళో కాలెట్టారు. వానొచ్చింది. సాదువులంటే ఏమనుకున్నారో మాజనం? సర్వక్క దగ్గిరికొచ్చి అతని పాదాలమీద పడ్డది.

"అయ్యగోరూ! మావూరొదిలి విసుక్కుని ఎందుకెళ్ళారు?"

"ఏమో, ఎక్కడికైనా వెడదామని బుద్ధిపుట్టింది తల్లీ. నాలాంటివారే ఒకరు దొరికారు. విశ్వనాథుని సన్నిధి కాశీకివెళ్ళాను. జంగరువాడిమఠమని వుంది. మనవేపు జంగాలెవరెళ్ళినా ఇబ్బంది లేకుండా వుండచ్చు. ఇక్కడ చేసే భజన అక్కడే చేసుకుంటూవున్నాను. ఎంతయినా అది మనదేశం కాదు. మనజనంకాదు. మఠంవాళ్ళేమో మనవాళ్లే. ఇక్కడికొద్దామని అనిపించింది. వొచ్చేశాను".

"అయ్యగోరూ! మీ రాగులన్నీ దొంగల్దోచుకున్నారట చూశారా?" సర్వక్క అడిగింది.

"రాత్రి అగ్గిపుల్ల గీచిచూశాను. ఏవీలేవు. చుట్టుపక్కల వరదొచ్చింది. కడుపుకు గంజిలేనివాళ్ళెవరో తిన్నారు. ఎవరు తిన్నా మట్టయ్యేదేకదా?"

నంజమ్మనడిగి పేరురాగి పిండి చేబదులు తీసుకుని సర్వక్క వెళ్ళిపోయింది

వాళ్ళింటికెవరో బంధువులొచ్చారు.

సర్వక్క వెళ్ళాక అయ్యగారన్నారు. "నేను మీ నాన్నను చూశాను". "ఎక్కడా?" నంజమ్మ కుతూహలంగా అడిగింది. ఆమె తండ్రి కంఠీజోస్యులున్నట్టుండి అజా పజా లేకండా వెళ్ళి పన్నెండు సంవత్సరాలయింది. పన్నెండేళ్ళయితే ముఖం చూడ రాదట. బతికేవున్నాడో, చచ్చిపోయాడో అని తనలో తానెన్నిసార్లో అనుకుందామె.

"కాశీలో వున్నారమ్మా, నెలరోజులక్రితం తెల్లారి నదిఒడ్డుకెళ్ళాను. హనుమాన్‌ఘాట్ అని దాని పేరు. మన వేపు బ్రాహ్మలు చాలా మంది వున్నారు. మనవాళ్ళేమి, హిందూదేశంలోని అన్ని జాగాలనుంచీ జనం కాశీకి వస్తూనే వుంటరు వాళ్ల శ్రాద్ధం చేస్తున్నారు. మీ నాన్న గట్టిగా మంత్రాలు చెబుతున్నారు. నేనే పలకరించాను. ఆ తరువాత రెండు రోజులకి నేను మకాం చేస్తున్న జంగమవాడి మఠానికొచ్చాడు. ఆయనే భయపడుతూ "నామీద పోలీసు అరెస్టు వారెంటింకా వుందా?" అని అడిగారు. ఏమిటని అడిగాను. "మావూరి కరణం శ్యామణ్ణ వచ్చాడే దాన్నిగురించి" అన్నారు. నాకాతబిసీళ్ళుతెలవ్వు. నాకుతెలిసింది చెప్పాను. "అది కాదు స్వామీ! కోర్టులో మీరే నెగ్గారట. నెగ్గాక వూరొదిలి ఎందుకెళ్ళారు?" ఆయనేమీ జవాబు చెప్పలేదు. "నేనూ వూరొదిలి పన్నెండేళ్ళయింది. వూరికెడతాను". అన్నారు. తరువాత మళ్ళీ కనబడలేదు. ఆయనెక్కడున్నారో చెప్పలేదు".

నంజమ్మ కిప్పుడంతా అర్థమయింది. కోర్టునించీ, కేసయ్యాక వూరికి వచ్చిన శామణ్ణ "ఆ నా కొడుకు దొరకనీ, జడ్జిగారే వురేస్తారు". అన్నాడు. అంచేతే ఆయన భయపడి దేశాంతరం వెళ్ళపోయాడు. ఇలాంటి కేసుల్లో కాలపరిమితి పన్నెండేళ్ళట! తరువాత సర్కారు వాళ్ళాకాగితాలు కాల్చేస్తారట. ఇల్లూ వాకిలీ వదిలి దేశాటనం చేయడం తన తండ్రి నుదుట రాసిందేమో! ఆమె మౌనంగా ఆలోచిస్తోంది. ఇంతలో చెన్నిగరాయలొచ్చాడు. అయ్యగారిని చూడగానే అతనికీ సంతోషమయింది. ఆయన పాడుతున్న తత్వాలు, చేస్తున్న భజన వింటూ కూర్చుంటే తనకు కాలక్షేపమయ్యేది. అయ్యగారిన్నాళ్ళూ ఎక్కడున్నారు, ఏమిటి అన్న కుశలప్రశ్నలయ్యాక కాశీకి వెళ్ళారన్న సంగతివిని చెన్నిగరాయలకేదో అడగాలనిపించింది. కాశీని గురించి చాలామంది చెప్పగా విన్నాడు. కానీ మాదేవయ్యలాగ అక్కడే ప్రత్యక్షంగా వున్నవాళ్ళనింతవరకూ చూడలేదు.

"అయ్యగారూ! అక్కడ రాజులు,మహారాజులు రోజూసమారాధనలూ, సంతర్పణలూ చేస్తారటగా? భోంచేస్తూ ఓలడ్డుతింటే ఓరూపాయ దక్షిణిస్తారట నిజమా?"

"అక్కడ రాజుల మహారాజుల ధర్మశాలలు చాలానే వున్నాయి. వెళ్ళినవాళ్ళకి ధర్మశాలల్లో మూడురోజులు వూరికే అన్నంపెడతారు. పండుగ భోజనం పెడతారు. ఒకోసారి ఓ లడ్డుతింటే ఓ రూపాయివ్వడమూకద్దు"

"అయితే అక్కడికెళ్ళి వుండిపోవాలండి"

"కరణం గారూ! కాశీలో బిచ్చగాళ్ళు లేరనా? మీలాగే అక్కడికెళ్ళి వుండాలనే వాళ్ళు లేరవా? రోజూ వూరికే భోజనం పెట్టాలంటే ఏ రాజాధిరాజుకు సాధ్యం?"

"థూ! అలాంటి రాజేంరాజండీ. వాడి పిండాకూడు. వాడి ఐశ్వర్యమెలాంటి ఐశ్వర్యమండీ?"

అయ్యగారు దానికెలాంటి బదులుగాని, వ్యాఖ్యానంగానీ చెప్పదలుచుకోలేదు. కాసేపు కూర్చుని ఆయన బయల్దేరగా నంజమ్మ అంది. "మీ గుళ్ళోవున్న రాగులూ అవీ దొంగతనమయ్యాయి. ఈ రోజుకింత పిండి, పప్పులు, కారప్పొడి ఇస్తాను. లేదా మా ఇంట్లోనే భోంచెయ్యండి."

కాసేపాలోచించి ఆయన "ఈ వూళ్ళోవుందామని వచ్చాను. చుట్టూ పల్లెల్లో జోలెపట్టి బిచ్చమెత్తుతాను. మా కులస్థులతో పనేమి? ఇక్కడికే భోజనానికి వొస్తాను" అనేసి వెళ్ళిపోయారు.

ఆయన గుడికెళ్ళి అర్థగంటకూడా కాలేదు. ఒక్కొక్కరే. బణజిగ మగాళ్ళు గుడికి వచ్చారు. రేవణ్ణశెట్టి, శెట్టప్ప, మరుళప్పశెట్టి, లింగదేవుడు, అందరూవచ్చి అయ్యవారికి నేలమీదపడి దణ్ణాలుపెట్టారు. రేవణ్ణశెట్టి అన్నాడు. "అయ్యగారూ! మీరు గొప్పోళ్ళు. మా వూరిమీద కోపగించుకుని వెళ్ళిపోయారు. వూళ్ళోవానే పడలేదు. నిన్నరాత్రి మీరొచ్చారు. వానొచ్చింది. మిమ్మల్నేదో అని పాపంజేశాం. మీరు దాన్ని మరిచి మా ఇళ్ళకు రోజూ జోలెభిక్షానికి రావాలి."

అయ్యగారా సంగతే ఆలోచించలేదు. వీళ్ళిలా అంటున్నారు. తాను వూరువదిల్తే వర్షంపడలేదా? కేవలం రామసంద్రానికే వరపురాలేదు. ఆ సీమకంతా వరపే. వర్షంపడలేదు. తమిళ దేశంలో, తెలుగుదేశంలో కూడా వర్షాలు లేకపోవటం రైల్లో వస్తూ ఆయవ చూశారు. నిన్న తాను వూరికి రావటానికీ, ఇక్కడ వర్షం పడటానికీ అదేమి శివుడిసంకల్పమో!ః ఈవూరి పైపల్లెల్లోకూడా వర్షంపడ్డది. ఆయనే అన్నాడు. "నేనేమీ గొప్పోణ్ణికాను. వర్షం వచ్చేది మానేది శివుడి ఆజ్ఞ. ప్రజల పాపపుణ్యాలకు తగ్గరీతిగా శివుడిస్తాడు. మన కవళం మనమే మట్టిలో పారేసుకుంటాం".

అయినా వాళ్ళు వినిపించుకోలేదు. రోజూ తమ ఇళ్ళకి జోలె భిక్షానికి వచ్చి,

అందరినీ ధన్యుల్ని చేయాలని మరోసారి చేతులెత్తి దణ్ణం పెట్టారు. అయ్యగారు కాదనలేదు. ఇప్పుడూళ్ళో అందరి ఇళ్ళల్లోను తిండికి తిప్పలు పడుతున్నారని విన్నాడు. అయినా ఆయన జోలెభిక్షమెత్తి, గుడికి తెచ్చి, కూర్చుని తిన్నాడు. నంజమ్మ ఇంటికి రాత్రికి వస్తానని చెప్పివచ్చారు. నంజమ్మ కొడుకు విశ్వం అయ్యగారిని సగం మరిచిపొయ్యాడు. బడికి వెడుతున్నాడు. ఆయన భోంచేసేటప్పుడు కూడా వుండటానికి లేదు. బడివుంది.

మాదేవయ్యగారు వూరొదిలి వెళ్ళేసరికి వూళ్ళోవర్షంపడలేదనీ, ఆయన నిన్నరాత్రి వచ్చాచరు గనకే వర్షం పడిందనే వదంతి వూరంతా పాకింది. కురుబలు, కుమ్మరాళ్ళు, బడిగలు, అందరూ గుడికొచ్చి ఆయన దర్శనం చేసుకుని చెయ్యెత్తి మొక్కి వెళ్ళారు. మునసబు శివేగౌడలాంటి కొందరు దీన్ని నమ్మలేదు. ఆ రోజురాత్రి అయ్యగారొకరే గుడిలో పడుకున్నారు. ఎవడో వచ్చి "అయ్యోరు! అయ్యోరు! అని పిలిచి లేపాడు. అయ్యగారు లేచి అగ్గిపుల్లగీచి చూశారు. వచ్చినవాడు శివేగౌడ ఇంటినౌకరు గౌరవ. ఆయన కాళ్ళుట్టుకుని "నాకు శాపం పెట్టకండి. నాదేమీ తప్పులేదు."

"ఏం, ఏమయింది? లే".

"మీ రాగులు, అనపగింజలు అన్నీ మా గౌడ రాత్రి చీకట్లో వూళ్ళోకొచ్చి దోచుకున్నారు. ఆయనే వొచ్చి తాళం బద్దలు కొట్టారు. నేను మోసుకెళ్ళి ఆయన షెడ్లో పడేశాను. మా ఇంటికేమీ కొంచబోలేదు"

"సరే వదిలెయ్. నీదేమీ తప్పులేదు".

"నేను చెప్పానని ఎవళ్ళతోటి చెప్పకు"

"చెప్పనులే". అన్న తరువాత వాడు వెళ్ళిపోయాడు.

మునసబు శివేగౌడ ఎలాంటివాడో అయ్యగారికి తెలియందికాదు. వదిలిపెట్టిన వూళ్ళో దేవాలయంలో గదితాళం బద్దలుకొట్టి రాగులు దొంగిలించాలంటే ఎవరోఇలాంటివాళ్ళ అండలేందే, కేవలం పొట్టగడవని అలగాజనం చేయలేరని ఆయన వూహించారు.

మరుసటిరోజు వుదయం సుమారు పదిగంటల సమయంలో ఒక వింత చూశారు వూళ్ళోజనం. ఆకాశంలో ఏదో శబ్దం చెవులు గింగురుమంటూ వినిపించింది. పొలాల్లో తోటల్లో వున్నజనం తలెత్తి చూశారు. ఆకాశంలో తెల్లగా పెద్ద గరుడపక్షిలాంటిదేదో వెడుతోంది. రెక్కలాడించడంలేదు. ముక్కులేదు.

కానీ తోకలాంటిదేదో వుంది. రెక్కల్లా రెండువేపులా ఏవో వున్నాయి. వూరిమీదుగా వెళ్ళేటప్పుడు దానిలోనుంచీ ఏవో రాలికిందపడ్డాయి. గాలి దుమారంలో లేచే ఎండుటాకుల్లాగా, వూరిమీదంతా ఏవోకాగితాలు చెల్లాచెదురుగా పడ్డాయి. పైవ వెళ్ళింది విమానమని, వెనక ఎప్పుడూ చూడకపోయినా చాలామందికి తెలిసిపోయింది. కిందికి పడ్డ చీటీ ఒకటి తీసి నంజమ్మ చదివింది.

మైసూరు రాజ్యాన్ని పరిపాలించే శ్రీమన్మహారాజుల ఘనతపొందిన ప్రభుత్వం దాన్ని అచ్చువేసింది. ఇప్పుడు యుద్ధంజరుగుతోందట. యూరోపుదేశంలో జర్మనీ వాళ్ళు ముందుకు చొచ్చుకొస్తున్నారట! జపానువాళ్ళు ఇండియాను కబళించటానికి వస్తున్నారు. మన మైసూరుదేశం మీదకూడా బాంబులు పడవచ్చు. విమానాలు వచ్చినప్పుడు జనం బయటికివచ్చి చూడరాదు. వున్న చోటే బోర్లా పడుకోవాలి. శత్రువులను వెనక్కితరమగొట్టడానికి యుద్ధనిధికి ప్రజలంతా సహాయం చేయాలి, అని అందులో వ్రాశారు. చివర 'విజయం' అని వుంది.

ఈ సంఘటన జరిగాక వారంరోజుల్లో రెవెన్యూ ఇన్స్పెక్టరు రామసంద్రానికి వచ్చారు. యుద్ధ నిధికి సహాయం చేయాలని సర్కారు వారి ఆజ్ఞ అయింది. పంటలు లేవని అదే సర్కారువాళ్ళు నిరుడు పన్నులు మినహాయించారు. కాని ఇప్పుడు ఇంగ్లాండు చక్రవర్తి డబ్బు లేకుండా యుద్ధంలో గెలవటం సాధ్యంకాదు. ప్రజలు తమ శక్తికొద్దీ ఇవ్వాలి. రెవెన్యూ ఇన్స్పెక్టరే వచ్చాక చేసేదేమిటి? శివేగౌడ, కాశింబడ్డెలాంటి వారినుంచీ ఇన్స్పెక్టరు చెప్పినంతా వసూలయింది. వూరిబయట చిన్నదుకాణం పెట్టుకున్న నరిసి కూడ అయిదు రూపాయలిచ్చింది. మొత్తంమీద రామసంద్రంలో వందరూపాయలు వసూలయింది. "మీ గ్రామం మర్యాద నిలుపుకున్నారు' అని చెప్పి రెవెన్యూ ఇన్స్పెక్టరు వెళ్ళిపోయారు.

మరుసటిరోజు రామణ్ణ బడినుంచీ వచ్చేసరికి, వాడి చొక్కాకు 'V"అన్న ఆకారంలో అచ్చువేసినరంగుకాగితాన్ని గుండుసూదితోగుచ్చుకొనివచ్చాడు. వాడొచ్చి అమ్మతో చెప్పాడు. "అమ్మా మా స్కూల్లో కుర్రాళ్ళందరికీ చొక్కాలకి తగిలించివూరేగించారు. ఇదిచూడు నీకుచెప్పానుకదా ఇంగ్లీషులో "వి" అనే అక్షరం".

"అంటే దానర్థమేమిట్రా?"

"వి" అంటే విక్టరీఅని. యుద్ధంలో మనకంతా జయం కలగటి అని. దాని కోసం ప్రతికుర్రాడు బేడ చొప్పున ఇవ్వాలని హెడ్‌మాస్టర్ చెప్పారు." అని కొడుకు వివరించాడు. రెండణాలెక్కణ్ణించీ తేనని నంజమ్మ మనసులోనే ఆలోచిస్తోంది.

# 11వ అధ్యాయం

ఇన్ని రోజులైనా కమలకు పిల్లలు కలగలేదు. తాను పెంచి పెద్ద చేసిన మనువడికి పిల్లలు లేరని, వంశం నిలిచిపోతోందనీ అక్కమ్మ బాధపడుతోంది. పిల్లలు లేకపోతే పీడాపోయింది. మొగుడుకి గానీ, ముసలమ్మకు గానీ ఆమెవల్ల సుఖంలేదు.

రామసంద్రంలో వానా వంగడి లేనప్పుడు నాగలాపురంలో కూడా లేవు. కానీ కల్లేశు తెలివైన గృహస్థుడు. ఏడాదికి సరిపడా ధాన్యం నిలవచేసి వుంచాడు. నిరుడు వర్షా లెడతాయన్న సూచన కలగ్గానే పొలాలలో ఆరికలు వేయించాడు. వర్షాలు పడకపోయినా పొలంలో మూడుఖండిగలారికలు వచ్చాయి. ఇంట్లో రాగులెలాగూ వున్నాయి. లేందల్లా వరిఒకటే. ఇవి వుంటే చాలదూ? ఆరికన్నమూ భేషుగ్గా వుంటుంది. కాని కల్లేశునికది పడేది కాదు. వాయువు చేసే ఆరికన్నం తింటే, అసలే కాస్త అదవగా వున్న ఎడమచెయ్యి అదరడం మొదలెట్టింది. అంచేత తినడానికి వీల్లేదు. ఇంట్లో వున్న బస్తా వడ్లే అప్పుడప్పుడు దంపిస్తే యాభై అయిదుసేర్లు బియ్యమైనా వస్తాయి. రోజూ అరపావు అన్నం చేస్తే ముద్దకు తోడు సరిపోతాయి. ఇంతవయస్సయినా ముసలమ్మ కారి కన్నం తింటే ఏమీ అయ్యేదికాదు. తానూ, కమలా, అదే తినాలని అక్కమ్మ నిశ్చయించింది.

రెండు రకాలుగా అన్నంచేసి, మొగుడి కొకరకంగా, తనకోరకంగా వడ్డించడం చూసే సరికి కమల మండిపడింది. అతనిదే మెక్కువ? తనదేం తక్కువ? – అని ఆవిడ వాదం. నాగలాపురానికి వచ్చి పన్నెండేళ్లయినా తానింకా హాసన పట్టణానికి చెందినట్టే భావిస్తోంది. ఆ వాసన ఇంకా పోలేదు. అంచేత పట్టుదలతో ఇన్ని రోజులుగా ఒక పూటయినా రాగి ముద్ద చేత్తో ముట్టలేదు. ఇప్పుడారికన్నం ఎలా మింగుడుపడుతుంది. ఒక రోజు అక్కమ్మ వంట చేసి పెట్టి పెరట్లో బొప్పాయి చెట్టుకింద కూర్చుంది. కల్లేశు కాయగూరల పాదులలో తవ్వు గోలతో తవ్వి కలుపు తీస్తున్నాడు. వానకానీ వరపుకానీ పెరటినిండా కాయగూరలు పెంచడం అతడెప్పుడూ మానలేదు. అతనిది చేతులు ముడుచుకుని కూర్చునే ప్రకృతి

కాదు. తాను తవ్వుతున్న పాదులలో కలుపుతీసి, లోపల ఎరువు ఎర్రమట్టి కలిపివేసి, పైన పాతమట్టి కప్పి, పాదులు చేసి, నీళ్ళు తోడి వాటిని తడిపి, అన్నంతిన్నాక మధ్యాహ్నం ఏఏ పాదుల్లో ఏఏ మొక్కలకేం చేయాలో నిర్ణయించుకుని, 'బామ్మా! అన్నం వడ్డించు" అన్నాడు.

కల్లేశు మరో బిందె నీళ్ళు తోడి, నూతి పళ్ళెంలో చేతులు కాళ్ళు కడుక్కుంటున్నాడు. అక్కమ్మ లోపలి కెళ్ళి చూసేసరికి కమల వెండికంచం వేసుకుని భోంచేస్తోంది. మొగుడికి చేసిన వరి అన్నమంతా ఆవిడ కంచములో వుంది. అన్నపు తప్పేలా ఖాళీగా పడుంది. తనకు తోచినంత నెయ్యి వంపుకుని, పప్పుచారు తేటగా పోసుకుని కలిపి జుర్రుకుంటోంది. లోపలి కొచ్చిన అక్కమ్మ వూరికే చూస్తూ నిలబడిపోయింది. ఆవిడొస్తే మాత్రం తనకేమన్నట్టు నిర్లక్ష్యంగా కమల భోంచేస్తోంది. ఇంతలో కల్లేశు కూడా లోపలికొచ్చాడు. చూడగానే అతడికంతా అర్థమైపోయింది, తిన్నగా పొయ్యిదగ్గరకెళ్ళి అక్కడున్న చింత కర్రు చ్చుకుని ఆవిడ వీపు మీదా, చేతులు మీదా, తొడలమీదా, దబదబా బాదడం మొదలెట్టాడు.

"తింటే తింది, అలాకొట్టకురా" – అని విడిపించాలని వెళ్ళిన అక్కమ్మనో తోపు తోపే సరికి పాపము ముసలమ్మ గోడకు కొట్టుకుని కూలబడి పోయింది.

"కొడతావేరా? నీ ఇంటి అన్నం తిన్నానని కొడతావా? పెళ్ళానికి పిడికెడు పిండాకూడు తెచ్చిపడేయడం చేతకాక ఆరికన్నం తినమంటావా? కొట్టడానికి మాత్రం మొనగాడిలా వొస్తావు -- సిగ్గులేదూ?" కమల అడిగింది.

కల్లేశు మరింతరెచ్చిపోయ్యాడు. ముక్కు మొహం చూడకుండా వాయించేసరికి కర్ర విరిగిపోయింది. వాడి అరచేతిలో పిడిగుచ్చుకుని రక్తం చిమ్ముతోంది. విరిగిముక్కలయిన కర్ర అక్కడే పడేసి, బయటికి వచ్చి, చొక్కా వేసుకుని, అన్నం తినకుండా వెళ్ళిపోయాడు. అతడలా ఇల్లు వదిలి వెళ్లిపోవటమిదే మొదటిసారికాదు. ఫలాని చోటికే వెళ్ళాడని ఎవళ్ళూ ఖచ్చితంగా చెప్పలేరుకాని ఎక్కడికెడతాడో అక్కమ్మకు తెలుసు. కమలకూ చూచాయగా తెలుసు. మరువనహళ్ళి దేవదాసి ఇంటికో, హొసూరి దగ్గరున్న దొంబరపాళ్యం మువియ ఇంటికో లేదా వాగలాపురంలో పుట్టి ఇంటికో, అదే వూళ్ళో పోలీసు కానిస్టేబులు మమ్మీ సాహెబు మూడవపెళ్ళాం దగ్గరికో, మరెక్కడికో వెళ్ళుంటాడు. అతడి భోజనం గీజనం కూడా అక్కడే . ఎక్కడి కెళ్ళినా అర్ధరాత్రి లోపుగా ఇంటికి

వచ్చేస్తాడు. ఇంకెక్కడికెళ్ళినా ఒకరోజుకంటే ఎక్కువ వుండడు.

అతడు వెళ్ళి వెళ్ళగానే కమల అక్కమ్మ వేపు తిరిగి "ముసలి ముండా! నీ మనవడికి చెప్పి నన్ను కొట్టించావేమే నీ నోట్లో మట్టిగొట్టా నీ పీనుగ నూరకుక్కలు తినా......." అని తిట్టిపోసింది.

అక్కమ్మ పాపం నోరు విప్పదు. ఎంతబాగా వంట చేసినా, మధ్యాహ్నం కూర్చుని హాయిగా భోం చేస్తామనే నమ్మకం లేదు. నిష్కారణంగా కల్లేశు కోపగించుకున్నా, అతడి పెళ్ళామిలా చేసినా ఇలాంటి వుపద్రవం వచ్చిపడేది. కాకపోతే ఈ రోజు కాస్త పై స్థాయిలో జరిగింది. ఆమె లేచి వచ్చి మళ్ళీ బొప్పాయి చెట్టు నీడలో కూర్చుంది.

కల్లేశు పెళ్ళాన్ని కొట్టేటప్పుడు చెయ్యేకాదు నోరుకూడా జోరుగా పనిచేసేది. బాదే చప్పుడు ఇరుగుపొరుగు నాలుగిళ్ళకే వినబడితే తిట్టేతిట్ల ఆర్భాటం ఇరవై ఇళ్ళకు వినిపించేది. అతడు చొక్కవేసుకుని వెళ్ళిన కాసేపటికి కరణం శ్యామణ్ణగారి కోడలు వచ్చింది. ఇంచుమించు కమల వయస్సే ఆవిడకూ. గడచిన అయిదారేళ్ళుగా, ఆమెకూ కమలకూ స్నేహం పెరుగుతూ వచ్చింది. ఇద్దరూ కలిసే చెరువుకు వెళ్ళేవారు. కమల ఎన్నోసార్లు వాళ్ళింటికి వెళ్ళివచ్చేది. రెండేళ్ళక్రితం శ్యామణ్ణ భార్య చనిపోయాక కోడలు పుట్టగౌరి ఇంటి యజమానురాలు. ఆవిడ చేతిలో మొగుడు కీలుబొమ్మ. అంచేత కమలకు సలహాదారుగా వుండేది. ఆవిడ రావడంపోవడం కల్లేశు కిష్టంలేదు. రాకూడదని శాసించాడు. ఆవిడ రాకూడదని అక్కమ్మ కూడా చెప్పేది. కాని పట్టుపట్టి కమలతో మాట్లాడాలని వచ్చేది. కమలని తన ఇంటికి తీసుకెళ్ళేది. తమ ఇంటి కోడలు మనస్సు విరిచి, దెబ్బలాట పెట్టి తమాషా చూడాలనే శ్యామణ్ణ తన కోడల్ని పంపుతున్నాడని అక్కమ్మ వూహ. ఆమె వూహ తప్పుకాదని కల్లేశుకూ తెలుసు. ఇటీవల ఆవిడ రాకపోకల్ని నిరోధించటం మానేశాడు. ఎందుకో అక్కమ్మకర్థం కాలేదు. ఆ పుట్టగౌరి స్నేహం మానితే తమ కోడలు దారిలో పడుతుందని ఆమె నమ్మకం.

ఆ రోజు కల్లేశు వెళ్ళాక పుట్టగౌరి వచ్చింది. కమల తన పడక గదిలోకెళ్ళి చాపమీద దుప్పటి కప్పుకుని పడుకుంది. దెబ్బలు తిన్న జాగాలలో తానే వుప్పుకాపడం పెట్టి స్నేహితురాలిని ఓదార్చడమేకాక, సాయంకాలం తన ఇంటినుంచీ ఒక గిన్నెలో అన్నంపులుసు కలిపి తెచ్చి తినిపించింది గౌరి - ఈ ఇంటి

కంతకంటే అవమానం మేముంది? 'కల్లేశుజోస్యులింట్లో పెళ్ళానికి కూడెట్టే యోగ్యత లేదు. నేను పెట్టి వచ్చాను చూడండి'- అని నాలుగిళ్ళకు గిన్నె చూపుతూ వెళ్ళింది.

కల్లేశు మరుసటిరోజు పుదయం వచ్చాడు. అంతలో పెళ్ళాం, పెరటివేపెళ్ళి, ముఖంకడుక్కుని, కాఫీ చేసుకుని తాగి మళ్ళీ కోపగృహంలో పడుకుంది. అప్పుడావిడ చూసుకున్నదట. అతడు నిన్న కొట్టిన దెబ్బలకి ఆవిడ చెవుల్లోవున్న దుద్దులు రెండూ విరిగి ముక్కలైపోయాయట! ముసలమ్మ తెలియకుండా వూడ్చి పారేసిందో, మనవరాలింటికి సాగించటానికి తీసి దాచిందో! 'నేనలాంటి దొంగముండని కాదే' అని అక్కమ్మ వాదించింది. "నా పెళ్ళిలో పెట్టిన దుద్దులు పోయాయి. ఇప్పుడు కొత్తవి చేయించిపెడితే సరే. మా నాన్నకి రాస్తాను" - కమల దీర్ఘాలు తీసింది.

ఇంటికి వచ్చేసరికి కల్లేశు కోపం కూడా కాస్త తగ్గింది. ఆ రోజు పొద్దుట ఇల్లూడ్చి పారేసిన చోట చెత్త కుప్పలో వెతికి తానే చూచాడు. పెళ్ళామన్నట్టు అక్కమ్మ తీసిదాచిందని అతడు నమ్మలేదు. తాను వీపు మీద మాత్రమే కొట్టివుంటే ఏ గొడవ వుండేదికాదు. చెవికి తగిలేలా కొట్టి వుండకూడదని లోలోపల పశ్చాత్తాపపడ్డాడు.

రెణ్ణెల్లు కమల చెవులకు దుద్దులు లేకండానే తిరిగింది. పెళ్ళాం చెవికేమీ లేకపోతే తనకే అవమానం. ఎలాగో యాభైరూపాయలు పోగుచేసి రాళ్ళదుద్దులు చేయించి ఇచ్చాడు.

## 2

సుమారు ఏడాది కావస్తోంది. వర్షాలులేక వూళ్ళో మంచి నీళ్ళేపుట్టడంలేదు. ప్రతిరోజూ చెరువునుంచీ మంచినీళ్ళు తెచ్చుకునే వారు జనం. చెరువు ఎండిపోయాక, నట్టనడుమ నాలుగు నూతులు తవ్వారు. అసలేదూరం. ఇప్పుడింకా దూరం వెళ్ళాలి. ఒకరోజు మధ్యాహ్నం కమల చెరువుకు మంచినీళ్ళకని వెళ్ళింది. ఏకాదశి కావటంచేత అక్కమ్మ వూరవతల వున్న కేశవాలయానికి వెళ్ళింది. పుట్టగౌరి తలమీదొకటి, చేతిలో ఒకటి బిందెపుచ్చుని కల్లేశింటికి వచ్చింది. 'కమలమ్మా' అని పిలుస్తూ లోపలిదాకా వెళ్ళినా ఎవరూ అగుపించలేదు. పెరటి దాకా వెళ్ళి చూసింది. ఎవరూ లేరు. వెనక్కు తిరిగి రాబోతే వీధి తలుపు వేసి

వుంది. ఇదేమిటని తిరిగిచూసేసరికి పెరటితలుపు కూడా ఎవరో మూశారు. లోపల చీకట్లో ఒంటరిగా చిక్కడిపోయి "అయ్యయ్యో" అని పూర్తిగా అరిచేలోపుగా ఎవరో చేత్తో నోరు మూసి లాక్కున్నారు.

ఇంటికెళ్ళేటప్పుడామె గుండె దడదడలాడుతోంది. కల్లేశు జోస్యులలాంటివాడని ఎంతో మంది అన్నారు. పూరిదయిట అతడేమైనా చేసుకోనీ. బ్రాహ్మణి అయిన తమ్న, అందులోనూ అతని పెళ్ళాన్ని నీళ్ళకెడదామని పిలవటానికెడితే, ఇలా దొరకపుచ్చుగుని గట్టిగా కేకవేసే ముందే నోరునొక్కేసి ఇలా చేయచ్చా - ఆమె చేతులు కాళ్ళు వణుకుతున్నాయి. అసహ్యంతో శరీరం మండిపోతోంది.

ఆవిడింకా ఇల్లైనా చేరుకోలేదు. కల్లేశింటి ఇరుగు పొరుగు వాళ్ళు నలుగురైదుగురు వచ్చి అడిగారు "మీరలా కేకేశారే, ఏమయింది?"

ఆవిడ మామ శ్యామణ్ణ, మొగుడు నంజాండయ్య ఇంట్లోనే వున్నారు.

"ఏమీ లేదు వాళ్ళింటిపిల్లి మీద పడిపోయింది"

"ఇదేమిటని పరుగెత్తి వచ్చాం. వీధి తలుపు గడియవేసి వుంది"

"తరవాత ఏంచెప్పాలో తెలియక "హా, కమలమ్మ పెరటివేపుంది" అంది.

వచ్చినవాళ్ళు వెళ్ళిపోయారు. అదేసమయంలో వాళ్ళింటిముందే కల్లేశు భార్య కమలమ్మ నీళ్ళబిందె లెత్తుకుని చెరువునుంచీ ఇంటికెడుతోంది. అనుమానం తగిలి శ్యామణ్ణ లోపలికెళ్ళి అడిగాడు. "నిజం చెప్పు. ఎవడైనా వెకిలి చేష్టలు చేసుంటే పురితీయిస్తాను చెప్పు. భయపడకు".

"కమలమ్ముందేమో అని పెరటిదాకా వెళ్ళాను. ఎవరూలేదు. తిరిగొచ్చేస్తున్నాను. కల్లేశజోస్యులు మా ఇంటికెందుకొచ్చావు నువ్వు? అని అడిగాడు. కంగారెత్తింది. కేకేసి పెరటి వేపు నుంచీ పశువులొచ్చే దారిగుండా వొచ్చేశాను. అతడువచ్చిలా నువ్వు గివ్వు అనచ్చా?"

కోడలిమాటలు పూర్తిగా నమ్మాలా మానాలా అన్నదానికంటే దాన్ని శంకించి అల్లరి చేస్తే తమ ఇంటిపరువే పోతుందన్న విచక్షణ కలిగింది. ఆయన కొడుకు నంజాండయ్యకు ఈగొడవే అర్థంకాలేదు. "బోడినాకొడుకు! అలాగన్నాడా! ఇంకోరోజా వాళ్ళింటిగడపతొక్కకు" - అని భార్యకు సుగ్రీవాజ్ఞ వేశాడు.

శ్యామణ్ణ కల్లేశజోస్యులింటికి వెళ్ళాడు. కమల ఇంట్లోనేవుంది. అక్కమ్మ ఇంకారాలేదు. కల్లేశు ఇంట్లో లేడు. ఎక్కడికోవెళ్ళాడు శామణ్ణ కమలమ్మతో "నిమ్న నీళ్ళకు పిలవడానికి మా కోడలొస్తే నీ మొగుడమర్యాదగా మాట్లాడాడట.

వాడిమీదకేసువేసి మూడు చెరువుల నీళ్ళు తాగించేవాణ్ణి. ఏదో పోనిద్దూ అని వూరుకున్నాను. ఇహమీద నువ్వు మా ఇంటికి రాకు. నా కోడలు మీ ఇంటికి రాదు" అని కుండ బద్దలు కొట్టినట్టు చెప్పి వెళ్ళిపోయాడు.

కల్లేశు రెండురోజులింటికి రాలేదు. మూడవరోజు రాత్రి పదిగంటల కింటికొచ్చాడు. అక్కమ్మ లేచి అన్నం, 'గొడ్డుచారు' చేసి పెట్టింది. శ్యామణ్ణ ఏమైనా గొడవచేశాడా అని బామ్మని అడిగాడు. కోడలికి వినిపించకుండా రహస్యంగా చెప్పింది. "మొన్న గౌరివస్తే మా ఇంటికెందుకొచ్చావు నీవని దాన్ని కసురుకున్నాడట. నా కోడల్ని వాడిలా అనవచ్చా? ఇహమీద ఇది వాళ్ళింటికి వెళ్ళద్దు. వాడి పెళ్ళాం మనింటికి రావద్దు అని వెళ్ళాడట. పోనీ శని విరగడైపోయింది. ఇదేమాట నాలుగేళ్ళక్రితమే అని పంపితే అది ఇక్కడికొచ్చి ఈ కోతికి కల్లుతాగించేదికాదు. ఇది కాస్తంతయినా తిన్నగావుండేది."

శ్యామణ్ణ గొడవ చేయలేదని కల్లేశు నిశ్చింతగా విట్టూర్చాడు. అతడు రెండు పనులు సాధించినట్లయింది. అది అక్కమ్మకూ తెలియదు. అతడి పెళ్ళానికీ తెలియదు.

కమలతో సంబంధం పుట్టగౌరికి బొత్తిగా తొలగిపోయింది. ఒకరోజు వాళ్ళిద్దరూ చెరువులో నూతి దగ్గర కలిశారు. కమల పలకరించినా, ముఖముటువేపుతిప్పుకుని చూడకుండా వెళ్ళిపోయింది. పుట్టగౌరి తనకూ ఆవిడికీ స్నేహం శాశ్వతంగా విడిపోయినట్టే అని వారం రోజుల్లోనే తెలుసుకుంది కమల. ప్రాణానికి ప్రాణంగా వున్న స్నేహితురాలు విడిపోయిందన్న మనస్తాపానికి తోడు, మరోవేదన కూడా వుంది. అది ఎవరితోనూ చెప్పుకునేదికాదు. వూరుకునేది కాదు.

వారంరోజులు తనలోనే తాను సతమతమయింది. ఒకరోజు తెల్లారగానే లేచి, తిన్నగా శ్యామణ్ణ ఇంటికి వెళ్ళింది. ఆ సమయంలో శ్యామణ్ణగానీ, నంజుండయ్యగానీ ఇంట్లో వుండరని ఆవిడికి తెలుసు. తిన్నగా లోపలికెళ్ళి పుట్టగౌరిని ఎదరనుంచుని "ఆయనేదో ఓమాట అంటే అనివుండచ్చు. ఆపాటికే నీనా స్నేహం తెంచుకోవాలా?"

ఏంచెప్పాలో పుట్టగౌరికి వెంటనే స్ఫురించలేదు. అయినా ఇలా అంది!" ఒకమాటేమిటి ఖర్మ! చాల్చాలు. నీ స్నేహానికోదణ్ణం నీకో దణ్ణం. ఇప్పుడు నువ్విక్కడికి వచ్చావని తెలిస్తే మా మామగారు నీ కాళ్ళు విరగ్గొట్టి పారేస్తారు. నడు. నడు."

"వెడతాను; నా దుద్దులు డబ్బా అక్కడపెట్టు."

"దుద్దులేమిటి? డబ్బేమిటి?"

"ఇదేమిటమ్మా ఇలా అంటావు? వెనకోరోజు, మా ఆయన నన్ను కొట్టినరోజు, నీకు తీసివ్వలేదూ నేను? నీళ్ళకెళ్ళేటప్పుడు బిందెలో దాచుకుని తెచ్చిచ్చిన బియ్యం, కాఫీగింజలు - అన్నీచేరి పదిహేను రూపాయలివ్వక్కర్లా నువ్వు?"

"కమలమ్మా, లేనిపోనివి చెబితే నీనోట్లో పురుగులడతాయి; నడు. నడు. మా ఇంట్లో నిమిషంకూడా నుంచోకూడదు. మా మామగారొస్తారు చూడిప్పుడు."

కోపంతో కమలమ్మ ఒళ్ళుమండిపోయింది. పెదాలదురుతున్నాయి. ఏమనాలో తెలియలేదు. వెనకటి కాలపు గట్టిదుద్దులు. ఎంతలేదన్నా ఎనభైరూపాయలు చేస్తాయి. కడమది పదిహేను రూపాయలు. ఈ ముండ రెండూ దక్కించుకోవాలని చూస్తోంది. ఇవి ఎగ్గొట్టడానికే నీ మొగుడిలా అన్నా డలా అన్నాడని వంకెట్టి అబద్ధాలు కల్పించి, నాతో మాట్లాట్టం మానేసింది. డబ్బిలా దీనికే వదిలేస్తే నేను పాపవ పడుచేకానని, ఆలోచిస్తూ చుట్టూ చూసింది. తావేమిచేస్తున్నాను, దాని పరిణామమెలా వుంటుంది. అన్న ఆలోచనేలేదు. నీళ్ళగదికి వెళ్ళి రాగికాగులో నీళ్ళు వంపేసి, దాన్ని రెండు చేతులతోటీ పుచ్చుగుని - "నాడబ్బు నాకిచ్చి నీ కాగు నువ్వుతీసుకో" అని వెళ్ళిపోయింది. పుట్టగౌరి వదుల్తుందా? 'అయ్యో దొంగముండా! ఇంట్లో దూరి కాగెత్తుకుపోతున్నావా?" అని ముందుకు దూసుకుని వచ్చి ఆపింది. కాని కమల ఆవిడ కంటె బలమైనది ఆవిణ్ణి కిందికి తోసి, ఇంట్లోనించి బయటికి వచ్చి, కిందున్న మనిసికూడా చూడకండా, కాగుతలమీదెట్టుకుని తన ఇంటికి గునగున పరుగెత్తింది.

కల్లేకు భార్య పెద్దకాగు తలమీదెట్టుకు వెళ్ళటం వీధిలో పదిమందీ చూశారు. దానిలో ఎవరికీ ఏమీ విడ్డూరం తోచలేదు. ఆవిడ ఇంటికి వచ్చేసరికి మొగుడు లేడు. కాగు వంటింటిమూల్లో పెట్టి తలుపు ముందుకు చేరవేసింది. అక్కమ్మకేమీ అర్థమవలేదు. "ఏమిటే ఇది? ఎవరింటిదే కాగు?" అని అడిగితే ఆవిడపలకలేదు. "దొంగముండ. నా డబ్బు కాజెయ్యాలని నాటకమాడింది. మా ఆయన ముక్కోపి అని తెలవదా? ఎందుకొచ్చారని అడిగితే అడిగారుగాక, అదేవంక పెట్టింది మింగడానికి. కాగిమ్మని అడగటానికి మాగడపలొక్కనీ, దగాకోరుముండకి చూపెడతా నా తడాఖా " అని ఆవిడ సణుగుతూ ఆలోచించడం అక్కమ్మ కరుగ్గారగా వినిపించింది కానీ అర్థం కాలేదు.

అరగడియకాలేదు. వీధిలో ఏదో చప్పుడయింది. శ్యామణ్ణ "మా ఇంటికాగు దొంగిలించావా - దొంగా?" అంటూ అరుస్తూ వస్తున్నాడు. ఇంకా ఇరవై ముప్పైమంది గుంపుగా వచ్చే శబ్దం వినిపించింది. శ్యామణ్ణే వీధి తలుపుతట్టాడు. "ఆయన వచ్చేదాకా తలుపు తీయకు" - అని కమల చెబుతన్నా అభంశుభం తెలియని అక్కమ్మ వెళ్ళి తలుపుతెరిచింది. ఇంటిముందు జన సమ్మర్దం. జాతరలో వుండేలా వుంది. శ్యామణ్ణ "అక్కమ్మా! మీ ఇంటికోడలు మా కాగు పట్టుకొచ్చింది. ఇచ్చేయండి" అన్నాడు.

"నా డబ్బిచ్చేదాకా నేనివ్వను" అని కమల లోపలినించే అరిచింది.

ఏమిటోగొడవ అర్థంకాని అక్కమ్మ "మా కల్లేశు వూరిబయటికెళ్ళాడు. ఎవరైనా వెళ్ళి తీసుకురండి. ఇంటి యజమాని వచ్చేదాకా నాకేమీ తెలవదు".

ఇద్దరు పరుగెత్తారు. కాసేపటికి కల్లేశు వచ్చాడు. పెళ్ళామేంజేసిందో, పిలవటానికికెళ్ళినవాళ్ళే దారిలో చెప్పారు. ఎందుకు చేసిందో తెలియని కల్లేశు ఇంట్లోకెళ్ళి పెళ్ళాన్నడిగాడు "ఏమిటే ఇది?"

" ఆ దొంగముండ నా డబ్బు కాజేసింది"

"ఏమిటా డబ్బు; ఎక్కడిదాడబ్బు? అడుగు" - అన్నాడు శ్యామణ్ణ.

"నా దొక జతదిద్దులు; పైగా పదిహేనురూపాయలూ ఇవ్వాలి"

"ఎలాంటి దుద్దులు? ఎక్కడివవి?"

"నా దుద్దులే విరిగిపోయాయి. బాగుచేయిస్తానని మీ కోడలు తీసుకుంది"

"నీ దుద్దులు విరిగిపోతే నీ మొగుడిచేత బాగు చేయించుకోవాలి. దానికెందుకిచ్చావు? పదిహేను రూపాయలేమిటి? ఎక్కడివి?"

"నా దగ్గర బియ్యం, కాఫీగింజలు తీసుకుంది"

"విన్నారయ్యా! ఎవళ్ళయినా నమ్మేమాటలేనా ఇవి?" అని శ్యామణ్ణ వీధిలో పోగయిన వాళ్ళనంతా అడిగి ఒప్పించాడు.

"ఎవరేమి ఒప్పుకునేది? నా డబ్బు కాజేయాలని వుత్తిపుణ్యానికే నీ మొగిడిలా అన్నా డలా అన్నాడని వంకెట్టి నాతో మాట్లాడ్డం మానేశింది. నా మొగుడేమన్నాడావిణ్ణి? పిలవండావిణ్ణి. పిల్లల మీద ప్రమాణం చేసి చెప్పనీ!"

"పిల్లల్లేని గొడ్రాలు. నువ్వెవళ్ళమీద ప్రమాణం చేస్తావు?" అని అడిగాడు శ్యామణ్ణ.

మాటలెలా వెడుతున్నాయో అర్థంచేసుకున్నాడు కల్లేశు. ఒట్టు,

ప్రమాణమనేసరికి, ముందువెనకా ఆలోచించకండా పుట్టగౌరి నిజమే చెప్పవచ్చు అన్న భయమూవేసింది. అక్కమ్మవేపు తిరిగి "కాగెక్కడుంది?" అని అడిగాడు.

"వంటింట్లో పెట్టింది"

ఏమీమాట్లాడకండా వెళ్ళి దానిని తీసుకువచ్చి శ్యామణ్ణముందుంచాడు. "నా దుద్దులు డబ్బు - ఇచ్చేదాకా దాన్నివ్వకండి - "అని అడ్డమొచ్చిన పెళ్ళాన్ని కాలితో తన్ని తోసేశాడు.

"దొంగముండ. వెత్తిమీదవెంట్రుకలూడేదాకా తన్నాలి" అంటూ శ్యామణ్ణ, అక్కడే నుంచున్న తలారిని "కాగట్టుకుని ఎళ్ళా" అని ఆజ్ఞాపించాడు.

జనసమూహం నెమ్మదిగా పలుచబడింది. కానీ గ్రామంలో ఇలాంటి విశేషం జరిగినప్పుడంత త్వరగా దాన్ని మరచిపోయి జనం తమదారిని తాము పోవటం తేలికకాదు. ఆ వీధిదాటి అవతలివీధిలో మళ్ళీ గుంపుగా చేరి గుసగుసలాడుకున్నారు. ఇందాకా విషయమేమిటో తెలియని వాళ్ళుకూడా ఒక్కొక్కరే పోగయ్యారు.

కల్లేశు వీధితలుపువేశాడు. పశువుల్ని కట్టేతాడుమడతపెట్టి చేతబుచ్చుకున్నాడు. పోలీసువాళ్ళు, దొంగల్ని చేసినతప్పుఒప్పుకునేదాకా బాదేలా తాడుతో పెళ్ళాన్ని బాదడం మొదలెట్టాడు. ఈ సమయంలో తానేమైనా కలిపించుకుంటే తనకూ నాలుగు వడ్డిస్తాడని అక్కమ్మ మాట్లాడకండా పెరట్లో కెళ్ళి గొడ్లపాకలో కూర్చుంది. "దుద్దులు దానికెందుకిచ్చావే భోసుడి? చెప్పు" అని పదిపదిహేనుసార్లు బాదాక చివరికావిడ చెప్పింది. "మా రంగమణికిద్దామనుకున్నాము" రంగమణి తన ఆఖరుచెల్లెలు. ఇప్పుడు పెళ్ళికి సిద్ధంగా వుంది.

"బియ్యం కాఫీగింజలెలా ఇచ్చావు?"

ఆవిడ చెప్పలేదు. మళ్ళీ నాలుగు తగిలించేసరికి మెల్లిగా బయటపెట్టింది. "నీళ్ళకెళ్ళేటప్పుడు బిందెలో దాచి తీసుకెళ్ళిచ్చాను"

కల్లేశు తాడు పారేశాడు. వంటింట్లో కెళ్ళి పొయ్యిలో పెట్టే కర్రపట్టుకొచ్చాడు. దాన్ని చూడగానే ఆవిడ "బాబోయ్ నన్ను చంపేస్తున్నాడు; చచ్చాను బాబోయ్" అని అరిచింది. వాళ్ళింటి పక్కవీధిలో గుమిగూడిన జనం నిశ్శబ్దంగా వాళ్ళింటిముందుకొచ్చారు. పటా పటాపడే కర్రదెబ్బలు, ఆమె హాహాకారం, తిట్లూ, మధ్య మధ్య కల్లేశు తారస్థాయిలో వదుల్తున్న "మాదర్‌చోత్, భాంచోత్" అన్న బూతుపదాలు, బయటున్న వాళ్ళకి వినిపిస్తున్నాయి. తలుపుతట్టి, లోపల దూరి శాంతి స్థాపించాలని ఒకరిద్దరు దూరపుళ్ళవాళ్ళ ప్రయత్నం చేయబోతే

ఇరుగుపొరుగిళ్ళవాళ్ళు దీనిలో విశేషమేమీ లేదు. మామూలే అని చేత్తో పైగచేసి ఆపారు.

కర్రవిరిగిందో, అతడికే విసుగెత్తిందో చెప్పలేముకాని మొత్తానికి కొట్టడమాగిపోయింది. ఏడవటానికికూడా శక్తిలేక నేలమీదపడున్న ఆవిడికి వీపునుంచి, భుజాలనుంచి, చేతులనుంచి, ముఖంనుంచీ రక్తం కారుతోంది. తాను నిరుడు చేయించిన దుద్దులామె చెవుల్లో వున్నవి తీసి, అట్టువెక్కి తన పెట్టెలో జాగర్తచేసి, తాళం చెవి మొలతాడుకు కట్టుకుని అతడు వీధి తలుపుతీసి బయటికెళ్ళాడు. ఇంటిముందు పోగైన జనాన్నిచూసి రెచ్చిపోయి, "లోపలేమి ఎలుగుబంటాడుతోందని నుంచున్నార్రా" అని గర్జించేసరికి ఎక్కడి వాళ్ళక్కడ తప్పుకుని వెళ్ళిపోయారు.

గట్టిగా ఏడ్చి, దాదాపు రెండుగంటలు వెక్కుతూ కూర్చుని మొగుడికాళ్ళు చేతులు విరిగిపోవాలని, మొగుణ్ణి జైల్లో పెట్టాలని పురితీయాలని శపించాక, కమల బుద్ధి తెల్లారినుంచి జరిగిన విషయాలను సింహావలోకనం చేసింది. ఆ దొంగముండ వా దుద్దులూ పదిహేనురూపాయలూ కాజేసినా నేనాకాగు పట్టుకొచ్చింది పారపాటే. దాన్ని పట్రాకపోతే నిరుడు జరిగిందంతా బయటికి వచ్చేదికాదు. అంచేత కదా ఆ ముండాకొడుకిలా చావగొట్టాడు నన్ను. అయినా వాడికి బుద్ధి చెప్పాలి. వూరుకుంటే ఆ యముడు మరోసారి చావగొడతాడు - అని నిశ్చయించింది.

## 3

మరునసహళ్ళి దేవి ఇంట్లో ఆరోజంతా వుండి మరుసటిరోజు పొద్దుట లేచి, కల్లేపు వూరికి బయల్దేరాడు. తోటదగ్గర జనుము పుంతలో వెడుతుండగా రంయిమని నాలుగైదు రాళ్ళువచ్చి తగిలాయి. ఎవరా అని తలెత్తి చూస్తుండగా వెనకనుంచి మరోరాయి వచ్చి తగిలింది. "ఎవర్రా అది మీ అమ్మనీ ......." అని వాడొకసారి గర్జించాడు. రాళ్ళు పడటమాగిపోయింది. తానే వెళ్ళి మీద పడదామంటే భయం. చాలామంది వుండి తన మీదపడితే చేసేదేం? వూరికే తనదారిని తాను వెడితే, ఎవరిలా చేశారో, ఎందుకు చేశారో తెలియడమెలాగ? ఎలాగూ తెల్లారిపోయింది. అని ధైర్యం చేసి జనుపమొక్కల సందులోంచి చూశాడు. కంచెచాటున, నక్కి కూర్చున్న వాళ్ళ గుపించారు. గుర్తుపట్టాడని గ్రహించి వాళ్ళే

సందులోంచి వంగుని వెళ్ళి తరవాత కాళ్ళకి బుద్ధి చెప్పారు.

వాళ్ళు శ్యామణ్ణ తాలూకు మనుషులు, తోటి, తలారి, వృత్తిపుణ్యానికి తనమీద రాళ్ళురువ్వటానికి వాళ్ళకి తనకివైరంలేదు. అదంతా శ్యామణ్ణ పన్నాగమేనని వూహించాడు. వాడిబుద్ధే అలాంటిది. తానొక్కడే ముందుకు దూసుకెళ్ళి ఏంచేయడానికి ధైర్యం చాలలేదు. వాడు వెనకాలుండి చేయిస్తాడు. నాన్నగారున్నప్పుడిలాగే ఒకరాత్రి రాళ్ళురువ్వించాడు. అంచేతేకదా పట్టపగలే వెళ్ళి వాన్నవాళ్ళపెంకులు చితగ్గొట్టారు. కాని నాన్నలా చేయగలిగిన సాహసం తనకు లేదని కల్లేశుకు తెలుసు. ఈ శ్యామణ్ణ ఎందుకిలాచేశాడు? నిన్న తన భార్య కాగు తెచ్చిందని చేశాడా? అయ్యుండదు. దాన్నితానే ఇచ్చేశాడు కదా? కోడలికేదో జరిగిందని వాడనుమానించి వుంటాడు. వచ్చిపోట్లాడితే వాడింటి పరువే పోతుంది. అంచేతే ఇలా పగతీర్చుకోవాలని బయల్దేరాడు లంజాకొడుకు. జబర్దస్తీ పనికిరాదు. ఒడుపుగా బోల్తాకొట్టించాలి. ఆ పుట్టగౌరివలా చేసుండకూడదు. అదేం మహా అందగత్తెఅని. అయినా చాలారోజులుగా మనస్సు కోరింది. కోరిక తీరింది. – అని ఆలోచిస్తూ ఇంటికి వచ్చే పరికి మరోసమస్య వచ్చి కూర్చుంది. రాగానే అక్కమ్మ చెప్పింది. "నువ్వు నిన్నంతా ఎక్కడి కెళ్ళావో ఏమో? అది నూతిలో పడతాను. నిన్ను నీ మనవణ్ణి కలిపి సిలవవేయిస్తాను" అని నిన్నంతా బెదిరించింది. రాత్రంతా నేను కన్ను మూయలేదు. హన్మణ్ణి పిలిచి ఇంట్లోనే వుండమన్నాను."

కమలింకా కోపగృహంలోనేవుంది. "ఏమే సైతాన్?" అని అడిగేసరికి" నిన్నురి కంబమెక్కిస్తాను." అని రాగాలు తీస్తూ చెప్పింది. పంగలకర్రుచ్చుగుని దేహశుద్ధి చేద్దామనుకున్నాడుకానీ, నిన్నటి అనుభవం వల్ల కర్రకులొంగే ఘటంకాదని వూహించి, ఆ ప్రయత్నం మానేశాడు. వెనకోసారి ఆవిడ నూతిలో పడ్డ సంగతి గుర్తొచ్చింది. వెంటనే ఒక వుపాయం తోచి అతడడిగాడు. "నూతిలో పడతావేమే?"

"అవును"

"అయితేరా" అని ఆవిడ రెక్కుచ్చుగుని జరజర పెరటినూతిదాకా లాక్కెళ్ళాడు. "ఏదైనా పొరపాటు జరిగితే మనపీకలమీదికొస్తుందిరా" అని అడ్డం వచ్చిన అక్కమ్మను దూరంగాతోసి, నూతిదగ్గరేవున్న కొత్త చేంతాడు కొలికి పెద్దది చేసి, ఆవిడ చంకల కిందికేసి బిగించాడు. ఆవిడ లబోదిబోమొత్తుకుంటువున్నా, రెండుకాళ్ళు నూతి ఒరకు తన్నిపట్టి, కొత్తగావేసిన రాటనుంచీ ఆవిణ్ణి నెమ్మదిగా లోపలికి దించి, 'బాబాయ్ బాబోయ్" అని ఆవిడ ఏడుస్తున్నా చేంతాడు మెల్లిగా లోపలికి

వదుల్తున్నాడు. కిందనీళ్ళదాకా వెళ్ళి ఆవిడకాళ్ళు, మోకాళ్ళు, తొడలు, నడుము మెల్లిగా నీళ్ళలోకి వెడుతున్నాయి. "బాబోయ్" అని మొత్తుకుంటున్నా పైనుంచీ చేంతాడు కాస్త సడలించి, పూర్తిగా ఆవిణ్ణొకసారి ముంచి మళ్ళీ చంకలదాకా పైకెత్తాడు. నూతిలో ఆవిడ చెమటపట్టి వణికిపోతోంది.

"నూతిలో పడతావేమే? పైనుంచీ కేకేసి అడిగాడు.

'లేదూ లేదూ"

"నువ్వు గివ్వు అంటూ పేల్తావేమే?"

"పేలను. పేలను. బాబోయ్, మీ కాళ్ళట్టుగుంటాను. పైకిలాగండి/ ఒరకు రెండు కాళ్ళూ తన్నిపట్టి, ఆవిణ్ణి పైకి లాగాలని ప్రయత్నించాడు. కాని మరీ బరువనిపించింది. తానొక్కడే పైకి లాగడానికి సాధ్యంకాదు. మరొకరి సహాయంలేకండా కష్టమే. పైవాళ్ళనెవళ్ళనైనా పిలిస్తే లేనిపోని అల్లరి. ఇంతలో ఎవరో వీధితలుపు తట్టారు. "ఆగు, తలుపుతెరవకు" అని అక్కమ్మకు చెబుతూ వుండగానే "అమ్మా! కల్లేశా! తలుపుతెరవండి" అన్న మాటలు వినిపించాయి. అది తన కొడుకు కంఠి గొంతుక అని అక్కమ్మ గుర్తుపట్టింది. లేచి వెళ్ళి తలుపుతీసి, ఆయన లోపలికి వచ్చాక మళ్ళీ తలుపుమూసింది. ఎడమ భుజం మీద రెండువేపులా బరువుగా వేళ్ళాడుతున్న సంచి, చేతిలోవున్న మరోసంచి కిందవుంచి, కొడుకు యోగక్షేమాలడిగేలోపుగా అక్కమ్మ "కాస్త అక్కడికిరా. ఏమీ మాట్లాడకు" అంది. తండ్రికొడుకు కలిసి కోడల్ని పైకి లాగేశారు. తడిచీరతోటే గదిలోకెళ్ళిన ఆవిడ మళ్ళీ మాట్లాడలేదు. చడీచప్పుడుచేయలేదు.

పరస్పరం కుశలప్రశ్నలయ్యాయి. జోస్యులిప్పుడు సన్యాసిలా గడ్డం పెంచాడు. తానిన్ని రోజులూ కాశీలో వున్నట్టు చెప్పాడు. ఎందుకెళ్ళావు? అన్న ప్రశ్నకు మాత్రం సమాధానం చెప్పలేదు. ఈ ప్రాంతాలకు వచ్చాక శ్యామణ్ణ బతికేవున్నాడా లేదా అన్న సంగతి, రెండు మూడు పల్లెల్లో భోగట్టాచేసి, మరీ వూళ్ళోప్రవేశించాడు.

"ఇదేమిటిలా గడ్డం పెంచావు? సన్యాసం తీసుకున్నావా?"

"అలాంటిదేమీలేదు. వురేయ్ కల్లేశా? మంగలిని పిలిపించు" మంగలివచ్చాడు. ఎప్పటిలాగే గోష్పాదమంత జుట్టు వదిలి తల, గడ్డం శుభ్రంగా గొరిగించుకున్నాడు. గత పన్నెండేళ్ళుగా ఆయన కాస్తంతయినా చిక్కలేదు. నలగలేదు. సడలలేదు. పుష్టిగా హాయిగా వున్నట్టు తెలుస్తోనే వుంది. స్నానమయ్యాక కూర్చుని సంధ్యావందనం, జపం చేశాడు. జపం చేయ డం కాశీలో కొత్తగా నేర్చాడుమో।

వంటయ్యాక వడ్డించేటప్పుడు తల్లి అడిగింది. "కంటీ! నువ్వెళ్ళి పన్నెండేళ్ళయిందిగా? ఏదైనా దేవాలయంలో ముఖదర్శనం చేసుండాలిగావును."

"కాశీ గంగతెచ్చాను. అది కూడా వుంటే ఏదీ అక్కరలేదు. అ మరిచాను. గంగాసమారాధన చేయాలి."

"ఈ కాలంలో సమారాధన అంటే మాటలా? నిరుడు వర్షాలు లేక ఇంట్లో ఏమీలేవు"- అని కల్లోసన్నాడు.

"నేను డబ్బుతెచ్చాను. అయితే మహా ఎంతవుతుంది?"

(కంటీజోస్యులు తిరిగొచ్చారన్న సంగతివిని ఎంతోమంది వచ్చి చూసి మాట్లాడించి వెళ్ళారు) పన్నెండేళ్ళు కాశీలో వుండి వచ్చాక వెవకటికంటే గొప్ప పండితుడయ్యాడు. కాశీయాత్ర చేయాలన్న కోరికవున్నా తీరనివాళ్ళాయన కాళ్ళకి నమస్కారంచేశారు. అలాంటి వాళ్ళకందరికి జోస్యులు కాలభైరవగ్రంథం బహుమతిగా ఇచ్చారు. వారంరోజుల్లో మహావైభవంగా గంగా సమారాధన జరిగింది. అందరూ వచ్చినా శ్యామణ్ణగాని వాళ్ళింటివాళ్ళుగానీ రాలేదు.

ఈ లోపుగా జోస్యులు వూరంతా తిరిగి, తనపాతస్నేహితుల్ని చూచి, పలకరించి, వూళ్ళోని సంగతులన్నీ తెలుసుకున్నాడు. గంగా సమారాధన అయిన రాత్రి వెన్నెట్లో పెరటినూతిదగ్గిర కూర్చుని ఆయన కొడుకు నడిగాడు. "కల్లో! నువ్వు కొట్టావన్న కోపంకొద్దీ, అది దుద్దులు దాచేసి పుట్టింటికి వెళ్లాయికి పంపాలని చూసిందట. దానితో శ్యామణ్ణ కోడలు షరీకయిందట నిజమా?"

"హూం"

"దాన్ని నవ్వు అవమానం చేశావట"

"మా ఇంటికి రావద్దన్నాను"

"చూడు. నేను కాశీకి వెళ్ళొచ్చాను. నీ కన్నతండ్రిని. నాతో నిజం చెప్పు. వూరికే మా ఇంటికి రాకన్నావా? మరేమైనా జరిగిందా"?

"నీ కెవళ్ళయినా ఏమయినా చెప్పారా?"

"వూరంతా మరోలా అనుకుంటోంది. నిజం-చెప్పడానికి శ్యామణ్ణకి అనమానంగా వుందట"

"హూం" - కల్లోసు తలవంచి చెప్పాడు. "దీని బుద్ధి పాడు జెయ్యాలని ఆ శ్యామణ్ణ కోడల్ని పంపేవాడు. అలాంటివాడికి మరేం చేయాలి?"

"చూడు. మగాడు కావలిస్తే పౌరుషంచూసి జయించవచ్చు.

అదొక్క విషయంలో మాత్రం నిగ్రహముండాలి. అది సడలిపోయిందా వాడెన్నటికీ జయించలేడు. నువ్వు చేసింది తప్పు."

కల్లేశుకు సిగ్గేసింది. కానీ అతడు చేసింది సమర్థించుకుంటూ అన్నాడు. "నువ్వు వచ్చావే ఆరోజు నేను మరువనహళ్ళి నుంచీ వస్తూవున్నాను. శ్యామణ్ణ మనుషుల్ని పంపి నామీద రాళ్ళు రువ్వించాడు. వాడలాంటి పని చేయచ్చా?"

"వర్థి లుచ్చాలంజాకొడుకెక్కడో మనింటిమీద రాళ్ళు రువ్వించి ఏం బావుకున్నాడు. కంఠి చచ్చాడనుకున్నాడేమో వాడు? నేను చూసుకుంటాను. వదిలెయ్",- అని ఆయన చెప్పాడే కాని ఏంచేయదలచుకున్నదీ చెప్పలేదు.

ఇదయిన తరువాత రెండురోజులకి శుక్రవారం. అంటే వాగలాపురం సంత. మధ్యాహ్నం మూడుగంటల సమయంలో కరణం శ్యామణ్ణగారు తమ ఇంటినుంచీ సంతవేపు బయల్దేరారు. గోచివేసి తెల్లనిపంచకట్టుకున్నారు. చొక్కావేసుకున్నారు. పైన కండువా భుజాన వేసుకున్నారు. నుదుట బొట్టెట్టుకుని కరణం దర్పంతో నడుస్తున్నాడు. ఎక్కడకనిపెట్టుకు కూర్చున్నాడో కంఠీజోస్యులు, వచ్చి ప్రత్యక్ష మయ్యాడు గోచిపంచె, కాషాయరంగు చొక్కా, నుదుటభస్మత్రిపుండ్రాలు ధరించి మెడలో జపమాల వేసుకున్న ఆయన చేతిలో పెద్ద కుండవుంది. దానిలోంచి వస్తువ్న దుర్వాసన దగ్గిర వున్న వాళ్ళు ముక్కలు మూసుకువేలా చేస్తోంది. "నా కొడుకు మీద రాళ్ళు రువ్వించావట్రా ఆడలంజాకొడుకా" అంటూ ఆయనచేతిలో వున్న కుండపైకెత్తి అభిషేకం చేస్తున్నట్టు శ్యామణ్ణమీద తపతప పడేలా వంచేశాడు. వాసనవల్లా, రంగువల్లా చుట్టుపక్కలున్న వాళ్ళకంతా తెలిసిపోయింది. అది మను ష్యుల అమేధ్యం, అంత ప్రమాణంలో దాన్ని ఎక్కడ సంగ్రహించారో, దాన్నంతా ఒకే పాకంలో ఎలా కలిపి పెట్టించి తెచ్చారో, ఆయన పన్నెండేళ్ళు పూజించిన ఆ కాశీ విశ్వేశ్వరునికే తెలియాలి! అంతా వంపేశాక శ్యామణ్ణ తలమీదనించీ, ముఖంమీదుగా, తెల్లచొక్కామీదుగా జారి లేపనంలా మెత్తుకుంది. కుండనెత్తి వైరి నెత్తిమీదే పగలగొట్టి కంఠీ జోస్యులు జనం సందులో దూరి వెళ్ళిపోయాడు.

## 4

మళ్ళీ నెలరోజులు కంఠీజోస్యులు నాగలాపురంలో లేడు. ఏవూళ్ళో వున్నాడో ఎవళ్ళకీ తెలియదు. కల్లేశు మూడు నాలుగు రోజులకోసారి ఏదోవూరికి వెళ్ళొచ్చేవాడు. తండ్రిని కలుసుకుని ఇక్కడి సంగతులన్నీ చెప్పడానికే అతడు

వెడుతున్నాడని ప్రజలూహించారు. అతడు వెళ్ళేది రాత్రిపూట. అంచేత అతణ్ణి వెంబడించి వెళ్ళే ధైర్యమెవరికీలేదు. పగలే తిరిగొచ్చేవాడు. అది తెలుసుకున్నా ఎవళ్ళకేం ప్రయోజనం. గడచిన పన్నెండేళ్ళుగా ఆయన లేనందువల్ల అతడొక పురాణపురుషుడయ్యాడు. వూరికి వచ్చాక గంగాసమారాధన చేసిన మూడురోజులకే ఆయన ఈ ప్రాంతంలో ఎవళ్లూ ఎన్నడూ చేయని ఒక సాహసాన్ని చేశాడు. శ్యామణ్ణ వెంటనే ఇంటికి పరుగెత్తుకెళ్ళి, నీళ్ళగదిలోనికెళ్ళి, నీళ్ళోసుకుని, సీకాయి తోటి కొబ్బరిపీచుతోటి రుద్దుకుని స్నానం చేశాడు. ఆయనకేం జరిగిందో చూచిన వాళ్ళు నిజంగా పది పదిహేనుమంది కంటే ఎక్కువలేరు. ఇంటికి పరుగెత్తేటప్పుడు ఆయన్నుగుర్తుపట్టింది. ఏ నలుగురైదుగురో అంతే. కానీ వూళ్ళో వాళ్ళంతా తామే స్వయంగా కళ్ళతో చూచినట్టూ, కంఠీజోయ్యలు వంపింది, అది శ్యామణ్ణ నోట్లోకి వెళ్ళింది, ఒళ్ళంతా దసరాపులిలా లేపనంగా వ్యాపించింది రకరకాలుగా చెప్పుకొని వర్ణించారు.

కంఠీజోయ్యలమీద కేసు పెట్టడానికి వీలులేదా? - అని శ్యామణ్ణ ఆలోచించాడు. కానీ ఆపని జరిగినప్పుడు ప్రత్యక్షంగా అక్కడవుండి చూచిన వాళ్ళెవరూ అతనికి గుర్తురాలేదు. "వాడిలా నాకు చేశాడని చెప్పుకోవడానికి సిగ్గు. ఎవళ్ళూ ఆ విషయమాయన దగ్గిర ఎత్తడం లేదు. తానై తాను దీన్ని అనవసరంగా తోడి ప్రచారం చేయడ మతనికి వివేకమనిపించలేదు. అదీ కాక వెనకోసారి ఈ కంఠీజోయ్యలమీద కేసువేసి, నరసీపురానికి కాళ్ళరిగేలా, చచ్చినట్టు తిరిగి, కేసుకొట్టేశాక, అతనిచేత చావుదెబ్బలుతిన్నదీ గుర్తొచ్చింది. ఈ ముండాకొడుకు చచ్చిపోయాడనుకున్నాను. వాడికొడుకు కల్లేశుని పెళ్ళాన్ని దూరంగా వుంచివుంటే ఏమీ జరిగేది కాదు. ఈ ముసలితనంలో ఇంకా ఏంకష్టాలు పడాలో? అని ఆలోచిస్తూవుండగా మరోవిషయం కూడా జ్ఞాపకం వచ్చింది. కంఠీజోయ్యలకొడుకు కల్లేశు తండ్రిలాగే దిట్టంగా వున్నాడు. సమయంవస్తే చెయ్యిచేసుకోగలడు. ధైర్యమూవుంది. నా కొడుకు నంజుండ పట్టిరణబీరువు. పైబడి గిల్లికజ్జాయం తెచ్చుకునే కాలం దాటిపోయింది.

నెలరోజులయ్యాక కంఠీజోయ్యలూరికి వచ్చారు. ఆయన్నెవరూ ముఖాముఖి ఆ విషయమడగలేదు. ఆయనా చెప్పలేదు. మెడలో జపమాల వేసుకుని, నుదుట త్రిపుండ్రం ధరించి, వీధిలో వెడుతూ వుంటే జనం గౌరవం చూపుతూ దూరంగా ఒదిగి వెళ్ళేవారు.

# 12వ అధ్యాయం

ఆ ఏడు వానలాలస్యంగా వచ్చినా రాగులపంట పండింది. యూరప్‌ఖండంలో ఇంగ్లీషు వారికీ జర్మనీ వారికీ ఘోరమైనయుద్ధం నడుస్తోంది. ఇవతల బర్మావేపు కూడా పోరాటం సాగుతోంది. ప్రభుత్వమాహారధాన్యాలను రేషన్ చేసిందట. ఒకరోజు వూరికి వచ్చిన రెవెన్యూ ఇన్స్పెక్టరు రేషనంటే ఏమిటో వివరించి, వుత్తరోత్తర, పహణి వ్రాసేటప్పుడు పంటల దిగుబడి అంచనా చేసే క్రమమూ నేర్పించారు. ఎకరాకు ఆరు 'ఖండుగ' ల రాగులు పండితే పదహారణాల పంట. నాలుగున్నర అయితే పన్నెండణాలపంట. మూడయితే ఎనిమిదణాలపంట. ఇల్లాగే రాగులు, వడ్లు, అనుములు ఇత్యాది అన్ని పంటల అంచనా వేయాలి. ప్రభుత్వం దానిమేరకు ప్రతిరైతు పంటనూ అంచనావేసి, ఖానీషుమారి లెక్కల మేరకు, వాడి ఇంటిఖర్చుకు మళ్ళీ విత్తనాలకూ ఎంత కావాలో అంత వాడికుంచేసి కడమవి ప్రభుత్వం తాను నిర్ణయించిన వెలమేరకు కొంటుంది. అంటే లెక్కలు వ్రాసే కరణాలకు కొత్త అధికారం వచ్చిందన్నమాట.

నంజమ్మ ఒకరోజు కురుబరహళ్ళికి వెళ్ళి కొత్త లెక్కల విషయం గుండే గౌడకు తెలిపింది. ఆయన – "మేము కష్టపడి పండించిందా నా కొడుకుల కివ్వాలా?" అని అడిగారు.

"ప్రభుత్వ ముత్తర్వు చేసింది. లేకపోతే పోలీసువాళ్లు చూసుకుంటారు."

ఎవరికే ఇబ్బంది కలిగినా కురబరహళ్ళికెలాంటి హాని కలగరాదని నంజమ్మ కోరిక. వూరికి ఏదైనా హాని కలిగితే గుండేగౌడ మునసబుగిరికే అవమానం. తన సంసారాన్ని పోషించిన గ్రామానికి ఇబ్బంది కలిగితే ఆవిడెలా సహించగలదు. కానీ వూళ్ళోవాళ్ళందరికీ గొర్రెల మందలున్నాయి. ప్రతియేడు పొలాలకు గొర్రెలు తోలించడం వల్ల ఎకరాకారు 'ఖండగ'ల కంటే ఎక్కువే పండిస్తున్నారు. తాను తక్కువ అంచనా వేయాలి. కాని కరణంగారి అంచనాలు పరిశీలించటానికి తాసిల్దారుగారే స్వయంగా వచ్చి పొలాల్ని పరీక్షిస్తారని రెవెన్యూ ఇన్స్పెక్టరుగారు

చెప్పారు.

నంజమ్మ గుండేగౌడ చర్చించుకుని ఒక నిర్ణయానికి వచ్చారు. సామాన్యంగా, ఎనిమిదణాలు, పదణాలపంట అని ఆవిడ పహణీ వ్రాసేటప్పుడు అంచనావేయాలి. వూరి మొత్తంమీద వందరూపాయలు వసూలుచేసి రెవెన్యూ ఇన్స్పెక్టరుకు, పై వాళ్ళకు ఇచ్చి పరిజేసుకోవాలి. ప్రభుత్వంవారు ధాన్యంవసూలు చేయటానికి వచ్చినప్పుడు వారు నిర్ణయించిన ధరమేరకు మొత్తం పది పన్నెండు 'ఖండుగ' లివ్వడం.

ఆ ఏడలాగే జరిగింది. వందరూపాయలు నగదు, పన్నెండు ఖండగల రాగులు కొలిచి నల్భై కుటుంబాల కురబలు గండంగడిచి గట్టెక్కారు. ఇందాకా ఆ వూరి వాళ్ళు కరణానికి సిరాకానుక ఇచ్చేవారు. ఇప్పుడు దానితోపాటు ప్రతి ఇంటికీ పదిసేర్ల రాగులచొప్పున ఇవ్వటం ప్రారంభించారు. ఆహార నియంత్రణ-ఆజ్ఞ వల్ల దెబ్బతిన్నది రామసంద్రం, లింగాపురం. పంటల అంచనా వేయడమంటే ఏమిటో రామచంద్రం మునసబు శివేగౌడకుగానీ, లింగాపురం మునసబు పురదప్పకుగాని తెలియదు. నంజమ్మ ఈ రెండుగ్రామాల పహణీకూడా వున్నదున్నట్టు వ్రాసింది. నూర్పిళ్ళకాలం కాగానే, ఒకరోజు రెవెన్యూ ఇన్స్పెక్టరు, ఆయన జవానులిద్దరు, ఇద్దరు పోలీసువాళ్లు వూరికి వచ్చారు. రెవెన్యూ ఇన్స్పెక్టరు గారి ఆదేశం మేరకు జవానులు ప్రతిఇంట్లోనూ దూరారు. అట్టువ, పెట్టెలు, గాదెలు, గరిశలు, కణజాలు బానలు-అన్నీ శోధించారు. పాడుగాటి వెదురు కర్ర ధాన్యపుపాత్రల్లోనికి చొప్పించి వాటి పొడవువెడల్పు అంచనా వేస్తారు. ఇంట్లో మొత్తమింత ధాన్యముందని అంచనాచేసి, వాళ్ళకు బుద్ధి పుట్టినన్ని కొలిచి బస్తాలకెత్తించి తెచ్చి మాదేవయ్యవున్న గుడిముందు పోగెడుతున్నారు. అటకెక్కిన రెవెన్యూ ఇన్స్పెక్టరు జవాను ఇంటిరైతునుంచి అక్కడికక్కడే ఇరవై, నల్భై, యాభై. ఎంతయితే అంత పుచ్చుకుని, కిందికి దిగి "మొత్తం రెండే బస్తాలు సార్" అనడము జరిగేది. తరువాత దానిలో రెవెన్యూ ఇన్స్పెక్టరు కేమిస్తాడో, తానేమి స్వాహాచేస్తాడో, పరమాత్ముడికే తెలియాలి. తమకు వచ్చిన దానిలో రెవెన్యూ ఇన్స్పెక్టరు పోలీసువాళ్ళకు కూడా వాటా ఇవ్వాలి.

మొత్తమ్మీద ఒక్కరోజులో రామసంద్రం నుంచి నాలుగు వందలు, లింగాపురం నుంచి వందబస్తాలు కొలిపించుకొని రెవెన్యూ ఇన్స్పెక్టరు వెళ్ళిపోయారు. మునసబు, కరణంగారి సమక్షంలో ఆయన ఇచ్చిన రసీదులు హాజరుపరిచి, దానికి సంబంధించిన

అధికారులకు తగిన సంభావన అందజేసి తామిచ్చిన ధాన్యం ఖరీదు తీసుకోవాలి. రాగులు కొలిచే జవానులు, తాము తెచ్చిన కొలత సేర్లవల్లా, కొలిచే పద్ధతి వల్లా బస్తాకేడెనిమిది సేర్లయినా ఎక్కువ గా లాగేసేవారు.

ఇది జరిగిన పదిహేను రోజులయ్యాక ఒకరోజు శివేగౌడ వెట్టిచేత నంజమ్మను రమ్మని కబురెట్టాడు. మునసబు కబురెడితే కరణం వెళ్ళాలా, కరణం కబురెడితే మునసబువెళ్ళాలా అన్నది వాళ్ళ ఆస్తి పాస్తులమీద, వారి వారి దర్జాలమీద ఆధారపడివుంటుంది. ఇందాకా శివేగౌడ కబురెడితే చెన్నిగరాయలు వెళ్ళటమే అలవాటు. కాని ఈరోజతడు నంజమ్మను రమ్మని కబురెట్టాడు. ఆమెకు కోపం వచ్చింది. కాని తన్ను తాను సంబాళించుకుని వెట్టితో చెపింది. "ఏమైనా పనివుంటే వారినే ఇక్కడికి రమ్మని చెప్పు".

కాసేపటిలో మునసబుగారే వచ్చారు. అతనివెనకాలే వచ్చినవెట్టి తలుపుదగ్గిరే నుంచున్నాడు. స్తంభం దగ్గిరవేసిన ఈతచాపమీద కూర్చుని సంభాషణ ఎలా ప్రారంభించాలో తెలియక తికమక పడుతున్న గౌడ అయిదు నిమిషాలయ్యాక "కురుబరహళ్ళిలో పన్నెండు ఖండుగాలే పట్టుకు పోయారట. మనూళ్ళో నాలుగొందలు బస్తాలెట్టాపట్టుగెళ్ళారు?"

"అది నాకేం తెలుసు మునసబు గారూ?"

"ఏం తెలుసో ఏం తెలవదో నువ్వు చెప్పాలమ్మా. లెక్కలురాపేది నువ్వు"

"మునసబుగారూ! నువ్వు గివ్వు అని అనడానికి మీ ఇంట్లో బిచ్చానికి గాలేదుతేను. కాస్త మర్యాద ఇచ్చి మాట్లాడండి" అని చెప్పి నంజమ్మ వంటింట్లోకి వెళ్ళిపోయింది.

"చెన్నిగరాయల్ని పుట్టినకాణ్ణించి ఎరుగుదును"

"అయితే ఆయన్నే అడగండి. నన్ను మీ ఇంటిదగ్గిరికి రమ్మని వెట్టితో కబురెట్టారే, మీ మునసబుగిరి అంటే దర్పారనుకున్నారా?"

శివేగౌడ ముఖం జామాలుమంది. అతడెప్పుడూ ఆవిడతో మాట్లాడి ఎరగడు. పొలము పుట్రపోయి, విస్తళ్ళుకుట్టి బతుకుతూ కాయగూరలు పండించి తిని, మొగుడి కరణీకం లెక్కలు రాసే ఆమె ఠీవి, దర్పం చూసి వాడి బుర్ర దిమ్మతిరిగిపోయింది.

"మనూరి పాణి రాసేటప్పు డెందుకమ్మా తక్కువెయ్యలేదు?"

"అడగటానికి మీరెవరు?"

"ఆడాళ్ళు సర్కారు లెక్కలు రాయొచ్చా? అని సర్కారునే అడుగుతాను" అని శివేగౌడ వెళ్ళిపోయాడు. వూరికంతా దొరలా గుంటున్న వాడికి రోజు పరాభవం జరిగింది. అది కూడా తానిన్ని రోజులు దర్పంచెలాయిస్తున్న వెట్టి సమక్షంలో జరిగింది. తన బావమరిది శివలింగణ్ణి వెంటబెట్టుకుని అతడు తిన్నగా కంబనకెరె వెళ్ళి రెవెన్యూ ఇన్స్పెక్టరును చూసి, ఆడది సర్కారులెక్కలు రాయొచ్చా అని అడిగాడు. ఇన్స్పెక్టరు గారికి ప్రశ్న వెనకాలున్న పుట్టుపూర్వోత్తరాలు తెలుసు. ఆఫిర్కాకు వచ్చి ఆరునెలలే అయినా,వెనకున్నాయన ప్రతి ఫిర్కాలోని ఆనుపానులన్నీ తెలియజేశాడు. వుపాయంగా మాట్లాడి ఆయన శివేగౌడ చేతే, వాడి ఆక్షేపణ వెనకాలున్న చరిత్రంతా లాగారు. కరణీకం పహణీలో ఎక్కువగా అంచనావేసినా ఆయనకు లాభముంది. తక్కువగా అంచెనావేసినా లాభముంది. అంచేత రెవెన్యూ ఇన్స్పెక్టరు కరణాన్నెందుకు బయట పెడతారు? ఆయనన్నారు. "చూడండి శివేగౌడగారూ! ఆమె లెక్కలు రాస్తుందని డిప్టికమిషనర్ దొరగారికి కూడా తెలుసు. మొత్తం తుముకూరుజిల్లాలో అంత చక్కగా ఎవరూ రాయడం లేదని ఆయనే హుజూరు జమాబందిలో చెప్పారు. ఆడది లెక్కలు రాయకూడదని సర్కారు రూలేమీ లేదు".

తోకముడుచుకుని శివేగౌడ బావమరిదితో పాటు వూరికి వచ్చాడు. దారిలో శివేగౌడ బావమరిదినడిగాడు! "ఆ నా కొడుకు ఇన్స్పెక్టరు వూరికొస్తే ఆ భోసుడిముండ వుప్పిండి, కాఫీ ఇస్తుందని ఎట్టా వెనకేసుకొచ్చాడో చూశావాబావా?"

"వట్టి వుప్పిండికి, కాఫీకి వెనకేసుకొస్తాడా బావా? వాడొచ్చినప్పుడల్లా ఇది వాడిపక్కలో పడుకుంటుంది".

"లంజాముండ, లంజాముండ" అని తిట్టి శివేగౌడ కాస్త వూరట చెందాడు. కాని వూరికి వచ్చాక ఈ మాటే మరెవరి దగ్గిరయినా ఎత్తడానికి వాడికిగాని, వాడిబావమరిదికి గాని దమ్ములులేవు.

శివేగౌడ దర్పాన్ని చూసి నంజమ్మ మనస్సులోనే అసహ్యించుకునేది. అది కేవలం మునసబుగిరి దర్పం కాదు. కాశింబడ్డి లావాదేవి డబ్బంతా వాడిదే అని ఇప్పుడూరికంతా తెలుసు. పరదేశి కాశింబడ్డికి ఈవూళ్ళో ఇల్లూవాకిలి పొలముప్రూ అక్కరలేదు. తన వాటా వడ్డీ పుచ్చుకుని వాడు తన మళయాళ దేశానికి పంపేవాడట. మొదట్లో వాళ్ళ వడ్డీ వ్యాపారం బంగారం, వెండి, రాగి, ఇత్తడి

వస్తువుల తాకట్టుమీదే నడిచింది. ఇవన్నీపోగొట్టుకున్న వాళ్ళు తమకున్న అంతో ఇంతో పొలాన్ని తణఖారాసిచ్చి రోజుకు రూపాయికి పైసా చొప్పున అప్పుతీసుకునేవారు. తణఖా శివేగౌడపేరిట జరిగేది. మూణ్ణెల్ల వడ్డీ ముందే మినహాయించుకుని ఇచ్చేవారు. అంటే వెయ్యిరూపాయలకు తణఖా పెడితే ఇంచుమించు అయిదువందలే చేతికి వచ్చేవి. దీనిమీద కోర్టుకెళ్ళినా నూటికి పన్నెండు వంతున వెయ్యిరూపాయలకూ వసూలయ్యేది. గడచిన కొన్నేళ్ళుగా, అందులోను వర్షాలు, పంటలులేని రెండేళ్ళలో శివేగౌడ బాగా బలిసిపోయాడు. వాణ్ణి అణచడమంటే అవూళ్ళో ఎవళ్ళకీ సాధ్యంకాదు. నంజమ్మకూ ఆ విషయం తెలుసు. కాని తనమీద కూడా దర్బారు చేయాలని వచ్చినప్పుడు వాడికెలా చెప్పాలో అలా సమాధానం చెప్పి పంపింది. ఆహార శాఖ వారి కంట్రోలు వచ్చాక రెవెన్యూ ఇన్స్పెక్టరప్పుడప్పుడు వూరికి వచ్చేవాడు. వాడాయన్ను చూడటానికి వెళ్ళిన సంగతి తెలిశాక, వాడికి తగిన మర్యాద జరిగిందని ఆవిడ వూరుకుంది.

## 2

వర్షాలు పడ్డాక పంటలు బాగా పండినా ధాన్యాల వెలమాత్రం తగ్గలేదు. యుద్ధం జరుగుతూనే వుంది. కరణీకం లెక్కలేకాక ఆహార నియంత్రణ, పంటల వివరం, ధాన్యసంగ్రహణ, వంటి లెక్కలు కూడా ఎక్కువయ్యాయి. ప్రభుత్వం కరణాలకందరికీ ఏటేటా ఇచ్చే పోటిగె కాకుండా ప్రత్యేకమైన భత్యమివ్వడం ప్రారంభించింది. ఇప్పుడు నంజమ్మ కరణీకం పోటిగె మూటిశరవై అరయితే, అదనంగా వందరూపాయలు వస్తోంది. లెక్కలెక్కువ కావడం మూలాన విస్తళ్ళు కుట్టడానికి తీరుబడిలేదు. పార్వతి ఇంటిపనులు చేసుకుని కూరపాదులకు నీళ్ళుపోసేది. గుండేగౌడ ఇంటినుంచీ వెనక్కితెచ్చిన ఆవుల్ని చూసుకునే బాధ్యత కూడా ఆవిడదే. రామణ్ణ ఇప్పుడు మిడిల్ స్కూలులో మూడవ తరగతిలో, తరగతి మొత్తానికే ఫస్టు. తల్లి వ్రాస్తున్న కొత్త కొత్త పుస్తకాలకు రూళ్ళు వేయడం మొదలుకుని, ధాన్యపు కొలతల కూడిక లెక్కలన్నీ తప్పులు లేకుండా చేస్తున్నాడు. తల్లి చేసిన లెక్కలు చూపి అడపాదడపా తప్పుంటే చూపెడతాడు: ఒకసారి రెవెన్యూ ఇన్స్పెక్టరే వాడికి కబురెట్టి వారి లెక్కలపుస్తకం నకల్ తీయించారట. కొడుకు బద్ధిమంతుడయ్యాడని నంజమ్మకు పట్టరాని

సంతోషం. ఉత్తరోత్తర రామణ్ణ కరణం కావడమామె కిష్టం లేదు. అధమపక్షం రెవెన్యూ ఇన్స్పెక్టరయినా కావాలి. దేవుడు చల్లగా చూస్తే ఎందుకు కాకూడదు? రామణ్ణ ఇంత బుద్ధిమంతుడు కదా- అని తనలో తాననుకునేది.

విశ్వం ఎలిమెంటరీ బడిలో మూడవతరగతి. వాడిలాంటి అల్లరి కుర్రాడు మొత్తం వూళ్ళోనేలేడు. వాడి ధైర్యమే ధైర్యం. వూళ్ళోని చెరువులో పెద్దాళ్ళలా యాభై అరవై గజాలు ఈదుకుంటూ వెడతాడు. ఒక్కడే శ్మశానం వేపు వెళ్ళి తేనెపట్టలు వెదికి, దులిపి, పోకదొప్పల్లో తేనె పిండి తెస్తాడు. మాటల్లో, దర్పంలో, ధైర్యంలో అన్నింటిలోనూ వాడచ్చం కంఠీజోస్యులే. ఇప్పుడు వాడికి మాదేవయ్యకూ మొదటికంటే ప్రీతి ఎక్కువయింది. ఆయన తత్వాలు పాడుతూ వుంటే చక్కగా తంబూరా మీటుతాడు. చిటికలు వేస్తాడు. ఆయన తెచ్చే జోలెభిక్షం తినడం మళ్ళీ అభ్యాసం చేసుకున్నాడు.

నంజమ్మ ఇంట్లో ఇప్పుడు తినడాని కేలోటూ లేదు. ఆహారపు లెక్కలు వచ్చాక తలిమ్మా కరణాలకు మల్లే ఆవిడకు కూడా రాబడి పెరిగింది ఇప్పుడందరికి ఇంట్లో రెండ్రెండు బట్టల జతలువున్నాయి. రాత్రివూట చలికాలంలో కప్పుకోవడానికందరికి నాలుగు కంబళ్ళు కురుబరహళ్ళి మంచి కొన్నారు. కానీ ఆవిడ మనస్సులో ఒక ఆలోచన లోలోపల వేధిస్తోంది. పార్వతికప్పుడే పదమూడు నిండింది. ఈ మధ్య రెండేళ్ళు వరపురాకుండా మంచి ఆహారం పడివుంటే అది ఇప్పటికే పెద్దమనిషయ్యేది. తిండి లేకండా బక్కచిక్కిపోయిన పార్వతి ఇప్పుడు రెండు పూటలా తిండి, పొద్దుట రొట్టి, పెరుగు తింటోంది. ఇంకా అమ్మాయికి పెళ్ళి కాలేదు. పెళ్ళికాకముందే పెద్ద మనిషయితే ఎలాగని నంజమ్మ లోలోపల మధనపడుతోంది.

పెళ్లంటే మాటలా? ఎంత లేదన్నా ఏడెనిమిది వందలు కావాలి. వరుణ్ణి వెదికి తెచ్చి అన్నీ నిర్వహించే మగాడు కావాలి. తన మొగుడెలాంటివాడో ఆవిడకు బాగా తెలుసు. దేవుడెలా రాసి పెట్టాడో! అన్న ఆలోచన ముప్పూటా వేధిస్తోంది.

తిపటూరి వద్ద తిరుమగొండనహళ్ళిలో ఒక వరుడున్నాడని ఎవరో చెప్పారు. వెళ్ళి చూసి రమ్మని మొగుణ్ణి, వూరికి కొత్తగా వచ్చిన మాస్టారు వెంకటేశయ్యగారినీ పంపింది. వాళ్ళు తెచ్చిన మరుసటి రోజే తిరిగి వచ్చిన మాస్టారు "నంజమ్మగారూ! ఈ కరణంగారిని కూడా తీసుకెడితే వరనిశ్చయమవుతుందా? మేము వాళ్ళింటికెళ్ళి జాతకమడిగాం. వధువుజాతక ముందివ్వండన్నారు. ఇచ్చాను. భోంచేయండన్నారు.

పిల్లనివ్వటానికి వచ్చాం. కతికితే అతకదంటారు. దైవసంకల్పం వుండి, కన్యాదానమయ్యే దాకా మేము మీ ఇంట్లో గంగోదకమైనా తీసుకోరాదని శాస్త్రముందికదా అని అన్నాను. కానీ కరణంగారు వినిపించుకోలేదు. వద్దండీ అని చెప్పినా వినకుండా లేచి చొక్కా విప్పి కాళ్ళూ చేతులూ కడుక్కుని భోజనానికి కూర్చున్నారు, నేను మాత్రం చేయలేదు. ఆయన భోజనమయ్యాక ఆ కుర్రాడి బాబాయి బయటికి వచ్చి నాతో అన్నారు. పెళ్ళికూతురు తండ్రే మా ఇంట్లో భోంచేశారు, ఇహ పెళ్ళి సంప్రదింపులు చేయకూడదు. శాస్త్రం మీకూ తెలుసుగా".

మాస్టారు మాట విన్న నంజమ్మకు దుఃఖం కోపం రెండూ కలిగాయి. అక్కడే చాపమీద దొల్లుతూ భుక్తాయాసం తీర్చుకుంటున్న మొగుణ్ణి "మాస్టారు చెప్పినా ఎందుకిలా చేశారు?" అని అడిగితే "కడుపులో ఆకలేస్తుంటే మరేం చెయ్యమన్నావ్?" అన్నాడు. అమేధ్యం మీద రాయివేస్తే ముఖం మీదికి చిల్లుతుందని ఆవిడ మళ్ళీ మాట్లాడలేదు. బాధ్యత వహించి తన కూతురు పెళ్ళి చేయగలిగిందెవరా అని తనలో తానాలోచించింది.

పులి మీద పుట్ర అన్నట్టు, ఆ రోజు రాత్రే పార్వతి పెద్ద మనిషయింది. అది ఎప్పుడైనా జరిగేదే అని ఎదురు చూస్తున్నా, అలా జరిగేసరికి నంజమ్మ తత్తరిల్లింది, పెద్ద మనిషయిన పిల్లనెవరు పెళ్ళి చేసుకుంటారు. తిపటూరిలాంటి పెద్ద పెద్ద వూళ్ళల్లో పెద్ద పెద్ద వాళ్ళ ఇళ్ళల్లో ఇటీవల సమర్తాడిన పిల్లలకే పెళ్ళి చేస్తారని చెప్పుకుంటారు. కానీ అది పెద్దింటి వాళ్ళమాట, మనమెంతైనా బీదవాళ్ళం. పల్లెటూరి వాళ్ళం. ఆడపిల్ల పెళ్ళికాకుండానే పెద్ద మనిషయిందంటే బతకనివ్వరు. వూళ్ళో వున్న పురోహితులు తమ్మాళ్ళి పిల్లల్నీ వెలివేశారు. ఒకవేళ వరుడు దొరికి, డబ్బు పోసినా, ప్రాయశ్చిత్తాని కని డబ్బు గుంజందే వాళ్ళు వచ్చి పెళ్ళి చేయరు. పెళ్ళి ప్రయత్నాలు పైకి పొక్కితే, పిల్లను చూడటానికి ఏ వరుడు వచ్చినా, వాళ్ల చెవిలో ఏదో వూది పాడుచేసే అక్కుపక్షులుండనే వుంటారు. మెదడు మొద్దుబారిపోయి వంజమ్మ గంటసేపూరికే కూర్చుంది. చెన్నిగరాయలు హాయిగా నిద్రపోతున్నాడు. ఆయనకు విషయం తెలిస్తే వూరంతా కోడై కూస్తాడు.

ఆమె మనస్సులోనే నిశ్చయించుకుంది. ఎవళ్ళతోటి ఈ సంగతి అనవద్దని పార్వతికి చెప్పి, అమ్మాయిని తన పక్కనే పడుకోబెట్టుకుంది. పొద్దుట కూతుర్ని ఇంటి పనులు చేయడానికి వదలలేదు. కడుపునొప్పి అనే వంకెట్టి ఓమూల పక్కేసి పడుకొమ్మంది. రామణ్ణ కున్న విషయం చెప్పింది. వాడు బుద్ధిమంతుడు.

ఎవరితోటీ చెప్పడు.

విశ్వానికింకా ప్రపంచజ్ఞానం లేదు. వాడితో గాని, చెన్నిగరాయలతోగాని, ఏమీ చెప్పలేదు. పిల్లలారోగ్యంగా వున్నా, రోగమో రొష్ఠో వచ్చినా చెన్నిగరాయలెన్నడూ మాట్లాడించిన వాడు కాడు. విశ్వం మాత్రం అక్కయ్య దగ్గిర కూర్చుని ఆవిడ కడుపునొప్పి ఎలా వుందో అడిగాడు. అలాగే వంటింట్లోకి వచ్చాడు. కూతురికి ఇంటిపనులన్నీ నిర్వహించే శక్తి వచ్చాక నంజమ్మ నెలనెలా వాకటుండేది. అదీ కాక వంటింట్లో దేవుడి పటంతోపాటు ఒక సాలగ్రామాన్ని వుంచుకుని, వున్నంతలో కాస్త మడిగా వుండేది. రజస్వలయిన అక్కయ్యను తాకి విశ్వనాథం వంటింట్లోకే వచ్చేశాడు. నంజమ్మ మడి చీర చుట్టుకుని, సాలగ్రామాన్ని తీసి, కడిగిన రాగి చెంబులో వుంచి పైన షెల్ఫు మీద పెట్టింది. తతిమ్మా వాటిని గురించి భయంలేదు. సాలగ్రామమంటే ఎంతయినా జాగర్తగా వుండాలి.

రోజూ రామణ్ణ ఎలాగూ కంబనకెరె వెడతాడు. నంజమ్మ కొడుకుతో చెప్పి నువ్వులు తెప్పించింది. తానే ఒకరోజు కురుబరహళ్ళికి వెళ్ళి దైవకార్యమని వంకెట్టి, నాలుగిళ్ళల్లో అడిగి ఇరవై "గిటకలు" కొబ్బెర తెచ్చింది. ఎవళ్ళకీ తెలియకండా పార్వతిని వంటింట్లో కూర్చోబెట్టుకుని బెల్లంవేసిన చిమ్మిరుండలు, కొబ్బెర, బెల్లం, మెంతిపిండి, రోజూ తినిపించేది. ఇప్పుడు వెన్న సేరు పదణాలు. అది కూడా రామణ్ణ కంబనకెరి నుంచీ రహస్యంగా తెచ్చేవాడు. రహస్యంగా నంజమ్మ కూతరు చేత నెయ్యి తినబెట్టేది. అమ్మాయి పెద్ద మనిషయిన సంగతి దాచవచ్చు. కానీ ఇప్పుడు కాస్తంత శరీపోషణ విషయమై ఆలోచింకపోతే తరువాత దాని ఆరోగ్యం పాడవదూ? అని నంజమ్మ కూతురి విషయంలో చాలా జాగర్త తీసుకుంది.

పైవాళ్ళకెవళ్లకీ ఈ సంగతి పొక్కకుండా అయిదు నెలలు గడిచింది. కాని పార్వతి శరీరంలో కలుగుతున్న మార్పులు చూస్తే ఎవరికైనా అమ్మాయి పెద్ద మనిషయిందన్న సంగతి తెలుస్తోంది. తల్లిలాగే పొడగరి, తల్లిలాగే విశాలమైన భుజాలున్నపిల్ల. కక్కుర్తిగా చేస్తున్నా నువ్వులు, బెల్లం, కొబ్బరి, నెయ్యి, మెంతులు -- దేనికీ తక్కువ లేదు. వారానికోసారి తలంటి పోస్తోంది. వెనకటిలాగా ఇప్పుడెండలో కూరపాదులవేపు కూడా వెళ్ళడం లేదు. పిల్ల కాస్త ఒళ్ళు చేసి తెల్ల బడ్డది. శరీరంలో కలిగే ఈ మార్పుల్ని దాచడమెలాగ? లోలోపల చేస్తున్న పోషణ మానేద్దామా అంటే తరువాత దాని ఆరోగ్యమో! నంజమ్మకు ప్రాణ సంకటంగా

వుంది. కూతురి ఆరోగ్యమయిన శరీర సంపదని చూసి ఒకవేపు మురిసిపోతుంది. మరోవేపు "దీనికి నిజంగా పెళ్ళవుతుందా? మా పరువు ప్రతిష్ఠలుంటాయా"? అన్న ఆలోచనలో కుంగిపోతుంది.

పార్వతిది చురుకైన బుద్ధి. తల్లి బాధ తనకూ తెలుసు. అది తన బ్రతుక్కి సంబంధించిన సమస్య. వెనకటి కాలంలో పెళ్ళి కాకముందే ఆడపిల్లలు పెద్దమనుషులయితే కళ్ళకు గంతలు కట్టి అడవుల్లో వదిలేసేవారట. ఎలాగో అమ్మ తనపెళ్ళి చేస్తుంది. కానీ ఎలాంటి వరుడు దొరుకుతాడు. తన తండ్రిలాంటి వాడా? తన బాబాయి లాంటివాడా? మేనమామ కల్పేశు లాంటి వాడా? రేవణ్ణ శెట్టి, శివేగౌడ-- ఈ వూళ్ళో ఎవళ్ళతో పోల్చినా అలాంటి మొగుడు తనకక్కరలేదని ఆవిడ మనస్సు చెబుతోంది. ఇలాంటివాడు కావాలి, ఇలాంటి వాడక్కరలేదని అమ్మతో చెప్పడానికేం చెప్పవచ్చు. కానీ తనకు వచ్చిన వరుణ్ణి వెదికి తెచ్చి పెళ్ళి చేసే శక్తి తల్లికి లేదన్న సంగతి కూడా అమ్మాయికి తెలుసు. తాను పుట్టకుండా వుంటే బావుండేది. ఇప్పుడయినా చచ్చిపోతేనో? చచ్చిపోవడమంటే -- అమ్మని, రామణ్ణని, విశ్వాన్ని వదిలిపోవడమన్నది గుర్తొచ్చి - ఆ ఆలోచన తనలోంచీ దూరమై పోయింది. ఎలాంటి మొగుడయినా సరే సంసారం చేయాలి. అమ్మ చేయడంలేదూ. అలాగే. అదృష్టం బాగా వుంటే మంచివాడే రావచ్చు. ఈ వూళ్ళో మాస్టారు వెంకటేశయ్య గారు పెళ్ళాన్ని కొట్టరు, తిట్టరు. పొగాకు, బీడి లాంటి అలవాట్లు లేవు. ఆయన నోటంబట చెడుమాటే రాదు. అలాంటివారు దొరికితే చాలు - ఇలాంటి ఆలోచనలు పార్వతి లేతహృదయాన్ని ఆరాటపెడుతున్నాయి.

ఒకరోజు సాయంత్రం ఇంటికి వచ్చిన చెన్నిగరాయలు పెళ్ళాన్నడిగాడు "పార్వతేమయినా పెద్ద మనిషయిందేమే?"

ఈ ప్రశ్న అడిగినప్పుడు పార్వతి ఎదురుగుండానే వుంది. నంజమ్మకు చిర్రెత్తింది. "మీకేం బుద్ధి తిన్నగా వుందా లేదా? ఎవరన్నారలాగని?" అని కసురుకుంది.

"ఇటీవల నీ కూతురు కూరపాదులకు నీళ్ళు గిళ్ళు పోయటానికి రావటంలేదు. ఇంట్లోనే వుంటోంది. పెద్దమనిషయిందా ఏమిటని అణ్ణాజోస్యులడిగారు".

"దానికి మీరేమన్నారు"

"నాకు తెలవదు. మా ఇంటావిణ్ణడుగుతానన్నాను".

"లేదనలేకపోయారూ?"

"నాకేం తెలుసే అదంతా?" అని కాస్త చీదరించుకున్నాడు.

"ఇంకాలేదు. ఇప్పుడింట్లో విస్తళ్ళు కుట్టడంతోటే సరి పోతోందని చెప్పండి" అని నంజమ్మ వుపాయంగా చెప్పింది. దాంతోటి చెన్నిగరాయలూరుకున్నాడు.

అంటే వూళ్ళో వున్న బ్రాహ్మలకప్పుడే అనుమానం వేసింది. ఎంత రహస్యంగా వుంచినా ఇలాంటి వట్టేరోజాలు దాచలేము, కష్టం. తీగలో మల్లెమొగ్గ విరిసేటప్పుడు దాచినా దాగదు. అందరికీ తెలిసిపోతుంది. అలాగే పెద్దమనిషై పోషణ సరిగా వున్న పడుచుపిల్ల విషయంలో కూడా అంతే.

## 3

ఇది జరిగిన రెండవరోజు మధ్యాహ్నం నంజమ్మ ఇంటి ముందర సవారీ బండొకటి వచ్చి ఆగింది. ఎడ్లమెడలకి మువ్వల పట్టెళ్ళు కట్టారు. ఇంకా నొగలు దించకముందే పరం వెనకభాగం నుంచీ ఎవరో ఎత్తైన భారీ వ్యక్తి కిందికి దిగారు. నుదుట త్రిపుంద్రాలు ధరించి మెడలో జపమాలలు వేసుకున్న ఆయన్ని పార్వతి ఇంతకు మునుపు చూడలేదు. నొగలు దించాక అక్కమ్మ దిగింది. అక్కమ్మ ఇక్కడికి వచ్చి అప్పుడే నాలుగేళ్ళయింది. ఇప్పుడావిడ వెన్ను మరీ వంగిపోయింది. "అమ్మా! తాతమ్మ వచ్చిందే" అని లోపలికి తిరిగి పార్వతి కేకేయగానే నంజమ్మ ఒక్కపరుగులో బయటికి వచ్చింది. ఎదురుగుండా చూస్తే తన తండ్రి.

"నంజా! అప్పటికీ ఇప్పటికీ బాగా చిక్కావు. ఇదేనా అక్కడ పుట్టింది?" అని అడిగాడు.

తాతయ్యను గురించి పార్వతే కాక తమ్ముళ్ళిద్దరూ చాలా విన్నారు. ఇప్పుడాయనను చూడగలిగారు. అక్కమ్మ 'కోడుబళె' జంతికలు - అన్నీ తెచ్చింది. తాతయ్య కూతురుకి మనమరాలికి చీరలు, కడమ మగపిల్లలకి చొక్కాలు లాగూలు కుట్టించి తెచ్చారు. వీటికి తోడు గంగచెంబు కూడా తెచ్చారు. కాశీ నుంచీ తెచ్చింది. బడి నుంచీ వచ్చిన విశ్వానికి ఒళ్ళు తెలియని సంబరం.

"నాన్నా! నువ్వు దేశం వొదిలిపెట్టి పన్నెండు నిండి పదమూడో సంవత్సరం కదా! మొదలొక దేవాలయానికి వచ్చి మమ్మల్ని పిలిపించి వుంటే బావుండేదేమో!"

"కాశీకి వెళ్ళిన వాళ్ళకదేమీ పట్టింపు లేదు. కూడా గంగ తెచ్చాను."

ఆయన అడా పోడా తెలియకుండా ఇన్నేళ్ళు కాశీ ఎందుకు వెళ్ళారు? - అన్న ప్రశ్న వచ్చినప్పుడు కంఠీజోస్యులు సరైన సమాధానం చెప్పలేదు. "ఏమో విశ్వేశ్వరుని సన్నిధానంలో వుండాలని బుద్ధి పుట్టింది. వెళ్ళాను. నా కెక్కడుంటే ఏమి?" - అన్నాడు. అక్కమ్మ ఆ రోజంతా వూళ్ళోని కబుర్లన్నీ చెప్పింది. కంఠీజోస్యులు వూళ్ళో వున్న ఇద్దరి జోస్యులిండ్లకూ వెళ్ళి, వాళ్ళకు తమ పన్నెండేళ్ళ కాశీ అనుభవాలు చెప్పి, వాళ్ళిచ్చిన తాంబూలం, కొబ్బెర కాయలతో ఇంటికి తిరిగొచ్చారు.

తాము వచ్చిన పనేమిటో అక్కమ్మే ప్రస్తావించింది. "ఆ గొడ్రాలి ముండకు పిల్లలంటూ కారు. పెళ్ళయి పదహారేళ్ళయింది కదా దాని యోగ్యతే అంత. వంశమాగిపోతే మాకు పిండం పెట్టేదెవరు? కల్లేశుకు వేరే పెళ్ళి చేద్దామనుకున్నాం".

"దానికన్నయ్య ఒప్పుకున్నాడా?"

"హుం. ఒప్పుకోకేం చేస్తాడు? వాడే మమ్మల్నిద్దరినీ బండి కట్టించి పంపాడు"

"దానికి నేనేం జెప్పను? నాకేం తెలుసు?"

"పార్వతి నిచ్చి పెళ్ళి చేసెయ్. ఒక రోజులో పెళ్ళి చేసేద్దాం-" అక్కమ్మ ఈ మాటలు చెబుతున్నప్పుడు పార్వతి ఎదురుగుండానే వుంది. ఇది విన్న అమ్మాయికి అయోమయంగా వుంది. నంజమ్మ కలలో కూడా ఎన్నడూ అనుకోని ఈ మాటలతో తికమకపడ్డది. అక్కమ్మ ఇంకా ఇలా చెప్పుకపోయింది. "కంఠి కాశీనుంచి మూడు వేల రూపాయలు, ఇరవై బంగారపు వుంగరాలు తెచ్చాడు. డబ్బంతా మన పిల్లకే అవుతుంది. రాణిలా బతగ్గలదు."

"బామ్మా! పార్వతి వయస్సెంత? అన్నయ్య వయస్సెంత? ఎంతయినా వాడు మేనమామ. ఇది మేనకోడలు. వాడికి కొడుకు పుట్టివుంటే దీన్ని ఇవాళ్ళివచ్చేది."

"కొడుకే వుంటే మరో పెళ్ళెందుకేడవను? మేనమామలెంతమంది పెళ్ళాడ్డంలేదు. వాడికి మాత్రం వయస్సెంత? ముప్పై ఆరో ముప్పై ఏడో! ఇంకా రాజకుమారుడిలా వున్నాడు."

"వదినమ్మ వూరికే వుంటుందా?"

"వూరుకోకపోతే వురెట్టుకోనీ. దాని కడుపులో ఒక కాయకాయనీ. కావలిస్తే దీని పాదసేవ చేస్తూ పడుండనీ. లేదా పాత చీర చంకనెట్టుకుని పుట్టింటికి

వెళ్ళనీ."

వెంటనే, 'అవును.కాదు' అని చెప్పటానికి నంజమ్మకు నోరాడలేదు. ఆవిడ మనస్సులో కోలాహలం బయల్దేరింది. అక్కమ్మ ఇంకా ఇలా అన్నది. "నువ్వే చూశావు కదా! ఇంట్లో తినడానికి, కట్టడానికి లోటు లేదు. కల్లేశు కష్టపడి పొలం పని చేస్తాడు. బంగారం లాంటి ఇల్లు, కంఠి మూడు వేలు తెచ్చాడు. కావాలంటే దాంతో బంగారు నగలు తెచ్చి దీన్ని ముంచేస్తాడు. ఇటు చూస్తే మనవరాలు. అటు చూస్తే కోడలవుతుంది. కల్లేశుకు పిల్లలు కాకుండా, చస్తే మా పద్ధతి మాటేమిటి? ఏదో మీ అమ్మకు మీరిద్దరూ పుట్టి బతికారు. నేను పెంచాను. ఇప్పుడు నేనే వచ్చి అడుగుతున్నాను. వాడి కంటే దగ్గిరవాడెవడు నీకు. నా మాట విని పిల్లనివ్వు".

నంజమ్మకు పుట్టింటి మమకారం కలిగింది. కాని మనస్సు మాత్రం లోపల వద్దంటోంది. ఆవిడేమాటా చెప్పలేదు. ఆ రాత్రి భోజనాలయ్యాక కంఠీజోయ్యలే కూతురి దగ్గిర పెళ్ళిమాటెత్తినప్పుడు చెన్నిగరాయలూ వున్నాడు. ఆయనకు మామగారంటే మొదటినుంచీ భయమే. తనకు శివలింగడి నుంచీ కరణీకం ఇప్పించిందే ఆయన. అక్కమ్మ మనవరాలితో చెప్పినవన్నీ ఆయనా చెప్పి, అల్లుడివేపు తిరిగి "ఏమంటావు చెన్నయ్యా! వూళ్ళో వున్న పొలము, ఇల్లు, పైగా మూడు వేల రూపాయలు, నీ కూతురికే చెందుతాయి. ఇప్పుడు మరో చోట వరుణ్ణి వెదికి నీవెక్కడ తంటాలు పడతావు? వూరికే వూఁ అను చాలు" అన్నాడు.

చెన్నిగరాయలు వద్దంటాడా? "కావచ్చు దానికేం. ఉమ్ం ......." అన్నవాడు నోరు నొక్కుకుని "దీదీ దీనికి మీరే చెప్పండి నాదేమీ అడ్డులేదు" అని ముగించాడు.

"నీ మొగుడూ ఒప్పేసుకున్నాడు. ఏమంటావు నంజీ"?

నంజమ్మకిప్పటికీ ఏం చెప్పాలో తెలియలేదు. "కానీ రేపాలోచించి మాట్లాడుదాం" - అంది.

"ఆలోచించేదేమిటి అందులో? మేమంతా ఒప్పుకున్నాక నిశ్చయమయినట్టే. వూరికెళ్ళి అన్నీ సిద్ధం చేయిస్తాను. వారం రోజుల్లో పెళ్ళి చేసేస్తాను" కంఠీజోయ్యలు నిష్కర్షగా చెప్పేశారు.

"మీరెలాగూ నాలుగు రోజులుంటారుగా. మాట్లాడుకుందాం".

"ఇప్పుడుండడానికి తీరుబడి లేదు. వూరికెళ్ళి పెళ్ళి ప్రయత్నాలు చేయాలి.

మువ్వాక పైసా ఖర్చు చేయక్కరలేదు" - అక్కమ్మ అంది.

అక్కమ్మ వుప్పిండి ఫలహారం చేసింది. నంజమ్మ భోంచేశాక అందరూ పడుకున్నారు. వచ్చిన ఇద్దరికీ త్వరగా నిద్దరపట్టింది. చెన్నిగరాయులు గుర్రుపెడుతున్నాడు. అక్కమ్మ పక్కలో పడుకున్న నంజమ్మకు కన్నుపాడుచుకున్నా నిద్దరట్టలేదు. అనుకోకండా వచ్చిన ఈ సమస్య తండ్రి పరిష్కారం చేశాడు. ఆయనన్నట్టు నాగలాపురంలో తినడానికే ఇబ్బందీ లేదు. పాడి ఆవు లేకుండా వాళ్ళెన్నడూ భోంచేసి ఎరగరు. ఏడాదికి సరిపడా ధాన్యం వస్తుంది. ఇంకా మిగులుతుంది కూడా. పైగా మూడు వేల రొఖ్ఖం దీనికే వస్తుంది. మూడువేలంటే మాటలు కాదు. అంతడబ్బు వాళ్ళెక్కసారిగా కళ్ళతో కూడా చూడలేదు. మా అమ్మాయి పుట్టాక ఇక్కడ అనుభవించిన భోగభాగ్యాలు మాత్రమేమిటి? పొట్టకుంటే బట్టకు లేదు. బట్టకుంటే పొట్టకు లేదు- అన్న ఆలోచన కాసేపావిడ మనస్సులో తారసిల్లింది. కాని ఆ మహామారి మొదటి పెళ్ళాం వుండగా, తన అన్నకే కూతురు నివ్వచ్చా? - అన్న ప్రశ్న కూడా కలిగింది. అన్నయ్య తనకంటే ఏడేళ్ళు పెద్ద. అంటే వాడికీ పార్వతికీ ఇర్వై రెండేళ్ళు తేడా. ముప్పై ఏళ్ళ తేడా వుండి, రెండవ, మూడవ పెళ్ళి చేసుకున్న వాళ్ళను కూడా చూసింది. పిల్లలు కలగకపోతే పెద్దపెళ్ళాం వుండగా రెండవపెళ్ళాన్ని చేసుకోవడం కూడా పరిపాటే. కాని అన్నయ్యకు పిల్లలెందుకు కలగలేదు? కాని తిరుగుళ్ళు తిరగటం వల్ల కలగలేదా? లేదా ఆవిడే గొడ్రాలా? ఆవిడ కిరాతజాతికి చెందిన మనిషి. వాడికిస్తే నా కూతురు సుఖంగా వుంటుందా?

ఈ ప్రశ్నకి సమాధానం వెతుక్కుని రేపు పొద్దుట లేచాక బొమ్మకి, నాన్నకి అటో ఇటో తేల్చి చెప్పాలి. ఈ సందర్భంలో తనకష్టసుఖాలు చెప్పుకుని ఎవరితోటి సంప్రతిస్తే బావుంటుంది? ఇంటి నిండా ధాన్యం, పైగా మూడు వేల రూపాయలనేసరికి కన్నతండ్రి వెనకా ముందు ఆలోచించకుండా సరేనన్నాడు. పిల్లలపెళ్ళి విషయంలో తల్లీతండ్రులిద్దరూ కూడబలుక్కుని ఆలోచించాలి. తాను నోచుకోని ఆ భాగ్యాన్ని ఆశించడం వృథా. ఎంచేతో మాదేవయ్యగారు. గుర్తొచ్చారు. ఆయన్నడిగి ఏదో నిర్ణయం తీసుకోవాలనుకుంది. అందరూ గాఢ నిద్రలోవున్నారు. ఆవిడ లేచి, చీకట్లోనే బయటికి వచ్చింది. చప్పుడు కాకుండా తలుపు చేరవేయబోగా పార్వతి కూడా తనవెంటనే రావడం చూసి ఆమెకాశ్చర్యం కలగలేదు. చప్పుడు చేయకని కూతురికి సైగ చేసి తలుపుచేరవేసి, గుడివేపు

నడిచి వెళ్ళింది. పార్వతి కూడా వెనకాలే వెళ్ళింది.

గుడికి వచ్చి అయ్యగారిని లేపి, ఆయన దీపం వెలిగించినప్పుడు దాని వెలుతురులో పార్వతి కళ్ళలో కన్నీళ్ళు కారడం కనిపించింది. అయ్యగారే అడిగారు "ఏం తల్లీ! మేనమామను పెళ్ళాడనని ఏడుస్తున్నావా?"

"మీకిదంతా ఎలా తెలుసయ్యగారూ?" నంజమ్మడిగింది.

"సాయంత్రం మీ నాన్నగారొచ్చారు. వాతో అంతా చెప్పారు. నువ్వేమాలోచించావు?"

"నాకేమీ తోచలేదు. అంచేతే వచ్చాను"

ఇంతలో రామణ్ణ కూడా అక్కడికి వచ్చాడు "ఇల్లొదిలి నువ్వెందుకొచ్చావు?" అని తల్లి అడిగింది.

"బయటనుంచీ చడీ చప్పుడు కాకుండా తాళం వేసుకుని వచ్చాను. నాకూ నిద్దరట్టలేదు. మీ రిక్కడికే వచ్చారనుకున్నాను" అని వాడు తాళం చెవి చూపించాడు.

"అక్కయ్య పెళ్ళి గురించి ఏమంటావు రామణ్ణా?" అయ్యగారడిగారు.

"వద్దండి అయ్యగారూ! కల్లేకు మావ నరిసీ ఇంటికి .... ' అని చెబుతున్నవాడు అర్ధాంతరంగా, ఆ మాటలన్నీ పెద్దవాళ్ళకు చెప్పడం దేనికని, ఆపేసి "ఆయన కివ్వడం వద్దండి" అన్నాడు.

అయ్యగారన్నారు "చూడు తల్లీ! నీ మనస్సులో వున్నదే నేనూ చెబుతాను. అన్నయ్య అవి పిల్లనివ్వకు. నన్నడిగితే ఈ చుట్టుపక్కలెవరూ వొద్దు, బుద్ధిమంతులెవరున్నారు? సర్కారు పనిలో వున్నవాళ్ళే తగిన వాళ్ళు. ఎంత కష్టమయినా వరే ఓ స్కూలు మాస్టారు లాంటి వాడికివ్వు, పరువుగా, సుఖంగా వుంటారు. కడమవాళ్ళు వట్టి ఏబ్రాసులు."

పార్వతి మనస్సులో వున్నదాన్నే అయ్యగారు చెప్పారు. ఆయన మాట చాలా సబబయినదని నంజమ్మకు తోచింది 'అయినా' ఆవిడ ధ్వని తగ్గించి "అమ్మాయి వయస్సు చూడండి. పెద్దమనిషయితే గతేమిటి?" అంది.

"ఇప్పుడు పెద్ద వూళ్ళల్లో ఈ పట్టింపు లేదట. అలాంటి వూళ్ళల్లోనే ఎవరినైనా చూసి ఇవ్వండి. ఇప్పుడెలాగూ సర్కారు ధాన్యం లెక్కలు మీ చేతిలో వున్నాయి. మీ కరణీకం వూళ్ళల్లో చందా ఎత్తితే అయిదారు వందలు పోగవటం కష్టం కాదు".

పెద్ద వూళ్ళల్లో చాలావరకట్నమడుగుతారట అయ్యగారూ! నే నీ అమ్మాయి పెళ్ళి చేసి నెగ్గగలనా?"

"అమ్మా! నే నెలాగూ పై తరగతిలో వున్నాను. అక్కయ్యకు పాఠాలు చెబుతాను. దానికి లోయర్ సెకండరీ ప్రయివేటుగా కట్టిస్తే బడి పంతులమ్మను చేయచ్చు. పెళ్ళికాపోతే ఏం మునిగిపోయింది?" అని రామణ్ణ అన్నాడు.

"అది తరువాత చూద్దాం. అవసరమయితే వెంకటేశయ్య మాస్టార్ని ఒకమాటడిగిచూడండి. తరవాత మీ నాన్నకి జవాబు చెప్పండి."

నంజమ్మ రామణ్ణకు వెంకటేశయ్యగారిని పిలుచుక రమ్మని చెప్పింది. "ఎవళ్ళనీ లేపకూడదు. ఎవళ్ళకీ తెలియకూడదు" అని హెచ్చరించింది. కాసేపటిలో మాస్టారొచ్చారు. పార్వతి లేచి వెళ్ళి స్తంభం చాటున కూర్చుంది. వున్న సంగతంతా నంజమ్మ వివరించి చెప్పాక మాస్టారన్నారు. "అమ్మా! అరిసికెరె, బాణావర వైపంతా చిన్న చిన్న వూళ్ళల్లో కూడా ఆడపిల్లలు పెళ్ళికాకముందే పెద్ద మనుషులు కావటం చాలా మామూలు విషయం. ఎవరూ పైకి మాత్రం చెప్పరు. దాన్ని గురించి మీరు కంగారు పడవద్దు. కావలిస్తే నేను వరుణ్ణి వెదికి ఏర్పాటుచేస్తాను. ఎలిమెంటరీ స్కూలు మాస్టారంటే జీతం తక్కువ. అలాంటివాళ్ళు దొరుకుతారు. మీరు డబ్బు సర్దండి. అయిదారు వందలయితే చాలు".

"మాస్టారూ! కుర్రాడు గుణవంతుడు కావాలి. అప్రయోజకుడు కారాదు. జీతం తక్కువయినా మా అమ్మాయికి విస్తళ్ళు కుట్టడం వచ్చు. ఇంట్లో కూర్చునే ఎంతలేదన్నా నెలకు పదిహేను రూపాయలు సంపాదించగలదు."

"అది నాకు తెలియదా? పార్వతమ్మను పెళ్ళాడాలంటే ఎవడయినా పుణ్యం చేసి వుండాలి."

మొత్తానికి పుట్టింటికి పిల్లను మారివ్వడం కూడదని నిర్ణయం జరిగింది. "నాకక్కరలేదని అమ్మాయి పట్టుపట్టనీ. అమ్మాయి ఇలా అంటోంది నేనేం జేయను? ఋణానుబంధం లేదు అని మీరు చల్లగా జారుకోండి" అని మాస్టారే ఉపాయం చెప్పారు.

ముగ్గురూ చప్పుడు కాకుండా వచ్చి తలుపుతీసి పడుకున్నారు.

తెల్లారి లేవగానే తాము బయల్దేరాలని హడావిడి చేసిన కంఠీజోస్యులడిగాడు. "నంజీ! వారం రోజులకో మంచి లగ్నముంది. పెళ్ళి ఇక్కడ మీ ఇంట్లో జరగాలా? అక్కడయినా పరవాలేదా?"

"నాన్నా! పెళ్ళి చేసుకునే పిల్లనడిగి తరువాత ఏమయినా నిశ్చయిద్దాం. మనం మనం మాట్లాడుకుంటే ఎలాగ?"

"దాన్నేమడిగేది? నీ పెళ్ళి నిన్నడిగి చేశానా? ఒసేవ్ చిన్నీ రావే ఇలా" అని మనవరాలిని పిలిచి కంఠీజోస్యులుగారు "ఏమంటావే నువ్వు?"

పార్వతి వెంటనే మాట్లాడలేదు. తాతయ్యే మరోసారి అడిగే సరికి "నాక్కర్లేదు" అంది.

"ఎందుకక్కరలేదు?"

"నాకిష్టం లేదు. వద్దు తాతయ్యా!" అని చెప్పి పార్వతి వంటింట్లో కెళ్ళిపోయింది.

"ఏమే నంజీ! ఇదిలా అంటుంది?"

"దానికిష్టం లేకపోతే వద్దులే నాన్నా"

కంఠీజోస్యులకు చిర్రెత్తింది. ఆయన వంటింట్లోకెళ్ళి పార్వతి ముందు నుంచుని "ఎందుకక్కర్లేదు?" అని మళ్ళీ అడిగాడు. "నా కిష్టంలేదు. నన్ను బలవంతం చేయకండి" అన్నదే తడవుగా అమ్మాయి చెంప ఛెళ్మని పేలింది. ఒకరోజయినా నంజమ్మ పార్వతిని కొట్టి ఎరగదు. శబ్దం వినగానే నంజమ్మ లోపలికొచ్చి చెప్పింది. "నాన్నా! ఆ అమ్మాయి నెందుక్కొడతావు? నీ మనస్సుకు తోచిందల్లా అయి తీరాలన్న పట్టుదలే నీది, నా పెళ్ళేమయినా కాస్త వెనకా ముందు ఆలోచించి చేశావా? అన్నయ్య పెళ్ళి మాత్రం బాగా ఆలోచించి చేశావా? పిల్లలు కలగడం, కలక్కపోవడం వాళ్ళ తలరాత. కానీ పిల్ల గుణగణాలు చూసి చేసి వుంటే వాడి కనుకూలంగా వున్న పెళ్ళామయినా వచ్చేది".

"ఇప్పుడు నీకేమయింది?"

"ఇంకేం కావాలి? వున్న పొలమంతా వూడ్చుకుపోయింది. నీ వియ్యపురాలు, అల్లుడూ కలిసి సంసారాన్ని ఈ స్థితికి తెచ్చారు. నేను రెక్కలు విరుచుకుంటే వుంది. లేకపోతే పిల్లలు తినడానికి తిండిలేక చచ్చేవాళ్ళు".

"అందుకే తినడానికి కట్టడానికి వుందనే కల్లోళుని కిమ్మన్నది"

"మీ రెవళ్ళేమి చెప్పినా అమ్మాయి వద్దన్నాక నే నివ్వను. వాడికి పెళ్ళి చేసే తీరాలంటే మరో చోట పిల్లనుచూడండి."

"అయితే నువ్వు కూతురువి కావు. నేను తండ్రిని కాను. భాంచోత్ లాడి" అంటూ బయటికి వచ్చిన కంఠీజోస్యులు "అమ్మా! నడు దీనింట్లో ఇహ చుక్కనీళ్ళు కూడా తాగరాదు" అని తమగుడ్డలన్నీ సర్దుకుని వెళ్ళి ఇంటి ముందే

వున్న బండిలో వెళ్ళి కూర్చున్నాడు. తాము వచ్చిన పని కాలేదని అక్కమ్మకు కూడా కోపం వచ్చింది. ఆమె కూడా తన మూటా ముల్లె కట్టుకుని బండెక్కి కూర్చుంది. బండివాడు నొగలెత్తి ఎడ్లను పూన్చకముందే నంజమ్మ బయటికి వచ్చి - "ఋణానుబంధం లేదు. కాలేదు. దానికెందుకింతగా కోపగించుకుని వెడతారు? ఈ రోజుండి వెడితే కాదా?" అనేసరికి, అక్కమ్మ, "నిన్ను పెంచి పెద్ద చేసి పురుళ్ళు పోసినందుకు నాకు మంచి మర్యాద చేశావు" అంది. కంఠీజోస్యులు "నాతో మాట్లాడకు. నువ్వు కూతురివి కావు.నేను తండ్రిని కాను. అని చెప్పలేదూ" అన్నాడు. నంజమ్మ మళ్ళీ మాట్లాడలేదు.

## 4

వారం రోజులు గడిచింది. ఒకరోజు మధ్యాహ్నం నంజమ్మ పార్వతి కలిసి తిరగలి గుంజ పట్టుకుని రాగులు విసురుతున్నారు. ఇంట్లో మరెవరూ లేరు. ఎవరో ఇంట్లోకి వచ్చిన అలికిడయ్యింది. నంజమ్మ వీధి తలుపు కేసి తిరిగి చూసింది. నరసి. ఇంతకుముందెన్నడూ నరసి తమ ఇంటికి రాలేదు. దాని అంగడి దాటివెళ్ళేటప్పుడు "ఏమమ్మా కురుబరహళ్ళికి బయల్దేరారా?" అంటే "వూం" అనడమెంతో అంతే. ఇప్పుడావిడే వచ్చింది. ఇంటికి వచ్చినావిణ్ణి మాట్లాడించకుండా పంపడమెలా? ఇంతకూ తనకూ నరిసికీ దెబ్బలాటేముంది? ఆవిడ నడత మంచిదికాదంతే.

"కూర్చోవమ్మా" - అని నంజమ్మ చెప్పాక నరిసి కంబానికానుకుని కూర్చుంది. పార్వతి లేచి వంటింట్లో కెళ్ళింది. 'ఏదో విశేషం లేందే రాదు' - అని ఆలోచించిన నంజమ్మే అడిగింది. "ఏమమ్మా వచ్చావు?"

"అమ్మా! మీతో ఓ మాట చెప్పాలని వొచ్చాను. మీ పారుతమ్మగోర్ని మీ అన్నగోరికిస్తారట విజవాఁ?"

"నీకెవరు చెప్పారు?"

"శింగేనళ్ళిలో మా చుట్టాల్లేరూ, ఆళ్ళకి నాగలాపురంలో చుట్టాలుండేరు. వాగలాపురంలో అనుకుంటూ వుండారట."

కానీ ఇంటి గుట్టు బయట పెట్టడం నంజమ్మకిష్టం లేదు. "అదంతా అబద్ధమమ్మా" అంది.

"మీ అయ్యా, మీ బామ్మా వొచ్చారు కదా? దానికే అయ్యుండచ్చనుకున్నాను.

అబద్ధమవుతే మరీ మంచిది. వేనిట్లాగన్నానని ఎవళ్ళకీ చెప్పకండేం? మీరన్నా చెల్లెలు బావుంటే నాకేం కడుపుమంటా? ఆ అయ్యకి ఆడపడుచు నివ్వకండి."

దీనికేం బదులు చెప్పాలో తెలియ కావిడ ముఖం చూస్తూ వుండిపోయింది. నరసమ్మే అంది "అలాంటోరికిచ్చే కన్నా నూతిలో తోస్తే సుఖంగా చస్తారు."

"మా అన్నయ్య ఇప్పటికీ మీ ఇంటికొస్తాడా?"

"నేదు నాలుగేళ్ళ కితం వేనే తన్ని తగలేసి పొమ్మన్నాను. లంజపక్కలో పడుకున్నా ఆ అయ్యకి నీతి నిజాయితీ వుండక్కర్లా?"

నంజమ్మ మాట్లాడలేదు. ఎదిగిన పిల్ల పార్వతి వంటింట్లో వుంది. దానికి వినపడేలా ఈ మాటలు మాట్లాడటం తప్పు. కానీ ఈ సూక్ష్మం నరసికెలా బోధపడుతుంది? "పోనిద్దూ నరసమ్మా ఆమాట లెందుకిప్పుడు?"

"నేనా అయ్యమీద కోపంతో చెప్పనేదు తల్లీ! వందమందొస్తారు. వెతారు. ఎవడిమీదా కోపమంటూ నాకు వేదు. పారుతమ్మ నా కూతురు నాంటిది. ఎవడయినా తండ్రికి పుట్టినాడికిచ్చి పెళ్ళి చెయ్యండి. నా పక్కలో పడుకుని అర్ధరేత్రికాడ, నేను నిద్దరోతుంటే నా గల్లాపెట్టిలోని డబ్బే ఎగరేసుకుపోతాడా ఆ సచ్చినోడు?"

నంజమ్మ అప్పటికీ మాట్లాడలేదు. తాను వచ్చిన పని జరిగిందన్నట్టుగా "నే నెడ్తాను తల్లీ! మనసుండబట్టక చెప్పెపెల్దామని వొచ్చేను" అనేసి నరసి లేచి వెళ్ళిపోయింది.

ఆవిడ వెళ్ళిపోయాక పార్వతి బయటికి వచ్చి తిరగలి గూటం పట్టుకుని కూర్చుంది. తిరగలి పట్టుకుని విసురుతున్న తల్లీ కూతుళ్ళ మనస్సులు రెండూ ఒకటే విషయాన్ని గురించి ఆలోచిస్తున్నాయి. ఈ పెళ్ళి అక్కరలేదని చెప్పటం మంచికే జరిగిందని ఇద్దరూ ఆలోచిస్తున్నారు. ఎవరూ పైకి ఏమీ అనలేదు.

## 5

ఈసారి ఎలాగైనా సరే కూతురిపెళ్ళి చేసి తీరాలని నంజమ్మ నిశ్చయించింది. డబ్బు సర్దుకోందే వరాన్వేషణం వెడితే, ఒకవేళ హఠాత్తుగా వరనిశ్చయం జరిగితే, చేతిలో డబ్బు లేకుండా వుంటే పరువు పోతుంది. అలాంటి పరిస్థితి రాకూడదు. ఆహార నియంత్రణ లెక్కలు ప్రారంభమయ్యాక, పొటిగె సరిపడా రసీదులిచ్చి ముందే కురుబరహళ్ళి నుంచి ధాన్యం తెచ్చే అవసరం లేదు. అదీకాక అదనంగా

లెక్కలు వ్రాసినందుకు ప్రభుత్వం సంవత్సరానికి వంద రూపాయలిస్తోంది. మొత్తం మీద రెండు వందలా ఇరవైరూపాయలు తన చేతికి వచ్చే నమ్మకముంది. కాని సాహుకారులో శ్రీవారు తిపటూరికెళ్ళి ఎవళ్ళకీ తెలియకుండా, పోటిగె, ఫుడ్ పోటిగ ఖర్చు వేయించుకుని తినేస్తారేమో అన్న భయమూ వుంది. ఒకరోజు గుండేగౌడ వూరికి వచ్చినప్పుడు, ఆయనతోపాటు కురుబరహళ్ళిలో వున్న ఆరుగురి పేరిట ఆ ఏటి పన్ను బాపతు రసీదులువ్రాసి, దానిలో సంతకం చేయమని మొగుడితో చెప్పింది.

ఆయన --"నేను చేయను" అన్నాడు.

"గౌడగారూ, అమ్మాయి పెళ్ళి చేయాలి. ఈ డబ్బు మీ దగ్గిరే వుండనీ, మీరే చెప్పి సంతకం చేయించండి" అని నంజమ్మ చెప్పాక గౌడ అడిగాడు "చెన్నయ్యా, వాటిలో సంతకం చేస్తావా, నీ పీకనొక్కేయాలా?"

"ఎందుకండీ మీరూ అదీ కలిసి నాకొక పైసాకూడా లేకండా చేస్తారు? నేనేమిటి కరణాన్నే కానా? నేను సంతకం చేయనంటే ఏంజేస్తారు?"

"పీకనొక్కేస్తాను. నువ్వు మా వూళ్ళో ఎలా అడుగుపెడతావో చూస్తానాగు"- అని గౌడ తన దుడ్డుకర్ర చేత బుచ్చుకుని నుంచునే సరికి, చెన్నిగరాయలు భయపడి అన్నింట్లోనూ సంతకం చేశాడు. కాని ఆయన కోపం మాత్రం తగ్గలేదు. "మాదిగాళ్ళకు పుట్టిన ముండ" అని తిట్టుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు.

"సంసారమంటే నాటకమమ్మా" అని గౌడ చిరునవ్వుతో చెప్పారు.

"అవునండీ, మీలాంటివాళ్ళు ఒకళ్ళిద్దరు లేకపోతే రంగస్థలానికే నిప్పంటించే బాపతు మావారు" అని నంజమ్మ అంది. "దీంతో రెండు వందలయింది. పెళ్ళంటే ఆరేడు వందలయినా కావాలి. తరవాతేమి చేయాలో నాకు తెలియదు. మీరే దిక్కు".

"లచ్చిందేవిలా వుంది పాప.మా జాతిలో అవుతే ఈపాటికి అడ్డిగ, నాగరు, దుద్దులు - అన్నీ ఎట్టి ఇట్టే ఎగరేసుకెళ్ళేవారు.మా చెడ్డజాతి తల్లీ మీది."

"ఎలాంటి జాతయినా పుట్టాక జాతికి తగ్గ రీతిగా చెయ్యాలిగా?"

"నువ్వు కాయ కసురు, పువ్వు పప్పులాంటి వాటికి బెంగెట్టుకోకు. పెళ్ళికొడుకును చూడు. మా వూళ్ళో ఇంటికి పదీ అయిదు చందా ఎత్తి ఇస్తాము. వలభై ఖర్చున్నాయి. పెళ్ళి వూరి కరణాలు అంటే మూడొందలయినా రాలవా? ఫుడ్ లెక్కల్లో నువ్వు మా వూరిని రాయటంలే? మొత్తానికి నీ అయిదొందలు

అయ్యాయి కదా? ఎలాగో సద్దుకోవాలి."

గౌడగా రీ హామీ ఇచ్చేసరికి నంజమ్మ గుండె మీది కుంపటి దించినట్టయింది. ఎలాగయినా సరే వరాన్వేషణ చేయించాలి. వూరికెళ్ళే ముందు గుండేగౌడ పార్వతిని బయటికి పిలిచి, "నీకేం మచ్చలేని చెందురుడులాగున్నావ్. మొగుడు మంచోడే దొరుకుతాడులే" అని ఆశీర్వదించి వెళ్ళాడు.

వరుణ్ణి వెతకటానికి మొదట్లో అన్నయ్య సహాయం కోరాలనుకుంది నంజమ్మ. కానీ అతడికే వరుడుగా పిల్లనడగటానికి తండ్రి -బామ్మా వచ్చి కోపగించుకుని వెళ్ళాక, మరెవళ్ళకాళ్ళో పట్టుకోవాలి మరి, లేకపోతే పనికాదు. అందులోనూ యోగ్యుడయిన వరుడు దొరకాలంటే విశ్వాసపాత్రుడు కావాలి. పెళ్ళి బరువంతా వెంకటేశయ్య మాష్టారు మీదెట్టింది నంజమ్మ. "కన్యాదానఫలం మీకే చెందుతుంది. మీరే ఏదో దారి చూపాలి" అంది.

మాష్టారు అయిదారూళ్ళు తిరిగి వచ్చారు. ఎక్కడా కుదరలేదు. అరలసీకెరె దగ్గర ఒకవూళ్ళో పెద్ద జమిందారులున్నారట. వారి రెండవ కొడుక్కి ఈ అమ్మాయి నడగమని వారే కబురెట్టారు. వెంకటేశయ్య గారన్నారు "అమ్మా! వాళ్ళకేమాటా ఇదమిత్థంగా చెప్పలేదు. నేననుకుంటాను. అంతటి జమీందారులు తిరిటిపిల్ల నడుగుతున్నారంటే కుర్రాడిలో ఏదో లోపముండాలి."

"వున్నా వుండవచ్చు వియ్యానికయినా, కయ్యానికయినా సమంగా వుండాలని కదా సామెత. అంత పెద్దింటికి మనపిల్ల నివ్వటమే వద్దు" - నంజమ్మకూడా అంగీకరించింది.

నాలుగు నెలలిట్లా అన్వేషణ జరిగాక ఒక సంబంధం వచ్చింది. వెనక వీళ్ళ కరణీకం లెక్కలు వ్రాస్తూ, నంజమ్మకు లెక్కలు వ్రాయటం నేర్పిన తిమ్మలాపురం దేవరసయ్యగారు కబురెట్టారు. ఆయన పెళ్ళాంవేపు దూరపు చుట్టం, ఒక వరుడున్నాడట. పేరు సూర్యనారాయణ. యస్.యస్.ఎల్.సి చదివి మిడిల్ స్కూలు మాష్టారుగా పనిచేస్తున్నాడు. వయస్సు ఇరవై ఏడు. మొదటి పెళ్ళాం నాలుగునెలల క్రితమే చచ్చిపోయింది. మూడేళ్ళ కూతురుందట. కుర్రాడికి తల్లి తండ్రి ఎవరూ లేరు. ఇప్పుడా పాపను తానే పెంచుతున్నాడు. బడికి వెళ్ళేటప్పుడు కూడా తీసుకెళ్ళి కూర్చోబెట్టుకుంటాడు. కుర్రాడు బుద్ధిమంతుడు. అరవై రూపాయలు జీతం. తలతగిలినవాడు. బంగారు లాంటి గుణం. "అమ్మా! నీకే అనుమానమూ వద్దు. పిల్లనివ్వు. చాలా మంచివాడు. నీకూతురు సుఖపడుతుంది.

అతడి కూతుర్ని మీ అమ్మాయి తనకన్నకూతురిలా చూసుకోనీ" - అని దేవరసయ్యగారు తన కొడుకుతో కబురెట్టారు. ఆయన కిప్పుడింత దూరం నడిచి వచ్చేశక్తి లేదు.

దేవరసయ్యగారు చాలా యోగ్యులన్న సంగతి నంజమ్మకెవరూ చెప్పక్కరలేదు. అలాంటి వారిని నమ్మకపోతే మరెవర్ని నమ్మాలి? 'కుర్రాణ్ణి మీరు చూశారా?' నంజమ్మ అడిగింది.

"మాకు బాగా తెలియదు. మా అమ్మవేపు దూరపు చుట్టమట. కుర్రాడిప్పుడు గుబ్బితాలూకా బాళెకెరె మిడిల్ స్కూల్లో మాస్టారట. మీరు కబురెడితే పిల్లని చూడటానికి వస్తారు".

నంజమ్మ వెళ్ళి వెంకటేశయ్యగారి నడిగింది. ఆయనే, దేవరసయ్యగారి కొడుకువెంట తిమ్మలాపురానికెళ్ళి వరుడి విషయమంతా అడిగి తెలుసుకుని వూరికి వచ్చి చెప్పారు. "నంజమ్మగారూ, ఆ కుర్రాణ్ణి నేనూ ఎరుగుదును. నేను గుబ్బితాలూకా కడబలో పనిచేస్తున్నప్పుడు జీతం రోజు తాలూకాఫీసులో ఎన్నో సార్లు చూశాను. చాలా మంచివాడు. పాపం, పెళ్ళాం పోయిందని నాకు తెలియదు. రెండో పెళ్ళిఅన్నదొకటిమినహాయిస్తే అలాంటి వరుడుదొరకటం నిజంగాకష్టమే."

నంజమ్మ పార్వతి నడిగింది. "అమ్మా! నువ్వొప్పుకుంటే నాదేం లేదు. నన్నడగక్కరలేదు" అంది పార్వతి. మొగుడిపేరిట వుత్తరం వ్రాయించి నంజమ్మ వెట్టిచేత తిమ్మలాపురానికి పంపించింది.

ఆ తరువాత పదిహేను రోజులకి దేవరసయ్యగారూ, ఆయన భార్యా, సూర్యనారాయణతోటి పెళ్ళి చూపులకి ఎడ్ల బండిలో వచ్చారు. వరుడికి ఇర్వై ఏడుకంటే ఎక్కువ లేదని ముఖం చూడగానే తెలిసిపోతోంది. గంభీరమయిన స్వభావం. స్వభావం చేతనే మితభాషి. అతడి మూడేళ్ళ పాపమాత్ర మతణ్ణి క్షణం కూడా వదిలి పెట్టడం లేదు. వెంకటేశయ్య మాస్టారు వచ్చారు. ఆయన సూర్యనారాయణ కంటే వయసులో చాలా పెద్దవాడు. ఇద్దరూ కాసేపు మాట్లాడుకున్నారు. మధ్యాహ్నానికి పాయసం వండి పండుగ చేసి అందరి భోజనాలయ్యాక పెళ్ళికూతుర్ని చూపించే సమయానికి సూర్యనారాయణ కూతురు రత్న, నంజమ్మ దగ్గిరికి చనువుగా పొందుకొని వెడుతోంది. నంజమ్మ దాన్ని చంకకెత్తుకునే తిరుగుతోంది. వంటింట్లోనే కూర్చున్న పార్వతి తొడమీద కాసేపు ఆడుకుని చివరికి విశ్వం చెయ్యట్టుకుని ఆట్లాడటానికి వీధిలో కెళ్ళింది.

సూర్యనారాయణ అన్నాడు. "అది ఎవళ్ళదగ్గిరికీ ఇలా వెళ్ళదు. వీళ్ళను చూశాక అర్ధగంటలోనే కలిసిపోయింది."

పిల్లను చూశారు. సూర్యనారాయణే నంజమ్మతో అన్నాడు. "అమ్మా! నా జాతకం తెచ్చాను. కావలిస్తే మీరెవరికైనా రెండు జాతకాలు చూపండి. నాకుమాత్రం దానిలో నమ్మకమే పోయింది. మొదటిసారి జాతకాలు చూసిన ఇద్దరు ముగ్గురు జోస్యులు ఇంతగా అతికిన జాతకాలు లేవన్నారు. పెళ్ళయిన నాలుగేళ్ళకే ఇలా అయింది. నా విషయమంతా దేవరసయ్య మామగారే చెప్పారు. మీ కంతా సమ్మతమైతే ఇంత చారు అన్నం చేసి ఒక రోజు పెళ్ళి చేసి ఇవ్వండి. భేదభావం లేకండా నా పిల్లను తన కన్నకూతురులా చూసే బాధ్యత మాత్రం మీ అమ్మాయి మీద వుంటుందవి మొదటే చెబుతున్నాను."

జాతకాలు చూడటం మాస్టారుకి కాస్తోకూస్తో వచ్చు. దేవరసయ్యగారు కూడా కొద్దిగా తెలిసినవారే. ఇద్దరూ కలిసే చూశారు. గ్రహమైత్రి, యోనికూటం, నాడీకూటం, రజ్జుకూటం అన్నీ కలిపి వచ్చాయి. మొత్తం ఇరవై మూడు గుణాలు వచ్చాయి. ఇంతకంటె అన్యోన్యత వుండడం కష్టం. వెంకటేశయ్యగారు సూర్యనారాయణను తమ ఇంటికి తీసుకెళ్ళారు. ఇక్కడ దేవరసయ్యగారు చెన్నిగరాయల్ని అడిగారు: "మీరేమంటారు కరణం గారూ?"

"నేనేమనాలి? వన్నేమైనా అడిగి చేస్తుందంటారా ఇది?"

"ఇంటికి పెద్దలు మీరు. కార్యభారమావిడ నిర్వహించినా యజమానస్థానం మీదికదా?"

"ఇంతగా చిందులేస్తోందే డబ్బుకేంజేస్తుందో అడగండి."

"ఏంజేస్తావని మీ పెళ్ళాన్ని మీరే అడగండి."

పెళ్ళాం వేపు తిరిగి "డబ్బుకేం జేస్తావే ముం..... అన్నవాడు తన మాటకు తనకే సిగ్గేసి "డబ్బెక్కడ తెస్తావే" అని అడిగాడు. ఈ ఏటి పోటిగె డబ్బు గుండేగౌడ వద్దే వుంది. అదీకాక కురబరహళ్ళిలో చందా ఎత్తి ఇస్తానన్నారు".

తన మీద జబరుదస్తి చేసి రసీదుల మీద సంతకాలు తీసుకున్నది గుర్తొచ్చి కరణంగారు "వాడొకడు కొంపలు కూల్చే లంజాకొడుకు" అన్నారు. నంజమ్మ మళ్ళీ మాట్లాడలేదు. ఆయన స్వభావమేమిటో ఎరిగిన దేవరసయ్యగారూ వూరుకున్నారు.

వెంకటేశయ్యగారు తమ ఇంటికి మాదేవయ్యగారిని పిలిపించి వరుణ్ణి చూపెట్టారు.

తరువాత నంజమ్మ ఇంటికి వచ్చారు. పెళ్ళి నిశ్చయమయింది. పెళ్ళిరోజే లగ్నపత్రిక వ్రాసే శాస్త్రంకూడా చేయాలనీ, నెలరోజుల్లో పెళ్ళి చేసెయ్యాలనీ చెప్పిన సూర్యనారాయణ "మీరెక్కువగా ఏ ఖర్చు పెట్టుకోకండి. పెళ్ళికూతురుకి కావలసినవన్నీ నేనుపట్టుకొస్తాను. వరోపచారానికి, ఒక మిల్లు పంచలచాపు, రాగి పంచపాత్ర వుద్ధరిణి - ఇంతమాత్రమయితే చాలు."- అని తనంతటతానే చెప్పాడు. బయల్దేరేముందు నంజమ్మకు చెన్నిగరాయలకు నమస్కారంచేసి - అందాకా వీధిలో విశ్వంతో ఆడుతున్న అమ్మాయితోటి నమస్కారం చేయించి, ఎత్తుకుని బయల్దేరాడు. బండి కట్టినా, అతడూ, దేవరసయ్యగారూ, ఆయన కొడుకు , ముగ్గురూ ఊరు వదిలేదాకా నడిచేవెళ్ళారు. వెంకటేశయ్యమాస్టారు, మాదేవయ్యగారు వూరిపొలిమేరదాకా వెళ్ళి వాళ్ళను సాగనంపారు.

## 6

పెళ్ళైమో నిశ్చయమయింది. లగ్నంపెట్టి పెళ్ళిచేయటానికి పురోహితుల సహాయంకావాలి. స్థానిక పురోహితులిద్దరూ చేరి తన్ను వెలివేయించారు. తన తండ్రి సహాయం చేయడు. కోపగించుకుని వెళ్ళిపోయాడు. వీళ్ళని మంచి చేసుకోకపోతే ఏవో పుల్లలు పెడతారు. పిల్లనూ తల్లినీ వెలివేశారని పెళ్ళికొడుక్కి చెప్పవచ్చు. మరేవో అడ్డంకులు కల్పించవచ్చు. పెళ్ళి కొడుకు మంచివాడే అయినా, లోకానుభవమున్నా, ఇలాంటి విషయాల్లో ఎవరిమాటలెలా పని చేస్తాయో చెప్పలేము.

ఆ పురోహితులిద్దరినీ ఒక కొలికికి తేవడం, ఇప్పుడామెకు కష్టంకాదు. ఆహారపు లెక్కలు వచ్చాక, తమ పొలాల పసలీ అంచనా తక్కువ వ్రాయించాలని ఊళ్ళో ఎందరోవచ్చి వినయ విధేయతలు చూపెట్టి వేడుతున్నారు. ఇంతవరకూ జోస్యులు స్వయంగా రాకపోయినా పొలంచేసే రైతుద్వారా కబురెట్టారు. ఖాతా, పహణీ వ్రాసే నిజమయిన కరణం నంజమ్మే అని వాళ్ళకు తెలియని సంగతి కాదు. ఇప్పుడు వాళ్ళింటికి తానే వెళ్ళాలా అని మధ్యాహ్నమంతా ఆలోచించిన నంజమ్మ సాయంత్రం వెట్టిని పిలిపించి "వెళ్ళి అణ్ణాజోస్యులుగారినీ, అయ్యాశాస్త్రులుగారినీ నేను చెప్పానని పిలుచుకురా" అని చెప్పింది.

ఆమె ఇలా కబురెట్టడం వినయాన్ని సూచించే ప్రవర్తన కాదు. శృంగేరీ జగద్గురువుల మఠానికి ప్రతినిధులనిపించుకున్న వాళ్ళిళ్ళకు తనలాంటి వాళ్ళెళ్ళి,

గుమ్మం దగ్గరే మంచొని సాష్టాంగ నమస్కారం చేయడం ఆచారం. వాళ్ళు వెట్టివెంట వస్తారో, రారో! ఆవిడకి అనుమానమే. ఒకవేళ రాకపోతే తరువాత ఏం చెయ్యాలి? అన్న ఊహకూడాలేకపోలేదు. కానీ అలాజరగలేదు. పదినిమిషాల్లో అయ్యాశాస్త్రులు, మరో అయిదు నిమిషాల్లో అణ్ణాజోస్యులు వెట్టి వెంట వచ్చారు.

"మాయిగా! నువ్వు పంచటరుగుమీద కూర్చో" అని సాధికార స్వరంతో చెప్పిన నంజమ్మ ఆ ఇద్దరికీ చిరుచాపలు వేసింది. వాళ్ళే యోగక్షేమాదులడిగి "అమ్మాయి పెళ్ళి నిశ్చయమయిందట, చాలా సంతోషం" అన్నారు.

"చూడండి. అంచేతే మిమ్మల్ని పిలిపించాను. జాతకాలు చూడాలి. ముహూర్తం నిర్ణయించాలి. తరువాత పెళ్ళిచేయించాలి. ఇప్పుడు మా నాన్న కాశీనుంచి తిరిగొచ్చారని మీకు తెలుసుగా. పెళ్ళయ్యేదాకా వచ్చి ఇక్కడే ఉండి అన్నీ పనులూ నిర్వహించండి అంటే రెక్కలు కట్టుకుని వచ్చి వాల్తారు. కానీ స్థానిక పురోహితులు మీరుండగా ఆయన్ని రమ్మనడం దేనికని మీకు కబురెట్టాను. మీరెలా చెబితే అలా చేస్తాను".

"అబ్బెబ్బెబ్బే. ఎందుకూ? మేముండగా ఆయనకెందుకా శ్రమ. మా వూళ్ళో జరిగే పెళ్ళి చేయించే బాధ్యత మాది. కుర్రాడి జాతకమిలా ఇవ్వు." - అయ్యాశాస్త్రులడిగారు. ఇప్పుడు పంటలు అంచనా వేసే అధికారం నంజమ్మ చేతిలో వుందన్నదొకటే కాదు. ఆమె తండ్రి కంఠీజోస్యులీ వూరికి వచ్చి తిష్ఠ వేస్తే ఇద్దరికీ ఇబ్బందే. ఆయన పౌరోహిత్యంలో ఆరితేరిన ఘటమే కాక కోపం వస్తే ఎవళ్ళనయినా సరే పట్టుకుని చావగొట్టి చెవులు మూస్తాడని వాళ్ళిద్దరికీ తెలుసు. పన్నెండేళ్ళుగా కాశీలోవుండి తిరిగి వచ్చాడన్న సంగతి వాళ్ళూ ఎరిగిందే. ఇంట్లో వున్నపంచాంగ మిమ్మని ఏవో లెక్కలు వేసిన పురోహితద్వయం జాతకాలు బహుచక్కా కుదిరాయన్నారు. ఆనాటి కిరవై ఆరవరోజు లగ్నం ప్రశస్తంగా వుందని చెప్పిన ఇద్దరూ "పెళ్ళిని గురించి ఏబెంగాపెట్టుకోకు. పెళ్ళికొడుకు వేపు పురోహితులు రాకపోయినా మేమిద్దరూ ఎలాగో తంటాలు పడి అన్నీ చేసే పూచీ మాది" అని హామీ ఇచ్చారు.

"చూడండి. వఁరాజుపెళ్ళిలో గుఁరాజుకోపోచ అన్నట్టు - ఆ చేత్తోటే మా రామణ్ణ మెడలో ఓ జందెపుపోగు వేయించాలనుకున్నాను. అది పెళ్ళిరోజెట్టుకోవచ్చా?"

మళ్ళీ గుణించి, వాళ్ళన్నారు "పెళ్ళికి ముందు రోజెట్టుకో".

ఓపట్టాన తేలదనుకున్నది ఇంత చులాగ్గా పని అవుతుందని నంజమ్మ

వూహించలేదు. ఇక డబ్బు పోగుచేసి సామాను గట్రా కొనాలి. మరునటి రోజే ఆమె కురుబరహళ్ళికి వెళ్ళింది. గుండేగౌడ వూళ్ళో వున్న అందరినీ పిలిపించి చందా అడిగారు. నంజమ్మ పట్టీ వ్రాసింది. రెండు వందల డెభ్భై రూపాయలయ్యాయి. కడమ ముప్పై రూపాయలు తానిస్తానని చెప్పిన గౌడ - "తల్లీ! పన్నులరశీదు బాపతు డబ్బు రెండొందలూ ఇప్పుడట్టుకెళ్ళు. ఆ మూడొందలూ వారం రోజుల్లో నేనే వసూలు చేసి తెచ్చిస్తాను. తోటలున్నోళ్ళని అయిదు, పది, కొబ్బరి కాయ లిమ్మంటాను. ఒక వందా యాభై అవుతే సరిపోద్దా?"

"సరిపోతుంది గౌడగారు"

"సామాను గట్రా సట్రావటానికి తిప్పూరుకెళ్లాలేమో. నీ కేరోజీలైతే ఆరోజు కబురెట్టు. ఎడ్లబండి పంపుతాను. బెల్లం కాస్త ఎక్కువే సట్రా."

నంజమ్మ వూరికి వచ్చింది. సామాను పట్టీ తయారుచేయాలి. పెళ్ళికొడుకు వేపు ఎందరు వస్తారో తెలియదు. అతనికి ఎవరూ దగ్గిర చుట్టాలు లేరట. అదీకాక రెండో పెళ్ళి. పదిపదిహేను మంది కంటే ఎక్కువ రారు. తనవేపు నాగలాపురం వాళ్ళను మినహాయిస్తే ఎవరూ లేరు. వూళ్ళో ఆరేడు బ్రాహ్మల ఇళ్ళున్నాయి. పెళ్ళిరోజు, కురుబరహళ్ళి నుంచీ, ఇంటికో వ్యక్తి చొప్పునైనా పిలవాలి. కాస్త ఎక్కువగానే సామానుపట్టీ వేశాక, కొనవలసిన గుడ్డలు, బంగారం, వెండి., పట్టీవేసింది. వెంకటేశయ్య మాస్టారినీ, రామణ్ణని వెంటబెట్టుకుని బండి కట్టించుకుని తానే తిపటూరికి వెళ్ళింది. పెళ్ళికొడుక్కి 'కలాపత్తు' పంచెలు, సిల్కుచొక్కా, కోటు, జరీతలపాగా, వెండిగ్లాసు, వుద్ధరిణి తీసింది. పెళ్ళి కూతురికి ముప్పైరూపాయలకొకటి, పాతిక రూపాయలకొకటి చీర కొన్నది. రామణ్ణకూ, విశ్వానికీ మంచి గుడ్డలే లేవు. వాళ్ళకి రెండు చొక్కాలు, విశ్వానికో లాగు, రామణ్ణకు రెండడ్డ పంచెలు, వడుగులో భిక్షపాత్రకో వెండి గిన్నె తన పెనిమిటి కెనిమిది రూపాయలెట్టి తెల్లటి మిల్లుపంచెలు, చొక్కా కొన్నది. తనకు పెళ్ళిచీరె వుంది. ఇప్పుడేమీ అక్కరలేదని నిర్ణయించింది. "నంజమ్మగారూ, అన్ని సామానులు కొన్నా, పైన ఎంతలేదన్నా వందా యాభై చేతిలో వుంచుకోండి. డబ్బు చాలా పొదుపుగా ఖర్చు చేయాలి సుమా" - మాస్టారు చెప్పారు.

వుత్తరం వ్రాసి వెట్టితో నాగలాపురానికి పంపింది. తెల్లారి కోడి కూయగానే వెళ్ళిన వెట్టి రాత్రికే తిరిగి వచ్చి "అళ్ళెవరూ రారట" అని చెప్పాడు.

"అలాగని ఎవరన్నారు?"

"మీ అయ్యగారే అన్నారు"

"మరేమన్నారు?"

"నే వడిగితే పిల్లనివ్వటానికి వీల్లేదంది. మరోచోట ఇచ్చినా సుఖం లేదన్నారు".

తండ్రి స్వభావమామెకు తెలుసు. తన పట్టుదల తన పంతం నెగ్గాలి. దాని ముందు తల్లి, కూతురు, ప్రేమ, కరుణ - ఏవీ లేవు.

"బామ్మ ఏమంది?"

"ఆయమ్మగోరు నాతో మాట్టాడనేదు"

నంజమ్మకు దుఃఖం వచ్చింది. తండ్రి స్వభావం కొత్తది కాదు. కానీ తన్ను పెంచి పెద్ద చేసి, పెళ్ళిచేసి, పురుళ్ళు పోసిన బామ్మే రాకపోతే ఎలాగ? పుట్టింటి మమత నిగ్రహించుకోలేక ఒక రోజెళ్ళి తానే వెళ్ళి పిలవవా అనుకుంది. బండ్లో వెళ్ళడానికోరోజు, రావడానికోరోజు కావాలి. పెళ్ళికి పదమూడు రోజులే వుంది. పవేమీ జరగలేదు. జంతికలు, 'తేంగొళలు' మొదలయిన పిండివంటలేవీ తయారుకాలేదు. అటుకులు కొట్టాలి. పేలాలు వేయించాలి. మెరపకాయలు కొట్టించాలి. బాజా బజంత్రీలు నేర్పాటు చేయాలి.

మరో వుత్తరం వ్రాసి రేపో ఎల్లుండో వెట్టిని పంపడమే మంచిదనుకుని ఆవిడ వెట్టితో అంది. "రెండు మూడు రోజులయ్యాక మరోమారు నువ్వు వెళ్ళిరావాలి. కానీ జాగర్త. నువ్వక్కడి కెళ్లింది కానీ వాళ్ళు రామన్నది కానీ పైకి పొక్కరాదు."

వెట్టి రెండవసారి వెళ్ళినా వాళ్ళు రాలేదు. మళ్ళీ వచ్చాడని వెట్టినే చీవాట్లెట్టి మరీ పంపాడు కంఠీజోస్యులు. ఈ సంగతి ఎవరికీ తెలియకూడదని మరోసారి హెచ్చరించి నంజమ్మ వెట్టిని వెళ్ళిపొమ్మంది. తనకూ తన తండ్రికీ మధ్య మెరమెర కలిగిందన్న సంగతి వూళ్ళో వున్న జోస్యులకు తెలిస్తే వాళ్ళు మధ్యలో అడ్డుపుల్లలు వేయచ్చని లోపల భయముండనే వుంది.

ఆమె వేపు చుట్టాలే లేరు. అంతదాకా ఆమె వెళ్ళి అత్తగారిని పిలవలేదు. ఆమెకూడా రాలేదు. కానీ ఏ సామాను తెచ్చింది. ఏది లేదు - అన్నది చెన్నిగరాయని ద్వారా తెలుసుకుంటూనే వుంది. పెళ్ళికూతురుని ఎల్లుండి చేస్తారనగా నంజమ్మ తానే అత్తగారింటికెళ్ళి 'అత్తయ్యా, మీరూ అప్పణ్ణయ్యా అక్కడికేరండి. ముందు నుంచుని అన్నీ చేయించదగినవారు మీరు" అంది.

"నంగనాచి వంగముల్లు. ఇన్ని రోజులు పెళ్ళికొడుకును చూడటానికి గాని, సామాను కొనడానికి గాని నన్ను పిలిచావేమే? ఈ ప్రపంచంలో వరుడే లేడని, ఆ

పెళ్ళాం చచ్చిన రెండో పెళ్ళి వాడికివ్వటాని కొప్పుకున్నావా?"

"అత్తయ్యా! ప్రపంచంలో వందలాది వరుళ్ళుండవచ్చు. వాళ్ళు కోరిందిచ్చి పెళ్ళి చేసే తాహత్తు నాకులేదు. మీరూ "అప్పణ్ణయ్యా రండి" – అని మాటకు మాట పెంచకండా వెళ్ళిపోయింది.

చెన్నిగరాయలకు కూడా పెళ్ళాం మీద కోపమే. కల్లేశునికి పిల్లనివ్వనని చెప్పి మంకు పట్టుపట్టి మామగారు చేసే సహాయాన్ని పాడుచేసుకుంది. పెళ్ళి నిశ్చయమయ్యాక దేనిలోను తన సలహా కోరలేదు. అడిగితే అడుగడుగునా విఘ్నాలే అని ఆవిడకు తెలుసు. తమ్ముని ఖాతరు చేయవందుకు పగతీర్చుకోవాలని ఎదురుచూస్తున్నాడు.

అప్పణ్ణయ్య ఆ రోజే వీళ్ళింటికి వచ్చాడు. వదిన చెప్పినట్టుగా వంటింట్లో గాడిపొయ్యి తవ్వడం మొదలు, కర్రలు పోగెట్టి, వెట్టిచేత పందిరి వేయించేదాకా అన్ని పనులూ చేశాడు. రెండు దఫాలు కురుబరహళ్ళికెళ్ళి వాళ్ళు పోగెట్టిన కాయగూరలు బండ్లో వేసుకుని తెచ్చాడు. గంగమ్మ వుపనయనం రోజు వచ్చింది. ఏ పని చేయడానికి బుద్ధి పుట్టలేదో, అభిమానమో చెప్పలేం కాని, వంటింట్లో వూరికే కూర్చుండిపోయింది.

పెళ్ళికొడుకు వాళ్ళు చాలామంది రాలేదు. తిమ్మలాపురం దేవరసయ్యగారు, ఆయన భార్య కన్యాదానం పట్టడానికి వచ్చారు. ఆయన కొడుకు, కోడలు, ముగ్గురు మనవలు, పెళ్ళికొడుకుతోపాటు పనిచేసే ఇద్దరు స్నేహితులు, ఒక పురోహితుడు – మొత్తం ఇంతమందే వచ్చారు. పెళ్ళిలో ఏ గొడవా లేకండా సాగిపోతోంది. కన్యాదానానికి ముందు, కన్యాదాన మండపంలో పెళ్ళికూతురు తల్లితండ్రులు కూర్చుని ఏదో శాస్త్రకాండ చేయాలి." చెన్నిగరాయా! నువ్వు త్వరగా రావాలి పీటలమీదికి" అని జోస్యులు పిలిచారు. ఆయన ఎంచేతో లోపలే భీష్మించుక్కూచున్నాడు. "ముహూర్తం మించిపోతోంది. త్వరగా లేవండి" అని నంజమ్మ వెళ్ళి చెప్పింది. "నీకూతురి పెళ్ళి కావాలిస్తే నువ్వే చేసుకో, నేను పీటలమీదికి రాను" అన్నాడు. ఆమెకేమీ తోచలేదు. అక్కడే వున్న మాస్టారడిగారు "ఎందుకు కరణంగారూ! ఏమయింది చెప్పండి."

"ఇదే యజమానురాలు. సామాను గీమాను తేటానికి నన్నేమైనా అడిగిందేమండి?"

"మీరే యజమాని. మీ పేరిటే కదా అంతా నడుస్తోంది. పొద్దయింది లేవండి."

"ఇక్కడ చూడండి. ఇది నాకెలాంటి పంచతెచ్చిందో! 'కలాపత్తు' పంచలు చాలుతే అక్కరలేదా? దీన్ని కట్టుకుని నేను కన్యాదానమండపాటి రాను.' అని ఆయన పట్టుపట్టాడు. అంతేకాక మరో అభియోగం-పెళ్ళికి చేసిన జంతికలు, 'తేంగొళలు', లడ్లు, లాంటి పిండివంటలన్నీ చీకటి గదిలో పెట్టారు. దాన్నిపూచీ అంతా ఎవరో బాధ్యత ఎరిగిన ఒక ముత్తైవుకు అప్పచెప్పడం పెళ్ళిళ్ళల్లో వున్న ఆచారం. పిండి వంటలుంచిన గది తాళం చెవి నంజమ్మ మాస్టారు భార్య కప్పచెప్పింది. చేసిందే కొద్దిగా. వియ్యంకులు వెళ్ళేటప్పుడు వారికి కాస్త ఇచ్చి పంపాలి. వూళ్ళో వున్న ముత్తైదువులకు, పెళ్ళిలో సహాయంచేసిన తలిమ్మా వాళ్ళకి అంతో ఇంతో ఇవ్వాలి. పిండివంటలన్నీ పొదుపుగా ఇచ్చే బాధ్యత నంజమ్మ ఆవిడమీద వుంచింది. ఇప్పుడు చెన్నిగరాయలగాడు "పిండివంటల గది తాళం చెవి నాకెందుకివ్వలేదు?"

నంజమ్మే జవాబు చెప్పింది. "అదంతా చూచి ఇచ్చేది ఆడాళ్ళ పని. తాళం చెవి వుంచుకుని మీరేం చేస్తారు."

"నేను ఇంటికి పెద్ద. అది నా వద్దే వుండాలి."

నంజమ్మ వద్దంటున్నా మాస్టారు వెళ్ళి పెళ్ళాం మెడలోవున్న తాళం చెవి తెచ్చి కరణం గారికిచ్చారు. ఆయన వెళ్ళి, గది తలుపుతీసి అక్కడే వున్న ఒక తాటాకు బుట్టనిండా లడ్లు, జంతికలు మొదలైన పిండివంటలన్నీ నింపుకుని, అందరి ఎదురుగుండా దాన్ని తీసుకెళ్ళి కరణీకపు భోషాణంలో పెట్టి తాళం వేసుకున్నాడు. "ఇదేమిట్రా చెన్నయ్యా" అని అయ్యాశాస్త్రులడిగితే "పెళ్ళయ్యాక తినడానికి నాకు కావాలండి" అని జవాబిచ్చి లోపలికెళ్ళి మళ్ళీ తన మొదటి ఆక్షేపణ పట్టుకు కూర్చున్నాడు." నాకు 'కలాపత్తు' పంచలెందుకు పట్రాలేదు?"

"చూడండి. మొత్తం మీద ఇంతడబ్బు ఖర్చయింది. నేనేమీ కొత్త చీర కొనలేదు. మీ కంతటి ఖరీదయిన పంచ లెక్కడినుంచి తేను".

"అవుతే నేను పీటలమీదికి రాను"

"అనుకున్న ముహూర్తంలో కన్యాదానం కావాలన్న దృష్టితో పెళ్ళికొడుకుమ పిలవడానికింకా రాలేదేమని వాళ్ళ పురోహితుడు కబురెట్టాడు. పెళ్ళికొడుకు వాళ్ళని మాస్టారు గారిల్లు విడిది చేసి దించారు. పెళ్ళికూతురు తండ్రే ఇక్కడిలా భీష్మించుకు కూచున్నారు. ఇక్కడ జరగవలసిన శాస్త్ర కాండ జరగందే పెళ్ళికొడుకును పిలవడమెలాగ? మాస్టారి సలహా పని చేయలేదు. మాదేవయ్యగారు వచ్చారు. ఆయనకూ సాధ్యం కాలేదు. పురోహితద్వయం ఔపచారికంగా ఏదో

చెప్పారు. ఈ తమాషా చూచి వాళ్ళానందిస్తున్నారు. సంగతంతా తెలిసి దేవరసయ్యగారే వచ్చినా ప్రయోజనం లేకపోయింది. తలుపు దగ్గిరే కూర్చున్న గుండేగౌడ చేతి దుడ్డుకర్ర పుచ్చుకోబోయారు. దాని వల్ల మరింత క్షోభించుకుంటారని నంజమ్మ ఆయన్ని నివారించింది. అంతవరకూ వూరుకున్న అప్పణ్ణయ్య "వురేయ్, చెన్నయ్యా నోరుమూసుకుని లేచి పీటమీద కూర్చుంటావా లేక రెండంటించమంటావా?" అని అడిగాడు.

"ఈ బోడిముండా కొడుకు నన్నిలా అనవచ్చా? పెద్దన్నయ్య అంటే తండ్రితో సమానం. వాడు నా కాళ్ళట్టుకుని తప్పయిందని అడగాలి" అని చెన్నిగరాయలు మరో షరతు పెట్టాడు.

"అప్పణ్ణయ్యా మీరూరుకోండి" అని నంజమ్మే చెప్పి అతణ్ణి మాట్లాడకుండా చేసింది. కానీ గంగమ్మ కలిపించుకుని "ఇంటికి యజమాని, వాడికి 'కలాపత్తు' పంచలు లేకుండా కన్యాదానమెలా చేస్తాడు? నీ కామాటి తెలియక్కరలే? ఇప్పుడయినా ఓ చాపు వెంటనే తెప్పించు" అంది.

(తన వాదాన్ని బలపరిచే ఒక వ్యక్తి దొరకగానే చెన్నిగరాయలు మరింత బిర్ర బిగిశాడు. "హూం. ఇప్పుయినా సరే తిపటూరికెవళ్ళనైనా పంపించి కొని తెప్పిమ్మను. అప్పటిదాకా నేనిక్కడే కూర్చుంటాను."

"డబ్బు తీయి. పెట్టెలో దాచి తాళం చెవి బొడ్డులో జోపుకున్నావుగా?" అని గంగమ్మ వెటకారంగా అంది. అది తన్ను సమర్థిస్తూ పలికిన మాటే అని చెన్నిగరాయలకు కూడా తెలిసిపోయింది.

కోపగించుకుంటే వ్యవహారం చెడుతుంది. కానీ ఏ వుపాయమూ తోచడం లేదు. "పెళ్ళయిన వెంటనే తిపటూరికెళ్ళి తప్పకుండా కొనిపెడతాను" అని నంజమ్మ దేవుడిమీద ప్రమాణం చేసి చెప్పినా శ్రీవారు ఒప్పుకోలేదు. ఇప్పుడే కావాలి ధోవతులు. ఒకటే పట్టుదల. నంజమ్మకేమీ పాలుపోలేదు. మాట్లాడకుండా ఓమూలకెళ్ళి కన్నీళ్ళు తుడుచుకుంటూ నుంచుంది. బయట కన్యాదాన మండపంలో కూర్చున్న మాదేవయ్యకు విషయం తెలిసింది. ఆయన వెళ్ళి ఓసారి గుడికెళ్ళి వచ్చి బయటకి పిలిచి " చెన్నయ్యా! ఇరవై రూపాయలివిగో. తీసి దాచుకో. ధోవతులు తరవాత కొనచ్చు" అని చెప్పాడు.

బయటకి వచ్చిన కరణంగారు 'నాకుడబ్బక్కర్లేదండీ, పంచల చాపేకావాలి' అన్నారు.

దేవరపయ్యగారు నంజమ్మ నవతలకి పిలచి చెప్పారు. "అమ్మా ఓపని చేయండి. పెళ్ళికొడుక్కని తెచ్చిన పంచలచాపు ఈయనకివ్వండి. మేము పెళ్ళికొడుక్కి చదివించడానికో చాపు రాజామిల్లు పంచలు తెచ్చాం. అవిస్తాను. అవే పెళ్ళికొడుక్కివ్వండి. మీరిలాంటివెందుకు తెచ్చారు. ఎందుకు పెట్టారు, అని అడిగే కుర్రాడు కాడు."

కానీ ఆయన వాలకం చూడండి మావయ్యా! ఇలా చెయ్యచ్చా? మనకైనా మర్యాదక్కర్లే? తరవాత, ఒక రోజు కాకపోతే ఒక రోజు మా అమ్మాయిని "మిల్లు పంచలతో కన్యాదానం చేశారు మీ ఇంట్లో" అని వేళాకోళం చేస్తే దాని మనస్సు చిన్నబుచ్చుకుంటుంది."

"అమ్మా! వాడలాంటివాడు కాడు. ఒకవేళ అన్నా ఏం చేస్తాం మరి సహించాలి. నీ మొగుడి విషయమంతా వాడికి నేను చెప్పాను. ప్రపంచంలో ఎలాంటెలాంటి వాళ్ళో వుంటారు. ఇప్పుడిదొకటే దారి. నేను చెప్పినట్టు చేసెయ్"

నంజమ్మ వెళ్ళి, పెళ్ళికొడుక్కని తెచ్చిన పంచలు తెచ్చి మొగుడి ముందెట్టి- "లేవండి, కట్టుకోండి" అంది.

"చాపా! ఒంటిపంచా?" - చెన్నిగరాయలడిగాడు.

"రెండూ వున్నాయి. భయపడకండి"

చెన్నిగరాయలకి తృప్తి కలిగింది. లేచి,అందులో ఒకటి కట్టుకుని మరోటి పైన వుత్తరీయంగా కప్పుకున్నారు. ఇప్పుడు తన కోరిక తీరింది. పెళ్ళాం మీద కోపం పోయింది. కట్టడానికి 'కలాపత్తు' పంచలొచ్చాయి. పెళ్ళయ్యేసరికి ఆవిడ తనకని ప్రత్యేకంగా పిండివంటలుంచేదో లేదో! బుట్టనిండా అవి కూడా తన భోషాణంలో భద్రంగావున్నాయి. యుద్ధంలో జయించినవాడిలా అతడు పెళ్ళిపందిట్లోకి వచ్చాడు.

పెళ్ళికూతురు తండ్రి కొత్త 'కలాపత్తు' ధోవతి, పెళ్ళికొడుకు మామూలు రాజా మిల్లు పంచ కట్టుకుని, కన్యాదానం మరే విఘ్నమూ లేకుండా జరిగిపోయింది. కన్యాదాన సమయానికి సరిగ్గా సైకిల్ మీద వచ్చిన రెవెన్యూ ఇన్స్పెక్టరు వరుడు, మామగారు కట్టుకున్న పంచలు చూచి, కాసేపయ్యాక దేవరసయ్యను పిలిచి అదేమిటని అడిగారు. ఉన్న విషయం చెప్పకుండా ఆయన అవి చెన్నిగరాయల పెళ్ళిలో పెట్టిన పంచలని కప్పిపుచ్చారు.

కన్యాదాన సమయానికి సరిగ్గా ఇంటి ముందు సవారీ బండొకటి వచ్చి ఆగింది. అందులోంచి దిగిన అక్కమ్మను చూచిన రామణ్ణ పరుగెత్తుకెళ్ళి అమ్మతో

చెప్పాడు. అందాకా ఏదో మూగవేదన అనుభవిస్తున్న నంజమ్మ కెంతో వూరట కలిగింది. తిన్నగా ఇంట్లోకి వెళ్ళిన అక్కమ్మ "నువ్వెళ్ళకూడదంటే వెళ్ళకూడదని కంటీ, కల్లోళు. ఇద్దరూ అన్నారు. నా ముని మనవరాలిపెళ్ళి, నేను వెళ్ళే తీర్తాను అని పట్టుపట్టి వచ్చేశాను. అప్పుడే కన్యాదానమవుతోంది. "తీసుకో, దీన్ని పార్వతికి చదివించు" అని బొడ్డులోంచి ఒక బంగారపు చేమంతిపూవు తీసిచ్చింది. అది అక్కమ్మ ముత్తైదువుగా వున్న రోజుల్లో పెట్టుకుంటున్న నగ. ఇంతదాకా ఏలాగో దాచి వుంది. లోపలికెళ్ళి ఎర్రమడి చీర కట్టుకుని కూర్చుంది. తనలాగే మడి చీర కట్టుకుని కూర్చున్న గంగమ్మ ఈమెతో మాట్లాడలేదు. అక్కమ్మ కూడా పలకరించలేదు. తలుపుచాటు గుండా కన్యాదానాన్ని చూస్తున్న అక్కమ్మ, నంజమ్మ ఏదో పనిమీద లోపలికొస్తే, ఆమెకు మాత్రమే వినిపించేలా "మంచి పనే చేశావు నువ్వు. కుర్రాడు రాజకుమారుడులా వున్నాడు. ఇంగ్లీషు బడిలో మాసా ర్రంటే సామాన్యమామరి? ఇంకా చిన్నవయస్సు. చిన్నపాప వుంటే ఏమి?" అంది.

కన్యాదానమయిపోయింది. సూర్యనారాయణ కూతురు రత్న విశ్వంతో ఆడుకుంటోంది. రత్న ఇప్పుడెలాగూ సొంతమక్క కూతురే అవుతుంది. "వాళ్ళిద్దరికీ ఇప్పుడే పెళ్ళి చేసేద్దాం" – అని వెంకటేశయ్య మాస్టారన్నప్పుడు విశ్వనాథుడు సిగ్గేసి పాపతో ఆడుకోవడం మానేశాడు. "ఈరోజే చేయండి దాన్నిక్కడే వదిలేసి వెడతాను," అన్నాడు సూర్యనారాయణ.

రేపు నాగవల్లి జరగాలి. పెళ్ళిరోజు సాయంత్రం మాస్టారు, ఆయన భార్య నంజమ్మను రహస్యంగా పిలిచి అడిగారు. "నంజమ్మగారు! మీరు మరోలా అనుకోకండి అమ్మాయి పెద్ద మనిషయిందని పెళ్ళికొడుకు వాళ్ళకెలాగు తెలుసు."

ఆ మాట వినగానే నంజమ్మ కంగారుపడ్డది. మాస్టారన్నారు. "కంగారుపడక్కరలేదు. సూర్యనారాయణ తిపటూరు, తుమకూరులాంటి పెద్ద వూళ్ళు చేసినవాడు. బ్రైనింగుకని మైసూరికి కూడా ఒక సంవత్సరమెళ్ళాడు. పెద్ద పెద్ద వూళ్ళల్లో పదహారు పదిహేడేళ్ళయ్యాకే పెళ్ళి చేస్తున్నారు. నాగవల్లి అయ్యాక మరుసటి రోజు కార్యం కూడా చేసి పంపుతారు. బెంగుళూరిలో అయితే పెళ్ళి, నాగవల్లి, కార్యం అన్నీ ఒకేరోజు చేస్తారట. నాకు సూర్యనారాయణే చెప్పాడు. రేపునాగవల్లిజరుగుతుంది. రేపురాత్రికార్యం ఏర్పాటుచేసి, అల్లుడి వెంట అమ్మాయిని పంపితే తీసుకెడతారు. మళ్ళీ మీరు దానికి ప్రత్యేకంగా డబ్బు ఖర్చు పెట్టాలి. ఇప్పుడు పనిలో పని. అది కూడా అయిందనిపిస్తే మంచిదనుకుంటాను.

కావలిస్తే రేపు నేను కంబనకేరివెళ్ళి రెండుకుట్టినపక్కలే పట్టుకొస్తాను" అన్నారు.

అంటే కూతురును వెంటనే తమ ఇంటినుంచీ పంపించేయాలే అని ఆమె మనస్సు కొట్టుమిట్టాడింది. దానికన్నా మరో కారణం వల్ల భయమేసింది కూడా. అమ్మాయి పెద్ద మనిషయిందని ఇందాకా ఎవళ్ళతోటీ అని వుండలేదు. ఈజోస్యులో, మరెవళ్ళో పెళ్ళికొడుక్కి ఈ సంగతి చేరవేసి వుండచ్చు. అతడు దీన్ని తప్పుగా తీసుకుని దెబ్బలాడలేదు. అదృష్టమే. ఇప్పుడు కార్యం చేస్తే అమ్మాయి పెద్ద మనిషయిందని తానొప్పుకున్నట్టవుతుంది. దాన్నిన్నిరోజులూ దాచిందని అందరికీ తెలుస్తుంది. తెలిస్తే ఏమిటి? అన్న భావం కన్నా తెలియరాదన్న భీతితో కూడిన పాతభావమే ఆమె హృదయాన్ని ఆక్రమించింది. ఇప్పుడున్న పళంగా దాన్ని మార్చడం సాధ్యం కాదు. పెళ్ళయిన రెండు మూడు నెలలకోనాడు పార్వతి పెద్ద మనిషయిందని ప్రకటించి బయట కూర్చోబెట్టి, ఆచారం మేరకు నలుగురు ముత్తైదువులను పిలిచి హారతి ఇచ్చి, పదహారవరోజు శోభనం చేసి పంపాలన్నదే ఆమెకు తెలిసిన వ్యావహారిక వివేకం. ఉన్న పళంగా దాన్ని మార్చుకోలేక "చూడండి, అమ్మాయి పెద్దమనిషయిందన్నమాట నిజమే. పెద్ద పట్టణాల్లో అల్లా వేస్తారని మనం చేస్తే ఇబ్బందులుంటాయి. ఈ వూళ్ళో వున్న జోస్యుల సంగతి మీకు తెలియంది కాదు. మా ఇంటాయన స్వభావమూ మీకు తెలుసు. ఆయన పిచ్చిపిచ్చిగా మాట్లాడే అవకాశం లేకపోలేదు. నేనాయనకూ తెలపలేదు. మూణ్ణెల్లల్లో చేసేద్దాం" అంది.

"అలాగే చేయండి. సూర్యనారాయణ బలవంతం చేయలేదు. వూరికే మీకెందుకు రెండు ఖర్చులన్నాడంతే. అయినా అతనికి ఇంకా మూణ్ణెల్లు చేతులు కాల్చుకుని, పాపని చూసుకుంటూ వుద్యోగం చెయ్యడం కష్టం."

"పాపని మా ఇంట్లో వదిలిపెట్టి వెళ్ళమని చెప్పండి"

ఇక్కడి పరిస్థితులన్నీ వివరించి చెప్పేసరికి సూర్యనారాయణ అంగీకరించాడు. అతనికి పల్లెటూరి పరిస్థితులు బాగా తెలుసు. కాని పెళ్ళయిన వెంటనే తన కూతురిని వదిలిపెట్టిపోవడమూ అభిమతంగా లేదు. అది లౌకికం కాదనుకున్నాడు.

మరనటిరోజు నాగవల్లి అయ్యాక పెళ్ళికూతురి అప్పగింతలప్పుడు వంజమ్మ అక్కమ్మలతోపాటు రామణ్ణ కూడా కంటతడిపెట్టాడు. వాళ్ళిద్దరూ కూడా పెరిగనవాళ్ళు. అన్యోన్యత ఎక్కువ. అన్నీ తెలిసి వున్నా అమ్మ దగ్గిరకెళ్ళి "అమ్మా! పార్వతి మన ఇంట్లో మంచీ వెళ్ళిపోతుందా?" అన్నాడు.

"ఆడపిల్లలంతే కదా బాబూ?" అమ్మ అంది.

ఎందుచేతో ఏమో అప్పణ్ణయ్యకూ ఏడుపొచ్చింది. అతడు వీళ్ళింటి కింతదాకా ఎక్కువగా రానేలేదు. పార్వతితో ఎక్కువగా మాట్లాడేవుండలేదు. ఆవిడ కూరపాదులకు నీళ్ళుపోస్తుండగా, "నాకు కాస్త తోటకూర ఇస్తావేమే?" అని ఎప్పుడయినా అడిగేవాడు. "మీకెంత కావాలో మీరే తీసుకోండి బాబాయ్" అని ఆవిడనేది. ఇది మినహాయించి, చిన్నాన్న కూతురికి ఎలాంటి మాటా మంతీ వుండేది కాదు. ఇప్పుడెంచేతో, తానైతాను వచ్చి పెళ్ళింట్లో పనులన్నీ చేశాడు. నంజమ్మను మినహాయిస్తే, ఇక్కడ రాత్రింబవళ్ళూ కంటికికునుకు లేకండా పనిచేస్తున్నది అతడొకడే. ఏమేమి చేయాలో వదినగారు, మాస్టారుభార్య, అక్కమ్మ, ఒకోసారి జోస్యులు చెప్పేవారు. అన్నపు తప్పేలాలు వండి వార్చేది మొదలు, ఎంగిలి విస్తళ్ళెత్తి, గోమయంతో అలికి, పెళ్ళికొడుకు వాళ్ళ విడిదిలో కాగుకు నీళ్ళు తోడి నింపేదాకా అన్ని పనులు, డబ్బిస్తే చేసే పనిమనిషి కంటే ఎక్కువగా చేసేవాడు. పెళ్ళికూతురు నప్పగించాక, పార్వతి కాళ్ళకు నమస్కారం చేసినప్పుడు అతడి కళ్ళంబట నీళ్ళు కారి టపటప ఆవిడ తలమీద పడ్డాయి.

మరుసటి రోజు పెళ్ళికొడుకు వాళ్ళని సాగనంపుతూ అమ్మవారి గుడి దాకా వధూవరులను చేతులు పట్టుకుని నడిపించుక తీసుకెళ్ళారు. ముందు బాజా బజంత్రీలు , వెనకాల అందరితో పాటు నంజమ్మ రత్నాన్నెత్తుకుని నడుస్తోంది. గ్రామదేవతకు పూజయ్యాక నమస్కారం చేసి బండి దగ్గరకొచ్చాక పెళ్ళాం చేయి వదిలేముందు, మెల్లిగా నొక్కి ఆవిడకు మాత్రమే వినిపించేలా సూర్యనారాయణ చెప్పాడు- "ఇహ మూణ్ణెల్లకొచ్చి తీసుకెడతాను." శ్వాసోద్వేగంతో కంపించి పోతూ తలవంచుకున్న పార్వతి ఏమీ మాట్లాడలేదు. ఆవిడేమయినా అంటుందని అతడెదురు చూడనూ లేదు.

అతడు, అత్తకు, మామకు, చిన్నమామకు, పురోహితులకు, వెంకటేశయ్యమాస్టారుకు, మాదేవయ్యగారికి నమస్కారం చేశాడు. అతనికి మాదేవయ్యగారికీ ఈ స్వల్పకాలంలోనే కాస్త పరిచయమేర్పడింది. కొంత ఆత్మీయత కూడా పెరిగింది. పార్వతి కూడా పెళ్ళికొడుకు వేపు వాళ్ళేకాక తనవేపు వాళ్ళూ అయిన దేవరయ్యగారికి ఆయన ఇంటివాళ్ళకి దండం పెట్టాక, వాళ్ళంతా బండెక్కారు. తిమ్మలాపురానికి వెళ్ళి అక్కడ పదహారువాళ్ళ పండుగ చేసుకుని సూర్యనారాయణ బొంబాయి వెళ్ళాలి.

# 13వ అధ్యాయం

పెళ్ళి దేముడి దయవల్ల సుఖంగా జరిగిందని నంజమ్మకు పట్టరాని సంతోషం. తనకు చేదోడువాదోడుగా సహాయం చేసినవాళ్ళనంతా ఒకటికి పదిసార్లు తలుచుకుంది. పెళ్ళికొడుకువేపు చాలా మంది రానందున బియ్యం, పప్పులు, మిరప్పొడి, మొదలైన సరుకులెన్నో మిగిలిపోయాయి. అవి మొగుడికంట పడితే రోజూ అన్నం, పప్పు, చారు, పులుసు చేయమని ప్రాణంతోడేస్తాడు. ఎలాగూ మూణ్ణెల్లల్లో కార్యం చేసివ్వాలి. దానికి పనికొస్తుందని అన్నీ తీసిదాచింది. మిగిలిపోయిన సగం డబ్బునూనె కూడా మూతెట్టి కంటిక్కనిపించకుండా దాచింది. కార్యానికి మహాఅయితే పాతికరూపాయల సామాను కావాలి. పడకలు కుట్టిస్తే యాభైరూపాయలు కావచ్చు. అమ్మాయి కివ్వడానికి పాత్రలో! అత్తయ్య గంగమ్మ ఇంట్లో తానుతెచ్చినవే బోలెడన్ని వున్నాయి. కాని అవి వచ్చే మార్గం లేదు. కొత్తవి కొనాలంటే డబ్బులేదు. తన ఇంట్లో వున్న వాట్లో కొద్దిగా ఇచ్చిపంపాలి. తరువాత సాధ్యమయినప్పుడు కొద్దిగా కొనవచ్చు. పాత్రలు గీత్రలు ఇవ్వలేదని దెప్పిపొడిచే రకం కాదు సూర్యనారాయణ.

పార్వతి చేతులనిండా వల్లగాజులు వేసుకుంటుంది. మెడలో నల్ల పూసలు, చెవిలో పెద్దవి తెల్లరాళ్ళదిద్దులు, నాగవల్లి రోజే కుట్టిన ముక్కుకు ఆవిడ భర్తే తెచ్చిన తెల్లరాళ్ళ బేసరి కొత్తగా కుట్టించుకున్న ముక్కుకు బరువుగా వుంది. ఆవిడ ముఖంమింత విశాలమయిందని దుద్దులు, 'బేసరి' పెట్టేదాకా నంజమ్మకు కూడా తెలియలేదు. కాళ్ళకు మట్టెలు.

"పార్వతమ్మెంత అందంగా అగుపిస్తోందో!" అని ఒకరోజు వీళ్ళింటికి వచ్చిన సర్వక్కే "పచ్చి ఒళ్ళు. ఒక్కత్తినీ చెరువుకాడికి పంపకండేం నంజమ్మగోరూ!" అని హెచ్చరించింది.

"దుద్దులు, బేసరి పెట్టుకున్నాక అక్కయ్యచాలా అందంగా కనిపిస్తోంది. రెవెన్యూ ఇన్స్పెక్టరు భార్యలాగా చేతులకి బంగారు గాజులు వేసుకుంటే ఇంకా

అందంగా వుంటుంది కదమ్మా?" అని రామణ్ణ అడిగేసరికి "నువ్వు రెవెన్యూ ఇన్‌స్పెక్టరయినప్పుడవీ చేసి వేద్దాంలేబాబూ" అంది నంజమ్మ.

పార్వతికి అంతే, అద్దంలో చూసుకుంటే ఏదో కొత్తదనం కనిపిస్తోంది. రెండు మూడునెలల్లో పుట్టింటినుంచీ వెళ్ళిపోవాలన్నది గుర్తొచ్చి వెంటనే ముఖం వాడిపోతోంది. ఒకరోజు నంజమ్మ చెప్పింది." "చిట్టీ నీ మొగుడు చాలా మంచివాడు. ఇంత కలిసికట్టుగా సర్దుకుపోయి ఎవరు చేసుకుంటారు పెళ్ళి. వంటావార్పూ, ఇంటిపనులు - అన్నీ నీకు బాగావచ్చు. నీ మొగుడికి సంతోషంగానే వుంటుంది. తల్లిలేని పిల్ల కంటతడిపెడితే ఆ పాపం మనకూ తగులుతుంది".

"నేవలా చేస్తానా అమ్మా?" - కూతురడిగింది.

"పిల్ల ముద్దుగా అందంగా వుంది. తరువాత మన విశ్వానికే చేసుకోవచ్చు కదమ్మా?" రామణ్ణ అడిగాడు.

నంజమ్మ అంది "వీడొక్టి అల్లరివెధవ. తిన్నగా చదివి హైస్కూలైనా పూర్తిచేయకపోతే పార్వతి భర్త పిల్లనిస్తారా?"

" లేదమ్మా! అల్లరికుర్రాళ్ళకే బుద్దెక్కువని మా హెడ్‌మాస్టరే చెబుతూవుంటారు.

"అయితే నువ్వింత సాధువైకూడా తరగతి కంతా ఫస్టు ఎలా వస్తున్నావు?" అక్కయ్య అడిగింది.

"అల్లరి వాడయితే ఇంకా ఎక్కువ మార్కులొచ్చేవేమో" - తమ్ముడు సమాధానం చెప్పాడు.

ఈ చర్చ జరిగేటప్పుడు విశ్వం మాదేవయ్యగారి గుడిలో బెల్లపుకుండలో చెయ్యెట్టి వెదుకుతున్నాడు.

పెళ్ళై అప్పుడే నెలరోజులు గడిచింది. సూర్యనారాయణ తన క్షేమ సమాచారాన్నితెలుపుతూ తీర్థరూపులైన మామగారికి ఉత్తరం కూడా వ్రాశాడు. నంజమ్మకొక విషయం గుర్తొచ్చింది. పార్వతిపెళ్ళి నిర్విఘ్నంగా జరిగితే గ్రామదేవత గుడికి చక్కెరపొంగలి, దద్ధోజనం చేయిస్తానని మొక్కుకుంది. గ్రామదేవత కాళమ్మ మొక్కుబడి చాలారోజులుంచుకోరాదని గుర్తొచ్చి, దాన్ని త్వరగా తీర్చుకోవాలనుకుంది. ఇంతకూ దానికెక్కువ ఖర్చుకూడా లేదు. ఇంట్లో బియ్యమున్నాయి, బెల్లముంది. కొబ్బరికాయలు, పెరుగు, అన్నీవున్నాయి. అమ్మవారికి ఒక రవికగుడ్డ. అదికూడా ఇంట్లోనే వుంది. ఎలాగూ ఎల్లుండి శుక్రవారం. బడికి సెలవు పెట్టమని రామణ్ణకు చెప్పింది. "అమ్మవారి గుడికి

వెళ్ళాలి ఇంట్లోనే వుండండి." అని చెప్పేసరికి చెన్నిగరాయలు వెంటనే ఒప్పేసుకున్నాడు. చక్కెరపొంగలి దద్ధోజనం ప్రభావం!

గంగమ్మ, అప్పణ్ణయ్య ఇప్పటికి వారం రోజులుగా వూళ్ళోలేరు. గండసి, దుద్దవేపు పల్లెలమీద వెళ్ళారు. శుక్రవారం గుడికి వస్తామని, అమ్మవారి పూజారి కాళనికి కబురెట్టింది నంజమ్మ. ఆ రోజు పెందరాళే లేచి నీళ్ళు కాచింది. స్నానం చేసి తాను మడి కట్టుకున్నాక పార్వతిని ,విశ్వాన్ని మడికట్టుకొమ్మంది. రామణ్ణ స్నానమయ్యాక చెన్నిగరాయలుస్నానాలగదిలో కెళ్ళాడు. మూడు సేర్ల బియ్యం వండి, బెల్లపు పాకంలో సగమన్నం కలిపి, పొంగలివండి ఏలకులు, కొబ్బెరవేసి, కడమసగానికి కొబ్బెరకోరు, కరివేపాకు, కొత్తిమెరవేసి తిరుగమోత పెట్టి, పెరుగన్నం కలిపి రెండు డేకిశాల నిండా నింపి మూతమూసి పెట్టింది. పసుపు, కుంకుమ, గన్నేరుపూలు, వేరువేరు పళ్ళాల్లో పెట్టి, పార్వతిని పెళ్ళిలో మొగుడు పెట్టిన ఎనభైరూపాయల చీరను కట్టుకొమ్మని చెప్పింది. పసుపురాచిన బుగ్గలు, అడ్డకుంకుమ, పలచగా దువ్విన వెంద్రుకలు, ముడిచిన పూలు, దుద్దులు, బేసరి, మట్టెలతో పెద్ద చీర కట్టుకుని పార్వతి పసుపు కుంకుమ పళ్ళెం ఎడమచేత్తో పట్టుకుని వీధిలో నడుస్తూవుంటే అందరూ ఆమెను చూసే వారే. వెంటవెడుతున్న నంజమ్మ, కూతురికి దృష్టి దోషం తగులుతుందేమో అని శంకించింది. నుదుట గోపిచందనం పెట్టుకుని, మడిగావస్తున్న రామణ్ణ రెండు డేకిశాలు పుచ్చుకుని వస్తున్నాడు. విశ్వం చేతిలో కొబ్బెర కాయ వుంది. చెన్నిగరాయలు చేతులూపుకుంటూ వెంబడిస్తున్నాడు.

పూజారి కాళడు వీళ్ళకోస మెదురు చూస్తున్నాడు. నంజమ్మ కూతుర్ని గర్భగుడిలోనికి తీసుకెళ్ళి అమ్మపాదాలకు పూజ చేయించింది. పసుపు కుంకుమ గన్నేరుపూలతోబాటు, గుడిముందున్న చెట్టెక్కి ఎర్రపూలు కోసి తెచ్చి పూజచేసినప్పు డంకణం వెడల్పు ఆవరించి కూర్చున్న అమ్మవారు ఎలాంటివాళ్ళనయినా మింగేచండిలా అగుపించింది. వీళ్ళు అమ్మవారి తొడమీద కొత్త రవిక గుడ్డ పరిచాక, పూజారి కాళడు పెద్దగా వత్తి వెలిగించి మంగళారతి ఇచ్చాడు. హారతి తీసుకున్నాక అందరూ నమస్కారం చేశారు. కాళనికి దక్షిణిచ్చి, తెచ్చిన నైవేద్యాలురెండు, రెండరటాకుల నిండా వాడికిచ్చి, కడమది పట్టుకుని బయటికి వచ్చారు. ఇంతలో ప్రసాదానికని వచ్చినవాళ్ళకంతా చెరోముద్ద పడేసి, గుడివెనకాల వున్న కోనేటివేపు వెళ్ళారు. నీటి ఒడ్డున కూర్చుని అందరికీ

అరిటాకుల్లో ప్రసాదం వడ్డించింది. చెన్నిగరాయలకు కూడా కడుపు నిండింది. నంజమ్మ తిన్నాక కూడా కాస్త ఇంటికి పట్టుకెళ్ళడానికి మిగిలింది. చెన్నిగరాయలక్కడనుంచే చెరువు కట్ట వేపు వెళ్ళాడు. తల్లీ పిల్లలు, మళ్ళీ దేవాలయానికి వచ్చి అరుగుమీద కాసేపుకూర్చుని, మరోసారి తలుపు కన్నంద్వారా అమ్మవారి దర్శనం చేసుకుని, గడపకు నుదురు తగిలేలా వంగి నమస్కారం చేసి ఇంటికి బయల్దేరారు. ఇంటికి వచ్చేటప్పుడుకూడా దారిలో ఆడాళ్ళు పిల్లలు - అందరూ పార్వతిని వింతగా చూసేవారే. కొందరాడాళ్ళు "- తల్లీ - కొత్తపెళ్ళికూతురు, పచ్చి ఒళ్ళు, పెద్దచీరకూడా కట్టించి ఎందుకు తీసుకొచ్చారు? దిష్టి తగలగలదూ" అన్నారు. అదికూడా సంభవమే అని నంజమ్మకు తోచలేదు.

ఆరోజు మధ్యాహ్నమింట్లో వంటచేయలేదు. గుడినుంచీ తెచ్చిన ప్రసాదమే మూడుగంటలకి చెరికాస్త తిన్నారు. ఇంటికి రాగానే పార్వతి తన పెళ్ళిచీర విప్పేసి మామూలుచీర కట్టుకుంది. నుదిటికి కుంకుమ, చెవిలో దుద్దులు, తలలోపూలు అలాగే వున్నాయి. ఆవిడకెందుకోమగతగా వుంది. చాపేసుకుని పడుకుని నిద్రపోయింది. రామణ్ణ ఇంట్లోనే కూర్చుని ఇంగ్లీషు పాఠం వ్రాసుకుంటున్నాడు. విశ్వం బడికి వెళ్ళాడు. చెన్నిగరాయలువెళ్ళి మాదేవయ్య గుడిలో అరుగుమీద పడుకున్నారు. నంజమ్మను చూడటానికి సర్వక్క వచ్చింది. చాపమీద పడుకున్న పార్వతిని చూడగానే తన కూతురు రుద్రాణి గుర్తొచ్చింది. తన మొగుడిలా చేసి వుండక పోతే - దానికీ పెళ్ళయి బిడ్డలయ్యేవారు కదా అని ఆవిడ మనసులోనే పరితపించింది.

కాసేపటిలో పార్వతికి మెలకువ వచ్చింది. ఆవిడ కళ్ళు కాస్త ఎర్రబడ్డాయి. "అమ్మా! చలి చలిగా వుంది. వేడిగా కాచుకుందామా అనిపిస్తోంది" - అని లేచి కూచుంది. అవి వేసవి సమీపిస్తోన్న రోజులు. ఇప్పుడేం చలి? నంజమ్మ దగ్గిరకొచ్చి నుదురుతాకి చూచింది. జ్వరం తగిలింది. చలిజ్వరం వచ్చింది.సర్వక్క వెంటనే అంది "నంజమ్మగోరూ! ఇయ్యాళమ్మాయి నెందుకు తీసుకెళ్ళారు. పెద్ద చీర కట్టుకుంది కూడాను, జనాలకళ్ళొకలా వుండవు. చీపురు పుల్లలంటించి దిష్టితీయండి".

నంజమ్మ పిడికెడు పుల్లలు తీసి, అంటించి, దిగదుడిచి మూలలో పడేస్తే అవి గట్టిగా చిటపటలాడుతూ మండి వెలిగి బూడిదయ్యాయి. "దిష్టేనండీ; చూశారా ఎట్టాగ చిటపడలాడేయో!" సర్వక్క తన వూహను సమర్థించింది. పార్వతి

కూర్చునే వుంది. సాయంత్రం సర్వక్కవెళ్ళాక నంజమ్మ వంటచేయటానికి లోపలికెళ్ళింది. కూర్చోలేక కంబడి కప్పుకుని పార్వతి పడుకుంది. రామణ్ణ తలగడ దగ్గిరే కూర్చుని ఆవిడ కేదో కాలక్షేపం చేస్తున్నాడు. ఆరాత్రి కావిడ చలిజ్వర మెక్కువయింది. వంటచేసిన పొయ్యిమీదే నంజమ్మ, జీలకర్ర, మిరియాలు, లవంగాలు, వేసి తులసి కషాయం చేసిచ్చింది. వెచ్చగాకప్పి పడుకోబెట్టింది. జవాలకళ్ళొకలావుండవు. పెద్దచీర కట్టుకొమ్మన్నదే తప్పయింది- అని తనలో తానమకుంది.

రాత్రంతా పార్వతికి జ్వరం కాస్తూనే వుంది. మధ్య మధ్య ఒళ్ళు కత్తిరించుకుపోతోంది అంటుంది. ముఖం గండరించి, కళ్ళెర్రగావున్నాయి. మరోసారి కషాయం తాగించింది. తెల్లారేసరికి పార్వతి ఒంటిమీద జ్ఞానం లేకుండా పడుకుని వుంది. నంజమ్మకుకూడా కాస్త నిద్రపట్టింది. తెల్లారి ఆవిడికి మెలకువ వచ్చేసరికి సూర్యుడు పుట్టాడు. పార్వతి జ్వరం కాస్త తగ్గినట్టున్నా బొత్తిగా వదలలేదు. ఒళ్ళంతా వూచ కోతలు కోసినట్టు సలుపుతోంది. "చాలా నొప్పిగా వుంది." - అంటూ పార్లుతూ వుంది. 'జ్వరం తీవ్రతకలా వుంది చిట్టీ. ఇప్పుడు జ్వరం తగ్గుతోంది. వెచ్చగాకప్పుకుని పడుకో. వేడినీళ్ళు కాస్తాను. తరువాత ముఖం కడుక్కుందువుగాని అని ఆవిడ ఎడమవేపుకి తిరిగి చూస్తే రామణ్ణ ఇంకా పడుకునే వున్నాడు. కోడికూసే ముందే లేచి, ల్యాంపు వెలిగించుకుని, కూర్చుని చదువుకునే వాడింకా పడుకునేవున్నాడు. "బాబూ! ఇంకా లేవలేదేరా?" అని అడిగేసరికి ముసుగు లోనుంచే 'చలిజ్వరం వచ్చిందమ్మా!' అన్నాడు. కంగారుగా దుప్పటి ముసుగు తీసి చూసింది. పార్వతి ముఖం లాగే వాడి ముఖం కూడా అయింది. కళ్ళెర్రబడ్డాయి. 'ఇద్దరికీ ఒకేరోజు చలి జ్వరమొచ్చింది. ఎందుకిలా జరిగింది? - అని ఆలోచిస్తూ ఆమెలేచి నీళ్ళగది కాగు కింద మంట వేసింది. వేడినీళ్ళతో ఇద్దరికీ తానే ముఖం కడిగింది. పక్కలు రెండూ చేర్చివేసి పడుకోబెట్టింది. మళ్ళీ కొంత కషాయం కాచి, దానికంటే ముందు బియ్యపు జావచేసి, వాళ్ళువద్దన్నా తాగించింది. చలిజ్వరం వస్తుంది. పోతుంది. కాని రామణ్ణ పరీక్షలు దగ్గిరికొస్తున్నాయి. పార్వతికి దిష్టయిందనవచ్చు. రామణ్ణ కెందుకువచ్చినట్టు? వాడు మడిగా అడ్డపంచపైన తుండుగుడ్డ కప్పుకునే గుడికి వచ్చాడు. వాడు కొత్తగా వడుగైన కుర్రాడు. మగకుర్రాళ్ళకు పచ్చి ఒళ్ళేమిటి? పెళ్ళిలో అంతగా చాకిరీచేశాడు. తరువాత రోజూ ఎండలో బడికి వెళ్ళొస్తున్నాడు.

ఇంకేం నెలలో పరీక్షలయిపోతే తరువాత వేసవి సెలవులొస్తాయి. ఒకటిన్నర నెల హాయిగా వుండచ్చు.

సాయంత్రానికి పార్వతి జర్వం మళ్ళీ హెచ్చింది. కళ్ళుమాత్రం గ్రామదేవత కాళమ్మ కళ్ళలా కణకణమండుతున్నాయి. రెండు చెవులలోనూ థళ థళ మెరిసే దుద్దులు, ముక్కుమీద ధగధగలాడే బేసరి - ఆవిడముఖాన్ని చూస్తే భయమేసేది. నంజమ్మ దుద్దులు, బేసరితీసి పెట్టెలో దాచేసింది. చీకటి పడుతూవుండగా పార్వతి అంది. "అమ్మో! నా కుడి తొడ దగ్గిర గడ్డ కట్టిందిలా వుంది".

పెళ్ళయ్యాక ఆవిడ అట్టే పనిచేయలేదు. ఎక్కడికీ నడిచి వెళ్ళలేదు. దేవాలయానికి నడిచివెళ్ళలేదు. దేవాలయానికి నడిచి వెళ్ళిరావటం వల్ల ఇలా జరిగిందేమో అన్న ఆలోచన నంజమ్మకు వచ్చింది. కానీ దేవాలయం వూరి ముందే వుంది. పదిమైళ్ళు నడిచినా అలుపు వచ్చే రకం కాదు పార్వతి. అయితే ఈః కాస్త నడిస్తే గజ్జల్లో గడ్డకడుతుందా? ఎలాగయితే అలాగవుతుందని ఆవిడే వుప్పుకాపడమిచ్చి, మరోమారు జావతాగించి, వెచ్చగా పడుకోబెట్టింది. రామణ్ణజ్వరం కూడా తగ్గలేదు. చడీచప్పుడు లేకండా పడుకున్నాడు. మాదేవయ్యగారి గుడి కెళ్ళి, భజనవిని రాత్రి ఎనిమిది గంటలకి చెన్నిగరాయలింటికి వచ్చారు. విశ్వం కాస్త ముందుగా వచ్చాడు. వాళ్ళిద్దరికీ మధ్యాహ్నం మిగిలిందే వడ్డించింది. నంజమ్మకు ఆకలిగాలేదు. అదీకాక నిన్నరాత్రికూడా నిద్దరలేక ఆవిడ కళ్ళుమూతలడిపోతున్నాయి. మరోసారి వాళ్ళ నుదుళ్ళమీద చేయివేసి చూసి, బాగాకప్పి, వాళ్ళిద్దరి దగ్గిరే తల వేపు పడుకుంది. కాసేపు నిద్దరరాలేదు. తరువాత ఒళ్ళెరగకండా వచ్చింది.

ఎప్పుడో రాత్రినిద్దరలో ఆవిడకోకల వచ్చింది. మొన్నటిరోజు వాళ్ళు గ్రామదేవత గుడికి వెళ్ళినప్పటి దృశ్యం అగుపిస్తోంది. అమ్మవారి ముఖం కూడా జ్వరమొచ్చిన పార్వతి ముఖంలాగే బూరటిల్లింది. ఆమె చెవుల్లో దుద్దులు ధగ ధగలాడుతున్నాయి. కళ్ళు చింతనిప్పుల్లా వున్నాయి. పద్మాసనం వేసుకుని, అంకణమంతా ఆవరించి కూర్చున్న అమ్మవారి రెండు తొడలమీదా, పార్వతి రామణ్ణ లిద్దరూ అప్పుడే పుట్టిన కవలపిల్లల్లా దిగంబరంగా పడుకున్నారు. దగ్గిరకెళ్ళి వాళ్ళిద్దరి ఒంటి మీదా కంబడి కప్పాలని తాను ప్రయత్నిస్తుంది. కానీ గర్భగుడిలోపలికి వెళ్ళడానికే సాధ్యంకావటంలేదు. తలుపులు తెరిచేవున్నాయి. ఎదురు గుండా ఏ అడ్డం అగుపడలేదు. కానీ ఆమెను లోపలరాకండా ఏదో

అవుతోంది. ఆమె ప్రయత్నం చేస్తూనేవుంది. "అయ్యో!" అని ఎవరో మూలిగినట్టయింది. కల అక్కడికే తెగిపోయింది. మెలకువయింది. మూలుగుతున్నది రామణ్ణ. సన్నగా వెలుగుతున్న లాంతరు పెద్దది చేసి, వాడి తలమీద చెయ్యెట్టి "ఏం బాబూ" అని అడిగింది.

"రెండు గజ్జల్లోను గడ్డలు కట్టాయమ్మా చాలా నొప్పిగా వుంది"

ఆవిడ గుండె గతుక్కుమన్నది. అయితే పార్వతికయింది సామాన్యమైన గడ్డకాదు. ఇవేమి కొంపతీసి ప్లేగు గడ్డలా ఏమిటి? కానీ చుట్టుపక్కల ఎక్కడా అవ్వూసే లేదే. వూళ్ళోకూడా ఎలికలుపడలేదు. దుప్పటి కాస్త తొలగించి రామణ్ణ గజ్జల్లో చేయెట్టి చూచింది. వాడికి కాస్త సంకోచం వేసినా, జ్వరం తీవ్రతలో కదలకండా పడుకున్నాడు. రెండువేపులా పనసపిక్క ప్రమాణంలో వుబ్బెత్తుగా వుంది. ఆమె చేయి తగలగానే వాడు 'హాఁ' అన్నాడు. ఏమిచేయాలో తోచకండా అయిదు నిమిషాలలాగే కూర్చుండిపోయింది. తరువాత మొగుడిదగ్గరకెళ్ళి, ఆయన బుజం కదిపి "ఇలా చూడండి పార్వతి, రామణ్ణలకిద్దరికీ తొడసందుల్లో గడ్డలు కట్టాయండీ. ప్లేగో గీగో కాస్త లేచి చూడండి". ఆమె మూడుసార్లు కదిపి, వూపి, పిలిచాక "రేపు పొద్దుట చూస్తేపోలా. నాకు నిద్దరొస్తోంది" అని ముసుగు మరింత బిగించాడు. వెళ్ళి మాదేవయ్యనయినా పిలుద్దామా అనిపించిందామెకు. ఒంటరిగా వెళ్ళటానికెందుకో భయమేసింది. చీకటంటే భయపడికాదు. కాని ఎందుకో భయంగా వుంది. పడుకున్న విశ్వాన్ని లేపి, "చిన్నబాబూ, అయ్యగారిని పిలుచకురావాలిరా, వెడదాము" అంది. కళ్ళు నలువుకుంటూనే ఠపీమని లేచి మంచుని వాడు 'నేనే తీసుకొస్తాను". అని తలుపు దగ్గరికెళ్ళి గొళ్ళెం తీశాడు. "బయట కన్నుపొడుచుకున్నా కనిపించని చీకటి. "నేనూ వస్తాను" అని ఆవిడ అనే లోపుగానే తలుపుతీసుకుని బాణంలా చీకట్లో దూసుకువెళ్ళాడు. అర్ధరాత్రి. వూరంతా నిశ్శబ్దంగా చచ్చినట్టు పడుకుంది.

కాసేపటిలో అయ్యగారు విశ్వం చేయట్టుగుని వచ్చారు. పిల్లలిద్దరి జబ్బూ వివరించి నంజమ్మ – "ఇది ప్లేగో ఏమిటో నాకుతెలీదు. భయంగా వుంది. మీరే చూడండి" అంది.

అయ్యగారిద్దరి చేతులు తాకి చూశారు. రామణ్ణ గడ్డలు చూశాక – "సాయంత్రం కరణంగారొచ్చారు. పిల్లలకి జబ్బుచేసిందని ఒక్కమాటయినాఅనలేదే" – అన్నారు.

"వాళ్ళకి జబ్బొస్తే ఆయనకేం?– ఇప్పుడు వీళ్ళ జబ్బేమిటి?"

"నిన్న హాయంత్రమే గుడిలో హొరకేరి గురవణ్ణ, కురబరహట్టి పుట్టయ్య, మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ వీధిలో ఎలికలు పడ్డాయట. రెండురోజులయిందట."

పై ప్రాణాలు పైనే లేచిపోయాయి నంజమ్మకు. నిర్ఘాంతపోయి కాసేపు గుండె ఆడనంతటిపని జరిగింది. రెండు నిమిషాలు స్తబ్ధంగా వున్న ఆవిడ, వున్న దున్నట్టుగా వెక్కి వెక్కి ఏడవటం మొదలెట్టింది. "తల్లీ! శాంతించాలి. నువ్వే ఇలా ఏడిస్తే చూసుకునే వాళ్ళెవళ్ళు"? - ఆయన మాటలతో ఆమె దుఃఖం చల్లారలేదు. "అయ్యగారూ! ఈ పాడు జబ్బు ప్లేగొచ్చాక ఎవరు బతుకుతారు? - "అంటూ గట్టిగా ఏడ్చేసింది. అమ్మ అన్నది రామణ్ణ విన్నాడు. వాడే - "అమ్మా! మందు పుచ్చుకుంటే నయమవదూ? ఎందుకేడుస్తావూరుకో" అన్నాడు. ఆవిడకి కాస్త ధైర్యం వచ్చినట్టయింది. పార్వతి కాపాటి మాట్లాడే ఓపికా లేదు.

అయ్యగారన్నారు - "ప్లేగు తగిలినా ఎంతోమంది బతికి బయట పడ్డారు. ఒక సారి తగిలితే మళ్ళీ తగలదట".

ఆమెకు కాస్త మనశ్శాంతి కలిగింది. అవును నిజమే. అన్నయ్య కల్లేశుకు ప్లేగు తగిలినా బతికాడుగా? అది గుర్తురాగానే మరింత భయం తగ్గింది. చెన్నిగరాయల గురక మినహాయించి అంతా నిశ్శబ్దంగా వుంది. విశ్వం పూరికే తన పక్కమీద కూర్చున్నాడు. "నువ్వెందుకు కూచున్నావు. పడుకోబాబు" - అని అయ్యగారే చెప్పి పడుకోబెట్టారు. కాసేపటిలో రామణ్ణకు కూడా ఒంటిమీద జ్ఞానం లేదు. ఇలాంటి సమయంలో అయ్యగారు లేచి తమగుడికి వెళ్ళడం భావ్యం కాదు. ఇక్కడ కూర్చుని ఏం మాట్లాడాలో ఎవరికీ బోధపడలేదు. అయినా తానూరికే కూర్చుంటేచాలు. నంజమ్మ కష్టకాలంలో, ఏదో ధైర్యం, ఏదో వూరట కలుగుందని ఆయనకు తెలుసు. అంచేతే కూర్చున్నాడు. కాసేపయ్యాక నంజమ్మ అంది, "అయ్యగారూ! ఈ రాత్రి నాకో కల వచ్చింది. దాంట్లో అమ్మవారిగుడిలో, అమ్మవారిలొడమీద రామణ్ణ - పార్వతీ ఇద్దరూ దిగంబరంగా పడుకున్నారు. వాళ్ళ మీద కంబళయినా కప్పుదామని నేను వెడితే గడపదాటి వెళ్ళడానికి అవలేదు. ఎదురుగుండా గోడలేదు. రాయిలేదు. ఏదో అడ్డుతున్నట్టనిపించింది. దీనర్థమేమి?"

"పిల్లలిద్దరూ అమ్మవారి తొడలమీద పడుకున్నారంటే ఆమె దయ చల్లగా వుందనేగా అర్థం? ఇప్పుడొచ్చింది అమ్మవారి జబ్బే. అయినా ఆమె కాపాడుతుందనే అర్థం".

నంజమ్మ మనస్సు కాస్త స్థిమితపడ్డది. 'అయితే నన్నెందుకు లోపలికి రానివ్వలేదు?"

అయ్యగారికేంజెప్పాలో తెలియలేదు. దేముడు రక్షించేపిల్లల దగ్గిర కెళ్ళేందుకు మనుష్యులకేం హక్కు అనికదా? - అన్న జవాబు మనస్సులో స్ఫురించినా దాన్ని పైకి చెప్పలేదు. దాన్ని గురించి నంజమ్మా ఆలోచిస్తోంది. ఏదో అశుభసూచన మనస్సులో కలుగుతోంది. కాని దాన్ని స్వీకరించడాని కంతఃకరణ మంగీకరించక, మరోరకంగా వ్యాఖ్యానించడానికే ప్రయత్నిస్తోంది. "నా తొడమీదున్న పిల్లల్ని తాకడానికి నీకేమధికారం? నా దగ్గిరుండేదాకా వాళ్ళు క్షేమంగానే వుంటారని కదా దాని అర్థం?"

"అవును తల్లీ"

"అయ్యగారు! అయితే వీళ్ళకి మనం మందివ్వక్కరలేదా?"

"ఇవ్వకపోతే ఎలాగ?"

" నా తొడమీదున్న పిల్లలికి నువ్వెందుకు మందిచ్చావని అమ్మవారు కోపగించుకుంటే?"

అదికూడా ఆలోచించదగ్గ సమస్యే. మందివ్వాలా అక్కరలేదా అన్న ప్రశ్న ఇద్దరినీ కాసేపు బాధించింది. చివరికయ్యగారన్నారు. "తల్లీ, గజ్జి వచ్చినప్పుడు, నాగరాజుమ కొలిచారు? నయమయిందా? నువ్వెళ్ళి సూదిమందు వేసుకున్నావుగా? ఇప్పుడూ అలాగే చేయాలి. రేపే డాక్టర్ని పిలవాలి. లేక బండికట్టుకుని కంబనకెరె వెళ్ళాలి".

అదే మంచిదని ఆమె అంగీకరించింది. వెంటనే వెట్టిని పిలిచి, ఓ బండికేర్పాటు చేయనా అని అడిగితే అయ్యగారు - " ఇంత జ్వరంలో వీళ్ళని బండిమీద తీసికెళ్ళడం మంచిదికాదు. డాక్టర్నే ఇక్కడికి పిలిపించాలి. బండి కట్టించి పంపండి. కావలిస్తే నేను బండితోపాటు వెళ్ళొస్తాను"

కోడికూసేదాకా అలాగేకూర్చుని, తరువాత అయ్యగారే వెళ్ళి వెట్టిని తీసుకొచ్చారు. వాడెళ్ళి, రూపాయిన్నరకి అద్దెబండి ఏర్పాటు చేశాడు. సూర్యోదయానికి ముందే, మాదేవయ్యగారు దానిలో కూర్చుని కంబనకెరె వెళ్ళారు.

తెల్లారేసరికి పిల్లలిద్దరికి జ్వరం మరీ ఎక్కువయింది. పార్వతికి కుడితొడలో గడ్డ కట్టడమేకాక ఇప్పుడు రెండు చంకలలోను నొప్పి మొదలెట్టింది. ముఖమంతా

బూరుటెల్లి చూడటానికి భయంకరంగా మహామారి ముఖంలా వుంది. సగం మెలకువలో సగం నిద్రలో మగతగా పడుకుంది. వేడిగా జావ తాగిద్దామని దగ్గరకొచ్చి కుదిపేసరికి కాస్త మెలకువ వచ్చి "కాళ్ళు చేతులు లాగుతునానయి" అంది.

"జ్వరానికలా వుంది చిట్టీ! కాస్త జావతాగు. సర్దుకుంటుంది"

"వద్దు ......."

"లేకపోతే ఒంట్లో మరీ నీరసమవుతుంది....తాగు మాతల్లివికదూ. తల్లిమాటకు జవాబు చెప్పకుండా నోట్లో పోసిందాన్ని గుటకేసిమింగి పడుకొని కళ్ళుమూసుకుంది. రామణ్ణను లేపినప్పుడు వాడికి బాగా ప్రజ్ఞవుంది. వాడే "అమ్మా డాక్టరెన్ని గంటలకొస్తారు" అని అడిగాడు.

'తొమ్మిది పదిగంటలకి రావచ్చు"

"వస్తారో రారో! ప్లేగున్న వూరికి రావటానికి డాక్టరు భయపడతారు. ఇప్పుడున్నది, మొదట వున్న డాక్లరుకాదు.

"చూద్దామాగు"

తల్లిమాట మేరకు వాడుకూడా జావతాగి పడుకున్నాడు. వాడి గడ్డలు రెండు మరింత నొప్పిగా వున్నాయి. మధ్య మధ్య వాటిబాధ ఓర్చుకోలేక "అ ‹...... అ ‹........ అంటున్నాడు. తెల్లారిలేచి చెరువు వేపు వెళ్ళిన చెన్నిగరాయలింకా ఇంటికి రాలేదు. విశ్వానికేమి చేయాలో, తెలీదు,, వూరికే అమ్మవెనక వంటింట్లో నుంచి నడవలోనికి, నడవలోంచి వంటింట్లోనికి తిరుగుతున్నాడు. అంతలో బేలూర డప్పువాయిస్తూ, ఏదో చాటింపు చేస్తున్న శబ్దం వినపడ్డది. నంజమ్మ పంచటరుగు దగ్గిర కెళ్ళి నుంచుంది. దూరం నుంచి 'డమ్మ డక్క డమ్మ డక్క' అని డప్పు వాయించుకుంటూ వచ్చిన బేలూర వీళ్ళింటి సందుమూలలో నుంచుని డప్పువాయించటమాపి, గట్టిగా, "వూరికి పిళేగమ్మ వొచ్చిందది. అందరూ వూరొగ్గేసి సెట్లేసుకుని ఎల్లిపోవాలని పంచాయతీ చేశారు. వచ్చే సుక్రారం లోపుగా అందరూ వూరొగ్గేయలోహో ... వూరొగ్గేయాలోహో ...... సుక్రారంలోపుగా ..... " అని అరుస్తూ డమ్మ 'డక్క డమ్మ డక్క' అని మళ్ళీ డప్పువాయించుకుంటూ ముందుకెళ్ళాడు.

వూరికి ప్లేగు వచ్చినట్టు నంజమ్మకు నిన్న అర్ధరాత్రి దాకా తెలీదు. బహుశః తన యింటికే మొదట వచ్చిందేమో! గ్రామదేవత మొక్కుబడి చెల్లిద్దామని

పార్వతిని తీసుకెళ్ళాను. కొత్త పెళ్ళికూతురెంతో అందంగా వుంది. అమ్మవారికి దానిమీదే మొదట కన్నుపడ్డదేమో! కానీ గ్రామదేవత కాళమ్మా, ప్లేగు సుంకలమ్మా వేరు వేరు కదా? వూళ్ళోకి సుంకలమ్మ మారి రాకండా ఆపడానికి కదా గ్రామదేవత వుండేది. వూళ్ళో అందరికంటే ముందు పార్వతికే ఎందుకు రావాలి? దాని తరువాత దాని తోబుట్టువు రామణ్ణకూ వచ్చింది. ఇదంతా నిజమా? అబద్ధమా? పాడు ప్లేగు, రెండేళ్ళకోసారి ,మూడేళ్ళకోసారి ఎందుకురావాలి? దీన్ని బాగుచేసే మందేలేదా? - ఈ చివరిప్రశ్న వెనువెంటే మందు తప్పకుండా వుంది. డాక్టరు వస్తే తప్పకుండా నయం చేస్తారు. త్వరగా షెడ్డువేసుకుని వూరొదిలి పోవాలి" అన్న వూహ కూడా కలిగి ధైర్యం తెచ్చుకుంది.

పదకొండు గంటకు అయ్యగారు బండ్లో తిరిగొచ్చారు. డాక్టరు రాలేదు. కంబనకెరె వేపు కూడా ఎలికలు పడుతున్నాయట. అక్కడంతా ఇనాక్యులేషన్ చేస్తున్నారట డాక్టర్. ఇప్పుడు రావటానికి వీల్లేదు రోగుల్నే ఇక్కడికి తీసుకురండి అన్నారు".

"జ్వరం పేలిపోతోందే! వీళ్ళనెలా తీసుకెళ్ళడం అయ్యగారూ?"

"బండి కెలాగు సవారీ వుంది. మెత్తగా వరిగడ్డిపరిచి, మీదపక్కపరిచి, పడుకోబెట్టి తీసికెల్దాం, మరేంచేద్దాం?"

నంజమ్మ ఆలస్యం చేయలేదు. బండాడు గడ్డితెచ్చి పరిచాడు. దాని మీద నంజమ్మ పక్కవేసింది. మరోసారి జావకాచి ఇద్దరి చేతా తాగించింది. బండాడు, అయ్యగారు కలిపి పిల్లల్ని ఒకొళ్ళొకళ్ళనే తీసుకొచ్చి బండ్లో పడుకోబెట్టి కంబడి కప్పారు. తాను కూడా బయల్దేరాలా అక్కరలేదా అని కాసేపాలోచిస్తున్న చెన్నిగరాయలు చివరికి బయల్దేరాడు. విశ్వాన్ని మాస్టారింట్లో వుండమని చెప్పి బండిలో పిల్లల తలవేపు ముందర కూర్చుంది. అయ్యగారు, చెన్నిగరాయలు బండి వెనకాలే నడిచి వెళ్ళారు.

గతుకుల దారిలో అటూ ఇటూ వూగుతూ, తూలుతూ, కబ్బళ్ళియుగ ఎక్కదిగి, గొడవకొప్పలుదాటి, బ్రహ్మజెముడు పుంతలోసాగి బండి కంబనకెరె చేరేసరికి మధ్యాహ్న మొంటిగంట అయింది. డాక్టరు అప్పటికే ఇంటికి వెళ్ళారు. బండి ఆసుపత్రి ముందే ఆపి, పిల్లల్ని చూస్తూ వుండమని చెన్నిగరాయలకు చెప్పి, నంజమ్మ అయ్యగారితోపాటు డాక్టరింటికేవెళ్ళింది. భోంచేసి, విశ్రాంతి తీసుకుంటున్న ఆయన మొదట కాస్త విసుక్కున్నా, తాళం చెవి తీసుకుని

ఆసుపత్రి కొచ్చారు. రోగుల్ని బండ్లోనే పరీక్షించి, "రోగమింత ముదిరేదాకా ఎందుకూరుకున్నారు" అని అడిగారు.

"మాకు తెలవనేలేదు సర్, గడ్డకట్టిందే నిన్న రాత్రి నిన్నపగలంతా పట్టి చలిజ్వరమనుకున్నాం".

"ఇప్పుడు ఇనాక్యులేషన్ చేయరాదు. మందిస్తాను. తీసుకుని వూరికెళ్ళండి. సీసాతెచ్చారా?"

"లేదండి, మాకేమీ తోచలేదు"

"ఆసుపత్రి అన్నాక సీసాలేకుండా వస్తే ఏంచేయాలి?" - అని అంటూ ఆయన ఆసుపత్రి తలుపుతెరిచి, ఒక ఖాళీసీసా నిండా మందునింపి ఇచ్చారు. "ఇద్దరికీ రోజుకు మూడుపూటల చొప్పున తాగించండి. ఎల్లుండి మళ్ళీరండి" అన్నారు.

ఆయన మరేమీ చెప్పలేదు. వీళ్ళకేమడగాలో తెలియలేదు. బండి నొగలెత్తి ఎడ్లు పూన్చి వూరికి బయల్దేరారు. మళ్ళీ గతుకుల దారిలో కుదుపుల్తో బండి వూరు చేరుకునే సరికి సాయంత్రం నాలుగున్నరయింది. ఇంటికి వచ్చి చూస్తే విశ్వం మాష్టారింటికి వెళ్ళనేలేదు. తలుపు తీసుకుని, ఇంట్లోనే, చాపమీద పడుకున్నాడు. తెల్లారి నంజమ్మ చేసిచ్చిన రొట్టెమినహా వాడి కాహారం లేదు. అదీకాక వాడి ఒళ్ళుకూడా వూచకోతలు కోసినట్టు సలుపుతోంది. కొద్దిగా జ్వరం కూడా తగిలింది. కళ్ళు ముఖం చూడగానే నంజమ్మ పరుగెత్తుకొచ్చి నుదురు తాకి చూసింది. వాడికీ రోగం తగిలింది. కూర్చుని వాడిముఖాన్ని తన గుండెకదుముకుని గట్టిగా ఏడవటం మొదలెట్టింది. "అయ్యగారు! ఈ పాపిష్ఠిమారి నా పిల్లల్నందర్నీ లాక్కెళ్ళాలని వొచ్చింది. ఇలా చూడండి. విశ్వానికి జ్వరమొచ్చింది"

పార్వతి, రామణ్ణ ఇద్దరూ బండ్లోనే వున్నారు. పోనూ రానూ మొత్తం పదిమైళ్ళు. గతుకుల దారిలో ఎడ్లబండిలో చేసిన ప్రయాణానికి మరింత నీరసించి ఇద్దరూ ఒంటిమీద జ్ఞానంలేకుండా పడివున్నారు. వాళ్ళను తెచ్చి లోపలపడుకోబెట్టాక అయ్యగారన్నారు. "తల్లీ! నువ్వు వీళ్ళిద్దరినీ చూస్తూ వుండు. విశ్వాన్ని తీసుకుని మళ్ళీ కంబనకెరె వెడతాను. వీడికింకా వ్యాధి ముదరలేదు. ఇప్పుడే వెళ్ళాలి."

మరోమార్గం నంజమ్మకు కూడా కనిపించలేదు. అయ్యగారు గుడికెళ్ళి తమ పెట్టిలోవున్న డబ్బంతా తీసుకున్నారు. నంజమ్మ కవసరమొస్తే వుండనీ అని పదిరూపాయలిచ్చి, కడమ ఇరవైరూపాయలు తమ చొక్కాజేబులో జాగర్తచేశారు.

ఇంతలో బండాడు తనింటి కెళ్ళి భోంచేసి, వేరేవాడి దగ్గిర వేరే ఎడ్లజత తెచ్చాడు. ఆ బండ్లోనే వేరే పక్కపరిచి, దాని మీద విశ్వాన్ని పడుకోబెట్టి, తానూకూర్చుని అయ్యగారు బయల్దేరిపోయారు.

ఆయన కంబనకెరె చేరేసరికి చీకటిపడ్డది. డాక్టరు గారింటి దగ్గిరికే బండిని తీసుకెళ్ళారు. డాక్టరు బయటికి వచ్చి "ప్లేగుతగిలాక రోగుల్ని వూళ్ళోకెందుకు తెచ్చారు?" అని అడిగారు.

"ఆసుపత్రి దగ్గిర మీరుండలేదండి"

"రాత్రింబగళ్ళూ అక్కడే వుండాలేం? రేయ్, కరియా, చూడు ఆసుపత్రికెళ్ళి తలుపుతీసి, టేబులు మీదున్న సీసాల్లో కుడివేపునుంచి రెండవదాంట్లో వీళ్ళకి మూడవున్సులివ్వు". అని బంట్రోతుతో చెప్పి లోపలికి వెళ్ళిపోయారు.

ఆయనవెంట ఆసుపత్రి దాకా వచ్చిన కరియకు, అయ్యగారి కావి బట్టలు చూచి భక్తి ఏర్పడివుండాలి. వాడన్నాడు. "అయ్యగారూ! ఈ మందుతో నయంమవదు. తిపటూళ్ళో హేమాద్రిపానకమని దొరుకుద్ది. మూడురూపాయలకో బాటల్ యంగటాచలశెట్టి అంగట్లో దొరుకుద్ది. బజార్లో ఆయనుండే ఇంటి ముంగటే అంగడి. ఈ కుర్రాడికి తాగించండి. జబ్బింకా ముదరలేదు. నయమవుద్ది".

"డాక్టరలాగన్నారుకదా?"

"ఆయనలాగే చెబుతాడు. మీరు నేను చెప్పేలాచేయండి. కావలిస్తే ఆ సీసా ఇస్తాను. దీనివల్ల లాభంలేదు".

వెంటనే తిపటూరి కెళ్ళాలని అయ్యగారు నిశ్చయించారు. బండాడు కాస్త వెనకాడాడు. "రేయ్ మనిషి ప్రాణంపోతూంటే వెనకంజేయరాదు. నీకూ ఇంట్లో పిల్లాజెల్లావున్నారు. గుర్తుంచుకో" అని అయ్యగారుచెప్పాకభయమూ, దాక్షిణ్యమూ, మంచితనమూ అన్నీకలిసి వాడొప్పుకున్నాడు. కంబనకెరె నుంచి తిపటూరికి తిన్నగా రోడ్డుంది. మోటారు కూడా వెడుతుంది. పది పదకొండుమైళ్ళుంటుంది. కుర్రాడి కాక లేస్తుందని అయ్యగారొక బిస్కత్తుపొట్లం కొన్నారు. బండి కట్టించి వెంటనే బయల్దేరారు.

అర్ధరాత్రి దాటాక బండి తిపటూరు చేరింది. వెంకటాచలశెట్టి అంగడి అయ్యగారికి కూడా తెలుసు. ఇప్పుడు అంగడిమూసివుంటుంది. కాని శెట్టిగారి నివాసం, అంగడి రెండూ ఒకటే అన్నది గుర్తొచ్చి, ఆయన బండిదిగి వెళ్ళి తలుపు

తట్టారు. మెలకువై తానే బయటికి వచ్చినశెట్టి అయ్యగారు చెప్పిందంతావిని "హేమాద్రిపానకమొకటే ఆయుర్వేదంలో వున్న ఔషధం. మాది తిన్నగా మదరాసు వెంకటాచార్లు కంపెనీ నుంచి వచ్చిన మందు. జబ్బు ముదరకండానే ఇస్తే నయమవుతుంది. ముదిరాక ఇస్తే గ్యారంటీ చెప్పలేం. మీకెన్ని సీసాలు కావాలి?" అని అడిగాడు.

"రోగులకెలాగ ఎంతమందివ్వాలి?"

"పూటకి నాలుగు చంచాలు చొప్పున రోజుకి నాలుగుపూటలు.ఒకసీసా మూడురోజులోస్తుంది. మూడు రూపాయలుసీసా."

అయ్యగారి దగ్గిర ఇరవైరూపాయలున్నాయి. పద్దెనిమిది రూపాయలుతీసుకుని మొత్తమూరు సీసాలమందిచ్చాక శెట్టి అన్నాడు. "కుర్రాడి కిప్పుడే నాలుగు చంచాలు తాగించండి. తెనెలా తియ్యగా వుంటుంది. ప్లేగున్న వూళ్ళోకి తీసుకెళ్ళరాదు. రోగమున్న ఇంట్లోకెళ్ళరాదు. ఎక్కడయినా వూరవతలవుంచాలి".

ఈ సలహా ఇచ్చి శెట్టి లోపలికెళ్ళి తలుపువేసుకుని పడుకున్నాడు. వెంటనే బండికట్టాలంటే ఎడ్లు అలిసివున్నాయి. అదీకాక అయ్యగారికి బండాడికి కూడా ఆకలుపుగావుంది. ఇంతరాత్రివేళ తిండికావాలంటే రెల్వేస్టేషన్ హోటల్లో మాత్రమే దొరుకుతుంది. బండి అక్కడికే తరలించి, ఒక గ్లాసుతీసుకుని విశ్వానికి మొదట మందుతాగించి, తరవాత ఒక కప్పు కాఫీ తాగించారు. వడలు, పకోడీలు మినహాయించి మరే తిండి లేదక్కడ. ఎనిమిదణాలకు కట్టించుకుని, తామూ, బండాడు తిన్నాక, బండాడేదో గుర్తొచ్చినట్టన్నాడు. "అయ్యగారూ! మనమూ వూరొదిలి శెడ్డెయ్యాలి. ఎడ్లుకూడా అలిశాయి. అయినా మెల్లిగా బయల్దేరుదాం"

"అదే మంచిది"

బండి కట్టాడు. విశ్వానికి జ్వరం కాస్తోంది. కానీ ఒంటమీద జ్ఞానం తప్పలేదు. అయ్యగారు వాడి తొడసందుల్లోను, చంకల్లోను తడిమి చూసి "నొస్తుందాబాబూ" అని అడిగితే లేదని తలాడించాడు. ఆయన కదొకటే ధైర్యం. గడ్డకట్టకముందే మందుపడింది. రోగం మొక్కగా వుండగా తుంచేయచ్చు - అన్న నమ్మకంతో ఆయనాబండ్లో తడికకు చేరబడి, కళ్ళుమూసి కునుకు తీయడం మొదలెట్టారు. అలిసిపోయిన ఎడ్లు నెమ్మదిగా నడుస్తున్నాయి. కంబనకెరె దాటేదాకా రహదారి గనక బండాడు కూడా లోపలివేపు తడికకు చేరబడి నొగలు మీద కాళ్ళుచాపి, కునుకుతీస్తూ అడపాదడపా, లేచి "ఎహెహే" "పపప్ప" అని అదిలించేవాడు.

సూర్యోదయమయ్యేసరికి వాళ్ళప్పుడే సగం దారి గడిచారు . రోడ్డు పక్కనే వున్న ఒక కట్ట దగ్గిర బండాపి, అయ్యగారు విశ్వానికి సీసాతోటే మరోసారి మందుతాగించారు. జ్వరం మాత్రముంది. ఎక్కడా గడ్డలు కట్టలేదు. ఆయనకు మరింత ధైర్యం వచ్చింది. కుర్రాడికి తినడానికి మరి రెండు బిస్కత్తులిచ్చారు. వాళ్ళిద్దరూ కాలకృత్యాలు తీర్చుకుని మళ్ళీబండి కట్టారు. దారిలో వస్తూ ఆయనకో ఆలోచన వచ్చింది. ఎలాగూ అందరూ వూరొదులుతారు. విశ్వాన్ని వూళ్ళోకితీసుకెళ్ళకూడదు. వూరొదిలాక చెరువుకట్టమీదున్న గుడేవాడి. బండి అక్కడికే తోలించి వీణ్ణి అక్కడే పడుకోబెడితేసరి. వూళ్ళోకెళ్ళి నా కంబళి, చాప, తలగడ తెస్తే చాలు.

ఆయనలాగే చేశారు. పదకొండు గంటలకి బండి చెరువు కట్టమీదున్న గుడి చేరుకుంది. విశ్వాన్ని దించి, మరోసారి సీసాతోటే వాడికి మందుతాగించి, తామువచ్చేదాక బండాణ్ణి అక్కడే వుండమని చెప్పి, నాలుగుసీసాల మందుచ్చుగుని వూళ్ళోకెళ్ళారు.

## 2

వూళ్ళో ప్రతిఒకరూ వెదురుగడలు, తడికలు, తాళ్ళు మోసుకుని షెడ్లు వేయడానికి వూళ్ళోనుంచి సివారుకెడుతున్నారు. షెడ్లు వేయకముందే ఎంతోమంది ఇంట్లో వున్న సరుకులు, పాత్రలు పట్టుకుని వూరి బయటికెడుతున్నారు. అయ్యగారు వచ్చేసరికి పార్వతికి, రామణ్ణకు ఒంటిమీద ముప్పాతిక భాగం జ్ఞానం తప్పింది. కాని గడ్డ నలుపుతూంటే దాని బాధకు "అమ్మ - అయ్యమ్మో" అని క్షీణ స్వరంతో మూలుగుతోంది పార్వతి. అయ్యగారొక్కరే రావటంచూసి నంజమ్మ గాబరాపడ్డది. అది గుర్తించి అయ్యగారే "భయపడకు తల్లీ! తిపటూరికి వెళ్ళాం. విశ్వానికి జ్వరమేమో వుంది. గడ్డకట్టలేదు. మంచి మందుతెచ్చాను. చెరువుకట్టమీద గుడిలో వాణ్ణి పడుకోబెట్టాను. ప్లేగున్న వూళ్ళోకి తీసుకెళ్ళకండి అన్నారు. ఈ మందు వీళ్ళిద్దరికి రోజుకి నాలుగుపార్లు తాగించు".

బిరడా తీసి, ఆయనచెప్పినట్టు, మందుగ్లాసులోపోసి వాళ్ళిద్దరికీ నోట్లో పోసింది. గ్లాసుతో తాగేశక్తిగాని, జ్ఞానం కాని వాళ్ళకి లేదు. "ఇదొకటేమందు. బతికిస్తే శివుడు దీనితోటే బతికించాలి". అని అయ్యగారు కాసేపాగి "త్వరగా వూరొదలాలి. మీరేమీ ప్రయత్నం చేయరా?" అని అడిగారు.

"వేవింట్లోనే వున్నాను. మమ్మల్ని చూడటానికి హడావుడిలో ఎవరొస్తారు?"

"చెన్నయ్య ఏడి?"

"తెలీదు. తెల్లారి ఎనిమిది గంటలకి వెళ్ళినవారు మళ్ళీరాలేదు"

"నా గుడికెళ్ళి, కంబడిగింబడి తీసుకుని కట్టమీది గుడిలో పెడతాను. నువ్వు విశ్వాన్ని గూర్చి బెంగెట్టుకోకు. వీళ్ళని చూసుకో, వాడూళ్ళోకి రావడమెందుకూ? వెట్టిని పిలిచి మీకు పాకగీకవేయమని చెబుతాను.". అని చెప్పి తన దగ్గిరున్న మందుపిపా లావిడకిచ్చి విశ్వానికి జావచేయటానికని అర్ధశేరు బియ్యపునూక తీసుకుని వెళ్ళిపోయారు. పార్వతి, రామణ్ణలిక బతుకుతారనే ఆశ నంజమ్మకు పన్నగిల్లిపోయింది. బతికితే, అది దేముడి దయ. ఇద్దరికీ గజ్జల్లో గడ్డలు వాచి పెద్దవయ్యాయి. పార్వతి అడపాదడపా కళ్ళుతెరిచి చూస్తోందికాని ఆవిడ దృష్టి ఈ లోకంలో లేదు. బూరటిల్లిన ముఖంచూస్తే భయమేస్తుంది. రామణ్ణ ఎక్కువ మూలగడంలేదు. వూరికే పడుకున్నాడు. వాడి గడ్డలు కూడా, చిలగడదుంపల్లా వాచిపోయాయి. ఇద్దరిలో ఎవరు కూడా పొద్దుటినుంచీ ఒక్కమాటకూడా మాట్లాడలేదు. అయ్యగారు తెచ్చిన మందు చాలా మంచిది కావచ్చు. తిపటూరి మంచీ తెచ్చారు. కంబనకెరె డాక్టరేమన్నారో! విశ్వాన్ని గూర్చి బెంగెట్టుకోకని ఆయనే చెప్పారు. వెళ్ళి ఒకసారయినా చూచిరావాలి. నేను వెడితే ఈ పిల్లల దగ్గరెవరు?

అదే సమయానికి మాస్టారు భార్యవచ్చింది. ఆమె చేతిలో ఏదో గిన్నెవుంది. మాస్టారు పొద్దుట వచ్చి వీళ్ళను చూసి వెళ్ళారు. ఆమె అంది "ఇంట్లో చేసినవంట వేరు వేరుగా తేరాదని శాస్త్రమట, అంచేతే వట్టి అన్నం పులుసు కలిపి తెచ్చాను. దీన్ని లోపలుంచి వెడతాను. మా ఆయన సామాను కడుతున్నారు. ఇప్పుడెలావున్నారు పిల్లలు?"

"ఏమీ తేడాలేదు. పొద్దుటినుంచి మాట్లాడటం లేదు"

"మీ వెట్టినో, ఎవరైనా నలుగుర్ని పంపండి, మా ఆయనే మీకో చిన్న షెడ్డు వేయిస్తారు. మీరు పిల్లలతో పాటు రండి, సామానుమేము కట్టి పడేస్తాం. కరణంగారేరీ?"

"ఎక్కడికెళ్ళారో ఎవరికి తెలుసమ్మా?"

ఆమె వెళ్ళిపోయింది. షెడ్డుకు కావలసిన వెదురు గడలు, బద్దలు అన్నీ నంజమ్మ ఇంటి అటక మీదే వున్నాయి. కొబ్బెరా కొకటే కావాలి. వూళ్ళో

వాళ్ళందరికీ కావాలి గనక దానికి కాస్త ఇబ్బందిగానే వుంటుంది. బండి పంపితే కురుబరహళ్ళినుంచి, కావలసినంత వేపి పంపుతారు. ఆ వూరు కూడా వదిలేస్తున్నారో ఏమో! దేనికైనా బాధ్యత తీసుకుని చేసేదెవరు? నంజమ్మ లేచి మరోసారి ఇద్దరికీ హేమాద్రిపానకం తాగించింది. "జావకావాలా?" అని అడిగితే వాళ్ళేమీ జవాబు చెప్పలేదు. ఇప్పుడేగా మందు తాగారు. అర్ధగంట కానీ – అని ఆవిడే వూరుకుంది. ఇంతలో చెన్నిగరాయులింటికి వచ్చారు. ఆయన తలమీద వుతికిన రెండు దోవతులు, ఒక చొక్కా వున్నాయి. కట్టుకున్న తుండుగుడ్డ సగం పొడిగా వుంది. నుదిటి విభూతి పట్టెలు చూడగానే ఆయన తోటబావిలోనో, చెరువు తూములోనో, గుడ్డలు, ఉక్కుని స్నానం చేయడాని కెళ్ళారని తెలుస్తోంది. నుదిటి విభూతి ఆయన సంధ్యావందనం చేశారనటానికి సాక్షి. సంధ్యావందనానికి కూర్చుంటే "ఓం తత్సత్... తత్సవిత్వ ..." అని గబగబా అష్టోత్తర శతమో, అష్టోత్తర సహస్రమో, గాయత్రి జపం చేయందే పైకి లేచేవాడు కాడు. ఈరోజు ఆయన బయటకెళ్ళిన వేళని బట్టి చూస్తే అష్టోత్తర సహస్ర గాయత్రి జపం చేసివచ్చాడనే ఖచ్చితంగా చెప్పొచ్చు.

"ఇంట్లో పిల్లలు చావుబతుకులమీదున్నారు. వూరంతా వదిలేస్తున్నారు. ఈ రోజే ఈ గుడ్డలుతుక్కోవాలా మీరు?"

"మాసిన పంచె ఎన్నిరోజులని కట్టుకోను? నాలుగు రోజులయింది మన్నె గుడ్డలుతికి. నువ్వదే చీర కట్టుకున్నావు. నువ్వేం బ్రాహ్మల జాతిలో పుట్లా?"

ఆయనతో వాదించి లాభం లేదని ఆవిడ వూరుకుంది. శ్రీవారు వంటిట్లోకి తొంగి చూడగానే మాస్టారింటి అన్నపుగిన్నె కంట పడ్డది. మూత తీసి, దగ్గిరేవున్న అల్యూమినియం కంచంలో వడ్డించుకుని, పంచపాత్రలో నీరు వంచుకుని, "చిత్రాయనమః చిత్రగుప్తాయనమః యమాయనమః యమధర్మాయనమః సర్వభూతేభ్యోనమః" అని అయిదుసార్లు చిత్రావతి పెట్టి విధిపూర్వకంగా ప్రారంభించి భోజనం ముగించారు. చెన్నిగరాయల ఆకలి మాస్టారు గారి భార్య కేంతెలుసు. ఆవిడ తెచ్చిపెట్టిన అన్నమాయనకు చాలలేదు. భోంచేసి, ఆపోశనం పట్టి ఆయన బయటికొచ్చేసరికి మాదేవయ్యగారు మళ్ళీ వచ్చారు. అంతలో పార్వతికి కాస్త ఎగశ్వాస దిగశ్వాసగా వుంది. మరేం చేయడానికి తోచక, అమ్మాయి బుజం మీద చేయివేసి కూర్చుంది. అయ్యగారన్నారు; "చెన్నయ్యా! మీరు తిన్నగావెళ్ళి కట్టమీది గుడిలో వుండండి. మధ్యాంకణంలో

విశ్వం పడుకున్నాడు. పొరకేరి నంజప్ప కొడుకు మేకలు కాస్తూ వుంటే వాణ్ణక్కడే వుండమని చెప్పొచ్చాము. మీరెళ్లి అక్కడ వూరికే కూర్చోండి మరేమీ చేయక్కరలేదు."

"నే నొక్కణ్ణే వుండాలంటే వినుగండి"

అయ్యగారికి చిర్రెత్తుకొచ్చింది! "నువ్వేమి మనిషివా? పశువ్వా? చెప్పినట్టు చేయకుండా" - అనేశారు. అయ్యగారు, ఎవరిమీదా ఎన్నడూ కోప్పడలేదు. ఆయన మాటలు విన్న కరణంగారు నిశ్చేష్టుడయ్యాడు. "హూం. వెడతాను. కాస్త పొగాకుంటే ఇప్పించండి. భోంచేశాక వేసుకోకపోతే అదోలా వుంటుంది"

"అయితే భోజనమయిందన్న మాట. ఎవరు వండివార్చారు?"

"ఇదే చేసిందేమో!"

"మాస్టారి పెళ్ళాంకాస్త తెచ్చిపెట్టివెళ్ళారు" - నంజమ్మ అంది.

"అక్కడే నా అడపముంది. సామాన్లలోనే, నీకు కావలసినంత తీసుకో" అని అయ్యగారు చెప్పాక కరణంగారు పంచటరుగు దండెంమీద ఆరవేసిన తనపంచ తీసుకుని ఆరేలా తలమీద వేసుకుని వెళ్ళిపోయాడు.

"తల్లీ! మీ షెడ్డు మాటేంచేశావు?"

"షెడ్డు సంగతి తరువాత ఆలోచిద్దాం. పార్వతి చూడండి ఎలా వూపిరి తీస్తోందో!"

అయ్యగారు దగ్గిరికెళ్ళి పార్వతి ముక్కు కింద చెయ్యెట్టి చూశారు. వూపిరి సమంగా ఆడటంలేదు. "జావ ఎప్పుడిచ్చారు?"

"తాగటమేలేదే"

"కడుపుకేమీ లేని తాపంవల్ల ఇలా వుంది. తొరగా లేచి కాస్త జావ కాచి తాగించు. ఇంతలో మీ షెడ్డుకు, కావలసిన ఆకుకోసం కురుబరహళ్ళికి కబురుచేస్తాను" - అని చెప్పి ఆయన బయటికి వెళ్ళాడు. మాస్టారుగారి కొడుకు విశ్వం కంటే రెండేళ్ళు పెద్దవాడు చాలా చురుకైనవాడు. మాస్టారింటికెళ్లి మాదేవయ్యగారు, వాణ్ణడిగారు" "కురుబరహళ్ళికి ఒంటరిగా వెళ్లిరాగలవా బాబూ?"

"ఓ! పరుగెత్తుకెళ్లి రాగలను"

"గుండేగౌడగారి ఇంటికెళ్ళిచెప్పు. కరణంగారింట్లో ముగ్గురి పిల్లలకూ ప్లేగు తగిలింది. పాక వేసుకోవాలంటే ఆకు లేదు. తడిమ్మానవన్నీ వున్నాయి. నంజమ్మగారేడుస్తూ కూర్చుందని చెబుతావా?"

"ఓ అన్నీ గుర్తుంచుకొని చెబుతాను. త్వరగా వెళ్ళమని మాస్టారు చెప్పారు. మాదేవయ్యగారు నంజమ్మ ఇంటికి వచ్చారు. లోపల పొయ్యిమీద గంజి కుతకుతలాడుతోంది. గుండేగౌడగారు వెంటనే ఆకులతోపాటు మనుమల్ని కూడా పంపుతాడన్న నమ్మకం అయ్యగారికుంది. ఇంతలో వెదురుగడలు అవీ తీసి బయటపడేస్తే మంచిది. ఈ రాత్రికే పాక వేస్తే రేపు తెల్లవారే లోపుగా ఈ ఇల్లువదిలేయచ్చు. పూరువదలకపోతే పిల్లల జబ్బు నయమవదు - అని ఆలోచిస్తూ ఆయనే అటకెక్కారు. మూలలో వుపయోగించకుండా పడేసిన వెదురగడలు దుమ్ముపట్టి వున్నాయి. గంజి పట్టుకొచ్చిన నంజమ్మతో "పిల్లలమీద కప్పు తల్లీ, దుమ్ము పడుతుంది. కాస్త ఈ వెదుళ్ళు కింద పడేస్తాను." అని చెప్పి ఎక్కువ చప్పుడు కాకుండా ఒకటొకటే కిందికి పడేశారు. ఆయన నిచ్చెనదిగి వాటినన్నీ తీసి బయట పడేసేదాకా వంటింట్లోనే చల్లారనీ అని గంజిగిన్నె వుంచివచ్చింది. వెదుళ్ల అన్నీ బయట పడేశాక, నంజమ్మ మళ్ళీ లోపలికెళ్ళి ఒక గ్లాసులో జావ వంచుకుని తెచ్చి పార్వతి మీద కప్పిన దుప్పటి తీసి చూసేసరికి, వూపిరి వుండీ వుండనట్టు సన్నగా ఆడుతోంది. జావగ్లాసు నోటికందించి నోట్లో పోసినా గుటక పడలేదు, "అయ్యగారూ! ఆ కర్రలలా పడేసి ఇలారండి" అని నంజమ్మ పిలిస్తే ఆయన లోపలికి వచ్చి దగ్గిర కూర్చుని పార్వతి ముఖం పరిశీలించాడు. అనుమానం వేసింది. "గడ్డలెలా వున్నాయో కాస్త చూడు తల్లీ , నేను చెయ్యి కడుక్కుని వస్తాను" అని చేతులు కడుక్కునేందుకు నీళ్లగదివేపు వెళ్ళాడు.

నంజమ్మ చేతితో తడిమి చూసింది. కుడితొడ సందులో కట్టిన గడ్డ పగిలి చీముబయటికి వచ్చి చుట్టూ పులుముకుంది, "అయ్యగారూ! కుడివేపుగడ్డ పగిలింది చూద్దురుగానిరండి".

ఆయన వచ్చి కప్పినదుప్పటి తొలగించి చూచారు. తెల్లగా చీము బయటికి కారుతోంది. దాని చుట్టూ ఎర్రని ద్రవం కారుతోంది. సెగగడ్డ పగిలితే రక్తము చీము బయటికి వచ్చేలా, చీము నెత్తురు ఇక్కడకూడా వస్తోంది. చీరను కాస్త కిందికి జరిపి మరొక వేపు చూశారు. అటువేపు కూడా గడ్డ పగిలే సూచనలు కనిపించాయి. ఆయనే చీర సవరించి గుండెలదాకా దుప్పటి కప్పారు. "ఏమయిందయ్యగారు"మెదడు మొద్దుబారిపోయి అడిగింది నంజమ్మ.

"శివుడి అనుగ్రహమెలా వుంటుందో చూడాలి తల్లీ!"

ఆమెకూ అర్థమయిపోయింది. పార్వతి ఇప్పుడు కాస్త గట్టిగా వూపిరి తీస్తోంది. నంజమ్మ ఇంతవరకు చావును కళ్ళారా చూడలేదు. మరీ దుర్బలంగా వున్న వూపిరి ఇప్పుడు బలంగా ఆడడంలో వున్న ఆంతర్యం ఆవిడకుబోధపడలేదు. కళ్ళచూపులోవున్న జడత్వం వేపు ఆమె దృష్టి వెళ్లనే లేదు. అయ్యగారికి తెలిసిపోయింది. కానీ ఏమి చెప్పాలో, ఎలా చెప్పాలో తెలీక వూరికే మాట్లాడకుండా కూర్చున్నారు. చివరికో నిశ్చయానికి వచ్చి "మీ నాన్నగారు కాశీ నుంచీ గంగచెంబు తెచ్చారట కదా ఇంట్లోవుందా?"

"దేనికి!" ఇప్పుడు నంజమ్మకు దాని అర్థం బోధపడ్డది.

"ఇప్పుడు కంగారుపడరాదు. బతికిస్తే గంగమ్మ తల్లి బతికించాలి లోపలికెళ్ళి పట్రాతల్లీ!"

నంజమ్మ పరుగెత్తుకెళ్ళి తెచ్చింది. గంగచెంబు మూతకు మేకుతో ఒకవేపు కన్నం పొడిచి, "అమ్మాయితలని తొడమీద పెట్టుకో తల్లీ, నువ్వు సరిగ్గా కూర్చో నీకు సహాయం చేస్తాను" అని ఆయనే పార్వతి తలను మెల్లిగా ఎత్తి ఆమె తొడమీద పెట్టి, దగ్గిరే వున్న గ్లాసులోని జావ చేత్తో తుడిచి, దానిలో కాశీగంగవంచి, ఆమె చేతికిచ్చి "నెమ్మదిగా నోట్లో పొయ్ తల్లీ, ఆగు, కాస్తపట్టుకుంటాను" అన్నారు.

నంజమ్మ చేయి వణుకుతోంది. చేతిలో వున్న గ్లాసులోని గంగ నీళ్ళు తొణికిసలాడి చిందుతున్నాయి. అయ్యగారే ఆమె చేయిపట్టుకుని గ్లాసు మూతి నెమ్మదిగా పార్వతి పళ్ళమధ్య చొప్పించి గొంతులోకి నీళ్లుపోయేలా వంపించారు. గట్టిగా ఆడుతున్న వూపిరి సన్నగిల్లుతోంది. కళ్లు సగం తెరిచివున్నా, తనమీదికి వంగి చూస్తున్న అమ్మ ముఖ మావిడకగుపించడం లేదు.తల్లి తొడమీదే తన తలవుందన్న జ్ఞానం కూడా ఆవిడకి లేదు. సన్నగిల్లుతోన్న వూపిరి మరీ సన్నగిల్లింది. వుండి వుండి వస్తూన్న వూపిరి చివరి కొక్కసారిగా బయటి వచ్చింది. మళ్లీ గాలిలోపలికి వెళ్ళలేదు. లోపలున్నదంతా ఒకేసారి బయటి కక్కేయాలని సగం తెరిచిన నోరు మూతపడనేలేదు.

"అ..య్య..గా..రూ" – అని వూపిరి బిగబట్టి, వెక్కుతూ నంజమ్మ కూతురి గుండెమీద తలవాల్చేసింది. ఇప్పుడేమి ఓదార్చినా లాభం లేదని అయ్యగారికి తెలుసు. తరువాతి కర్తవ్యం గుర్తొచ్చి ఆయన పైకి లేచి మాస్టారుగారింటికి గబగబ చిన్న పరుగుతో నడిచి వెళ్లారు. తమ సామానంతా చివరిసారిగా బండికెక్కిస్తున్న

ఆయనకు కూడా పార్వతి చచ్చిపోయిందన్న వార్త ఆఘాతంలా తగిలింది.

"ఇప్పుడు ఊరికే ఆలస్యం దేనికి సాయంత్రమయింది. పదండి, మీ కులస్థులంతా చేరి మొదట శవాన్ని సాగించండి."

మాస్టారు వెంటనే వచ్చారు. ఆయన వెనకాలే ఆయన భార్యా వచ్చింది. నంజమ్మ కూతురు గుండెమీద తలెట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తోంది. అయ్యగారు ఆమెదగ్గిరికొచ్చి "తల్లీ! ఇది ప్రాణం పోయినకట్టె. దాన్ని వదిలెయ్. ఇక రామణ్ణను చూసుకో. వాడికి జావ ఇవ్వకుండా వుంటే ఎలా? లే, ఆవేపు తిరుగు" అని అన్నారు.

"అయ్యగారూ! పార్వతి....."

"పార్వతి శివుడి దగ్గిర కెళ్ళింది. ఇహ రామణ్ణను చూసుకో" అని ఆయనే పార్వతి తలెత్తి కింద వుంచారు. మాస్టారు ఆలస్యం చేయరాదని శవం కాళ్ళుచేతులు వంచారు. వున్న దున్నట్టుగా నంజమ్మ ఏడవటం మానేసింది. ఆమె నోట మాటకూడా నిలిచిపోయింది. పైకి లేచి, వంటింట్లోకెళ్లి, జావ మళ్ళీ వెచ్చబెట్టి, తెచ్చి గ్లాసులో పోసి, రామణ్ణతల ఎత్తి తన తొడమీద వుంచుకుంది. వాడికెంతవరకూ ఒంటిమీద జ్ఞానం తప్పిందో ఆవిడకు తెలియలేదు. తాగించిన పలచని జావ లోపలికెళ్ళింది. ఆవిడకేదో ఆశ, ధైర్యం కలిగింది. అదే గ్లాసులో హేమాదిపానకం వంచి తాగించి, వెచ్చగా కప్పింది. చంకలోగాని, తొడసందులోగాని గడ్డలు చితకలేదు. గడ్డలు చితికితే ఏమవుతుంది, చితక్కుంటే ఏమవుతుంది,చితికితే రోగి చస్తాడా, చితక్కపోతే బతుకుతాడా అన్నదేదీ ఆవిడికి స్పష్టంగా తెలియదు. ఆ విషయమక్కడున్న వాళ్ళకెవళ్ళకీ తెలియదు. కానీ గడ్డలు చితికాక పార్వతి చచ్చిపోయింది. రామణ్ణకు చితకలేదు వాడి వూపిరి కూడా క్రమంగానే వుంది. అంచేత ఆవిడకేదో ధైర్యం వచ్చింది. ప్రాణంపోయిన కూతురి శవాన్ని వదిలి, ఇంకా ప్రాణంలో వున్న కొడుకు తలను తొడ మీదెట్టుకుని, పట్టుకుని మౌనంగా కూర్చుండిపోయింది.

అయ్యగారెలాగు అటకెక్కి వెదురుగడలు తీసి ఇంటిముందు వడేశారు. పాడె కట్టడానికి వాటిలోనే కొన్ని తీసి వుపయోగించుకోవచ్చు. మాస్టారువెళ్ళి జోస్యులిద్దరికీ చెప్పారు. వూళ్ళోవున్న కడమ మూడు బ్రాహ్మలిళ్ళకూ వార్త అందింది. అందరూ వూరొదిలే హడావుడిలో వున్నారు. కాని శవాన్ని వెంటనే దహనం చేయకపోతే చీకటి పడుతోంది. తెల్లారేవరకు శవాన్ని ఇంట్లోనే

వుంచుకోవాలి. కులస్థులు వచ్చారు. చెన్నిగరాయుతే రావాలి. విశ్వం దేవస్థానములో ఒంటరిగావుండవలసి వస్తుంది. వాడికి తోడెవరు? తామిక్కడే వుండాలని మాదేవయ్యగారు నిశ్చయించుకున్నారు. ఎవరు దొరికినా సరే, వాళ్లని విశ్వాన్ని కాస్త కనిపెడుతూ వుండమని అడగాలనుకున్నారు. దేవాలయం వేపు బయలుదేరారు. ఎవరూ ఆయన కంటపడలేదు. వూరవతల తన అంగట్లో నరిపి కూర్చుని వుంది. ఆవిడే అయ్యగారిని పలకరించి "కరణంగారింటి పార్వతమ్మ పోయారట నిజమా" - అని అడిగింది.

అయ్యగారామె సహాయమే కోరారు. విషయమంతా సంగ్రహంగా చెప్పి - "నువ్వెలాగూ వూరవతలున్నావు. వూరు వదిలే పని నీకు లేదు. అంగటి తలు పేసుకుని బయల్దేరు. నేను మళ్ళీ వచ్చేదాకా కుర్రాణ్ణి చూసుకోవాలి" అన్నారు.

నరిపి కొట్టుకు తాళమేసి ఆయన వెంటే బయల్దేరింది. అయ్యగారి అడపంలోని సున్నపుకాయ తీసి చెన్నిగరాయులు ఆరవసారి తమలపాకలుకి సున్నం రాస్తు కూర్చున్నాడు. అయ్యగారు గర్భగుడిలోకెళ్లి దేవుడి ప్రమిద తెచ్చి దగ్గరెట్టి నరిపితో చెప్పారు: "చీకటి పడితే ఈ దీపం వెలిగించుకో. ఈ సీసా వుంది చూడు. ఇందులోని మందు మూడు గంటలకోసారి ఇంతింత తాగించు. అబ్బాయి ఆకలేస్తోందంటే, ఇందులో బియ్యపునూకుంది. జావకాచివ్వు."

"నేనంతా చేస్తాను. మీరెళ్లండి"

విశ్వం నిశ్చబ్దంగా పడుకున్నాడు. అయ్యగారు చెన్నిగరాయలితో "పార్వతమ్మ పోయింది. మీరు పదండి. తరువాత పని జరగాలి" అన్నారు.

"అదెందుకు చచ్చిపోయిందండీ?"

"అదే అడుగుదురు గానీ రండి" - అని ఆయన చెయ్యట్టుకుని అయ్యగారు బయల్దేరారు.

ఆయనవచ్చేసరికి పాడె సిద్ధంగా వుంది. అణ్ణాజోస్యులే నుంచుని అన్నీ నిర్వహిస్తున్నారు. అయ్యాశాస్త్రులకి శవముంటే మొదటినుంచీ భయమే. ఆయన ఇంటిబయటే వీధిలో నుంచుని మాట్లాడుతున్నాడు. నంజమ్మ మాత్రం తన కూతురుచచ్చిపోనట్టే, తన ఇంట్లో జరుగుతున్న శవసంస్కార ప్రయత్నానికీ, తనకూ ఏమీ సంబంధం లేనట్టు, రామణ్ణ ముఖమే చూస్తూ పూనకం వచ్చిన దానిలా కూర్చుండి పోయింది. "నిజానికి అమ్మాయి మొగుడే కర్త. ఆయనకుతెలపకుండా సంస్కారం చేయచ్చా?" అణ్ణాజోస్యులడిగారు.

"ఇప్పుడు తెలిసేదెలాగ?" అందులోను ప్లేగుతో పోయిన శవమాయె.వదిలేస్తే ఒళ్ళంతా వల్లబడిపోతుంది. ఆ వూచీ నాది. పెళ్లిపెద్దగా నుంచుని చేసింది కూడా నేనే. ఆయనకు తరువాత వుత్తరం రాస్తాము. ఇప్పుడాలస్యం చేయకండి." అని మాస్టారన్నారు.

మాస్టారు భార్య, పార్వతికి పసుపురాచి, కుంకుమ పెట్టింది. ఇంట్లో వున్న ఒక రవికెగుడ్డ కప్పింది. అయ్యగారు నిన్న తనకిచ్చిన పదిరూపాయల్లో మిగిలిన అయిదు రూపాయలు మాస్టారు చేతికిచ్చింది. శవాన్ని కట్టి, పాడె తీసుకెళ్ళేటప్పుడు మాస్టారు భార్య కంట తడిపెట్టింది. కానీ నంజమ్మ ఏడవలేదు. "ఈ ముండ ఎందుకు చచ్చిపోయిందో?" అని చెన్నిగరాయులు కళ్ళు తుడుచుకున్నాడు.

వీళ్ళు వెళ్లేసరికి కట్టవెనకాల వున్న తోటవతల శ్మశానంలో చితి సిద్ధపరిచారు. పెళ్ళయిన అమ్మాయి గనక పార్వతికి సంస్కార పూర్వకంగా దహనం జరగాలి. అణ్ణాజోస్యులు శుభాశుభకర్మలురెండూ తెలిసిన వాడు. అయ్యాశాస్త్రిగారు, శవం వెనకాల చెరువు కట్టదాకా వెళ్లారు. చెరువుకట్ట దిగటానికి ముందే ఆగిపోయారు. తోటవతల దహనం జరిగి, మంటలు పదిపన్నెండడుగులు పైకి లేవటం చూసిన తరువాతకూడా అక్కడేమంచుని శవవాహకులు-శ్మశానం దగ్గిర బావిలో స్నానం చేసి వచ్చేదాకా ఎదరు చూస్తున్నారు. చివరికందరూ కలిసి వెనక్కివచ్చాక వూరిముందు వాళ్ళనాపి "కపాలమోక్షం త్వరగానే జరిగిందా?"

"ఔను"

"చిన్నయ్యా! శవవాహకులకు దక్షిణెంతిచ్చావు?' "

"ఎనిమిదణాలు"

"చూడు. కూడా నేమారావలసిందే. ఇంత దూరం వచ్చాను అక్కడికి వస్తే, సాయంత్రం చన్నీళ్ళల్లో మునగాలి. ఒంటికి పడదని రాలేదు. నా వాటా దక్షిణివ్వు"

అది వినేసరికి మాస్టారికి ఒళ్ళుమండింది. కానీ అణ్ణాజోస్యులు "ఇవ్వివ్వు" అని వెంటనే అన్నారు. చెన్నిగరాయలు తమ బొడ్డులో దోపుకున్న డబ్బులో ఎనిమిదణాల బిళ్ళ తీసి ముసలిశాస్త్రికిచ్చాడు. ఆయన ముఖం చేటంతయింది.

"తిథి గిథి వూళ్ళోనే చేస్తావా? లేక....." ఆయనడిగారు.

"తిథి అమ్మాయి భర్త పూచీ కదా? ఈయనెలా చేస్తారు? అని మాస్టారడిగేసరికి "అవునవును. మరిచాను" అని ఆ అయిదుగురితో పాటు ఆయన వూరివేపునడిచారు.

## 3

పార్వతి శవాన్ని తీసుకెళ్ళాక ఇంట్లో నంజమ్మతోపాటు అయ్యగారొకరే వుండిపోయారు. మాస్టారి సామాను కొంత పూరవతల వేసిన పాకకి చేరుకుంది. మరికొంత సామాను ఇంట్లోనే వుంది. దాన్ని సాగించే ప్రయత్నం చేయటానికి మాస్టారు, భార్యవెళ్ళారు. కురుబరహళ్ళికి వెళ్ళిన మాస్టారుగారబ్బాయి తిరిగి వచ్చి "రేపు రెండుబారలు పొద్దెక్కాక, రెండు బళ్ళతోటి అకు, ఇద్దరు మనుషుల్ని పంపుతారట. అమ్మవారి గుడివద్దే వుండి, ఎక్కడ పాకెయ్యాలో వాళ్ళకి చూపెట్టాలట" అని చెప్పి వెళ్ళిపోయాడు.

రామణ్ణ వూపిరి పన్నగిల్లిపోతోంది. "మరోసారి మందిచ్చావా తల్లీ?" అని అయ్యగారడిగారు. పార్వతి పోయాక కాపేపటికే రెండుసార్లు తాగించినా, నంజమ్మ మళ్ళీ గ్లాసుతీసుకుని మందువంచి తాగించబోతే వాడునోరు తెరవలేదు. బలవంతాన నోరుకాస్త తెరిచి మందు గ్లాసు మూతి లోపలికి చొప్పించి, మందు వంచింది. కానీ మందు లోపలికెళ్ళలేదు. "అయ్యగారూ! వీడు మందు తాగనంటాడు ..జ్వరం దిగిందేమో చూడండి" అంది నంజమ్మ.

ఆయన దగ్గిరికొచ్చి మొదట నుదురు తాకి చూశారు. జ్వరం తగ్గుతోంది. ప్లేగు తగిలిన వాళ్ళకి, వేడి తగ్గడం, పెరగడం, మామూలే. కాని ఇప్పుడు బాగా తగ్గినట్టు తోచింది. జ్వరం తగ్గిపోవడం రోగం నయమయ్యే లక్షణం కావచ్చు." తల్లీ. ఇంట్లో ఇద్దరికి తగిలింది. ఒకరు బలయ్యారు రామణ్ణ బతికి బయటపడే సూచనలు కనిపిస్తున్నాయి. జ్వరం దిగిపోతోంది. - అన్న ఆయన మాటలకి చచ్చిపోయిన పార్వతి బతికి వచ్చినంత వూరట కలిగి, "ఆ మాత్రం దయదలిస్తే కాళమ్మకు కొత్తచీరపెట్టి వూరేగింపు చేయిస్తాను" అంది. రోగి ఒంట్లో వేడి క్షణక్షణానికి దిగిపోతోంది. సుమారు అయిదు నిమిషాల దాక అయ్యగారికి కూడా అది మంచి సూచనే అనిపించింది. తరువాత కాస్త అనుమానం వేసి దుప్పటిలో చెయ్యేట్టి, కాళ్ళు ముట్టి చూస్తే చల్లబడిపోతున్నాయి. "కాస్త బూడిద కావాలి. వుందా?" - ఆయన అడిగారు.

"వంటింటి పొయ్యిలో వుంది"

ఆయనే వెళ్ళి పిడికెడు బూడిద తెచ్చి రామణ్ణ కాళ్ళకు వేడెక్కేలా రుద్దారు. అయిదు నిమిషాలు రుద్దినా వేడెక్కలేదు దానికి కారణంమేమో ఆయన నోరువిప్పి చెప్పలేదు. దుప్పటి తొలగించి చూస్తే తొడసందులోనూ చంకల్లోనూ

గడ్డలు బాగా వాచి వున్నాయి. ఏవీ చితకలేదు. మళ్ళీ దువ్వటి కప్పి కుడిచేతి నాడి చూస్తే, దొరికీ దొరక్కుండా వుంది. వాడికి కాశీగంగ నోట్లో పోయాలి. ఆ విషయం నంజమ్మకు చెప్పే కాఠిన్యం ఆయనకు లేకపోయింది. కాని, ఎరిగుండీ, అలాగే వదిలేస్తే అబ్బాయి గొంతుకెండి చచ్చిపోతాడు. ప్రాణం పోతూవుంటే నోట్లో నీళ్ళు పోస్తే ఎంత? పోయకుంటే ఎంత? అదంతా మన భ్రమ కాదా?" అన్నవూహ ఆయనకుకలిగినా, తరువాత "నా కొడుక్కు చివరికి ప్రాణం పోతుండగా నీళ్ళు కూడా నోట్లో పోయలేదే" అని నంజమ్మ బాధపడరాదని ఆలోచించి, దగ్గిరేవున్న కాశీ చెంబు చేత బుచ్చుకున్నారు. దాన్ని ఆవిడ చేతికిచ్చి, ఆయనే కుర్రాడి నోరుతెరిచి "తల్లీ! కాస్త గంగ నోట్లోవదలు" అన్నప్పుడావిడ కర్థమయింది.

"రామణ్ణకూడా చచ్చిపోతాడా అయ్యగారూ?" – అని ఆవిడడిగింది. "తల్లీ! ఇప్పుడేడవకు. నేను చెప్పింది చెయ్యి?" – అని గంగగిన్నె ఆవిడ చేతికిచ్చినట్టే ఇచ్చి, తామే గంగ కుర్రాడి నోట్లో పోశారు. దానిలో ఎంత లోపలి కెళ్ళిందో, ఎంత బయటికి వచ్చిందో తెలియలేదు. ఎడమచేయి ముక్కు దగ్గిరెట్టి కుడి చేత్తో నాడి పరీక్షిస్తూ అయ్యగారు రోగి ముఖాన్నే చూస్తూ కూర్చున్నారు. నంజమ్మ పూనకం వచ్చినదానిలా తన కొడుకు ముఖంకేసి చూస్తూ కూర్చుంది. ఇద్దరూ ఎంతోజాగర్తగా వెయ్యికళ్ళతో చూస్తున్నా, ప్రాణవాయువు చివరిసారిగా ఎప్పుడు బయటవచ్చిందో ఎవరికి తెలియలేదు. అయ్యగారి వేళ్ళకింద లోలోపలికి దిగిపోతున్న నాడి మళ్ళీ పైకి రాకుండా పాతాళానికి దిగిపోయింది.

వున్న సంగతి నంజమ్మకు తెలపాలి. తెలిపి, శవం చేతులుకాళ్ళు మడవాలి. ఆలస్యంచేస్తే బిగుసుకు పోయి చేతులు కాళ్ళు వంచడానికి వీలుపడదు. అయితే ఎలా మొదలెట్టడం? ఆమెకు విషయం బోధపడకకాదు. కానీ మెదడుకు కలిగిన జ్ఞానం ఇంకా లోపలికి ఇంకలేదు. పార్వతి చచ్చిపోయినప్పుడేడ్చినట్టుగా ఇప్పుడావిడ ఏడవటం లేదు. రామణ్ణ ఛాతీమీద తన ముఖం పెట్టలేదు. వాడి చెయ్యి కూడా పట్టుకోలేదు. వాడి తలమాత్రం తన తొడమీదే వుంది.

ఈ పాటికి పార్వతిదహనసంస్కారం జరిగి వాళ్ళు వెనక్కి తిరిగి వస్తూ వుంటారు. ఇప్పుడే వాళ్ళకావార్త అందజేయాలి. మళ్ళీ చితికి కర్రలు పంపాలి. అప్పుడే చీకటిపడ్డది. ఇప్పుడేశవాన్ని తీసుకెడతారో లేదో! తెల్లవారేదాకా ఆగాలా? ఎలాగైనాసరే చేతులుకాళ్ళు మడిస్తే మంచిది. "తల్లీ! ప్రాణం శివుడి

పాదాలుచేరుకున్నాక పట్టి కట్టెలో ఏముంది? చేతులు కాళ్ళు మడుస్తాను." అని అన్నాడు మాదేవయ్య.

"మీపని మీరు చేయండి" – అని చెప్పిన నంజమ్మ కొడుకు తల మెల్లిగా కిందికి దింపి, తానే దూరంగా జరిగింది. అయ్యగారు తరవాతి కర్తవ్యాన్ని నిర్వహించి, శవంమీద దుప్పటి కప్పారు. ఇంతలో మాస్టారు, చెన్నిగరాయులు వచ్చారు.

"మాస్టారూ! రామణ్ణకు కూడా భూమ్మీద నూకలు చెల్లాయి.తరువాత కార్యక్రమ మాలోచించండి" – అని అయ్యగారన్నారు.

"ఓరి భగవంతుడా!"

"భగవంతుడి దగ్గిరికే వెళ్ళాడు. ఏం మాట్లాడినా ఏం లాభం లేదు. జోస్యులగారిని పిలవండి"

మాస్టారు అణ్ణాజోస్యుల షెడ్డుకు గబగబా వెళ్ళారు. ఇంతలో జోస్యుల ఇంటిల్లిపాది పూళ్ళో ఇల్లుఖాళీ చేసి షెడ్డుకు సామాను సాగించారు. చెన్నిగరాయలకేమీ బోధపడలేదు. రామణ్ణ శవం దగ్గిర గుడ్లల్లో కన్నీళ్ళు కుక్కుకుంటూ గొంతు కూర్చున్నాడు.

మాస్టారు అణ్ణాజోస్యులను వెంటబెట్టుకుని వచ్చారు. అయ్యగారు జోస్యులను "స్వామీ! ఇప్పుడే అంతా ముగిస్తారా? తెల్లారేదాకా ఆగాలా?" అని అడిగారు.

"రాత్రి పూట ఎలాగవుతుంది?"

మాస్టారు మధ్యలో కల్పించుకున్నారు. "పెద్దరోగం వచ్చినప్పుడేం జేశారు జనం. అగ్గిజ్వరం వచ్చినప్పుడు పగలూ రాత్రీ అని తేడా లేదు. శవాలు పడ్డవిపడ్డట్టు తీసుకెళ్ళి తగలేసేవారు. అందరికీ వేరు వేరు చితులేర్పాటు చేయడం కష్టమై రెండు మూడు శవాలనేకంగా ఒకచితి మీదే తగలబెట్టేశారు. పూళ్ళో మహామారి వున్నప్పుడు శాస్త్ర గీస్త్రం సమంగా చూడ్డానికి వీలులేదు. ఇప్పుడే కానిద్దాం".

జోస్యులు కూడా ఒప్పుకున్నారు. మొదట వచ్చిన వాహకుల్నే పిలవటానికి జోస్యులు వెళ్ళాడు. శవవాహకులు వచ్చారు. కాసేపటిలో తిరిగివచ్చిన అయ్యగారు – "సూరేగౌడ పెరట్లో కర్రలు, కొబ్బరిచిప్పలు, మట్టలు బోలెడున్నాయి. 'పట్టుకెళ్ళండి మేమూ ఎలాగూ పూరొదులుతున్నాం' అన్నాడు. అతందే బండి ఇచ్చాడు. అతడూ, అతని కొడుకూ ఇంకా ఇద్దరు బండికెత్తుతున్నారు. వాళ్ళు తిన్నగా కాటి దగ్గిరికే వస్తారు. మీరు కానివ్వండి" అని అన్నారు.

అన్నీ తయారయ్యాయి. శవాన్ని ఎత్తి పాడెమీద బిగించి, నోట్లో ఇన్ని బియ్యం పడేయ్యడమే తరవాయి. అయ్యగారు నంజమ్మ కోసం చూశారు. ఆమె కవపడలేదు. "నంజమ్మ ఏదీ?" అని అడిగారు. ఎవళ్ళకీ తెలియదు. ఈ హడావిడిలో ఎవరూ ఆవిణ్ణి గమనించలేదు. "ఎక్కడైనా నుయ్యో గొయ్యో చూసుకుందేమో! కాస్త చూడండి" - జోస్యులు వెంటవే హెచ్చరించారు.

"ఇక్కడే, ఎక్కడయినా నీళ్లున్నవేపు వెళ్ళుండచ్చు" మాస్టారాలోచించారు.

అయ్యగారు మరోలా వూహించారు. "మీరెక్కడెక్కడైనా చూడండి. నేను చెరువు కట్టమీదున్న గుడిలో చూసొస్తాను. చివరివాడక్కడ పడుకున్నాడు. నంజమ్మక్కడికే బహుశా వెళ్ళుండచ్చు". అని వాళ్ళతో చెప్పి, వడివడిగా అడుగు లేసుకుంటూ, వూరిముందు కెళ్లి కట్టెక్కి, గునుకు పరుగుతో, చెరువు కట్టమీదున్న గుడి చేరుకున్నారు. గడపదాటగానే ఆయన వూహించినట్టే జరిగింది. విశ్వం కంబడి మీద పడుకున్నాడు. వాడి తల నరసి తొడ మీదుంది. నంజమ్మ మూడు గజాల దూరంలో స్తంభందగ్గర కూర్చుని కుర్రాణ్ణే చూస్తోంది. ఆవిడ కంట్లో నీళ్ళు లేవు. దెయ్యంపట్టినవాళ్ళ చూపుల్లా చూపులున్నాయి.

నరసి అయ్యగారితో చెప్పింది. "నంజమ్మగోరు సీకట్లో పారొచ్చినారు. నేను కుర్రాడికి జావ పోస్తాకూస్తున్నాను. వచ్చి కొడుకు తల తీసి తొడ మీదెట్టుకుంది. తరవాతేం బుద్ది పుట్టిందో నన్ను ఇమంటారమ్మని 'వరసమ్మా, ఈడు నా కొడుకుకాడు. నా కొడుకంటే పాపంజాకొడుకు దేముడు కొంచబోతాడు. నీకిచ్చేస్తాను. నీకెట్టాను పిల్లాజెల్లాలేదు నువ్వేపెంచుకో. ఈడ కూకో, రా, నీ తొడమీదెట్టుకో. నాకూ ఈడికీ ఏమీ సంబంధం లేదు. ఈడు నా కొడుకుకాడు. నేవాడి అమ్మని కాను. అన్నారు. కొడుకుని నా తొడమీద పడుకోబెట్టి, ఆవిడల్లంత దూరంలో కూకున్నారు చూడండి".

"అలాగే చేయి వరసవ్వా. రామణ్ణా పోయాడు. మేము తరవాతి పని చూసుకుంటాం. నువ్వు ఇద్దరినీ జాగ్రత్తగా కనిపెట్టుకో. మగాళ్ళనెవళ్ళయినా పంపాలా?"

"నేనుండగా బయమేమి? ఎవ్వడూ అక్కరలే"

"జ్వరమెలావుంది" - కుర్రాడి నుదురు తాకిచూచి అయ్యగారడిగారు "తొడసందులో నొప్పిగిప్పి అని అన్నాడా?"

"కాసేపయింది మాట్లాడి. నేనే తొడసందులో చూసి అడిగేను. ఏమీ

లేదన్నాడు. జరం మాత్రం పేలిపోతోంది."

"ఎలాగైనా సరే. మూడుగంటలకో చుట్టు మందు తాగించు" అని నరసికి చెప్పి, "నంజవ్వా! భయపడకు. ఇంకా గడ్డకట్టలేదు. మందు పనిచేస్తోంది" - అని వూరడించి, అయ్యగారు-ళ్ళోకి వెళ్ళారు.

మాస్టారు వూరిముందు ఆడాళ్ళు చెంబట్టుకెళ్ళే పొదల దగ్గిరకెళ్లి "నంజమ్మగారు" అని కేకేశారు. జవాబు లేదు. వాపసు వచ్చారు. కడమవాళ్ళు ఇంటి దగ్గిరే కూర్చుని ఈ ఇంటికి పట్టిన గ్రహచారాన్ని గూర్చి చర్చించుకుంటున్నారు. అయ్యగారు రాగానే -"నంజమ్మ గుడిలో వుంది. మీరు కానివ్వండి." అన్నారు. నలుగురూ నాలుగువేపులా పట్టి పాడె పైకెత్తారు. కూడా చెన్నిగరాయులు బయల్దేరాడు. ఇక్కడింకా మిగిలిపోయిన హేమాద్రిపానకపు సీసాలు, ఒక పక్కా, రెండు కంబళ్ళూ తీసుకుని ఇంటికి తాళంవేసి అయ్యగారు చెరువు కట్టమీదున్న గుడివేపు బయల్దేరారు. ఈ పాటికి రామణ్ణ శవాన్ని శ్మశానానికి తీసికెళ్ళి దించివుంటారు. పార్వతికి పేర్చిన చితిమంటలు తోటలోవున్న కొబ్బెరచెట్ల సందుల్లోంచి కనిపిస్తున్నాయి. కట్టమీదనుంచి కిందికి దిగేచోట వృద్ధ పురోహితుడయ్యాశాస్తుల్లొక్కడే నడుం వంగి పోయి నుంచున్నది చీకట్లో కూడా కనిపిస్తోంది.

"ఏం స్వామీ? ఒక్కరే నిలబడ్డారు?" - అయ్యగారడిగారు.

"శవాన్ని తగలెయ్యడానికెళ్ళారు కదా? వాళ్ళురానీ అని నుంచున్నాను"

వాళ్ళ రాకకోస మీ శాస్తుల్లెందుకు కనిపెట్టుకూ్చున్నారో అయ్యగారి కర్థంకాలేదు. దాన్ని అడిగి తెలుసుకునే వ్యవధి లేదు. పక్కచుట్ట ,కంబళ్ళు మోసుకుంటూ ఆయన గబగబా గుడివేపు నడిచి వెళ్ళారు.

## 4

తెల్లారి ఎనిమిది గంటలకి, కుబరహళ్ళినుంచి, రెండు బళ్ళనిండా ఆకు, ఇద్దరు మనుషులు వచ్చారు. వాళ్ళు వూళ్ళోకి రాలేదు. రామసంద్రం వెట్టి కరణంగారి ఇంటిముందున్న వెదుళ్ళు బండికెత్తించి పట్టుకెళ్ళాడు. అమ్మవారి గుడివెనకాల, తోటపక్క బయల్లో మధ్యాహ్నానికి పాకతయారయింది. మాస్టారుగారే కట్టమీదున్న గుడికి వచ్చి, తాళంచెవి తీసుకుని వెళ్ళి సామాను సరంజామా, బట్టా, బాతా అన్నీ బండికెత్తించి షెడ్డుకు తోలించారు. ఆ రోజు సాయంత్రానికి వూరంతా ఖాళీ చేశారు.

విశ్వానికి జ్వర మెక్కలేదు. దిగలేదు. గడ్డలు కట్టలేదు. పార్వతికీ రామణ్ణకూ జ్వరమొచ్చిన ఇరవైనాలుగు గంటలలోగా గడ్డలు కట్టాయి. విశ్వానికి జ్వరం రెండు రోజులుగా కాస్తోంది. అయినా గడ్డలు లేవు. అయ్యగారిస్తున్న మందు వల్ల కావచ్చు. లేదా జ్వరం తగిలాక ఆలస్యం చేయకండా కొత్తమందిచ్చిన ప్రభావం కావచ్చు. చెడులక్షణాలేవీ అగుపించడం లేదు. మారి తగిలిన ఇంట్లో, చావు ఇంతటితో ఆగిపోతుందని చెప్పగలిగిందెవరు? "అయ్యగారున్నారు." ఇది ఈశ్వరుని గుడి. దీనిలోనికి మారి ఎలా వస్తుంది? అంచేతే విశ్వన్నకు గడ్డకట్టలేదు. నువ్వు భయపడకు."

నంజమ్మ పులకలేదు పలకలేదు. రాతిప్రతిమలా మౌనంగా కూర్చుని విశ్వాన్నే చూస్తూ తెల్లారేదాకా కన్ను మూయకుండా కూర్చుంది. తెల్లారేసరికి అయ్యగారికి బడలికగానూ నీరసంగానూ వుంది. నిన్నా, మొన్నా, ఆయన ఏమీ తినలేదు. మొన్నరాత్రి బండ్లో ప్రయాణం చేసినప్పుడు తీసిన కునుకు మినహాయిస్తే తరువాత కన్ను మూయలేదు. ఆయన నిజమయిన వయస్సెంతో ఆ వూళ్ళో ఎవరికీ తెలియదు. డెబ్భైఅయిదుకు పైబడే వుంటుందనటంలో సందేహం లేదు. రెండు రోజులుగా ఆయన శరీరం బాగా అలిసిపోయింది. స్తంభానికి చేరబడి కూర్చున్న ఆయన తమకు తెలియకండానే నేలమీదికి ఒరిగిపోయి అలాగే నిద్రపోయారు. నరసి అంది "అమ్మోరు! నాకు దేముడు పిల్లల్నివ్వలే, పిల్లల్లేరని చింతగా వుండేది. పిల్లలయినా చింతే."

నంజమ్మ మాట్లాడకండా కూర్చుంది. ఇంతలో మాస్టారు వచ్చి, ఇంటి తాళంచెవి ఇచ్చారు. నంజమ్మ పులకలేదు పలకలేదు. నరిసి మళ్ళీ మాట్లాడలేదు. ఆవిడ కుర్రాడికి మందిచ్చింది. కుర్రాడితల ఆవిడ తొడమీదే వుంది. కాసేపయ్యాక మాస్టారుగారి భార్య వచ్చింది. ఆమె కంట తడిపెట్టుకుంది. నంజమ్మ ఏడవలేదు.

"లేవండి మా షెడ్డుకెడదాం. మడికట్టుకుని కాస్త వుప్పిండి తిందురుగాని. మీరు నిన్నంతా ఏమీ తినలేదు".

. రానని నంజమ్మ తలాడించింది. మేస్టారి భార్య షెడ్డుకెళ్ళి ఓ గిన్నెలో వుప్పిండి పట్టుకొచ్చింది. నరసి అడిగింది. "చెన్నయ్యారేరీ?"

"రాత్రి అన్నీ ముగించుకుని వచ్చి మా షెడ్డు ముందరే గోనిపట్టమీద పడుకున్నారు. ఇప్పుడే ఆయనకి వుప్పిండి పెట్టొచ్చాను"

"కొడుకిక్కడున్నాడని ఆయనకి తెలీదా?"

"తెలుసు. ఇంతలోనే రావచ్చు"

"అమ్మోరూ! నరసి చెడుగా మాట్లాడుతోందనకండి. నాలాంటి లంజముండకి పిల్లలు పుట్టి, ఆళ్ళకి మంచో చెడో అయితే ఎవడూ రాడు. ఆళ్ళ బాబెవడో ఎవడికీ తెలవదు గనక ఎందుకొస్తారు. ఈ చెన్నయ్య తన కడుపున పుట్టిన కొడుకుని చూడాలని రాకండా వుప్పిండి మొక్కుతున్నాడా?"

మాట్లాడవద్దని నంజమ్మ నరిసికి చేత్తో సైగచేసి సూచించింది. మాష్టారు భార్య నంజమ్మతో అంది: "చూడండి. ఈ గ్రామ దేవతలున్నారే మారెమ్మ, సుంకలమ్మ వీళ్ళంతా మంచివాళ్ళు కారు. వీళ్ళు చెడు చేస్తారే కాని మంచి చేయరు. ఎలాంటి కష్టమైనా సరే శృంగేరి శారదాదేవి పరిహారం చేస్తుంది. విశ్వానికి నయమయితే వచ్చే నవరాత్రికీ సన్నిధికి వచ్చి కుంకుమార్చన చేయిస్తానని మొక్కుబడి కట్టండి. తప్పకుండా నయమవుతుంది. మీకు సూతకం, మీరేమీ చేయకండి. నేనింటికెళ్ళి మడిగా మీపేరిట నాలుగణాలు ముడుపు కట్టిపెడతాను."

అక్కరలేదని నంజమ్మ తలాడించింది.

"ఎందుకలా అంటారు?"

"ఏ దేవుడూ ఏమీ చేయడు. దేవుడు గీవుడన్నదంతా అబద్ధం. ఆయుష్షుంటే బతుకుతారు. లేకపోతే లేదు."

నరసి అంది: "నంజమ్మగోరూ! కోపంలో అట్టాగనకండి తప్పయిందనండి. ముడుపు కట్టండి."

"తప్పూలేదు. గిప్పూ లేదు. ఏ దేవుడికీ మొక్కుబడి చేయక్కరలేదు." నంజమ్మ గట్టిగా చెప్పింది. మళ్ళీ వాళ్ళిద్దరూ బలవంతం చేశాక – "మీకెలా తోస్తే అలా చేయండి." అంది. మేస్టారు భార్యవెళ్ళిపోయారు. ఇంతలో గుడి కొక్కొక్కరుగా ఎంతో మంది వచ్చారు. అందరికీ వాళ్ళవాళ్ళ పాకలు వేసుకునే గొడవే సరిపోయింది. నంజమ్మను పరామర్శిద్దామని వచ్చినవాళ్ళు విచారం వెలిబుచ్చారు. పార్వతి రూపాన్ని, గుణాల్ని పొగిడారు. రామణ్ణ తెలివితేటల్ని మెచ్చుకున్నారు. బతికి బట్టకట్టివుంటే తాసీల్దారుగిరి చేసే తెలివివాడిది. అలాంటి బుద్ధిమంతులు ప్రపంచంలో వుండరాదు, తనదగ్గిరే వుండాలని శివుడు లాగేసుకున్నాడు. పచ్చి ఒంటితో పార్వతమ్మ కొత్తచీర కట్టుకుని వెళ్ళుండకూడదు. అమ్మవారి కళ్ళు మొట్టమొదట ఆ అమ్మాయి మీదే పడ్డాయి – అని అందరూ తమకు తోచినట్లు వ్యాఖ్యానించారు. వూళ్ళో ఇంకా ఎనమండుగురికి ప్లేగు తగిలిందట. నిన్నరాత్రి

నలుగురు, ఈ రోజు వుదయం ఇద్దరు పోయారట. వూరి బయట దేవాలయంలో వున్న నంజమ్మకు గానీ, నరసికిగానీ ఈ సంగతి తెలియదు. వచ్చినవాళ్ళంతా ఒక్కొక్కరే వెళ్ళారు. సర్వక్కమాత్ర ముండిపోయింది.

నంజమ్మ, సర్వక్కా కష్టసుఖాల్లో చేదోడువాదోడుగా వున్న స్నేహితులు. సర్వక్కకూడా ఎదిగివచ్చిన కూతుర్ని పోగొట్టుకుంది. తన కూతురి చావుతో పాటు నరసిగుర్తొచ్చింది. ఆ నరసే తన కెదురుగుండా కూర్చుంది. నంజమ్మ కొడుకు తల దాని తొడమీదుంది. వాడు తన కొడుకే కాదన్నట్టు నంజమ్మ దూరంగా కూర్చున్నారు. నరసి పేరు చెబుతేనే సర్వక్కకు ఒళ్ళు మండుతుంది. మరొకప్పుడయితే దాన్ని చెప్పుచ్చుక్కొట్టేది. కానీ ఇప్పుడూరికే చూస్తూ కూర్చుంది. నంజమ్మను వదిలిపెట్టి పోవడమిష్టంగా లేదు. ఏం మాట్లాడాలో కూడా తెలియలేదు.

ఇంతలో కుర్రాడు గట్టిగా వూపిరితీయడం మొదలెట్టాడు. జ్వరం బాగా ఎక్కువపోయింది. "అమ్మోరు. జరానికి నా తొడంతా కాలిపోతోంది. కుర్రాడు గట్టిగా వూపిరి తీస్తున్నాడు. నాకు భయంగా వుంది చూడండి" – అని నరసి అంది.

"నేను చేత్తో తాకను. మీరే చూడండి సర్వక్కా" – అని నంజమ్మ అంది. దగ్గిరికెళ్ళి సర్వక్క కంబడిలో చెయ్యెట్టి చూసింది. ఒళ్ళంతా చెమట పడుతోంది. ఆవిడ అరచేతికి చెమటతడి తగిలింది. ఎందుకలా చెమట పట్టిందో ఆవిడ కర్థం కాలేదు. మామూలుగా నంజమ్మకు తెలిసేదేమో! కానీ ఇప్పుడావిడకి ఏమీ బోధపడలేదు. నరసి అయ్యగారిని పిలిచింది. ఆయన గాఢ నిద్రలో వున్నారు. సర్వక్కే ఆయన బుజాన్ని కదిపింది. ఆయన లేచి కూర్చుని కాసేపు కళ్ళు నులుపుకుని చుట్టూ చూశాక సర్వక్క చెప్పినమాట అర్థమయింది. ఆయన కూడా కుర్రాణ్ణి తాకి చూసి, "ఒళ్ళంతా చెమట పడుతోంది. జ్వరం దిగిపోయేముందు ఇలాగే జరుగుతుంది. గడ్డ గిడ్డ లేదు. నంజవ్వా! విశ్వన్న బతికిపోయాడు. బతికిపోయాడు".

నంజమ్మ మూగదానిలా కొడుకును చూస్తూ కూర్చుంది. "ఇంతే చాలు, శివుడు చల్లని చూపు చూశాడు" – అంది సర్వక్క. కుర్రాడింకా చెమటలు కక్కుతున్నాడు. కాసేపటికి జ్వరం చాలా తగ్గిపోయింది. అంతలో రేవణ్ణశెట్టి అక్కడికొచ్చాడు. నంజమ్మ ఇంతవరకూ అతనితో ఒకసారి కూడా మాట్లాడి వుండలేదు. అతడు కూడా నంజమ్మతో ముఖాముఖి మాట్లాడి ఎరగడు.

కుర్రాడికి చెమట పట్టిందన్న సంగతి విన్న అతడు కూడా తాకి చూచి "బతికిపోయాడు" అన్నాడు. "నంజమ్మగారూ! ఈ వూరికంతా బుద్ధిచెప్పగల తెలివున్నవారు మీరు. మీ కెవరయినా ఏం చెప్పగలరు చెప్పండి" - అని తనకు తోచింది చెప్పి పెళ్ళాంకేసి తిరిగి "అయ్యగారికి రెండు రోజులుగా భోజనంలేనట్టుంది. ఇంటికెళ్ళి ముద్దచేసి పట్టుకొచ్చివ్వు" - అని చెప్పి ఆవిణ్ణి తీసుకుని ఇంటికెళ్ళాడు. అయ్యగారు బలవంతం చేసి నంజమ్మను ముఖం కడుక్కోమ్మా అన్నారు. మాష్టారు భార్య తెచ్చిన వుప్పిండి అలాగే వుంది. "ఇకమీదట విశ్వన్నను చూసుకునే పూచీ నీది. ఒంట్లో శక్తి లేకపోతే ఎలాగ. నువ్వు తిను తల్లీ!" అన్నా ఆవిడ వినలేదు. చివరికి అయ్యగారు కోప్పడ్డారు. నరిసి బలవంతం చేసింది. నంజమ్మ ఒక ముద్ద వుప్పిండి నోటికెత్తి, మింగుడుపడక, లేచి వెళ్లి వుమ్మేసి, వుప్పిండి గిన్నె అవతలికి జరిపి మూతెట్టింది. అయ్యగారు తన సామాను మధ్య వున్న ఒక చిన్న డబ్బి వెదికి తీసి, దానిలో వున్న నల్లటి పొడి రెండు చిటికెలు తీసిచ్చి "దీన్ని నోట్లో వేసుకో" అన్నారు.

"ఇదేమిటయ్యగారూ?"

"శివుడి ప్రసాదం. కాశీమంచీ తెచ్చాను. మిగిలిపోయింది. తీసుకో.

నీశని విరగడైపోతుంది. కుర్రాడికి చెమట పట్టింది. జ్వరం తగ్గింది")

నంజమ్మ దాన్ని నోట్లో వేసుకుని మింగింది. చేదు, వగరు, తీపి అన్నీ కలిసిన రుచి. మళ్ళీ స్తంభానికి చేరబడి కొడుకునే చూస్తూ కూర్చుంది. ఇంతలో చెన్నిగరాయులు వచ్చాడు.

"ఇంతదాకా ఏం జేస్తున్నారు కరణంగారు?" - నరిసి అడిగింది.

"వద్దామని బయల్దేరాను. ఎవరెవరో వచ్చి పరామర్శిస్తూ ఆపారు. అలాగా కూర్చుండి పోయాను".

"వారెవా. పుట్టించిన పురుషుడా" అని నరిసి అనేసరికి అతడు తెల్లబోయి చూశాడు.

"నరువ్వా. ఏంమాట్టాడకు' - అయ్యగారన్నారు.

పది నిముషాల్లో నంజమ్మ కళ్ళు బరువుగా వాలిపోతున్నాయి. స్తంభాన్నానుకుని కూర్చున్న ఆవిడ అలాగే, మోకాళ్ళ మీద వాలిపోయింది. నిన్న రాత్రి తెచ్చిన పక్క దగ్గరగా పరిచి, అయ్యగారావిడ బుజం పట్టి పడుకోబెట్టి, పాత దుప్పటి కప్పారు. మరో రెండు నిముషాల్లో ఆమెకు బాగా నిద్ర ముంచుకొచ్చింది.

"అయ్యగోరూ! మీరు నంజంగోరి కిచ్చిందేట?"- నరిసి అడిగింది.

"నిద్దరొచ్చేమందు కాశీలో దీన్ని వాడుతారు. వచ్చేటప్పుడు తెచ్చాను. పాతది కాస్త మిగిలిపోయింది"

"అవుతే నాకూ కాస్తిఇవ్వండి"- చెన్నిగరాయలడిగారు.

"అది మగాళ్ళు తీసుకునేది కాదు. నంజమ్మకు రేపటిదాకా మెలుకువరాదు. మీరిక్కడే వుండండి. మీకిక్కడే అన్నం తెచ్చి పెట్టమని మాస్టారింటాళ్ళకు కబురెడతాను" అని చెన్నిగరాయులకు హామీ ఇచ్చి అయ్యగారు నరసితో చెప్పారు. "నరసవ్వా!, ఇక భయంలేదు. కుర్రాణ్ణి కిందపడుకోబెట్టు. నువ్వింటికెళ్ళి అన్నంచేసుకో, వెళ్ళు. రాత్రంతా నీకూ నిద్దరలేదు. ఇంటికెళ్ళి పడుకో"

"అయ్యగోరూ! కుర్రాడు బతికితే చాలు. మరో రెండ్రోజులిట్టాగే కూకోమన్నా కూకుంటాను"

"ఇంటికెళ్ళి అన్నంతిని కాస్త నిద్దరపోయి మళ్ళీరా"

ఒక చిన్న కంబడి మడిచి వ్చారయ్యగారు. దానిమీద కుర్రాడి తల మెల్లగా పెట్టి, నరిసి లేచి తన ఇంటికెళ్ళింది. నంజమ్మకు మెలకువ రానేలేదు. మధ్యాహ్నాని కల్లా కురుబరహళ్ళి నుంచి గుండేగౌడ, ఇంకా కొందరు గుడికి వచ్చారు. గట్టిగా మాట్లాడరాదని అయ్యగారు చెప్పడంతో చెన్నిగరాయలనే బయటికి తీసుకెళ్ళి పరామర్శించారు. "మేమూ చేతనయిందల్లా చేశామండి! లాభం లేకపోయింది. ఇద్దరూ పోయారు" అని చెబుతుండగా చెన్నిగరాయల కంట్లో నీళ్ళు రాలాయి.

ఇక్కడ కలిగిన ఈ వుపద్రవాన్ని సూర్యనారాయణకు వ్రాసి 'క్షేమం' అని వ్రాసే జాగాలో నల్లసిరా రాసి మాస్టారు కార్డు వ్రాసి పోస్టులో వేశారు.

## 5

పిల్లలిద్దరూ పోయి ఆరురోజులయింది. నంజమ్మ తన షెడ్డుకు వచ్చింది. ఇప్పుడు చెన్నిగరాయలు నంజమ్మ ఇద్దరే షెడ్డులో. విశ్వానికి జ్వరం బొత్తిగా వదిలింది. కోలుకుంటున్నాడు. ఇంట్లో సూతకం మైల పదిరోజులుంటుంది. అందాకా కుర్రాడు గుళ్ళోనే వుండనీ అని మాదేవయ్యగారన్నారు. అంచేత కుర్రాడు గుళ్ళోనే వున్నాడు. షెడ్డుకు తీసుకెళ్ళడానికి నంజమ్మకు భయం. తెల్లారొకసారి, మధ్యాహ్నమొకసారి గుడికెళ్ళొస్తుంది. సూతకం గనక గుళ్ళోకెళ్ళడం లేదు. విశ్వానికి సూతకం మైలవున్నా వాడు కుర్రాడు. లేచికూర్చోగలిగిన శక్తి

వచ్చినా అయ్యగారు వాణ్ణెప్పుడూ పడుకోబెట్టేవుంచారు. గుడి తలుపు దగ్గిరే కూర్చుని, వాణ్ణి చూసి, అయ్యగారితో మాట్లాడి, షెడ్డుకు వెళ్ళిపోయేది. పార్వతికి ,రామణ్ణకు తెచ్చిన హేమాది పానకం, జ్వరం తగ్గినా మాదేవయ్యగారు కుర్రాడికి తాగించడం మానలేదు.

కన్నతల్లి ముందే పిల్లలెందుకు చచ్చిపోతారు? అన్న ప్రశ్న నంజమ్మను పీడిస్తోంది. ఎంత ఆలోచించినా సమాధానం దొకడంలేదు. ఒకరోజు అయ్యగారి నడిగితే ఆయనిలా అన్నారు. "తల్లీ! ఇదంతా దేముడి మాయ, కృష్ణుడు కుర్రాడుగా వుండగా తల్లిని రకరకాలుగా పరీక్షచేశాడట. అతడు అన్నం తినకపోతే ఆవిడ తినేదికాదు. అతడు పాలు తాగేదాకా ఆమె నీళ్ళు కూడా తాగేది కాదు. ఈ తల్లి ప్రేమని ఇంకా పరీక్ష చేయాలని ఒకరోజు అడిగాడట, "అమ్మా! నేను చచ్చిపోతే మువ్వేంజేస్తావు?"

"నిన్ను వదిలి నేనుంటానా తండ్రీ! వెనకాలే నేనూ చస్తాను"- అంది.

"నిజమా?" - అని అడిగాడు.

"నీ మీదొట్టు - నాచిట్టితండ్రీ!"- అని ప్రమాణం చేసింది.

"ఒకరోజు అతడు దగ్గిరేవున్న మడువులో కాలు జారిపడి పోయాడు. ఒకసారి మునిగి మళ్ళీ పైకి లేచినట్టే లేచి, " అమ్మా! పైకిలాక్కో నువ్వూ నీళ్ళలోదూకు. నేను చచ్చిపోతున్నాను. బతికించుకో"- అని కేకేశాడు. అతడి నోట్లోకి నీళ్ళు వెళ్ళాయి. గోపమ్మ ఒడ్డుమీదే నుంచుంది. "ఎవరైనా వచ్చి నాకొడుకుని పైకి తీయండర్రా" అని కేకలేసింది. ఎవళ్ళూ రాలేదు. కట్టుకున్న చీరే విప్పి, ఓ చివర పట్టుకుని మరోచివర కొడుకు వేపు విసిరింది. అది అతని కందలేదు "అమ్మా! అమ్మా!" అంటూనే అతడు నీళ్ళలో మునిగిపోయాడు. చచ్చి పోయాడు కూడా. గోపమ్మ చీర మళ్ళీ కట్టుకుని ఒడ్డుమీద కూర్చుని ఏడ్చింది చూడు, కంటికి మంటికి ఏకధారగా ఏడ్చింది. తానుకూడా నీళ్ళల్లో దూకి ప్రాణం తీసుకుందామని, లేచి ఒడ్డుమీద నుంచుంది. ఎందుకో చావంటే భయమేసింది. నీళ్ళల్లో దూకలేదు. కొడుకును పొట్టనెట్టుకున్న గంగమ్మ తల్లిని తిట్టిపోసింది. లబోదిబోమంది. ఒడ్డుమీదే కూచుంది. నీళ్ళల్లో మాత్రం దూకలేదు. ఒకరోజయింది, రెండురోజులయింది. గోపమ్మ రోజూ వచ్చి ఒడ్డుమీద కూచుని ఏడ్చేది. నీళ్ళల్లో మాత్రం దూకలేదు. మూడోరోజు కృష్ణుడే పైకి లేచొచ్చి "అమ్మా! ఇంతేనా నీ ప్రేమ? నేను చచ్చినా నువ్వు చావలేదు. ఇక మీదట తల్లి

ఎదటే కన్నబిడ్డలు చావనీ" అని శాపమిచ్చాడు. అందుకే ఇలా జరుగుతోందట"
ఇది వినగానే నంజమ్మకు గోపి మీద విపరీతమయిన కోపం వచ్చింది. ఆమె నీళ్ళల్లోకి దూకి వుంటే, ప్రపంచంలో తల్లి ఎదుట పిల్లలు చచ్చిపోయేవారు కాదు. గోపి ఎంతయినా మనిషి. శ్రీకృష్ణుడో దేవుడు. మానవమాత్రురాలయిన తల్లి ప్రేమను పరీక్షించడానికే అతడిలా చేశాడు. దేవతామాత అయ్యింటే చచ్చిపోయేదేమో! కాని దేవతలకు చావేలేదు. అయితే ఆమె కొడుక్కూ చావులేదు. అప్పుడీ కథే జరిగేదికాదు.
షెడ్డుకు వచ్చాక కూడా ఆవిడ మనస్సు దీన్ని గూర్చే ఆలోచిస్తోంది. ఇదే. వట్టి కథా లేక నిజమా? - అన్న ప్రశ్న కలిగింది. కథకావచ్చు పార్వతి రామణ్ణ చచ్చిపోతే తానెందుకు చచ్చిపోలేదు? అన్న ప్రశ్న మనస్సులోనే కలిగింది. కలగ్గానే ఆశ్చర్యమూ వేసింది. తాను కూడా చచ్చిపోవాలన్న బలమైన కోరిక ఏర్పడింది. అప్పటికే రాత్రి ఎనిమిది గంటలయింది. చెన్నిగరాయలు పొగాకు నములుతూ పాకకెదురుగుండా వున్న రాతి తిన్నెమీద కూర్చున్నారు. నంజమ్మ లోపల పక్కపరచుకుని పడుకుంది. నిద్దరరాలేదు. తానుకూడా ఈరోజా చచ్చిపోవాలి. పార్వతి రామణ్ణల్ని వెబండించి వెళ్ళి పోవాలన్న నిశ్చయం మనస్సులో గట్టిగా పాతుకుపోయింది. తాను, గోపమ్మలాకాక, ధైర్యంగా చచ్చిపోతే, దేవుడు తమ్మా, తన పిల్లల్ని బతికించి వెనక్కి పమ్మంటాడేమో! ఆమె చూచిన యక్షగానాల్లోనూ, చదివిన పురాణాల్లోనూ అలాగే జరుగుతుంది. తనకూ అలాగే ఎందుకు జరగగూడదు? కాని పిల్లలిద్దరూ ఒకేరోజు చచ్చిపోయిన నాటి నుంచీ దేవుడన్నా పురాణాలన్నా నమ్మకమే పోయింది. గోపి కృష్ణుడికోసం వెనకాడిందో లేదో! దాంతో నాకేం పని, ఇప్పుడు నా పిల్లలు పోయారు. ఈ ఆరు రోజులు వాళ్ళు లేనిదే నరకమనుభవించాను. ఈయాతన భరించలేను. నేనూ చచ్చిపోవాలి.
అంతలో ఆవిడ భర్తలోపలికొచ్చి పడుకున్నాడు. ఆయన గొరకకూడా స్ఫుటంగా వినిపిస్తోంది. నంజమ్మ పైకి లేచింది. అప్పటికే పదిపదకొండు గంటలయింది. షెడ్డు తలుపు చేరవేసి ఆవిడ బయటికి వచ్చింది. ఎక్కడికెళ్ళాలి? చచ్చిపోవడమెలాగ? - అని స్పష్టంగా ఆలోచించకుండానే ఇద్దరు పిల్లలు కాలి బూడిదయిన శ్మశానం వైపు కాళ్ళు తీసుకెళ్ళాయి. శవాల్ని దహనం చేసినప్పుడావిడ వెళ్ళలేదు. ఆడాళ్ళు శ్మశానానికి వెళ్ళరాదట. తిన్నగా అక్కడికే వెళ్ళింది. ఏ భయమూ లేదు. జంకు జడుపు లేదు. దెయ్యాలు పిశాచాలన్న భీతి

మనసులోనే కలగలేదు. చీకట్లో కూడా రెండు శవాల చితులు కాలిన జాగాలు కనపడుతున్నాయి. తన ఇద్దరు పిల్లల్ని మినహాయించి ఏ అగ్రజాతి శవమూ పడలేదు. అక్కడగుపించే చితుల గుర్తులు రెండూ తన పిల్లలవే. దానిలో పార్వతిదేది? రామణ్ణదేది? – అన్నది మాత్రం తెలియలేదు. అది తెలిస్తే మాత్రం లాభమేమి? మూడవరోజే అస్థి సంచయనంకూడా జరిగింది. అయినా ఆవిడ వంగి రెండు జాగాల్లోనూ గుప్పెడు గుప్పెడు బూడిద తీసి తన చెరుగులో కట్టుకుంది. శ్మశానం దగ్గిరే ఒక బావివుంది. శవాలను తగలెట్టిన తరువాత శవవాహకులు, సంస్కారకర్తలు స్నానం చేసే దందులోనే. కడమ సమయాలలో దాన్నెవరూ వుపయోగించరు. అంచేతే నీరు కాస్త పాచిపట్టివుంటుంది. తానందులో దూకాలి. దూకి చావాలి. మెట్టమీదున్న నాలి బండ మీద నుంచుని దూకాలి. కళ్ళు మూసుకుంది. నల్లగావున్న చీకటి నుసీ కటిక చీకటయింది. నవనాడులు పొంగి నట్టయి రెండు నిమిషాలు ఒంటి మీద స్వాధీనం తప్పింది. చేతులు కాళ్ళు తనకు తెలియకుండానే వణికాయి. బావిలో నీళ్ళు చేత్తో కదిలించింది. క్రమంగా నరాలు శాంతించాయి. శరీర కంపనం తగ్గింది. ఏ ఆలోచనగాని భావనగాని లేక, సకల వ్యాపారాలు నశించి, మనస్సు శూన్యమై పోయింది. చావంటే ఇదేనా? ఇంతేనా? అక్కడెవరూ లేరు. పార్వతి లేదు. రామణ్ణలేడు. చివరికి తానూలేదు – ఏమీ లేదు. అడుగు ముందుకేసి దూకడమొకటే తరువాయి. కష్టంలేకుండా, అప్రయత్నంగా, నిరాయాసంగా అడుగు ముందుకు పడాలి.

ఆ అడుగు వేసేముందు, వూళ్ళోవున్న మిగిలిన వాళ్ళొకసారి గుర్తొచ్చారు. మిగిలిన వాళ్ళిద్దరే. భర్త .ఆయన గొడవాయనదే. విశ్వం .విశ్వం గుర్తురాగానే మనస్సు విచలితమైంది. వాడు ప్లేగు వచ్చినా చనిపోలేదు. బతికి బయట పడ్డాడు. వాడికి దిక్కెవరు? పెంచేదెవరు? అయ్యగారే వాడికి దిక్కని మనస్సు చెబుతోంది. పిల్లలు చచ్చిపోయారన్న దుఃఖంతో నంజమ్మ ప్రాణాలు తీసుకుందని తెలిసిన అయ్యగారు వాడికెప్పుడూ అండగా వుంటారన్న నమ్మకం కలిగింది. కానీ తాను లేకపోతే తల్లిలేని పిల్లాడవుతాడు. అయ్యగారెంత చేసినా తల్లితో సమానమవుతారా? పార్వతికీ రామణ్ణకు రోగం తగిలి తనకెందుకు తగల్లేదు? విశ్వాన్ని పెంచిపెద్దచేయనీ అవేగావును దేవుడు తమ్ము బతికించాడు. నేను పెంచాలనే గావును వాణ్ణీ బతికించాడు. విశ్వం ముఖం గుర్తొచ్చింది. పార్వతి కున్న విశాల ముఖమూ, రామణ్ణకున్న బుద్ధీ, శక్తీ వాడిలో మేళవించాయి. వాళ్ళిద్దరికి బదులుగా వాడు

బలికాడేమో! తాను ప్రాణం తీసుకుంటే ఎలాగ? వాడికేందారి?

ఇలా ఆలోచిస్తూ ఆవిడ నాలికబండ మీదే గొంతుకూర్చుంది. తనకు పెళ్ళి కావడమూ, ఈవూరికి రావడమూ, ఈ పిల్లలు పుట్టిందీ అన్నీ గుర్తువచ్చాయి. తరువాత తనకు కలిగిన కష్టాలు, సుఖాలు, వర్షాలు లేక వూరికి వచ్చిన వరప్పు, పార్వతి రామణ్ణలు, ఆకలి బాధ ఎంత సహించిందీ అన్నీ గుర్తొచ్చాయి. అంత మంచివాళ్ళు గనకనే దేవుడు వాళ్ళని తనవద్దకి తీసుకుపోయాడు. విశ్వం ఆకలిబాధ కోర్చలేక తన్ను పట్టి కొట్టేవాడు. వాడి స్వభావం అంత. ధైర్యంలో, కోపంలో, తొందరపాటులో, భోజనంలో వాడేవాడు. కాని వాడు తండ్రిలాగా తిండిపోతు, స్వార్థపరాయణుడు కాడు. నీచబుద్ధిలేదు. దిబ్బమీద ఏచెట్టెక్కి ఏ పండుకోసి తెచ్చినా తల్లినీ, అక్కయ్యను, అన్నయ్యనూ వదిలి, తినేవాడు కాడు. అలాంటి వాణ్ణి వదిలి తల్లిలేని వాణ్ణి చేసి తాను చచ్చి సాధించేదేమిటి? ఇప్పుడు చచ్చి మరోలోకాని కెళ్ళినా అక్కడ పార్వతి రామణ్ణ లిద్దరూ "అమ్మా! నువ్వు విశ్వాన్నిలా వదిలొచ్చావే. వాడి గతేమి? నీకేమాత్రం బుద్ధిలేదా అంటే ఏం చెప్పాలి?"

తనకు తెలియకుండానే లేచి నాలిక బండనుంచీ ఒడ్డెక్కింది. రాళ్ళు, ముళ్ళు వుంటాయని జాగర్తగా చూసుకుంటూ వెళ్ళిన దారంబడి నడిచి శ్మశానానికి వచ్చింది. పార్వతి రామణ్ణల చితిస్థానాల మధ్య కాసేపు నుంచుంది. తరువాత షెడ్డుకు కుడివేపుగా కాక, ఎడమవేపుగా కాళ్ళు దేవాలయానికి దారితీశాయి. కట్టమీద దారి చీకట్లో కూడా బాగా కనిపిస్తోంది. ఎడ్లబండ్లు సులువుగా వెళ్ళగలిగినంత విశాలంగా వుందా దారి. దేవాలయాన్ని సమీపించగానే అయ్యగారు లోపల పాడుతున్న పాట వినిపించింది. ఆవిడ లోపలికెడితే దేవాలయం మధ్య అంకణంలో ఆముదపు ప్రమిద వెలుగుతోంది. విశ్వం పక్కమీద పడుకుని నిద్రపోతున్నాడు. వాడికి కంబడి కప్పి, వాడి పక్కమీదే ఓరగా కూర్చుని అయ్యగారు కుడిచేత్తో తంబూరా మీటుతూ పాడుతున్నారు.

"హళ్ళకొళ్ళద బళి తనువు తంపిద బళి
గుళ్ళద హణ్ణు పులమాదుదు
గుళ్ళద హణ్ణు నెలకుదిరి చీళువాగ
అదర బళ్ళిగె హేళి హోయితె బందు మాత ...

తలుపు దగ్గరగా వచ్చి నుంచున్న ఆకృతిని గమనించిన అయ్యగారు ఆవేపు

తిరిగి చూచారు. ఆమెను గుర్తుపట్టి అడిగారు." సాయంత్రంతం వొచ్చావు కదా. మళ్ళీ ఎందుకొచ్చావు తల్లీ? ఏమీ బెంగెట్టుకోకు. విశ్వన్న గుండ్రాయిలా వున్నాడు. ఇకమీద వాణ్ణి విశ్వన్న అనకు. గుండణ్ణ అను. అలాగే పెరిగి పెద్దవాడవుతాడు."

అయ్యగారి నోరుమంచిది. ఆశీర్వాదమంతకన్నా మంచిది. ఆయన మాటే చాలు. ఇకమీద వాణ్ణి గుండణ్ణ అనే పిలవాలి - అని మనస్సులోనే నిశ్చయించుకుని "వూరికే వచ్చాను. ఏమీలేదు. వెళ్ళొస్తాను" అంది.

"ఇప్పుడెందుకొచ్చావు?"

"వూరికే వచ్చాను"

కావలిస్తే ఇక్కడే వుండు. కానీ చూడు తల్లీ, లోకుల నోరు ఒకేరకంగా వుండదు. నువ్వింటికెళ్ళు."

'వెడతాను" అని బయల్దేరింది.

"కాస్త దూరమొచ్చి దిగబెడతానుండు తల్లీ"

"వద్దొద్దు, కుర్రాడొకడే పడుకున్నాడు"- అనేసి వడివడిగా ఆవిడ కట్టమిదికి వచ్చేసింది. షెడ్డువేపు నడుస్తోంది. ఇంతలో చీర కొంగులో కట్టుకున్న బూడిద గుర్తొచ్చింది. కట్టకెడమవేపుగా దిగి కొంగు విప్పి, చెరువు నీటిలో దాన్ని చల్లి 'గంగమ్మతల్లీ! దీన్ని నీ కడుపులో దాచుకో" అని చెప్పి, మళ్ళీ కట్ట ఎక్కి షెడ్డు కెళ్ళిపడుకుంది.

## 6

ఆరోజు పొద్దుటే దేవాలయానికెళ్ళి విశ్వాన్ని చూచి వచ్చి షెడ్డులో కూచుంది. ఇది ఏడవరోజు. క్రమంగా జరిగివుంటే రామణ్ణకుత్తర ప్రకియలీరోజునుండి మొదలెట్టి వుండాలి. ఏం శాస్త్రమో వల్లకాడో! ఆవిడా విషయమై ఎక్కువగా ఆలోచించనూ లేదు. ఎవరూ గుర్తుచేయమూ లేదు. పార్వతి కర్మల బాధ్యత దాని భర్తది.

మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. నంజమ్మ మోకాళ్ళమీద తల పెట్టుకుని కూర్చుంది. చెన్నిగరాయలెక్కడికో వెళ్ళాడు. తెల్లబట్టలు కట్టుకుని ఎవరో పాకలోపికి వచ్చినట్టయింది. తలెత్తి చూసింది. వచ్చినవాడు సూర్యనారాయణ. పార్వతి భర్త. ఎడమచేత్లో రత్నపాప చేయి పట్టుకున్నాడు. బుజానికో పెద్ద సంచి

వెళ్ళాడులోంది. కుడి చేతిలో వెదురుబుట్ట బరువుగా వుంది. వచ్చిన వాణ్ణి నంజమ్మ కూర్చోమనీ చెప్పలేదు. అల్లుడొచ్చాడని, సిగ్గుతోగాని, మర్యాద గాని లోపలికి వెళ్ళలేదు. సూర్యనారాయణే – "పాపా అమ్మమ్మ దగ్గిరికెళ్ళు" అన్నాడు.

రత్నపాప నంజమ్మను మరచిపోలేదు. తిన్నగావచ్చి ఆవిడ భుజంమీదే చేయివేసింది. దాన్ని తీసుకుని తొడమీద కూర్చోబెట్టుకుంది నంజమ్మ. సూర్యనారాయణ బుట్టమూతతీసి "దీన్ని తీసి దాచండి. వేడికి వాడిపోతాయి అని ఒక్కొక్కటే బయట తీసి వుంచాడు. గమగమలాడే మల్లెపూల పొట్లం. లేత తమలపాకులకట్ట. కమలాపళ్ళు. అరటిపళ్ళు హోటల్ నుంచి తెచ్చిన తిండి పొట్లాలు. వాటినంతా చూడగానే నంజమ్మకు దుఃఖం పొంగిపొర్లింది. రత్నపాపను వాటేసుకుని ఒకసారి వెక్కివెక్కి ఏడ్చింది. కంగారు పడుతూ సూర్యనారాయణ తలెత్తి చూశాడు. నంజమ్మ తన ఒడిలో వున్న పాపనక్కడే వదిలి వంటింట్లోనికి వెళ్ళిపోయింది. అతనికేమీ బోధపడలేదు. లోపలనుంచి వెక్కివెక్కి ఏడవటం మాత్రం వినిపిస్తోంది.

"అమ్మా! ఏమిటి సమాచారం? ఎందుకేడుస్తున్నారు?" అని అతడడిగాడు. (ఆవిడ బదులు చెప్పలేదు. తానే, వంటింటిదాకా వచ్చి అడగటానికి సంకోచం, ఏమీ బోధపడక వూరికే కూర్చున్నాడు. కానీ అతని మనస్సులో ఒకరకమైన అవ్యక్తమైన శంక, భీతి కలిగాయి. అర్ధగంట ఇలాగే గడిచింది. సూర్యనారాయణే "అమ్మా! నాతో మనసిచ్చి మాట్లాడరాదా?" అన్నాడు. నంజమ్మ మాట్లాడలేదు. వంటింట్లోనుంచి వచ్చి షెడ్డుబయటికి వెళ్ళిపోయింది. దగ్గరే మరో షెడ్డుముందాడుకుంటున్న కుర్రాణ్ణొకణ్ణి పిలిచి "బాబూ! మాస్టారుగారి షెడ్డుకెళ్ళి నేను పిలుస్తున్నానని ఆయన్ని వెంటనే పిలుచుకురా వెళ్ళు" అని చెప్పి పంపింది. కుర్రాడు పరుగెత్తుకెళ్ళాడు. అయిదు నిమిషాల్లో మాస్టారొచ్చారు. "ఎందుకు కబురెట్టారట?" అని అడిగిన ఆయనతో "మాషెడ్డుకెళ్ళి చూడండి" అని చెప్పి ఆవిడ అక్కడ నిలబడకుండా తిన్నగా చెరువుకట్టమీదున్న దేవాలయం వేపు వెళ్ళిపోయింది.

ఏమిటి సంగతి అని మాస్టారు షెడ్డుకు వెళ్ళి చూశారు. సూర్యనారాయణ వెర్రిమొహమేసుక్కూచున్నాడు. అతని ముందు, పళ్ళు,పూలు, తమలపాకులు, తిండిపొట్లాలు వున్నాయి.

రత్నపాప తండ్రిబుజం మీద వాలి నుంచుంది.

"ఎప్పుడొచ్చారు? నా వుత్తరమందలేదా?"

"ఏం వుత్తరం? లేదే"

"అయిదురోజులయింది రాసి"

"మావూరికి పోస్టు వారానికోసారి వస్తుంది."

మాస్టారు మళ్ళీ మాట్లాడలేదు. "నాకేమీ బోధపడలేదు. అదేమిటో చెప్పండి వెంకటేశయ్యగారూ" అని సూర్యనారాయణ అడిగాడు.

"ఈ నోటితో ఎలా చెప్పను?"

"చెప్పండి ఫరవాలేదు" – అన్నప్పుడతని కంఠంలో తడబాటు స్పుటంగా కనిపించింది.

"పార్వతమ్మ, రామణ్ణ – ఇద్దరూ పోయారు. ఏడురోజులయింది".

"ఏమిటి?" తెరిచిన నోరు తెరిచినట్టేవుండిపోయిందతనికి.

"ప్లేగు. వూరికి వచ్చినమారి మొదట వీళ్ళింటిమీదే వచ్చిపడ్డది. అక్కాతమ్ముడూ ఇద్దరూ ఒకే రోజు ఒకరి తరువాత ఒకరు వెళ్ళిపోయారు. విశ్వం కోలుకొంటున్నాడు," అని ఆయన అంతా చెప్పారు.

సూర్యనారాయణ మూగవాడిలా కూర్చుని విన్నాడు. అంతా చెప్పి ముగించాక, మాస్టారుగారు "గ్రహచారమండీ గ్రహచారం! తలరాత ఎవరు తప్పించగలరు". అన్నప్పుడతనికి దుఃఖం పొంగిపొర్లింది. ఎంత నిగ్రహించుకున్నా లోపలినించి ఏడ్పుపొంగివచ్చింది. వెక్కివెక్కి ఏడుస్తూ వుండి వుండి నిట్టూర్చాడు. తండ్రి ఏడవటం చూచి రత్నపాప తానూ ఏడవటం మొదలెట్టింది. దానికేం తెలిసిందో! ఎంత తెలిసిందో!

"వెంకటేశయ్యగారూ! నేను నష్టజాతకుణ్ణి" అని కూతురుని వాటేసుకుని తన ముఖాన్ని అమ్మాయి వీపులో దాచుకున్నాడు.

ఏం చెప్పాలో మాస్టారు గారికి తెలియలేదు. పదినిమిషాలూరికే కూర్చున్న తరవాత "లేవండి, మా షెడ్డు కెడదాం" అన్నారు.

"లేదు. ఇప్పుడొద్దు. నేను తిరిగి వెళ్ళిపోతాను"

"వెడుదురుగానీ రండి. పాపకయినా ఏదో కాస్త పొట్టకి పడాలి కదా?" – అని బలవంతం చేసి, అతణ్ణి లేపి, షెడ్డు తలుపువేసి, తిరగలి మీదున్న తాళం తగిలించి, బహల్దేరారు. వాళ్ళు షెడ్డుకు వెళ్ళాక సూతకంమై లవున్న రత్నపాపకు మోదుగువిస్తట్లో

అన్నం కలిపి పెట్టారు. సూర్యనారాయణ కప్పు కాఫీకూడా ముట్టుకోలేదు. అమ్మాయి భోజనమయ్యాక అతడే విస్తరి తీసి పారేసి, గోమయం వేసి అలికి "పదండి దేవాలయానికెళ్ళి కుర్రాణ్ణి చూసివద్దాం" అన్నాడు. ఇద్దరూ చెరువుకట్టనేపువెళ్ళారు. సూర్యనారాయణ రత్నపాప నెత్తుకున్నాడు.

వీళ్ళు దేవాలయానికెళ్ళేసరికి నంజమ్మ షెడ్డుకువచ్చేసింది. మాస్టారుగారింటికో అబ్బాయిని పంపి తాళంచెవి తెప్పించుకుంది. అంతవరకూ చెన్నిగరాయల కంతామాస్టారింటిలోనే జరుగుతోంది. మాస్టారు భార్య వీళ్ళ షెడ్డుకే తెచ్చిపెట్టే అన్నమొక ముద్ద తింటే తినేది. లేకపోతే కుక్కకి పడేసేది. తలుపు తెరిచి లోపలికొచ్చేసరికి సూర్యనారాయణ తెచ్చిన పళ్ళు పూలూ అన్నీ అక్కడే వున్నాయి. వాటిని చూడలేక, ముఖమువతలికి తిప్పుకుని లోపలికెళ్ళింది. కరణీకం లెక్కలపుస్తకాలు పెట్టే భోషాణంలో పార్వతిపెళ్ళిచీరలు, సూర్యనారాయణపెట్టిన దుద్దులు, బేసరి, వెండికడియాలున్నాయి. అన్నీ బయటికి తీసి ఒక తెల్ల తుండుగుడ్డలో మూటకట్టింది.

ఒక గంటయ్యాక దేవాలయంనుంచీ వాళ్ళు తిరిగివచ్చారు. సూర్యనారాయణ మాట్లాడకుండా వూరికే నుంచున్నాడు. మాస్టారే "ఆయన వెడతారట. రేపన్నీ ఏర్పాటు వేసుకుని ఎల్లుండి తొమ్మిదోరోజునుంచీ అయినా కర్మ మొదలెట్టాలి గదా?" అన్నారు. నంజమ్మ దానికేమీ జవాబు చెప్పలేదు. తాను కట్టిపెట్టిన మూట తెచ్చి ముందెట్టి "ఇవి దాని చీరలు, నగలు, - మీవి, సంచిలో పెట్టుకోండి". అంది.

దాన్ని చూడగానే అతనికళ్ళల్లో నీళ్ళు నిండాయి. "అమ్మా! నా మూలధనమే పోయాక వీటిని పట్టికెళ్ళి ఏంచేసుకుంటాను? నాకక్కర లేదు" - అన్నాడు.

"కన్యాదానమయ్యాక అది మీ వస్తువైపోయింది. దాని చీరలు నగలు మా ఇంట్లో వుంచుకొని ఏంచేస్తాం? అవి కళ్ళ ఎదటవుంటే నాకు మనస్సు కెలికినట్టవుతుంది"

మాస్టారు చెప్పాక అతడా మూట సంచిలో పెట్టుకున్నాడు. తాను నుంచున్న చోటునుంచే అత్తయ్యకు వంగి నమస్కారంచేసి, కూతురి చేత చేయించి, ఒక చేత్తో సంచి, ఒకచేత్తో అమ్మాయినీ పట్టుకుని నెమ్మదిగా అడుగులేసుకుంటూ వెళ్ళిపోయాడు. మోటారు రోడ్డుదాకా మాస్టారు వెళ్ళారు.

ఇప్పుడా రోడ్డు మీద మూడు బస్సులు తిరుగుతున్నాయి. మొదలియారు

బస్సుకాక, సి.పి.సి కంపెనీ బస్సులు రెండు నడుస్తున్నాయి. రోడ్డు మీది కెళ్ళిన పదినిమిషాలకే తిపటూరివేపు వెళ్ళే బస్సు వచ్చింది. బస్సెక్కించి మాస్టారు వూరికి తిరిగొచ్చేసరికి నంజమ్మ మాస్టారుగారి షెడ్డులోనే వుంది. మాస్టారామెతో అన్నారు. "పార్వతమ్మ అపరకర్మలు ఎల్లుండి నుంచీ మొదలెట్టి ఆయన చేస్తారు. రామణ్ణ వడుగైనకుర్రాడు. ఏదో ఒక శాస్త్రం చేయక తప్పదుమరి. ఈ జోస్యుల చేతిలో పడ్డామా నున్నగా డేకించేసాడు. ఇతరుల కష్టసుఖమేమీ చూడరు. బాధ్యతంతా నాకు వదిలేయండి. పాతికరూపాయల్లో అంతా పూర్తి చేస్తాను. ఇక్కడ మనమేంజేసినా అక్కడ చచ్చిన జీవుడికేమీ ఒరగదు. మన కర్మ విమోచనం కావటానికి మనం చేయాలి. అంతే"

"ఇప్పుడు డబ్బుకే ఇబ్బందిగావుంది. మీరే కాస్త కురుబరహళ్ళికి వెళ్ళిరండి. గుండేగౌడగారు ఇలాంటి సమయాల్లో లేదనరు. వచ్చే ఏటి పన్నులో మినహాయించుకుంటే సరిపోతుంది.

మాస్టారప్పుడే కురుబరహళ్ళికి బయలుదేరారు. నంజమ్మ తన షెడ్డుకు వెళ్ళింది.

## 7

అదే రోజు సాయంత్రానికి బండ్లో కూర్చుని అక్కమ్మ, కల్లేశు ఇద్దరూ వచ్చారు. అక్కమ్మ దారిపొడుగునా ఏడుస్తూనే వచ్చిందని, బండిదిగగానే తెలిసిపోయింది. కల్లేశు ముఖం కూడా వాడిపోయింది. షెడ్డులోని కడుగు పెడుతూ ఏడుస్తూనే అంది అక్కమ్మ "నంజీ! మేమంతా చచ్చిపోయామా? వారం రోజులయిందట కదా? మాకు కబురుచేయక్కరలే?"

ఆ కష్టసమయంలో పుట్టింటి వాళ్ళని చూడగానే నంజమ్మకు కూడా ఏడుపు వచ్చింది. కానీ ఎలాగో నిగ్రహించుకొని చెప్పింది. "ఏం సంతోషవార్త అని కబురెట్టమంటావు చెప్పు"

"కష్ట సుఖాలకి మే మాదుకోవద్దా? మేమేం దూరమై పోయామా? లే. ఓ రెణ్ణెల్లు వూళ్ళో వుండి వద్దువుగాని. ఇదంతా కాస్త మరిచిపోయేదాకా". - అని కల్లేశన్నాడు.

నంజమ్మ వెంటనే పుట్టింటి కెళ్ళడానికి వీల్లేదు. విశ్వమింకా కోలుకుంటున్నాడు. ఎల్లుండి నుంచి, సంగ్రహంగా అయినా రామణ్ణ కర్మ జరిపించాలి. అదీకాక

పుట్టింటికెళ్ళడానికావిడ కెందుకో ఇష్టమూ లేదు. పుట్టింటికెళ్ళి కొన్నేళ్ళయింది. కానీ కల్లేశు బలవంతం చేశాడు.అతడూ అక్కమ్మ ఇద్దరూ వెళ్ళి విశ్వాన్ని చూచివచ్చారు. బతికిబయట పడ్డ ఆ ఒక్కమునిమనవణ్ణి వాటేసుని అక్కమ్మ ఏడ్చేసింది.

పదకొండోరోజు సూతకం పోయేదాకా ఇద్దరూ అక్కడే వున్నారు. అక్కమ్మకు కల్లేశుకు మూడురోజులే సూతకం. గనక షెడ్డులో అక్కమ్మే వంటమొదలెట్టింది. కల్లేశ రేవణ్ణశెట్టి షెడ్డు వెతుక్కొనివెళ్ళాడు.

అక్కమ్మ మనవరాలితో చెప్పింది. "చూడు. కంటి ఇప్పుడూ వూళ్ళో వుండటంలేదు. ముందున్న తెల్లగుర్రం వాడు కాశీకి వెళ్ళాక నాలుగేళ్ళకు చచ్చిపోయింది. ఇప్పుడింకో గుర్రం కొన్నాడు. ఎక్కడెక్కడో తిరుగుతాడు.. కాశీనుంచి ఏవేవో కొత్త కొత్త మంత్రాలు తంత్రాలు నేర్చుకుని వచ్చాడట. చేతబడి, మంత్రం, తంత్రం అంటూ చన్నరాయపట్న, శాంతిగ్రామం, హాసన, అరకలగూడు - అవైపు వాళ్ళంతా తీసుకెడుతూ వుంటారు. వాడూరువదిలి ఇరవైరోజులయింది'.

"కురుబరహళ్ళి వింగేగౌడ అనేవాడున్నాడే వాడమ్మాయిని మనవూరి కొళి చిక్కణ్ణ తమ్ముడికిచ్చారుకదా? వింగేగౌడ నిన్నమనవూరికి వచ్చాడట. ఈరోజు చికణ్ణేవచ్చి "మీ మనవరాలి పిల్లలిద్దరు పోయారట. అందరూ వూరొదిలారట. మీ రెల్లటంలేదా?" అని అడిగాడు. నాకిదేం నిజమా కాదా అనిపించింది. 'మా వియ్యమే చెప్పాడమ్మా' అన్నాడు. కల్లేశ వెంటనే హొన్నణ్ణి బండికట్టమన్నాడు. బయల్దేరాం"

"అన్నయ్య కెక్కడా పిల్లను చూడలేదా?"

"కంటి చూసి ఏర్పాటు చేశాడు. ఆనెకెరె దగ్గరున్న ఆలనహళ్ళి పిల్ల. ఆ నంగనాచి కది ఎలాగో తెలిసి, లోలోపలే నాన్నకి వుత్తరం రాసిందిలా వుంది. అతడొచ్చి కల్లేశుని చేతులట్టుగుని, కుటతడిపెట్టి, "నిన్ను కష్టకాలంలో కొడుకులా భావించి సేవచేశాను. దేవుడివ్వలేదు. పిల్లలు కాలేదు. మరోపెళ్ళి చేసుకోకు" అని ప్రాధేయపడ్డాడు. అందాకా చేసుకుంటాను చేసుకుంటావని గునుస్తున్నవాడు మనసుమార్చుకున్నాడు. నాకు పెళ్ళివద్దు పెడాకులు వద్దన్నాడు. నేను, కంటి ఎంత చెప్పినా వినలేదు"

మేష్టారు యాజమాన్యంలో రామణ్ణ కర్మ పాతికరూపాయల్లోనే జరిగిపోయింది.

సూతకం పోయాక నంజమ్మ ఏశ్వాన్నెత్తుకుని వచ్చింది. వాడిప్పుడు లేచి మెల్లిగా రెండు మూడడుగులు వేయగలడు. పుష్టిగా బొద్దుగ కోడెదూడలా వున్న కుర్రాడిప్పుడు బక్కచిక్కిన గొర్రెపిల్లిలా వున్నాడు. అక్కమ్మ కల్లేశువచ్చిన బండి మర్నాడే వెళ్ళిపోయింది. కల్లేశు మళ్ళీఅడిగాడు. "నంజీ ఓ సవారిబండి కిరాయికేర్పాటు చేస్తాను. నడు వూరికెడదాం".

వెళ్ళకూడదని ఆమె మనస్సు వ్యతిరేకిస్తోంది. కాని మంకుపట్టు పట్టరాదు. వదిన చెడ్డదికావచ్చును. అన్నయ్య తనకేమీ చెడుచేయలేదు. పిల్లనివ్వమని అడిగారు. నేను లేదన్నాను. కోపం వచ్చి పెళ్ళికి రాలేదు. ఇప్పుడువాళ్ళే వచ్చి పిలుస్తున్నారు. ఎందుకెళ్ళరాదు? కానీ అది పన్నులు వసూలుచేసే కాలం ఇన్నిరోజులూ దాని విషయమే పట్టించుకోలేదు. తాను పుట్టింటికి వెడితే, తన భర్త ఒకడే ఇక్కడ వుండడు. సర్కారు పని చేయడు. ఆవిడ అంది. "అక్కమ్మ ఇక్కడే వుండనీ. కిస్తు వసూలు ఇర్సాలయ్యాక అక్కమ్మతో కూడా వస్తాను. తరువాత పదిపదిహేనురోజులుండి తరువాత కిస్తు వసూలు మొదలెట్టేసరికి వాసను వస్తే సరిపోతుంది".

కల్లేశు ఒక్కడే కాలినడకతో నాగలాపురం వెళ్ళాడు.

# 14వ అధ్యాయం

ఈసారి గండసి, దుద్ద వేపు పల్లెలమీద వెళ్ళిన గంగమ్మ, అప్పణ్ణయ్యా ఒకటిన్నరనెల అయ్యాక వెనక్కి తిగారు. కానీ వూరికింకా పదిమైళ్ళలో వుండగానే, అందరూ వూరొదిలిపెట్టారన్న వార్త తెలిసింది. ఆకు పొగు చేసి షెడ్డు వేసుకోవాలి. సామాను సరంజామూ అంతా వదిలేసిన వూళ్ళో హనుమంతరాయని గుళ్ళో గదిలో వున్నాయి. తలుపు తీసి వాటిని బయటికిపెట్టుకు పోవచ్చో పోకూడదో అన్న సందేహం కూడా కలిగింది. ఆ గొడవంతా దేనికని వాళ్ళు మళ్ళీ పశ్చిమాభి ముఖంగా బయల్దేరారు. ఇటీవల వాళ్ళు వెళ్ళని వూళ్ళన్నీ గాలించి, హబ్బనహళ్ళి, హరనహళ్ళి సీమంతా తిరిగి తాపీగా వూరు చేరుసరికి మూణ్నెల్లు పట్టింది. రెండుదుక్కులు వర్షంకూడా పడి, అందరూ షెడ్లు వదిలి వూళ్ళోకి చేరుకుంటువ్నారు.

మునవడు మనవరాలు- ఇద్దరూ ఒకేరోజు చనిపోయారన్నవార్త విన్న గంగమ్మకు కోడలిని తిట్టిపోయాలన్నంత కోపం వచ్చింది. కాని ఆవిడ ఎదర నిలబడి నోరుతెరవటానికి ఏదోభయం. కోడలి ఇంటికి వెళ్ళినప్పుడావిడకి తెలియకుండానే దుఃఖం ముంచుకొచ్చింది. "ఆ పెళ్ళాం చచ్చినాడికి పిల్లనిస్తే అది బతుకుతుందా? అప్పుడు నన్నయినా అడిగి చేశావా ఏమన్నానా?" అని తన దుఃఖాన్ని వెళ్ళబోసుకుంది.

ఇద్దరు పిల్లలూ బతికుండగా వాళ్ళకూ ఆవిడకూ ఎక్కువ సంపర్కమే లేదు. ఆవిడ తరుచు పల్లెలమీద సంచారం వెళ్ళేది. వూళ్ళో వుండగా వాళ్ళింటికి వెళ్ళేది కాదు. పిల్లలావిడింటికి వేళ్ళేవారు కారు. ఒక్కోరోజు కాయగూరలపాదుల దగ్గిర పార్వతి కనబడితే "మీ అమ్మ కురబరహళ్ళికి వెళ్ళిందటగా సిరాకాముక ఎంతొచ్చిందేమిటి? " అని అడిగేది. "నాకేం తెలుసు బామ్మా" అని పార్వతి ఇచ్చే జవాబుతో- బామ్మకూ మనవరాలికీ మధ్య ప్రేమ ఒలకబోసే సంభాషణ ముగిసేది. "నువ్వు ఇంగ్లీషు చదువులు చదివి రెవెన్యూ ఇన్స్పెక్టరవుతావటగా.

నాకో ఎర్రమడిపట్టుచీర కొనిపెడతావురా?" అంటే "అలాగేలే బామ్మా" అని రామణ్ణ చెప్పడంతో అవ్వా మనవడి సంభాషణ అంతమయ్యేది. కానీ ఎంచేతో వాళ్ళిద్దరూ గుర్తొచ్చి ఆవిడ మనస్సు వ్యాకులమయింది. మూడు నాలుగురోజులు వాళ్ళిద్దరినీ స్మరించి, కోడలిని తిట్టి తిట్టి, తన దుఃఖాన్ని ప్రకటించుకుంది. గుడికివచ్చిన వాళ్ళందరి తోటీ చెప్పి, చెప్పి, ఏడ్చింది. )

ఎక్కువగా దుఃఖించింది అప్పణ్ణయ్య. పార్వతి పెళ్ళిలో అతడు చచ్చేట్టు చాకిరీ చేశాడు. అంచేతేమో అతడికి పార్వతంటే ఎంతో అనురాగమేర్పడింది.. రామణ్ణ తన తరగతికే మొదటివాడుగా వున్నాడని విన్నందువల్లేమో వాడిమీదా అభిమానమేర్పడింది. రెవెన్యూ ఇన్స్పెక్టరుగారికే లెక్కలు వ్రాసిపెట్టిన కుర్రాడు వాడు. ఇంగ్లీషు చదువులు చదివి వుత్తరోత్తర రెవెన్యూ ఇన్స్పెక్టరు కాదగినవాడు. ఎక్కువగా వాడితో మాట్లాడకపోయినా వాళ్ళిద్దరూ తన పిల్లలే అన్నంత మక్కువ అతనిలో ఎలాగో గాఢంగా పాతుకుపోయింది. అప్పణ్ణ వెళ్ళి, వదినముందు నుంచుని "మనం దురదృష్టజాతకులం. పిల్లల్ని బతికించుకోవడం మననుదుట రాయ"దని కన్నీళ్ళు కార్చాడు.

ఈసారి వర్షాలు బాగానే పడ్డాయి. పంటలూ బాగానే వున్నాయి. పహాణీ వ్రాయటం కూడా అయిపోయింది. ఒకరోజు మాస్టారు భార్యవచ్చి నంజమ్మతో చెప్పింది. "చూడండి, శృంగేరి శారదమ్మ దర్శనం చేయించి కుంకుమార్చన చేయిస్తానని నేను విశ్వం పేరిట ముడుపు కట్టాను. అది మా ఇంటి దేవుడిగూట్లోనే వుంది. వారంరోజుల్లో నవరాత్రి వస్తోంది కదా! అప్పుడు కుర్రాణ్ణి తీసుకెళ్ళి కుంకుమార్చన చేయించిరండి. నేను ముడుపు కట్టినరోజే వాడికి జ్వరం దిగిపోయింది. ఆ మొక్కుబడి చెల్లించి తీరాలి".

శృంగేరికి వెళ్ళిరావాలని నంజమ్మ నిశ్చయించుకుంది. ఏదేవుడిశక్తి ఎలా వుందో! దాన్ని చెల్లించకుండా వుంటే ఏదైనా విపత్తు కలగవచ్చు. వాకున్నదల్లా విశ్వమొకడే. వెళ్ళి తీరాలి. అక్కడికెలా వెళ్ళాలో మాస్టారు వివరించారు. తిపటూరిలో రైలెక్కి తరీకెరెలో దిగాలి. మధ్య బీరూరిలో వేరే బండికి మారాలి. రాత్రి తరీకెరె స్టేషనులో పడుకుని తెల్లారి బయల్దేరే చిన్నరైల్లో నరసింహరాజపురం వెళ్ళాలి. అక్కడి నుంచి శృంగేరికి మోటారెడుతుంది. కొప్పగుండా వెడుతుంది. తిపటూరి నుంచీ తరీకెరె వెళ్ళాలంటే ఒక్కొక్కళ్ళకి పదిహేవణాలు. అక్కణ్ణుంచీ నరసింహరాజపురానికి ఆరణాల మూడుకాసులు. తరువాత మోటారుకు

రెండురూపాయలు. శృంగేరిలో యాత్రీకులు దిగడానికి సత్రముంది. మఠంలో రెండుపూటలా భోజన సౌకర్యముంది.

విశ్వాన్ని తాను తీసుకెళ్ళాలి. రైలు ప్రయాణం చేసి, దూరదేశం తిరిగి వచ్చిన వాళ్ళెవళ్ళైనా కూడా వుండాలి. ఇప్పుడంత డబ్బొదిగించడం కూడా కష్టం. కుంకుమార్చనకే అయిదురూపాయలు పుచ్చుకుంటారట. అప్పణ్ణయ్య తనంతట తానేవచ్చి రహస్యంగా చెప్పాడు. "ఎవరికీ చెప్పకండి. నా దగ్గిర ఇరవైరూపాయలున్నాయి. మీకిస్తాను. తరువాత నేనడిగినప్పుడిద్దురుగాని, నేను కూడా మీతో వస్తాను."

ఇరవైరూపాయలు చాలవు. అమ్మాయి పెళ్ళయ్యాక మిగిలింది కాస్తా దానికీ దీనికీ ఖర్చయిపోయింది.కురబరహళ్ళి వాళ్ళని ఎంతని ముష్టెత్తేది? అప్పణ్ణయ్య చెప్పాడు:" ఇక్కణ్ణుంచీ తిపటూరికి నడిచే వెళ్ళచ్చు. నరసింరాజుపురం దాకా రైల్లో వెళ్ళచ్చు. తరువాత నడిచే వెడదాం. ఇరవైరూపాయలు సరిపోతాయి."

అయితే ఆ డబ్బేచాలు. నంజమ్మ, విశ్వం, అప్పణ్ణయ్య వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. కాని చెన్నిగరాయలు మానుతారా? తామూ వస్తామని పట్టుపట్టారు. ఆయనకు డబ్బెలాగ? ఆయన నడిచి వస్తారన్న నమ్మకమూ లేదు. "నేనెలాగో డబ్బు తెచ్చుకుంటాను నీకెందుకు?" అన్నారు. ఎవళ్ళ దగ్గరా ముందుగానే పన్నురసేదిచ్చి తీసుకురాకూడదు" అని ఆవిడ కచ్చితంగా చెప్పింది."అలాగే" అని ఆయన ఒప్పుకున్నాడు. ఎక్కడ డబ్బు సంపాదించారో ఏమో ఆయన ఖర్చేవేరు. వాళ్ళముగ్గురి ఖర్చేవేరు. నంజమ్మ అయిదు సేర్ల పేలపిండి తయారు చేసింది. అప్పణ్ణయ్య యాయవారం చేసి తెచ్చిన వడ్ల ఎనిమిది సేర్లు తల్లికి తెలియకుండా తెచ్చిచ్చాడు. అటుకులు తయారుచేసి నంజమ్మ వాటినీ మూటకట్టింది. యాత్రకు బయల్దేరాలని గంగమ్మకూ ఆశగానే వుంది. కానీ ఆ కోడలి వెంట వెళ్ళరాదు. కొడుకునూ వెళ్ళద్దంది. ఖర్చంతా వదినమ్మ పెడుతూ వుండగా ఎందుకెళ్ళకూడదని అతడు బయల్దేరాడు.

ప్లేగునుంచి కోలుకున్నాక ఈ ఆరునెలలుగా నంజమ్మ విశ్వానికి సమృద్ధిగా పాలు, నెయ్యి పోసి పోషించింది. వాడు మొదటి నుంచీ దిట్టమయినవాడు. ఒకరోజు పెందరాడే , అంటే వెనక ఆమె మోదుగాకులకని వెళ్ళడానికి ముందే, నంజమ్మ, విశ్వం,అప్పణ్ణయ్య రొట్టెలు, పచ్చడీ కట్టుకుని బయల్దేరారు. మోటారువాళ్లు తనకు పరిచయం గనక తాము దానిలో తిపటూరికి వచ్చి వాళ్ళని

కలుసుకుంటానన్నారు చెన్నిగరాయలు. రొట్టెలమూట, పేలపిండి, అటుకులు, బెల్లం, చింతపండు, పీచుతీసిన నాలుగుకొబ్బరికాయలు, రెండుసేర్ల బియ్యం, రెండుపాత్రలు, కావలిసిన గుడ్డలు, అన్నీ గోనిసంచిలోవేసి మూటకట్టి తలమీదెట్టుకుని అప్పణ్ణయ్య బయల్దేరాడు. తన రెండుచీరలు, రవికలు, విశ్వం బట్టలు, రెండుదుప్పట్లు ఒక జముఖానా, అన్నీ, చిన్నమూటకట్టి చంకలో పెట్టుకుని, మరోచేత్తో విశ్వాన్ని పట్టుకుని నంజమ్మ నడుస్తోంది. తెల్లారేసరికి వాళ్ళు రహదారిలో నడుస్తున్నానరు. విశ్వం తల్లి చెయ్యి వదిలేసి, బాబాయి కంటే ముందర పరుగెత్తుతున్నాడు. "అమ్మా! చూడు నీకంటే నేనే బలంగా లేనూ?" అని అప్పుడప్పుడడిగేవాడు. ఆరుమైళ్ళు నడిచాక దారిపక్కలోవున్న కట్టమీద కూర్చుని ముగ్గురూ రొట్టెలు పచ్చడి నంజుకుని తిన్నారు. మరి రెండు మూడు మైళ్లు నడిచేసరికి విశ్వం నడక మందగించింది. ఇప్పుడు మళ్ళీ తల్లి చేయట్టుకుని నడవటం మొదలెట్టాడు. కాళ్ళులాగుతున్నాయని చెప్పుకోవడం వాడి ఆత్మాభిమానానికి భంగం. ఇంతలో వాళ్ళ వెనకాలనుంచీ దుమ్ము చిమ్ము కుంటూ బస్సు బర్రుమని వెళ్ళింది.

"వాడు వెనకాల సీటులో కూర్చున్నాడు చూశారా?" అప్పణ్ణయ్యడిగాడు.

"లేదు"

"అమ్మా, మోటారువాళ్ళు నాన్నని వూరికేనే కూర్చోబెట్టుకున్నారు. నన్నెందుకు కూర్చో బెట్టుకోరు?" -విశ్వమడిగాడు.

"హుం కూర్చోబెట్టుకుంటారు వీణ్ణి. గాడిదగుడ్డు. వీడమ్మని . . . ." అప్పణ్ణయ్య జవాబు చెప్పాడు.

"పోనిద్దురూ వదిలేయండి"- అని నంజమ్మ అంటున్నా అతడు "మీరేమైనా చెప్పండి. మన చిన్నయ్య నీచపు ముండాకొడుకు. చిన్నప్పటినుంచీ అంతే, నాచిన్నిబొజ్జకు శ్రీరామరక్ష అనేబాపతు. ఇలాంటి వాకొడుకుల్ని చెప్పుచ్చుక్కొట్టాలి. వీడమ్మని . . . ."

"అప్పణయ్యా పుణ్యక్షేత్రానికి యాత్రకని వెడుతున్నాం. మననోట్లో పాడుమాట లెందుకు రావాలి? పోనివ్వండి. వదిలెయ్యండి-" అన్న నంజమ్మ విశ్వంతో "బాబూ, నేను నీకు చెప్పించానే 'భజగోవిందం భజగోవిందం' దాన్ని చెప్పు చూద్దాం. శృంగేరికి వెడుతున్నామే ఆ మఠం ఆదిశంకరాచార్లు రాసిందది" అంది.

విశ్వం రాగయుక్తంగా నెమ్మదిగా పాడడం మొదలెట్టాడు. వాడు తప్పు చెబితే నంజమ్మ సవరించేది. అప్పణ్ణయ్య నోరు తురతురలాడింది. యాదాలాపంగా జేబులో చెయ్యెట్టి అడపం తీసి ఆకుల్లో సున్నంరాసి మడిచి ఒకగోటు వక్కతో పాటు నోట్లోకితోసి పొగాకుతుంపుతీసి పొడిచేసి దట్టించాడు. కాసేపటిలో నోటినిండా తాంబూరసం నిండింది. దారిపొడుగునా వుమ్ముతూ నడిచాడు.

రైలు తిపటూరికి ఒంటిగంటకి వస్తుంది. ఒకసారి దారిలో అలసటతీర్చుకున్నా, వాళ్ళు వీలైనప్పుడల్లా దగ్గిరగా వున్న కాలిదారి తొక్కి, పన్నెండు గంటలకే స్టేషను చేరుకున్నారు. ముగ్గురూ మళ్ళీ రొట్టెలు తిన్నారు. అంతలో అశ్వత్థం కట్ట దగ్గిరున్న మాధవభట్టు హొటల్లో భోంచేసి చెన్నిగరాయలూ అక్కడికి వచ్చాడు. రెండున్నర టికెట్లు అప్పణ్ణయ్య తీసుకున్నాడు. తనటికెట్టు తాను తీసుకున్నాడు చెన్నిగరాయలు.

రాత్రి తరీకెరె స్టేషన్‌లో కొళాయినీళ్ళు పట్టుకుని వీళ్ళు ముగ్గురూ రొట్టెలు పచ్చడి నంజుకుని తిన్నారు. చెన్నిగరాయ వూరు చూసివస్తానని చెప్పి వెళ్ళిపోయారు. "వాడిప్పుడెక్కడికెళ్ళాడో తెలుసా?" అప్పణ్ణయ్యడిగాడు. "ఎక్కడికైనా వెళ్ళనీ మనకెందుకా సంగతి? వూరుకోండి" - అంది నంజమ్మ. జమ్ముఖానా పరుచుకుని విశ్వంతో పాటు స్టేషన్‌లో ఓమూలలో పడుకుంది నంజమ్మ. వాళ్ళ తలవేపు గోనిపట్ట పరుచుకుని, దుప్పటి కప్పుకుని, గోనిసంచి తలగడగా చేసుకుని అప్పణ్ణయ్య పడుకున్నాడు. వెంటనే ముగ్గురికి నిద్రట్టింది. భోంచేసివచ్చిన చెన్నిగరాయలు వాళ్ళపక్కలో ఓ ధోవతి పరుచుకుని పవళించాడు.

మరుసటి రోజు తెల్లారింది. వాళ్ళదగ్గిర ఇంకా పదిరొట్టెలు మిగిలున్నాయి. మొన్నరాత్రి చేసిన రొట్టెలు గట్టిపడి అట్టల్లా వున్నాయి. అయినా నీళ్లలో నానబెట్టి తినవచ్చు. కానీ పచ్చడి పాడయిపోయింది. హొటల్లో అణాపెట్టి సాంబారు కొందామన్నాడప్పణ్ణయ్య. ఇంతలో చెన్నిగరాయలు ముఖం కడుక్కుని హొటల్లో ప్రవేశించాడు. విశ్వం హోరూర్చుకుంటూ కూచున్నాడు. నంజమ్మ అంది: "అణాకి సాంబారు పట్రండి. అలాగే విశ్వానికి ఒక ఇడ్లీ రెండు దోసెలు పట్రండి మొత్తం మూడణాలవుతుంది."

నరసింహరాజపురం వెళ్లే సన్నరైలు బయల్దేరిందే తరవాయి. విశ్వానికేదో ఒకరకమైన వుబలాటం. కిటికీలోంచి చూస్తే ఎన్ని చెట్లు? ఎన్ని చెట్లు?

దగ్గిరదగ్గిరగావుండి లెక్కపెట్టడానికి వీలులేనన్ని పెద్దచెట్లు! వాటితో పెనవేసుకున్న తీగలు. అప్పుడే వర్షాకాలం ముగిసింది. ఆశ్వీజంలో ఎక్కడ చూచినా చెట్లు చేమలు విజృంభిస్తున్నాయి. విశ్వం చూస్తుండగానే పెద్దజంతువొకటి చెట్ల మధ్య నడిచివెళ్ళింది. తన పుస్తకంలో చూచిన బొమ్మగుర్తొచ్చి అది ఏనుగని తెలుసుకున్నాడు. "అమ్మా! అరణ్యమంటే ఇదేనా? అని అడిగాడు. ఇదే అయివుండచ్చని ఆవిడా అనుకుంది. ఆవిడ కూడా ఇంతవరకూ ఇంత దట్టమైన చెట్లు చూడనేలేదు.

అప్పణ్ణయ్య చెప్పాడు "ఈ ప్రాంతమంతా ఇలాగే. శివమొగ్గ అవతలికెడితే ఇంకా భయంకరమైన అడవి".

"మీరు శివమొగ్గ కెప్పుడెళ్ళారు?"

ఏదోగుర్తొచ్చి అప్పణ్ణయ్య వూరుకున్నాడు. వెంటనే నంజమ్మకు కూడా అది గుర్తొచ్చింది. అలా అడిగి వుండకూడదని ఆవిడనుకుంది. వదినను కాలితో తన్ని, పోలీసోళ్ళు పట్టుకుపోతారన్న భయంతో వెనక ఈ ప్రాంతాలన్నీ తిరిగింది గుర్తొచ్చి, సిగ్గుతో, అవమానంతో కిటికీ నుంచీ బయటికీ చూస్తూ కూర్చున్నాడు. చెన్నిగరాయలు పొగాకు నలుపుతున్నాడు.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు రైలు నరసింహరాజపురం చేరేసరికి బస్సు ఏజెంట్లు వచ్చి – "శృంగేరి శృంగేరి అర్జెంట్ శృంగేరి" – అని ముసురుకున్నారు.

"మీరు బస్సులో వస్తారా నడిచొస్తారా?" చెన్నిగరాయలడిగారు.

"బస్సులో రావటానికి డబ్బెక్కడుంది?" – అప్పణ్ణయ్య జవాబిచ్చాడు

"నాకు కాలు బెణికింది. నేను బస్సులో వెడతాను. ముందుగా వెళ్ళి సత్రంలో మనకు వసతి ఏర్పాటు చేస్తాను. మీరు వెనకాతలరండి" – అని చెప్పి ఆయన వెళ్ళిపోయారు.

"చిన్నియ్యా! కాస్త ఆగు. వదినమ్మనూ, విశ్వాన్నీ, కూడా తీసుకెళ్ళు మూడురూపాయలవుతుంది. విశ్వాని కర్ధచార్జి. "మేము బీదాళ్ళం కుర్రాణ్ణి తొడమీదే కూర్చోబెట్టుకుంటాం. చార్జి చేయకండి" అంటే వాణ్ణలాగే కూర్చోబెట్టుకోవచ్చు. నేను వెనకాతల నడిచొస్తాను"– అని అప్పణ్ణయ్య కేకేసి పిలిచి చెప్పాడు.

"నాదగ్గిర డబ్బులేదు. దాని దగ్గిరుంటే రానీ"– అని చెబుతూ ఆయన ముందుకెళ్ళారు వందలకొద్ది దిగిన ప్రయాణీకులు గుంపులు గుంపులుగా

పరుగెత్తి బస్సులకెగబడుతున్నారు. చెన్నిగరాయలెక్కి జాగా చూసుకుని కూర్చున్నాడు.

ఎండిపోయిన రొట్టెలు నీళ్ళలో నానవేసి ఆముగ్గురూ తిన్నారు. రొట్టెలన్నీ అయిపోయాయి. ఇంకా చాలలేదు. నంజమ్మ బెల్లమూ చింతపులుసుతో ఒకటిన్నరపావు పేలపిండి కలిపింది. తరువాత విశ్వం జేబులో అటుకులు నింపి ఒక బెల్లంముక్క ఇచ్చింది. అప్పణ్ణయ్య, వదినమూటకూడా తనగోనిసంచిలో పడేసి కట్టి తలమీదెట్టుకుని బయల్దేరాడు.

## 2

అలాంటి అడవి ఆవిడెప్పుడూ చూసి వుండలేదు. చెట్లు చేమలంటే ఆవిడకి పట్టరానిఆనందం. ఓరకమైన అలౌకికమైన ఆకర్షణ. మోదుగాకులకని చోళనగుడ్డకు వెడుతూ వూరిచుట్టూ పైరు పెరిగి, పొలాలన్నీ పచ్చగా నేత్రపర్వంగా వుంటే అలా చూస్తూ నిలబడిపోయేది. ఇక్కడ ఎటు చూసినా అడవే, పెద్దపెద్ద చెట్లున్న అడవి. ఏదో ఇదమిద్ధమని చెప్పలేని భావ మామె మనస్సు నాక్రమిస్తోంది. కాసేపట్లో అది ఆవిడ అంతరంగాన్ని కలతపరిచింది.మనస్సు నానందపరిచే ఆ ఆకుపచ్చరంగు తన పిల్లలిద్దరినీ జ్ఞాపకం చేసింది. ఈ టేకు చెట్టు ఆకులెంత వెడల్పుగా వున్నాయి. ఒక్కొక్క ఆకుమీద వడ్డించుకుని భోంచేయచ్చు. మొదుగాకులు ఇంతవెడల్పుగా వుంటే కుట్టే కష్టమే వుండేది కాదు. మోదుగాకులకని వెళ్ళినప్పుడు పెద్ద ఆకుల్ని చూస్తే రామణ్ణ నిధిని చూచినంత సంతోషంతో "అమ్మా! ఇలా చూడు ఎంతపెద్దాకో" అని కేకేసి పరుగెత్తుకెళ్ళి కోసేవాడు.ఆకు మరీ పెద్దదయితే కుట్టడం ఇబ్బంది. వూరంత వెడల్పయ్యేది. మోదుగుపాలు చిమ్మి వాడి చొక్కా అంతా మరకలు పడేది. దాని కోసమే ప్రత్యేకంగా పాత చిరిగిన చొక్కా లేసుకునేవాడు.

పార్వతి ఆకులు కోయడానికి వస్తే ఏదో గొణుగుతూ వుండేది. దానికి పైరుపచ్చలంటే ఎంత సంతోషం! తనకు వచ్చిన విద్యంతా అది వేర్చుకుంది. పన్నెండేళ్ళయ్యేసరికి రాగులు విసరడం బొత్తిగా మాన్పించేసింది. తెల్లారుఝూమున విసిరేటప్పుడు అది రాగయుక్తంగా పాడుతుండగా వినడానికి ముచ్చటగా వుండేది. మాస్టారు చెప్పారు. దాని మొగుడు పాటంటే చెవికోసుకుంటాడని. సూర్యనారాయణ హార్మోనియంశ్రుతి పెట్టుకుని భారతంలోని పద్యాలు రాగయుక్తంగా పాడితే,

వినేవాళ్ళ కళ్ళు చెమ్మగిల్లేవట. ఇంట్లో కూర్చుని రోజూ భారతం చదివే వాడట. అతని స్వభావం చాలామంచిది. కోపంలేదు విసుగులేదు. కన్నబిడ్డను కంటికి రెప్పలా చూసుకుంటాడు. మగాడంటే అలావుండాలి. అలాంటివాడితో సంసారం చేసే యోగం మా అమ్మాయికి లేకపోయిందేమో! ఆవిడ మనస్సు, తన భర్త చెన్నిగరాయల్ని సూర్యనారాయణతో పోల్చి చూసింది. రోతపుట్టి, అదంతా వాళ్ళ వాళ్ళ పూర్వ జన్మ ఫలమని, మనస్సు మరోదారి పట్టింది.

అడవిని చూచిన కొద్దీ విశ్వముబ్బి తబ్బిబ్బవుతున్నాడు. "అమ్మా! ఇలా చూడు మన వూళ్ళో తోటలోవున్న మావిడి చెట్టుకంటే ఎంత పెద్దదో" - అంటాడు వెంటనే "దాని పక్కనే వుంది చూడు ఆకాశమెత్తుంది" అని, దృష్టి మరోవేపుకి తిప్పి, "ఆ కోతిమూతి అలావుందేం. మనూళ్ళో కోతులింతకంటే బావుంటాయికదా?"- అని అడిగేవాడు.

"ఇది అడవికోతి బాబూ"

"అయితే మనూళ్ళోవున్న వెలాంటి కోతులు?"

"వూరకోతులు"

"అయితే వూళ్ళోవుండవే మరి? అవి తోటకోతులు"- అని తానే జవాబు చెప్పేవాడు.

దారిలో వెడుతూ వుండగా వాళ్ళకి రెండు పాములు కూడా కనిపించాయి. పాములు వాళ్ళు చూడని జంతువులు కావు. రామసంద్రంలోనూ వున్నాయి. ఇది పెద్ద అడవిగనక ఎక్కువగా వున్నాయి. జాగర్తగా నడవాలి. మలెనాడులో పెద్దదాసరి పాములుంటాయట. మనుష్యుల్నే అమాంతంగా మింగేస్తాయట. పెద్దకొమ్మల్లా పడుంటాయట.

తల్లిచేయి పట్టుకుని నడిచి నడిచి విశ్వానికి విసుగెత్తింది. చేయి విదిలించుకుని ఒక్కడే విడిగా నడుస్తున్నాడు. ఒక్కోసారి ఇరవైగజాలు ముందుకు పరుగెత్తేవాడు. ఒక్కోసారి పదడుగులు వెనకపడేవాడు. ఒకసారి నంజమ్మ ఏదో ఆలోచిస్తూ నడుస్తోంది. అప్పణ్ణయ్య ఎప్పటిలాగే వీళ్ళకంటే పదిగజాలు ముందు నడుస్తున్నాడు. హఠాత్తుగా నంజమ్మ విశ్వం గుర్తొచ్చి వెనక్కి తిరిగిచూసింది. విశ్వం లేడు. ఆమె గుండె ఝల్లుమంది. అడవిలో పులులు, తోడేళ్ళూ వుంటాయట - ఆ సంగతి జ్ఞాపక మొచ్చింది. పురుగుపట్రలకి కొదవలేదు. "అప్పణ్ణయ్యా, విశ్వమేడీ కనపడలేదు చూడండి-" అని పిలిచింది. ఇద్దరూ వెనక్కుతిరిగి వెదుకుతూ

వెళ్ళారు. ఒక ఫర్లాంగు వెనకాల రోడ్డుపక్కనవున్న చిన్నటేకుచెట్టెక్కి వాడు "కీకీకల, కీకీకల" అంటూ ఎదురుబొత్తుగా చెట్లో వున్న కోతుల్ని వెక్కిరిస్తున్నాడు. "చెప్పాచెయ్యకుండా ఎందుకురా ఇలా చేశావు?"- అని అడిగితే "ఆ కోతి నన్ను చూచివెటకారంగా వెక్కిరించిందిగా"- అని జవాబు చెప్పాడు.

అప్పటినుంచీ, వాణి వెనక వదిలెయ్యకుండా ముందరే నడిపించుకుంటూ వెళ్ళింది.

అప్పణ్ణయ్యకు అడవిలోని అందచందాలేమిటో తెలియవు. ఈ పాడు అడవికంటే మనబయలు సీమే నయం. ఇక్కడ కేవలం వడ్లు పండుతాయి. రాగులే లేవు. ముద్దతినకపోతే ఒంట్లో బలమెలా వుంటుంది? మలెసీమవాళ్ళు మనలా దిట్టంగా వుండరట- అన్న ఆలోచనతోపాటు అతనికి తనజీవితంలో జరిగిన వెనకటి సంఘటనలు గుర్తొచ్చాయి. అతని కూతురు జయలక్ష్మికి కూడా పార్వతి వయస్సే. రెండవవాడు రామకృష్ణ దానికంటే చాలా చిన్నవాడు. మూడవది ఎలాంటిదో! రామకృష్ణ నిజంగా నాకే పుట్టాడు. మాఅమ్మ మాత్రం కాదంది కదా? అక్కడికెళ్ళిన నాకు తెలవదా? వాడేమైనా బడికి గిడికి వెడుతున్నాడో లేదో! మంత్రాలు నేర్పి పౌరోహిత్యం చేయిస్తామన్నారట వాళ్ళు. ఈపాటికి వాడొకడే వెళ్ళి దానాలు అవీ పట్టి తెచ్చిపడేస్తున్నాడేమో! అది ఇప్పుడెలాగుందో! నన్ను జ్ఞాపకం చేసుకుంటూ వుంటుందో లేదో! నేను తాళి తెంచి పంపడం తప్పే. గాడిదముండ అదీ విస్తళ్ళు గిస్తళ్ళు కుట్టి వుంటే వుప్పుకో, పప్పుకో సరిపడా వచ్చి సుఖంగా కాలక్షేపయ్యేది కదా? వాళ్ళకెందుకు చెప్పు తెల్లారగానే కాఫీ? వరన్నం, పప్పుచారు. కాఫీ రోజూ కావాలంటే ఎలాగవుతుంది? వాళ్ళబాబు మూటాముల్లె కట్టిచ్చాడా? అయినా ఆముండ నన్ను వదిలేసి వెళ్ళడం తప్పు- అని తలపోస్తూ వుండగా తన ఒంటరి తనంలోని బాధ గుర్తొచ్చింది. ఏదో విసుగు, జీవితంలో సుఖం లేదన్న భావం, అతణ్ణి ఆవరించింది. "వింటున్నావా?"- వెనకాతల వస్తున్న వదిన నడిగాడు.

"ఏమన్నారు?"

" ఆ అమ్మాయికి కూడా ఈపాటికి పెళ్ళి గిళ్ళి చేసుంటారా?"

" ఏ అమ్మాయి కంటారు?"

పలినా అని నోరువిప్పి చెప్పడానికి సిగ్గేసి వూరుకున్నాడు. "ఎవరికి?" అని వదిన మరోసారి అడిగే సరికి "ఎవరికీ లేదులేండి. నాకు రేవణ్ణశెట్టి కూతురు

రుద్రాణి గుర్తొచ్చింది"- అన్నాడు.

("రుద్రాణి చచ్చిపోయి ఎన్నేళ్ళయింది? ఇదేమిలా అంటారు?"

అంటే అతడు జవాబే చెప్పలేదు. తన ఆలోచనలో తానుండి నంజమ్మ అతని మాటల్లోని అంతరార్థాన్ని వూహించుకోలేదు. మళ్ళీ మౌనంగా నడవటం మొదలెట్టారు. అతడు పదిగజాలు ముందు ఆమె పదిగజాలు వెనక తనలో తానేదో వెర్రిమొర్రిగా మాట్లాడుతూ విశ్వ మొక్కోసారి బాబాయికంటే ముందుకెడతాడు. లేదా ఇద్దరికీ మధ్యగా నడుస్తాడు. విసుగెత్తితే అమ్మ చెయ్యట్టుకుని "కథ చెప్పమ్మా"అని అడుగుతాడు)

దారిలో ఒకసారి కూర్చుని సేదతీర్చుకుని, రాత్రి ఏడుగంటలకి పధ్నాలుగు మైళ్ళ దూరంలో వున్న కొప్ప చేరుకున్నారు. ఒక గిన్నెలో అటుకులు నానవేసి, బెల్లం కలిపి, మరో గిన్నెలో పేలపిండి కలపవచ్చు. లేదా ఏదైనా చెట్టు కింద మూడు రాళ్ళెట్టి కాస్త అన్నం వుడికించుకుని బేడకి సాంబారో చారో హోటలునుంచీ పట్రావచ్చు-అని నంజమ్మ ఆలోచించింది.

"మల్నాడులో షావుకార్ల ఇంట్లో ఎంతమంది వచ్చినా అన్నం పెడతారు. వెళ్ళి భోంచేసి వద్దాం" - అని అప్పణ్ణయ్య సూచించాడు.

వదిన- "ఎవరింటికీ భోజనానికి వెళ్ళక్కరలేదు" అంది.

"అయితే నేనూ విశ్వం భోంచేసివస్తాం. మీకు అన్నంవండి హోటల్లో సాంబారు తెచ్చిపెడతాను"

"ఎవరూ వెళ్ళొద్దు మనంతెచ్చిన పదార్థం తిందాం"

చివరికావిడ మాటప్రకారమే జరిగింది. అప్పణ్ణయ్య అన్నం ఉడికించేందుకు ఎండుపుల్లలు పోగుచేశాడు. ఆమె అన్నం వండింది. రెండణాలకి హోటలువాళ్ళు సగం గిన్నెడు కంటే ఎక్కువే పులుసు ఇచ్చారు. ముగ్గురు కడుపునిండా భోంచేశారు. వీధిలో ఒక అంగడి పంచటరుగుమీద పడుకుని తెల్లారిలేచి పేలపిండి కలుపుకున్నారు. ఒక కొబ్బరికాయకొట్టి, అప్పణ్ణయ్య హోటలుకెళ్ళి, ఒకచిప్ప కొబ్బరికోరు, కత్తిపీటతో తురిమి తెచ్చాడు. నానవేసిన అటుకులకి బెల్లం, కొబ్బరికోరు వేశారు. ముగ్గురూ కడుపునిండా తిని, నానవేసిన అటుకులు మిగిలిపోతే విశ్వాని కుంటాయని మూటకట్టి మళ్ళీ ప్రయాణం సాగించారు. మొన్న వూరినుంచీ తిపటూరికి పదహారుమైళ్ళు, నిన్న నరసింహరాజపురం నుంచీ కొప్పానికి పధ్నాలుగు మైళ్ళు, వరుసగా నడవడం చేత విశ్వాపానికి రెండు

తొడలు నొప్పెడుతున్నాయి. నంజమ్మకు పాదాలు రెండు నొప్పెడుతున్నాయి. కానీ ఇంకా నడవక తప్పదు. "కాళ్ళు లాగు తున్నాయా బాబూ?" అని అడిగే సరికి విశ్వం "మగకుర్రాళ్ళకి నొప్పెట్టవు"- అంటూ ముందుకు పరుగెత్తాడు. అక్కడికి పన్నెండుమైళ్ళల్లో హరిహరపురమట. అక్కడకూడా శృంగేరి మఠముందట. గబగబా నడిచి మధ్యాహ్నానికల్లా హరిహరపురం చేరుకున్నారు. నదిలో స్నానం చేసి, దేవుడి దర్శనం చేసుకుని, మఠంలో భోంచేశారు. వీళ్ళలాగే సుమారు వందమంది బ్రాహ్మణముత్తైదువులు భోజనానికి రావటంచేత నంజమ్మకు ఎబ్బెట్టుగా లేదు. భోజనమయ్యాక విశ్వం జోగుతున్నాడు. నంజమ్మకు కాళ్ళు బాగాలాగుతున్నాయి. రాత్రికక్కడే వుండి తెల్లారాక వెడదామని నిశ్చయించారు. జోగుతున్న విశ్వాన్ని సత్రంలో పడుకోబెట్టారు. అప్పణ్ణయ్యకూడా వెన్నువాల్చాడు. దగ్గరే ప్రవహిస్తున్న నది ఒడ్డున కూర్చోవాలని నంజమ్మకు బుద్ధిపుట్టింది. ఇసకలో నడిచి వెళ్ళి, నీళ్ళల్లో రెండుపాదాలూ మునిగేలా ఒకరాతిమీద కూర్చుంది. కాళ్ళకు హాయిగా నీళ్ళు తగిలి అలసట తొలగిస్తున్నాయి. పార్వతీ-రామణ్ణలు గుర్తొచ్చారు. మనస్సు నాక్రమించారు. వాళ్ళూ బతికుంటే, ఈ ప్రాంతాలకొచ్చివుంటే, ఎంత సంతోషపడేవారో! మాట్లాడుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ నడిస్తే ఈ అలసట కలిగేది కాదు. నేనొక పాపి-అని కళ్ళనీళ్ళు తుడుచుకుంది. సాయంత్రం విశ్వం; అప్పణ్ణయ్య వచ్చి పిలిచేదాకా అలాగే కూర్చుంది.

## 3

వీళ్ళు శృంగేరి చేరేసరికి చెన్నిగరాయలక్కడ పాతబడిపోయాడు. మఠమూ, పుగాణమూ, పాకశాలా, భోజనాల చావళ్ళు - ఎన్నున్నాయి. ఒక్కొక్క చావడిలో ఎంతమంది కూర్చోవచ్చు. ఏ చావడిలో వడ్డన త్వరగా జరుగుతుంది అన్న వివరాలతో - ఏరవతల నరసింహగుడ్డ, కాలభైరవగుడ్డ అన్నీ చూచాడు. ఆయన రాగానే సత్రంలో ప్రత్యేకమైన గదికోసం ప్రయత్నమేమో చేశాడు. వేలకొద్ది జనం వచ్చే నవరాత్రి సమయంలో పెద్దపెద్దవాళ్ళకే వసతి దొరకడం లేదు. చెన్నిగరాయలకు దొరుకుతుందా? పారుపత్తేగారిని కాళ్ళవేళ్ళాపడి చంపుకులివ్వందుకు, మేడమెట్ల కింది జాగా చూపించారు. మెట్లెక్కి దిగేవాళ్ళ దడదడమనే కాళ్ళచప్పుడువున్నా ఆ మాత్రమయినా చోటు దొరికింది. సత్రం

కాపాలా జవాను దగ్గరే వుండటంవల్ల వాడికి తన చిన్న మూట అప్పచెప్పి నిర్భయంగా షికార్లు తిరిగొచ్చేవాడు.

ఉదయం తొమ్మిది గంటలకి నంజమ్మ శృంగేరి చేరేసరికి శ్రీవారి దర్శనం కలిగింది. సత్రంలో ఆయనున్న జాగాలోనే తమ సామానూ పెట్టి, విశ్వాన్ని అప్పణ్ణయ్యని వెంటబెట్టుకుని మఠం దగ్గిరకు వచ్చింది. నదిలో స్నానం చేసి, మడికట్టుకుని వుతికిన బట్టలెండలో ఆరవేసుకుని, దేవస్థానాలన్నీ చూసింది. కుంకుమార్చన కప్పుడే కాలాతీతమై పోయింది గనక రేపు పొద్దుట చేయించాలనుకుంది. మధ్యాహ్నం భోజనమయ్యాక వీళ్ళు ముగ్గురూ పడవలో కూర్చుని నది దాటి నరసింహవనానికి బయల్దేరితే చెన్నిగరాయలు కూడా వచ్చి కలుసుకున్నాడు. "మమ్మల్ని వొదిలేసి నువ్వు బస్సులో వొచ్చావుగా, నువ్వు మాతోటి రాకు" అని విశ్వం నాన్నని కసురుకున్నాడు. అప్పణ్ణయ్య కూడా దానికి వంతపాడాడు. "ఎవరూ ఏమీ మాట్లాడకండి. విస్సూ నువ్వు మంచాడివి కదూ నామాట విను" అని వాళ్ళని వారించింది.

నరసింహవనంలో ఎన్నిరకాలైన గులాబి పూలు? ఇన్ని రకాలైన గులాబి చెట్లని నంజమ్మ మనస్సులో కూడా వూహించి వుండలేదు. భక్తులు వాటిని దోసిళ్ళతో తీసుకెళ్ళి శారదాదేవి కర్పిస్తారట. ఎవళ్ళయినాసరే కోసుకుని గుడికి పట్టుకెళ్ళచ్చు. విశ్వం పరుగెత్తుకెళ్ళి రెండుపూలు, చేతికి ముళ్ళు గుచ్చుకున్నా పాటించకుండా, తెచ్చి అమ్మకిచ్చాడు. "నువ్వు ముడుచుకో" అన్నాడు. "వీటిని మనం ముడుచుకోరాదు. బాబూ! దేవుడివి" అని వాటిని తీసుకుంది. వెంటనే పార్వతి గుర్తొచ్చింది. పార్వతికి వెంట్రుకలు దటంగా నల్లగా పొడుగ్గా వుండేవి. దువ్వి జడలల్లితే లావుగా దిష్టి తగిలేలా వుండేది. "సురిగి" పూలు పూసే కాలంలో రామణ్ణ వెళ్ళి చెట్టెక్కి ఒడినిండా గమగమలాడే పూలు తెచ్చేవాడు. పార్వతి వాటినంతా పెద్దదండగా కూర్చేది. అది వ్యక్తురాలయ్యాక ఒకరోజు సురిగి దండ ముడిస్తే ఎంత అందంగా వుండేది! వాడి బడిలోంచి ఒక రోజు రామణ్ణ రెండు గులాబిపూలు కోసి తెచ్చాడు. వాటిని ముడిచినా అందంగా కనిపించేది. అక్కా తమ్ముళ్ళకి ఎంత మక్కువ. ఎంత అనురాగమో చెప్పలేము.

గులాబిపూలు చూపిన నంజమ్మ మనస్సు ముకుళించుకుపోయినా వాళ్ళతో పాటు వనమంతా తిరిగింది. పెద్ద గురువులు తపస్సు చేసిన గుహ, భైరవకొండ, అన్నీ చెన్నిగరాయలు చూపెట్టాడు. వెనక్కి తిరిగివస్తూ ఒక

తడిగుడ్డలో గులాబిపూలుకోసి కట్టుకుని తెచ్చి అమ్మవారి గుడికిచ్చింది.

మరునటి రోజు కుంకుమార్చనకని కాస్తముందుగానే బయల్దేరింది. అర్చనయ్యేదాకా విశ్వంకూడా వుపవానముండాలి. అప్పుడే ఏడున్నర గంటలయింది. బయటికెళ్ళి సత్రానికి తిరిగొచ్చిన చెన్నిగరాయలు ఒడిలో పదిపదిహేను కాకరకాయలు వేసుకుని వచ్చాడు.

"ఇవెందుకు తెచ్చావురా?" అప్పణ్ణయ్య అడిగాడు.

"చాలా బాగున్నాయి. అణాన్నరకిన్ని ఇచ్చారు. వీటితో 'గొజ్జు' చేయవే" - అని పెళ్ళాన్ని ఆజ్ఞాపించాడు.

"మీకేం వేళాకోళమా? మేమిప్పుడు దేవాలయానికి బయల్దేరాం"

"వచ్చాక చేస్తేసరి. నా దగ్గిరున్న టిఫిన్ కారియర్‌లో వేసుకుని వెళ్ళి అక్కడ సమారాధన భోజనంతో పాటు వేసుకుని తింటాను. వాళ్ళు చేసే పులుసులోకానీ, చారులోకానీ, వుప్పుచాలదు. కారమూ చాలదు".

"వేలకొద్దీ జనం భోంచేస్తారు. మీరిలా పట్టుకెళ్ళితింటే అందరూ నవ్వరూ?"

"ఎవడే నవ్వుతాడు. వాడమ్మని ..."

"పుణ్యక్షేత్రానికి వచ్చారు. ఆ పాడు మాటలేమిటి?"

అప్పణ్ణయ్య అన్నాడు. "ఇక్కడ పొయ్యి ఏదీ? తరిగేదెక్కడ? రుబ్బేదెక్కడ? కాకరకాయ గొజ్జు కావాలని వుండుండి ఇక్కడే మోజు కలిగిందేమిట్రా?"

"సత్రంలో రుబ్బురోలు, పాత్రమున్నాయి. ఇక్కడే మూడిటికలు పొక్కళ్ళుగా పెడితే సరి. కాపలా జవాను నాలుగు కర్రలిస్తాడు."

"అమ్మా! నువ్వు చేయకు" - అన్నాడు విశ్వం.

"ఓరి భడవా! అడ్డుపుల్ల వేస్తావటరా? నీ అమ్మని ..."

సత్రం కాపలా జవా నీ మాటలు విన్నాడు. "ఇక్కడా పాడు బూతులు మాట్లాడరాదండి. పారుపత్తేగారికి తెలిస్తే ఇక్కణ్ణించీ తరిమేస్తారు" - అని వాడు హెచ్చరించాడు. ఇక్కడ ఇటికల పొయ్యి అదీపెట్టి పాడుచేయటానికి వీలు లేదని మందలించాడు. చెన్నిగరాయల ఆశ నిరాశ అయింది. కాకరకాయ గొజ్జంటే ఆయనకి ప్రాణం. రామసంద్రంలో ఇంతమంచి కాకరకాయలే దొరకవు. ఇక్కడ దొరికినా ప్రయోజనం లేదు. "పాడు పారుపత్తేగారు" అని మనసులోనే తిట్టుకుని నోరుమూసుకున్నాడు.

కుంకుమార్చన చేయించేటప్పుడు నంజమ్మ కోరకమైన మనశ్శాంతి

లభించింది. శారదమ్మనింతవరకూ ఆవిడ పఠంలో మాత్రమే చూసింది. నిన్న మధ్యాహ్నం వచ్చిన వెంటనే దర్శనం చేసుకుంది. అప్పటికింకా అలంకారం చేయలేదు. ఇప్పుడెందరో భక్తులు కుంకుమార్చన చేయిస్తున్నారు. అమ్మవారెంత కళగావున్నారు. ఎంత గంభీరం. రామసంద్రంలో కాళమ్మ ముఖం చూస్తే భయమేస్తుంది. శారదాంబ ముఖం చూస్తే ఎలాంటి భయమైనా పోతుంది. అమ్మవారి కృపవల్లే విశ్వం బతికి బయటపడ్డాడు. ఇహమీదట ఏ కష్టం వచ్చినా, రోగం, రొష్ఠు వచ్చినా అమ్మవారికే ముడుపు కట్టాలి. కడమా దేవుళ్ళెవరూ అక్కరలేదని మనస్సులో నిశ్చయించి, విశ్వంచేత మూడుసార్లు దండంపెట్టించి, తానూ ప్రదక్షిణ నమస్కారం చేసింది. మొక్కుబడి డబ్బు పావలా హుండీలోవేసి, వాళ్ళిచ్చిన ప్రసాదమూ, కుంకుమా పుచ్చుకుంది. అప్పణ్ణయ్యకూడా భక్తితో ప్రదక్షిణ నమస్కారం చేశాడు.

మరుసటిరోజు లేచి అందరూ కాలకృత్యాలు తీర్చుకున్నారు. ఉదయం ఏడుగంటలయింది. స్నానానికి నదికి వెళ్ళాలి. విశ్వం సత్రం బయట ఎక్కడో వుంటాడని ఎక్కడ వెదికినా కనబడలేదు. చెన్నిగరాయలేమో నదివేపు వెడతానని వెళ్ళిపోతాడు. వెనక్కెప్పుడు తిరిగొస్తాడో తెలియదు. అతనికోసం కనిపెట్టుక్కూర్చోవడ మనవసరం. జనసమ్మర్దంలో కుర్రాడెక్కడ తప్పిపోయాడో ఏమో అని నంజమ్మ, అప్పణ్ణయ్య ఆలోచిస్తుండగా వాడే ఏడుస్తూ వచ్చి, అమ్మ కొంగుపుచ్చుకుని 'నాకూ దోసె కొనిపెడుదువుగానీ రా' అని లాగాడు.

"మడికట్టుకున్నాక పేలపిండి కలిపిస్తాను బాబూ" - అంటే "వూహూ, నాన్న దోసె తింటున్నాడు. నాకూ కొనిపెట్టు" అని పట్టుపట్టాడు.

"ఇప్పుడు నువ్వెక్కడి కెళ్ళావురా?' అప్పణ్ణయ్య అడిగాడు.

"నాన్న ఒక్కడే హోటలు కెడుతున్నాడు. నేనూ వెనకాతలే వెళ్ళాను. ఆయన కూర్చుని రెండు దోసెలివ్వమన్నాడు. తరువాత నన్ను చూసి "నువ్వెందుకొచ్చావు? అని అడిగాడు. "నాకు దోసె కొనిపెట్టు" అన్నాను. "నా దగ్గిర డబ్బులేదు. మీ అమ్మనడిగి పేలపిండి తినువెళ్ళు" అన్నాడు. 'నాకూ దోసె కొనిపెట్టు' - అని నేను, నాకూ దోసె పట్రాండి' అని హోటలు వాళ్ళకి చెప్పాను. 'వీడెవడో కుర్రాడు అడుగుతున్నాడు. తరువాత డబ్బు నన్నడిగేరుసుమా' అని నాన్న అన్నాడు. హోటలు వాళ్ళు నన్ను కసిరిపంపించేశారు.

'ఇక్కడ అటుకులకి, పేలపిండికి వాటాకి తయారవుతాడు. అక్కడ దొంగచాటుగా

హోటల్కి వెడతాడు. చూశారా ఈ దొంగముండాకొడుకు" - అన్నాడు అప్పణ్ణయ్య.

"ఏమైనా చేసుకోనీ, మీరు మాట్లాడకండి, కుర్రాణ్ణి తీసుకెళ్ళి అణాకి దోసె కొనిపెట్టండి"

అమ్మ ఒకణా ఇచ్చింది. బాబాయి వెళ్ళి దోసె తినిపించి తిరిగివచ్చాడు. తరువాత ముగ్గురూ స్నానానికని నదికి వెళ్ళారు. చేపలున్న చోట స్నానం చేయాలని విశ్వానికాశగా వుంది. అంతపెద్ద చేపల్ని వాడుగానీ, వాళ్ళమ్మగానీ చూసి ఎరగరు. అలాంటి చేపల్ని రామనాధపురంలో చూశానని అప్పణ్ణయ్య చెప్పాడు. ఏదైనా తిండి పడేస్తే చేపలు గుంపులుగుంపులుగా ఎగబడే దృశ్యం ఎంతసేపు చూచినా విశ్వానికి తృప్తి లేదు. తనజేబులో వేసుకున్న అటుకులన్నీ చేపలకే వెదజల్లాడు.

స్నానఘట్టంనుంచీ కాస్తపైకెళ్ళి చెల్లచాటుగా నంజమ్మ మొదట స్నానం చేసి, బట్టలుతుక్కుంది. తరువాత విశ్వంతోపాటు అప్పణ్ణయ్య నీళ్ళలోనికి దిగాడు. కానీ విశ్వం ఇద్దరి కళ్ళూ కప్పి క్షణంలో ఎలా తప్పిపోయాడో పోయాడు. రెండే రెండు నిమిషాల్లోవాడు ప్రవాహవేగానికి చిక్కి, కిందికి కొట్టుకుపోతున్నాడు. ఈతవచ్చును గనక నీళ్ళల్లో మునగలేదు. "అబ్బాయి మునిగిపోతున్నాడు, పట్టుకోండి" అని నంజమ్మ గాభరాగా కేకేసింది. వెంటనే అప్పణ్ణయ్య నీళ్ళల్లో ఈదుకుంటూ వెళ్ళాడు. అంతలోనే విశ్వమెంతో ముందుకు వెళ్ళిపోయాడు ఒక్కవూపులో బారలు సాచి ముందుకెళ్ళిన అప్పణ్ణయ్య విశ్వాన్ని పట్టుకున్నాడు. విశ్వంకూడా చేతులు కొడుతూనే వున్నాడు. మొత్తానికిద్దరూ ఒడ్డు చేరుకున్నారు. నంజమ్మకు ప్రాణం లేచివచ్చింది. ఒడ్డుమీద పరుగెత్తుకొచ్చి వాళ్ళు గట్టెక్కుతున్న చోటుకు వచ్చింది. ఇంతలో ఈ దృశ్యాన్ని చూచి చాలామంది గుంపు కూడారు

గట్టెక్కిన విశ్వం "అమ్మా! చెరువులో అయితే ఎలాపడితే అలా ఈదవచ్చు. నదిలో ఎటెటో లాక్కెడుతుంది" - అన్నాడు.

ఆవిడకు పట్టరాని కోపంవచ్చింది. పట్టుకుని వీపుమీద బలంగా నాలుగు వేసింది "నాకు ఈదాలనిపించింది, వెళ్ళాను" అని వాడు తన్నుతాను సమర్థించుకున్నాడు.

"ఇంకా కిందికెడితే సుడిగుండముంది" - అవి దగ్గిరే వున్న ఒకరన్నారు.

వాళ్ళు శృంగేరిలో మొత్తం మూరు రోజులున్నారు. రోజూ వుదయం మమ్మ వారికి

కుంకుమార్చనతో ప్రారంభించి రాత్రి స్వామివారు సింహాసనమెక్కేదాకా అన్నీ చూశారు. చండీహోమమయిన మరుసటి రోజే బయల్దేరారు. "మిగిలిన డబ్బు లెక్కట్టండి. తిపటూరిదాకా రైలు చార్జీ అయితే చాలు. డబ్బంటే చెన్నయ్యతో కూడా మీరూ విశ్వమూ ఎల్లుండి బస్సులోరండి. నేనిరోజే బయల్దేరి నరసింహరాజపురానికి నడిచివస్తాను" అని అప్పణ్ణయ్య చెప్పాడు. అలాచేసినా డబ్బు సరిపడా వుంది. బస్సుకు మూడురూపాయలు ఖర్చు చేస్తే, దారిలో విశ్వమేదైనా అడిగితే కొనిపెట్టాలంటే డబ్బుండదు. అదీకాక మళ్ళీ అలాంటి అడవి చూస్తానో చూడనో! తనకు తెలియకుండా తనలో అరణ్యమంటే అంత ఇష్టం పెనవేసుకుంది. కాళ్ళు లాగుతున్నాసరే నడవటానికి విశ్వం వెనుదీయడు. ముగ్గురూ నడిచే వెళ్ళారు. అప్పణ్ణ గోనిసంచీ తలమీదికెత్తుకున్నాడు. తాను కొన్న శారదాంబ పటాలు మూడూ చుట్టి తనచేత్తో పుచ్చుకుంది.

దారిలో నంజమ్మ మనస్సు ప్రసన్నంగా వుంది. తనపిల్లలిద్దరూ చనిపోవాలన్నది దేవుడి సంకల్పమేమో! దైవేచ్ఛ తప్పించడమెవరికి సాధ్యం? అన్న భావన ఆవిడలో కలిగింది. విశ్వం నదీప్రవాహంలో కొట్టుకుపోయినా బదికి బయటపడ్డాడు. వాడికి గండముందేమో! అయితే గండం గడంచిందన్నమాట. వూరికి వెళ్ళాక తన నాన్నకు కబురెట్టి విశ్వం జీవిత భవిష్యత్తంతా జాతకం వ్రాయించాలనుకుంది. అప్పణ్ణయ్య మాత్రమే ఎందుకో చాలా నిరుత్సాహంగా వున్నాడు. అతడెన్నడూ తనలోకూడా వుండలేదు. ఎప్పుడూ అమ్మతోటే వుండేవాడు. దేశంమీద యాయవారానికి వెళ్ళేవాడు. ఎంచేత అలావున్నాడని ఆవిడెక్కువగా పట్టించుకోలేదు.

నరసింహరాజపురానికి వచ్చి, అన్నం వండుకుని హోటలునుంచీ పులుసు తెచ్చి భోంచేసేసరికి మూడవరోజు మధ్యాహ్నం ఒంటిగంట దాటింది. మిగిలిపోయిన అన్నం గిన్నెలో వేసి మూటకట్టింది. ఇంతలో చెన్నిగరాయల బస్సు వచ్చింది. విశ్వం నాన్న మొఖం చూడగానే "అమ్మా! ఆయనకన్నం పెట్టకండి. ఆయనెందుకు నాకు దోసె కొనిపెట్టకుండా ఒకడే తిన్నాడు" అన్నాడు. ఆ మాటలు మరెవరైనా వింటే ఏమనుకుంటారో అని నంజమ్మ భయం. వాళ్ళ రైలుకింకా ఆలస్యముంది. అన్నంపెట్టమని చెన్నిగరాయలేమో అడగలేదు. స్టేషన్ దగ్గిర హోటల్లో భోజనం తయారుగా వుంది.

రాత్రి తరీకెరెలో నలుగురూ పడుకున్నారు. మరుసటి రోజు [illegible]

తొమ్మిది గంటలకు, రైలు రాకముందే నంజమ్మ అన్నం వండింది. అప్పణ్ణ పులుసు తీసుకొచ్చాడు. చెన్నిగరాయలిప్పుడు కూడా వీళ్ళతోటి భోంచేయలేదు.

ఆరోజు తెల్లారినుంచీ అప్పణ్ణయ్య మరీ జిడ్డుగా వున్నాడు. రైలెక్కాక కూడా నిరుత్సాహంగా కూర్చున్నాడు. అన్నయ్యే పొగాకు ఇవ్వబోతే అక్కరలేదన్నాడు. బేరూరులో బండి మారినప్పటినుంచీ అతని ముఖంలో విషాదమూ, చింతా అగుపించాయి. ఎందుకో అడగాలని నంజమ్మ కనిపించినా మొగుడి ఎదర అడగరాదని వూరుకుంది. కడూరు స్టేషనులో నీళ్ళు నింపుకోవడానికని బండి చాలా సేపు ఆగుతుందని పక్కనున్న వాళ్ళు చెప్పారు. వడలు బోండాలు వెదుక్కుంటూ చెన్నిగరాయలు కిందికి దిగారు. అప్పణ్ణయ్య వదిన నడిగాడు. "తిపటూరినుంచీ మీరు, విశ్వమూ బస్సులో వెళ్ళడానికి డబ్బుందా?"

"ఎందుకూ?"

"మీరెళ్ళండి.నేను నుగ్గికెరె వెళ్ళొస్తాను"

అనిరీక్షితమయినా, ఈ మాటలవల్ల నంజమ్మకు సంతోషమయింది. కనీవినీ ఎరగని రీతిగా అమానుషంగా ప్రవర్తించి కొట్టి, తిట్టి పెళ్ళాం మాంగల్యాన్ని తెంచి, తన్ని తగలేసి ఇన్ని సంవత్సరాలయింది. ఇప్పుడితడు వెడితే మాట్లాడిస్తారో లేదో! తల్లి చెప్పిన మాటలువిని అప్పణ్ణయ్య అలా చేశాడు. ఇప్పటికైనా సంసారం ఒకదారికొస్తే మంచిదే - అని ఆవిడ ఆలోచిస్తుండగా, అతడే "పిల్లల్నైనా చూడాలనిపిస్తోంది" అన్నాడు.

నంజమ్మ డబ్బు లెక్కెట్టి చూసింది. రెండు రూపాయల రెండవ్వరణాలున్నాయి. తనకు విశ్వానికి కలిసి పన్నెండణాలయితే చాలు. ఒక రూపాయతీసి అప్పణ్ణయ్యకిచ్చి "వెళ్ళి చూసిరండి. జయలక్ష్మికి పెళ్ళీడు. తండ్రయినవాడు పిల్లల్ని చూడకపోతే మరెవరు చూస్తారు? రామకృష్ణ బడికెడుతూ వున్నాడో, దానాలు పుచ్చుకుంటూ పల్లెలు తిరుగుతున్నాడో! చూసిరండి" అంది.

గోనిసంచి విప్పి అప్పణ్ణయ్య తన చొక్కా పంచ పైకితీస్తూ వుండగా చెన్నిగరాయలు వెనక్కి తిరిగొచ్చాడు. "ఎక్కడికెడతావురా?" ఆయనడిగాడు. "నుగ్గికెరె" అని అతడు తడుముకోకుండా చెప్పాడు. కాని అలా చెప్ప వుండరాదనే భావన వచ్చేలోపుగా కరణంగారు "వొగ్గేసిన పెళ్ళాన్ని మాడాలని బయల్దేరావా సిగ్గులేని రాముడా?" అని అడిగారు. అంతలో రైలు కదిలింది. అప్పణ్ణయ్య జవాబు

చెప్పలేదు. గబగబా దిగిపోయాడు.

మధ్యాహ్నం మూడుగంటలకి తిపటూరు చేరుకున్న వాళ్ళు, సాయంత్రం ఆరుగంటలకి వూరు చేరుకున్నారు. రాత్రికి కాస్త అన్నం వుండనే వుంది. ఆవిడ వంటచేయలేదు. అమ్మవారి ప్రసాదమూ, పటమూ ఇవ్వటానికని మాస్టారింటికి బయల్దేరింది.

శృంగేరిలో సంపాదించుకున్న మనశ్శాంతి నిలుపుకోవటం కష్టమయింది నంజమ్మకు. అప్పణ్ణయ్య అత్తారింటికెళ్ళాడని, చెన్నిగరాయల ద్వారా తెలుసుకున్న గంగమ్మ మరుసటిరోజు మధ్యాహ్నమే వచ్చి "మళ్ళీ వాళ్ళిద్దరికీ శోభనం చేయాలని పంపించావేమే తార్పుడుముండా?" అని నడివీధిలో నిలబడి తిట్టిపోసింది. నంజమ్మ పట్టించుకోలేదు. బామ్మకి నా తడాఖా చూపిస్తానని బయల్దేరిన విశ్వాన్ని పట్టి లోపల కూర్చోబెట్టింది. అత్తయ్య తిట్ల దండకం పూర్తిచేసి వెళ్ళాక, నంజమ్మను ఈ ప్రశ్న పీడించసాగింది. 'మా మానాన్న మేమున్నా దేవుడెందుకిలా చేస్తాడు? మేమక్కరలేదో దేవుడా అన్నా ఎవరెవరో వచ్చి ఎందుకిలా పొట్లాడుతారు? మాదేవయ్యగారి నడిగినా దీనికి సరైన సమాధానం దొరకలేదు. "మనల్ని పరీక్ష చేయాలని శివుడిలా చేస్తాడు" అని ఆయనేమో చెప్పారు. ఏమిటి పరీక్ష? ఎందుకిలా పరీక్షించాలి శివుడు?" అని ఆవిడ తనలో తాను ప్రశ్నించుకుంది.

నాల్గైదు రోజులయ్యాక ఒకరోజు సర్వక్క వచ్చి అడిగింది. "నంజమ్మగోరు! మీబామ్మ పార్వతికి బంగారపు చేమంతి పువ్విచ్చిందిగా, అదేంజేశారు?"

అది జ్ఞాపకమే లేదు. పార్వతి నగలన్నీ సూర్యనారాయణకిస్తూ పడేశానేమో! కాని తనెరిగినంతవరకూ ఇవ్వలేదనే గుర్తు. ఇంట్లో వెదికి చూసింది. కూతురుకు చెందిన ఏ వస్తువయినా వెదకడం గాని, చూడడంగాని ఆమెకు హితంగా వుండదు. రామణ్ణ బట్టలు కూడా మాదిగ మరియన్న కొడుక్కు దానంచేసింది.

"నాకు తెలీదు. ఎందుకు సర్వక్కా?"

"మీరు శృంగేరికెళ్ళేముందు, మీ ఇంటాయనదాన్ని కాశింబడ్డికి యాభైరూపాలకమ్మారట"

"మీ కెవరుజెప్పారు?"

"శివేగౌడ కూతురే. ఎనకటికాలంలో చేసింది. చాలా అందంగా వుందని దాన్నెట్టుగుని తిరుగుతోందా అమ్మాయి"

తన భర్తగారి శృంగేరి యాత్రలోని రహస్యమంతా తెలిసిపోయింది. మనస్సు

భగ్గుమని మండింది. కాని రెండు నిమిషాల్లో తన్నుతాను సంబాళించుకున్నది. అయిందేదో అయిపోయింది. ఆయన్ను కోప్పడి మాత్రమేం లాభం. ఆయన స్వభావం కుక్కతోకలాంటిది. ఎవళ్ళూ దిద్దలేరు. అని ఆలోచించి "పోనివ్వండి సర్వక్కా! అది ఇంట్లో వుంటే దాన్ని చూడలేకపోయేదాన్ని" అని ఆ ప్రసంగ మంతటితో తుంచేసింది.

## 4

కడూరినుంచీ తొమ్మిది మైళ్ళున్న నుగ్గికెరె వెడుతుండగా అప్పణ్ణయ్య మనస్సులో నానారకాలైన ఆలోచనలు కలిగాయి. ఇప్పుడు పిల్లలెలా వుంటారు? అది నాతో మాట్లాడుతుందో లేదో! "ఇల్లన్న తరువాత మగదిక్కుండాలి. ఇక్కడే పడివుండండి. మీరూ పల్లెల్లో దానం గీనంపట్టి ఇంత ఇంట్లో పడేద్దురుగాని" అని అంటే చేసేదేమిటి? వూరినుంచీ వెళ్ళేటప్పుడు కడుపుతో వుంది. పుట్టింది అమ్మాయో అబ్బాయో! ఏదో భయంకూడా అతని మనస్సు నావరించింది. 'ఇక్కడికెందుకొచ్చావు నడు' అంటే ఏంచేయాలి. ఇప్పుడే వెనక్కి వెళ్ళిపోనా? అన్న ఆలోచన కూడా వచ్చింది. ఎలాగైనా సరే వచ్చాక వెళ్ళిచూసే రావాలి అనుకుని అతడు నుగ్గికెరె చేరేసరికి సాయంత్ర మూరుగంటలయింది. వాళ్ళెక్కడున్నారని వాకబు చేస్తే తెలిసింది. ఈవూరు వదిలి మూడు నాలుగేళ్లయిందట. ఇక్కడ జీవనం గడవదని, పెద్దవూరు కడూరులోనే వున్నారట. బజారులో గంగాధరప్పగారి అంగడి వెనకాతలే వాళ్ళ ఇల్లట.

"అక్కడ బతుకుతెరువెలాగ?"

"మాకేం తెలుసు. మీరు వాళ్ళకేం కావాలి?" వాళ్ళు ముసిముసి నవ్వులు నవ్వుతూ అడిగారు.

తానెవరో చెప్పడమతనికిష్టంగా లేదు. అంచేత, తరువాత ఏ ప్రశ్నావేయకుండా అక్కణ్ణించీ బయల్దేరి, దారిలో చెరువుకట్ట కివతల వున్న బడ్డయ్యాళ్ళికి వచ్చాడు. పరస్థలం వాడని చెబితే ఎవరో సంపన్నుల ఇంట్లో జొన్నపిండిచ్చారు. దాన్ని రొట్టెలు చేసుకుని తిని రాత్రి పడుకుని, మిగిలిన రొట్టె తెల్లారితిని కడూరి వేపు బయల్దేరాడు.

కడూరు అతడు చూడని వూరుకాదు. వెనక ఒకసారి వచ్చాడు. ఉదయం పదిగంటలకక్కడికి వచ్చి బజారులో గంగాధరప్పగారి అంగడెక్కడుందో తెలుసుకుని

వెళ్ళాడు. అంగడి పక్కనే చిన్న సందుంది. ఆ సందులోవెడితే వెనకవేపే మంగుళూరు పెంకులు కప్పిన చిన్న ఇల్లుంది. ద్వారానికి గాజుమణులు తోరణం కట్టారు. అది వాళ్ళ ఇల్లవునో కాదో అని అనుమానిస్తూ నిలబడి వుండగానే లోపలినుంచి ఓ అమ్మాయి వచ్చింది. పధ్నాలుగు పదిహేనేళ్ల వయస్సుంటుంది. చేతిలో పుస్తకాలున్నాయి. మిలమిలలాడే చీరకట్టుకుంది. ముఖానికి పౌడరు వేసుకున్నా ఆ అమ్మాయి ముఖం చూడగానే గుర్తుపట్టాడు. జయలక్ష్మి! తన కూతురే!

"ఇదేనేమిటి ఇల్లు?" అతనడిగేసరికి, అమ్మాయి గుర్తుపట్టనిదానిలా చూచి "ఎవరు మీరు?" అంది.

"గుర్తుపట్టలేదా? మీనాన్ననే!"

"ఏవూరినాన్న?" అంటూ ఆమె లోపలికెళ్ళిపోయింది.

"ఓరి దీనమ్మని ..." మనసులోనే తిట్టుకుంటూ లోపలికెళ్ళిచూస్తే ఆ వైభవమేమిటి! మొత్తలు వేసిన కుర్చీలు. గోడలకు పటాలు, టేబిలు మీద హోటల్లో వున్నట్టు రేడియో. అతడి భార్య పట్టుచీర కట్టుకుని, జడవేసుకుని కుర్చీమీద కూర్చుని వుంది. ముఖానికి పౌడరు వేసుకుంది. ఎంత అందంగా కనిపిస్తోందిప్పుడు!. తొడమీద రెండేళ్ళ అమ్మాయి వుంది. దగ్గిరే మరో పెద్దకుర్చీలో విలాసంగా చేరబడి సుమారు నలభై ఏళ్ళ పెద్దమనిషి సిగరెట్టు కాలుస్తున్నాడు. ఆయన వేళ్ళన తళతళలాడే వుంగారాలేమిటి! మెడలో చైనేమిటి! చేతికి బంగారపు గడియారమేమిటి! కళ్ళు జిగేల్మన్నాయి.

"ఇదే నా ఇల్లు! నేను నుగ్గేకెరె వెళ్ళొచ్చాను" అప్పణ్ణయ్యడిగాడు. (సాతు నిర్ఘాంతపోయి ఒక క్షణమతణ్ణే చూస్తూ వుండిపోయింది. కానీ అతడు మళ్ళీ నోరెత్తకముందే "ఎవరు మీరు? ఇక్కడికెందుకొచ్చారు?" అంది.)

"నన్నే ఎవరంటావేమే?"

("వీణ్ణి ఇంట్లోనుంచి పంపించేయండి" - అని చెప్పి పక్కనున్న గదిలోకెళ్ళింది.

"ఎవఁడ్రా నువ్వు?" అని ఆ పురుషుడన్న దర్పానికే అప్పణ్ణయ్య బెదిరిపోయాడు. అక్కడ నిలవకుండా, చటుక్కున వెనక్కి మళ్ళినవాడు వెనకనించి ఏదో కుక్క తరుముతున్నట్టు దబదబ అడుగులు వేసుకుంటూ పరుగెత్తాడు. తానెలా వెడుతున్నాడు, ఏ దిక్కుగా వెడుతున్నాడన్న జ్ఞానం కూడా లేకుండా పరుగెత్తి అలిసిపోయి పెద్ద పెద్ద అంగలు వేస్తూ నడిచాడు. కాసేపటికి దూరంలో ఏదో

వూరగుపించింది. "అది ఏవూరు?" అని అడిగితే ఎవరో 'బీరూరు' అన్నారు. గబగబా నడిచి అక్కడికొచ్చాడు. తిపటూరికి వెళ్ళే రైలు ఇంతలోనే వస్తుందని ఎవరో చెప్పారు. స్టేషనుకెళ్ళి టికెట్టు తీసుకుని రైలు వచ్చాక కూర్చుంటే ఆ పాడు రైలు కడూరికే వచ్చి ఆగింది. వాళ్ళు తన్ను వెదుకుతూ వస్తే ఏంగతి అన్న భయంతో తన వేపున్న కిటికీ మూసి, రైలు బయల్దేరేదాకా కాళ్ళు చేతులు ముడుచుకుని కూచున్నాడు. తిపటూరు చేరేదాకా గుండె పీచుపీచుమంటోంది. స్టేషనులో దిగి, మిగిలిన అయిదణాలకి సాదా దోసెలు తిని, వూరి వేపు వెళుతుండగా "వాడెవడయ్యుండచ్చు" అన్న జిజ్ఞాస కలిగింది. "ఆ లంజాకొడుకు నుంచుకుందీ గాడిదముండ" అన్న జవాబు కష్టంలేకుండానే స్ఫురించింది. అలాగే వెనక్కెళ్ళి దాన్ని చీపురుచ్చుగుని కొట్టాలన్న వుద్వేగం కలిగింది. కాని మళ్లీ అటువెళ్లడానికి భయమేసింది.

మధ్యదారిలో ఎక్కడా ఆగకుండా రాత్రి పదిగంటలకి వూరికి వచ్చి హనుమంతరాయని గుడి తలుపు తట్టి 'నేను' అన్నాడు. గంగమ్మ [illegible]పేమో తెరిచింది. బుడ్డిదీపం వెలిగించాక అతడెళ్ళి లోపలకూర్చోవడమే తరువాయి, ఆవిడడిగింది. "మళ్ళీ ఆ లంజని వెతుక్కుని వెళ్ళావేరా? అది తన పడగ్గదిలోకి నిన్ను రానివ్వలేదా?"

అప్పణ్ణయ్య మాట్లాడలేదు. గంగమ్మే – "సిగ్గుమాలిన లంజాకొడుకా! శృంగేరి యాత్రకు వెడతానని, అబద్ధాలాడి దానితో కులకడానికెళ్ళావా? ఈ దేవుడిగుళ్ళో వచ్చి కూర్చున్నావే. తెల్లారి అణ్ణాజోస్యులను పిలిపించి వెలివేయిస్తానాగు. వొగ్గేసిన పెళ్ళాని కోసమెళ్ళిన సిగ్గులేని రామా!"

అప్పణ్ణయ్యకు విపరీతంగా కోపం వచ్చింది "వెంటవే అన్నాడు నోరుమూసుకుంటావా లేదమ్మా?"

"నే నెందుకు నోరు మూసుకోవాలిరా చవటా. దాని పంచితం వాసన చూస్తూ పరుగెత్తేవుకదరా వుచ్చగిత్తా. పావలాకి పడుకునే ముండ..." ఆమె తిట్లూ శాపనార్థాలు వినివిని అతడికి చిర్రెత్తుకొచ్చింది. "నోరు మూసుకుంటావా లేదా?" అని మరోసారి గట్టిగా అరిచాడు. ఆవిడింకా విజృంభించి తిట్టడం మొదలెట్టింది. అతడికెదురుగుండా ఈతాకు చీపురగుపించింది. లేచి దాన్ని చేతబుచ్చుకుని, ముక్కూ మొహము, వీపు, కాళ్ళు చేతులు అని చూడకుండా రపరప వాయించాడు "అయ్యో బాబోయ్. వీడు నన్ను చంపేస్తున్నాడు బాబోయ్" అని ఆవిడ వేసిన

గావుకేకలకి ఏడెనమండుగురు లేచివచ్చారు. కాసేపటికి మరోనలుగురు పోగయ్యారు. గంగమ్మ అణ్ణాజోస్యులను పిలిపించింది. అయ్యాశాస్త్రుళ్ళూ వచ్చారు.

"కన్నతల్లిని చీపురుకట్టతో కొట్టడం కంటే మహాపాపముందా?" అయ్యాశాస్త్రుళ్ళన్నారు.

"నూటఒక్కరూపాయలిచ్చి ప్రాయశ్చిత్తం చేయించుకోవాలి" అణ్ణాజోస్యులు తీర్పు చెప్పారు.

"నా నుంచీ వెంట్రుకముక్కైనా పీక్కోలేరు పొండిరా" అప్పణ్ణయ్య విర్రెత్తి గాండ్రించాడు.

ఇలాంటివాణ్ణి దేవాలయంలో వుంచడమెలాగ? వాడికి వెలివేసి వెంటనే అక్కడిమంచీ తరిమేశారు. "వీడివూరే వదిలి వెళ్ళాలి" అని అణ్ణాజోస్యులవాదం. "ఈ వూరేం మీ బాబు జాగీరు కాదురోయ్ జోస్యా" అని గర్జించాడు అప్పణ్ణయ్య. వాడికంతటి ధైర్యరావటం వాళ్ళు వెనకటికెప్పుడూ చూడలేదు. అందరూ స్తబ్దులయ్యారు. అతడే తన గుడ్డలు గిడ్డలు తీసుకుని వెళ్ళిపోయాడు. 'ఈ లంజాకొడుకు చేతుల్లో పురుగులడ' అని గంగమ్మ శపించింది.

వదిన ఇంటికి వెళ్ళాలని అనుకున్నాడు. నుగ్గెకెరె విషయమడిగితే ఏం చెప్పాలి? అన్నది గుర్తొచ్చి అక్కడికి వెళ్ళలేదు. చప్పుడు చేయకుండా వెళ్ళి మాదేవయ్యగారి గుడి అరుగుమీద పడుకుని ఆ రాత్రి గడిపాడు. మళ్ళీ దాదాపాక నెలరోజా అతడూళ్ళోనే లేడు.

నిన్నరాత్రి జరిగిన సంగతి నంజమ్మకు తెలిసింది. అతడు పెళ్ళామింటికి వెళ్ళాడన్న సంగతి వూరికి రాగానే తల్లికెళ్ళి చెప్పిన తన మొగుడిమీద విపరీతమైన కోపం వచ్చింది. కానీ అతణ్ణి అడిగి లాభం లేదు. గంగమ్మ కొడుకునే కాక, కోడలిని కూడా మనస్సుకు తోచినట్లు తిడుతూ తిరుగుతోంది. దానికి కూడా నంజమ్మ వులకలేదు పలకలేదు. బామ్మ ఎదురుపడి ఏమైనా అన్నా ఆమెతో మాట్లాడవద్దని విశ్వంతో చెప్పింది.

నెలరోజులయ్యాక ఒక రోజు అప్పణ్ణయ్య వదిన ఇంటికొచ్చాడు చెన్నిగరాయలింట్లో లేడు. అతడన్నాడు "ఆ భోసుడిముండతో పాటు వుండకపోతే నాకేం గడవదనా? 'హిరీసావె' చుట్టూవున్న పల్లెలకెళ్ళి ఒక బస్తా రాగులు, అవపగింజలు, మెరపకాయలు అన్నీ పోగుచేసుకొచ్చాను. నా ఇరవై రూపాయలు నాకివ్వండి. వంటగిన్నెలు అవీ కొంటాను."

"ఎక్కడుంటారు?"

"కురుబరహట్టి బీరేగౌడ గొడ్లచావిడ అరుగుమీద ఓగదుందిగా. అతణ్ణడిగాను ఓ దానికేం. వుండమని బీరేగౌడన్నాడు.

మూడురోజుల్లో నంజమ్మ అతని డబ్బుతనికిచ్చింది. కంబనకెరె సంతకెళ్ళి అత డల్యూమినియం చట్టి, గ్లాసులు, గరిట, వంటగిన్నెలు, ఒక చాప కొని తెచ్చాడు. ఊళ్ళో వున్న రోజుల్లో రాగిముద్ద వండుకుంటాడు. పులుసెప్పుడోగాని చేసుకోడు. పదినె ఇంట్లో రెండు పూటలకు సరిపడా పులుసు పట్టుకెళ్ళేవాడు. ఒక్కోరోజిక్కడే భోంచేసేవాడు. మళ్ళీ ఇంటికి రానిస్తోంది గనక ఆవిణ్ణి ప్రత్యేకంగా వెలివేయాలని గంగమ్మ జోస్యులతో చెప్పింది. కానీ దాన్యపు లెక్కలు వ్రాసే నంజమ్మ స్వయంగా శృంగేరియాత్ర చేసివచ్చింది. ఆవిడంటే జోస్యులకు బితుకుగానే వుంది. పురోహితులిద్దరిలో ఎవరూ శృంగేరి ముఖమే చూచి ఎరగరు.

ఒకరోజు నంజమ్మ అప్పణ్ణయ్య నడిగింది. "నుగ్గీకెరెలో వాళ్ళేమన్నారు?"

"ఆ ముండలావూళ్ళోనే లేరు"

"ఎక్కడికెళ్ళారో ఎవరూ చెప్పలా?"

"చెప్పేదేమిటి నా బొంద. కడూరులో ఎవడో షావుకారుతో కాపురం చేస్తోందా మాదిగ ముండ" అని అతడు తాను చూచిందంతా దాచుకోకండ చెప్పేశాడు.

అది వినగానే నంజమ్మ మనస్సు కలుక్కుమంది. ఈ ఇంటికి తామిద్దరూ కోడళ్ళుగా వచ్చారు. ఇద్దరిలో ఎవరుగాని పెళ్ళాల్ని విచక్షణతో బతకనివ్వలేదు. స్వయంగా వివేకం లేనివాళ్ళు పెళ్ళాల్ని బతకనిస్తారా? కాని అన్నకంటే తమ్ముడు కాస్త నయం. మంచిగా మాట్లాడితే మాటవింటాడు. వచ్చేట్టు చాకిరీ చేస్తాడు. పెళ్ళాంపిల్లలు తిన్నారా లేదా అని చూచి తరువాత తింటాడు. సాతు కాస్త విచక్షణతో ప్రవర్తించి వుంటే ఇలా జరిగేది కాదేమో! కానీ కష్టాలను భరించే శక్తి అందరికీ ఒకేలా వుండదు. ఆ అత్తయ్య మాట, ఆ మొగుడి మాట, వాళ్ళ భాష సహించడమందరికి చేతకాదు. తల్లిమాట విని అప్పణ్ణయ్య తన చేతుల్తో తాను కట్టుకున్న పాకకే నిప్పెట్టి తగలేశాడు. పెళ్ళాం తాళి తెంచివేశాడు. కానీ ఇంటికి వచ్చిన మరొక అమ్మాయి, తన తోడికోడలు ఇల్లా చేయరాదు - అని మనసులోనే బాధపడి, అప్పణ్ణయ్యతో అంది "ఈ విషయం ఎవళ్ళతోటయినా చెప్పారా?" ("లేదు" అన్నాడతడు)

"చెప్పకండి. మన మర్యాదే మట్టిపాలవుతుంది."

"ఆ ముండ మాట నాలుకతో వుచ్చరించినా అమేధ్యం తిన్నంత అసహ్యం వేస్తుంది. నేను దాని మాటెత్తను".

"అలాకాదు. ఒక్కోసారి కోపం వస్తే, మీరేమంటున్నారో మీకే తెలీదు. దీన్ని ఎవళ్ళతోటీ చెప్పనని దేవుడి మీద ప్రమాణం చేసి చెప్పండి".

"శృంగేరి శారదాంబ మీద ఒట్టెట్టి చెబుతున్నాను ఎవరితోటీ చెప్పను" అని అతడు గోడమీద వేళ్ళాడుతున్న శారదాంబ పటాన్ని తాకి చెప్పాడు.

# 15వ అధ్యాయం

ఇప్పటికి ఎనిమిదేళ్ళక్రితం పూరవతల ప్రభుత్వం కొత్త ఎలిమెంటరీ స్కూలు భవనం కట్టించింది. శివేగౌడకిప్పుడు బడికని ఇచ్చిన తన ఇంటిఅద్దె పోయింది. కొత్త బడికి పక్కనే పెద్ద ఆటస్థలముంది. మూడువేపులా పొలాలు.

ఒకరోజు నంజమ్మ కొత్త శిర్డీ పుస్తకం కుడుతూ కూర్చుంది. మాస్టారు నంజమ్మింటికి ఆదరాబాదరాగా వచ్చి "నంజమ్మగారూ మీ విశ్వం ఎలాంటిపని చేశాడనుకున్నారు?" అన్నాడు.

మాస్టారేవచ్చి చెప్పారంటే మరీ అల్లరిపనే చేసివుండాలి. ఆమె మాస్టారు చెప్పిందివిని బెంగపెట్టుకుంది. "బడికి వెనకాతల ఆటస్థలంలో అటువేపు ఓపుట్టవుంది చూశారూ, దాని పక్కనున్న కంచెలో ఓ పాముందిగావును. కుబుసమూడ్చేముందు పాము మగతగా వుంటుంది చూడండి అది ఏ పరధ్యానంలోవుందో ఏమో వీడో కర్రుచ్చుకుని వెనకనించి వెళ్ళిదాన్నికొట్టాడు."

"ఆ తరువాత?" నంజమ్మ భయపడుతూనే అడిగింది.

"అదృష్టంకొద్దీ అది మీదపడలేదు. సరపర పుట్టలోకి వెళ్ళిపోయింది. అది దూసుకుపోవడం నేనూ చూశాను. వాడు వెనకాతల్నించి తరుముకెళ్ళాడు. వాణ్ణిపట్టుకుని నాలుగిచ్చాను."

"వాడిచెయ్యి విరిగేలా కొట్టాల్సింది."

"ఇప్పుడు వాణ్ణి కొట్టే ప్రయోజనంలేదు. పాము పన్నెండేళ్ళు పగబడుతుంది. వాడు ఇదే బడికి వస్తూవుంటే ఏరోజో కనిపెట్టుకుని కాటేస్తే ఏంసంగతి?"

ఆమె గుండె దడదడలాడటం మొదలెట్టింది. "ఆ కుర్రాడి ప్రకృతే అంత. ధైర్యమంటే ప్రచండధైర్యం. అది నా ప్రాణాలమీదికొస్తుంది. ఇప్పుడేంచెయ్యాలి మాస్టారూ?"

"పాము పుట్టలోనే వుండొచ్చు. నలుగుర్ని పంపి పుట్ట తవ్వించి ఆ పామును చంపించాలి. ఆలస్యం చేయరాదు." నంజమ్మ వెంటనేలేచి ఇంటికి

తాళం వేసి వెళ్ళి వెట్టికి కబురెట్టింది. వాడితోబాటు నీరుగంటి వచ్చాడు. పాముల్ని కొట్టడంలో వూళ్ళో పేరున్నవాడు వాల్మీకి సంజీవనాయకుడు. వాడికో రూపాయకూలి ఏర్పాటుచేసి వాళ్ళతోబాటు పంపించింది. తానూ వాళ్ళ వెనకాతలే వెళ్ళింది. విశ్వం ఆటస్థలంలో ఒక్కడే పిల్లిమొగ్గలు వేస్తున్నాడు.

"పామునెందుకురా కొట్టడాని కెళ్ళావు?" అని నంజమ్మ అడిగితే, "ఆరోజు సంజీవనాయకుడు తిరుమలయ్య ఇంటి పెరట్లో కొట్టాడుగదా అలాగే నేమూ కొట్టాను." అన్నాడు.

సంజీవనాయకుడు వెదురుకఱ్ఱ పుచ్చుకుని ఎదురుగుండా నుంచున్నాడు. వెట్టి, నీరుగంటి పుట్టని తవ్వటం మొదలెట్టారు. దానిలోని కన్నాలు అన్నివేపులా ఎంత తవ్వినా వంకరటింకరగా ముందుకెళ్ళిపోతున్నాయి. సాయంత్రందాకా ఏకన్నమూ వదలకండా గాలించినా పాము దొరకలేదు.

"ఇప్పుడీళ్ళు పుట్ట తవ్వడానికొస్తారని పసిగట్టి నాగరాజెళ్లిపోయిండు"- అని సంజీవనాయకుడన్నాడు. "దానికోసం వెదికి లాబమేంలేదు. ఎన్నటికయినా కనిపెట్టుక్కూచుని కుఱ్ఱాణ్ణి కాటేస్తాడు."- అని హెచ్చరించాడు.

నంజమ్మకు పట్టరాని కోపం వచ్చింది నాయకుడి చేతిలోవున్న వెదురుకఱ్ఱ పుచ్చుకుని విశ్వం వీపుమీద నాలుగు బాదింది. వాడేడుస్తూ నుంచున్నాడు. "అయిందేదో అయిపోయింది. కొట్టి ఏం లాభం"- మాస్టారు నివారించారు. నంజమ్మ కుఱ్ఱాణ్ణి రెక్కపుచ్చుకుని ఇంటికి లాక్కొచ్చింది. ఇద్దరు పిల్లలు పోయారు వున్నది వీడొకడే. ఈదుకుంటూ చెరువుమధ్యకెళ్ళటం, నదిలో ఈదటం, మాదేవయ్య గుడి గోపురమెక్కి కిందికి దూకటం, దొంగచాటుగా ఎవరివో గుఱ్ఱపుపిల్లలు పొలములో మేస్తుండగా ఎక్కి సవారి చేయటం, పెద్దపెద్ద తేనెపట్టులొక్కడే వెళ్ళి తీయటం, ఒక్కడే పాముని కొట్టడం- ఇలాంటి అల్లరి పనులే వాడివి. ఆవిడకి నాన్న గుర్తొచ్చాడు. తాతయ్యలాగే వీడు కూడా. తరువాతయినా అదే బుద్ధి రాకపోతే చాలు. ఇప్పుడు వీడు చేసిన అఘాయిత్యానికి విరుగుడేమిటి? పాము పన్నెండేళ్ళు పగపడుతుందట. రేపు తెల్లారితే బడికి అక్కడికే వెళ్ళాలి. మరుసటిరోజు వాణ్ణి బడికి పంపలేదు. ఆతరువాత రోజు పంపలేదు. మాస్టారు వచ్చి అడిగారు. "కుఱ్ఱాణ్ణి బడికి పంపందే మంచిదనుకోండి. కానీ ఎన్నిరోజులని కుఱ్ఱాణ్ణి ఇంట్లోనే వుంచుకుంటారు?"

అదీ నిజమే. ఎలిమెంటరీ స్కూలయ్యాక వాడు కంబనకెరె

మిడిల్‌స్కూలుకెళ్ళాలి. తెపటూరికెళ్ళి హైస్కూల్లో చదవాలి. అమాత్రం చదివితే, రెవెన్యూ ఇన్స్పెక్టరు కావచ్చు. లేదా మిడిల్‌స్కూలు మాస్టారు కావచ్చు. విద్య లేకపోతే వాళ్ళ నాన్నలాగా, బాబాయ్‌లాగా తయారవుతాడు. ఏంచేయాలో ఆవిడకి తెలియలేదు. వెళ్ళి మాదేవయ్యగారి నడిగింది. ఒకరోజల్లా ఆలోచించి ఆయనే ఇంటికి వచ్చి చెప్పారు. "ఇప్పుడెలాగూ వీడు మూడో తరగతి. తీసుకెళ్ళి మీ అన్నయ్యింట్లో వదిలెయ్యండి. నాలుగో తరగతి అక్కడే పూర్తిచేయనీ. తరువాత వాడికి బడితో పనిలేదు. కంబనకెరెలో, అన్నానికేదో దారిచూసి, ఇంగ్లీషు బడిలో చేర్పించండి. సెలవులకిపూరొచ్చినా బడివేపు వెళ్ళకుండావుంటే సరి. ఆపాటికి కుర్రాడెదుగుతాడు. మనుష్యులకే గుర్తుపట్టడం కష్టం. ఇక పామెలా గుర్తిస్తుంది?"

"అక్కడ మా వదినన ఎలాంటిదో మీకు తెలిసిందేగా అయ్యగారూ?"

"ఆవిడెలాగుంటే ఏం. ఇంట్లో ముసలమ్మవుంది. పిల్లల్లేరు. మీ అన్నయ్య కూడా ప్రేమగానే చూసుకుంటాడు."

ఇదే మంచి ఉపాయమని ఆవిడ కనిపించింది. ఐతే వున్న ఒక్క కొడుకునీ అక్కడే వదిలేసి తానొక్కతీ ఇక్కడుండటమెలాగ?- అన్న బాధ ఆవిడని కలతపెట్టింది. ఊళ్ళోనే వుంచుకుంటే వాడికి చావు తప్పదేమో అనే భయం ముందు ఈ ఎడబాటు వల్ల కలిగే బాధ అంత పెద్దది కాదు. సెలవులొస్తే వూరికి తీసుకురావచ్చు. నేనూ అడపాదడపా వెళ్ళి చూసి రావచ్చు. మొత్తానికి ఒకటిన్నర సంవత్సరం. వాడక్కడుండటమే మంచిదని నిశ్చయించుకుంది.

మరుసటిరోజే వాడికి తలంటు పోసింది. దర్జీవాడికి కబురెట్టి కొత్త చొక్కాలు, లాగులు కుట్టించింది. 'కోడుబళె', జంతికలు చేసింది. "అమ్మా నేనింకోసారి ఏమీ చెయ్యను. వన్నెక్కడికీ పంపకు" అని విశ్వం ప్రాధేయపడ్డాడు. "ఒక్క సంవత్సరమే బాబూ. తరువాత కంబనకెరె బళ్ళో చేరుదువుగాని. కావలిస్తే నేనే అక్కడికొచ్చి వంట చేసిపెడతాను. ఊరికే ఉండకుండా ఆ పాము జోలికెందుకెళ్ళావు?- అని తాను కంటతడి పెట్టుకుంటూ వాడి కన్నీళ్ళు తుడిచి ఓదార్చింది. ఒక బస్తా రాగులు, ఇరవైశేర్లు అనపగింజలు, దుత్తెడు ఆముదం, రెండువీశలు సీకాయపొడి బండికెత్తించింది. బడి సర్టిఫికేటు జాగర్తచేసుకుని విశ్వంతో బయల్దేరింది. చెన్నిగరాయుడు వాళ్ళతో వెళ్ళలేదు.

వెల్లెలు కొడుకును ఇంట్లో వుంచుకోవటం, కల్లేశుకూ సంతోషమే. అక్కమ్మకైతే

పట్టరాని వుత్సాహం. నీఝ్యా గీఝ్యా తోడటం ఆవిడ చేతకాదు. అయినాసరే మునిమనవడికి తలంటిపోస్తానని చెప్పింది. వైముఖ్యం చూపింది కల్లేశు పెళ్ళాం ఒక్కతే. కాని ఆవిడ ప్రవర్తన అలా వుంటుందని అందరూ అనుకున్నదే.

కూడా తెచ్చిన సరుకులను చూసి కల్లేశు- "ఇవన్నీ ఎందుకు తెచ్చావు? మాఇంట్లో అన్నంలేదనా? వాపసు తీసుకెళ్ళు" అన్నాడు.

"నా కొడుక్కి అన్నం ఖర్చుకని పట్రాలేదు. వాడికి అన్నంపెట్టే బాధ్యత నీకూవుంది. ఏదో ఇంట్లో వున్నాయి కదా అని తెచ్చాను. వాడికి పాలకి, నెయ్యికీ కష్టమే లేదనుకో. నీవు మరేమీ చేయకు. వాడి అల్లరి విపరీతం. మావూళ్ళో వాడికి భయం లేదు. ఎంతకొట్టినా మగపిల్లలు ఆడాళ్ళకు భయపడరు. నేనేమనుకుంటానో అని చూడకు. నాలుగుతన్ని భయపెట్టి బుద్ధిమంతుణ్ణి చెయ్యి. చదువులో, రాతకోతల్లో వాడు తెలివైనవాడు. ఊళ్ళోవుండేదాకా నేనింట్లోనే పాఠాలు చెప్పించాను. ఇక్కడ నీకు వీలుంటే చెప్పించు. లేకపోతే మాస్టార్నేర్పాటు చెయ్యి. నేను నెలకో రూపాయి పంపిస్తాను."

కల్లేశు మళ్ళీ ఏమి అనలేదు. "నాలుగు రోజులుండి వెళ్ళు. - అని అతడూ అక్కమ్మా బలవంతం చేశారు. కాని ఆవిడ ఊళ్ళో లెక్కలురాయాలని మరుసటిరోజే అదే బండిలో వూరికి బయల్దేరింది.

"అమ్మా నేనూ ఊరికి వస్తాను" - అని విశ్వం ఏడుస్తూ నుంచున్నాడు. నంజమ్మకూ ఏడుపొచ్చింది. కన్నీళ్ళు తుడుచుకుంటూ ఆవిడ బండెక్కింది.

తండ్రి కంఠీజోస్యులు వూళ్ళోలేనందువల్ల మాళ్ళేకపోయింది. ఆయన వూరొదిలిపెట్టి మూణ్ణెల్లయ్యింది.

## 2

విశ్వాన్ని వదిలిపెట్టి వచ్చాక నంజమ్మకింట్లో పొద్దుగడపటమే కష్టమయింది. చేయడానికి చేతినిండా పనేమో ఉంది. కాని ఒంటరితనం విసుగ్గాఉంది. పార్వతీ, రామణ్ణా, పదేపదే గుర్తొచ్చి మనస్సు కలత చెందుతోంది. ఏ వడవలో అయితే ఆవిడ కరణీకపులెక్కలు వ్రాస్తుందో, రాగులు విసురుతోందో, వచ్చినవాళ్ళతో మాట్లాడుతోందో ఆ నడవలోనే ఇద్దరుపిల్లలు జబ్బుపడి ఒకళ్ళతరువాత ఒకళ్ళు చచ్చిపోయారు. ఆ ఇంట్లో ఉండటమే మనస్సుకి ముళ్ళు గుచ్చుకున్నట్లుంది. అయితే ఎక్కడికెళ్ళాలి? అప్పుడావిడకి గుర్తొచ్చింది. ఈ ఇంటికి వచ్చి దాదాపు

పదమూడేళ్ళయింది. గుండేగౌడ ఇల్లు తన సొంతిల్లులా అయిపోయింది. దాని అవసరమాయనకు లేదు. కాని ఊళ్ళో తనకో ఇల్లంటూ ఉండాలికదా - అన్న కొత్త ఆశ మొలకెత్తింది.

తనకు వేరే ఇల్లు ఎందుకు? తరువాత తరువాత విశ్వం ఈ ఊళ్ళో ఉండరాదనే ఆవిడ కోరిక. వాడు రెవెన్యూ ఇన్స్పెక్టరు కావాలి. లేదా మిడిల్‌స్కూలు మాస్టారయినా కావాలి. వాడెలాగూ ఈ ఊళ్ళో ఉండడు. కొడుకెక్కడుంటే అక్కడికెళ్ళాలితాను. కాని తనవూళ్ళో తనకో గూడంటూ ఉండాలి. సెలవులు వస్తే వచ్చి నాలుగురోజులుండటానికి ఒక జాగా ఉండాలి. అదే సమయంలో ఆ ఊళ్ళో ఒక ఇల్లు అమ్మకానికొచ్చింది. గానుగ చెలువశెట్టి అన్నవాడికి అత్తారూళ్ళో మంచి ఆస్తిపాస్తులు దొరికాయి. ఈ ఊళ్ళో ఉన్నవన్నీ అమ్మేసి అక్కడి కెళ్ళాలని నిశ్చయించాడు. అతని ఆస్తిపాస్తుల అమ్మకపు పత్రాలన్నీ తనదగ్గరే వ్రాయించాడు. అంటే ఆవిడ చెపితే చెన్నిగరాయలు వ్రాశాడు. పొలాలు కొనేవాళ్ళు రాతకోతలకి వీళ్ళకేమీ ఇవ్వక్కర్లేదు. మొత్తం ఆస్థి అమ్మిన ఖరీదులోనే ఈ ఇల్లుకూడా చేర్చాలి. దీన్నిమాత్రం చెలువశెట్టి వీళ్ళకు వ్రాసి ఇవ్వాలి. వీళ్ళు యాభై రూపాయలు అతనికిస్తే చాలు. అనుకున్నమేరకే అన్నీ జరిగాయి. లా పాయింటు తెలిసిన నంజమ్మ ఇల్లు తన పేరిటే వ్రాయించుకుంది. పొలంపన్ను రసీదుల మీదే ఇతర పొలాలు కొన్న ఆసాముల్నించీ యాభైరూపాయలిప్పించింది. రెండంకణాల పంచటరుగు, లోపల మూడంకణాల లోగిలి, ఒక అంకణం వంటిల్లు, ఒక అంకణం ధాన్యపుగది లేదా ఉత్తరోత్తరా కొడుక్కి పెళ్ళయితే వాళ్ళకి పడగ్గది ఇన్నీ ఉన్నాయి. వెనకాల పెరట్లో రెండు పశువుల్ని కట్టడానికి వీలయిన గొడ్ల చావిడి, కూరపాదులు పెంచుకోవడానికి ఖాళీ జాగా. మొత్తం ఈ ఇంటికంతా బిళ్ళపెంకు వేయించాలంటే ఎంత లేదన్నా వెయ్యి రూపాయలు కావాలి.

ఇప్పుడుకూడా ధాన్యపు లెక్కలు వ్రాయాలి. వెనకటిలాగే ఆదాయంకూడా ఉంది. కురుబరహళ్ళి వాళ్ళేకాక రామసంద్రం, లింగాపురం వాళ్ళుకూడా ధాన్యపులెక్కలు వచ్చాక ఇంటికిన్ని రాగులని తెచ్చివ్వడం మొదలెట్టారు. ఇంట్లో వెనకటిలా ఖర్చులేదు. ఒకపూట వండితే రెండుపూటలకి సరిపోతోంది. తనకు వొచ్చే రాగులలో కొంతఅమ్మవచ్చు. ఇప్పుడు రాగులు ఖండిగ తొంభైరూపాయలు పలుకుతున్నాయి. దీనికితోడు రెండేళ్ళ పోటిగె డబ్బంటే అయిదువందల

రూపాయలు. వచ్చే ఏటి పన్ను ఇప్పుడే ఇవ్వండి అంటే కురుబరహళ్ళివాళ్ళిస్తారు.

ఇదిలా ఉండగా ఒకరోజు మాస్టారొచ్చి చెప్పారు - "చూడండి, ప్రభుత్వమిప్పుడు వయోజన విద్యాసమితి అని ఏర్పాటు చేసింది. మగ ఆడ అందరూ చదవనూ రాయనూ నేర్చుకోవాలని ప్రభుత్వం ఆర్డరు వేసింది. పద్దెనిమిదేళ్ళు దాటినవాళ్ళందరికీ రాత్రి ఏడుగంటల్నించీ తొమ్మిదిగంటలదాకా చదువూ రాతా నేర్పించాలి. దాన్ని నైట్‌స్కూల్ అంటారు. ఈ ఊళ్ళో మగాళ్ళనైట్‌స్కూల్‌కి నన్ను నియమించారు. నా జీతం కాకుండా నెలకి పాతిక రూపాయ అదనంగా ఇస్తారు. ఈ ఊళ్ళో విద్యావంతురాలైన స్త్రీ ఎవరున్నారని మా ఇన్‌స్పెక్టరడిగారు. నేను మీపేరు సూచించాను."

"నేనాపని చేయగలనా మాస్టారూ?"

"ఇదేమిటి ఇలా అంటారు? మొత్తం ఎనిమిదినెలల పని అది. ఒక జట్టు అయ్యాక మరో జట్టు మొదలెట్టాలి. అ ఆ ఇ ఈలతో మొదలెట్టి రెండో తరగతి పుస్తకం చివరదాకా చదవగలిగిన జ్ఞానం వస్తే చాలు. తరువాత వాళ్ళే పేపరు గీపరు చదువుకుని తంటాలు పడాలి. నెలకు పాతిక రూపాయలు చేదా? కేవలం ఆడాళ్ళు మాత్రమే వస్తారు."

"చదువుమీద ఎవరికాశవుంది? అందులోనూ ఈ ఊరి ఆడవాళ్ళకి?"

"ప్రభుత్వమే. పలకలూ, బలపాలూ, పుస్తకాలూ, పెన్సిళ్ళూ అన్నీ ఇస్తుంది. మీరు వెలిగించే దీపం ఖర్చుకూడా ఇస్తుంది. బోర్డు , కిరసనరాయిలు కూడా ఇస్తుంది. మీ ఇంటి పంచటరుగుమీదే బడి పెట్టుకోవచ్చు. మొదట ఏడెనమండుగురు స్త్రీలు పోగయితే తరవాత కడకు వాళ్ళే వస్తారు. కావలిస్తే మా ఆవిణ్ణికూడా పంపుతాను."

మొదట నంజమ్మ దీనికి ఒప్పుకోలేదు. ఒకరోజు వీళ్లింటికొచ్చిన రెవెన్యూ ఇన్‌స్పెక్టరూ అదే సలహా ఇచ్చేసరికి ఒప్పుకుంది. కంబనకెరె మిడిల్‌స్కూల్ హెడ్‌మాస్టరే ఓన్నంతా చూసుకునే పై అధికారి. ఆయనే ఓ రోజు బండి కట్టించుకుని వచ్చి పలకలూ, పుస్తకాలూ, బోర్డూ, లాంతరూ మొదలైన సరంజామా అంతా ఇచ్చి వెళ్లారు. మాస్టారు భార్యకు అ ఆ లు ఇ ఈలు వచ్చు. అయినా మాస్టారు ఆమెను విద్యార్థి గానే చేర్చారు. నంజమ్మ కాశ్చర్యమైన విషయమేమిటంటే సర్వక్క తనంతటతానే వచ్చి రాత్రి బళ్ళో చేరింది. ఇంట్లో మొగుడడ్డుపెట్టినా ఆవిడ వినిపించుకోలేదు. లింగాయతులు నలుగురు, సాలెలు ముగ్గురు,

కురబవీధివాళ్ళు ఇద్దరమ్మాయిలు, మొత్తం పధ్నాలుగురు పోగయ్యారు. అ ఆ లు ఇ ఈలు బోర్డుమీద వ్రాసి అందరికీ పాఠం చెప్పడం నంజమ్మకు కొత్త అనుభవం.

నేర్చుకున్నవాళ్లు నేర్చుకున్నారు. లేనివాళ్ళులేదు. కాని సర్వక్క ఇంత బుద్ధిమంతురాలని నంజమ్మ ఊహించి ఉండలేదు. ఒకరోజులో ఆవిడ ఎనిమిదక్షరాలు నేర్చుకుంది. వారంరోజుల్లో యాభైరెండక్షరాలూ నేర్చుకుని కొన్ని అక్షరాల్ని కలిపి పదాలు కూడా చదవగల్గింది.

"నంజమ్మగోరూ మొదలే మీరు నాకిది నేర్పింటే ఈపాటికేమయ్యేదాన్నో నేనూ మీకుమల్లే లెక్కాపక్కా రాసేదాన్ని" - అంది.

"లెక్కలు రాయటానికి అందరికీ కరణీక మెక్కడుంటుంది సర్వక్కా?"

"అదీ నిజమే అనుకోండి."

రోజూ పొద్దస్తమానం ఇంటిపని, కరణీకపులెక్కల్తో సరిపోయేది. ఒక్కోరోజు మధ్యాహ్నం పూట మాదేవయ్యగారువచ్చి కూర్చుని ఏదో లోకాభిరామాయణం మాట్లాడేవారు. రాత్రి ఎనిమిదిన్నర తొమ్మిదిదాకా రాత్రిబడితో సరిపోయేది. తర్వాత భోంచేసి పడుకుంటే వెంటనే కళ్ళుమూసుకు పోయేవి. అదీ ఒకరకంగా మంచిదే. పాఠం చెపుతూవుండగా ఆవిడకు విశ్వం గుర్తొచ్చేవాడు. ఇప్పుడు వాడెలా ఉన్నాడో! అమ్మని తలుచుకుని ఏడుస్తున్నాడేమో. అక్కమ్మ ఉండేదాకా బహియంలేదు. ఆవిడ వాడి మనస్సుని బాధపెట్టదు.

రాత్రి బడి రెండుమూడు నెలలు నడిచింది. చేరిన వాళ్లలో ఆరుగురు వదిలేశారు. ఇప్పుడెనమండుగురు మాత్రమే వస్తున్నారు. "వాళ్ళు వదిలేసినా అటెండెన్స్ రిజిస్టర్లో మాత్రం అందరికీ ప్రెజెంట్ వేస్తూరండి"- అని మాస్టారు సలహా ఇచ్చారు. మాస్టారు నడుపుతున్న మగాళ్ల రాత్రిబడి కొంత మెరుగు. మొత్తం చేరిన ఇరవై ఇద్దరిలో ఇరవైమంది రోజూ హాజరవుతున్నారు.

ఒకరోజు చెన్నిగరాయలు ఇంట్లో ఉండలేదు. మాస్టారు వచ్చారు. ఆయన రాత్రిబడిని గూర్చి చెబుతున్నారు. "ఇంతవయస్సయినా నాలుగు రోజులు చెప్పినా అక్షరాలే గుర్తుంచుకోరు. వాళ్ల బుద్ధి ఎక్కడో ఉంటుంది. బళ్లో బీడీ కాల్చరాదన్నా వదలరు. ఈజనం ఎలా అక్షరాస్యులవుతారో దేవుడికే తెలియాలి.

'మాస్టారూ! మా అప్పణ్ణయ్య రేపు చారువట్టుకెళ్ళడానికని వొస్తాడు. నేను చెబుతాను. ఆయన్ని మీరాత్రి బడిలో చేర్చుకోండి. పగలుపూటకూడా ఆయన

వూళ్ళో వున్నప్పుడు కాస్త చెప్పించండి. కొద్దిగా అయినా విద్య అబ్బివుంటే ఆయవరాత ఇలావుండేది కాదు."

"ఓ దానికేంగానీ అప్పణ్ణయ్యగారిప్పుడు వేరే రాత్రి బడికెడుతున్నారు' - అని ఆయన నవ్వారు.

"ఏమిటి సంగతి?"

"ఇప్పుడాయనకి నరిసికి స్నేహమట"

నంజమ్మ దీన్ని నమ్మలేకపోయింది. అప్పణ్ణయ్యవద్ద డబ్బెక్కడిది? పోనీ అందూడా? యాయవారం చేసి రాగులు, అవీ తెచ్చుకుని ముద్దవండుకుని తినేబ్రాహ్మడు. పరాయి ఆడాళ్ళను కన్నెత్తి చూసే బాపతు కాదు.

'ఇందులో ఏదో అబద్ధముంటుం దనుకుంటాను మాస్టారు"- నంజమ్మ తన అభిప్రాయాన్ని వెలిబుచ్చింది.

"కాదమ్మా, నిజమేనట. ఇప్పుడు దాన్ని పలకరించే వాళ్ళెవళ్ళూ లేరు. దానికి డబ్బుకేమీ ఇబ్బందిలేదు. అప్పణ్ణయ్య కెవరుతోడు? పెళ్ళామా, పిల్లలా, తల్లా,? అక్కడ భిక్ష మెత్తి ఇక్కడ వండుకు తింటాడు. ఎలాగేర్పడిందో అంకె భగవంతుడికే తెలియాలి."

నంజమ్మకెందుకో సిగ్గేసింది. ఎంతయినా అతడు తన ఇంటికి చెందిన వాడు. తనకు మరిది. ముష్టెత్తి బతకడం అతని తలరాత కావచ్చు. కాని ఇన్నేళ్ళయ్యాక ఈప్రారబ్ధమేమిటి? ఆయన యాయవారం వెళ్ళక్కరలేదు. తన ఇంట్లో కూర్చుని తిన్నా జరిగిపోతుంది. ఉన్న రెండావుల్ని చూసుకుంటూ వుంటే చాలు- అన్న ఆలోచన ఆవిడలో కొన్ని రోజులుగా కలిగింది. కాని అలా జరిగితే అత్తయ్య గంగమ్మ బతకనిస్తుందా? గిల్లి కజ్జాయానికి వస్తుంది. ఆమె నోటికి అడ్డుండదు. ఎలాంటి దుష్ప్రచారమైనా చేసే మనిషే. అప్పణ్ణయ్య స్వభావం కూడా తిన్నగా వుండదు. యాయవార సంచారం మాన్పేస్తే ఆయన కాళ్ళు తిమ్మిరెక్కిపోతాయి. చేసిన వాళ్ళకు చేసినంత మహాదేవ అని ఆవిడ వూరుకుండిపోయింది. కానీ మాస్టారావార్త చెప్పాక మనస్సు ఆగలేకపోయింది.

అప్పణ్ణయ్య కి నడత మంచిదికాదనీ, బుద్ధి చెప్పాలనీ నాలుగైదు రోజులుగా సరైన వేళకోసం నిరీక్షిస్తోంది. చివరికోనాడు మధ్యాహ్నం చారుగిన్నె పుచ్చుకుని అతడు వచ్చాడు. చెన్నిగరాయలింట్లో వుండలేదు. ఆవిడే - "అప్పణ్ణయ్యా!, ఓ మాటడుగుతాను. మీరేమీ అనుకోరుగదా"- అంది.

"ఏం చెప్పండి"

"లోకులు కాకులు, వాళ్ళ నోళ్ళు మూయడానికి మూతలుండవు. మీరు నరసమ్మ అంగట్లో పొగాకు కొనడానికెళ్ళిందే నెపంగా తీసుకుని నానావిధాలుగా అంటారు. మీరు వేరే అంగట్లో పొగాకు కొంటే పోలా? వూరికే. జనం నోళ్ళల్లో నానడమెందుకు? అపవాదెందుకు?"

"వాడమ్మని ... అదెవడు చెప్పింది?"

"ఎవడయితేనేం, మన జాగర్తలో మనముంటే మంచిదిగా?"

అప్పణ్ణయ్య మళ్ళీ మాట్లాడలేదు. పులుసు తీసుకుని వెళ్ళిపోయాడు. కాని మరుసటి రోజు చారుకోసం రానేలేదు. రోజూ ఎక్కువగా చేసి, మొత్తమొక వారం రోజులు దండుగయ్యాక వంజమ్మ తక్కువగా వండుకుంది. తానలా అడగరాదేమో! తన మీదున్న కోపం చేతో లేదా సిగ్గుచేతో అతడురాలేదు. మగాడు ముద్దవండుకుని చారో పులుసో, కాచుకోవాలంటే ఎంత కష్టం. వాళ్ళ కర్మ. ఏమయినా చేసుకోనీ. మనమేం చేస్తామని ఆలోచిస్తుండగా తెలిసింది. అప్పణ్ణయ్య వూళ్ళోనే లేడని. ఈదఎహ వూరు వదిలి వెళ్ళిన వాడు మూణ్ణెల్ల దాకా తిరిగి రాలేదు.

అతడెక్కడో దూరసీమల కెళ్ళాడట. వెనక్కి తిరిగివచ్చి వదినకో బస్తా వడ్లు తెచ్చిచ్చాడు. తరువాత రోజూ చారు పట్టుకెళ్ళేవాడు.

మరోరోజు మాస్టారే అన్నారు! "ఇప్పుడప్పణ్ణయ్యగారావేపు వెళ్ళరట. దూర సీమలకు సంచారం వెళ్ళొచ్చాక దాని అంగడి దగ్గిరికి కూడా వెళ్ళటం లేదట"

## 3

మేనమామంటే విశ్వానికి లోలోపల భయం. కల్లోలు కుర్రాడంటే అశ్రద్ధ చేయలేదు. సంతరోజు వాడికేవో తినుబండారాలు తెచ్చిపెట్టేవాడు. తనతోకూడా పొలాల మీద తిప్పేవాడు. కానీ ఏదైనా అల్లరిచేస్తే కసురుకొని కళ్ళెర్ర చేసేసరికే కుర్రాడికి చెమటలు పోసేవి. ఒక రోజు బడిలో మరో అబ్బాయితో దెబ్బలాడాడని కల్లోలు వాడికోలెంపకాయిచ్చాడు. దానికి వాడు వుండచుట్టుకుని పడిపోవడమే కాక లాగులోనే వుచ్చోసుకున్నాడు. అక్కమ్మ కల్లోలును చీవాట్లెట్టి కుర్రాణ్ణి దగ్గిరికి తీసుకుని ఓదార్చింది.

కమలకు మాత్రం విశ్వంమీద ఏ మాత్రమూ సానుభూతిలేదు. వాడు కూర్చుంటే తప్పు, లేస్తే తప్పు, మాట్లాడితే తప్పు. కానీ అక్కమ్మ భయానికి,

మొగుడి భయానికి ఆవిడ వాణ్ణి తిట్టడంలేదు. కొట్టడంలేదు. ఈ వెధవ పీనుగొకడొచ్చాడు మా ఇల్లు గుల్ల చేయటానికని సణిగేది.

ఇప్పుడువిశ్వం వెనకటిలా చురుగ్గాలేడు. చదువులో తనవూళ్ళో వున్నట్లు తెలివితేటలు చూపడంలేదు. "వీడు సరయిన భయంలేకుండా వట్టి మొద్దయిపోతున్నాడు" అని కల్లేశు మరింత బిగించాడు. కానీ వాడు రోజు రోజుకు మరీమొద్దయి పోతున్నట్టే అవుపించింది. కల్లేశు ఇంట్లో పాఠాలు చెప్పడానికి కూర్చుంటే, చావడానికి సిద్ధంగావున్న మేకలా గుడ్లు తిప్పుతూ, అతడి చెయ్యి ఎప్పుడు తనమీద పడుతుందో అని ఒక కంట కనిపెట్టడంలోనే వాడి దృష్టి నిమగ్నమై వుండేది. అక్కమ్మ కక్షర జ్ఞానమేలేదు. చెల్లాయి కొడుకును మంచి శిక్షణలో వుంచానన్న తృప్తి కల్లేశుకు మాత్రం కలిగింది.

నాగలాపురం చెరువు. రామసంద్రం చెరువు కన్నా పెద్దది. వూరివేపు నీళ్ళల్లో ఎన్నో బండలు గుండ్లూ వున్నాయి. ఈదుకుంటూ వెళ్ళి ఆబండలమీద ఒంటిమీద నీళ్ళారిపోయేదాకా, ఎండలో కూర్చుని మళ్ళీ ఈదుకుంటూ రావాలని విశ్వానికి ఆశ. కానీ నీళ్ళల్లో దిగరాదని సుగ్రీవాజ్ఞ ఇచ్చాడు మేనమామ. చెరువు వేపు వెళ్ళినప్పుడల్లా, అది గుర్తొచ్చి వాడేడ్చేసేవాడు. ఈ వూళ్ళో తేనెపట్టులు తీయటానికే లేదు. తనవూరికి పారిపోదామా అన్న ఆలోచన కూడా అప్పుడప్పుడు కలిగేది. కాని అమ్మమళ్ళీ ఇక్కడికే తెచ్చి వదుల్తుందన్న భయం కూడా వుండేది. తన తల్లిని మనసులో తిట్టుకునేవాడు.

ఒకరోజు ఉదయం వాడు పలకా పుస్తకాలు తీసుకుని బడికి వెడుతున్నాడు. ఎంతోమంది పిల్లలు, పెద్దలు, గుంపులుగుంపులుగా వాడి బడివేపువెడుతున్నారు. గుంపులో ముందువరసలో వున్న వాళ్ళు తెల్ల అంగీలు, తెల్ల టోపీలు ధరించారు. వాళ్ళ చేతుల్లో జెండాలున్నాయి. అందరికంటే ముందెళ్ళే ఆయన నోటి దగ్గర ఏదో వుంచుకుని "బోలో భారతమాతకీ" అని గట్టిగా అరుస్తాడు. వెనకాతలున్న జనమంతా 'జై' అంటారు. "మహాత్మా గాంధీకీ" అని ఆయన మళీ అరుస్తాడు. వీళ్ళు 'జై' అని ఒకేసారి అంటారు. ఆయనింకా ఏవో కేకలేస్తే వీళ్ళంతా జై అని, జాతరనాడు రథంలాగుతూ హరహరమహదేవ అని జనమన్నట్టు, అంటున్నారు. విశ్వానికేదో వుత్సాహంగా వుంది. నాలుగుసార్లు వినేసరికి ముందున్నాయన అనేవన్నీ వీడికి వచ్చాయి. ఆయన ఆపగానే వీడే- "బోలో భారతమాతకీ" అని కేకేశాడు. అందరూ 'జై' అన్నారు. తరువాత నాలుగైదు 'కీ' తో అంతమయ్యే

కేకలేశాడు. అన్నిటికీ 'జై' అన్నారు. ముందున్నాయన వాడి వీపు తట్టి "తెలివైన కుర్రాడివి నువ్వే చెబుదువుగానీరా ఈ జెండా పుచ్చుకో" అని వాడి చేతికి జెండా ఇచ్చారు. అందరికంటే ముందు వీడే నడుస్తున్నాడు. చాలా వుత్సాహంగా వుంది.

ఆ గుంపు వీడి బడి దగ్గిరికే వెళ్ళింది. ఎదురుగుండా వున్న మైదానంలో అందరూ కూర్చున్నారు. వీడికి జెండా ఇచ్చినాయన నుంచున్నారు. మరొకరెవరో ఆయన నోటి ముందు ఏదో పట్టుకున్నారు. దానికో తంతి వేళ్ళాడుతోంది. ఆ తంతి మరో చివర టేబిల్ మీదవున్న పెట్టెకు తగిలించారు. అక్కడే బాకాలాంటిదేదో వుంచారు. ఆయన మాట్లాడడం మొదలెట్టాడు. "సోదర సోదరీమణులారా! ఇప్పుడు మనదేశం ఎర్రకోతుల చేతుల్లో పడి నలిగిపోతోంది. వాళ్ళు మన వెండి బంగారాన్ని దోచేస్తున్నారు. మన దేశమాతకు స్వతంత్రం సంపాదించడానికి మనమంతా పాటుపడాలి. 'ఇప్పుడు మనమంతా యుద్ధానికి తయారుగా వున్న సిపాయిలం".

ఆయన మాటలు గట్టిగా వినపడుతున్నాయి. దాన్ని లౌడ్ స్పీకరంటారట. ఇంకా ఇద్దరు ముగ్గురు మాట్లాడారు. చివరికి మాట్లాడినవారు "ఈరోజు శనివారం మధ్యాహ్నం చెన్నరాయ పట్టణంలో సంత జరుగుతుంది. అక్కడ బ్రహ్మాండమయిన సభ జరుగుతుంది. మీరంతా అక్కడికి రావాలి. దేశభక్తి చూపాలి." అన్నారు. చాలామంది వాళ్ళతోటే బయల్దేరారు. విశ్వానికీ వెళ్ళాలనే వుబలాట కలిగింది. తనకు జెండా ఇచ్చిన వారి దగ్గిరకెళ్ళి "నేనూ వస్తానండి" అన్నాడు.

"ఎనిమిది మైళ్ళు నడవగలవా బాబూ? "ఆయన అడిగాడు.

"ఓ నేను శృంగేరికే నడిచెళ్ళాను"

గుంపు బయల్దేరింది. వీడూ వెళ్ళాడు. దారిలో 'మరళహళ్ళ, 'ఉచలవన' 'ఆలదతోపు' 'కారెగుచ్చి' ఇంకా ఏవేవో వున్నాయి. శృంగేరికెళ్ళే దారిలో లాగా ఇక్కడ అడవి లేదు. అయినా సరదాగా వుంది. మధ్యాహ్నం ఒంటి గంటకు చన్నరాయపట్టణం చేరింది గుంపు. వాడికాకలేస్తోంది. అలసిపోయాడు. 'నాకాకలేస్తోందండీ'-అని ఆయనతో చెప్పాడు. "అందరికీ భోజనం పెడతారు, రా,"- అని ఆయన వీడి చేయిపుచ్చుగుని తీసుకెళ్ళాడు. ఒకవేపు పెద్దపెద్ద తప్పేలాలు, గంగాళాలు పెట్టి వంట చేసి వుంచారు. శృంగేరిలోలాగే ఇక్కడా సమారాధన జరిగింది. తరువాత అందరు సంతజరిగే మైదానానికి వెళ్ళారు. జనం తండోపతండాలుగా వున్నారు. వాడు శృంగేరిలో కూడా అంతమంది జనాన్ని

చూడలేదు. రామసంద్రం అమ్మవారి జాతరలో కూడా చూడలేదు. నాగలాపురం సంతలోనూ చూడలేదు. మైదానం మధ్యలో పదిపన్నెండడుగుల ఎత్తులో అట్టువ కట్టారు. దానిమీద లౌడ్ స్పీకర్ కూడా సిద్ధంగా వుంది.

విశ్వానికి జెండా ఇచ్చి తీసుకొచ్చినవారు హెూళె నరసీపురం వారట. ఆయన వీణ్ణడిగారు "బాబూ! నువ్వు ప్రసంగిస్తావా?"

"అలా అంటే ఏమిటండీ?"

"నాగలాపురంలో నేను నుంచుని మాట్లాడానే అలాగ"

"ఓ మాట్లాడతాను"

"ఏం మాట్లాడాలో నేను చెబుతాను"

"మీరు మాట్లాడిందంతా నాకు నాకుగుర్తుంది. అదే చెబుతాను. ఎర్రకోతులు మనదేశమాతను జైల్లోపెట్టారని"

"రైట్, నేనింకా కాస్త చెప్పిస్తాను. ఆగు"- అని ఆయన ఏదేదో చెప్పాడు.

సభని మొదలెట్టే ముందు ఒకరు అట్టువ మీదికెక్కి లౌడ్‌స్పీకరుముందు నుంచి "వందేమాతరం" అని కమ్మగా పాడారు. తరువాత "ఇప్పుడు మొట్టమొదట ఒక బహారతమాత కిశోరం ప్రసంగిస్తాడు. అతని ప్రబోధం మనం సావధానంగా వినాలి."- అని చెప్పి పక్కకి తప్పుకున్నాడు. హెూళె నరసీపురం వ్యక్తి విశ్వాన్ని పైకెక్కించారు. ఆయనా ఎక్కి వాణ్ణి మైకుముందు నుంచోబెట్టారు. ఎదురుగుండా వున్న జనాన్ని చూస్తే అలుగుపారేలా చెరువులో నీళ్ళు చేరినట్టు జనం పోగైవున్నారు. వాడికి భయమేసింది. ముఖం ఎర్రబడ్డది. వాడితో కూడా ఎక్కిన వ్యక్తి - 'బోలో భరతమాతకీ అను" అని మెల్లిగా చెప్పారు. విశ్వమూ నినాదం చేశాడు. వాడు కేకేసినా ఎంత గట్టిగా వినపడ్డదనీ! లౌడ్ స్పీకరంటే ఎలా తయారు చేస్తారు. దానిలో ఏం పెట్టారు. అలాంటిది తనకూ ఒకటి వుండాలి" ఇంతలో జనమంతా 'జై' అన్నది. లౌడ్‌స్పీకరులో వాడి నినాదం కన్నా గట్టిగా ప్రతిధ్వనించింది. వాడు తనకు తెలిసిన మరో ఏడెనిమిది నినాదాలు చేశాడు. అన్నిటికీ జనం 'జై' అన్నారు. 'ఇప్పుడు మాట్లాడు" అని ఆయన చెప్పారు. నిండిన చెరువులో ఈదేలా వాడు మాట్లాడటం మొదలెట్టాడు. "సోదరులారా! సోదరీమణులారా! మీకు తెలుసుకదా! మన భారతమాత చేతులకీ కాళ్ళకీ సంకెళ్ళు వేశారు. మనల్ని బానిసల్ని చేశారు. ఈ ఎర్రకోతి లంజాకొడుకులు మనపన్నులన్నీ దోచేస్తున్నారు. మీరెవరూ పన్నులు చెల్లించకండి. మన చేత కల్లు తాగిస్తున్నారు" - ఇలా

ఏకధాటిగా మాట్లాడుతూ వాడు చెప్పించిన దానికి తోడు ఎర్రకోతులంకు, 'లంజాకొడుకులు, 'బోడినాకొడుకులు' అన్న విశేషణాలు, ఆక్షణంలో నోటికి వచ్చినట్టు విచ్చలవిడిగా చేర్చాడు. వేరే బూతుమాటలు చేర్చరాదని వాడెలాగో గ్రహించాడు. ప్రసంగం కాగానే, పక్కనే నుంచున్న వ్యక్తి వాడిమెడలో చేమంతి పూదండ వేసి, – "భారత మాతకీ" అన్నారు. 'జై' అనడమేకాక చెరువు తూము హోరుమన్నట్లు చప్పట్లు మోగాయి. వాణ్ణి కిందికి దించాక మరొక కొత్తవ్యక్తి మాట్లాడటం మొదలెట్టారు. ఆయన ప్రసంగమేమిటి? విశ్వాన్ని ఆకాశమెత్తు పొగడ్డమే. "ఇలాంటి ధైర్యశాలి అయిన కుర్రాడినుంచీ మనముత్తేజితులం కావాలి. ఈకుర్రాడు సింహకిశోరంలా నుంచుని పరదేశీయుల్ని ఎలా ప్రతిఘటించాడో అలాగే మీరూ ప్రతిఘటించండి. ఈఏడు మీరెవరూ పన్నులు చెల్లించకండి. పోలీసువాళ్ళు వస్తే ఆకుర్రాణ్ణి జ్ఞాపకం చేసుకోండి మీకు ధైర్యం వస్తుంది"– అని ఇంకా ఏదో వాడికర్థం కాని వన్నీ మాట్లాడారు.

ఇంతలో వున్నదున్నట్టుగా జనం చెదిరిపోవటం మొదలెట్టారు. కాఖీ బట్టలు వేసుకున్న పోలీసులు చాలామంది చేతుల్లో లాఠీలు పట్టుకుని వచ్చారు. తెల్లటోపీ పెట్టుకున్న వాళ్ళనంతా చుట్టుముట్టి లౌడ్స్పీకర్ తీసేసుకున్నారు. వాళ్ళకీ వీళ్ళకీ మధ్య ఏవో మాటలు నడిచాయి. చివరి కందరినీ పోలీసు స్టేషన్కి తీసుకెళ్ళారు. అందరినీ ఒక గదిలోవేసి, ఇనపకటకటాలున్న తలుపులేసి తాళమేశారు. లోపలున్నవారు 'భారతమాతకీజై! అని అరుస్తున్నారు. కొందరేదో మాట్లాడుకుంటున్నారు. మరి కొందరింగ్లీషులో మాటలాడుకుంటున్నారు. విశ్వానికెవరూ తెలియదు. వాణ్ణి తీసుకొచ్చి ప్రసంగం నేర్పిన వ్యక్తి లేరు. వాడి కేడుపు వచ్చింది. వెక్కి వెక్కి ఏడవటం మొదలెట్టాడు. "భయపడకు బాబూ, మేమంతా వున్నాంగా" అని దగ్గిరున్నవాళ్ళు వాణ్ణి ఓదార్చి వీపు మీద తట్టారు, వాడేడుపు మానేశాడు. అయినా ఏదో భయం. తెల్లారినుంచి జరిగినవన్నీ చాలా సరదాగావున్నాయి వాడికి. కానీ భోజనమయినా లేకుండా ఎందుకిలా నిర్బంధిచారు? జైలంటే ఇదేనా?

"జైలంటే ఇదేనాండీ?"

"కాదు బాబూ. ఇది రాజమందిరం"– ఒకరన్నారు.

'అయితే సింహాసనమేదీ?"

"ఉద్దండపిండం!" అని అందరు అభిప్రాయపడ్డారు. ఎవళ్ళూ వాడి ప్రశ్నకు

జవాబు చెప్పలేదు.

ఇంతలో తలుపు తెరుచుకుని లోపలికి వచ్చిన పోలీసువాడు వాడి చెయ్యిపట్టుకుని "బయిటికిరా" అన్నాడు.

"మేమీ కుర్రాణ్ణి వదలం. మీరు వాణ్ణి కొడతారు"- అని కదమవాళ్ళన్నారు.

"ఇంత చిన్న కుర్రాణ్ణి మేమెందుకు కొడతాం? వాడి బంధువులొచ్చారు" అని చెప్పి వాణ్ణి బయటికి తీసుకెళ్ళి, కడమవాళ్ళని లోపలే వుంచి తలుపు తాళం వేశారు.

ఆఫీసులోకి తీసుకెళ్ళి నుంచోబెట్టారు. కుర్చీలో కూర్చున్న లావాటి పోలీసాయన వాణ్ణడిగాడు: "మీదేవుర్రా అబ్బాయ్"

"రామసంద్రం"

"రామసంద్రం? ఎక్కడుందది?" అని ఎదురుగుండా నుంచున్న పోలీసునడిగాడు.

విశ్వమే చెప్పాడు, "తుమకూరు జిల్లా, తిపటూరు తాలూకా, కంబనకెరె ఫిర్కా రామసంద్రం"

"పరవాలేదు. నీకంతా తెలుసు. ఏం చదువుతున్నావు?"

"మూడో తరగతి"

ఎవరి కుర్రాడివి నువ్వు?"

"కరణం చెన్నిగరాయుల కొడుకుని"

"కరణం కొడుకై ఇలాంటివాటిలో జోక్యం కలిగించుకోవచ్చా? ఎవర్రా నిన్ను తీసుకొచ్చింది?"- అని అడుగుతూ వుండగా నుంచున్న పోలీసువాడు రామసంద్రం వేరే జిల్లా సార్, వీడక్కణ్ణుంచీ రాలేదు' అని చెప్పి - నువ్వే వూరి నుంచి వచ్చావు? అని వాణ్ణడిగాడు.

'నాగలాపురం నుంచీ"

"అక్కడకెందుకొచ్చావు?"

"బడి కెడుతున్నాను"

"ఎవరింట్లో వున్నావు"

"కల్లేశ జోస్యుల ఇంట్లో"

"ఆయనేం కావాలినీకు?"

"మా అమ్మగారి అన్నయ్య'

నుంచున్న పోలీసు కూర్చున్న పెద్దపోలీసుతో అన్నాడు "ఓ ఇప్పుడు

తెలిసింది సార్. ఆ కల్లేశు నాతో కూడా పి.సి.గా వుండేవాడు. ఈవూళ్ళో మసీదవతల దెయ్యాలకొంప అని వుంది చూశారూ. అక్కడ కంఠజోస్యులని ఒకాయన లేరూ, మంత్రాలు తంత్రాలు చేస్తారు చూడండి ఆయన కొడుకే కల్లేశు. రేయ్, కుర్రాడా, నువ్విక్కడికెలాగొచ్చావు?"

విశ్వం తాను తెల్లారి లేచి ఇంటినుంచీ బయల్దేరింది మొదలు చన్నరాయపట్టణం చేరేదాకా జరిగినదంతా చెప్పాడు. "ఆ కంఠీజోస్యుల దగ్గర వదిలేసిరండి, వై బాదరేషన్–" అన్న పెద్దపోలీసాయన, వాడివేపు తిరిగి భయంకరంగా గుడ్లురిమి చూస్తూ, "రేయ్, మరోసారి వీళ్ళతో చేరి జై గియ్ అని కేకేశావంటే నిన్ను తోలు బెల్టుచ్చుకుని వాయించేస్తాం హూం"అని పళ్ళు పటపట కొరికి బూటు కాలుతో నేలమీద దట్టించాడు. "లేదు లేదు" అని వాడు భయపడుతూనే చెప్పాడు. నుంచున్న పోలీసువాడు ఆ రాత్రే వేళే వాణ్ణి తీసుకుని వెళ్ళాడు. బజారుదాటి సాయిబుల మసీదు వెనకాల ఒక పెద్ద ఇంటిముందు నుంచుని తలుపుతట్టాడు. "ఎవరు?" అని లోపలినుంచి గొంతు. "తలుపు తీయండి మీమనవడు"– అన్నాడు పోలీసు. లోపల దీపం వెలిగించి తలుపు తీసిన వారు వెడల్పాయిన ముఖంతో భారీ మనిషి. "మీకూతురి కొడుకు కాంగ్రెసు వాళ్ళతో చేరి తెలియకుండా వచ్చేశాడు. అప్ప చెప్పాలని వచ్చాను. ఇక మీదట బయటికి వదలకండి." అని చెప్పి అతడు వెళ్ళిపోయాడు.

ఆ తాతయ్యను చూచిన గుర్తు విశ్వానికి లీలగా వుంది. అక్కయ్య పెళ్ళికి చాలాముందు ఆయన అక్కమ్మతో వూరికి వచ్చారుగా? కానీ బాగా జ్ఞాపకం లేదు. ఆయనతో కూడా లోపలి కెళ్ళి చూశాడు. లోపల పులిచర్మం పరచివుంది. మనుష్యుల పుర్రెలు, ఎముకలు వున్నాయి. గవ్వలు, రాగిరేకులు, పసుపుతాళ్ళు, పాతజోళ్ళు చాలా జతలున్నాయి.

"నాకు భయమేస్తోంది"– అన్నాడు వాడు.

"ఈరోజంత ధైర్యంగా మాట్లాడావు. భయమెందుకురా? నువ్వు నా మనవడని నాకు తెలీదు, వారెవా. రుస్తుం. నాకూతురు కడుపులో పుట్టినందుకు సార్థకమయింది"అని చెయ్యిచ్చుకుని కూర్చోబెట్టారు.

కంఠిజోస్యులకు కూతురి మీద వచ్చిన కోపం, ఆవిడపిల్లలు చచ్చిపోయారన్న వార్త తెలిసినప్పటికీ చల్లారలేదు. తనమాట లెక్కపెట్టకుండా, కొడుక్కిపిల్లనివ్వనని చెప్పి అవిధేయత నాయన మరచిపోలేదు. ఆయనకు, మనమలకీ ఎక్కువ

సంపర్కమేలేదు. వాళ్ళు పోవడంవల్ల కూతురు దుఃఖంలో మునిగి వుంటుందని ఒక్కోసారి ఆయన కనిపించేది. కూతురు పిల్లలమీద ఆయనకు కలిగే అవ్యక్త వాత్సల్యమేదయినా వుంటే అది కూతురిని పురస్కరించుకుని ఏర్పడ్డదే. కాని ఇప్పుడు ఈ మనవడు రుస్తుం పనిచేశాడు. పదిహేను, ఇరవైవేల జన సమూహం ముందు నుంచుని, పోలీసు వాళ్ళకు భయపడకుండా, ప్రసంగించి దండవేయించుకున్నాడు. జనం "సింహపుపిల్ల' అని మెచ్చుకుంటూ మాట్లాడ్డం తానే విన్నాడు. వాడు ప్రసంగించేటప్పుడు తానూ అక్కడే వున్నాడు. ఆ ప్రసంగమంతా విన్నాడు కూడా. ఇప్పుడాయనకు వాడి మీద అభిమానం పొంగింది. "ఏ వూరి నుంచీవచ్చావు?"- అని అడిగారు.

తా నిప్పుడు నాగలాపురంలో వున్న సంగతి చెప్పాడు. ఇటీవల జోస్యు లూరికే వెళ్ళలేదు. చన్నరాయపట్టణంలోనూ వుండలేదు. హాసన , కౌశిక,మ గ్గ రామనాథపురం వేపే వుండిపోయారు.

"ఆకలేస్తుందా?" - ఆయన అడిగారు

"హుం"

"చూడు ఇప్పుడరటిపళ్ళు, పంచదార వున్నాయి. తినిపడుకో తెల్లారాక హోటల్లో తిండి తిందువుగాని.

"దోసేనా?"

"హుం. నువ్వు కోరింది"

ఆయనే వొలిచి పంచదారలో అద్ది ఇచ్చిన అరటిపళ్ళువాడు కడుపునిండా తిన్నాడు. తమ పక్కమీదే పడుకోబెట్టుకుని, తనశాలువేకప్పి దీపమార్పేశాడు. వాడికి నిద్ర పట్టింది. వెళ్ళి కూతుర్ని చూడాలని బుద్ధి పుట్టింది. ఆమె పిల్లలు చచ్చిపోయి దాదాపు సంవత్సరమయింది. ఎంత దుఃఖించిందో? నేనా పిల్ల పెళ్ళికే వెళ్ళలేదు. మంచి కుర్రాడికే ఇచ్చి పెళ్ళి చేసిందని అక్కమ్మ చెప్పింది. నంజమ్మ మొగుడు వట్టి నషరత్ భాంచోత్. నాలాంటి వాడి కూతురిని పరిగ్రహించే యోగ్యత ఆకుక్కకి లేదు. అయినా ఫరవాలేదు. ఈసింహపు పిల్ల వాళ్ళ కడుపున పుట్టింది. అంతేచాలు- అని రకరకాలుగా ఆలోచిస్తూ ఆయన అటుఇటు తిరుగుతూ పడుకున్నాడు.

ఇంతలో ఎవరో తలుపు తట్టి - 'తలుపు' అన్నట్టయింది. మరోసారి పిలిచేసరికి కల్లేశు కంఠధ్వని అని పోల్చుకున్నాడు. లేచి దీపం వెలిగించి తలుపు

తీశారు. విశ్వమిక్కడ పడుకున్నది చూశాక కల్లేశుకు భయం తీరింది. ఆరోజు మధ్యాహ్నం దాకా ఎదురు చూసి, చెరువు నూతులు గోతులు అన్నీ వెతికాడు. చెన్నరాయపట్టణానికి వెళ్ళిన గుంపులో వాడువున్నట్టుందని రాత్రి కెవరో చెప్పారు. అప్పుడే ఇక్కడికి బయల్దేరి వచ్చాడు. అర్ధరాత్రయింది. అందరూ పడుకున్నారు. అనుమానం కలిగి పోలీసు స్టేషన్ కెళ్ళి భోగట్టా చేశాడు. వీడితో పాటు పనిచేసి ఇప్పుడు దఫేదారుగా వున్న యల్లప్ప వీడి విషయమంతా చెప్పి "మీనాన్న దెయ్యాలకొంపలోవున్నారు. నేను వెళ్ళి వాదిలొచ్చాను" అని కుర్రాడి ధైర్యాన్ని వర్ణించాడు.

మనవడి ప్రతాపాన్ని కంఠీజోయ్సులు చెప్పారు. పిల్లలు చచ్చిపోయాక నంజమ్మ శృంగేరికి వెళ్ళటం, అక్కడ వీడు నదిలో ఈదిన సాహసం, పూళ్ళో పామును కొట్టగా అది తప్పించుకు పోవటం, ఇప్పుడు చదువుకోసం నాగలాపురానికి నంజమ్మ పంపటం- అన్నీ కల్లేశు వివరించాడు.

తెల్లారి అందరు పొద్దెక్కా లేచారు. మెలకువ వచ్చి విశ్వం లేచి అటుతిరిగేసరికి మేనమామ కూర్చుని వున్నాడు. వాడు భయంతో మళ్ళీ మొద్దుబారి పోయాడు. లేచి ముఖం కుడుక్కుని చెరువు కట్టవేపు వెళ్ళొచ్చాక ముగ్గురూ హోటలు కెళ్ళారు. 'మసాలదోసె తింటావా బుజ్జీ"- అని తాతయ్య అడిగితే వాడు జవాబే చెప్పలేదు. మరోసారి అడిగితే "వాకేమీ వొద్దు" అన్నాడు. కల్లేశుని చూస్తే వాడికింత బెదురని ఆయనకు తెలియదు. ఆయనే చెప్పి రెండు మసాలా దోసెలు, మైసూరుపాకు ఇంకా రుచిగావున్న తినుబండారాలు కొని తినిపించారు. కల్లేశు బయల్దేరుతూవుండగా చెప్పారు. 'కుర్రాణ్ణి నడిపించుకుని వెళ్ళకు. నేను కొత్త గుర్రం కొన్నాను. వెనకాల కట్టేశా. జీనువేసి కూర్చోబెట్టుకుని వెళ్ళు'

ఆయనే గుర్రాన్ని విప్పి తెచ్చి, జీనువేసి దాని మీద విశ్వాన్ని కూర్చోబెట్టేసరికి వాడుబ్బిపోయాడు. పూళ్ళో వుండగా మునసబు గుర్రపు పిల్ల మీద అప్పుడప్పుడు దొంగచాటుగా ఎక్కి సవారి చేసే అలవాటుంది కాని ఇలాంటి మిలమిలలాడే పల్లం, ఇంత పెద్ద గుర్రం మీదెన్నడూ వాడు కూర్చోలేదు. కల్లేశు ఎక్కికూర్చున్నాక తాతయ్య చెప్పాడు."ఇలా చూడు గుర్రాన్ని కావలిస్తే పదిహేనురోజులక్కడే వుంచుకో. అంతలో వీడికి సవారీ నేర్పించు. మగ కుర్రాడయ్యాక గుర్రపు సవారి విధిగా రావాలి."

సవారి మాత్రం చాలా సరదాగావుంది. దారిలో మామ తిట్టలేదు. ఒకమాటా

మాట్లాడలేదు. గుర్రాన్ని ఇంకా వడిగా నడిపించాలని వాడి కోరిక. కానీ మామతో ఆ మాటలు చెప్పడానికి గుండెలు లేవు. వూరికే కూర్చుని సవారి సుఖమనుభవించాడు. నిన్న తాను చేసిన ప్రసంగంలోని వాక్యాలు గుర్తొచ్చాయి. "ఈ గుర్రం నాదే అయితే ఏంచక్కా వుంటుంది! నాకే ఇచ్చేయమని తాతయ్యనడగాలి. దాని మీద కూర్చుని రాత్రిపూట ఒక్కణ్ణే మా వూరికెళ్ళి అమ్మను లేపాలి. ఇకమీద మా వూళ్ళోనే వుండిపోవాలి. అమ్మ లేకుండా ఒకణ్ణే వుండరాదు. ఎప్పుడూ గుర్రం మీద కూర్చుని తిరిగితే పామెలా కరుస్తుంది? మళ్ళీ మా వూళ్ళో బడిలో చేరిపోవాలి. బడిలో "నేను గుర్రం మీదే కూర్చుంటాను. మీరలాగే పాఠాలు చెప్పండి" అని మాస్టారుకు చెప్పాలి. ఎలిమెంటరీ స్కూలయ్యాక మా వూరి మంచీ రోజూ కంబనకెరె మిడిల్ స్కూలు కెళ్ళొచ్చు ఇప్పుడీ మామయ్య కూడా లేకపోతే ఇటునుంచీ ఇటే మా వూరికి వెళ్ళుండచ్చు. నన్ను కొడతాడే! ఈ మామయ్య చెయ్యి పడిపోను..." అని తనలోనే ఆలోచించుకుంటున్నాడు.

వూరు చేరాక, ఇంటిముందు గుర్రమాపి, వీణ్ణి దించాడు కల్లేశు. గుమ్మంలోనే అక్కమ్మ "ఎక్కడికెళ్ళావురా బుజ్జీ" అంటూ వచ్చి వాటేసుకుంది. కల్లేశు చెప్పులు వదిలి తిన్నగా వంటింట్లోకెళ్ళాడు. చేతికి దొరికిన చింతకర్రొటుచ్చుకుని బయటికి వచ్చి వాడి రెండు చేతులు పట్టుకుని రపరపబాదడం మొదలెట్టాడు. "అయ్యో, కుర్రాడు చచ్చిపోతాడురా రాక్షసి ముండా కొడుకా. అలా కొట్టకురా" – అని విడిపించాలని వెళ్ళిన అక్కమ్మ చేతి మీద కూడా దెబ్బ పడి, ఆవిడ అయ్యయ్యో అంటూ రాగాలు తీస్తూ "దెయ్యం ముండాకొడుకా, కుర్రాణ్ణలా చంపుతావట్రా?" అంటూ వుండగానే మరో ఏడెనిమిదిసార్లు బాదేశాడు.

"ముక్కుతాడు లేని ఎద్దులా పెరిగాడు భడవ! ఎవళ్ళతో పడితే వాళ్ళతో వెళ్ళిపోవడమే! ఏమయినా అయితే చెడు పేరెవరికి?" అంటూ వుండగా అతడి దృష్టి కుర్రాడి మీద పడ్డది. వీపులో నించీ రక్తం కారుతోంది. నేలంతా వుచ్చే. "అక్కడ పాము కరుస్తుందని వున్న ఒక అంకురాన్ని యిక్కడికి పంపితే నువ్వు కొట్టి చంపావట్రా!" అని అక్కమ్మ లబోదిబోమంది. ఇరుగుపొరుగువాళ్ళు పరుగెత్తుకొచ్చారు. కల్లేశ విశ్వాన్ని తాకి చూశాడు. ప్రాణం పోలేదు. పరుగెత్తుకెళ్ళి ఒక చెంబుతో చన్నీళ్ళు తెచ్చి నెత్తిమీద తట్టాక తెలివి వచ్చింది. చొక్కావిప్పి చూసేసరికి వెన్ను చితికి వాతలుపడిపోయింది. కారుతున్న రక్తం గడ్డకట్టి

నల్లబడుతోంది. కల్లేశే గాయాలు కడిగి ఇంట్లోనే వున్న నాటుగంధపు మానె రాస్తే కుర్రాడు "బాబోయ్ మంట!మంట! అని బాధతో అరిచాడు.

## 4

ఈ మధ్య మాస్టారుకు రామసంద్రం నుంచీ బదిలీ అయింది. ఈ వూరికాయన వచ్చి అయిదేళ్ళయింది. తమ సొంత వూరు హుళియారుకు బదిలీ చేయించుకోవాలని ప్రయత్నించారు. అదృష్టం కొద్దీ ఆ వూరికే బదిలీ అయింది ఆయన వెళ్లిపోవడం వల్ల నంజమ్మకు చాలా విసుగ్గా వుంది. సొంత అన్నయ్యలా ఆమెను కష్టసుఖాలలో ఆదుకునే వాడాయన. ఆయన భార్యకూ ఆవిడకూ చాలా సఖ్యత, అన్యోన్యత వుండేవి. రాత్రిబడి కూడా ఆరునెలలు సక్రమంగా నడిచింది. కంబనకెరె హెడ్‌మాస్టారు వచ్చి నైట్‌స్కూలు సక్రమంగా నడిచిందని రిపోర్టు చేసి, మరో ఆర్నెల్లు వేరే జట్టుతో ప్రారంభించటానికి సిఫారసు చేశారు. ఇంతలోనే మొదటిసారి పారితోషికం నూట ఇరవై రూపాయలు ప్రభుత్వం పంపుతుందని ఆమెనుంచీ రసీదు పుచ్చుకుని వెళ్ళారు. ఆ మాస్టారుకు బదులు మరొకరెవరో వచ్చారు. కానీ ఆయనతో పరిచయం లేదు. వెంకటేశ్వరయ్య మాస్టారు వెళ్ళిపోవడం చేత మా దేవయ్యగారికీ విసుగ్గానే వుంది.

ఇదే సమయంలో నంజమ్మ కొత్త ఇంటి మరమ్మత్తు ప్రారంభించింది. అప్పుడు మరో పనేమీ లేదు. ఈసారి వానాకాలం రాకముందే పెంకు నేయించాలని ఆపకుండా పనిచేయిస్తోంది. ఇల్లు కట్టించడమంటే ఆవిడికి కొత్తే. అన్నీ స్వయంగా చూసుకోవాలి. స్వయంగా నిర్వహించాలి. లేకపోతే దుబారా ఖర్చులవుతాయి. ఇప్పుడావిడ దగ్గరున్న డబ్బు గోడలకు, కలపకు, వెదురుకు సరిపోతుంది. అట్టువ ఎఫిలకలు తరవాత ఎప్పుడయినా వేసుకోవచ్చు. పెంకులు కొనాలంటే డబ్బు కావాలి. గోడలకి మొత్తులు, పూతలు, నింపాదిగా చేసుకోవచ్చు. తొందరలేదు. ఏ సామాను కొన్నా, ఏ కలప పని చేయించినా మా దేవయ్యగారుకు తెలిసిన దాకా పనివాళ్లకి సలహాలిచ్చేవారు. తవకింట్లో వేరే పనిలేదు. వూరికే కూర్చోవటం దేనికని నంజమ్మ కూడా పనిలో సహాయపడేది. మగ కూలీలు కలిపిన మట్టి తానే గోడమీదికందించేది. మన్ను కలవడానికి క్షణంలో నీళ్ళు తోడి తెచ్చేది. కరణీకం లెక్కలు రాసే అమ్మగారు పనిచెయ్యడం చూస్తే కూలీలకే అదోలా వుండేది. కానీ తన ఇల్లు తానుకష్టించికట్టాలి. వూరికే కూర్చోవడం దేనికి?–అన్న దృష్టి ఆవిడది.

అప్పటికే పదడుగుల గోడపైకి లేచింది. పెంకు కొనడమే తరువాయి. ఒకరోజు పొయ్యంత్రం మట్టి కలిపిన జాగాలో వేలకంటుకున్న మట్టిని పారతో గోలెంలో వేసి పైన కూర్చుని గోడ మదురు పూర్తి చేస్తున్న కూలీకి అందిస్తోంది. ఆవిడ తండ్రి అక్కడికి వచ్చారు. బుజానికో చర్మం సంచి వేసుకుని, పంచె కట్టుకుని, శాలువా కప్పుకొని, – ఆయన వెనకటి బూటు, హాటు, తెల్లగుర్రం కంటీజోస్యులు కారు. గుర్రం లేదు. నడిచే వచ్చారు. "నంజీ! ఇల్లు కట్టిస్తున్నావా? మంచి పనిచేస్తున్నావు"– అన్నారు.

పార అక్కడే పడేసి, మరుసటిరోజు చేయాల్సిన పని, గోడపని వాడికి పురమాయించి ఆవిడ తండ్రితో కలిసి ఇంటికొచ్చింది. చేతులు, కాళ్ళు కడుక్కుని వంటింట్లోకెళ్లి పొయ్యంటించింది. 'నంజీ! నా కోసమని విశేషమేమీ చేయకు. అన్నం, చింతపండు చారు చాలు' అంటూ ఆయన వంటింట్లోకి వచ్చారు. పొయ్యి దగ్గరే గోడకి చేరవేసిన పీటవాల్చి కూర్చుని "చూడు నీ కొడుకంటే ఏమనుకున్నావు. రుస్తుం! పుడితే అలా పుట్టాలి. ఇరవై వేల జనం 'సింహపు పిల్ల' అన్నారు అని తాము చూచిందంతా వివరించారు" కొడుకును పొగుడుతూ వుంటే ఆవిడకి సంతోషముంటుంది. కానీ వాడిలా పొరవగా వెళ్ళి పోలీసువాళ్ళ చేత చావుదెబ్బలు తింటే గతేమిటి అన్న ఆలోచన కలిగింది. 'నేనీ వేపు రానే లేదు. నిన్న నీ కొడుకును చూశాను. చెప్పానుగా. రాత్రి పోలీసువాళ్ళే తెచ్చి నా దగ్గర వదిలేసివెళ్లారు. ఈ రోజు పొద్దుట గుర్రం మీద కూర్చోబెట్టి వాణ్ణి, కల్లేటును వూరికి పంపించాను. ఎంచేతో నిన్ను చూడాలనిపించింది. ఆలస్యమెందుకని సంచి బుజాన వేసుకుని బయల్దేరాను' అని కంటీజోస్యులన్నారు.

పిల్లలు చచ్చిపోయిన విషయమాయన ఎత్తలేదు. ఆమె కూడా చెప్పలేదు. ఆయనన్నారు. "ఇల్లు కట్టిస్తున్నావు. మంచి పని చేస్తున్నావు. ముందుగా తెలుసుంటే నేను కాస్త డబ్బిచ్చేవాణ్ణి. మంగుళూరు పెంకే వేయించి వుండచ్చు. నెలరోజుల క్రితమే ఎనిమిది వందలిచ్చి ఒక గుర్రం కొన్నాను. తీసుకో. రెండొందలున్నాయి'–ఆయన తన లోపలి చొక్కా జేబులో ఓ గుడ్డలో చుట్టిన నోట్ల కట్టతీసి "తీసుకో ఇల్లు కట్టించడానికవుతుంది"– అని ఆవిడ దగ్గరుంచారు.

"నీకు దేనికైనా అవసరానికుంటుంది. ఇంటికి నేనేదో ఏర్పాటు చేస్తాను".

"నాకు డబ్బుకేమీ ఇబ్బంది లేదు"

ఆ రోజు పడుకున్నాక కూడా తండ్రీ కూతురు చాలాసేపు మాట్లాడుతున్నారు.

నంజమ్మడిగింది. "నాన్నా, నీకింత వయస్సయింది. దేవుడి దయవల్ల చేతులూ కాళ్ళూ గట్టిగానే వున్నాయి. నువ్వెందుకు వూరూరా తిరగాలి? మూణ్ణెల్లు ఆర్లెల్లు మవ్వెక్కడుంటావో తెలీదని బొమ్మ చెప్పింది. ఇక మీదయినా హాయిగా ఇంట్లోనే వుండరాదా?"

"ఊళ్ళో వుండి ఏం చేయాలి?"

"వూరికేనే వుండు"

"వూరికే ఎలా వుండేది? ఏదో పని చేయాలి కదా?" - ఈ ప్రశ్నకి నంజమ్మకు సమాధానం తెలియలేదు. కాసేపయ్యాక ఆయనే అన్నారు. "కల్లేశు పెళ్ళామెలాంటిదో నీకూ తెలుసు. ఆ ముండని తన్ని తగలేసి పంపించేదాకా ఎవరికీ సుఖం లేదు. వాడు దాన్ని తిడతాడు. కొడతాడు. కాని తరిమేయడు. దాన్ని ఖూనీ చేసి ఏదో పొలంలో పూడ్చేయటం కష్టం కాదు. దానితో వేగాలి అని వాడి నుదుట రాసుంటే నేనెందుకు పట్టించుకోవాలి అని వూరుకున్నాను. నాకేం ఏ వూళ్ళో వున్నా జరిగిపోతుందనుకో".

నంజమ్మ మాట్లాడలేదు. "ఇక్కడే వచ్చి వుండు" అని చెప్పే మనస్తత్వమావిడది. కానీ ఆయన కూతురింట్లో ఎన్నటికీ వుండడు. అదీకాక ఆయ నిక్కడవుంటే మొగుడు ఇల్లొదిలి వెళ్ళిపోతాడు. తన మొగుడి ప్రవర్తన చూసి పిలకుచ్చుకుని నాలుగు వాయించినా వాయించగలడు తండ్రి. ఆవిడేమీ అనలేదు. ఇరవై మైళ్ళు నడిచి వచ్చిన జోస్యులకు నిద్రవచ్చింది.

నంజమ్మకు నిద్రపట్టలేదు. విశ్వాన్ని పోలీసుస్టేషన్‌కు పట్టుకెళ్ళిన విషయాన్ని గూర్చే ఆలోచిస్తోంది. నిద్రవచ్చాక కూడా అదే కల. వాణ్ణి పోలీసు వాళ్ళు వదిలేస్తారు. కాని తన్ను పట్టుకోవాలని వచ్చారు. తప్పించుకుని పరుగెత్తిపోతున్న ఆవిణ్ణి ఇద్దరు నల్లటి పోలీసోళ్ళు వెంటాడుతారు. ఎదురుగుండా ఓ పల్లముంది. దాన్ని దాటి దూరంగా పరుగెత్తి వెళ్ళాక వాళ్ళు - 'మా నుంచీ తప్పించుకుని ఎలా వెడతావో చూస్తాం' అని పకపక నవ్వి అక్కడే నుంచుంటారు. ఆవిడకి వెంటనే మెలకువయ్యింది. ఏదో చెడుకల, తానెలాంటి తప్పు చేయలేదు. పోలీసు వాళ్ళెందుకు తన్ను తరుముకుంటూ వచ్చారు-అని ఆలోచిస్తూ పడుకుంది. ఎంతసేపయినా నిద్దర పట్టలేదు.

కంఠీజోస్యులు కుతురింట్లో మూడురోజులున్నారు. కట్టే ఇంటికి తమకు తోచిన సలహాలు తామిచ్చారు. హాసన తాల్లూకాలో ఒక ఇంటికి అష్టదిగ్బంధం

చేయాలని వెళ్ళిపోయారు.

బిళ్లపెంకు కొనడానిక డబ్బు లేదే అనుకుంటూ వుండగా, ఆవిడ తండ్రి రెండు వందల రూపాయలిచ్చి వెళ్ళారు. ఆయన వెళ్ళిన రోజే సన్నేనహళ్ళికెళ్ళి డబ్బు సిద్ధమయిందనీ, రెండురోజుల్లో పెంకు తెచ్చి డబ్బు పట్టుకెళ్ళమని చెప్పేసి వచ్చింది. పైకి లేచిన గోడలు కాస్త ఆరడమే తరువాయి. స్తంభాలు పెట్టి, వాసాలు వంతలు తీర్లు ఎక్కించి బద్దలు కట్టి అన్నీ సిద్ధంగా వున్నాయి. పెంకు డబ్బు చెల్లించినా, యాభై రూపాయలదాకా చేతిలో వుంటాయి. పనిలో పని, ఎర్ర మట్టిపూత చేయించి వెల్లవేయించాలి. ఇల్లు తయారయితే చాలు. గృహ ప్రవేశానికెలాగో డబ్బు సిద్ధం చేసుకోవచ్చు. రాత్రి బడి పారితోషికం వస్తే దానిలో యాభై రూపాయలతో ఎలాగో గృహప్రవేశాస్త్రం నడిపిస్తే సరి. మా నాన్ననే రమ్మనాలి. ఈ వూళ్ళో వున్న జోస్యులక్కరలేదు. గృహప్రవేశానికి విశ్వాన్ని ఎలాగూ పిలిపించాలి. అక్కమ్మా వస్తుంది. కల్లేశు తప్పకుండా వస్తాడు. వాడి పెళ్ళాం మాట చెప్పలేము.

ఈసారి వేసవి మొదలెట్టకముందే ఆకాశంలో మేఘాలు కనిపించాయి. పెంకు కప్పే ముందే వర్షం వస్తే గోడలు తడిసి కూలిపోవచ్చు. అంచేత త్వరగా కప్పు పరిపించాలి. వడ్రంగులకు పని పురమాయించి నంజమ్మ మరోసారి సన్నేనహళ్లికి వెళ్ళింది. కుమ్మరిశెట్టి ఇంట్లో వుండలేదు. అతడు వచ్చేదాకా వాడింట్లోనే కూర్చుని, ఆలస్యం చేస్తున్నావు త్వరగా పెంకు పంపించమని చెప్పి వూరికి వచ్చింది. మరుసటిరోజే పెంకు వచ్చింది. ఎండ తీవ్రంగా వుంది. ఆకాశంలో మేఘాలు భయపెడుతున్నాయి. త్వరత్వరగా పెంకు పైకి తేవాలి. పెంకు నేయించే పని మొదలెట్టారు. ఇంటికిరువైపులా పనివాళ్ళు చూరు మీది నుంచి ఎక్కి కూర్చున్నారు. ఆడ కూలీలు నిచ్చెనెక్కి పెంకుల తట్ట లందిస్తున్నారు. ఆ రోజా సాయంత్రానికే వర్షం పడేలా వుంది. నంజమ్మ ఉదయం నుంచీ తాను కూడా పెంకులందిస్తోంది. పనివాళ్ళెవళ్లూ విశ్రాంతి తీసుకోలేదు. సాయంత్రం నాలుగు గంటలకి పనంతా పూర్తి అయింది. "అమ్మా, మీ పని పూర్తి అయింది. మీరు నెగ్గారు" అని చెప్పి పనివాళ్ళు కిందికి దిగారు.

అక్కడే వున్న మాదేవయ్య గారన్నారు. "నంజవ్వా! అప్పణ్ణయ్య చెరుకు తోటలకి నిప్పెట్టాడు కదా, అంచేతేగా మీ పొలమంతా పోయింది. ఆ రోజు చెన్నయ్య అతడూ చేరి రోకళ్ళుచ్చుకుని మీ ఇంటి పెంకు చితకబాదారు. నేను

చెప్పానుగా. ఇల్లు కూల్చేది మలభం. కట్టేది కష్టమని. మొత్తానికి నువ్వు నీది అంటూ ఇల్లు కట్టి పూర్తి చేశావు".

ఆయనలా చెబుతూ వుండగా, పక్కనే వున్న చెన్నిగరాయలకు కోపం వచ్చి అక్కణ్ణించి వెళ్లిపోయాడు.

మేఘాల హడావిడేగానీ వాన చినుకు లేదు. రాత్రి ఆకాశమంతా నిర్మలంగా వుంది. తెల్లారి నుంచీ పెంకులందించి, అందించి నంజమ్మ కలసటగా వుంది. ఆకలేస్తోంది. ఏమైనా వండుకోవాలి. రాత్రి పొయ్యి రాజేసి అన్నం చేసింది. మజ్జిగ పోసి మొగుడికి పెట్టి తానూ తిని పడుకుంటే చచ్చిపోయిన పిల్లలు గుర్తొచ్చారు. మా సొంత ఇంట్లో వాళ్ళొకరోజా వుండే అదృష్టం నాకు లేదు. వెంటనే విశ్వం గుర్తొచ్చాడు. వాడు వాగలాపురానికెళ్ళి ఆరునెలలు దాటింది. మరో పదిహేను రోజులకి వేసవి సెలవులొస్తాయి. వూరికి తీసుకురావాలి. ఈ వూరి బడివేపు వెళ్ళకపోతే సరి. నేనే బండి కట్టించుకుని వెళ్ళాలి. అమ్మా అమ్మా అని ఎంత బెంగెట్టుకున్నాడో ఏమో! వాడితో కూడా అక్కమ్మనీ పిలుచుకురావాలి. అయితే గియితే వాడు మరో సంవత్సరమక్కడ వుంటే చాలు. తరువాత కంబనకెరె రామణ్ణలాగ వాడురోజూ అయిదుమైళ్ళు వెళ్ళి, అయిదు మైళ్ళు రావక్కరలేదు. చిన్న ఇల్లు అద్దెకు తీసుకుని మేమూ అక్కడే వుండాలి. అక్కణ్ణించీ వచ్చి కరణీకపు లెక్కలు వ్రాయచ్చు - ఇలా ఆలోచిస్తూ ఎప్పటికో నిద్రపట్టింది.

తెల్లారి లేచేసరికి ఒళ్ళంతా బరువెక్కి జ్వరం వచ్చింది. రెండు చంకల్లోను నొప్పి. నిన్న పొద్దస్తమానం ఎండలో నుంచుని పెంకులందించిది. ఎండలో పనిచేయడం తనకు కొత్తకాదు. కానీ నిన్న విపరీతమైన ఎండ. మనుషుల శరీరప్రవృతి ఒకేలా వుండదు. అన్ని పెంకులందించే సరికి చంకల్లో గడ్డలు కట్టాయి కాబోలు. లేచి ముఖం కడుక్కుని, దూడను వదిలి పాలు పితికింది. విశ్వం వెళ్ళిపోయాక పాలు పెరుగు ఖర్చు తగ్గిపోయింది. ఇప్పుడో నెలనించీ అప్పణ్ణయ్య కూడా వుాళ్ళోలేదు. అంచేత మజ్జిగ చాలా మిగిలిపోతోంది. జ్వరం తీవ్రంగా వున్నా ఆరు రొట్టెలు కాల్చింది. పక్కవేసుకుని పడుకుంది. సగం నిద్ర, సగం మెలకువ సాయంత్రం దాకా ఇలాగే వుంది. ఇంటి కెవరూ రాలేదు. మొగుడింట్లో లేడు. సాయంత్రం తానేలేచి శొంఠి, మిరియాల కషాయం చేసుకుని తాగి మళ్ళీ పడుకుంది. మగత నిద్ర పట్టింది. ఎప్పుడు చీకటి పడ్డదో మొగుడెప్పుడు వచ్చి పడుకున్నాడో ఆవిడికి తెలియదు.

అర్ధరాత్రిలో అతని గురకలకి మెలుకువ వచ్చింది. నీళ్ళగది కెడదామని లేవబోయింది. రెండు తొడల సందులోను నొప్పిగా వుంది. మళ్ళీ వచ్చిపడుకున్నప్పుడావిడ కనుమాన మేసింది. పెంకులందించింది గనక చంకల్లో నొప్పి వచ్చిందనుకోవచ్చు. నిచ్చెనెక్కి దిగీ తొడ సందులో నొప్పి వచ్చిందంటే తెల్లారినించీ ఎందుకు లేదు. ఇదేమిటి ప్లేగా? అయితే వూళ్ళో ఎక్కడా ఎలికలు పడ్డాయన్న వూసే లేదే. వెనక పార్వతికీ రామణ్ణకూ వచ్చినప్పుడు కూడా ఏ సూచనా లేకండానే వచ్చింది మరి. ఇప్పుడు కూడా అలాగే దొంగచాటుగా వచ్చిందేమో! ఆవిడకు భయమేసింది. ఎలాగయితేనేం మాదేవయ్యగారినయినా అడగాలి.

"చూడండి, మేలుకునే వున్నారా?" - అని మొగుణ్ణి పిలిచింది. ఆయన కదలలేదు. గొరక తగ్గలేదు. మరోసారి పిలిచి, చేయి చాపి, భుజం కదిపి చూసింది.

"వూరికే పడుకోవే. రాత్రివంటా చేయలేదు. ఇప్పుడు నిద్రా పాడుచేస్తున్నావు." ఆయన సగం జోగుతూనే కసురుకున్నాడు.

ఆమెకు కోపం వచ్చింది. "మీరేం మనిషా పశువా?" - అని అడగాలనిపించింది. కాని దానివల్ల మరింత గొడవై ఆయన నోటికి వచ్చినట్టు బూతులు లంకించుకుంటాడు. నాలిక చివరిదాకా వచ్చినమాట లోపలే నొక్కేసి "నాకు ప్లేగు తగిలిందిలా వుంది. వెళ్ళి మాదేవయ్యగారిని పిలుచుకు రండి".

ఆయన మాట్లాడలేదు. కాసేపట్లో మళ్ళీ గొరక మొదలయ్యింది. తెల్లారేదాకా ఆగవచ్చు. కాని సాధ్యమయినంత త్వరగా మందు తీసుకోవాలి. ఆమె పైకి లేచి, కంబడి కప్పుకుని తలుపు తీసుకుని బయటి కెళ్ళింది. నడుస్తూ వుండగా తొడసందులో నొప్పిగా వున్నా చంకల్లో వున్నంత లేదు. ఎలాగో దేవాలయందాకా వెళ్ళి "అయ్యగారూ" - అంది. వేసవి గనక అరుగుమీదే పడుకున్న ఆయన 'ఆ' అన్నారు. వెంటనే "నాకు ప్లేగు తగిలిందిలా వుంది, మా ఇంటికి రండి"- అనేసి వెనక్కి తిరిగి వెళ్ళింది. తూలుతూ ఇల్లు చేరుకునేసరికి వెనకుంచీ వచ్చిన అయ్యగారే తలుపుతీశారు. లోపలికెళ్ళి, తలగడ దగ్గిరే వున్న అగ్గిపెట్టె తీసి, పుల్లగీచి లాంతరు వెలిగించి, పక్కమీద వాలిపోయింది. వెలుగులో అయ్యగారు చూశారు. ఆవిడ ముఖం బూరటిల్లి, కళ్ళు నిప్పుల్లా వున్నాయి. ఒంట్లో జ్వరం తీవ్రంగా వున్నదని ముఖం చూడగానే తెలిసిపోయింది.

"జ్వరం ఎప్పుడొచ్చింది తల్లీ?"

"నిన్నరాత్రే వచ్చింది. నిన్న చంకల్లో నొప్పెట్టింది. పెంకులెత్తి అందివ్వటం వల్ల గడ్డలు కట్టాయమకున్నా. ఇప్పుడు మెలకువయ్యేవరికి తొడసందులో నొప్పిగా వుంది".

ఒక నిముషమాలోచించి అయ్యగారడిగారు. "సణ్ణేనహళ్ళికి పెంకులుకని వెళ్ళావు కదా. వూళ్ళో కెళ్ళావా? బయటే వున్నావా?"

"లక్కయ్యశెట్టి ఇల్లు వూళ్ళో మధ్యలో వుందిగా? ఎందుకూ?"

"వాడింట్లో కూర్చున్నావా?"

"హూ. నే నెళ్ళేసరికి వాడింట్లో లేడు. వచ్చేదాకా దాదాపు రెండుగంటలు కూచున్నాను? ఎందుకు?"

"ఆ వూళ్ళో పదివన్నెండు రోజులనుంచి ఎలుకలు పడుతున్నాయట. పల్లెటూరి వెధవలు, తెలీదు. వూరు వదిలిపెట్టకండా అక్కడే వున్నారు. ఈ రోజు పొద్దుట కోరణ్యం భిక్షకని ఆవేపు వెళ్ళాను. ఈ వార్త తెలిసింది. నేనూళ్ళోకి వెళ్ళనే లేదు."

"అయితే నాకు వచ్చింది ప్లేగే అంటారా?"

"చెప్పడానికి వీల్లేదు. ఏమైనా కావచ్చు. మందు చ్చుగోవాలి"

ఇంత మాట్లాడేసరికి ఆవిడ కాయాసమయింది. కాసేపలాగే కళ్లు మూసుకుని కాస్త ఓపిక తెచ్చుకుని - "ఇంట్లో యాభై రూపాయలున్నాయి. ఏమందయినా తెప్పించండి. మీరే దిక్కు" - అనేసి కళ్ళుమూసుకుంది. ఇప్పుడావిడ కే మందు ఇప్పించాలి - అని అయ్యగారాలోచించారు. వెనక విశ్వాన్ని బండిమీద కంబనకెరె తీసుకెళ్ళడం గుర్తొచ్చింది. ఈ డాక్టరేమీ చేయలేడు. హేమాదిపానకమే సరైనమందు. - అని నిశ్చయించినారు. డబ్బెక్కడుందో నంజమ్మ చెప్పింది. ఇప్పుడింకా అర్ధరాత్రే. ఆయన బయటికి వచ్చి ఆకాశం వేపు చూశారు. చుక్కల్ని చూచి అర్ధరాత్రే అని పోల్చుకున్నారు. వెంటనే తిపటూరికి నడిచి వెళ్ళి హేమాదిపానకం తీసుకుని వెంటనే బస్సులో తిరిగి రాగలిగిన వాళ్ళెవరు? చెన్నిగరాయులకి రాత్రి చీకట్లో నడిచే ధైర్యం లేదు. అతడు పనిదొంగ అని అందరికీ తెలుసు. మందుకని ఇచ్చిన డబ్బుతో మసాలదోసె లారగిస్తూ, మైసూరుపాకంలు మెక్కుతూ అక్కడే వుండిపోగలడు. అప్పణ్ణయ్య వూళ్ళోనేడు. తానే వెళ్ళాలి. తాను వెడితే ఇక్కడ ఈ రోగిని చూచు దిక్కెవరు? కష్టకాలంలో నరసి ఎవళ్ళనయినా ఆదుకుంటుంది.

తిపటూరినుంచి తన అంగడి సరకులు కొని తెచ్చే అలవాటు కూడా ఆవిడకుంది. కాని ఆడది రాత్రిపూట నడిచి వెళ్ళలేదు. ఎలాగయినా కానీ ఆవిణ్ణడుగుదాం. ఆవిడ మరెవళ్ళనయినా పంపవచ్చు - అని ఆలోచించి, పూారవతలికెళ్ళి అంగడితలుపు తట్టారు. వెంటనేలేచి, దీపం వెలిగించి, బయటికి వచ్చి, ఆయన చెప్పిందంతా విని "అయ్యగోరూ, మీరేం భయపడకండి. లింగాపురం పంబణ్ణగారున్నారు. నేను చెబితే తప్పకండా పని చేసుకొస్తారు" అంది. ఆవిడే లోపలికెళ్ళి అతణ్ణి లేపింది. లింగాపురం సంబేగౌడ అయ్యగారికి తెలిసిన వ్యక్తే. వోణబగౌడ గనక అతడింట్లో కూడా అయ్యగారు భోంచేశారు. తానిక్కడున్నది అయ్యగారికి తెలిసి, ఆయన ఎదురుగుండానే వచ్చి నుంచునే సందర్భ మేర్పడి వందుకతడు సిగ్గుతో తలవంచుకుని నుంచున్నాడు. ఒక కాగితం మీద అయ్యగారు -"తిపటూరి బజారులో వెంకటాచలశెట్టి అంగడి, హేమాదిపానకం, ప్లేగుమందు." అని వ్రాసి ఇరవై రూపాయలిచ్చారు. "ఇప్పుడే లగెత్తుకెళ్ళి బస్సులో బేగి రావాలి" - అని నరసి హుకుం జారీ చేసింది. జోడు తొడుక్కుని, తలకు పాగా చుట్టుకుని, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ అతడు చీకట్లోనే బయల్దేరాడు.

నరసి అయ్యగారి నడిగింది. "అయ్యగోరూ! ఈ వూళ్ళో నంజమ్మలాంటి మంచి మడిసి మరోరు లేరు. ఆ యమ్మ కొచ్చిన కట్టమెవ్వరికీ రాలేదు. ఇప్పుడు మళ్లా ఆవిడికే ప్లేగంటున్నారు. దరమంగా ఎందుకుండాలో మీరే చెప్పండి."

అయ్యగారికేం చెప్పాలో తెలియలేదు. ఈ సందర్భంలో అలాంటి విషయాలను గూర్చి ఆలోచించే పదును మెదడుకి లేదు. "మరోరోజు చెబుతాను. ఇప్పుడామెను చూసేవాళ్ళెవళ్ళూ లేరు." - అని ఆయన బయల్దేరాడు.

"నేనూ రానా?"

"అక్కరలేదు" - అని ముందుకు నడిచారు.

" కాసింతాగండి" - అని పిలిచి, నరిసి దగ్గిరకొచ్చి చెప్పింది. " నేను రావనుకోండి. సూడండి. రాత్రికాడ ఆడాళ్ళకి బడెట్టింది చూశారూ దాంట్లో నేను చేరవా అని కబురెట్టాను. వద్దందట. ఇప్పుడు నేనాడికొచ్చినా ఆవిడికి ఇష్టంగా వుండదు".

"నిన్ను చేర్చుకోలేదని కోపమా?

"లేదనుకోండి చేర్చుకుంటే వచ్చే ఆడాళ్ళు మానేద్దురు"- అని ఆవిడే చెప్పింది.

మందురాగానే పంపమని చెప్పి అయ్యగారింటికి వచ్చేసరికి నంజమ్మ నిద్రపోతోంది. లాంతరు వెలుగుతోంది. ఇప్పుడు రోగిని లేపరాదని.ఆవిడ ముఖాన్నే చూస్తూ స్తంభానికి చేరబడి కూర్చున్నారు. చెన్నిగరాయలను లేపనా అని అనుకున్నారు. ఆయన లేచివుంటే ఈవిడే గుడికెందుకొచ్చింది? అని తర్కించుకుని వూరుకున్నారు. ఆమె ముఖం చూస్తూ, చూస్తూ, పెళ్ళై ఈవూరికి వచ్చిన రోజు మొదలు ఈనాటిదాకా ఆమె జీవితంలో జరిగినవన్నీ ఆయనకి గుర్తొచ్చాయి. కోడలుగా ఈవూరికొచ్చిన కొత్తలో ఆమె బయటివాళ్ళతో ఎవళ్ళతోటీ మాట్లాడేదికాదు. ఆకుమరుగు పిందెగానే వుంది. కోడలిని రాచిరంపాన పెట్టిన అత్త, ఎవళ్ళమీద ప్రీతివిశ్వాసాలు లేని మొగుడు. పొలమంతా పోయిన సంగతి, వాటిని దక్కించుకోవాలని ఆమెచేసిన ప్రయత్నం, ఏకాకిగా పిల్లలతోటి వేరేవచ్చి సంసారాన్ని నిలబెట్టిన వైఖరి, కొడుకు విద్యాభ్యాసం, కూతురిపెళ్ళి, పిల్లలిద్దరి చావు, ఇప్పుడామృత్యువీమెనే మింగడానికి వచ్చింది. నరసి అడిగిన ప్రశ్న మళ్ళీ గుర్తొంచ్చింది. నంజమ్మ లాంటి మంచిమనిషి లేదు. ఆమెకు వచ్చిన కష్టాలు మరెవళ్ళకి రాలేదు. ఇప్పుడీ ప్లేగు ఈవిడకే వచ్చింది. ధర్మంగా ఎందుకుండాలి? శివుడు సజ్జనులను రక్షిస్తాడు, దుర్జనులను దండిస్తాడు. అయితే నంజమ్మ ఏంచెడుచేసింది? అత్తయ్య అవివేకానికి, మొగుడి నైచ్యానికి ఈవిడ బలి అయింది. అయితే ప్లేగుమారి, ఈవిడింటిమీదా, ఈవిడ పిల్లలమీదా, చివరకీవిడ మీదే పగపట్టాలా? ప్రపంచంలో ధర్మకర్మానుసారంగా శిక్షించడానికి దేవుడు రోగాల్ని కల్పించాడని ఆయన తత్వాల్లోను ,లావణీపదాల్లోను తెలుసుకున్నారు. కానీ ఇంతవరకూ అర్థం చేసుకున్నదే ఇప్పుడర్థం కావటంలేదు.

అదే సమయానికి సరిగ్గా నంజమ్మ వులిక్కిపడి "అయ్యయ్యో" అంటూ మేలుకుంది. "ఏంతల్లీ?" – అని ఆయనడిగారు అయిదు నిమిషాలు శూన్యంగా చూసి, ఆమె అడిగింది "మీరేనా"

"హుం? ఏమయిందేమిటి?

"కల వెనకో సారివచ్చింది. ఇద్దరూ నల్లటిపోలీసులు తరుముకుని వచ్చారు. నేను పల్లిందాటాను. మమ్మల్ని తప్పించుకుని ఎక్కడికెడతావులే అన్నారు. ఇప్పుడుమళ్ళీ అదే కల. నేను పల్లిందాటే ముందే ఇద్దరూ వచ్చి నన్ను రెక్కుచ్చుగుని నల్లటితాడుతో కట్టేస్తున్నారు. అంతలో మెలకువ వచ్చింది."

"జ్వరం తాపానికి అలాంటి కలలేవో వొస్తాయి. వూరికే పడుకో తల్లీ."

"జ్వరానికి కాదయ్యగారూ! నేనిప్పుడు చచ్చిపోవడం నిజం, నాకు కాస్త జావకాచిపోస్తారా? బ్రాహ్మల వంటిల్లని అనుకోకండి. మానాన్న వచ్చినప్పుడు వుప్పిండికని బియ్యపునూక చేసిపెట్టాను. పైన నల్లడబ్బాలో వుంది. వుండ్రాళ్ళ తప్పేలాలో బెల్లముంది. బెల్లం దొరక్కపోతే పట్టి జావయినా సరే కాస్తకాచి పట్రండి."

ఆయన లేచి లాంతరు తీసుకుని లోపలికెళ్ళారు. రాత్రి చెన్నిగరాయలు తిని కిందరాల్చిన రొట్టెముక్కల మీద చీకట్లో కూడా ఈగలు ముసురుకున్నాయి. బియ్యపు నూక, బెల్లమూ వెంటనే దొరికాయి. నాలుగు కర్రలు మండించి గిన్నెలో జావకాచి, ఒకగ్లాసుతోటి తెచ్చిచ్చారు. ఆయనే బుజం పట్టుకుని కూర్చోబెట్టాక, జావతాగి ఆవిడ మళ్ళీ పడుకుంది.

అయిదు నిమిషాలయ్యాక ఆవిడంది. "ఇప్పుడు జావతాగాక కాస్త శక్తి వచ్చింది. తరువాత ఒంటిమీద తెలివుంటుందో వుండదో ఇప్పుడే మీతో మాట్లాడాలి."

"జ్వర తీవ్రతలో ఎక్కువగా మాట్లాడరాదు తల్లీ, వూరికే పడుకో"

("ఇప్పుడే చెబుతాను వినండి. నేను పుట్టగానే మా అమ్మ చచ్చిపోయిందట, వే నేడాది పిల్లనట. ఒకరోజు ఉయ్యేల్లో పడుకుని వూరికే ఏడుస్తున్నానట. బయట హోరుమని వాన పడుతోందట గొడ్లపాకలో వున్న అక్కమ్మకి నా ఏడుపు వినపడలేదు. మానాన్న ఏదో సంస్కృత మంత్రం కంఠతః పడుతున్నారట. నా ఏడుపు వల్ల ఆయనకేకాగ్రత కుదరలేదు. ఇదో చంటిముండ ఎప్పుడూ నోరూమూయకుండా ఏడుస్తుంది. అని కోపంతో వుయ్యేల నమాంతంగా తీసుకుని వెళ్ళి, దడదడ నీళ్ళుదూకే మూరుకిందెట్టి లోపలికెళ్ళి మంత్రం జపించడం మొదలెట్టారట. కాసేపయ్యాక అక్కమ్మ లోపలి కొచ్చి చూసింది. ఉయ్యాల లేదు.
"ఏదిరా పాపాయ్?" అని అడిగితే "చూరుకింద" అన్నారట. నాముఖం ధారగాపడే నీళ్ళకిందలేదట. కాళ్ళుమాత్రమున్నాయి. ముఖం వీధి వైపుందట. లేకపోతే నేనారోజే చచ్చిపోవలసింది. అక్కమ్మలోపలికి తెచ్చి బ్రాందీ గిందీ పోసి, జలుబు చేయకుండా నన్ను బతికించుకుందట".)

కంఠీజోస్యులలా చేయడమేమీ అసహజం కాదని, ఆయన సంగతి తెలిసిన అయ్యగారనుకున్నాను. నంజమ్మంది: "నేనప్పుడే చచ్చివుండాలి కానీ ఎందుకు చావలేదు? ఇన్నేళ్ళు బతికి ఇలాంటి మొగుణ్ణి కట్టుకుని, ఇంతమంచి పిల్లల్ని కని,

వాళ్ళని పోగొట్టుకుని ఇప్పుడు చావాలా? ఇదెందుకిలా అవుతోంది అయ్యగారూ?"

అయ్యగారు కూడా గంటక్రితం నుంచీ ఇదే ఆలోచిస్తున్నారు. వరిసి అడిగిందీ ఇదే ప్రశ్న. ఇప్పు డీవి డడుగుతున్నదీ ఇదే ఎందుకిలా అవుతోంది? శివేచ్ఛ ఏమై వుంటుంది? ఆయన వేదాంతం చదవలేదు. తత్త్వాలు, లావణి, పదాలు మాత్రమే ఆయన జ్ఞానానికి మూలాధారాలు. కాశీ వెళ్ళినప్పుడిలాంటి ప్రశ్నలమీద మఠంలోను, మఠం బయటా తర్కించడం కుతూహలంతో వినేవాడు.కాని గంటక్రితం సరసి అడిగిని ప్రశ్నకు జవాబు మాత్రమాయనకు తెలియదు. తమకు కూడా తిన్నగా అర్థంకాని భారతంలోని పద్యాలు రాగయుక్తంగా చదివి విడదీసి నంజమ్మ అర్థం చెప్పేది. అయితే ఆవిడిప్పుడడుగుతున్న ప్రశ్నకు సమాధానమేమిటి? ఆవిడ చిన్నపిల్లగా వుండగా ఎందుకు చచ్చిపోలేదు? తనకాన్న తెలివితేటలు గలిగిన ఆమెకే తెలియకుండా ఆయన్నడిగింది.

ఇంతలో ఆవిడకి మైకం కమ్మింది. అయ్యగారావిడ ముఖాన్నే చూస్తూ కూర్చున్నారు. జ్వరతాపానికి బూరటిల్లిన ముఖంమీద ఏవేవోగీతలేర్పడి చెరిగిపోతున్నాయి. కాసేపటి కావిడ కళ్ళు తెరిచి మాట్లాడబోయింది. కాని ఆయాసంతో మాటలు తిన్నగారావటంలేదు. అతిప్రయత్నంతో తన శక్తంతా కూడకట్టుకుని పలికింది "పార్వతి రామణ్ణలు చచ్చిపోయినప్పుడు గోపి కథ మీరు చెప్పారు. కొడుకు చచ్చిపోతే తన ప్రాణాలు తీసుకోవటానికి గోపిభయపడి గట్టుమీదే కూర్చుంది. ఆరోజురాత్రే నేను శ్మశానంలో వున్న బావిలో దూకడానికని వెళ్ళాను. ధైర్యంగా నీళ్ళలోకి దూకేదాన్నే. విశ్వానికి దిక్కెవరని ఆలోచించి తిరిగి వచ్చాను. ఇప్పుడు నేనే చస్తున్నాను. విశ్వానికెవరు దిక్కు? అక్కమ్మ ఇంత అన్నం వండిపడేస్తుంది. మా అన్నయ్య మీద వాకు నమ్మకం లేదు. కుర్రాడికి అన్నంకాదు. ప్రధానమయినది వాడు ప్రయోజకుడు కావాలికదా?"

ఇంత మాట్లాడేసరికి, మరీ అలిసిపోయి కళ్ళుమూసుకుని పడుకుంది. మళ్ళీమాట్లాడలేదు. మైకం వచ్చిన కాసేపటికే నిద్ర పట్టినట్టయింది. అయ్యగారు మాట్లాడకుండా కూర్చున్నారు. బెస్తవీధిలో కోడి కూసింది, అది ఆయనరోజూ లేచే సమయం. చెరువుకట్టవేపు వెళ్ళాలనిపించింది. చెన్నిగరాయల్ని లేపి వెళ్ళాలన్న ఆలోచన కలిగినా, ఆయన లేచి రోగికి చేసే వుపచారమేమిటని తర్కించుకుని, మండే లాంతరలాగే వదిలేసి, తలుపు చేరవేసుగుని బయటికి వెళ్ళారు. చెరువుకట్ట నుంచీ తిరిగి వస్తూవుండగా కాకులు కూశాయి. అంతలో లేచి

కట్టవేపు వస్తున్న జనం మాట్లాడుకుంటున్నారు. చుట్టపక్క వూళ్ళల్లో ఎలికలు పడ్డాయట. ఈవూళ్ళో పడకముందే వూరిపెద్దలు చేరి అందరూ వెంటనే వూరు వదలాలని తీర్మానించారు. ఈరోజుతెల్లారి బేలూర వూరంతా డప్పువాయించి చాటి స్తాడు. నిన్న సాయంత్రం కంబనకెరె నుంచి ఆరోగ్యశాఖవాళ్ళు కబురెట్టారట. ఈరోజు వుదయమేవాళ్ళీవూరికివస్తారు. అమ్మవారిగుడిదగ్గరవూళ్ళోవున్న స్త్రీలు పిల్లలు– ఆ బాలగోపాలంవచ్చి సూదిమందు వేయించుకోవాలట. రోగం వ్యాపించే ముందే ప్రతిపల్లెలోనూ సూదిమందివ్వాలని ప్రభుత్వం హుకుం జారీ చేసిందట

అప్పుడే ప్లేగు తగిలిన వాళ్ళకి సూదిమందు వేయరాదని, నిరుడు కంబనకెరె డాక్టరు చెప్పారన్న సంగతి అయ్యగారికి గుర్తొచ్చింది. నిరుడు కూడా మారి నంజమ్మింటికే మొదట వచ్చింది. ఇప్పుడు కూడా, దాని వూసుతెలిసేముందే నంజమ్మనే తాకింది– అని ఆలోచిస్తూ ఆయన ఆవిడ ఇంటివేపు వెళ్ళాడు.

## 5

అందరూ రెండురోజుల్లో వూరొదిలేశారు. నంజమ్మ ఇల్లు పూర్తిచేసి ఇంకా మిగిలిపోయిన వెదురుగడలు, బద్దలు– అన్నీ అయ్యగారే సాగించి షెడ్డు వేయించారు. అందరికీ ఆశ్చర్యకరమైన సంగతేమిటంటే గంగమ్మ అదే షెడ్డుకు వచ్చి కోడలి సేవకు పూనుకోవడం. "పాడిల్లు కట్టపోతే ఏం మునిగిపోయింది ఆ సన్నేనహళ్ళికెళ్ళి రోగం తగిలించుకుని వచ్చింది. పెద్దాళ్ళమాట వినుంటే దీనికేమీ అయ్యేదికాదు.– అనివూరికే సణుగుతున్నా, అయ్యగారు చెప్పినట్టు హేమాదిపానకం, జావ, ఆవిడక్కరలేదన్నా క్రమంగా నోరుతెరిచి తాగించేది.

చెన్నిగరాయలు ఇనాక్యులేషన్ వేయించుకుని జబ్బనొప్పెట్టి వాచి, అయ్యగారి కట్టమీది గుడిలోనో లేదా బయట అమ్మవారిగుడి అరుగుమీదో పడుకునేవాడు. "సన్యాసి వాకెందుకు సూదిమందు నేనుచస్తే ఏడ్చే వాళ్ళెవరు?– " అన్నా, "మీరు చావడం కాదు ప్రధానం. మీనుంచి వ్యాధి వూళ్ళోవాళ్ళకి వ్యాపించకుండా వుండాలి"– అని వైద్యశాఖవారయ్యగారికి కూడా గుచ్చారు. ఒకరోజు జబ్బ కాస్త వాచింది నొప్పెట్టింది. కానీ వూళ్ళోవాళ్ళంతా అలాగే సామాను సాగించారు. గంగమ్మ మాత్రం ససేమిరా సూదిమందువేయించుకోనంటే వేయించుకోనంది.

నంజమ్మ పడుకున్న పక్కనే నలుగురు నాలుగువేపులా పట్టితెచ్చి షెడ్డులో పెట్టారు. ఒంటిమీద తప్పిన తెలివి ఆవిడకి మళ్ళీ రానేలేదు. కానీ బలవంతాన

గంగమ్మత్త తాగించేమందు, పలచని జావ ఎలాగో గుటకేసి మింగేది. షెడ్డుకు సాగించిన రెండవరోజు పొద్దుట ఆవిడకి కాస్త తెలివివచ్చినట్టె మాట్లాడడానికి ప్రయత్నించింది. దగ్గిరే కూర్చున్న అయ్యగారు ఆవిడ చెవిదగ్గిరగా – ఏమి? అన్నారు.

"వి. . . శ్వ. . ."

"చూడాలా?"

అవుననన్నట్టున్న ఆవిడ ముఖభావాన్ని గుర్తించిన ఆయనే "మనిషిని పంపుతాను, పిలుచుకొస్తాడు"– అని చెప్పి బయటికెళ్ళారు. వూరంతా తమతమ షెడ్లు వేసుకునే పనిలో మునిగివుంది. ఇప్పుడే మనిషి దొరుకుతాడు? అని ఆలోచిస్తూ వెట్టి షెడ్డుకెళ్ళి చెప్పారు. "నంజమ్మ చావుబతుకులమీద వుంది. కొడుకును చూడాలని అంటోంది. ఎవళ్ళయినా నాగలాపురానికెళ్ళి కుర్రాణ్ణి తీసుకురావాలి కదయ్యా".

"అయ్యగారూ! మీరే చూడండి. నాపాకకి పూర్తి ఆకు కప్పలేదు. ఈ రోజు గౌడుగారి తోటకెళ్ళి ఆకు తేవాలి"– అన్నాడు వెట్టి.

"అది రేపు చేసినా ఇబ్బంది లేదు. చచ్చిపోయే తల్లి నోట్లో కొడుకు నీళ్ళు పొయ్యక్కరలా? వెళ్ళు నాయనా".

"అలాగే"– అని వాడొప్పుకున్నాడు. వెంటనే వెళ్ళాలని చెప్పి ఆయన నంజమ్మ పాకకి వచ్చారు. ఇంతలో గంగమ్మ అంది. "అదేమిటో అంటోంది నాకు తెలవలేదు. మీరే అడగండయ్యగారు"

మళ్ళీ ఆవిడ నోటికి దగ్గరగా చెవిపెట్టి "ఏంతల్లీ?" అని ఆయనడిగారు. అయిదు నిమిషాలయ్యాక అది వినిపించనట్టు ఏదో హీనస్వరంలో చెప్పింది. "వినపడలేదు కాస్త గట్టిగా చెప్పు" అన్నాక మళ్ళీ హీనస్వరంలోనే ఏదో అంది. స్పష్టంగా వినబడక పోయినా "వూళ్ళో ప్లేగుంది. కుర్రాణ్ణి పిలిపించకండి"– అని మొత్తం మీద అర్థం చేసుకున్నారు. "నువ్వేళ్ళకని వెట్టితో చెబుతాము"– అని ఆయన బయటికి వచ్చారు.

రోగం వచ్చిన వూరికి విశ్వం రాకూడదని ఆయనా కూడా నిశ్చయించారు. నంజమ్మెలాగూ చచ్చిపోతుంది. కొడుకు వచ్చి నోట్లో నీళ్ళు పోయకపోతేఏం? వాడి ఆయుస్సు గట్టిగా వుంటే చాలన్నదే ఆవిడ కోరిక. కాని ఆవిణ్ణి పెంచిపెద్ద చేసిన బామ్మకి, అన్నయ్యకు తెలపాలి. అని ఆలోచించి ఆయన వెట్టి పాకకెళ్ళారు.

వాడప్పుడే ముద్దతిని బయల్దేరానికి సిద్ధపడుతూ వున్నాడు. కుర్రాణ్ణి తీసుకురాకూడదనీ, బామ్మనీ, అన్నయ్యనీ మాత్రం పిలుచుకురావాలనీ అయ్యగారు చెప్పారు.

వెట్టి పరుగుచ్చుకున్నాడు. వాడెంత వేగంగా వెళ్ళినా చోళనగుడ్డ, మరళహళ్ళ, కెమ్మణ్ణుహళ్ళ, కత్తాళిఓణి, దాటి అంతదూరం నాగలాపురాని కెళ్ళేసరికి మధ్యాహ్నం రెండుగంటలయింది. తీరా అక్కడికెళ్ళిచూస్తే ఆవూరూ వదిలిపెట్టారు. కల్లేశజోస్యుల షెడ్డెక్కడుందో తెలుసుకుని వెళ్ళేసరికి విశ్వం బడికెళ్ళాడు. కల్లేశ జోస్యులూళ్ళోలేరు. హాసన వెళ్ళారు. మరుసటిరోజువస్తారట. వాడు చెప్పిన సంగతి విని అక్కమ్మ రాగాలు తీసింది. కల్లేశుకోసం ఆగడానికి లేదు. వాడు రేపురాగానే పంపమని కమలకు చెప్పి, ఆవిడమీదనమ్మకంలేక ఇరుగుపొరుగు పాకలవాళ్ళకి చెప్పి, హొన్నడి చేత బండి కట్టించుకుని అక్కమ్మ వెంటనే బయలుదేరింది.

పాడుప్లేగు నిరుడే కదా ఇద్దరు పిల్లల్ని బలితీసుకుంది. ఈ ఏడు మనవరాలకే తగిలింది. విశ్వానికి తగిలినప్పుడు శృంగేరి శారదమ్మకు ముడుపుకట్టుకునేసరికి నయమయిందట. వాళ్ళిప్పుడు కనీసం రూపాయ అయినాముడుపు కట్టారో లేదో! దారిలో ఓ చిన్న కట్టవుంది అక్కడికి రాగానే రెండు నిమిషాలు బండి ఆపి ఆ కట్టదగ్గిరే చేతులూ కాళ్ళూ కడుక్కుని, తన బొడ్డులో జోపుకుని తెచ్చిన డబ్బులో ఓ వెండిరూపాయతీసి చేతబుచ్చుకుని మనవరాలికి నయమయితే ఆవిణ్ణి మళ్ళీ శృంగేరికి పంపి కుంకుమార్చన చేయిస్తానని ముడుపు కట్టి మొక్కుబడి చేసుకుని, వచ్చి బండ్లో కూర్చుంది.

ఈసారి ఎక్కడ చూచినా వూళ్ళు వదిలారు. అన్ని వూళ్ళల్లోను ప్రభుత్వంవారు సూదిమందులు గుచ్చారు. నాగలాపురంలో విశ్వం, కల్లేశు, కమల అందరూ సూదిమందెక్కించుకున్నారు, కాని ముసల్ది తనకెందుకని తాను పుచ్చుకోలేదు. ఇన్నేళ్ళుగా ఒకసారయినా ఆసుపత్రిసీళ్ళుతాగని తాము, ఈ సూదిమందు శరీరంలోకి ఎక్కించుకోవడంమెలాగ?

మనమరాలి పరిస్థితిని గురించి వెట్టిని మాటిమాటికి అడుగుతోంది. ప్రత్యక్షంగా వాడికేమీ తెలియదు. విన్న సంగతులే చెబుతున్నాడు. ప్రాణాపాయముండదేమో అని తనకు తానే చెప్పుకుంటూ, ఎద్లనదిలించమని హొన్నడికి పదేపదే చెప్పింది. ఎంత వడిగా వెళ్ళినా వాళ్ళబండి రామసంద్రం చేరేసరికి చీకటిపడ్డది.

## 6

షెడ్డుకు వచ్చి చూస్తే మనవరాలు లేదు. వియ్యపురాలు గంగమ్మ లబోదిబోమని ఏడుస్తోంది. మాదేవయ్యగారు చెప్పారు. "మధ్యాహ్నానికే నంజమ్మ ప్రాణంపోయింది. 'ప్లేగువచ్చిన వూరికి కొడుకుని పిలిపించవద్దు' అన్నదే ఆఖరిమాట. మళ్ళీ మాట్లాడలేదు. చచ్చేముందు ఏగడ్డకూడా చితకలేదు అయిదే అయిదు నిమిషాలాయాసపడి ప్రాణవాయువు వెళ్ళిపోయింది. దగ్గిరే వున్న గంగమ్మగారే నోట్లో నీళ్ళు పోశారు. వీళ్ళొస్తారని సాయంత్రందాకా శవాన్ని వుంచారు. చీకటి పడితే రేపటిదాకా వుంచాలి. ప్లేగువ్యాధితో చచ్చిన శవం త్వరగా కుళ్ళుతుందని దహనానికి అర్ధగంట క్రితమే పంపించారు."

అక్కమ్మ గుండెలు బాదుకుంది. నాకు ముఖం చూసే ప్రాప్తి లేకపోయిందని ఏడ్చింది. 'అక్కడికే వెళ్ళి చూస్తాను' అని చీకట్లోనే శ్మశానంవేపు బయల్దేరింది. పండు ముసిల్ది ఎక్కడయినా పడిపోతుందేమో అని ఆమె చెయ్యి పుచ్చుకుని అయ్యగారు వెంటవెళ్ళేరు. వీళ్ళు వెళ్ళేదారిలో అయ్యాశాస్త్రులొక్కరే, నడుం వంచుకుని నిలబడ్డారు. వీళ్ళిద్దరినీ చూసి ఆయనే "ఎవరు" అన్నారు. "నంజమ్మగారి బామ్మ"- అని చెబుతూనే అయ్యగారు అక్కమ్మతో తోటవేపు వెళ్ళారు. కట్టదిగి, తోట సందుగుండా నడిచి, వీళ్ళెళ్ళేసరికి, శాస్త్రభాగం ముగించి, శవాన్ని చితిమీదపెట్టి, అప్పుడే, బట్టలన్నీ తీసేశారు. తన మనమరాలు పుట్టిన రోజెలాగుందో అలాంటి స్థితిలోనే ఆవిణ్ణి చూసింది. అప్పుడెంత తెల్లగా వుండేది! ఇప్పుడు శరీరమంతా నల్లబడిపోయింది. ఆవిడ పరుగెత్తి కొచ్చి శవాన్నే వాటేసుకుంది. అక్కమ్మను ఓదార్చి ఇవతలకి లాగేసరికి అందరికీ తలప్రాణం తోకకు వచ్చింది. ఆవిడ ముందే శవంమీద కర్రలెట్టి కొరివితో నిప్పంటించారు. మంట మెల్లగా వ్యాపించి, అంటుకుని ధగధగ పైకి లేచేదాక తదేక దృష్టితో చూస్తున్న అక్కమ్మ వున్నదున్నట్టుగా కేకేసింది "దొంగముండా! చివరికిలా చేశావా! నీకు శాస్తి చేస్తానాగు".

ఆవిడేమి చెబుతోందో ఎవరికీ అర్థం కాలేదు. అక్కమ్మ వెనక్కితిరిగి గబగబ బయల్దేరింది. చీకట్లో పడిపోగలదని అయ్యగారో చెయ్యిపట్టుకున్నా విదిలించుకుని, కసిరి, ముందుకెళ్ళింది. చెరువుకట్ట ఎక్కేచోట నుంచున్న అయ్యాశాస్త్రులు "ఎందుకమ్మా ఇలాపరుగెడుతున్నారు?" అన్నది కూడా ఆవిడ వినిపించుకోలేదు. తిన్నగా షెడ్డుకు వచ్చింది. లోపలికెళ్ళిన వెంటనే తలుపుచాటునవున్న ఈతచీపురు చేతబుచ్చుకుని, బండిదగ్గిరకెళ్ళి, ఎప్పుడు కిందవదిలిపెట్టిన పాతచెప్పొకటి

మరోచేత్తో పుచ్చుకుని వూరివేపు దూసుకు వెళ్ళింది. కాసేపు గంగమ్మకూడా నిర్ఘాంతపోయింది. పొన్నడికి ఏమీ తెలియలేదు. చీకట్లో ఆవిడెక్కడి కెళ్ళిందో వాళ్ళకి బోధపడలేదు. అమావాస్యకు ముందురోజులు గనక చీకటి కన్నుపొడుచుకున్నా కనిపించదు. చీకట్లో నే వీధిగుర్తుపట్టి ఎలా వెళ్ళిందో వెళ్ళింది. తిన్నగా తన మనమరాలు నివసించే ఇంటి ముందాగి, తలుపుల్ని చీపురుతోటి చెప్పుతోటి బాదుతూ గట్టిగా అరిచింది.

"ఓసి మారి ముండా! అందరినీ వొదిలి ఈ ఇంటికే మళ్ళీవస్తావా? నీ కళ్ళు దాని పిల్లలిద్దరిమీదా పడ్డాయి. ఇప్పుడు శారదమ్మకు మొక్కుబడి చేసేలోపుగా దాన్నే మింగేశావా? నీకు జడిసేకొద్దీ మీద పడతావా? పాపిముండా! ఒసేవ్ నీకు చెప్పుదెబ్బేసరి, దొంగచాటుగా లోపలకూర్చున్నావేమే? రా, బయటికి నీనెత్తిమీది వెంట్రుకలూడే దాకా చెప్పుచ్చుక్కొడతాను."

అక్కమ్మ చెప్పుతో తలుపుమీద మరీమరీ కొట్టింది. నోటికి వచ్చినట్లు ప్లేగుమారిని శపించింది. ఇంత చేసేసరికి ఆవిడకాయసం వచ్చింది. అలాగే అరుగుమీద కాసేపు కూచుంది. చీపురుకట్టా, పాతచెప్పు చేతుల్లోనే వున్నాయి. అర్ధగంటలో ఆవిడకోపం చల్లారింది. నిరుడు ఇద్దరుపిల్లలు చచ్చిపోయినప్పుడుకూడా ఆవిడ ఈ ఇంటికే వచ్చి మనవరాలిని ఓదార్చింది. ఈ ఇంట్లోనే పార్వతి పెళ్ళయింది. సంజా ఇక్కడికి వచ్చి పదమూడేళ్ళయింది. ఈ ఇంటినే వెదుక్కొని రావాలా పాడుప్లేగు! అక్కమ్మకు ఏడుపు వచ్చింది. వెక్కి వెక్కి చివరికి భోరుమని ఏడ్చింది. కాసేపయ్యాక పైకి లేచింది, చీపురుకట్టతో తలుపు బాదాలనిగాని, ప్లేగుమారిని తిట్టాలనిగాని, మళ్ళీ బుద్ధి పుట్టలేదు. చీకట్లో నడిచివూరి బయటికి వచ్చింది.

ఇంతలో ఎదురుగుండా వస్తున్న అయ్యగారు ఈవిణ్ణి గుర్తించి అన్నారు. "మిమ్మల్నే వెదుకుతూ మేమెక్కడెక్కడో గాలించాం. వదిలేసిన వూళ్ళోకెందుకెళ్ళారు?"

"ప్లేగుముండను చెప్పుతోకొట్టాలని వెళ్ళాను"

ఇంతలో శవవాహకులు వెనక్కి తిరిగొస్తున్నారు. చెన్నిగరాయలు కన్నీళ్ళు తుడుచుకుంటూ కూచున్నారు. "ఈపాడుకొంప కట్టకపోతే దానికేం మునిగిపోయింది. ? కొత్తిల్లు కట్టేసరికే అమ్మవారు పట్టుకుంది."

అక్కమ్మ రాత్రంతా ఏడుస్తూనే వుంది. తెల్లారి లేచాక బండెక్కి వూరికెళ్ళడమా

లేక కల్లేళు వచ్చేదాకా అక్కడే వుండిపోవడమా అన్న చర్చ జరిగింది. "ఆయన వచ్చేదాక వుండండి"- అని అయ్యగారన్నారు. ఎడ్లబండితోటి పొన్నడు కూడా వుండిపోయాడు.

మధ్యాహ్నం పన్నెండు గంటలు కావస్తోంది. పాకలో అక్కమ్మ పడుకుని వుంది. గంగమ్మ నెత్తిమీద చేతులెట్టుకుని కూర్చుంది. చెన్నిగరాయలు గ్రామదేవత గుడి అరుగుమీద పడుకుని, తనదుఃఖాన్ని మరచిపోవడానికి నిద్రపోతున్నారు. అదే సమయంలో విశ్వం వడివడిగా అడుగులేస్తూ వూరివేపు వస్తున్నాడు. ఊరిబయట తన అంగట్లో కూర్చున్న నరసి వాణ్ణి చూసి పరుగెత్తుకుని వచ్చి - "ఎక్కడి కెడతావ్ బాబూ?" అంటే "మాఅమ్మ చచ్చిపోయిందట నిజమా?" అని అడిగాడు

నరసి వాణ్ణి వాటేసుకుని పట్టుకుంది "నన్నెందుకు పట్టుకుంటారు ? నేను మాఇంటికెడతాను వదులు నరసమ్మా"- అని వాడు బతిమాలాడు.

"వెళ్ళి ఏంచేస్తావు బాబూ?"

"మా అమ్మ వుంది. మా అమ్మ చచ్చిపోలేదు.

"ఇట్రా నే చెబుతాను"- అని వాడి రెండుచేతులూ పుచ్చుకుని అంగట్లోకి తీసుకెళ్ళి, కూర్చోబెట్టి "ఒక్కడవే వచ్చావా?" అని అడిగింది.

"ఊఁ"

"అమ్మ చచ్చిపోయిందని ఎవరన్నారు?"

"మా పక్క షెడ్డు నాగమ్మత్త"

" ఆవిడ చెప్పగానే లగెత్తుకొచ్చావా?"

" ఊఁ"

"నీకు దారి తెలిసిందా?"

"బండి మీదెళ్ళేటప్పుడు చూశానుగా, చెరువుకట్ట, మేల్పాసి, కత్తాళిఓర్, కణగలహళ్ళ దాటి, హూలినహళ్ళి దాటి, చోళనగుడ్డ, ముత్తుగడహళ్ళ దాటి వచ్చాను."

"నరసికి ఏడుపొచ్చింది. మరోసారి వాణ్ణి వాటేసుకుంది.

"ఎందుకు నరసమ్మా ఏడుస్తావు? మా ఇంటికెడతాను వదులు " అని వాడు వదిలించుకుంటూ లేచాడు. "నేను తీసుకెడతానురా"- అని చెయ్యట్టుకుని వాళ్ళ షెడ్డుకు తీసుకెళ్ళింది. ముని మనవణ్ణి చూడగానే అక్కమ్మ వాణ్ణమాంతంగా

లొక్కుని వాటేసుకుని "తల్లి లేనిపిల్లాడయ్యావు రా, బాబూ" అని గట్టిగా ఏడ్చేసింది. విశ్వానికి ఏడుపు వచ్చింది. "అమ్మ చచ్చిపోయిందా?"- అంటూ ఏడ్చిగీపెట్టి కింద పడిపోయాడు.

## 7

సాయంత్రానికి అక్కమ్మకు జ్వరం తగిలింది. చేతులు కాళ్ళూ వూచ కోతలు కోసినట్టు నొప్పెడుతున్నాయి. కళ్ళువికారంగా ఎర్రబడ్డాయి. ముఖం బూరటిల్లింది. వెంటనే ఇవన్నీ ప్లేగు లక్షణాలని అయ్యగారన్నారు. ఈ ముసలమ్మ బతకదని ఆయన మనస్సుకుతోచింది. విశ్వాన్ని రోగిదగ్గర వుంచరాదు. వాణ్ణి నరసి దగ్గిర తెచ్చి వొదిలి "చూడమ్మా, వీణ్ణి నీ ఇంట్లో నుంచీ బయటికి వదలకు. అన్నం, తిండి, ఏదయినా సరే నువ్వే చూసుకో. కులమేంపోదులే, షెడ్డులో ముసలమ్మకిప్లేగు తగిలింది. వాడక్కడుండరాదు".

విశ్వ మేమీ తినలేదు. తన అమ్మను తలుచుకుని ఏడుస్తూనే వున్నాడు. వాణ్ణి కదలనివ్వకుండా నరసి దగ్గిరే కూర్చుంది.

నంజమ్మకవి తెచ్చిన హేమా పానకమింకా మిగిలివుంది. షెడ్డుకెళ్ళి, మాదేవయ్యగారు తాగించపోతే అక్కమ్మ వద్దంది. ఏంచేసినా నోరుతెరవలేదు తాను చచ్చిపోవాలనే నిశ్చయించుకుంది.

రాత్రిపదింటికి కల్లేశు వచ్చిడు. జరిగిందంతా అయ్యగారు చెప్పారు. రెండు నిమిషాలు అతడూ కంట తడిపెట్టాడు. తరవాతి కార్యక్రమ మాలోచించాలి. అతడే చెప్పాడు విశ్వానికి ఇనాక్యులేషను చేశారు. నాగలాపురం కూడా వదిలేశారు. ఈ వూరూ వదిలేశారు. వాడిక్కడున్నా భయంలేదు. వాడి అమ్మ అపరకర్మ లయ్యేదాకా ఇక్కడే వుండనీ. తరువాత వచ్చి నేను తీసుకెడతాను వదిలేసిన వూళ్ళోకెళ్ళి అంతసేపుండటంవల్ల అక్కమ్మకు రోగం తగిలింది. ఇనాక్యులేషనక్కర లేదని మొండికెత్తింది. ఇప్పుడు బండ్లో ఆవిణ్ణి తీసుకెడతాను."

దానికి సమాధానం చెప్పగిలిగిన స్థితిలో ఎవరూ లేరు. "అట్లాగే చేయండి" అయ్యగారన్నారు. "నేనక్కడికిరాను. నా మనవరాలిని తగలేసిన జాగాలోనే నన్నూ తగలెయ్యండి."- అక్కమ్మ పోరింది. కల్లేశు వినలేదు మెత్తగా వుండేలా గడ్డివేయించి, పైన గోనిపట్టా, చీరాపరిచి, అక్కమ్మనెత్తిపడుకోబెట్టి ఆవిడదే కంబడి కప్పి ఆరాత్రే బండి కట్టించుకుని బయల్దేరాడు.

మరసటిరోజు వుదయం అప్పణ్ణయ్య వూరికి వచ్చాడు. ప్లేగు వచ్చి వూరు వదిలారనిగాని, వొదిన చనిపోయిందనిగాని అతడికి తెలియదు. షెడ్డుకువచ్చి, కూచుని, కళ్ళనిండా నీళ్ళు పెట్టుకున్నాడు. పార్వతి పెళ్ళాయ్యాక అతడికి వదినమీద ఆప్యాయత పెరిగింది. ఇద్దరు పిల్లలు పోయాక ఆవిడతో శృంగేరి వెళ్ళొచ్చాక గౌరవమే ఏర్పడింది. తనతల్లి నుంచి వేరుపడ్డాక రోజూ ఆవిడ వండిన చారో, పులుసో తినేవాడు. ఇప్పుడీవూళ్ళో 'నా' అన్నవాళ్ళెవళ్ళూ తనకు లేరనిపించింది. నరసి ఇంటికెళ్ళి తానే విశ్వాన్ని తీసుకొచ్చాడు. ఇప్పుడు అయ్యగారిని మినహాయిస్తే విశ్వానికూళ్ళో ఆప్యాయత చూపేమట్టం బాబయ్య ఒక్కడే. రేవణ్ణసెట్టి భార్య సర్వక్క లాంటి వాళ్ళెందరో షెడ్డుకు వచ్చి, వాడి బుగ్గలు తడిమి ముద్దెట్టుకుని కన్నీళ్ళుకార్చి వెళ్ళేవారు.కానీ ఎవరూ వాడి తల్లిని వాడికి తెచ్చివ్వలేరు. ఆవిణ్ణి శ్మశానంలో కాల్చివేశారట. చచ్చి బుగ్గయిన వాళ్ళు తిరిగిరారట. వీళ్ళెందుకు కాల్చివేయాలి? అలాగే వుంచితే ఆమెకు ప్రాణం వచ్చేదేమో!" అని వాడాలోచించేవాడు.

ఇంకా వదినె కర్మలు కావాలి. అప్పణ్ణయ్య అన్నతో చెప్పాడు. "నాదగ్గిర అర్ధవైరూపాయలున్నాయి. నీ వద్ద ఏముందో ఇవ్వు. సక్రమంగా చేద్దాం. ఆమె పుణ్యాత్మురాలు. శ్రద్ధాభక్తులతో కర్మ జరిపించాలి."

"గాడిదముండ వున్న డబ్బంతా పోసి ఇల్లు కట్టింది. నాకేం పెత్తనమిచ్చింది డబ్బుండడానికి?"

అయ్యగారన్నారు: "మందు తెచ్చాక ముప్పైరెండు రూపాయలింకా మిగిలింది. అవి నాగ్గిరున్నాయి. అవి తీసుకోండి. ఎలాగో పొదుపుగా చేయండి. ఈవూరి జోస్యులకు మీరేమి దానమిచ్చినా చచ్చిపోయిన తల్లికేమీ చెందదు. బోలెడంత పుణ్యం చేసే పైలోకాలకెళ్ళిందావిడ".

ఆరోజే కంబనకెరె హెడ్ మాస్టారు వచ్చారు. రాత్రిబడిపారితోషికం నూట ఇరవైరెరూపాయలు చెన్నిగరాయలకిచ్చి, డబ్బు పుచ్చుకోవలసినవారు చనిపోయారుగనక, ఆమెభర్త ఆయన తాను స్వీకరించినట్లు వ్రాయించి, సంతకం చేయించుకుని వెళ్ళిపోయారు. "ఆ డబ్బు అపరకర్మల కివ్వమని" అప్పణ్ణయ్య అడిగాడు.

"దాన్ని ఖర్చుచెయకండి చదివే కుర్రాడికి, చొక్కాలు గిక్కాలు కుట్టించడానికి, పుస్తకాలు గిస్తకాలు కొనడానికి వుండనీ" అని మాదేవయ్యగారన్నారు." అయితే

అయ్యగారి చేతికివ్వు"– అని అప్పణ్ణయ్య అన్నాడు. చెన్నిగరాయలెవ్వరికీ ఇవ్వలేదు. వాటిని గుడ్డలో చుట్టి నడుముకు బిగించి తిరగటం మొదలెట్టాడు.

కర్మలు పొద్దుపుగానే చేసే ఏర్పాటు జరిగింది. కాయగూరలకని అప్పణ్ణయ్య కురుబరహళ్ళికి వెళ్ళాడు. ఆవూరి వాళ్ళంతా షెడ్లు వేసుకున్న సంగతి అతనికి తెలుసు. ఆరోజు వుదయమే గుండేగౌడ గారు చచ్చిపోయారు. అతడెళ్ళిన వేళకు సరిగ్గా ఆయన శవాన్ని ఖననం చేయడానికి తీసుకెళుతున్నారు. గుండేగౌడకు అప్పణ్ణయ్యకు పరిచయం తక్కువ. చిన్ననాటినుంచీ అతడాయన్ని ఎరుగును. ఆయనంటే ఒకరకమైన భయముండేది. వొదినను ఆయన చాలా ఆదుకున్నారు. ఆయన చాలా మంచివాడన్నది అప్పణ్ణయ్యకూ తెలుసు. ఒకేసారి వొదిన, ఆయన ఇద్దరూ చనిపోవడం చూసిన అప్పణ్ణయ్య– "దేవుడు వాళ్ళని కలిపి తీసుకెళ్ళాడు. పుణ్యాత్ముల్ని ఈ ప్రపంచంలో వదలడట. మా అమ్మలాంటి వాళ్ళని, ఆ నుగ్గికెరె గుడి సేటిలంజలాంటి వాళ్ళని చాలా ఏళ్ళు బతికిస్తాడుగావును–" అనుకుంటూ వెనక్కితిరిగొచ్చాడు. వూళ్ళోకి వెళ్ళనే లేదు.

విశ్వం వడుగుకాని కుర్రాడు. వాడికి బదులు పుత్రస్థానంలో నిలబడి ప్రాచీనా వీతి వేసుకుని అప్పణ్ణయ్యే కర్మకాండ చేశాడు. తోటబావి దగ్గరకి తీసుకెళ్ళి విశ్వానికి తలముండనం చేయించి, కర్మలు జరుగుతుండగా వూరికే ఒకమూలలో కూచో బెట్టారు. అణ్ణాజోస్యులే మంత్రతంత్రాలు జరిపించారు. నంజమ్మ ఇంటిలో పాత్రలు వగైరా వున్నాయి. వైకుంఠ సమారాధన రోజు వాటినే ధారాళంగా బ్రాహ్మలకిదానం చేశారు.

## 8

వైకుంఠసమారాధన జరిగిన పదిరోజులకి కల్లేశు వచ్చాడు. అక్కమ్మ వూరికెళ్ళిన రెండోరోజే చచ్చిపోయిందట. అతడు హాసన, కౌశిక, మావిన కెరె, గోరూరు, హొళ్ళెలె ఇత్యాది స్థలాలన్నీ తిరిగి, తండ్రి కంఠీజోస్యులను చివరికెలాగో పట్టాచేసి, ఆమె కర్మలు పూర్తి చేయించాడు. ఇప్పుడు విశ్వాన్ని తీసుకెళ్ళడానికి వచ్చాడు.

తల్లి కర్మలయ్యాక విశ్వం ఏడుపు మానేశాడు. కట్టమీది గుడికెళ్ళి అయ్యగారిముందు మౌనంగా కూచుంటాడు. వాడికన్నమే సయించదు. ఆయనే బలవంతంచేసి జోలెభిక్షంలో రెండుముద్దలు తినిపించేవారు. గుడికెళ్ళకపోతే

వాడు వరసమ్మ అంగడి కెళ్ళేవాడు. "వరసమ్మా! వూళ్ళోకెళ్ళి చూస్తే మా అమ్మ వుండదూ? ఆమె చచ్చిపోయిందని వీళ్ళబద్ధాలాడుతున్నారు కదా?" - అని అడిగేవాడు. ఏం బదులు చెప్పాలో తోచక "నాకు తెల్దుబాబు తీసుకో ఈబిస్కత్తు తిను." - అని తన అంగట్లో వున్న బిస్కత్తు ఇవ్వబోతుంది.

"నాకు బిస్కత్తక్కరలేదు. మా అమ్మ ఇంట్లో లేదా చెప్పు"- అని వాడడిగేవాడు. ఒకరోజు ఎవరూ చూడకుండా ఒక్కడే వూళ్ళోకెళ్ళి, తాళం వేసిన తన ఇల్లు చూచి, వెనక్కి తిరిగొచ్చేశాడు.

మామయ్య తన్ను తీసుకెళ్ళడానికి వస్తే వాడు ధైర్యంగా "నేనురాను" అని చెప్పాడు.

"ఎందుకురా?"

"మవ్వు కొడతావు. నేనీవూళ్ళోనే బడికెళ్తాను"

"ఈవూళ్లో వాణ్ణి పోషించే దెవరు? గంగమ్మ తనదగ్గరుంచుకుంటానంది. కానీ ఆవిడ మాటేమి నమ్మకం?" లేదు బాబు మామయ్య తోటి వూరికెళ్ళు"- అయ్యగారన్నారు.

"లేదండి ఆయన గొడ్డును బాదినట్టు బాదుతాడు"- అని మామయెదటే అనేశాడు.

"ఇహమీద కొట్టను"- అని కల్లేశు హామీ ఇచ్చాడు. తతిమ్మావాళ్ళూ బలవంతం చేశారు. మరోమార్గంలేక వాడు బయల్దేరాడు. సాగనంపడానికి అయ్యగారు, బాబాయ్ - ఇద్దరూ మైలుదూరందాకా వెళ్ళారు. వాళ్ళిద్దరూ వెనక్కు తిరిగి వస్తూవుండగా వాళ్ళను పిలిచి ఆపాడు. వాళ్ళదగ్గిరికి పరుగెట్టుకొచ్చి, "మా అమ్మ చచ్చిపోయిందని మీరంతా అంటారు కదా, అది అబద్ధం కావచ్చు. వూళ్ళోవాళ్ళంతా పెడ్డువదిలి వూళ్ళోకెళ్ళాక ఆమె వస్తుంది. నాగలాపురానికి వచ్చి వన్ను తీసుకురమ్మని చెప్పండి"- అన్నాడు. "అలాగే బాబూ"- అని వాళ్ళక్కడే నుంచున్నారు. కల్లేశు వాడి చేయిపుచ్చుకుని ముందుకు నడిచాడు పదేపదే వెనక్కి తిరిగి చూస్తూ, విశ్వమతణ్ణి ఏడుపు మొహంతో ఈడుపుకొళ్ళతో వెంబడించాడు. వాళ్ళెదురుగుండా వున్న మిట్టరెక్కి కనుమరుగయ్యేదాకా వీళ్ళిద్దరూ చూస్తూ అలాగే నుంచున్నారు. 'నాగలాపురానికి పంపకముందు విశ్వమెంతచలాకీగా వుండేవాడు. ఇప్పుడు వాడి ముఖం మొద్దుబారిపోయింది. చిక్కిపోయాడు. వాడన్నట్టు ఈ మామయ్య గొడ్డును బాదినట్టు బాదుతాడుగావును ఇంతదాకా ముసలమ్మ

వుండేది. ఇకమీదట ఈ మేనత్త ఎలా చూస్తుందో? చెల్లాయి చచ్చిపోయాక కల్లేశజోస్యులు కొట్టడంమానేసి కుఱ్ఱాణ్ణి తిన్నగా చూసుకుంటాడుగావును. తల్లిలేని ఇలాంటి కుఱ్ఱాడికి దేవుడే దిక్కు.-' అని ఆలోచిస్తూ అయ్యగారూ వూరి మొహం పట్టారు.

అప్పణ్ణయ్య షెడ్డుకు వచ్చాడు. ఇంతదాకా అతడు దేన్ని గూర్చి ఆలోచించివుండలేదు. ఇప్పుడు గుర్తొచ్చింది. అతడి వంటపాత్రలన్నీ వూళ్ళో బీరేగౌడ గొడ్లచావిడి అరుగుమీదవున్న గదిలో వున్నాయి. వూరువదిలేశారు. తానొక్కడికోసం పాకవేసుకోవాలి. అదో విసుగుపని వర్షాలు పడేదాకా అందరూ పాకల్లోనే వుంటారు. తరువాత వూళ్ళోకెడతారు. అందాకా తానేదో ప్రాంతాలలో తిరిగి వస్తే సరిపోతుంది. రేపు పొద్దుటే బయల్దేరాలి- అని నిశ్చయించుకున్నాడు.

ఆ రాత్రి వడ్డిస్తూ గంగమ్మఅంది "అది వుండేదాకా నీకు నూరిపోసి, నాతో పోట్లాడమని నిన్నాడించింది. ఇప్పుడు నువ్వెందుకు వేరే వుండాలి? నాతో కూడా వుండు."

"అప్పణ్ణయ్యకు చిర్రెత్తుకొచ్చింది. "ఆ మేమీ నాకు నూరిపోయలేదు. నీవే భోసుడి ముండవు"

"కన్నతల్లినే మళ్ళీ ఇలాగంటావ్రా చండాలపు తొత్తుకొడుకా?"

"ఊఁ అంటానే ముండ. నీతోకూడవుంటే మహాపాపం. నువ్వు చస్తే పిండం కూడా పెట్టను"- అని వెంటనే తనపంచ, చొక్కా, దుప్పటి, గోనిసంచి తీసుకుని షెడ్డువదిలి బయటికి వెళ్ళిపోయాడు. బయట వెన్నెల కాస్తోంది. ఎటువెళ్ళాలో ఇంకా నిర్ణయించుకోలేదు. అయిదునిమిషాలాగి ఆలోచించాడు. ఊరాగులసీమలో ఇంచుమించు అన్నిచోట్ల వూళ్ళొదిలారు. 'నోలెబయలు' కు వెళ్ళటమే సబబు. ఇప్పుడెలాగు వెన్నెలవుంది. బెండేకెరె ఎనిమిదిమైళ్ళు. నడిచివెళ్ళి వూరిబయట దేవాలయం అరుగుమీద పడుకుంటే తెల్లారి లేచి ముందుకెళ్ళచ్చు- అని తీర్మానించుకుని దారిపట్టాడు.

సంసారంలేని అప్పణ్ణయ్య ఇలా మళ్ళీ యాయవారానికి బయల్దేరినప్పుడు, చెన్నిగరాయలు అణ్ణాజోస్యుల షెడ్డులో కూర్చుని, తన భవిష్యత్తును గూర్చి మాట్లాడుతున్నాడు. వైకుంఠ సమారాధన అయినరోజే జోస్యులు ఆయన పెళ్ళి ప్రస్తావన చేశారు. "తిపటూరికి మూడుమైళ్ళదూరంలో దేవసహళ్ళిలో ఒక కన్య వుందిట. పిల్లకు తండ్రి లేడు తల్లి చాలా కష్టాల్లో వుంది. పేదరికం. ఒక బ్రాహ్మడి

చేతిలోకూతురునుంచి కృతార్థురాలు కావాలని తల్లి కోరిక. "పీకేం ఎంత మహావయస్సు? పెళ్ళి చేసుకో కొత్తగా కట్టిన ఇల్లు వంశానుగతమైన కరణీకం దీనికన్నా ఏంకావాలి? పిల్ల లక్షణంగా వుంటుంది. ఒక్కడవే ఎన్నిరోజులని అఘోరిస్తావు.?"- జోస్యులు నచ్చజెప్పారు.

చెన్నిగరాయలకు ఆవేశం వచ్చింది. "పిల్లనిప్పించండి పెళ్ళి చేసుకుంటాను".

"తాము వెళ్ళి పిల్ల తల్లితో మాట్లాడి రావాలి. వెళ్ళేటప్పుడు పెళ్ళికూతురికి ఓ చీర పట్టుకెళ్ళాలి. పెద్దకరణంగారని వాళ్ళకి చూపెట్టుకోవాలంటే తాము కూడా మంచి శాలువా కప్పుకుని వెళ్ళాలి. మొత్తం డెభ్భై అయిదు రూపాయలయినా కావాలి. ఇవ్వు"- అన్నారు. పిల్లకావాలంటే డబ్బు ముల్లె విప్పాలి.నంజమ్మ రాత్రి బడి నడిపినందుకు వచ్చిన పారితోషికం చెన్నిగరాయల నడుంలోనే వుంది. ఆ రహస్యం తెలియకపోతే జోస్యులీ ప్రసక్తి తెచ్చేవాడు కాదు. చెన్నిగరాయలాయన ఎదరే నడుముకు కట్టిన ముల్లె విప్పి డెభ్భై అయిదు రూపాయలు లెక్కెట్టి ఇచ్చాడు. ఇంకా ఎంత మిగిలిందో జోస్యులు కళ్ళు పరిశీలించి గ్రహించకపోలేదు.

మరుపటిరోజే జోస్యులు తిపటూరికి వెళ్ళారు. ఇరవైరూపాయలకో పచ్చశాలువ కొని కప్పుకొని వెనక్కివచ్చింది చెన్నిగరాయలే చూశారు. పిల్లకు యాభై రూపాయల చీర పెట్టారనడానికింతకన్నా సాక్ష్య మేంకావాలి? రెండురోజులయ్యాక , ఒక శుభలగ్నం చూపి వీళ్ళిద్దరూ తిపటూరికి వెళ్ళారు. రాత్రి హోటల్లో భోజనమయ్యాక, ఇద్దరూ పత్రపు అరుగుమీద పడుకున్నారు. జోస్యులసలహామేరకు, చెన్నిగరాయలు తమపంచ, జమాబందికోటు, తలపాగా, చౌడుపెట్టి వుతికి తెచ్చారు. తెల్లారిలేచి వాటిని లాండ్రీలో ఇస్త్రీ తోమించిన తరువాత, చెరువుకట్టమీదికో మంగలిని తీసుకొచ్చారు. వైదిక జోస్యులు గనక మంగలి సెలూనుకు వెళ్ళరాదు. చెరువుకట్ట మీద కూర్చోబెట్టి చెన్నిగరాయల సగం నెరసిన గడ్డం, తల నున్నగా గొరిగించారు. తామే దగ్గరుండి గడ్డం పరీక్షించి, తెల్లవెంట్రుక మొదళ్ళు కూడా కనిపించకుండా వుల్టా గీయించి, ఆయన్ని స్నానం చేయమన్నారు. స్నానంచేసి, ఇస్త్రీపంచ కట్టుకుని, చొక్కా కోటు తొడుక్కుని, జమాబందికి వెళ్ళేటప్పుడు చుట్టేలా పాగా చుట్టి నుంచున్నాక జోస్యులే అన్నారు. "ఇప్పుడు హోటలు కెడదాం, రా. అక్కడ పెద్దఅద్దముందిగా దాంట్లో చూసుకుందువుగాని ఎలాగున్నావో తెలుస్తుంది".

హోటల్లోకూర్చుని, ఆర్డరిచ్చిన మసాలాదోసె వచ్చేదాకా చెన్నిగరాయలు

అద్దంలో తన్ను తానే చూసుకుంటున్నాడు. ఆయనకే ఆశ్చర్యమేసింది. ఇంత అందంగా ఇటీవలెన్నడు కోటు తలపాగా ధరించలేదు. ఆయన పెళ్ళాంముండ ఒక్కరోజూ కూడా ఇస్త్రీపంచ, చొక్కా, కోటు, తలపాగాలతో జమాబందికి పంపలేదు. మసాలాదోసె, ఇడ్లీ సాంబార్, మైసూరు పాకు అయ్యాక కాఫీ తాగారు. సాయంత్రం దాకా తమతోటే వుండి తిరిగి తీసుకురావటానికని జోస్యులెనిమిది రూపాయలకో గుర్రబ్బండి కిరాయికి మాట్లాడారు.

బేవినహళ్ళి, పదిహేను గడపలున్న కుగ్రామం, పెళ్ళికూతురు దొక్కతే బ్రాహ్మలిల్లు. కాస్తోకూస్తో పొలమున్నా, విధవ గనక పిల్ల తల్లి దాన్ని వ్యవసాయం చేయలేక, కోరుకిచ్చి, రైతు ఇచ్చింది తిని చాలనిదానికి ముష్టెత్తుకుని జీవనోపాధి చేసుకుంటోంది. ఇంటిముందు గుర్రబ్బండి వచ్చి నిలబడేసరికి ఆవిడకి చేతులు కాళ్ళు ఆడనంతటి సంభ్రమం కలిగింది. కూతురికి పధ్నాలుగేళ్ళు, ఇంకా వ్యక్తురాలు కాలేదని తల్లి చెబుతుంది. పిల్లను చూడకపోయినా చెన్నిగరాయలు సమ్మతించేవారే. మాకాక ఆ ప్రశ్నే లేదు.

"రాత్రింబగళ్ళు కరణీకపు లెక్కలు రాసిరాసి మా చెన్నిగరాయలిలా వున్నారు. ముప్ఫైరెండేళ్ళు దాటలేదింకా . సొంతమిల్లు, కరణీకం,నాలుగెకరాల పొలం వుంది. ఈకాలంలో కరణీకమొక్కటుంటే చాలు సంసారాన్ని పోషించుకోవచ్చు. మీ అమ్మాయి రోజూ భోంచేశాక పొలతోటే చేయి కడుగుతుంది. నీళ్ళతో కాదు."- జోస్యులు చెన్నిగరాయల వకాల్తా పుచ్చుకుని చెప్పారు.

పెళ్ళి నిశ్చయమయింది. ఆలస్యమెందుకని జోస్యులు తమతోపాటు తెచ్చిన తెల్లకాగితంమీద లగ్నపత్రికకూడా వ్రాసిపెట్టారు. జాతకాలు సరిపోతున్నాయి. వైశాఖంలో ఎలాగూ మంచి లగ్నముంది. చింతపండు పులుసు, చారులన్నంచేసి పెళ్ళిచేసినా మాకాక్షేపణలేదు. అనగానే పిల్ల తల్లి నెత్తిమీద బరువు దించినట్టు సంతోషించింది. ఉన్న దాంట్లోనే వేతిపాయసం వండి వడ్డించింది. తాంబూలం పుచ్చుకుని గుర్రబ్బండెక్కి తిపటూరికి వచ్చేసరికి వూరివేపు వెళ్ళే బస్సు సిద్ధంగా వున్నా ఇద్దరిలో ఎవరు కూడా వెళ్ళాలని తొందరపడటంలేదు. హొటలువాళ్ళు బంగాళాదుంపలు, వుల్లిపాయలు వేసి పులుసు కమ్మగా చేస్తారు. రేపు తెల్లారి వెడదాం. జోస్యులు బట్టలదుకాణానికెళ్ళి ఒక పంచలచాపు, ఒకచీర కొన్నారు., ఆయన డబ్బు పట్రా లేదు. చెన్నిగరాయలే ఇరవైరెండురూపాయలు అంగడివాడికిచ్చారు.

చెన్నిగరాయల పెళ్ళివార్త వూళ్ళో అందరికీ తెలిసింది. " ఆ అయ్యకి పుట్టిన బుద్ధి! నేమవాలి.- అతగాడు పెళ్ళాన్నేలుకోగల్డా? "- అనినరసి ఎద్దేవాచేసింది. "ఆ యమ్మగోరెట్టాగో వేగింది గాని ఇతగాణ్ణి కట్టుకుని బూమ్మిద ఎవళ్ళేగ్గల్రు?" అని రాగం తీసింది. రేవణ్ణశెట్టి ఒక రోజుగుపించి "కరణంగారూ మీరు మంచిపనిచేశారు. పెళ్ళిచేసుకోండి లేకపోతే వండి వార్చేదెవరు?- అనిపురెక్కించారు. తల్లి గంగమ్మ మాత్రం మీవిషయంలో ఆసక్తి చూపలేదు. "ఏముండ వచ్చి నాకు చేసేదేముంది?" ఎవరూ నా సేవ చేయరు"- అనేసింది.

వారంరోజులకి చైత్రం గడిచి వైశాఖం వచ్చింది. ఈ నెలలో పెళ్ళికావాలి. మొదటి పెళ్ళాంవే దుద్దులు, ముక్కుపుడకా వున్నాయి. బూడిదలో వెదికి తీసిన మాంగల్యపు బంగారముంది. దీనిమీద వందరూపాయలు చేతిలో వుంటే చాలు. ఇంట్లోవున్న ఓ ఆవును వందరూపాయలకమ్మి అదికూడా సమకూర్చుకున్నారు. కాని తరువాత మాటాపలుక్కి పెళ్ళికూతురు వాళ్ళెవళ్ళూరాలేదు. పదిపన్నెండు రోజుల్లో తనపుట్టింటి వేపు బంధువు సిద్దవళ్ళి వెంకటరామయ్య అనేవారిని పంపిస్తానని పిల్లతల్లి చెప్పింది. కానీ ఎవళ్ళూ రాలేదు. పెళ్ళి ఆరే రోజులుంది. చెన్నిగరాయలుండబట్టలేక పోయాడు. జోస్యుల నడిగితే "ఏం సమాచారమో ఏమో? నాకు తీరుబడి లేదు. నువ్వే వెళ్ళిరా" అన్నారు. ఈయనే ఒకరోజు తిపటూరికెళ్ళి, వెనకటిలాగే క్షవరం చేయించుకుని, ఇస్త్రీ గుడ్డలు వేసుకుని బేవినహళ్ళికి వెడితే ఇంట్లో ఒక ముసలాయనేమో వుండటానికి వున్నాడు. తమ పరిచయంతామే చేసుకుని చెన్నిగరాయలు వారితోటే ఏదో మాట్లాబోతుండగా లోపలినించీ వచ్చిన పిల్లతల్లి రప రప అనేసింది. "ఏ వరుడూ దొరక్కపోతే మాపిల్లని ఏనూతిలోనో తోసేస్తాను. మీలాంటి వాళ్ళ కివ్వను".

కరణం చెన్నిగయారలకేమీ బోధపడక గుడ్లప్పగించి చూస్తూ కూర్చున్నాడు. ఆవిడే మాట్లాడింది! " ఆ జోష్యుల ముండాకొడుకు దూరపు చుట్టమని నమ్మితే వరుణ్ణి చూపెడతానని నా నుంచీ ఇరవైరూపాయలు లాగి మీలాంటి వామర్ధా ముసలాణ్ణి చూపి మోసం చేశాడు. నాకెవరో పుణ్యాత్ముడు ముందుగానే అన్నీ చెప్పాడు. లేకపోతే ఎరక్కగోతిలో దిగేదాన్ని."

"న...న...నా.....తప్పేమీ చె......చె.....చెప్పండి-" అని ఆయన ధైర్యం తెచ్చుకుని అడిగారు.

"ఏం తప్పా? మొదటి పెళ్ళాన్నెలా ఏలుకున్నారు మీరు? నిప్పెళ్ళు కుట్టి

పొట్టపోసుకోలేదా ఆవిడ? కరణీకం లెక్కలావిడ రాసేసరికి మీ పరువు నిలిచిందట. మాపిల్ల కవేమీరావు. మీకు వూళ్ళో పొలమెక్కడుంది? ఇల్లు కూడా మొదటి పెళ్ళాం కట్టించిందేనటగా? ఆవిడపేరిట వున్న ఇల్లు ఆవిడ కొడుక్కి వెడుతుంది. మీకున్న దొక్కడే కొడుకన్నారుగా. నిరుడు పెళ్ళయిన అమ్మాయి, వదుగైన అబ్బాయి చచ్చిపోలేదూ?"

"ఎ ఎవరు చె చెప్పారమ్మా ఇదంతా ?"

"ఎవరు చెప్పారంటారా? మీ వూరాయనే ఒక జంగమయ్య చెప్పారు. ముసలాయన మా ఇంటికే వచ్చారు. అది నిజమా అబద్ధమా చెప్పండి. మీ వయస్సు ముప్ఫైరెండా ? నిజం చెప్పండి."

"ఒరి వీడమ్మని. . . ." అన్నప్పుడు కరణంగారికి వెంటనే మాదేవయ్యగారు గుర్తొచ్చి పట్టరాని కోపం వచ్చింది.

"మీ నోటంట వచ్చేమాట చూడండి. మొదటి పెళ్ళాంతో ఇలాగే మాట్లాడేవారట. మీలాంటి వారికో గ్లాసెడు గంగోదకం కూడా ఇవ్వరాదు లేచెళ్ళండి ఇక్కణ్ణించి".

చెన్నిగరాయలు లేచి బయటకి వచ్చారు. ఈ వూళ్ళో మరెక్కడా కూర్చుందామన్నా భయమేసి, తిన్నగా తిపటూరికి వచ్చారు. "ఈమాదేవయ్య, వాడమ్మ . . .వాడికేమొచ్చింది, ఈ వూరికొచ్చి ఇలాతంటాలు పెట్టడానికి. వెయ్యబద్దాలు చెప్పి ఒక పెళ్ళి చేయమన్నారు. ఈముసలాడు అయ్యే పెళ్ళికి విఘ్నం చేశాడే. వీడి దుంపతెగా" అని తిట్టుకుంటూ హోటలుకెళ్ళి భోజనానికి కూర్చున్నారు. వెంటనే వూరికెళ్ళాలని బుద్ధి పుట్టలేదు. ఆవును అమ్మి పెళ్ళికని వుంచుకున్న డబ్బులో తొంభైరూపాయలు మిగిలాయి. సుఖంగా ఇరవైరోజులు తిపటూరిలోనే వుండిపోయారు. దివాను సత్రవు అరుగు వుండనే వుంది. వూరి నిండా హోటళ్ళున్నాయి.

చేతిలో డబ్బు కరిగిపోయేసరికి ఇంటికెళ్ళారు. ఇంతలో ముంగారు వర్షాలు పడ్డాయి. జనమంతా పెడ్లు వదిలి వూళ్ళో కెళ్ళారు. తామెక్కడికెళ్ళాలో తెలియలేదు. తిన్నగా తల్లివుండే హనుమంతరాయని గుడికెళ్ళారు. గంగమ్మ అంది. "ఏ కరణీకం పోయింది గదరా బుద్ధిలేని చవటపీనుగ లంజాకొడుకా".

"ఎక్కడి కెళ్ళిందమ్మా?"

"ఏ పెళ్ళాం చచ్చిపోయినప్పటినుంచి లెక్కల్రాయలేదు. ఇప్పటికి రెండు

కంతులయినా మునసబుగారికి వసూలి పట్టి ఇవ్వలేదు. రెవెన్యూ ఇన్స్పెక్టరు భోగట్టా తెలుసుకుందామనివస్తే నువ్వు గెరుహాజరు. మునసబు శివేగౌడ, శివలింగ, ఇద్దరూ తాసిల్దారు దొరగారిని చూశారట. రెవెన్యూ ఇన్స్పెక్టరు పోలీసోళ్ళనుతెచ్చి, గుండేగౌడ ఇంటి తాళం బద్దలుకొట్టి, పుస్తకాలన్నీ శివలింగడికిచ్చేశారు. ఇప్పుడు వాడే కరణం".

చెన్నిగరాయలు ప్రేతంలా గుడ్లప్పచెప్పి కూర్చుండిపోయాడు.

"నే నిప్పుడొచ్చాను. నా కరణీకం నాకిప్పించండి దొరగారు అని అడుక్కో వెళ్ళు"

"ఎవర్నడగాలి? ఇన్నిరోజులెక్కడి కెళ్ళావంటే ఏం చెప్పాలి? అదీకాక లెక్కలు రాసేదెవరు? ఈ ధాన్యపులెక్కలున్నాయే ఇవి మరీ చికాకు. ఏని తల్లి సిగతరగా. . . ." ఆయనకో వుపాయం తట్టింది. లేచి శివలింగడి ఇంటికెళ్ళారు. కరణం శివలింగడికి పాతలెక్కలయితే తెలుసు. కొత్త ధాన్యపు లెక్కలతడికి కష్టమే. కంబనకెరె కరణం వద్ద నేర్చుకుని వచ్చి, అతని సలహాలమేరకు వ్రాస్తూ కూర్చున్నాడు.

"ఏమయ్యా వొచ్చావ్?" కరణీకపు దర్పంతో అడిగాడు

"శివలింగే గౌడగారూ? నాకరణీకం మొదట మీరు చూసేవారు ఇప్పుడూ చూడండి. సంవత్సరానికోసారి పాటిగెలో ఏమిస్తారో గట్టిగా ఓమాట చెప్పండి."

"కరణీకం నువ్వు నాకివ్వలే దెల్లయ్యా, గవుర్మెంటిచ్చింది."

"అవులే ఏమీ ఇవ్వరా?"

"ఓ వెంట్రుక ముక్క కూడా ఇవ్వను. లెవెడతావా వెట్టిని పిలిచి మెడ పట్టి గెంటించమన్నావా?"

ఆయనకవమానమేసింది. "సీ అమ్మని . . . ." అని తిట్టాలని నోటిదాకావచ్చింది. కాని శివలింగ వెట్టిని పిలిచి అన్నంతపని చేయించగలడని భయపడి వూరుకున్నాడు. కోపంతో ఒళ్ళు మండులోంది.

దారిలోనే మాదేవయ్యగుడి. అయ్యగా రరుగుమీద కూర్చుని పొగాకు నలుపుతున్నారు. ఆయన్ను చూడగానే చెన్నిగరాయలకోపం మరింత విజృంభించింది. తానూ అరుగుమీద వచ్చి కూర్చుని అడిగాడు "అయ్యగారూ! మీరు పితివిజాయితి వున్న వాళ్ళనుకున్నాను. వెనకాల చాడీలు చెప్పడం ఎప్పటిమంచి నేర్చుకున్నారు?"

"మీ పెళ్ళి నిలిచిపోయిందని ఇలా అంటున్నారా?"

ఆయనే తొణక్కుండా శాంతంగా అడిగిన పద్ధతి చూసి మరింత కోపం వచ్చింది. "ఊఁ"- అన్నారు.

"సొంతంగా లెక్కలు రాసి కరణీకం చేస్తారా? పంటవొస్తుందనటానికి పొలముందా? ఇల్లు నంజమ్మ పేరిట వుంది. అది ఎలాగు విశ్వానికి చెందుతుంది. మీకు వయస్సెంత? ఆ చిన్న పిల్లని ఎలా పోషిస్తారు?"

"వాలిగిళ్ళల్లో ముష్టెత్తి తెచ్చి పోషించే వాణ్ణండి"

"నంజమ్మగారున్నప్పుడు పోషించింది మేమంతా చూడలేదనా? అందరూ నంజమ్మలా వుండరు. మీకొత్తపెళ్ళాం వూరవతల వున్న అంగడి నరసమ్మలా తయారయితే ఏం చేస్తారు?"

చెన్నిగరాయలకేమి బదులు చెప్పాలో తెలియలేదు. కాని కోపం మాత్రం తగ్గలేదు. అయ్యగారే అన్నారు. మిమ్మల్ని మీరర్థం చేసుకోండి. మీకు చేతకానిది మీకెందుకు చెప్పండి? వూరికే సన్యాసిలా వుండిపోండి. ఏమయినా చేయగలిగితే విశ్వానికి చేయండి. ఇప్పుడేమి శివలింగేగౌడగారింటి కెళ్ళొస్తున్నారా? ఏమన్నారాయన?"

"వాడమ్మని . . . పోటిగె డబ్బేమీ ఇవ్వనన్నాడు"

అయ్యగారు తరువాత ఏమీ అడగలేదు. మునసబు శివేగౌడకు దాదాపు తమవయస్సే. శివలింగేగౌడ అతనికంటే పదేళ్ళు చిన్నవాడు కావచ్చు. వాళ్ళిద్దరికీ ఆయుష్షు తగ్గనే తగ్గదేమో! ప్రపంచపు తీరే ఇలా వుంటుందేమో! –అని ఆయన ఆలోచించారు. చెన్నిగరాయలు అయ్యగారి సంచినుంచీ ఆకులు వక్క పొగాకు తీసి నములుతూ తల్లి ఇంటికి వెళ్ళిపోయారు.

చెన్నిగరాయ లాతరువాత వారం రోజు లూళ్ళోవున్నారు. ఇంతలో మిగిలిన మరో ఆవును, ఇంట్లో వున్న పాత్రలు గీత్రలన్నీ అమ్మేశారు. నంజమ్మ దుద్దులు ముక్కుపుడక కాశింబడ్డికి అమ్మేశారు. తరువాత రెణ్ణెల్లు వూళ్ళోనే వుండలేదు.

జీవితంలో ఏముంది? మాదేవయ్యలా తామూ సన్యాసిలా వుండాలని నిశ్చయించిన చెన్నిగరాయలు వూరూరూ తిరిగి మాలెకల్లు, తిరుపతికి వెళ్ళారు. అరసికెరె మంచీ తెచ్చిన కావి పంచకట్టుకుని చొక్కా వేసుకుని తిమ్మప్ప ముందు సాష్టాంగపడి మనస్సులోనే సన్యాసం స్వీకరించారు. సాయంత్రానికి ఆకలేసింది. కొండమీద సన్యాసులకు భిక్షంపెట్టే సంసారులు లేరు. కొండదిగి ఒక పల్లెకెళ్ళి

బిచ్చమెత్తి కడుపు నింపుకున్నాడు. పడుకోవడాని కనుమతి అడిగిన ఇంటి యజమాని గౌడ, ఆకులు వక్కలు పొగాకు ఇచ్చాడు. సన్యాసం మంచిదే అనిపించింది.

కాని రెణ్ణెల్లల్లో ఆ జీవితమంటే విసుగెత్తింది. మేటికురికె, కణకట్టె, హొళియూరు, బూదాళు ప్రాంతాల్లో రెణ్ణెల్లు తిరిగి, వూరూర బిచ్చమెత్తి తినేసరికి ఆయన తలప్రాణం తోకకు వచ్చింది. రోజూ ఒక వూరికెళ్ళాలి. సన్యాసం స్వీకరించాక, తాను బ్రాహ్మడన్న భావం, మడి, ఆచారం వదిలేసి అందరింట్లోను తినేవాడు. కొందరు "కూలినాలి చేసి తినడానికేం?" అని ముఖంమీదే అడిగేవారు.

విసుగెత్తి ఆయన ఇంటికెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. కానీ వూళ్ళో ఎవరున్నారు? ఏముంది? పెళ్ళామనిపించుకున్న ఆ 'ముండ' వుంటే బాగుండేది. ఎవళ్ళు లేకపోయినా, మాఅమ్మ నన్ను వదిలిపెట్టదు. అని ఆలోచించి, చెన్నిగరాయలు, దారి అడుక్కుంటూ హులుకురికె ద్వారా తిపుటూరికి వచ్చి, అక్కణ్ణించి వూరు చేరుకున్నారు.

గంగమ్మ హనుమంతరాయని గుడిలోనే వుంది. ఇప్పుడావిడ ఒకత్తే పల్లెటూళ్ళకు వెళ్ళాలి. ఆవిడ ముష్టెత్తగలదే గాని ముష్టెత్తిన ధాన్యం మోసుకుని రాలేదు. తనకు నచ్చిన కొడుకు అప్పణ్ణయ్య తన దగ్గిరికి మళ్ళీ వస్తాడన్న నమ్మకం లేదు. నా అదృష్టమిలాగేడ్చింది. శని దశ పట్టుకుంది. అని మనసులోనే కుంగిపోతున్న ఆవిడ గుడిముందరో రోజు తన పెద్దకొడుకు కరణం చెన్నిగరాయలు సన్యాసివేషంలో వచ్చి నిలబడ్డాడు. మాసిపోయిన కావిపంచ, చెమట కట్టుకట్టిన కావిచొక్కా, మాదేవయ్యగారిలాంటిదే వేషం. మాదేవయ్యగారు తల గడ్డం శుభ్రంగా క్షవరం చేయించుకునేవారు.కాని కొడుకు తలపీమలా పెరిగివుంది. గడ్డం నువ్వులు బియ్యం కలిపినట్టు పొదలా వుంది. కాసేపావిడ గుర్తే పట్టలేదు. తరవాత ఆవిడే "ఇదేమిట్రా లంజాకొడుకా ఇలాగయ్యావు?"- అంది. ఆప్యాయత పొంగి కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఇంకే ముందమ్మా బతుకులో? ఎవరున్నారు నాకు? అంచేత ఏమీ అక్కరలేదని సన్యాసం తీసుకున్నాను"

"ఛూ ముండాకొడుకా! వదిలేశాననరా. నేనేం చచ్చానా? ఎవళ్ళయినా చూస్తారు. లోపల్రా ఆ కావిగుడ్డలు తీసిపారేసి వేరేపంచకట్టుకో. రేపు రుద్రణ్ణను పిలిచి క్షవరం చేయించుకుందువుగాని".

చెన్నిగరాయలు సన్యాసం త్యజించారు.

తల్లి కొడుకు ఒకటయ్యారు. ఈయనకి అప్పణ్ణయ్యలాగా పెద్దబరువులు మోసే అలవాటు లేదు. కానీ తల్లికో అండ దొరికింది. ఆవిడ పల్లె మీదికెళ్ళి ఇంటింటా ముష్టెత్తుతూవుంటే ఈయన ఎవరింటి పంచటరుగుమీదో కూర్చుని పొగాకులో తాంబూల చర్వణం చేస్తూ దాని రసం నోటినిండా వూరితే కలిగే ఆనందాన్ననుభవించేవాడు

ఎలాగూ నంజమ్మ కట్టిన ఇల్లుంది. గుడిలో వుంటే రోజూ పూజచేయాలి, ప్రాకారమంతా వూడ్చికడిగి శుభ్రంగా వుంచాలి. అంచేత తల్లికొడుకు ఇద్దరు కలిసి, కొత్త ఇంటికి ఎర్రమట్టి మెత్తువేయించి, తలుపుకి గొళ్ళెం పెట్టించారు. ఒకరోజు గంగమ్మే కొత్త ఇంట్లో పాలుపొంగించింది. పురోహితద్వయాన్ని పిలిచి "కోడలుపోయి ఏడాది కాలేదు. కొత్త ఇంటి గృహప్రవేశం చేయడానికెలాగూ వీల్లేదు. ఇంతే చేయగలను బీదముండని"- అని పాయసం వండి, తలా రెండురూపాయలు దక్షిణ ఇచ్చి నమస్కారం చేసింది.

ఇంతదాకా నంజమ్మ వుంటున్న గుండేగౌడ ఇంట్లో ఎవరూ చేరలేదు. రామసంద్రంలో వున్న కురుబరహట్ట ముద్దయ్య గుండేగౌడ చుట్టం. తానందులో వుంటానని గుండేగౌడ కొడుక్కు చెప్పి తాళం చెవి తెచ్చుకున్నాడు. కానీ వరసగా మూరి ముగ్గురిని ఆహుతి తీసుకున్న ఆ ఇంటికి రావటానికి శంకించి, సరైన పురోహితునితో అష్టదిగ్బంధనం చేయించేదాకా సగం పడిపోయిన తన ఇంట్లోనే వుండాలని నిశ్చయించి, ఆ ఇంటికి తాళం వేసి వుంచాడు.

# 16వ అధ్యాయం

మాదేవయ్యగారీ వూరు వచ్చి నల్లభై అయిదేళ్ళయింది. ఎవరి పరిచయమూ అక్కరలేదు. ఎవరి స్నేహమూ వద్దు - అని ఆయన తన జీవితమిక్కడ ప్రారంభించారు. కానీ రోజులు గడిచే కొద్ది పది మందితోటి పరిచయమేర్పడ్డది. చుట్టుపక్కల ఎన్నో పల్లెటూళ్ళు కూడా తెలుసు. ఎవరి అంటూ సొంటూ లేకండా, ఎవరి గొడవకీ వెళ్ళకుండా వుండే ఆయన కీ వుళ్ళో విసుగొచ్చే కారణం లేదు. కానీ ఒకసారి విసుగొచ్చి, వూరొదిలి కాశీ వెళ్ళిపోయారు. ఎంత పుణ్యక్షేత్రమయినా అక్కడ వుండలేక మళ్ళీ ఈ వూరికి వచ్చారు. మళ్ళీ ఎందుకు తిరిగొచ్చాను? అక్కడ లేని దీ వూళ్ళో ఏముంది? అని ఆయన తనలో తాను కొన్ని సార్లాలోచించారు. ఆ గాలి పడలేదన్నది నిజమయినా, ఆ ఒక్క కారణంచేతే ఆయన కాశీ వదిలిరాలేదు. అక్కడి భాష హిందీ ఆయనకు వచ్చు. జంగమవాడి మఠంలో భోజన సదుపాయం బాగానే వుంది. ఇరవైనాలుగు గంటలు భజన చేయాలన్నా భజన వినాలన్నా కాశీకన్నా అనుకూలమైన దేదీ లేదు. కానీ మళ్ళీ రామసంద్రానికి వెళ్ళాలన్న బుద్ధి పుట్టింది. కొన్నేళ్ళుగా వున్న ఆ వూరి గుడి, వీధి, చెరువు, కట్ట, చుట్టూ పల్లెలు ఆయన మనస్సును ఆకర్షించాయో, లేదా ఆ వూళ్ళోని ప్రజలు ఆయన హృదయాన్ని ఆక్రమించారో, ఆయనకే స్పష్టంగా తెలియదు.

వచ్చాక ఈ వూరికే అంకితమైపోయారు. చుట్టుపక్కల వూళ్ళల్లో భిక్ష చేయడం, ఎవరో కొందరికి తమ చేతనయిన సహాయం చేయటం, భజన, వీటితోటే కాలక్షేపమయ్యేది. కాని ఇటీవల పొద్దుగడవటమే కష్టమవుతోంది. ఇక్కడ తన కెవరూ లేరన్న భావం ఆయన్నాక్రమించింది. ఎంతయినా తానొక సన్యాసి. మొదట్లో ఎవరున్నారు? ఇప్పుడెవరుండాలి? అని ప్రశ్నించుకున్నా మనస్సుకు ఒంటరితనం మాత్రం పోలేదు. ఏ అంటూ, సొంటూ లేని ఈ వూళ్ళోనే వుండాలన్నదేమి? అన్న ఆలోచన కూడా ఒకటి రెండు సార్లు

కలిగింది. కొన్ని రోజాలుగా అది మరింత బలపడింది. ఈ వూరక్కరలేదు. తిపటూరికో, తుమకూరికో మరెక్కడికో వెళ్ళాలి - అన్న భావం మనస్సులో కొంచెమించుమించుగా ధ్రువపడింది.

ఇలా ఆలోచిస్తుండగా ఒకరోజు అప్పణ్ణయ్య వూరికి వచ్చాడు. అతనికి ఈ వూళ్ళో ఎవళ్ళూ లేరు. వాదిన పోయాక ఈ వూరే అక్కరలేదనిపించి, అంచేతే ఇన్ని రోజాలు ఒంటరిగా 'నాలెబయల్లో' యాచిస్తూ కాలం గడిపాడు. వస్తూ వస్తూ ఒకటిన్నర బస్తా బియ్యం, ఇరవైసేర్ల కందిపప్పు, రెండువీశలు మెరపకాయలు, మసాలా పొళ్ళు తెచ్చాడు. అన్నీ బీరేగౌడ గొడ్లచావడి అరుగుమీద వున్న గదిలో వుంచుకుని, రోజంతా తానొకడే వండుకుంటాడు. వూళ్ళో అయ్యగారు మినహాయించి మరెవళ్ళూ ఆప్తులు లేరు. భోంచేశాక కాలక్షేపానికని వచ్చి గుళ్ళో కూర్చుంటాడు. ఏదయినా మాట్లాడితే చివరికది వదినమీదికే తిరిగేది. "ఆ నాకొడు కామెను విసిగించి ప్రాణాలు తోడేవాడండీ" అని అతడు పదేపదే అనేవాడు.

ఒకరోజు అయ్యగారన్నారు. "వెనకటికి జరిగిందేదో జరిగింది ఇప్పటికయినా నువ్వు, మీ అన్న, అమ్మ అంతా కలిసి వుండండి."

"థూ! దాని కొంపతగలడ. ఆ ముండతోటి వుండగలనా? నేను మగాణ్ణండీ. నాలెబయల్లో ఒకటిన్నర బస్తా బియ్యం సంపాదించుకుని వచ్చాను. చూద్దురు గాని రండి."

అయ్యగారూరుకున్నారు. అప్పణ్ణయ్య ఇరవైరోజు లూళ్ళో వున్నాడు. ఒకరోజయినా, అమ్మను గాని, అన్ననుగాని చూడాలని వెళ్ళలేదు. వాళ్ల వూసెత్తితే మండిపడేవాడు. అతడి కావూరే విసుగెత్తిపోయింది. వూరికే కూర్చుని ఏం చేయాలి? చుట్టుపక్కల వూళ్ళల్లో తల్లీ అన్నా ముష్టెత్తుతున్నారు. మళ్ళీతానూ వెడితే జనం ఇద్దరికీ బిచ్చం పెట్టరు. ఒకరోజు బీరేగౌడ అరుగుమీది గదికి తాళంవేసి నాలెబయలు వేపు మళ్ళీ బయల్దేరాడు.

అప్పణ్ణ వెళ్ళిపోయిన రాత్రి అయ్యగారికి నంజమ్మ సంసారమే పదే పదే జ్ఞాపకం వస్తోంది. చిన్నతనంలో కోడలుగా వూరికి రావటం, అత్తపోరు, ఆమె పిల్లలు, వేరే కాపురం, పిల్లల్ని పెంచి పెద్దచేసి, కొడుక్కు వడుగు, కూతురిపెళ్లి చేసిందీ, పిల్లలిద్దరి చావు, చివరికామే చనిపోవటం - ఇవన్నీ ఒక్కసారి నాటకంలో జరిగినట్టు గుర్తొచ్చాయి. ఆ సంసారంతో ఎంతవరకూ ఏకీభావం పొందారో

ఇప్పుడర్థమయింది. ఆమె సంసారమిలాగయింది.చెదిరిన గూడు! అని నిట్టూర్చినపుడు మనస్సు ఆ సంసారంలో చివరిమొలకగా నిలిచిన విశ్వం గుర్తొచ్చాడు. వాడాయన తొడమీద కూర్చుని, ఆయన భిక్షన్నం తిని, ఆయన హృదయానికి చేరువయ్యాడు. మంచి చలాకీ కుర్రాడు. ధైర్యంలో పులేపులి. వాడేవాడు. ముందుకు చదివితే బుద్ధిమంతుడవుతాడు. వాణ్ణి చదివించాలని నంజమ్మ కలలు కన్నది. మేనమామ ఇంట్లో ఎలా చదువుతున్నాడో ఏమో! అల్లరి కాస్త అణిగి వుంటే వుండవచ్చు. అత్తమామలకి పిల్లలు లేరు. అయినా వాళ్ళేలా చూస్తున్నారో!

తామీ వూరు వదిలే లోపుగా నాగలాపురాని కోసారివెళ్లి కుర్రాణ్ణి చూచిరావాలి అని ఆయన నిశ్చయించుకున్నారు.

## 2

రెణ్ణాలయ్యాక మధ్యాహ్నం భోంచేసి ఆయన గుడి అరుగు మీద కూర్చుని పొగాకు నలుపుతున్నారు. నరసి ఆయన్ని వెదుక్కుంటూ వచ్చి అరుగుమీద కూర్చుంది. ఆవిడ ముఖంలో ఏదో బాధ కనిపిస్తోంది.

"ఏమమ్మా ఏడెనిమిది రోజులుగా వూళ్లోలేవు. ఎక్కడికెళ్ళావు?"

"మా చుట్టాలింటికి సొంతి గ్రామానికెళ్ళానయ్యగారూ."

"ఎందుకలా వున్నావు?"

"ఏం చెప్పను? నిన్న బండ్లో నాగలాపురం చెరువు కట్టమీదొస్తున్నాను. విస్సన్న దారిలో అవుపడ్డాడు. అణ్ణి చూచి ఏడుపొచ్చిందనుకోండి."

అయ్యగారికి వెంటనే ఆస్థకలిగింది: "కుర్రాడెలావున్నాడు?"

"ఎట్టాగున్నాడా?" అరటిస్తంభంలాగున్న కుర్రోడు చీపురుపుల్లలా తయారయ్యాడు. చెరువులో నీళ్ళకని బిందె పట్టుకెడుతున్నాడు. బండ్లో నన్ను చూసి ఆడే గుర్తు పట్టాడు. నేనాణ్ణి గుర్తేపట్టలా. అట్టాగయిండు. బండాపి దిగాను. ఎట్టాగున్నావు బాబూ అన్నాను. వూరికే ఏడవటం మొదలెట్టాడు. ఏంజేసినా నిలవలే. నమ్మూరికి తీసుకెడతావా? అని అడిగాడు. నేనెట్టాగ తీసుకురాను మీరే సెప్పండి. ఇంకా చాలా ఏడ్చాడు. ఆలస్యమయితే ఇంట్లో అత్త చంపేస్తదని నీళ్ళు నింపుకుని ఎల్లిపోనాడు. అంతచిన్న కుర్రోడికిబిందిచ్చి పంపిందే ఆ కటికిముండ! ఏమంటారు?"

"నువ్వొళ్ళొ కెళ్ళి కల్లేశు, జోస్యులన్నడక్కపోయావా?"

"కుర్రోడెల్లిపోనాడు. ఆడే బండి కాస్తాపన్నాను. ఎవ్రో ఆడది చీరవుతుకుతోంది. ఆమె కాడికెల్లి "మాది రామసంద్రం. ఈ కుర్రోడిది మా వూరు. ఈణ్ణి కల్లేశప్పగారెట్టా సూస్తారని అడిగాను. ఆవిడంతా చెప్పుగొచ్చింది. కల్లేశప్ప ఇంటికాడే ఆళ్ళిల్లట. ఇంటి చాకిరీ అంతా ఆకుర్రోడు చెయ్యాలట. దానికి బియ్యపు రొట్టె, ఈడికి రాగిరొట్టె.... ఇస్తే ఇస్తది. మానేమాన్తది. దాని చీర ఈడే వుతకాలట! గరిటుచ్చుకుని నెత్తిమీద బాదేస్తదట!"

"కల్లేశు, జోస్యులూరుకుంటున్నారా?"

"ఆ అయ్య తలతిక్కమడిసి. అన్నీ సరిగ్గా వుంటే సంతకు తీసుకెళ్ళి మిఠాయి గిఠాయి కొనిపెడతాడు. కోపమొస్తే చింతకర్రుచ్చుకుని బాదుతాడట! లోపల ఆడదాడే నాటకం మగాడికేమెరిక?"

అయ్యగారు మరేమీ అడగలేదు. తల్లిలేని కుర్రాడు విశ్వం సుఖంగా వున్నాడని ఆయన భ్రమించలేదు. కాని ఇంత ప్రాణం తోడేస్తున్నారని ఆయన వూహించలేదు. కల్లేశు భార్య గయ్యాళి అని ఆయన చాలా విన్నాడు. చెల్లాయి కొడుకు విషయంలో మేనమామ ఇలా ప్రవర్తించకూడదు. అతడి బుద్ధి తిన్నగా వుంటేగా ప్రవర్తన తిన్నగా వుండటానికి? అని ఆయన పెట్టుకున్నాడు. నరసికూడా తనలో తానాలోచిస్తూ చివరి కడిగింది "అయ్యగోరు! నేనోమాట చెబుతావింటారా?"

"ఏం చెప్పు."

"దేముడు నాకు పిల్లలివ్వలే. ఆ కుర్రోణ్ణి తెచ్చి నాకివ్వండి. కొడుకని పెంచుకుంటాను. నా అంగడి, నా డబ్బు అన్నీ ఆడిదే. పాణంపోయే కుర్రోడు నా తొడమీద పడుకుని బతికాడు. ఆడి తల్లే "నరసవ్వా! ఈడు నా కొడుకు గాడు. నీకొడుకు, నువ్వే పెంచుకో" అని ఆ రోజంది. మీరు నాగలాపురమెల్లి తీసుకురండి. మల్లెపువ్వులాగా నలక్కుండా పెంచుతాను."

అయ్యగారాలోచించారు. ఆ రాత్రంతా ఆయనకి నిద్రలేదు. నంజమ్మే గుర్తొస్తోంది. ఆవిడకి గడ్డలు కట్టిన రాత్రి, వద్దన్నా మనస్సులో వున్నదంతా చెప్పేసింది. "పార్వతి, రామణ్ణ చచ్చిపోయినప్పుడు గోపి కథ మీరు చెప్పారు. కొడుకు పోతే ప్రాణాలివ్వటానికి గోపి భయపడి గట్టునే నుంచుంది. అదే రోజు రాత్రి నేను శ్మశానంలోని బావిలో దూకడానికెళ్లాను. ధైర్యంగా నీళ్ళల్లో దూకేదాన్నే!

విశ్వం గతేమిటని ఆలోచించి వెనక్కి వచ్చాను. ఇప్పుడు నేనే వెళ్ళిపోతున్నాను. విశ్వానికెవరు గతి? అక్కమ్మ ఇంత వండి పడేస్తుంది. మా అన్నయ్య మీద నాకు నమ్మకం లేదు. వాడి తిండి కాదు ప్రధానం. వాడు ప్రయోజకుడు కావాలి కదా?"

ఆవిడ చెప్పిందంతా గుర్తొచ్చింది. అక్కమ్మ బతికే వుంటే వాడి అన్నపానాదులకి లోటుండేది కాదు. ఇంట్లో అత్త అలా ఏడిపించుక తినేదికాదు. మనవరాలితో పాటు ఆవిడాపోయింది. 'కుర్రాణ్ణి మేనమామతో కూడా పంపినప్పుడు ఈ ఆలోచన రానేలేదు. నా తల్లో బుద్ధే లేదు' అని ఆయన తన్ను తాను నిందించుకున్నాడు. ఇప్పుడేం చేయాలి? నరిసి అడిగినట్టుగా వాణ్ణి తెచ్చిదాని కప్పజెప్పాలా? నరిసి వద్ద పది పదిహేనువేల రూపాయలున్నాయట. అంగడి నడుస్తోంది. ప్రీతిగా పెంచుకోగలదు. ఆ మేనమామ ఇంటి కన్నా ఇదే నయం - అని ఆయన మనస్సు బోధించింది.

కాని నంజమ్మ బతికి వుంటే నరసమ్మ దగ్గిర వదిలేదా? అది రాత్రి కొకణ్ణి చేరదీస్తుంది. "కుర్రాడికి తిండి ప్రధానం కాదు. వాడు ప్రయోజకుడు కావాలి గదా?" అన్న నంజమ్మ మాటలు గుర్తొచ్చాయి. కన్నతండ్రి యోగ్యుడు కాడు. బాబాయ్‌కి తెలివెక్కడుంది? బామ్మ గంగమ్మ - బుద్ధిమంతురాలయితే ఈ ఇంటి కీ గతిపట్టేదా? ఇప్పుడా కుర్రాడిగతి ఏమి?

ఏడెనిమిది రోజులాయన్ని ఈ సమస్యే వెంటాడింది. ఒకరోజు పడుకుని వుండగా హఠాత్తుగా ఓ వుపాయం తోచింది. నేనెలాగు వూరొదిలేస్తాను. విశ్వణ్ణను నాతో కూడా తీసుకెడితే సరి. నేను తెచ్చే జోలెభిక్షంలోనే రెండు పూటలా తింటాడు. నేనే బడికి పంపిస్తాను. కుర్రాడు బుద్ధిమంతుడు. ఇంగ్లీషు బడిలో చదవనీ. అదృష్టముంటే ఇంకా పై చదువులు చదవనీ. ఇదే సబబు - అని నిశ్చయించుకున్నపడు ఆయనకే తెలియని సంతోషంతో ఒళ్లు పులకించింది.

కానీ మరో ఆలోచనకూడా వచ్చింది. నాకప్పుడే ఇంత వయస్సయింది. తీసుకెళ్ళి నేనే చచ్చిపోతే వాడి గతిఏమి? ఒకటి రెండు రోజులీ ఆలోచన మనసును వేధించింది. కాని దానికి సమాధానం వెంటనే దొరికింది. మగ కుర్రాడు, చురుకైనవాడు. నేనొకవేళ చస్తే ఎక్కడయినా కూలిచేసుకుని బతకనీ, ఆ మేనమామ ఇంట్లో భయపడి చస్తూ బతకడమెందుకు? వద్దు, నేనిప్పుడే వస్తానని మాటేమిటి? నంజమ్మ లాంటి మనవరాలి వయస్సువాళ్లు చచ్చిపోయినా నేను గుండులా వున్నాను. విశ్వణ్ణ పెద్దవాడయ్యేదాకా నేను చావను.

కల్లేశు, జోస్యులు కుఱ్ఱాణ్ణి పంపనంటే ఏంచెయ్యాలి? అన్న ఆలోచన వచ్చింది. ఎలాగూ నన్ను చూడగానే కుఱ్ఱాడు నన్ను వొదలడు. దొంగచాటుగా తెస్తాను. నన్నేం చేస్తారో చూస్తాను - అన్న నిశ్చయంతో ఆయనొకరోజు నాగలాపురం బయల్దేరారు.

దారిలో కటిగేహళ్ళిలో పడుకుని మరుసటిరోజు నాగలాపురం చేరేసరికి పుదయం పదిగంటలయింది. దారి చెరువులో స్నానం చేసి అదే కావిపంచ కట్టుకుని, కావిచొక్కా వేసుకుని, తలకు కావి పాగా చుట్టి విభూతి పూసుకుని శివధ్యానం చేస్తూ తిన్నగా బడికి వెళ్ళారు. అది బడి వదిలేవేళ, గంట కొట్టగానే విశ్వం బయటికి వచ్చాడు. గుర్తుపట్టి వాడే "అయ్యగారూ!" అని పమీపించి నుంచున్న ఆయన తొడల్ని వాటేసుకున్నాడు.

"ఇక్కడ రా బాబూ. అని చెయ్యిచ్చుకుని బడికి వెనకాతలున్న రావిచెట్టు కిందికి తీసుకెళ్ళి కూర్చోబెట్టుకున్నారు. వరసి చెప్పినట్లే వాడు ఎండిన చీపురుపుల్లలా తయారయ్యాడు. ఆయనడిగారు. "నాతో కూడా వస్తావా?"

"మనవూరికా?"

"మనవూరికో - ఏవూరికయినా సరే. నాతో కూడా రా. ఏదైనా పెద్దవూరి కెడదాం. నేను జోలెభిక్షం తెచ్చిపెడతాను. నువ్వు బడికెళ్ళి బాగా చదువుదువుగాని, వస్తావా?"

"పొండయ్యగారు! మీరూరికే అలా అంటారు."

"లేదు బాబూ, నిజంగానే."

"అయితే ఒట్టెట్టి చెప్పండి చూద్దాం."

"నీ మీదొట్టుబాబూ" - అని వాడి తలమీద చెయ్యెట్టి పలికారు.

"అయితే - ఇలాగే పారిపోదాం పదండి."

"వద్దు. ఇంటికెళ్లి మీ మామయ్యనడుగుదాం."

ఆమాట వినగానే వాడికేడుపే వచ్చేసింది. "అతడు చస్తే పంపడండీ."

"మొదట అడుగుదాం. ఆయన పంపనంటే రేపు నేనిక్కడికి వస్తాను. ఇక్కణ్ణించి ఇలాగే తీసుకెడతాను" అని చెప్పి వాణ్ణి ఒప్పించాలంటే ఆయన తన కరడిగ మూడు సార్లు చేతబుచ్చుకుని ప్రమాణంచేయవలసి వచ్చింది.

వాణ్ణి ముందు పంపి, పది నిమిషాలయ్యాక ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళే సరికి "ఇంత ఆలస్యంగా ఎందుకొచ్చావురా భడవా?" అని కల్లేశు, జోస్యులు అల్లుణ్ణి

కేకలేస్తున్నారు. ఈయన్ని చూడగానే నోరు నొక్కుకున్నారు.

ఆయనేదో లోకాభిరామాయణం మాట్లాడుతూ వుండగానే ఇంటి ముందో పెద్ద ఎర్రగుర్రం వచ్చి ఆగింది. దిగింది కంఠీజోస్యులు. తల్లి అపరకర్మలు చేసుకొని వెళ్ళిన ఆయన మళ్లీ ఇదే రావటం. కల్లేశు విశ్వాన్ని తెచ్చివుంచుకుంటాడని ఆయనకు వెళ్ళకముందే తెలుసు. కల్లేశే చెప్పాడు. ఇప్పుడెందుకో మనస్సులో గాలి ఇలావీచి వూరికి వచ్చారు. మనవణ్ణి చూడాలన్న కోరిక కూడా ఆగాలిలో ఓ కెరటమే. లోపలికి రాగానే ఆయన వాణ్ణి పిలిచి మైసూరుపాకు, గారెలపొట్లం ఇచ్చారు. రాసంద్రం కబుర్లు, కూతురు కట్టిన ఇంటి విషయం అయ్యగారినడిగారు.

కాసేపయ్యాక కల్లేశు అయ్యగారి నడిగాడు. భోంచేస్తారా? లేక వంట చేసుకుంటారా? లేదా మీ కులస్థులింట్లో చెప్పాలా?"

"మా కులస్థులింట్లోనే చెప్పండి."

కల్లేశు విశ్వంతో ఆ వూళ్ళో వున్న మల్లశెట్టి ఇంటికి కబురెట్టాడు. మల్లశెట్టి వచ్చి ఈ జంగమయ్యను భోజనానికి తీసుకెళ్ళాడు. అతడి పెళ్ళాం వంట చేస్తుండగా, అయ్యగారు మల్లశెట్టినడిగి, కల్లేశుజోస్యులింట్లో విశ్వం పరిస్థితి తెలుసుకున్నారు. "ఇలాంటి పిల్లలుండరాదు. చచ్చిపోతేనే నయం శివుడా" - అన్నడా మల్లశెట్టి. అతడిభార్య కూడా లోపలనుంచీ ఆమాటే అంది.

"శెట్టిగారు! వెళ్ళి కాస్త కంఠీజోస్యుల్ని పిలుచుకొస్తారా?"

మల్లశెట్టి వెళ్ళిన పదినిమిషాలకి, అతనితోపాటు కఠీజోస్యులొక్కరే వచ్చారు. అయ్యగారి కెదురుగుండా గోడకు చేరబడి మల్లశెట్టి తెచ్చివేసిన మీట మీద కూర్చున్నారు. తానీ వూరికి వచ్చిన కారణం వివరించి అయ్యగారన్నారు: "కావలిస్తే ఈ శెట్టిగారినీ, లోపలున్న అక్కగారినీ అడగండి. ఈ వూళ్ళో ఎవళ్ళనయినా అడగండి. ఈ కుర్రాడెలా మారిపోయాడో కళ్ళతో చూడండి. మీ కోడలు గుణం మంచిది కాదు. కుర్రాణ్ణి నాతోటి పంపండి. నేను పెంచి ప్రయోజకుణ్ణి చేస్తాను. (జోస్యులకు కోడలిములుగులు విరగ్గొట్టాలన్నంత కోపం వచ్చింది. కానీ అయ్యగారే అన్నారు : "పుడుతూ వచ్చిన బుద్ధి పుడుకల్తో గాని పోదు. ఆవిణ్ణి మొగుడూ దారిలో పెట్టపోయాడు. కల్లేశజోస్యులకు కూడా పిల్లల్నెలా పెంచాలో తెలియదు. వూరికే నా వెంటపంపండి."

జోస్యులు కాసేపు తనలోనే ఆలోచించారు. తరవాత "మీరు తీసుకెళ్ళి ఏం జేస్తారు?" అని అడిగారు.

"ఏం జేస్తానో! ఎక్కడుంటానో తెలీదు. నామీద నమ్మకముంటే మాట్లాడకుండా పంపండి."

ఆయన వెంటనే బదులు చెప్పలేదు. మనస్సులో కోపం రాజుకొంటుంది. కుర్రాడి తాతయ్య నేను బతికే వున్నాను. మేనమామ కల్లేశున్నాడు. మేము తిన్నగా పెంచడం లేదని వాణ్ణి తీసుకెళతాము పంపండి అని అడగడానికి జంగమయ్య వచ్చాడు కదా! వీడికెంత పొగరు? అయ్యగారిని తిట్టాలనీ, కసిరి పంపాలనీ, నోరు తెరిచిన ఆయన, వెంటనే మరో ఆలోచన వచ్చి నాలిక నొక్కుకున్నారు. పదినిమిషాలు మూగవాడిలా కూర్చున్న ఆయన మనస్సు కల్లేశు సంసారాన్ని గూర్చి ఆలోచిస్తోంది. ఆ ముండ మంచిది కాదు. కడుపునిండా తిండి పెట్టకుండా కుర్రాణ్ణి చంపేస్తోంది. కల్లేశు కూడా కొడతాడట. నేనే తీసుకెళ్ళి వుంచుకుంటే ఎలాగుంటుంది? - అన్న ఆలోచనా వచ్చింది. తాము తీసుకెళ్ళి వుంచుకుంటే ఎలాగుంటుంది? హొటల్లో మంచి భోజనం, గుర్రపు సవారి, మంత్రాలు తంత్రాలు... ఛీ.ఛీ. ఇదంతా వద్దు - ఆయన మనస్సు ప్రబోధించింది. ఈ పరిస్థితిలో వాణ్ణి పెంచేదెవరు? ఎవరూ లేరు. ఈ అయ్యగారు విశ్వాసపాత్రులు. ఈయన దేవుడితో సమానమైన మనిషని నంజి చెప్పేదికదా- అని ఆలోచించి, ఆయననోరు తెరిచి అడిగారు. "చూడండి. నేనీరోజు ఈ వూరికి రావడం మంచిదయింది. నేను రాకపోతే మీరు కల్లేశునే అడగవలసి వచ్చేది. వాడు పంపేవాడు కాడు. అప్పుడేం చేసేవారు?"

"ఇప్పుడు మీరే వచ్చారు కదా? ఆ మాటెందుకు?"

"అథవా మాట. రాకపోతే ఏం జేసేవారు, నిజం చెప్పండి."

"నిజం చెప్పనా? రేపు మన కుర్రాడు బడికెళ్ళినప్పు డక్కడ నించీ అలాగే వాడి చెయ్యిచ్చుగుని తీసుకెళ్ళేవాణ్ణి. నన్నెవడయినా అడ్డితే జవాబు చెప్పేవాణ్ణి."

జోస్యు లరనిమిషమాయన్నే రెప్పవాల్చకండా చూచి, తరవాత తాము కూర్చున్న చోటునుంచీ లేచివెళ్లి ఆయన భుజం తట్టి "వారెవా, అయ్యగారు మీరు మగాళ్ళు, శెబాష్, తీసుకెళ్ళండి. కల్లేశుకు నేను చెబుతాను" - అని చెప్పి ఇంటికి వెళ్ళిపోయారు.

అయ్యగారు భోంచేసి, చిన్న కునుకు తీసి, కావాలనే కాస్త ఆలప్యంచేసి ఇంటి కొచ్చేలోపుగా కంఠీజోస్యులు కొడుకుని ఒప్పించారు. ఆ రోజే ఆయనే వెళ్ళి కుర్రాడి సర్టిఫికేటు తీసుకొచ్చారు. మరుసటి రోజు వాడి గుడ్డలు గిడ్డలు - అన్నీ

కట్టి అయ్యగారు బుజానవేసుకున్నారు. "బాబూ! తాతయ్యకు, మామకు, అత్తమ్మకు - అందరికీ కాళ్ళు తాకి నమస్కారం చేసి శరణు చేసుకో" - అని చెప్పారు నమస్కారం చేస్తుండగా కమల రాయిలా నుంచుంది. కల్లేశు మామ కళ్ళల్లో తడి కనిపించింది.

నిన్న సాయంత్రం నించీ కంఠీజోయిస్యులెందుకో వుత్సాహంగా లేరు. రాత్రి భోజనమూ చేయలేదు. రాత్రి పంచటరుగు మీద ఇద్దరూ పడుకున్నా ఆయన అయ్యగారితో కూడా మాట్లాడలేదు. తెల్లారి, వాళ్ళిద్దరినీ సాగనంపటానికి, కల్లేశు, తానూ, జీనువేసిన గుర్రపు కళ్ళెం పుచ్చుకుని చెరువవతల తూము దాకా వచ్చారు. తూము దాటాక ఆయనే కొడుక్కు చెప్పారు. "కల్లేశ, నీవు వెనక్కి వెళ్ళు, నేను మరి కాస్తదూరం వీళ్ళని సాగనంపివస్తాను."

వెనక్కి వెళ్ళేముందు కల్లేశు అయ్యగారితో అన్నాడు : నేనేమో కాస్త శిక్షణలోనే వుంచాను. వీడికి అల్లరెక్కువ. అదుపు వుంచమని నంజమ్మ చెప్పింది. లేకపోతే వీడు దారికిరాడు. అక్కడ మీరు భయముంచండి."

"అవునవును. వేలాది పులిపోట్లు తింటేగా రాయి లింగడయ్యేది? కీలెరిగి వాత -వీలెరిగి మాట అన్నారు. మీరు చేసింది మంచికే జరిగిందమకోండి" - అని అయ్యగారనే సరికి కల్లేశు ముఖం వంచేసుకున్నాడు. మళ్లీ మాట్లాడకండా వాడు వెళ్ళిపోయాడు.

గుర్రాన్ని నడిపించుకుని ముగ్గురూ మరో వందగజాలు నడిచాక అయ్యగారే కంఠీజోయిస్యులతో "మీరాగండి మేం వెడతాం" అన్నారు.

జోయిస్యులేమో మాట్లాడబోయారు గాని నోటంట మాట రాలేదు. ఆయన గుర్రాన్నాపి తాను నుంచున్నారు. దగ్గరే అయ్యగారూ నుంచున్నారు. వాళ్ళిద్దరి మధ్య వడుములు దాకా ఎదిగిన విశ్వం. అయిదునిమిషాలెవ్వరూ మాట్లాడలేదు. అయ్యగారే "మేం వెళ్ళమా?" అంటే ఆయనన్నారు : "వినండి అయ్యగారు, మీరే మగాళ్ళు. నెగ్గింది మీరు."

"అయ్యగారి కేమీ అర్థం కాలేదు". ఏమిటి మీరనేది"?

"ఏమీలేదు. ఇది తీసుకోండి" - అని లోపలి చొక్కాజేబులోంచి చెయ్యెట్టి నోట్ల కట్ట తీసి, ఆయనకవి చొక్కా జేబులో వుంచుతూ "నూటయాభై రూపాయలున్నాయి. మీరే వూరికయినా వీట్ని తీసుకెళ్ళండి.తరవాత నాకో వుత్తరం వ్రాయండి. 'చన్నరాయన పట్టణం మసీదు వెనకాల దెయ్యాల కొంప.

వాగలాపురం కంఠీజోస్యులు' అని వ్రాస్తే చాలు. అనిచెప్పి, తన భారీ శరీరాన్ని వంచి మనవడి రెండు బుగ్గలు ముద్దెట్టుకుని వాడి ముఖమూ, వీపూ తన విశాలమైన అరచేత్తో తడిమి వెనక్కు తిరిగి గుర్రమెక్కారు. ఆయన కనుకొలకుల్లో నీళ్ళు నిలవడం అయ్యగారు గుర్తించారు. గుర్రాన్ని రికాబుతో అదిలించి, మళ్ళీ వీళ్ళవైపు చూడకండా వేగంగా వూరివేపు గుర్రాన్ని దౌడు తీయించి వెళ్ళిపోయారు. విశ్వం వెనక్కు తిరిగి దానివేగాన్నే పరిశీలిస్తూ నిలబడ్డాడు. కాసేపటికి వాడి చెయ్యిచ్చుగుని, అయ్యగారు మునుముందుకు నడిచారు.

వాళ్లు అర్థమైలు నడిచారు. విశ్వమేదో ఆలోచిస్తున్నాడు. వాడికి తెలియకండానే వాడి పెదవులేవో శబ్దం చేస్తున్నాయి. "ఏమిటాలోచిస్తున్నావు బాబూ" - అని అయ్యగారడిగారు.

"తాతయ్య దగ్గిరుండే, అలాంటిది నాకూ ఓ గుర్రం తెచ్చిపెడతారా?"

"అదెందుకు బాబూ మనకు?"

"వాకలాంటి గుర్రాన్ని చూస్తే, ఎక్కి ఇప్పుడు తాతయ్య వెళ్ళారే, అంతకన్నా వేగంగా టక, టక, టక దౌడు తీయించాలన్న ఆశ పుడుతుంది."

"ఇంకా ఏమి ఆశ వుంది?"

"చాలాదూరం ఉండాలనిపిస్తుంది."

"చదవాలనిపించటం లేదా?"

"అనిపిస్తుందండి, మా తరగతిలో లెక్కల్లో నేనే ఫస్టు."

"ఇంకా దేనిలో ఫస్టు?"

"మామయ్య ఇంట్లో చదవటానికే తీరిక లేదు, లేకపోతే అన్నింట్లోనూ ఫస్టు వచ్చేవాడినని మాస్టారే చెప్పారు."

"ఇకమీద చదవటానికి నీకు బోలెడంత తీరికుంటుందిలే, సంచినిండా పలకా పుస్తకాలు కొనిపెడతాను. ముందుకు పద బాబు."

"మనం మనూరినించీ ఏ వూరెడదాం?"

"నేనింకా ఆలోచించలేదు గుబ్బికో, తుమకూరికో వెడదాం."

"అయ్యగారు! ఏవూరికెళ్ళినా నాకు ఊదడానికో చెరువుండాలి. అప్పుడప్పుడెవరిదయినా గుర్రమిప్పించండి. కూచోవాలనిపిస్తుంది.

"కాని చూద్దాం బాబు." అని మెడ తిప్పి వాడి ముఖంకేసి చూశారు. వెంటనే కంఠీజోస్యులు గుర్తొచ్చారు. జోస్యులు కాసేపటి క్రితమేగా "అయ్యగారు. మీరే

మగాళ్ళు. వెగ్గింది మీరు" - అనేసి వెళ్ళారు. ఆ మాటలు పూర్తిగా ఇంకా అర్థం కాలేదు, దాన్నే ఆలోచిస్తూ ఆయనలా ముందుకు సాగారు.

## 3

వాళ్ళారోజే రామసంద్రం చేరుకున్నారు. గంగమ్మ వూళ్ళో లేదు. సాయంత్రానికే తమవద్దవున్న ధాన్యం యావత్తు అయ్యగారమ్మేశారు. నూట ఇరవైరూపాయలు వచ్చాయి. అదికాక ఆయన వద్ద నలభై వెండి రూపాయలున్నాయి. కంఠీజోస్యులిచ్చిన నూటయాభై లోపలి జేబులో వున్నాయి. డబ్బంతా నడుముకు కట్టుకున్నారు. అల్యూమినియం పాత్రలు, బట్టలు కంబడి మూట కట్టి, దాన్ని మోయడానికో మనిషినేర్పాటు చేసుకున్నారు. బయల్దేరే ముందు విశ్వమడిగాడు. "అయ్యగారు! మా అమ్మ నిజంగా చచ్చిపోయిందా?" "అవును బాబూ!" "ఇంటికిపోయి ఇల్లొకసారి చూడాలి!"

"అక్కడ ఏముందని చూస్తావు?

"ఊహూ! నేను చూడాలి!" అని వాడు పట్టుపట్టాడు.

ఆ యిల్లు ఖాళీ అయ్యాక దాని తాళం చెవి గుండెగౌడగారి వట్టం కురుబరహట్టి ముయ్యవద్ద వుందని అయ్యగారికి తెలుసు. ముద్దయ్యను పిలిపించి తలుపు తీయించారు. ఎవరూ నివాసం లేక ఇల్లంతా మట్టికొట్టుకొని బూజు పట్టివుంది. ఏదో వాసనగా కూడా వుంది. లోపలికి వచ్చిన విశ్వం వంటింట్లోకెళ్ళాడు. తరవాత ధాన్యపు గదిలోకెళ్ళి చీకట్లో తడుముళ్ళాడాడు. స్తంభంమీదనుంచి అటకెక్కి చూచాడు. చివరికి గట్టిగా "అమ్మా! నువ్వు లేవా అమ్మా!" అని పిలిచాడు. సమాధానం రాలేదు. కిందికి దిగివచ్చి, "అయ్యగారుఅయితే అమ్మ నిజంగానే చచ్చిపోయిందా?" అని అడిగాడు.

తలుపు తీయడానికి వచ్చిన ముద్దయ్య రాయిలా నుంచున్నాడు. "అవును మరి. అమ్మ నిజంగానే చచ్చిపోయింది" - అని అయ్యగారన్నారు.

విశ్వం గట్టిగా ఏడవటం మొదలెట్టాడు. వాణ్ణి వాటేసుకుని ఓదార్చాక 'పద వెడదాం' అన్నారు.

వాడు మౌనంగా ఆయన వెనకాల నడిచాడు. సామాను మూట తలమీదెట్టుకుని కూలి మనిషి ముందర వెడుతున్నాడు. తమ తంబూర , చిటికెలు తీసుకుని అయ్యగారు నడుస్తున్నాడు. బాగా చిక్కిపోవడంచేత వూళ్లో వాణ్ణెవరూ గుర్తుపట్టలేదు.

తామీ వూరు వదిలిపోతున్నట్టు అయ్యగారెవరితోటీ చెప్పలేదు. ఎందుకు? ఏమిటి? అని అందరూ లక్ష ప్రశ్నలు అడుగుతారు. వాళ్ళకంతా విడమరిచి చెప్పడమెలాగ?

కంబనతెరె వేపు నడిచి మోటారు రోడ్డు చేరుకోవాలి. కూలిమనిషి సామాను మోసుకుని చాలా ముందువెడుతున్నాడు. వాడితో సమంగా నడవలేక అయ్యగారు వెనకపడ్డారు. ఆయన వెయ్యుమ్చుకున్నా విశ్వం అయ్యగారి కన్నా ఎక్కువగా అంతర్ముఖుడై తలవంచుకుని నడుస్తున్నాడు. వాళ్ళు వూరువదిలి మైలుదూరం వచ్చారు. దారిలో ఓ చెట్టు క్రింద చిన్న రాగులమూట మీద తలెట్టి చెన్నిగరాయులు పడుకున్నారు. నోటినిండా పొగాకు రసం నిండిన ఆయన బోర్లా పడుకునే, అది కిందికి కారిపోకండా పెదవులు సవరించుకుంటున్నారు. అయ్యగారాయన్ను చూశారు. ఈ ఇద్దరి అడుగుల చప్పుడికి తిరిగి చూచి, తిన్నగా కూర్చున్నారు. అయ్యగారాయన్ని పలకరించలేదు. దగ్గిరేవున్న కట్ట వెనక్కి గంగమ్మ వెళ్లి వుండవచ్చు. ఆమె చూస్తే "నా మనవడి నెక్కడికి తీసుకెడుతున్నారని?" అడగవచ్చు అని ఆలోచించి అయ్యగారు వడివడిగా అడుగులు వేశారు. తానే పలకరించాలంటే నోటినిండా తాంబూల రసముంది.



*Printed at* Printsman, 18A/11, Doriwalan, New Delhi–110005